# ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము





బాలాంత్రపు రజనీకాంతరావు



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
పటారురోడ్డు, విజయవాడ-2

# విషయ సూచిక

# అంకితం

శివనారాయణ తీర్థ య
తివరకృత తరంగిణీ ప్రథిత గాంధర్వున్
అవధూత మత్పితామహు
శివ నారాయణ సుతీర్థనాముని దలతున్

సన్న్యస్తుడౌచు కృష్ణానందుడై అందె
బ్రహ్మత్వ మెవ్వని ప్రథమ సుతుడు, -
అధ్యాత్మ విన్నుత రామానందుడై, ఉప
దేశించె నెవని ద్వితీయ సుతుడు, -
వివిధ సాహిత్య సంవేది నీలాచల
ధీమణి యెవని తృతీయ సుతుడు; -
కవికులాలంకార, కవిరాజహంస వేం
కటమంత్రి యెవని నాల్గవ సుతుండు, -

తతమహోదాత్త సాహిత్యధని, తపస్వి,
ఏ యతి సుతుండు సూర్యనారాయణుండు, -
ఉపనిషత్తత్త్వ చిత్తవృత్త్యుపనివిష్ట
శ్రీ మహాలక్ష్మి యే తండ్రి నోముపంట, -

మహిత బాలాంత్ర వంశాబ్ధి తుహినకరణు,
మూర్తి దాల్చిన సౌమ్యత, ముక్తజీవి,
సూరమాంబా మనోనాథు, నారసింహ
మానివరు, మాన్యు, మత్పితామహుని దలతు.

* * *

ఎన్నడో వ్రాసె ననుగూర్చి భృగుమహర్షి,
సిద్ధ గాంధర్వ విద్యాప్రసిద్ధు డనియు,
ప్రాజ్య రాజన్యవర్గానుబంధ సత్క-
ళాంశుమంత విద్యావంతుడనియు, వేంక
టకవి కలలపంటగు కనిష్ఠాత్మజుడని, -
అట్టి ఋషి వాక్కు సూనృత మౌ నసంగ,
దైవదత్త మువజ్ఞ, అధ్యయన శక్తి,
తాత తండ్రుల ప్రాక్తపోధనము కలిమి,
గురుబలమ్మాత్రగా తెనుంగున రచింతు
గేయకార సాహిత్య సంగీత చరిత ! -

కవి బుధగురు మిత్రస్థితి
కువలయ హితకరత డక్కగొను గీతాలా
ప విదగ్ధత, రజనీకాం
తు విశిష్టత గూర్చి వ్రాయుదును తుదిపుటలో !

* * *

భావము రాగమున్ గలిసి, పాటగ నా గళమందు దోచి, లో
కావళి చేతముల్ తనియగా; నవగీతులు గేయనాటికల్
కావొ, మరియ ధాతుపరికల్పన నవ్యకవీంద్ర గేయముల్
శ్రావ్యత నందవో, కడుపు చల్లని నీ దయచే పితామహా !

వేంకట పార్వతీశ్వర కవిద్వయ వత్సలతా ప్రపూర్ణ మౌ
అంకము జేరి, పాటలను ఆటల, మాటలు కూర్ప నేర్చి నీ
అంకము గోరి, నీ మధుగళాంచిత గానకళాంశ మొంది, నీ
కంకితమిత్తు నీ సుకృతి నందుకొనంగదవే పితామహా !



# చిత్రపట సూచిక

# తొలి పలుకు

భారత దేశ సంగీతపు క్రమపరిణామ చరిత్రలో ఆంధ్రుల కృషి అనన్య సామాన్యం. మన శాస్త్రీయ సంగీతానికి లక్ష్యప్రాయమైన గేయరచనలు తెలుగు భాషలో ఉన్నంతగా ఏ యితర భాషలోను లేవంటే అతిశయోక్తి కాదు. శాస్త్రీయ గాయకుల ప్రదర్శనలలో సామాన్య జనానికి రక్తికలిగించని పాండిత్య ప్రకర్ష మెండయి, కళకు ప్రధానమైన శ్రావ్యతా, రసభావపరికల్పనాదృష్టి లోపిస్తూండడం చేత మన శాస్త్రీయ సంగీతంపైని ఈనాడు జనసామాన్యంలో ఒక విధమైన విముఖతా, ఉదాసీనభావమూ వ్యాపించి ఉన్నాయి. ప్రాచీనకాలంనుంచీ ఇప్పటి వరకూ అనేక ఆంధ్ర వాగ్గేయకారుల కృషివల్లా దోహదంద్వారా సుస్థిరమైన దాక్షిణాత్య గేయసంపదకు మన వారసత్వమును నిరూపిస్తూ, ఆ కృషిఫలితమైన మన శాస్త్రీయ సంగీత కళయందు మన జనసామాన్యమును సుముఖులుగాను, సుపరిచితులుగాను చేయటం ఈ గ్రంథపు ప్రధానలక్ష్యం. ఇందుకు - తెలుగుభాషాసమితివారి పోటీ ప్రకటన నా లక్ష్యసాధనని ఆచరణలో పెట్టడానికి తోడ్పడినందుకు వారికి నా కృతజ్ఞత.

ఈ గ్రంథరచనములోను, ప్రకటనములోను అనేక అమూల్య విషయాలను సేకరించుటలోను నాకు తోడ్పడిన నా గురు బంధు మిత్రుల కోవలోని పెద్దలందరకునూ, ప్రత్యేకముగా - అనేక పరిశోధన వ్యాసములు ముద్రిత ప్రతులను చిత్రపటములను ఇచ్చిన డాక్టర్ వి. రాఘవన్, మద్రాసు సంగీత పరిషత్తువారికిని, శ్రమ అనుకోకుండా, నా గ్రంథమంతా ఆమూలాగ్రమూ చదివి పరిచయవాక్యములు వ్రాసిన ఆచార్య రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారికిని నా కృతజ్ఞతాపూర్వకవందనాలు.

*విజయవాడ,*
*5-9-'58.*

గ్రంథకర్త.
**బాలాంత్రపు రజనీకాంతరావు.**

శ్రీ



# పరిచయ వాక్యాలు

సుపరిచితులను పరిచయం చేయబూనడం స్వల్ప శ్రమమే. కాని ఆ యింత శ్రమంకూడా అనావశ్యకమైన పునరుక్తే కాగలదు. అయినా మిత్రులు శ్రీ రజనీ కాంతరావుగారివంటి వారితో వ్యవహరించేటప్పుడు ఆ పని చేయకుండలేము. ఆయన సుగృహీత నామధేయుడే కాని సుకుమార హృదయుడుగూడ. హృదయ సౌకుమార్య మున్నవారిలో హఠంకూడా సుకుమారంగానే ప్రబలంగా ఉంటుంది. కనుకనే చర్వితచర్వణంగానైనా ఈ నాలుగు పంక్తులు వ్రాయవలసియున్నాను. ఇది వట్టి పుటపూరణమే అయినా మా యిద్దరి సౌహార్ద్రహారంలోని ఒక చిన్న ముడిగా సార్థకమే కాగలదు.

వాక్కారులూ, గేయకారులూ నేడు తెలుగుసీమలో ఎందరో ఉన్నారు. కాని ఉభయకారులు - బయకారులు - చాలామంది లేరు. నేడేకాదు; ఎప్పుడూ వారి సంఖ్య స్వల్పమే. కనుకనే బయకాడు అంటే 'రాగమును బయలు పఱచువాడు' అని. బయకారమునకు 'యౌవనమునందు బయలు పడు శృంగార చేష్ట' అని, 'బయకారి' అనగా 'విలాసవతి' అని - ఏవేవో అర్థాలు నిఘంటువుల కెక్కినవి. (శబ్దరత్న). వాగర్థాలూ, నాదభావాలూ పరస్పర బంధంతో కవలపిల్లలవలె పుట్టినవైనా, అవి తర్వాత స్వతంత్రంగా అన్యోన్య నిరపేక్షంగా పెరిగి పెద్దవై విస్త

రిల్లినవి కావడంచేత, ఈ రెంటినీ ఆకళించుకొనే సాహస ప్రయత్నాన్ని చేసేవారు కొద్దిమందే. అందులో నెగ్గినవారి సంఖ్య యింకా తక్కువ అని చెప్పబనిలేదు. మరి ఆ రెంటి కలయికలో స్వతంత్రంగా రచన సాగింప గలిగినవారిని లెక్కించ డానికి చేతిలో పదివేళ్లు అక్కరలేదన్నది అనుభవ సిద్ధమైన సత్యం. 'రజని'కి ఆ రెంటియందూ సమానంగా కల శ్రద్ధాభక్తులూ, అట్టి రచనలో ఉపజ్ఞాబలమూ, విరామ మెరుగని కార్యశూరతా - ఎన్నో యేండ్లుగా తెలుగుసీమలో పాదుకొన్న పరిచిత విషయాలే. వీరి తండ్రిగారు, నేటి తెలుగు నవ్య గద్య పద్యవాఙ్మయానికి మూల స్తంభమైనవారిలో నొక్కరు అగు శ్రీ బాలాంత్రపు వేంకటరావుగారిసుండి 'అన్యం నయాతి హి విభూతి రపత్యభాజాం' అనే న్యాయంగా దిగివచ్చిన విభూతి యిది. ఇంకా వీరి పితామహులైన "శివనారాయణ తీర్థయతి సంస్కృత తరంగిణీ ప్రథిత గాంధర్వ్వ" లగు 'నారసింహమౌని' గారి మంగళాశాసనంకూడా తల్లి వేరై పై బయాకారి సంస్కారానికి దోహదం చేసింది. 'శతపత్ర సుందరి' మొదలగు గేయ రచనలు వీరివి అచ్చుమూలాన ఆకాశవాణిమూలాన తెలుగునాటిలో ఎంతో వ్యాపించినవి. 'శతపత్ర సుందరి' గేయసంహిత మదరాసు ప్రభుత్వపు బహుమతికి పాత్రమైనది. ప్రస్తుతమైన 'ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము' గూడ తెలుగు భాషా సమితివారి సన్మానమును సంపాదించుకొన్నది. ఇందు వింత యేమీ లేదు. వాటి అర్హత చెల్లిందంతే.

భరతాచార్యుని మొదలు బాల మురళీకృష్ణ వరకును గల కర్ణాటక సంగీత వాగ్గేయకారుల పరామర్శ ఈ గ్రంథము ఇది ఎంత విశాల గంభీరమైన విషయమో, ఎంత ఓర్పుతో సంగ్రహింపవలసిందో, యెంత ధైర్యంతో, నిష్పక్షపాతంతో పరిశీలింపవగిందో ప్రత్యేకంగా వివరింప బనిలేదు. అసలు వాగ్గేయకారుల చరిత్ర పరిశీలనార్హమనే భావమే ఇటీవల కలిగింది మనలో. అది గూడా ఏ కొందరికో మాత్రమే. పూర్వకాలపు పండితులకు గాయకులు పంక్తిబాహ్యులుగా గానవచ్చిరే కాని, గానవిద్యను 'ఉపవేదం'గా మన్నించి ప్రచారంచేయడంలో వారి ప్రయత్నం సామాన్యంకాదు. జీవితంలో గానానికి ప్రవేశంలేని సందర్భమే వారి సంస్కృతిలో లేదు. కాని గాయకుల వ్యక్తి జీవితాలను గూర్చి, వారి రచనలను గురించికాని వివ రాలు సేకరించే ఉత్సాహం వారంతగా చూపలేదు. మరి యిప్పటి యూనివర్శిటీల పండితులకు పాట ఒక వినోదవస్తువు - అదిగూడా అయితే ! - వారి పాలికి భౌతిక శాస్త్రాల పాండిత్యమే పాండిత్యం. విశ్వకళా పరిషత్తులలో వారిదే ప్రాజాపత్యమూ పలుకుబడీ కూడా. కాబట్టి, నేటి విద్యా తారాపథములలో సంగీతం, నాట్యం మొద న లలితకళలమాటకేమిగాని. అసలు సాహిత్యం, చరిత్రవంటి విషయాలకే స్థానం ర్బలమైపోయింది. కడుపు నించేపని మెదడుది; దానికి కావలసిన వేవో వాటిని క్కడ మెత్తితే చాలు, చదువు సార్థకమయిపోయింది; బుద్ధిని నిశితంచేసే విష

యాలుగాని, హృదయాన్ని స్నిగ్ధంచేసే కళలుగాని దమ్మిడీ తెచ్చిపెట్టేవి కావు; అవి సోమారులూ సుకుమారులూ మెచ్చుకొనేవి; ఆ రెండు తెగలవారికీ నేటి మానవ జీవిత తుములంలో చోటులేదు - అనేదే ఇంచుమించు ఇప్పటి విద్యాధికారుల దృష్టి. కాబట్టి, కళాకారుల యోగక్షేమాలు నేటి చదువరుల కక్కురలో లేనివి. ఈ స్థితిలో ప్రాచీనాధునిక వాగ్గేయకారు లందరికీ సంబంధించిన విషయాలను ఏర్చి కూర్చే ప్రయత్నం ఎంతో గొప్ప సాహసమైన త్యాగమంటే అతిశయోక్తి కాదు.

శ్రీ 'రజని' గారు ఆ పనిని ఈ గ్రంథంలో ఎంతో సమర్థతతో నెరవేర్చినా రనేది స్పష్ట విషయమే. ఎందరో ఆంధ్ర వాగ్గేయకారులను గూర్చి ఇంతవరకును వెలుపడని చిన్న పెద్ద విషయాలెన్నో సంగ్రహించి చెప్పినారు. గ్రంథనామానికి 'ప్రసిద్ధ వాగ్గేయకారులకును గురించి ఆంధ్రములో వ్రాసిన చరిత్ర' అనే అర్థాన్ని ఉదారంగా విస్తరించుకొని జయదేవుడు, గోవిందదీక్షితుడు మొదలైన అనాంధ్ర బయకారులను గూడా కలుపుకొన్నారు. వాగ్గేయములలో వారి పూర్వోత్తర సంబంధాలను పరిశీలించినారు. లక్ష్య లక్షణాలు రెంటిని గూర్చీ ఇతరుల మాటలను వాదం చేయక సొంతముగా చూచి సోదాహరణంగా తమ యభిప్రాయములను వెలువరిచినారు. ఇతరుల అభిప్రాయాలలో తమకు తోచిన భేదాలను ఎంతో సుకుమారంగా గౌరవంగా సూచించినారు. పరిశుద్ధమైన పరిశోధక దృష్టితో ఈ రచన సిద్ధమైనదని ఒక్క మాటలో దీని గౌరవమును చెప్పవచ్చును. ఆ యా వాగ్గేయ రచనలపై వీరు కట్టిన విలువలు రెంటియందును వీరికి గల సాధనాను భవాల నైశిత్యాన్ని స్పష్టపరుస్తోంది.

విషయం చాలా విశాలమైనది. వివరాలు తెలుసుకొనే అవకాశాలూ సాధనాలూ చాలా మితమైనవి. కనుక ఇందులో చేర్చవలసినవారు బయకారులు ఇంకా ఎందరో వుంటారని ఊహించడమూ, పేర్కొనడమూ సులభమే. సర్వంకషంగా ఇటువంటి విషయాన్ని నిర్వహించడం ఎప్పటికీ అసాధ్యమే గనుక, ఒకటి రెండు కొరతలున్న మాత్రాన ఈగ్రంథం ప్రయోజనమూయోగ్యతా అల్పమనుకొనేది అపచారం.

ఇట్లే శ్రీ 'రజని' గారి అభిప్రాయాలు కొన్నిటిని యథావత్తుగా అంగీక రించడం కొందరికి సాధ్యం కాకపోవచ్చును; లీలాశుకుడు ఆంధ్రుడను కొనడానికి వారిందిచ్చిన హేతువులు చాలా దుర్బలములుగా నాకు కానవచ్చినవి. ఇట్లే సంగీత సమయ సారకర్త పార్శ్వనాథుడు, రాగవిబోధకర్త సోమనాథుడును ఆంధ్రులని భావించేది సహేతుకంగా తోపదు. మరి యింత శ్రమతో వారి ఆంధ్రత్వాన్ని ఊహించి మనం సాధించేది వట్టి అభిమానం మాత్రమే. భాషల ఎల్లలన్నీ దాటిన కర్ణాటక సంగీత ప్రపంచంలో ఇటువంటి అభిమానాలు ఎంత దుర్బలంగా వుంటే అంత క్షేమం.

"నేటి కర్ణాటక సంగీతపు రాగా లెన్నో స్పష్టరూపం దాల్చినది క్షేత్రయ్య పదాలలోనే". (పుట 210) "అనుపల్లవికి క్షేత్రయ్యే మార్గదర్శి" (పుట 232) ఈ యభిప్రాయాలు క్షోదక్షమంగా కానరావు క్షేత్రయ్య వాడిన రాగాలు తాళాలు అన్నీ పురందర దాసాది ప్రాచీనుల రచనలలో నున్నవి. ఆ పదాలు పాడినట్లే వీటినీ పాడవచ్చును. నా గురువుగారు శ్రీ బిడారం కృష్ణప్పగారు దేవరనామాలు పాడు నట్లే క్షేత్రయాదుల పదాలూ అద్భుతంగా పాడేవారు. భక్తి శృంగార రూప భావ భేదమే తప్ప పాట శైలిలో ఏమీ భేదం మా యనుభవానికి అందులో రాలేదు. పదాలను రాగ ప్రధానంగా తెగయీడ్చి వాగర్థాల భావమే అవగతం కాకుండా పాడే పద్ధతి యీవల వీణ ధనమ్మాళ్ ప్రచారంలోకి తెచ్చిందని నా ఊహ. ఆమె త్యాగ రాజాదుల కీర్తనలు గూడ ఆ శైలిలోనే పాడేది అందలి రాగ మాధుర్యానికి లొంగి ఎందరో గాయకులు- వాగర్థాల దృష్టి లేనివారు- దక్షిణ దేశంలో ఆ శైలినే అక్షరశః అభ్యాసం చేసి పాడుచున్నారనేది వేరుమాట. క్షేత్రయ్యే యీ శైలిని తెచ్చిపెట్టినవా డనేది న్యాయం కాదేమో. అట్లే అనుపల్లవి పురందర దాసుల కీర్తనలలో ఎన్నిటికో యున్నది. కనుక దాసకృతులలో కలదు. ఇంతెందుకు? ఈ క్రింది అన్నమయ్య సంకీర్తనలోనే కలదు :

శ్రీరాగం

"ఇతరులకు నిను నెఱుఁగ తరమా
సతత సత్యవ్రతులు – సంపూర్ణ మోహ విర
హితు లెఱుంగుదురు నిను – నిందిరా రమణా"

దీనికి తర్వాత నాల్గు పంక్తుల చరణాలు మూడున్నవి. పై మూడు పంక్తు లను ఒక పల్లవిగా కలిపికొట్టి పాడేది యెట్లో నా కర్థంకాదు. అట్లే,

"పరిపూర్ణుఁడవు నీకుఁ బరాకున్నదా, నిన్ను
మరిగి వుండనిదే – మావల్ల తప్పుగాక,"

అనే తిరుమలయ్య సంకీర్తనలో రెండవపంక్తిని అనుపల్లవిలో అమర్చు కొనకపోతే రెంటినీ ఒక రూపంగా భైరవిరాగంలో పాడే రీతి దుర్గ్రహం కనుక దీని బరువంతా క్షేత్రయ్యమీదనే వేయడం నా దృష్టిలో న్యాయంకాదు.

తెలుగు కాంబోది యెరుకల కాంబోదిగా తరువాత యదుకుల కాంబోదిగా, ఉత్తరదేశంలో తిలక్ కామోదుగా మారినట్లే ఆంధ్ర భైరవి, శ్రీ రజనిగా రూహించినట్లు, ఆనందభైరవిగా మారడం అసాధ్యమేమీ కాదు. కాని తాళ్ళపాక ఆంధ్రులు దీనిని గ్రహింపలేదు. మరి పురందరదాసాది కన్నడులు దీనిని వాడినట్లు

పాట సాంప్రదాయ మున్నది. మొన్న మొన్నటిదాకా తెలుగులాక్షణికులెవరూ దీన్ని లక్షించినట్లు తోపదు. కనుక ఆంధ్రులకు ఆ రాగంమీద కల విశిష్టానురాగం అది వారిదే అనడానికి చాలిన హేతువు కాగలదా ?

ఇట్లే క్షేత్రయ్య వాడిన 'మోవనాడు' అనే పలుకుబడిలో 'మువ్వనాడు' అనే యెవ్వరూ కనివిని యెఱగని కొత్తనాడుగాని, 'నారదగానలోల' అనే త్యాగయ్యగారి కృతిలో నారదస్తుతి'పంచరత్నాలకు' కావలసిన నారదుని స్వరూపంకాని నా చూపు కందని విషయాలు మోవన్ ఆడు = నామీద తప్పు మోచునట్లుగా ఆడుము అని మొదటిదాని కర్థం. రెండవ కృతిలో ప్రతిపాద్య వ్యక్తి 'నీరదసమ నీలుడు' కనుక 'భేశసంకాశుడు; 'కడు'తెల్ల దేహము' * గల నారదముని కాజాలడు. కాబట్టి అతడు 'నారదగానలోలు'డే గాని 'నారద-గానలోల !' అనదగినవాడు కాదు. పంచ రత్నాలను కొన్నిటిని కనుక్కొనే ఉత్సాహంలో వచ్చి పడిన భ్రాంతి యిది. ఇట్లే క్షేత్రయ్యగారి 'మేరగాదు రమ్మనవే' అనే పదం అను పల్లవిలోని 'మోరతోపు'ను 'మొరతోపు'గా ఎవరో తిద్దుట పలుకుబడి యర్థము మాత్రమేకాదు. ప్రాస సామంజస్యముగూడా గమనించక చేసినది.

ఇట్లే ఇంకా ఒకటి రెండు చిన్న విషయాలను గూర్చి అభిప్రాయభేదాల కవకాశమున్నది యిందులో. కాని అసలు వస్తువు పెద్దది. స్వతంత్రము. ప్రామాణికము. ఆంధ్రదేశమందేగాక తెలుగు తెలిసిన సహృదయ గాయకు లందరూ కృతజ్ఞతతో శ్రీ రజనీకాంతరావుగారి యీ మహా గ్రంథానికి స్వాగత మిస్తారు.

తిరుపతి
1-8-58.

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ.



* శ్రీ నారదనాద-నారదముని వెడలిన అను త్యాగరాజ కృతులను చూచునది.

## ఒకటవ అధ్యాయము

# గ్రంథ రచనానుక్రమణిక

"తెలుగదేల యన్న దేశంబు తెలు గేను
తెలుగు వల్లభుండ, తెలు గొకండ
యెల్ల నృపులు కొలువ నెరుగవే బాసాడి
దేశ భాషలందు తెలుగు లెస్స!"

ఈ సువర్ణాక్షరాలు కన్నడ రాజ్య రమారమణుడైన శ్రీకృష్ణదేవరాయలకు స్వప్నంలో దర్శన మిచ్చిన శ్రీకాకుళాంధ్ర విష్ణుభగవానుడు (ఈయనకే తెలుగు రాయడని పేరుకూడ) సెలవిచ్చినవి. ఆ సంగతి వివరిస్తూ కృష్ణదేవరాయలే తన ఆముక్తమాల్యదా ప్రబంధంలో కృత్యాదిని చెప్పిన పద్యమిది. తన ఇంటిలోని భాష కన్నడమే అయినప్పటికీ, కర్ణాటాంధ్రోత్కళ ద్రావిడ రాజ్యములతో కూడిన దక్షిణ భారతమంతా ఏకచ్ఛత్రముగా ఏలిన రాయలు తన ఆస్థానంలో అన్ని భాషల కవి పండితులను ఆదరించి పోషించాడు. అయినా, అష్టదిగ్గజాలని పేరొందిన ఆంధ్ర కవితా పితామహ అల్లసాని పెద్దనాది కవీశ్వరులను పోషించడంలోను, తనకుతానై ఆముక్తమాల్యద అనే మహా ప్రబంధం ఆంధ్రంలోనే వ్రాయడంలోను, ఆ గ్రంథపు కృత్యాదిని పై విధంగా పేర్కొనడంలోను, దేశభాష లన్నిటిలోను తెలుగుకున్న ప్రత్యేక ఘనత ప్రకాశితమైంది. ఆ కారణవల్లనే అనాంధ్రులైన అనేకులు దాక్షిణాత్య వాగ్గేయకారులుకూడ తమ మాతృభాషలో కంటే తెలుగులోనే అశేషమైన కృషిచేశారు. పాశ్చాత్య విద్వాంసులు ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్ అని పేర్కొనడానికి కూడా ఇదే కారణమంటే చర్వితచర్వణం కాబోదు. ఈ సంగతి మొట్టమొదట గ్రహించిన ఘనత ఆంధ్రులై జన్మించిన వాగ్గేయకారులలో ఆదికవియైన తాళ్ళపాక అన్నమాచార్యులదే.

వాగ్గేయకారులంటే యెవరు? సంగీత లక్షణకర్తలూ, ఆ లక్షణమునకు ఉదాహరణాత్మకములైన కేవల సంగీతాత్మక రచనలు చేసిన లక్ష్యకర్తలూ, సంగీతాత్మకమైన సాహిత్య రచనలు చేసిన లక్ష్యకర్తలూ, ఈ మూడు తెరగుల వారూ వాగ్గేయకారులే. భరతుడు, మతంగుడు, రామామాత్యుడు, గోవిందదీక్షితుడు,

వేంకటమఖి వంటివారు మొదటి రకపు లక్షణకర్తలైన వాగ్గేయకారులు. రామామాత్యుడు, వేంకటమఖి మొదలైనవారివలె గీతతాయ ప్రబంధాల రచన చేసినవారూ, లక్షణ గీతాదులవంటి కేవల సంగీతాత్మక శాస్త్రీయ రచనలు చేసినవారు-కూడ ఒక రకపు లక్ష్యకర్తలు. వీరి సాహిత్య రచనలు చాలా కాలంవరకు సంస్కృత ప్రాకృతాలలో ఉంటూ వచ్చాయి. ఇంకొక రకపు లక్ష్యకర్తలు అన్నమాచార్యులు, పురందరదాసు, క్షేత్రయ్య, త్యాగరాజులవలె దేశ భాషలలో సంగీతాత్మకమైన సాహిత్య రచనలను చేసిన వాగ్గేయకారులు. ధాతుమాతు రచనా దక్షులే సార్థక నాములైన వాగ్గేయకారు లనవలసి ఉంటుంది కనుక, ఈ మూడవ రకపు రచయితలను గురించే ఈ గ్రంథంలో విపులంగా చర్చించబడుతుంది. మిగిలిన లక్షణకర్తలు, లక్ష్యకర్తలు తమ కాలమునాడు వాగ్గేయకార బిరుదాంకితులు గనుకను, సంగీతక్రమ పరిణామ పరిశోధనచేసి, ఆయా కాలములందు సుస్థిరమైన లక్షణ గ్రంథములను మనకు ప్రసాదించినవారు గనుకను, వారిని గురించి విపులంగా ఒక అధ్యాయములో చర్చించుకొంటాము.

ఈ ఆంధ్రవాగ్గేయకార చరిత్రము ఆంధ్రులయిన వాగ్గేయకారుల చరిత్ర మాత్రమేకాదు. భారతీయ సంగీత పరిణామ కారకులయిన ప్రసిద్ధ వాగ్గేయకారులను గురించి ఆంధ్రంలో వ్రాసిన చరిత్ర అని అర్థం చెప్పుకొని ఆది సంగీత ప్రబంధకర్త అయిన జయదేవుని గురించీ, కృష్ణకర్ణామృతకర్త లీలాశుకునిగురించీ స్మరించి, ఆ వెనుక మిగిలిన చరిత్ర అన్వేషిస్తాము.

## ప్రాచీన, మధ్యయుగాలు :

ఆంధ్ర వాగ్గేయకారులలో లక్ష్యకర్తల చరిత్ర రచన అన్నమాచార్యులతోనే ప్రారంభించాలి. పదకవితా మార్గదర్శి, పదకవితా పితామహుడు అని, అన్నమాచార్యులను ఆయన మనుమడు చిన తిరుమలయ్య, తాతగారి సంకీర్తన లక్షణం సంస్కృతంనుంచి తెనిగిస్తూ కృత్యాదిలో ప్రశంసించాడు. అన్నమయ్యాది పదిహేనవ శతాబ్ది. తరువాతి శతాబ్దిలో సుగ్రీవ విజయకర్తయైన కందుకూరి రుద్రయ మొదలైన యక్షగాన కవులూ వాగ్గేయకారులే. యక్షగాన కవుల వెంట నంచే భామ కలాపాదులు రచించిన సిద్ధేంద్రయోగీ, కృష్ణలీలా తరంగిణిలో ఆంధ్ర హృదయాలను ఊదులాడించిన నారాయణతీర్థ యతీంద్రుడు వస్తారు. నారాయణతీర్థులు సంస్కృతంలో తరంగిణిని మాత్రమేగాక, ఆంధ్రంలో పారిజాతాది యక్షగానాలుకూడా రచించాడు ఆ వెంటనే, భద్రాచల రామదాసుగా వెలసిన కంచెర్ల గోపన్నా, ఆ తరువాత మువ్వ గోపాల వ్యాపారతుడైన క్షేత్రయ్యా వాగ్గేయ రచనల ద్వారా భక్తి శృంగారములను వరుసగా పంచియిచ్చారు. ఈ నడుమ ఎప్పుడో అధ్యాత్మ రామాయణ కర్త సుబ్రహ్మణ్యకవి తెలుగుగేయాన్ని తీర్చిదిద్దాడు.

## అద్యతన యుగం :

క్షేత్రయ్యతోపాటు ఆంధ్ర నాయకరాజుల కొలువునుచేరిన ఆంధ్ర సరస్వతి రఘునాథ నాయకాది రాజులచేతా, ఇతర ఆస్థాన కవి కవయిత్రులచేతా మేలటూరి భాగవతులచేతా యక్షగానాలు పాడించి, ఆడించింది. ఆ సంప్రదాయాన్ని ఆంధ్ర నాయకరాజులకు తర్వాత వచ్చిన మహారాష్ట్రరాజులు శరభోజీ మొదలైన వారు కూడా పాటించి, తాము అనేక కవి పండితులకు, వాగ్గేయకారులకు, పోషకులు కావడమేకాక, తమకు తామే తెనుగులో యక్షగాన ప్రబంధాలను రచించి ఆట పాటలతో ఆంధ్ర సరస్వతిని అర్చించారు. అదే యుగంలో త్యాగరాజు, శ్యామా శాస్త్రిలు, దీక్షితులు, కర్ణాటక సంగీత రత్నత్రయంగా వెలిశారు. కర్నాటక సంగీతాన్ని శాఖోపశాఖాన్వితమైన మహావృక్షముగా అలరించిన త్యాగరాజుకు శిష్యపరంపరలో దాక్షిణాత్యులలో అనేకమంది అనాంధ్రులు కూడా తెలుగులో కృతులు చేశారు. అది పంథొమ్మిదవ శతాబ్దం. ఆ తర్వాత మలయాళం మాతృ భాషగా గలిగిన తిరువాన్కూరు రాజు స్వాతితిరునాళ్ళు సంస్కృతాంధ్రాలలో కూడా ఎన్నో కృతులు వెలయించాడు. సభా సంప్రదాయాలతోపాటు సంగీత సంప్ర దాయాలు కూడా పెరుగుతూ, మారుతూవచ్చాయి. శృంగారపదాలు, జావళ్ళు రచించిన వాగ్గేయకారులు వచ్చారు 19, 20 శతాబ్దాలలో యక్షగానం క్రమంగా హరికథా కాలక్షేపంగా రూపొందింది. విజయనగరం, బొబ్బిలి, పిఠాపురం మొదలైన సంస్థానాలలో సంగీత విద్వాంసులూ, కవిపండితులూ, హరికథకులూ వెలిశారు. వీరుగాక, జనపదాలలో పామరజనంలో కాలజ్ఞానతత్వమును బోధించిన గేయకర్తలు వెలిశారు.

## లక్షణకర్తలూ వాగ్గేయకారులే

ప్రాచీన కాలంలోనూ, మధ్యయుగంలోను, అద్యతన కాలంలోను కూడా వెలసిన సంగీత లక్షణగ్రంథా లన్నిటిలోనూ ప్రసిద్ధలక్షణకర్త లందరూ వాగ్గేయ కారులుగానే (రాయబయకారులు) పేర్కొనబడ్డారు. అటువంటివారిలో వేంకట మఖివరకు చాలమంది తమ లక్ష్యకృతులను సంస్కృత ప్రాకృతాలలో రచించారు. శార్ఙ్గదేవుడు, సోమనాధుడు, రామామాత్యుడు మొదలైనవారు తమకాలపు సంగీత రీతులను, వాగ్గేయ ప్రబంధరీతులను పరిశీలించి, ఆనాటి సంగీత పరిణామమును నిర్దేశిస్తూ వచ్చారు. అందుచేత ఈ లక్షణకర్తల చరిత్రమునుగాని, వారి కృషిని గాని వదలిపెడితే ఈ గ్రంథ్మస్నమగ్రం అనిపించుకోదు.

## ఆ ధా ర ము లు

పైన వివరించిన విషయాలన్నిటిని గురించీ సమగ్రంగా ఇంతవరకూ ఒకే గ్రంథంలోకి రాలేదు. ప్రసిద్ధ లక్షణకర్తలను గురించి డా. వి. రాఘవన్‌గారు మద్రాసు సంగీత పరిషత్పత్రికలో అమూల్య పరిశోధనాంశాలు వ్రాశారు. ఎట్టయాపురం జమీందారులు 1904 లో ప్రకటించి సుబ్బరామదీక్షితులవారు పరిష్కరించిన సంగీత సంప్రదాయ ప్రదర్శిని ప్రథమ సంపుటంలో ఉపోద్ఘాతంలో వాగ్గేయకారుల చరిత్రము అనే శీర్షికను 77 గురు వాగ్గేయకారులను గురించి స్థాలిపులాకంగా చర్చించారు. ఇప్పటివలె పరిశోధనావకాశాలు విరివిగాలేని ఆనాడు వారికి ఒక్కొక్కరిని గురించి తెలిసిన విషయాలు క్లుప్తంగానే ఉన్నాయి తాళ్ళపాకవారిని గురించి వ్రాసేటప్పుడు అన్నమాచార్య, పెదతిరుమలార్య, చినతిరుమలయ్యలను గురించి వ్రాయవలసిఉండగా, కీర్తనకర్త యెంతమాత్రముకాక, ద్విపదకవియైన చిన్నన్న ఒక్కని గురించే వ్రాస్తూ ఆతడే సంకీర్తన పద్ధతికి (అన్నమాచార్యుల ప్రసక్తియేలేదు) ఆది పురుషుడని సంప్రదాయ ప్రదర్శినిలో వ్రాయడం ఆశ్చర్యపడవలసిన విషయమే. ఒక్క సుబ్బరామదీక్షితులకు మాత్రమే కాదు. పది పదిహేనేళ్ళ నాడు తిరుపతి తిరుమల దేవస్థానంవారి ప్రోత్సాహంతో కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సముద్ధరించేవరకు తాళ్ళపాక కవులు ఫలానా వారనిగాని, వారు వ్రాసిన సంకీర్తన లివియని గాని, ఇన్నియని గాని ఎవరికీ తెలియవు. అన్నమాచార్య చరిత్రమును అన్నమాచార్యుల చిన్న మనుమడు చిన్నన్న రచించాడు. అది ప్రబలమైన సమకాలికాధారం. దానికి ప్రభాకరశాస్త్రులవారు విపులమయిన పీఠిక వ్రాశారు. అది యెంతో అమూల్యమైనది. తాళ్ళపాక కవుల సంకీర్తనముల నెన్నిటినో తిరుమల దేవాలయంలోని అరనుండి ఉద్ధరించి, ప్రభాకరశాస్త్రులవారు, రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు పరిశోధించి సంస్కరించి ప్రకటింపించారు. చాగంటి శేషయ్యగారి ఆంధ్రకవి తరంగిణి ౬, ౮, ౯ భాగాల్లో తాళ్ళపాక వాగ్గేయకారుల చరిత్రమూ, కవితావిశేషాలూ వివరించారు. యక్షగానములలో ఇంచుమించు మొదటిదైన సుగ్రీవ విజయాన్ని కూడా పరిష్కరించి ప్రభాకరశాస్త్రిగారే సోపోద్ఘాతంగా ప్రకటించారు. కూచిపూడి యక్షగానముల రచయితయైన సిద్ధేంద్రయోగిని గురించిన సమాచారము విశ్వనాథ సత్యనారాయణగారు ప్రత్యేక పరిశోధనలద్వారా సంపాదించి, తమ ఏకవీర నవలలో కొంత పొందుపరచారు. తంజావూరులోని మేలటూరుకు, వరహూరుకుపోయి, నారాయణతీర్థుల జీవిత విశేషాలను గురించీ, రచనలను గురించీ మేలటూరి భాగవతుల యక్షగానములను, ఇతర రచనలను గురించీ డా. రాఘవన్‌గారు పరిశోధనలు చేశారు. నారాయణతీర్థుల పారిజాతాపహరణమును గురించి, మరొక తెలుగు యక్షగానమును గురించి యస్. వి. జో[illegible]గారు కూడా పరిశోధనలు

సలిపారు. (రామదాస ముద్రాంకితాలైన భజన కీర్తనలను సూత్రప్రాయంగాగుచ్చి, వే రెవ్వరో నరసింహదాసు మున్నగువారు యక్షగాన పద్ధతిని రచించిన 2-3 రామదాసు చరిత్రములుతప్ప (త్యాగరాజుకు ఆయనపైనిగల అమేయ గురుభక్తి తాత్పర్యమునుమించీ) - విశేషముగా రామదాసు జీవిత చారిత్రకత గురించి పరిశోధనలు జరగలేదు.) అధ్యాత్మరామాయణ కీర్తనలను వ్రాసిన సుబ్రహ్మణ్య కవిని గురించి, నారాయణతీర్థులను గురించికూడా తిమ్మావఝ్ఝల కోదండరామయ్య గారు పరిశోధనలుచేసి వ్యాసాలు వ్రాశారు. విస్సా అప్పారావుగారు వ్రాసిన విపుల మైన పీఠిక క్షేత్రయ్య జీవిత చరిత్రను, వ్యక్తివిశిష్టతను చాలమట్టుకు వెలుగులోనికి తెచ్చింది. కురుగంటి సీతారామయ్యగారి తంజావూరు ఆంధ్రనాయక రాజుల కాలంనాటి తెలుగు సాహిత్య చరిత్రము, నేలటూరి వెంకటరమణయ్యగారి మధుర నాయకులనాటి సాహితీ చరిత, నిడదవోలు వెంకటరావుగారి దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము అద్యతన యుగములోని నాయక రాజులనాటి యక్షగాన కవితా సంగీత రీతులను కొంతవరకు తెలియపరుస్తాయి. దరిదాపు 1930 నుంచీ ప్రకటింపబడు తూన్న మద్రాసు సంగీత పరిషత్తువారి ఆంగ్ల పరిషత్పత్రికా సంపుటాలలో వింజమూరి వేంకటవరాహ నరసింహాచార్యులవారు, డాక్టర్ వి. రాఘవన్ మున్నగు ప్రముఖులు వ్రాసిన వ్యాసాలలో ఎందరో ప్రాచీన లక్షణకర్తలను గురించి స్థాలీపులాక పరామర్శలు లభిస్తాయి. కర్నాటకసంగీత రత్నత్రయం,త్యాగరాజు, శ్యామా శాస్త్రి, దీక్షితులు, ఇంకా ఇతర సమకాలిక దాక్షిణాత్యులు. అద్యతనులు వీరందరిని గురించి పి. సాంబమూర్తిగారు తాము ప్రకటించిన గ్రంథాలలో ఎన్నో అమూల్య విషయాలను సేకరించారు. త్యాగరాజు జీవిత విశేషాలతో, సాహిత్య సంగీత రచనా విమర్శలతో త్యాగరాజ శతవార్షికోత్సవ సంచిక రాజమండ్రి ఆంధ్ర గాన కళామండలివారు ప్రకటించారు

ఇవిగాక, వాగ్గేయకార శబ్దార్థ నిర్వచనములనూ, వాగ్గేయకార లక్షణమునూ, వాగ్గేయకారులందరి కృషికీ ఉపాధేయమైన గేయప్రబంధరీతులనూ గురించి భరత, మతంగ, శార్ఙ్గదేవ, గోవింద దీక్షితాదుల లక్షణగ్రంథాలలోని ప్రకీర్ణక ప్రబంధాధ్యాయాలలో విపులంగా వివరించి ఉన్నది. అన్నిటికీ అదిగేయమై తాళ్ళపాక వారికి నిత్యకృత్యమైన సంకీర్తనమునకు అన్నమాచార్యులే సంస్కృతంలో లక్షణం రచించాడు. ఈ సంకీర్తన లక్షణాన్ని ఆయన పెద్దమనుమడు చినతిరుమలయ్య తెనిగించాడు. అన్నమాచార్యులకు పూర్వుడై తాళగంధి వచన గేయములను రచించిన కృష్ణమాచార్యులను గురించి తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు వ్యాసం రచించారు. వీరిని గురించి చాగంటి శేషయ్యగారి కవి తరంగిణిలో కూడా వుంది.

ఏ యే వాగ్గేయకారులు ఏ విధమయిన గేయ ప్రబంధాలను రచించారో ఆయా లక్షణకర్తలు నిర్దేశించిన లక్షణానికి ఆయా రచనలు ఎలా సరిపోతాయో

తెలిసుకోవాలంటే సంగీతశాస్త్ర, గ్రంథాలన్నింటిలోను దాదాపు ఒకేవిధంగా నిర్వ
చింపబడిన ప్రబంధాధ్యాయాన్ని ఈ గ్రంథంలో ఒక ప్రకరణంగా వివరించవలసి
ఉంటుంది. ఆ ప్రబంధములలో ముఖ్యంగా పదం అనేదాన్ని మాత్రం తీసుకొని
అన్నమాచార్యుడు సంకీర్తన లక్షణము నిర్వచించిన విధానం తెలియడంకోసం ఒక
ప్రకరణం వినియోగించబడుతుంది. ఎందుకంటే, పదం, లేక సంకీర్తనమే తర్వాత
కృతిగాను, కీర్తనగాను పరిణామం చెంది అద్యతన వాగ్గేయకారుల విస్తృత రచన
లకు కారణమయింది.

భారతదేశంలోని ఏ భాషలోనైనా వాగ్గేయకారుల చరిత్రగాని, సంగీత
క్రమ పరిణామముగాని వ్రాయబోతే ముందుగా వేదకాలంనుంచీ ప్రారంభించి,
ఆదిమ లక్షణ కర్తలయిన భరత, మతంగాది మునుల కృషితోగాని ప్రారంభించ
లేము.

## రెండవ అధ్యాయము

# సంగీత పరిణామం చరిత్ర : లక్షణ కర్తలు

### చరిత్రాతీత ప్రాచీన యుగం

అత్యంత ప్రాచీనకాలంలో, అంటే ఋగ్వేద కాలానికికూడా పూర్వం వేదమంత్రములను ఉదాత్తానుదాత్తాలులేని ఒకే స్వరంలో దీర్ఘశ్రుతిగా పలుకుతూండేవారు. దీనికి ఆర్చికపద్దతి లేక ఏకస్వర గాయన పద్ధతి అని పేరు. ఆ తర్వాత ఋగ్వేదకాలంనాటికి గాథిక పద్ధతి లేక ద్విస్వరగాయన పద్ధతి— తర్వాత సామికము లేక త్రిస్వరగాయనపద్దతి వచ్చింది. పాణినీయంలోనూ, నారదుడు వ్రాసిన శిక్ష అను ప్రాచీన సంగీత శాస్త్రగ్రంథములోనూ ఇలా చెప్పబడి ఉంది : "ఉదాత్తానుదాత్తశ్చ స్వరితశ్చ స్వరాశ్రయః", "ఉచ్చైరుదాత్తః, నీచైరనుదాత్తః". త్రిస్వరగాయన పద్ధతే రాను రాను 'స్వరాంతర' లేక చతుస్వరిగాను, ఆ తర్వాత పంచస్వరిగాను, షట్స్వరిగాను; ఆఖరికి సప్తస్వరిగాను పరిణామం చెందింది. ఈ పరిణామం సామవేదంనుంచే జరగడంవల్ల ఆ కాలపు గాయన పద్ధతిని సామిక పద్ధతి అన్నారు. ఏడు స్వరాలూ వెలసిన తొలిరోజుల్లో వాటిని వరుసగా (౧) ఉత్కృష్ట లేక కృష్ణ; (౨) ప్రథమ: (౩) ద్వితీయ; (౪) తృతీయ; (౫) చతుర్థ; (౬) మంద్ర; (౭) స్వరిత లేక అతిస్వర — అనేవారు. మన దేశంలో తంత్రీవాద్యాలు: వాయువాద్యాలు; తాళవాద్యాలు వేదకాలంనాటి నుంచీ ఉండేవి.

సామగానమునకు నేటి గమకములవంటి విన్యాసా లుండేవి. అవి వికార; విశ్లేష; వికర్షణ: అభ్యాస; విరామ; స్తోభములు – 'గరిసనిద' అని పంచస్వరములతో వ్యవహరింపబడిన గ్రామం. కొన్నాళ్ళకు 'మగరిసనిదప' అని పై మధ్యమం నుంచి క్రింది పంచమం వరకూ అవరోహణ పద్ధతిలో పరిణామం చెందింది. క్రింద పలికిన 'సనిదప' స్వరాలను మధ్యమానికి పైనికూడా పలుకవచ్చునని తెలియగానే స్వరసప్తకంతో కూడిన స్థాయి పరిజ్ఞానం కలగడంతో సంగీత శాస్త్రాభివృద్ధికి ప్రధాన బీజారోపణ జరిగిందని చెప్పాలి. ఇది క్రీస్తుపూర్వం 2500 ఏళ్ళకు 1500 ఏళ్ళకు నడుమ జరిగినదని చరిత్రకారుల అభిప్రాయం. మంద్ర మధ్య తారములనే మూడు స్థాయిలూ, ఒక్కొక్క స్థాయిలో ఒక్కొక్క స్వరసప్తకం: ఇత్యాది పరిజ్ఞానము ఋక్ ప్రాతిశాఖ్యలో మొదటి సారిగా వెల్లడి అయింది.

నాలుగు వేదములూ కాక, సామవేదము నుండి బయలుదేరిన సంగీతాన్ని గురించి 'గాంధర్వవేద' మనే ఉపవేదం బయలుదేరింది. సదాశివుడూ, బ్రహ్మ, నారదుడూ, తుంబురుడు, కంబళుడు, అశ్వతరుడు, అరుణుడు, ఆంజనేయుడు మొదలైన పురాణ పురుషుల పేరు మీద నాట్య, సంగీత శాస్త్రాలపై గ్రంథాలు బయలుదేరాయి. కాని వీరందరు నిజంగా ఆ పురాణ పురుషులేనా అని చరిత్ర కారుల సందేహం. సామవేద యుగానికి తర్వాతి యుగాన్ని సంగీత చరిత్రలో గాంధర్వ యుగం, లేక మార్గయుగం అన్నారు. ఈ మార్గ సంగీత రచనల లక్షణమూ, లక్ష్యాలూ కూడా సంస్కృత కావ్య భాషలో జరిగేయి. వీటి ఈ మార్గ పద్ధతి లక్ష్య ప్రబంధాల కర్తృత్వం బ్రహ్మకు ఆపాదించారు. ఇవి శివస్తుతి పరాలు. బ్రహ్మచేత వెదకబడి "మృగయతే" సంపాదింపబడినవి కనుక వీనిని మార్గ గానము లన్నారు. వీనిలో కొన్ని భరతుని నాట్యశాస్త్రంలో ఉదాహృతాలు. శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరంలో అవి సస్వరంగా కూడా ఉదాహరించారు.

ఈ శివ సంబంధమైన మార్గ సంగీతానికి కొంచెం ముందుగానే ఆఖ్యాన గానం వ్యవహారంలో ఉండేది. ప్రసిద్ధేతిహాసాలయిన రామాయణ మహా భారతాలను ఆఖ్యానగానానికి ఉపయోగించేవారు. ఇద్దరు గాయకులు వీణను వంతగా పెట్టుకొని ఏడు విధాలైన జాతుల (ఆనాటి రాగాలు) లో ఆఖ్యానాలను గానం చేసేవారు. సప్త స్వరాలలోని షడ్జమునుండి, మధ్యమము నుండి, గాంధారం నుండి ఒక్కొక్క దానిని ఆధార శ్రుతిగా తీసుకొని, పై యేడు స్వరాలతో కలుపుకొని, గ్రామము అని ఆనాడు రాగములను వ్యవహరించే వారు. రానురాను భరతుని నాట్యశాస్త్రం వచ్చే నాటికి గాంధార గ్రామం వ్యవహారంలోనుంచి పోయింది. ఈ గాంధార గ్రామమూ, ముందు చెప్పుకొన్న గాంధర్వపద్ధతి గానమూ, గాంధార దేశంలో పుట్టినవేమోఅని చరిత్ర కారుల ఊహ.

"యథా కుటుంబినః సర్వ ఏకీభూత్వా వసంతి హి
సర్వలోకేషు సగ్రామో యత్ర నిత్యం వ్యవస్థితః" (బృహద్దేశి)

ఈ కాలంలో హరప్రియ, కాంభోజి, భైరవి మేళములు వ్యవహారంలో ఉండేవని హులుగూరు కృష్ణాచార్యులు గారు మద్రాసు సంగీత పరిషత్పత్రికలో వ్రాశారు. షడ్జగ్రామమూ, మధ్యమగ్రామమూ మాత్రమేకాకుండా గాంధారగ్రామం కూడా జనశ్రుతమని మహా భారతంలోని హరివంశ పర్వములో ఉందట.

## భ ర తు డు :

క్రీస్తు పూర్వం సుమారు 200 నాటి నుంచి, క్రీస్తు తరువాత 400 మధ్య కాలంలో గ్రామములనుండి మూర్ఛనలూ, జాతులూ ఏర్పడ్డవి. ఇది ప్రసిద్ధ నాట్య

శాస్త్ర కర్త భరతముని వెలసినకాలం. మూర్ఛనాప్రస్తార భేదములద్వారా గ్రామము లను విభజించి వేరువేరు జాతులుగా నిర్ణయించాడు భరతుడు. సప్తస్వరాత్మకమైన ఏడు శుద్ధజాతులను, పంచస్వరాత్మకమైనవీ, షట్స్వరాత్మకమైనవీ అయిన జాతులకు షాడవ, ఔడవము లను పేరులు పెట్టి వాటిని శుద్ధవికృత జాతులుగను, సాధారణ వికృతులుగాను, సంసర్గజ వికృతులుగాను విభజించాడు (భరతముని అని అనేక నాటకములలోను, నాటక లక్షణములలోను, అలంకార శాస్త్రములోను ఉదాహరింపబడిన ఈ మహర్షి తాను రచించిన నాట్య శాస్త్రములో సంగీతశాస్త్ర విషయములను ఆరు అధ్యాయాలలో చెప్పాడు.) అవి-జాతి లక్షణ విధానం, ఆతోద్యజాతి విధానం, సుషిరాతోద్యాధికారం, తాళవిధానం, ధ్రువాధ్యాయం, పుష్కరవాద్య విధానం- వీటిలో మొదటి మూడు అధ్యాయాలలోనూ మూర్ఛనల ప్రస్తారం ద్వారా జాతుల నెలా గ్రహింపవచ్చునో, వాటిని ఆయా వాద్యాలపై ఎలా ప్రయోగింపవచ్చునో వివరించాడు. తాళవిధానం స్పష్టం. /ధ్రువాధ్యాయం ఆనాటి ధ్రువాగానము అనబడే గేయరచనల ఫణితులనుగురించి చెప్పినది. శ్రీ, ప్రతిష్ఠ, సుప్రతిష్ఠ, విద్యుద్భ్రాంత, భూతలమాన్య, కమలముఖి ఘనపంక్తి, తనుమధ్య, శాలిని, మకరకశీర్ష, విమల, సునంద, లలిత, పంక్తి, నలిని, నీలతోయా, ద్రుతగతి, భ్రమరమాల, భోగవతీ మున్నగు దరువులు ఒకటి రెండు వందలవరకు ధ్రువా రీతులను భరతుడు సలక్షణంగా వివరించాడు. ధ్రువాశబ్దపు పరిణామమే దరువు - లేక దరువు అనే దేశిపదాన్ని సంస్కృతీకరించి ధ్రువా అన్నారని కొందరు పండితుల అభిప్రాయం. కీర్తనలు, సంకీర్తనలుకూడా వీటికి తరువాతి పరిణామములే. భరతుని ధ్రువారీతులు చాలమట్టుకు సంస్కృత, ప్రాకృతచ్ఛందస్సులలో కనబడతాయి./

జాత్యధికారంలో షడ్జ గ్రామంనుంచి షాడ్జి, నైషాది, ధైవతి, ఆర్షభి అను నాల్గు జాతులునూ, మధ్యమ గ్రామంనుంచి గాంధారి, మధ్యమ, పంచమ అను మూడు జాతులునూ శుద్ధజాతులు, అంటే ఈ జాతులే ఆనాటిరాగము లన్నమాట

ఒకస్థాయి (సప్తకం) లో ఏడు శుద్ధస్వరాలు మాత్రమే కాకుండా వికృతి స్వరాలతో కలిపి మొత్తం 22 శ్రుతులుంటాయని భరతుడు, చలవీణ, ధ్రువవీణ అను రెండు వీణలతో ప్రయోగదృష్టాంతాలద్వారా వివరించాడు. ఈ పద్ధతినే శార్ఙ్గదేవుడూ మొదలయిన తర్వాతి లక్షణకర్తలు అనుసరించారు. షడ్జ గ్రామంనుంచి ఏడూ, మధ్యమ గ్రామంనుంచి ఏడూ, 14 శుద్ధజాతులూ, మరి 4 మిశ్రమజాతులూ కలిసి మొత్తం 18 జాతులు (రాగాలు) నిర్ణయించాడు.

భరతుడు లక్షణం చెప్పిన ధ్రువాగానము నాటక ప్రదర్శనోపయుక్తమైన 5విధములుగా చెప్పబడింది. ప్రావేశికి, నైష్క్రామికి, ఆక్షేపికి, అన్తర, ప్రాసాదికి-

వీటిలో మొదటిది పాత్రప్రవేశ కాలంలో పాడబడేది. రెండవది పాత్రనిష్క్రమణ కాలంలో పాడబడేది. ఈ ప్రావేశికీ సంప్రదాయమే. మన తెలుగు యక్షగానపు దరువులలో రాజు ప్రవేశించేటప్పుడు "రాజు వెడలె" వంటి దరువులకు ప్రాచీన రూపమన్నమాట.

## నా ర దు డు :

భరతుని నాట్యశాస్త్రం తర్వాత, ప్రసిద్ధగ్రంథం నారదీయశిక్ష, నారదమహర్షి వ్రాశాడని ప్రతీతి. రాగాల ప్రశంస తగుమాత్రంగా కనబడే తొలిగ్రంథం నారదీయ శిక్ష. షాడ్జి, మాధ్యమి అను గ్రామరాగాలు రెండు, ఆరుస్వరాలు మాత్రమే తీసుకొనే పాడవము, పంచమము, సాధారితము, కైశికము, కైశికమధ్యమము ఇందులో వివరింపబడ్డాయి.

త్యాగరాజుకు ఉపదేశగురువుగా దర్శనమిచ్చి, స్వరార్ణవమను సంగీతలక్షణ గ్రంథమును రచించినదికూడ నారదుడే నట. అంతేకాకుండా సంగీత మకరందమూ, చత్వారింశచ్ఛతరాగ నిరూపణం అనే సంగీత గ్రంథాలను కూడా నారద మహర్షే రచించినారట. మహతీ వీణాగానలోలుడై, విష్ణుభక్తుడై త్రిలోకసంచారి అనిపించుకొన్న నారదుడే యీ గ్రంథాలను రచించాడో లేక అదే పేరుగల వేరు వేరు వ్యక్తులో తెలియదు.

## మ తం గు డు :

తర్వాతి ప్రసిద్ధ లక్షణకర్త మతంగ మహర్షి, ఈతని గ్రంథం బృహద్దేశి. శ్రుతినిర్ణయం స్వరనిర్ణయం, మూర్ఛనా తానములు, 33 అలంకారములు, "గమకములను పోలి ఉంటాయి", జాతులు, రాగలక్షణం, భాషాలక్షణం, ప్రబంధాధ్యాయము, ఇవి బృహద్దేశిలోని అధ్యాయాలు. భరతుడు చెప్పని విధంగా రాగ మార్గాన్ని వివరిస్తానని, మతంగుడు రాగానికి నిర్వచనం ఇచ్చాడు.

> "స్వర వర్ణ విశేషేణ ధ్వని భేదేన వా పునః
> రజ్యతే యేన యః కశ్చిత్ స రాగః సం మతః సతాం
> యోఽసౌ ధ్వని విశేషస్తు స్వరవర్ణ విభూషితః
> రంజకో జన చిత్తానాం స చ రాగ ఉదాహృతః—" "బృహద్దేశి"

ఈ రాగాలు మార్గపద్ధతికి భిన్నములూ, దేశ వ్యవహార సిద్ధములూ కనుక వీటిని గూర్చిన యీ గ్రంథం బృహద్దేశి అయింది. ప్రాచీన గ్రంథాలలో గ్రామములనీ, జాతులనీ వ్యవహారం ఉంటూండగా, దేశ వ్యవహారంలో నుంచి

తీసుకొని రాగాలను పరిపూర్ణ స్వరూపాలతో తొలిసారిగా శాస్త్రంలో చొప్పించిన వాడు మతంగుడే.

అంతేకాదు. ఆ రాగాలలో కొన్ని జనక రాగములనీ, వాటినుండి భాషా రాగాలు వాటినుండి విభాషారాగాలు, వాటినుండి అంతరభాషారాగాలూ పుట్టాయని చెప్పాడాయన. గ్రంథం పేరూనూ, రాగాలలో టక్క బోట్ట, సౌరాష్ట్రి, గుర్జరి, ఆంధ్రి, మాలవి, షాడ్జోదీచ్య, గాంధారోద్యదీచ్య, సౌవీర, ఆభీరి, హిందోలక, మొదలైన రాగాలలో చాలమటుకు ఆయా దేశాలకు సంబంధించిన పేర్లను కలిగి ఉండటమూ చూస్తే అనాడు దేశంలో జనానీకంలో బహుశ్రుతంగా వ్యవహారంలో ఉన్న రాగాలను మతంగుడు క్రోడీకరించి తనకు ముందున్న గ్రామ, జాతి పద్ధతితో సమన్వయం చేసుకొంటూ. రాగలక్షణమును ప్రత్యేకపద్ధతిలో శాసించి తర్వాతి లక్షణకర్తలకు మార్గదర్శకుడయినాడని తెలుస్తుంది.

మతంగుడు ప్రబంధాధ్యాయంలో చెప్పిన ముఖ్యమైన గేయరచన లివి ; 1. కందాఖ్య ప్రబంధము 2. వృత్త ప్రబంధము, 3 గద్య ప్రబంధము, 4. దండకం, 5. వర్ణకం, 6. ఆర్యా, 7. గాథా, 8. ద్విపథం, 9. వర్ధటీ 10, అడ్డిలా, 11. చతుష్పదీ, 12. దోధకం. 13 తోటకం, 14. వస్తు, 15. క్రౌంచపదం, 16. హంసపదం, మొదలైనవి మొత్తం 40 దాకా చెప్పాడు. ఇవి చాలా దేశీయ రచనా విశేషాలు.

వీనిలో మొదటి కందం అనేది కందార్థంగా యక్షగానాల్లో వినబడే దరువు. గద్యప్రబంధాలు కూడా చూర్ణికలనే పేర వింటూంటాము. దండకాలకు తెలుగు సాహిత్యం నిధి. ఏలలు అందరకు తెలిసిన దేశీసంగీత రచనా విశేషం.

నందికేశ్వర, నారద, మండూక, కశ్యప, ఆంజనేయ. కోహల, తండు, దత్తిలాది పౌరాణిక లక్షణకర్తలతోపాటు భరత, మతంగుల పేర్లుకూడా వినబడతాయి; భరతుడు దేవలోకంలో ఇంద్రసభలో నాట్య సంగీతాచార్యుడని ప్రసిద్ధ సంస్కృతనాటకాలలో కనబడుతుందికాని, నాట్యశాస్త్ర గ్రంథపరిశోధకులు భరతుని చారిత్రకపురుషునిగానే సుమారు క్రీ. శ. 400 ప్రాంతమున వెలసినవాడని నిర్ణయించారు — ఆ తరువాత మతంగునికాలం — వీరిద్దరి గ్రంథాలు కూడా వేర్వేరు వ్యాఖ్యానాలతో మనకు లభిస్తున్నాయి. ఈ లక్షణకర్తలంతా భారత దేశం అన్ని ప్రాంతాలవారికీ ప్రామాణికులు.

## మమ్మటాచార్యుడు :

వారి తర్వాత అనేక నాట్య సంగీత లక్షణ గ్రంథవ్యాఖ్యాతలపేర్లూ, లక్షణకర్తలపేర్లూ వినబడతాయిగాని, వారిలో 'కావ్యప్రకాశిక' అను సాహిత్య (అలంకార)

శాస్త్రమును రచించిన మమ్మటాచార్యుడు సంగీత రత్నమాలఅను లక్షణ గ్రంథం కూడా వ్రాసినట్లు తెలుస్తోంది. (1050—1150) ఇతని గ్రంథంలో శుద్ధవరాటి ద్రవిడవరాటి, దేశవరాటి, దక్షిణసౌరాష్ట్రిగుజ్జరులు టక్క, ఘంటారవ, నట్ట నారాయణ, శంకరాభరణ, దేరాగముల ప్రశంస కనబడుతుంది.

## పార్శ్వదేవుడు:

మమ్మటునికి - కొంచెము ముందుగా క్రీ. శ. 920 ప్రాంతమున బాదామి చాళుక్యరాజయిన ప్రతాపత్రైలపుడు రచించిన సంగీత చూడామణి. అన్నమాచార్యుల సంకీర్తన లక్షణం అనే గ్రంథంలో ప్రామాణికంగా ప్రశంసింపబడింది. మమ్మటునికి తరువాతి కాలంలో పార్శ్వదేవు డను జైన పండితుడు క్రీ. శ. (1165) సంగీత సమయసారం అనే గ్రంథాన్ని రచించాడు. ఈ గ్రంథంలోని చాలా అంశాలు శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరానికి కల్లినాథసింహ భూపాలురు రచించిన వ్యాఖ్యానాలలో ఉల్లేఖింపబడ్డవి.

## చాళుక్యసోమేశ్వరుడు:

అటుతర్వాత క్రీ. శ. (1174-77) ప్రాంతపుకాలంలో కళ్యాణినగరం రాజధానిగా పాలించిన చాళుక్యచక్రవర్తి సోమేశ్వరుడు అభిలషితార్థచింతామణి లేక మానసోల్లాసము సంగీత రత్నావళి అను సంగీత శాస్త్రగ్రంథాలు రచించాడు.

## సోమనార్యుడు:

సుమారు ఇదేకాలపు వాడని అనుకొంటున్న సోమనార్యుడు రచించిన స్వరార్ణవము లేక స్వరరాగసుధారసము అను సంస్కృతగ్రంథము వ్రాత ప్రతులు పరిశోధకుల కంటబడి సుమారు 20 ఏండ్లయింది. కాని, ఆ సోమనార్యుడెవరనే విషయంలో ఎవరూ ఒక అభిప్రాయానికి వచ్చినట్లు లేదు ఇతడు శైవమత పరాయణుడనీ, గ్రంథం శివపార్వతుల మధ్య జరిగిన సంవాదంలో నడుస్తుందనీ డా. వి. రాఘవన్‌గారు వ్రాశారు. (1609) ప్రాంతపువాడూ, ఆంధ్రదేశీయుడు అయిన సోమనాథుడు ఈ సోమనార్యుని ప్రశంసించి ఉండడంచేత, ఇతర లక్షణ కర్తలు ఇతని గ్రంథాలను సోమనాథుని గ్రంథంనుంచి అని కూడా పేర్కొంటూ ఉదహరించి ఉండడంవల్లా, 1160 నుంచి 1260 నడుమ వెలసి, బసవ పురాణం పండితారాధ్య చరిత్రలను ద్విపదలో రచించిన ఆంధ్రమహాకవి పాల్కురికి సోమనాథు డీయన కాగలడా అనే విషయం పరిశోధకులు తేల్చవలసి ఉంది. పాల్కురికి సోముడు సంస్కృతాంధ్ర మహారాష్ట్రి కర్ణాటద్రావిడ

భాషలలో కవిత్వము చెప్పగలడు. పండితారాధ్య చరిత్రలో పర్వతప్రకరణంలో విపులంగా దేశి నాట్య విశేషాలను సంగీతశాస్త్ర విషయాలను చర్చించాడు. మతంగుని బృహద్దేశికి తర్వాత దేశిగాన పద్ధతిలోని రాగములు, 108 తాళాలు, ప్రబంధములు ఇతర ప్రదర్శనీయాంశాలు, గతులు, గమకాలు, ఆలాపనలు, వాచకములు, తిరుపులు, వహణులు తాయములు, సాళగతాళగతులు, వాద్య చూడాదులు బృహద్దేశిలో లేనివికూడా పాల్కురికి సోముని పండితారాధ్య చరిత్రలో ఉదాహృతములయాయి. ఈత డుదాహరించిన రాగతాళాదికముల పేర్లు చాలమట్టుకు ఇతని కించుమించు సమకాలికుడయిన శార్ఙ్గదేవుడు తన సంగీత రత్నాకరంలో ఉదాహరించిన వానితో సరిపోలుతాయి. అదిగాక, ఆనాటి తంత్రీవాద్యా లన్నిటినీ సుమారు 40 వీణాభేదములుగా చెప్పాడు పాల్కురికి.

## జాయపసేనాని :

ఇటు పాల్కురికి సోమనాథునికీ, అటు శార్ఙ్గదేవునికీ కూడ ఇంచుమించు సమకాలికుడై "1213-1262" వరకు కాకతీయ సామ్రాజ్యము క్రింద ఆంధ్ర దేశ మంతటినీ ఏకచ్ఛత్రముగా ఏలిన గణపతి దేవుని కొలువులో గజసైన్యాధి పతిగా ఉండిన జాయపసేనాని నృత్తరత్నావళి అనే నాట్యశాస్త్ర గ్రంథాన్నీ, గీత రత్నావళి అనే సంగీత లక్షణగ్రంథాన్నీ రచించినట్లు తెలుస్తోంది. నృత్తరత్నావళిని పరిష్కరించి సోపోద్ఘాతముగా డా. వి. రాఘవన్‌గారు ఇటీవలే ప్రకటించారు. నృత్తరత్నావళిలో 40 విధాల దేశి లాస్యవిశేషాలను వర్ణించాడు. ఆ గ్రంథంలో 5వ అధ్యాయంలో...

"సచాస్మాభిః స్ఫుటం గీత రత్నావళ్యాం ప్రపంచితః" అని వ్రాశాడు. పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్రలో వివరించిన దేశీయగానవిశేషాలకు, గీత రత్నావళి చాలదగ్గరగా ఉండవచ్చు. వాద్యరత్నావళి అనే గ్రంథాన్ని కూడా జాయప సేనాని రచించెనని వినికిడి. కాని, ఈ చివరి రెండుగ్రంథాలు ఇంకా లభించలేదు. గొప్ప చరిత్రాత్మక విషయమేమిటంటే, భారత దేశానికంతకూ ప్రామాణికుడైన సంగీత లక్షణకర్తయైన శార్ఙ్గదేవునికి సమకాలికుడుగా (బహుశా సమవయస్కుడు కూడానేమో) ఆంధ్రదేశీయుడైన జాయపసేనాని, నాట్య సంగీత లక్షణగ్రంథాలు వ్రాయడం. శార్ఙ్గదేవుని పోషకులైన దేవగిరి యాదవరాజులకూ, కాకతీయ గణపతిదేవునకూ నడుమ చారిత్రకంగా రాజకీయ వైరమే కాకుండా, కవి పండిత కళాపోషణలో కూడా స్పర్ధ ఉండేదన్నమాట.

## శార్ఙ్గదేవుడు :

1200 — 1247 ప్రాంతమున దేవగిరి (హైద్రాబాద్ రాష్ట్రంలోని దౌలతాబాద్) రాజధానిగా పరిపాలించిన యాదవవంశపురాజు సింహణ భూపాలుని ఆస్థానపండితుడు శార్ఙ్గదేవుడు. ఆంధ్ర దేశీయులైన కల్లినాథుడూ, దరిమిలా సర్వజ్ఞసింహభూపాలుడూ సంగీతరత్నాకరానికి వ్యాఖ్యాతలు కావడం చూస్తే, గ్రంథంపుట్టుక మహారాష్ట్రంలో అయినా, దీనిలోని సంప్రదాయం దేశంలోనిఅన్ని రాజ్యాలలోని గానపద్ధతులనూ పరిశీలించి తయారుచేసినదే. ఆంధ్రి, గౌడి లాటి మొదలైన జాతిగానముల నిర్వచనమూ ఆంధ్రైలా, కర్ణాటైలా, ద్రావిడైలా మొదలైన ఏలా ప్రబంధముల లక్షణ నిర్దేశమూ పై అభిప్రాయానికి తార్కాణములు. 22 శ్రుతుల నిర్ణయంలో భరతుడు చూపిన చలవీణా ధ్రువవీణాప్రయోగం ద్వారా షడ్జగ్రామాన్నీ, మధ్యమగ్రామాన్నీ, ఆధారశ్రుతితంతినుంచి షడ్జమధ్యమ భావంగానూ. షడ్జపంచమభావంగానూ ఆరోహణ గతిలో పైకి పోగా వచ్చే శ్రుతులకు వేర్వేరు తంత్రులను సరిచేసి కనిపెట్టే పద్ధతినే ఇతడూ విపులంగా చెప్పాడు. ఇతడు నిశ్శంక బిరుదాంకితుడు. తన గ్రంథంలో భరత, మతంగ, కీర్తిధర, కోహల, కంబళ అశ్వతర, ఆంజనేయ, అభినవగుప్త, సోమేశ్వరాదుల మతములను నిరూపించినట్లు చెప్పాడు. ఈ గ్రంథం స్వర గతాధ్యాయం, రాగ వివేకాధ్యాయం, ప్రకీర్ణకాధ్యాయం, ప్రబంధాధ్యాయం, తాళాధ్యాయం, వాద్యాధ్యాయం, నృత్తాధ్యాయం – అను ఏడు అధ్యాయాలు, శార్ఙ్గదేవుడు రాగవివేకం అనే ప్రకరణంలో గ్రామరాగాలను, ఉపరాగాలను, శుద్ధరాగాలను, భాషావిభాషా అంతరభాషా రాగభేదాలను వివరించి, షడ్జ గ్రామంలోని గౌడ భేదాలనూ, బోట్ట (భూటాన్) మాలవ భేదాలనూ, మధ్యమ గ్రామంలోని టక్క (ఢాకా) రాగ భేదాలనూ బాంగాలీ, వరాటికా భేదాలనూ, సౌవీర, సౌవీరీ, భైరవా, నట్టా, ఛాయానట్టా, రామకృతి, దేవకృతి. గౌడకృతులనూ, తోడికా, తురుష్కతోడి ఛాయాతోడి గుర్జరీ భేదాలనూ, ఆంధాళీ, మల్లారీ, సైంధవీ భేదాలనూ – సుమారు 100 రాగాలకు పైగా చెప్పి వాటికి లక్షణం వివరించాడు. దేశీ రాగాలను రాగాంగ ఉపాంగ. భాషాంగ క్రియాంగములని విభజించాడు.

## సింహ భూపాలుడు

సంగీత రత్నాకరానికి మొత్తం ఏడు వ్యాఖ్యానా లున్నవట. సిం... శార్ఙ్గదేవ, కుంభకర్ణనరేంద్ర, కల్లినాథులు చేసిన సంస్కృత వ్యాఖ్యా... నాలుగు అని సుబ్బరామదీక్షితులవారు సంప్రదాయప్రదర్శినిలో వ్రాశారు... అనుటకు బదులు సింహభూపాల అని ఉంటే సరిగా ఉంటుందేమో ! గంగా

రాముడు హిందూస్థానీ వ్యాఖ్యాతట. ఇవి కాక రెండు ఆంధ్ర భాషా వ్యాఖ్యానాలున్నవట. వానిలో ఒకటి హంసభూపాలునిదట. కాకతీయరాజ్యం క్షీణించాక, రాచకొండలో రాజ్యం నెలకొల్పిన పద్మనాయకులలో ప్రసిద్ధుడయిన సర్వజ్ఞసింగ భూపాలుడు సంస్కృతంలో సుధానిధి అను వ్యాఖ్యను మాత్రమేకాక, తెలుగులో కూడ మరొక వ్యాఖ్యానం రచించారుకాబోలు. అయితే ఈ భూపాలుని ఆస్థానకవి, మహా విద్వాంసుడు అయిన విశ్వేశ్వర కవియే ఈ వ్యాఖ్యానాలు రచించి రాజుపేరు పెట్టి ఉండాలని డాక్టర్ వి రాఘవన్‌గారి అభిప్రాయం. దీక్షితులవారు హంస భూపాలుడన్నది సింహభూపాలుడనడానికి పొరపాటుగా వ్యవహారంలోనికి వచ్చిన పేరని పరిశోధకుల అభిప్రాయం.

క్రీ. శ. 1410లో ఈ సర్వజ్ఞ సింహభూపాలుని ఆస్థానమునకే శ్రీనాథుడు విజయంచేసి, అతని కొలువుకూటంలోని శారదాదేవి విగ్రహమును దర్శించి నపుడు 'దీనారటంకాల' అనే పద్యం చెప్పి 'రావుసింగమహీపాలు ధీ విశాలు నెల్లు మెప్పించెదో' అని ప్రార్థించాడట. ఈయన సంగీత సుధ అనే పేర సంగీత రత్నాకర వ్యాఖ్యానము మాత్రమేకాక, రత్నపాంచాలిక అనే సంస్కృత నాట కాన్ని, రసార్ణవ సుధాకరం అనే అలంకార శాస్త్రాన్ని, మరొక సంగీతశాస్త్ర గ్రంథాన్ని కూడా రచించాడట (1330—1420).

## ఉత్తర దక్షిణపద్ధతుల చీలిక :

సంగీతరత్నాకర కాలంవరకూ ఉత్తర దక్షిణ భారతదేశాలకు ఒకే సంగీత పద్ధతి. ఒకే ప్రామాణికతా ఉండేది. 13 వ శతాబ్దిలో ఉత్తరాదికి మహమ్మదీయ దండయాత్రలు వచ్చిపడి, తురుష్కసామ్రాజ్యాలు స్థాపించబడటంతో పారశీక సంగీత పద్ధతులు భారతీయపద్ధతులతోకలిసి ఉత్తరాది సంగీతం హిందూస్థానీ సంగీతంగానూ, దక్షిణాది సంగీతం కర్ణాటక సంగీతంగానూ వేరుపడి, వేరువేరు రూపాలలో పరిణామంచెంద నారంభించాయి ప్రాథమిక సూత్రాలు రెంటికీ ఒకటే - ప్రాథమిక ప్రామాణిక గ్రంథాలూ సమానమే. శ్రుతివిధానంలో, రాగ స్వరూపనిర్ణయంలో, గమకప్రయోగంలో, లక్ష్యప్రబంధాది ప్రయోగవిధానాలలో ప్రధానమైన వ్యత్యాసాలేర్పడి, రెండుపద్ధతులూ క్రమంగా వేరయినాయి. రాగాల సంజ్ఞలొకటే అయినా, వాటిస్వరసంపుటులు వేరవుతూవచ్చాయి - అలాగే, సంగీతా[illegible]ధానంలోను, ప్రయోగ విధానంలోను కూడాను. కాని దక్షిణాన్నిమాత్రం [illegible] సంప్రదాయం చెడకుండా క్రమపరిణామం చెందుతూ వచ్చింది.

[illegible]త్తర హిందూస్థానీ రాగపద్ధతిలో ప్రధానంగా ఆరుపురుషరాగాలూ, వాటికి [illegible]ఆరు రాగిణులూ, ఆయా కుటుంబాలకు చెందిన జన్యరాగాలూ, పుత్ర రాగాలూ, పుత్రికారాగాలూ ఈ విధంగా ఏర్పడ్డాయి. ఈ విభజన రాగప్రధానచ్ఛా

యలనుబట్టీ, వాటిలోని రసాధారస్థాయినిబట్టీ జరిగినది. ప్రతి రాగానికి కొంత దృశ్యకల్పన ఇచ్చారు. మేఘరాగానికి వర్షాకాలపు మేఘాలతోనిండిన ఆకాశం. హిందోళరాగానికి క్రీడాడోలికలో ఊగుతున్న జవరాలు. ఈ విధంగా నిర్ణయించి రాగమాలా చిత్రావళి రచనకు దోహదం చేశారు. రాగాలకు సమయ నిర్దేశం దక్షిణాదిని ఏ కొద్దిరాగాలకో కొంచెం పాటి స్తే పాటిస్తారు. లేకపోతే లేదుగాని, ఉత్తరాదిని ఏ సమయానికి పాడవలసిన రాగాలు ఆ సమయంలోనే పాడాలి. కాని ఇంకొక సమయంలో పాడకూడదు.

ముస్లిం రాజ్యకాలంలో ఉత్తరాదిని ఈ మార్పులు వచ్చినా, ఉత్తర దక్షిణాల విద్వాంసుల రాకపోకలు జరగకపోలేదు.

## గోపాలనాయకుడు :

క్రీ. శ. 1265-1315 ప్రాంతపుకాలంలో గోపాలనాయకుడను ఆంధ్రవాగ్గేయకారుడు అల్లా ఉద్దీన్ ఖిల్జీ ఆజ్ఞచొప్పున ఉత్తరహిందూస్థానానికి వెళ్ళి ఖిల్జీని తన ప్రబంధ (ధ్రువ) గాన పద్ధతితో మెప్పించాడట ఖిల్జీ ఆస్థానవిద్వాంసుడైన అమీర్ ఖుస్రూ పాదుషాగద్దె వెనుక దాగిఉండి. ఏకసంథాగ్రాహిగా విని గోపాల నాయకుడు పాడిన ధ్రువాగానమునె తు. చ. తప్పకుండ ఒప్పగించి. ఇది గొప్ప విశేషమేమీ కాదని పాదుషా సభలో కొంతసేపు గోపాలనాయకుని అవమానపరచి, తర్వాత గౌరవించి మన్నింపజేశాడట. రత్నాకర వ్యాఖ్యాత కల్లినాథ సూరి ఈ గోపాలనాయకుని గురించి....

> "తథా హి గోపాలనాయకేన గీత ద్వాత్రింశభాగనామయుక్తే
> గద్యాత్మకే భ్రమరాఖ్యే, స్వస్తికభేదే రాగ కదంబే
> ప్రథమ సింహనందన తాళబద్ధే మాళవశ్రీ పదే పద తాళావేవ
> ఉద్గ్రాహ ధ్రువయోః యోజితావితి ద్వ్యంగత్వమ్...."

అని గోపాలనాయకునికి విశిష్టమైన ప్రబంధ రచనా ప్రాగల్భ్యం. గాన ప్రౌఢి, ఉన్నవని ఉదాహరించాడు.

గీత, ప్రబంధ, ఠాయ, ఆలాపములలో దిట్టయైనవానికి ఆనాడు చతుర్దండీ సిద్ధుడని ప్రతీతి, చతుర్దండి ప్రకాశికలో వేంకటముఖి గోపాలనాయకుని చతుర్దండీ-సిద్ధినిగురించి ఉదాహరించాడు. ఈ కాలంలో గాయకులు వర్ధిల్లడమేకాక, దూర దేశాలకు పోయి విద్వత్సభలలో విద్యాప్రదర్శనములు చేయడం కూడా ఉందని తెలుస్తోంది.

## హరిపాల దేవుడు :

విచార చతుర్ముఖ బిరుదాంకుడైన ఇతడు రచించిన గ్రంథం సంగీత సుధాకరం. 1309 - 1312 ప్రాంతమువాడు. దేవగిరిని పాలించిన రాజులలో బహుశా చివరి వాడు కావచ్చును. షడ్భాషారచితాస్పదు డనిపించుకొన్న ఇతని తండ్రి కుమిరి, తాత సోమనాథుడు. ఇతడు అన్హిలవాడలో పాలించిన చాళుక్య రాజని మానవల్లి రామకృష్ణ కవిగారు వ్రాశారు.

## విద్యారణ్యుడు :

విద్యానగర రాజ్య ప్రతిష్ఠాపకుడని పేరుపొంది. ఆంధ్ర కర్ణాటకులకేగాక, అఖిల భారతమునకు వేదభాష్య ప్రణేతగా ఆరాధ్యుడైన విద్యారణ్యస్వామి సంగీత సారమను శాస్త్రగ్రంథమును రచించి, దాక్షిణాత్య సంగీతానికి కర్ణాటక సంగీత మను పేరు రావడానికి ప్రధాన కారకులలో ఒకడయినాడు. వేంకటమఖి కనుక్కొన్నాడని చెప్పబడుతున్న మేళకర్త జన్యరాగ పద్ధతికి విద్యారణ్యుడే అంకురారోపణ చేసినవాడని వేంకటమఖి తండ్రి గోవింద దీక్షితుడు తన సంగీతసుధలో చెప్పాడు.

"కర్ణాట సింహాసన భాగ్య విద్యారణ్యాభిధశ్రీ చరణాగ్రణీభ్యః
ఆరభ్య రాగాన్ ప్రచుర ప్రయోగాన్ పంచాశతం చాకలయే షడంగాన్
రాగాస్తు పంచాశ దిహోపదిష్టా, నట్టాదయః సర్వజగత్ప్రసిద్ధాః
తేషాం మతాః పంచదశైవ మేళాః క్రమాత్తదుద్దేశమిహామనామః"

విద్యారణ్యుడు 15 మేళకర్తరాగాలను నిర్ణయించి, 50 ప్రచుర ప్రయోగం ఉన్న రాగాలను నిర్దేశించాడు గోవింద దీక్షతలు సంగీతసుధలో గాయకరీతులు వివరిస్తూ రసికుని గూర్చి ...."ఆరభ్య గీతం పులకాంకితో యస్త్వానంద బాష్పాంచిత లోచనశ్చ ఆచక్షతే తం రసికం చ విద్యారణ్యాభిధశ్రీ చరణాగ్రగణ్యాః—"అని విద్యారణ్యుల నిర్వచనము నుదాహరించాడు.

అలాగే బిరుదప్రబంధంగురించి చెప్పేటప్పుడు బిరుదశబ్దసాధుత్వాన్ని వితర్కిస్తూ,...."ఆర్యప్రసిద్ధే ర్బిరుదాఖ్యశబ్దో మ్లేచ్ఛప్రసిద్ధే రథవా నిరుక్తః

ఏవం ప్రసక్తే సతి సంశయేస్మిన్ వినిశ్చితం శ్రీచరణై ర్వివిచ్య .. "
అని విద్యారణ్య మతాన్నే వివరించాడు.

విద్యారణ్యుల కాలము 1320 నుంచి 1380 వరకు.

## కుమారగిరి వసంతరాజు

ఇదేకాలంలో—అంటే కాకతీయ సామ్రాజ్యపతనం తర్వాత, దక్షిణాదిని విద్యానగరరాజ్యంతోపాటు, ఉత్తరాంధ్రంలో రెడ్డినాయకులు రాజ్యాలను స్థాపించారు. రాచకొండలో (వెలమలు) పద్మనాయకులు ఒకరాజ్యం స్థాపించారు. 1330లో రాచకొండ పాలించిన సర్వజ్ఞ సింహభూపాలుడు రత్నాకరానికి వ్యాఖ్య వ్రాశాడని ముందు చెప్పుకొన్నాము. కొండవీడు రాజధానిగా పాలించిన రెడ్డిరాజులలో మొట్టమొదట ప్రసిద్ధుడైనవాడు కుమారగిరిరెడ్డి, ఈయనకి వసంతరాయడనీ, సర్వజ్ఞ చక్రవర్తి అనీ బిరుదులు. ఇతడు వసంతరాజీయమనే నాట్యశాస్త్రం రచించాడు. దీనికి ఇతని బావమరది కాటయవేముడు వ్యాఖ్యానం వ్రాశాడు. (1380—1400.)

"మునీనాం భరతాదీనాం భోజాదీనాం చ భూభుజా
శాస్త్రాణి సమ్యగాలోచ్యనాట్య వేదార్థ వేదినాం
ప్రోక్తం వసంతిరాజేన కుమారగిరి భూభుజా
నామ్నా వసంతరాజీయం నాట్యశాస్త్ర మనుత్తమమ్...."

ఈ నాట్యశాస్త్రంలో సంగీతశాస్త్ర విషయాలు కూడ విపులంగా ఉన్నవనీ, ఈ గ్రంథములోని శ్లోకాలు మాళవికాగ్నిమిత్రానికి కాటయవేముడు వ్రాసిన వ్యాఖ్యలోను, నాదెండ్ల గోపమంత్రి వ్రాసిన ప్రబోధచంద్రోదయపు వ్యాఖ్యలోను, కుమారస్వామి వ్రాసిన ప్రతాపరుద్రీయపు వ్యాఖ్యలోను ఉన్నాయని డాక్టర్ వి. రాఘవన్ వ్రాశారు.

"జయతి మహిమా లోకతీతః కుమారగిరి ప్రభోః
సదసి లకుమాదేవీ యస్య ప్రియా సదృశీ ప్రియా
నవ మభినయం నాట్యార్థానాం తనోతి సహప్రథా
వితరతి బహూనర్థా నర్థి వ్రజాయ సహస్రః"

ఈ శ్లోకమునుబట్టి ఈ కుమారగిరి మహారాజుకు ప్రేయసి లకుమాదేవి అను ప్రసిద్ధ నర్తకి మహారాజు రచించిన నాట్యశాస్త్రానికి లక్ష్య భూతమయిన నాట్యాభినయాలతో ఆయన కొలువుకూటాన్ని అలంకరించడమే కాకుండా వేల కొలది 'అర్థు' లకు వితరణ చేస్తూండేదట. శ్రీనాథ మహాకవి రచించిన హరవిలాసమును అంకితముగొన్న అవచితిప్పయశ్రేష్ఠి ఈ కుమారగిరి మహారాజు ఆస్థానానికి విదేశములనుంచి సుగంధద్రవ్యములను తెప్పించే భాండాగారాధికారి,

## పెదకోమటి వేమారెడ్డి :

కుమారగిరికి తర్వాత కొండవీటిరాజ్యంపాలించిన ప్రసిద్ధుడు అతని దాయాది పెదకోమటి వేమారెడ్డి. 1402–1420. ఇతనికి సర్వజ్ఞ చక్రవర్తి, వీరనారాయణుడు అని బిరుదులు. మద్రాసుసంగీత పరిషత్పత్రిక "1930–31"లో ఇతనిని 'కోమటి కింగ్' అని వ్యవహరించడం పొరపాటు. పెదకోమటిరెడ్డికి కొడుకైన వేమారెడ్డి రెడ్డికింగ్ కాని కోమటికింగ్‌కాడు. ఇతడు సాహిత్యచింతామణి, సంగీతచింతామణి, అమరుశతకములను రచించాడు. ఈ గ్రంథాలితడు రచించినవి కాక, ఇతని ఆస్థాన కవియైన (వేమభూపాల చరిత్రమును రచించిన) వామనభట్టబాణుని రచన లేమోఅని డాక్టర్ వి. రాఘవన్‌గారభిప్రాయపడ్డారు. ఆ లెఖ్ఖని, ఇతని ఆస్థాన విద్యాధికారియై మహామహోపాధ్యాయుడై సంస్కృతాంధ్రవిద్వత్కవి సార్వభౌము డనిపించుకొన్న శ్రీనాథుడే వాటిని రచించాడనికూడా అనుకోవచ్చు. ఎవరేమను కొన్నా వేమారెడ్డి కావ్యగీతి ప్రియుడు. సంగీత చింతామణి గ్రంథమునకు కారకుడు అనడంలో సందేహంలేదు.

వేమభూపాలుని సంగీత చింతామణిలో ఇప్పటికి లభించిన తాళపత్రి గ్రంథంలోని అధ్యాయాలు....నృత్తవిభాగం, తతవిభాగం, వాద్యవిభాగం, మార్గ తాళాలు, దేశీతాళాలు, సుషిర, అవనద్ధ, ఘనవాద్యలక్షణాలు, గీతవిభాగం:— నడుమ కొన్నికొన్ని పత్రాలు లుప్తమై ఉన్నాయని తెలుస్తోంది. వేముని రచన చాల మట్టుకు జాయపసేనాని గ్రంథాన్ని ఆధారం చేసుకుని రచించినట్లు కనబడుతుందిట.

## గోపేంద్ర తిప్పభూపాలుడు :

విజయనగర సాళువ వంశానికి చెందిన ఇమ్మడి దేవరాయల పరిపాలన కాలంలో కారైకాల్ దగ్గరి తిరుమల రాయపురపు రాజప్రతినిధిగా ఏలిన గోపేంద్ర తిప్పభూపాలుడు తాళదీపిక అను సంగీత శాస్త్రగ్రంథం, మార్గదేశి తాళవివేక, ప్రస్తారాది నిరూపణాధ్యాయాలతో ప్రధానంగా లయశాస్త్రమును విస్తరించి రచించాడు. ఇది మాత్రమేకాక, వామనుడి కావ్యాలంకార సూత్రవృత్తులకు వ్యాఖ్యానం కూడా వ్రాశాడీతడు.

## చతురకల్లినాథుడు :

ఈ గోపేంద్ర తిప్పరాజుకు సమకాలికుడే క్రీ. శ. 1423 – 1446 ప్రాంతపు కాలంలో విద్యానగరమేలిన ఇమ్మడి దేవరాయల ఆస్థాన విద్వాంసుడు. ప్రసిద్ధ వ్యాఖ్యాత అయిన కల్లినాథుడు. శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరానికి ఇతను చేసిన

వ్యాఖ్య పేరు కళానిధి. ఔమాపతమూ. కోహలుని సంగీతమేరువు, ఇంకా భరత, మతంగ, విశ్వావసు, తుంబుర, యాజ్ఞవల్క్య, వేణ, దంతిల, కంబళ, అశ్వతర, కాశ్యప, యాష్టిక, అభినవగుప్తాది ప్రాచీన లక్షణక ర్తల మతములను, గోపాల నాయకుడను కించిత్పూర్వుడయిన వాగ్గేయకారుని మతమును ఇతడు తన వ్యాఖ్యలో ఉదాహరిస్తూ వచ్చాడు. లక్ష్మీధరుడు అనే లక్ష్మీనారాయణాచార్యు డీతని తండ్రి. తల్లి నారాయణి. చతురుడనే ప్రజ్ఞానామం మాత్రమేకాక. సాక్షా త్సంగీతదేవతా, అభినవ భరతాచార్య, రాయబయకార, తోడరమల్ల బిరుదాలతో ఇతడు దేవరాయల ఆస్థానంలో గౌరవింపబడ్డాడు. దక్షిణాధీశుడైన ఇమ్మడి దేవ రాయలు శ్రీనాథ కవిసార్వభౌమునికి సార్వభౌమ బిరుదం పాదుకొల్పి తన ముత్యాలశాలలో దీనారటంకాలతో కనకస్నానం చేయించినప్పుడు రాయబయ కారుడు కల్లినాథుడు గౌరవాస్పదంగా బిరుదప్రబంధాలు పాడిఉండవచ్చు. సంగీత చరిత్రలో రాయబయకార (రాజవాగ్గేయకార) ఉద్యోగం ప్రథమంగా ఆ పేరుతో ఇతనినుంచే ప్రారంభించినట్లు కనబడుతుంది.

## అన్నమాచార్యుడు :

ఇంతవరకూ లక్షణక ర్తలయిన వాగ్గేయకారులందరు తమ లక్షణ గ్రంథా లను సంస్కృతంలో రచిస్తూ వచ్చినట్లే లక్ష్యములయిన గేయ ప్రబంధాదులనుకూడా సంస్కృత ప్రాకృతాదులలో మాత్రమే వ్రాస్తూవచ్చారు. ఈ అభ్యాసం 17 వ శతాబ్దపువాడైన వేంకటమఖివరకూ కూడా ప్రాకింది. కాని 15 వ శతాబ్దిలోనే 1404 నుంచి 1480 వరకు జీవించి మొదట తాళ్ళపాకగ్రామ నివాసియై తిరుపతి కొండపై వెలసిన వేంకటేశ్వరస్వామి కంకితంగా వేలకొలది కీర్తనలను దేశభాష యైన తెలుగులో రచించిన అన్నమాచార్యులు సంకీర్తన లక్షణమును పండితులకోసం సంస్కృతంలో వ్రాసినా లక్ష్య ప్రబంధములయిన సంకీర్తనలను మాత్రం దేశభాష లోనే వ్రాసి పదకవితా మార్గదర్శి అని బిరుదు పొందాడు. సంస్కృతంలోని ఈ సంకీర్తన లక్షణాన్ని అన్నమాచార్యుల మనుమడు చిన తిరుమలాచార్యుడు తెనుగుచేశాడు.

## సంకీర్తన లక్షణము :

భరత శార్ఙ్గదేవాది లక్షణ కర్తలు, సంగీతరత్నాకర, సంగీత చంద్రిక, సంగీత చూడామణి, సంగీతసుధాకరాది గ్రంథాలప్రబంధాధ్యాయాలలో పదము అని నిర్వచించిన గేయ రచనమునకును దేశభాషలకు నిర్దేశించిన ఏలా ప్రబంధ విశేషములకును లక్షణం ఈ గ్రంథంలో అన్నమాచార్యుడు శాసించాడు. ఈ పదములే వేంకటేశ్వరస్వామి కంకితములై, స్వామియే నాయకుడుగా ఆయన లీలా



తాళ్ళపాక అన్నమాచార్యుడు

విశేషాలను కీర్తించడంచేత అవి సంకీర్తనము లయాయి. అన్నమాచార్యులకు సమకాలికుడు వయసులో కొంచెం చిన్నవాడును అయిన పురందరదాసుకును, తదనంతరం వెలసిన అనేకులు దేశభాషా వాగ్గేయకారులకును ఈ సంకీర్తన లక్షణమే ప్రాతిపదిక అయింది. తాళ్ళపాకవంశకవుల లక్ష్యప్రబంధ రచనలను గురించి వేరొక ప్రకరణంలో చర్చిద్దాము.

## పురందరదాసు :

లక్షణకర్తయె విద్యారణ్యులును, కించిల్లక్షణమును, బహుళంగా లక్ష్యమును చేసిన అన్నమాచార్యుడును అంకురారోపణ చేసిన కర్ణాటక సంగీతపుమొలక పురందరదాసు లక్ష్యసంప్రదాయములతో పెరిగి మొక్క అనిపించుకొన్నది. ఇతడు అన్నమాచార్యులకంటె యువకుడు. వీరిరువురు భక్తాగ్రేసరులూ సమావేశమైనట్లు అన్నమయ్య మనుమడు (మరొకడు) చిన్నన్న వ్రాసిన అన్నమాచార్య చరిత్రలో ఉంది. పురందరుడు పాండురంగవిఠల భక్తుడు. కర్ణాటక భాషాపండితుడు. ఇప్పటికిని కర్ణాటక సంగీత విద్యార్థులు అభ్యాసముచేసుకొను సరళిజంట వరుసలు. అలంకారాలు, పిళ్ళారిగీతాలు లంబోదరలకుమికరా మొదలయినవి ఈ మహానుభావుని రచనలే. ఇతనివి సూళాదులనబడే ప్రబంధరచనలు చాలావ్యవహారంలో ఉన్నవి. ఈయన కీర్తనలు భక్తి, వేదాంతపరములూ, లోకవృత్త విమర్శాత్మకములైనవీ, సుమారు కొన్ని లక్షలదాకా ఉన్నాయంటారు. సూళాదిలోని సాహిత్యేతివృత్తం కీర్తనలోని దానివలెనే ఉంటుంది. అయితే ఒక్క సూళాదిలో, 7,8 విభాగాలుంటాయి. ఒక్కొక్క విభాగానికి ప్రసిద్ధమైన ఒక్కొక్క తాళంలో సాహిత్యరచన ఉంటుంది. రాగం ఒక్కొక్క విభాగానికి ఒక్కొక్కటిచొప్పున ఉండవచ్చు. లేదా కొన్ని సూళాదులలో అన్ని విభాగాలకు ఒకేరాగం ఉండడం కూడా కద్దు. రాగప్రధాన సంబారాలన్నీ సూళాదిలో కనబడతాయి. ఉగాభోగం అనే భక్తిరచనలు కూడా పురందరదాసు విరివిగా చేశాడు. సర్వలఘుతాళంలో గీతంకంటే ప్రాథమికమైన తేలిక రాగ పద్ధతితో అనుయతంగా నడుస్తుంది. ఉగాభోగం.

## భండారు లక్ష్మీనారాయణ :

రాయబయకారులనుంచి కొంచెం దారితప్పి దైవభక్తుల సంకీర్తనమార్గాన్ని పట్టాము. కాని, ఆ మార్గం కొంతకాలం అదృశ్యం అయి, మళ్ళీ రాయబయకారుల వెంటబడు తున్నాము. తాళ్ళపాకవారు మూడుతరాల వరకూ వాగ్గేయకారులే కాని, అచ్యుతదేవరాయల కాలంవరకూ వారికి చెప్పుకొనదగిన రాజమర్యాద జరిగినట్లు కనిపించదు. వారు కూడా అటువంటి దానికి ఆశించినట్లు కనబడదు. కృష్ణదేవరాయలు 1503 నుంచి 1530 దాకా పాలించిన కాలంలో తరచుగా తిరుపతి వెళ్ళి

వస్తూండేవాడు. తిమ్మరుసు మంత్రి, రాయలవారి తమ్ముడైన అచ్యుతదేవరాయలూ, అన్నమాచార్యుల పుత్రుడైన పెద తిరుమలయ్యను, అతని కుమారుడు చిన తిరుమలయ్యనూ గౌరవించినట్లు శాసనాల వల్ల తెలుసుంది. రాయల ఆస్థానంలో రాయబయకారుడు భండారు లక్ష్మీనారాయణ– తోడరమల్ల బిరుదాంకితుడు– సంగీత సూర్యోదయమనే గ్రంథం సంస్కృతంలో రచించాడు. ఇతడు భండారు విట్ఠలయ్యగారి కుమారుడు. విష్ణుభట్టారకుల శిష్యుడు.

> "భూమౌ శ్రీకృష్ణరాయ క్షితిపతి కృపయా వర్ధతే సర్వవంద్యః—
> సంగీతాగమ లక్ష్యలక్ష్మనిపుణైః శ్రీ విష్ణుభట్టారకైః
> జ్ఞాత్వాదత్తిల కోహలాది భరతగ్రంథాన్ సుటీకాన్వితాన్
> భూమౌ కీర్తిశరీరరక్షణధియా గ్రంథః కృతోఽయం మయా
> సంగీత గ్రహయోగ్యతాధికతరః సంగీత సూర్యోదయః...."

సూక్ష్మ లిఖితాచార్యుడని, అభినవ భరతాచార్యుడనీ, తోడరమల్లుడనీ బిరుదులు. తాలాధ్యాయం. నృత్యాధ్యాయం. స్వరగీత, రాగజాతి, ప్రబంధాధ్యాయాలు ఉన్నాయి. ఈ గ్రంథంలో, ప్రత్యేకించి చెప్పిన మతమేమీ లేదు. కృష్ణదేవరాయల సోదరుడైన అచ్యుతదేవరాయలు సంగీత ప్రియుడనీ,అచ్యుతరాయ మేళవీణ అనే పేర వీణలో అంతవరకూ ఉండిన మేళపద్ధతిని సంస్కరించి, కొత్త పద్ధతిని ప్రవేశ పెట్టాడనీ తెలుస్తోంది. అచ్యుత దేవరాయలు తాళ్ళపాక అన్నమాచార్యుల మనుమలను సత్కరించాడట కూడ.

## చెరుకూరి లక్ష్మీధరుడు :

కృష్ణరాయల అల్లుడైన రామరాయల తమ్ముడు ఆరవీటి తిరుమలరాయల పోషితుడు లక్ష్మీధర పండితుడు. జయదేవుని గీత గోవిందానికి శ్రుతిరంజని అను వ్యాఖ్యానం వ్రాశాడు. ఇది కాక, రాగలక్షణ వివేకం, ఋతుక్రీడా వివేకం, ప్రసన్న రాఘవానికి వ్యాఖ్యానంకూడా వ్రాశాడు. లక్ష్మీధరుని కుమారుడైన చతుర దామోదరుడుకూడా లక్షణ కర్తయే. అతనిని గురించి తర్వాత తెలుసుకోవచ్చు.

## రామామాత్యుడు :

ఆరవీటి రామరాయలకు ఆస్థాన విద్వాంసుడైన రామామాత్యుడు శార్ఙ్గదేవుని తర్వాత నూతన పంథాను త్రొక్కి స్వరమేళ కళానిధి అను సంగీత లక్షణ గ్రంథం రచించాడు (1550). రామరాజు తన తమ్ముడు వేంకటాద్రితో కలిసి కొలువు తీర్చినపుడు రాయబయకారుడు అభినవ భారతాచార్య, తోడరమల్లు బిరుదాంకితుడు

రామామాత్యుడు తాను రచించిన ఏలా, రాగకదంబం, గద్యప్రబంధం, పంచ తాళేశ్వరం. స్వరాంకం, శ్రీరంగవిలాసం మొదలైన ప్రబంధాలు గానం చేస్తూండేవాడట. (రామరాజ భూషణుడని ప్రసిద్ధిపొంది వసుచరిత్రను రామరాయ లకు కృతి యిచ్చిన సంగీత సాహిత్యవేత్త భట్టుమూర్తికూడా అప్పుడు ఆ సభలో ఉండేఉంటాడు). ఆనాటి సంగీతశాస్త్రంలో లక్ష్య లక్షణములకు పరస్పర విరోధాలు ఎక్కువగా ఉండడం గుర్తించి, సమకాలిక సంగీత లక్ష్య రీతులను పరిశీలించి సమీకరించి నూతన శాస్త్రగ్రంథం ఒకదానిని చేయమని రామరాయలు రామామాత్యుని కోరాడట. తత్ఫలితమే స్వరమేళకళానిధి. ఉత్తరాదిని ఇదే కాలంలో బయలుదేరిన సద్రాగచంద్రోదయం అనే గ్రంథం అదే ఆదర్శములపై (లక్ష్యలక్షణ విరోధ నిర్మూలనం కోసం) బుర్హానుద్దీన్ సుల్తాన్ కోరికపై పురందర విఠలుడనే దాక్షిణాత్య పండితునిచే రచింపబడింది రామా మాత్యుని కాలంనాటికి ప్రచారంలోఉన్న ప్రామాణిక లక్షణగ్రంథం శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరం. కాని ఆనాటి వ్యవహారంలో ఉన్న సంగీతానికి రత్నాకరం లోని లక్షణానికి కాలక్రమేణ పరస్పర వైరుధ్యాలు యేర్పడ్డాయి. రామామాత్యుడు శార్ఙ్గదేవుని లాగానే 7 శుద్ధస్వరాలను చెప్పాడు. కాని వికృతస్వరాలు శార్ఙ్గదేవుడు 12 దాకా నిర్వచిస్తే, రామామాత్యుడు వ్యవహారంనుంచి తొలగిపోయిన వికృతు లను వదిలేసి, ఏడే వికృతులు చాలన్నాడు.

| | | |
|---|---|---|
| స — 4 వ శ్రుతి (22 లోను) | | |
| రి — 7 వ శ్రుతి ( ,, ) | | |
| గ — 9 వ శ్రుతి ( ,, ) | | ఇవి యేడును |
| మ — 13 వ శ్రుతి ( ,, ) | } | శుద్ధస్వరాలు. |
| ప — 17 వ శ్రుతి ( ,, ) | | |
| ధ — 20 వ శ్రుతి ( ,, ) | | |
| ని — 22 వ శ్రుతి ( ,, ) | | |

చ్యుత షడ్జము – చ్యుత మధ్యమము, చ్యుత పంచమము, సాధారణ గాంధా రము, అంతర గాంధారము, కైశికి నిషాదము, కాకలి నిషాదము – ఇవి 7 వికృ తులు. అయితే వీనిలో రాగపద్ధతికి పనికివచ్చేవి 12 స్వరాలే. గ్రామ, మూర్ఛన జాతులనుంచి రాగాలను యేర్పరచు పాత పద్ధతినీ, రాగరాగిణీ పుత్ర. పుత్రికాపరివార పద్ధతినీ, విడిచిపెట్టి జన్యజనకరాగ పద్ధతిని బాహాటంగా శాస్త్రంలో ప్రవేశపెట్టినవాడు రామామాత్యుడే. అయితే యీ పద్ధతిని సూచించి, ఆ కాలంలో వ్యవహారంలోఉన్న 20 (19?) మేళరాగాలను పేర్కొని వాటి లక్షణం చెప్పాడు. ఈ రాగాలన్నిటిలోకి మాళవగౌళ ప్రశస్తమైనదని చెప్పి, తనతర్వాతి లక్ష్యకర్తలు

మాయామాళవగౌళనే కర్ణాటకసంగీత ప్రారంభాభ్యాస సంగీతరచనలలో పాడడానికి దారి చూపించాడు. ఈతడీ అభిప్రాయానికి రావడానికి తనకు ఇంచుమించు సమకాలికుడూ, తనకంటే వయోవృద్ధుడూ అయిన పురందరదాసే మార్గదర్శి అయి ఉండవచ్చు (పురందరదాసు సరళి, జంటవరుసలు, లక్షణగీతాలు మాయా మాళవ గౌళమేళపువే). ఇతడు శాస్త్రానికి లక్ష్యమే ప్రధానమని లోకానికి చాటాడు. తన గ్రంథంలో మేళప్రకరణం ప్రత్యేకంగా రచించాడు. చిట్టచివర రాగప్రకరణంలో రాగంలోనే కర్ణాటకం సంగీతసారం యిమిడిఉందని నొక్కి చెప్పాడు. వీణాప్రకరణంలో తనకాలంలోని ఆరు రకాల రుద్రవీణలను వర్ణించాడు. రుద్రవీణ మొదట మూడురకాలు. అవి శుద్ధమేళవీణ, మధ్యమేళ వీణ, అచ్యుతరాజేంద్ర మేళవీణ. ఈ మూడవది కృష్ణదేవరాయని తమ్ముడైన అచ్యుతదేవరాయల ప్రోత్సాహంతో నిర్మింపబడింది. ఈ మూడు ఒక్కొక్కటి రెండు రకాలు. అవి—సర్వరాగ వీణ అనీ- ఏకరాగ వీణ అనీ. అన్నిటికీ మెట్లుంటాయి: ఏకరాగ వీణకు సితార్‌లో వలె రాగరాగానికి మెట్లు కదిపి మార్చుకోవాలి. వీనిలో పై నాలు తంత్రులను, స.ప.స.మ.లుగా శ్రుతిచేసి క్రింది అనుకరణ తంత్రులను స. ప. స. లుగా శ్రుతిచేస్తే హార్మొనిక్స్ లేక అప్పర్ పార్షియల్స్ అనబడే స్వరాలు వినబడతాయని రామామాత్యుడు తెలుసుకొని, వాటికి స్వయంభూ స్వరాలని పేరుపెట్టాడు. ఈ ప్రయోగం నుంచి తంబురా శ్రుతిని ఊతగా చేసి పాడుకొనే ఆచారం వ్యవహారంలోకి వచ్చింది.

ఇతడు నిర్వచించిన 20 మేళకర్తరాగాలలో కేదారగౌళ, సాళంగ నాటలకు ఒకే లక్షణం వుండటంవల్ల మొత్తం 19 రాగాలనే చెప్పినట్లయింది. దీనినీ, ఇంకా ఇతరమైన వివాదాంశాలను ఇతని తర్వాతివాడైన వేంకటమఖి తీవ్రంగా ఖండించాడు.

## అహోబల పండితుడు :

17 వ శతాబ్దపువాడైన అహోబల పండితుడు సంగీతపారిజాతం రచించాడు. ఇతడహోబలవాసియైన ఆంధ్రుడని సంప్రదాయ ప్రదర్శినిలో చెప్పారు. ఆంధ్ర భాషకు సంస్కృతంలో వ్యాకరణ భాష్యం వ్రాసిన అహోబల పండితుడూ ఈయనా ఒకరో కారో తెలియదు. శార్ఙ్గదేవుని నాటినుండీ వస్తున్న 22 శ్రుతుల వాదం ఇతడు తిరస్కరించి, స, రి, రి 2. గ. గ. 2. మ. మ. 2. ప ద. ద. 2. ని. ని 2. స. ఈ విధంగా పాశ్చాత్యులంతా అంగీకరించిన (యీక్వల్ టెంపర మెంటల్ స్కేల్) సమాన శ్రుత్యంతరం స్థాయి నిర్దేశం చేశాడు. గణితంద్వారా సర్వకంపన సంఖ్యా. వీణాతంత్రులపై వివిధశృతిస్థానముల పరస్పర దూరమూ కూడా స్పష్టంగా నిర్దేశించాడు. అయితే యీ పద్ధతిని భారతీయ విద్వాంసులెవ్వరూ

ఒప్పుకొనలేదు. ఇతని గ్రంథం 1724 లో పరిష్యన్ భాషలోకి పరివర్తనం కూడా అయింది. అహోబలుని మతం ప్రకారం ఒక స్థాయిలో 22 మాత్రమేకాక 29 శ్రుతులుకూడా ఉంటాయి. కాని 12 మాత్రమే రాగనిర్మాణాని కుపయోగపడేవి. ఇతడు మొత్తం 122 జనకజన్యరాగాలను ప్రవచించాడు. మిగిలిన సంగీత లక్షణ కారులవలెకాక, ఈనాటికీ తంత్రులపై 12 శ్రుతులనూ గుర్తుపట్టడానికి వీలుగా నిర్దేశించిన మొదటి లక్షణ కర్త అహోబలుడే.

## సోమనాథుడు

స్వయంగా చెప్పకపోయినా, 1609 నాటివాడయిన సోమనాథుడను వాగ్గేయకారుడు రాగవిబోధ అనే లక్షణ గ్రంథాన్ని అన్నివిధాల బయకార రామామాత్యుని గ్రంథాన్ని అనుసరించే రచించేడు. ఇతడు మేంగనాథుని మనుమడు ముద్గల సూరి కుమారుడు. ఆంధ్రదేశీయుడు. శ్రుతిస్వరవివేకం, వీణావివేకం, మేళవివేకం, రాగవివేకం, రాగరూప వివేకం – ఇతని గ్రంథంలోని ప్రకరణాలు. ఎక్కువగా శార్ఙ్గదేవుని ప్రామాణికునిగా ఉదాహరించాడు. ఇతని లెక్కల ప్రకారం మేళ రాగాలు 23.

## చతుర దామోదరుడు :

1570 – 73 నాటికి విజయనగర రాజ్యం పాలిస్తున్న తిరుమలరాయని ఆస్థాన విద్వాంసుడు. ముందు గీతగోవింద వ్యాఖ్యాతగా చెప్పుకొన్న లక్ష్మీధర పండితుని కుమారుడు. ఇంటిపేరు చెరుకూరివారు. ఈతని గ్రంథం సంగీత దర్పణం. చతుర కల్లినాథునికి వలెనే ఇతనికి కూడా చతురశబ్దం బిరుదోపపన్నం. ఉత్తరాదిని ప్రామాణికంగా దర్పణమతమని తరచు ఈగ్రంథాన్ని ఉదహరించడం కద్దు. రాగోత్పత్తి విషయంలో శార్ఙ్గదేవాదులు చెప్పినదంతా పూర్తిగా వదలి – ఇతడు కొత్తమార్గం తొక్కాడు. శాంత్రిక గ్రంథాలు, సోమేశ్వరుని రాగార్ణవము, హనుమద్భరతమను గ్రంథమూ ఇతని కొత్తమార్గానికి మార్గదర్శులు, ఈగ్రంథం ఉత్తరాదినే ఎక్కువ ప్రామాణికము. 6 పురుష రాగాలు, వానిలో ఒక్కొక్క దానికి 5 రాగిణులు (భార్యలు), 8 పుత్రరాగాలు, ఈ ఎనిమిది పుత్రరాగాలలో ఒక్కొక్కదానికి ఒక్కొక్క భార్య చొప్పున 8 స్త్రీ రాగాలు–మొత్తం 132 రాగ రాగిణీ పరివార రాగసంఖ్య. ఆరు ప్రాథమిక పురుషరాగాలు – ఏవి అనే విషయంలో ఉత్తరాదిలో వివిధ మతభేదాలున్నాయి. ఇందులోని అధ్యాయాలివి : స్వరాధ్యాయం, రాగాధ్యాయం, రాగరాగిణ్యుదాహరణం, ప్రకీర్ణకాధ్యాయం, ప్రబంధాధ్యాయం, వాద్యాధ్యాయం, వాద్యప్రబంధాధ్యాయం, తాళాధ్యాయం, దశప్రాణాధ్యాయం, నృత్యాధ్యాయం.

## పుండరీక విఠలుడు :

"కర్ణాటే శైవగంగాభిధా నగరనికటే సాతనూర్వాహ్వయో యో
గ్రామ స్తత్రాగ్రజన్మ ప్రవరమునికరాత్ జామదగ్న్యోఽ స్తివంశః...."

1590 ప్రాంతంలో కర్ణాటక దేశీయుడైన పుండరీక విఠలుడు ఉత్తర హిందూస్తానంవెళ్ళి ఖాన్‌దేశంలోని ఆనందవల్లిలో పరిపాలిస్తున్న బుర్హాన్‌ఖాన్ ఆస్థానంలో గౌరవం పొందాడు. ఖాన్ కోరికపై ఆ ప్రాంతాల సంగీత లక్ష్యలక్షణ విరోధాలను పరిశీలించి, సద్రాగచంద్రోదయ మనే గ్రంథాన్ని ప్రత్యేకంగా ఉత్తర దేశీయ రాగస్వరూప నిర్ణయంచేస్తూ రచించాడు స్వరప్రస్తార, స్వరమేళ ప్రస్తార, ఆలప్తి ప్రసాదాలు ఇందులోని అధ్యాయాలు. కపిలుడనే ముని కోరికపైని రాగ మాల అనే గ్రంథాన్ని రచియించి, ఆ తర్వాత మొగల్ చక్రవర్తియైన అక్బర్ ఆస్థానం చేరి, కచ్ఛపవంశీయుడైన రాజామాన్‌సింగ్ తమ్ముడు మాధవసింహున కంకితంగా రాగమంజరి అనే గ్రంథం రచించాడు. ఇందులో స్వరాధ్యాయం, రాగాధ్యాయం రెండే రెండు.

## మా ధ వ భ ట్టు :

1614 కు ముందు వారణసీ వాస్తవ్యుడయిన మాధవభట్టు రచించిన సంగీత చంద్రిక అన్నమాచార్యుల సంకీర్తన లక్షణంలో ప్రశంసింపబడిన సంగీతచంద్రికే కావచ్చు.

'నిశమ్య సంగీతక చంద్రికాఖ్యాం
కృతించ భట్టాదిమ మాధవస్య'.

ఇందలి అంశాలు శ్రుతిస్వరాది వివరణము: రాగ, గమక, ఆలాప లక్ష ణాలు, కాకు, స్థాయ, శారీర లక్షణాలు.

## తా న ప్పా చా ర్యు డు :

1600 ప్రాంతపువాడు. వేంకటమఖి తన చతుర్దండి ప్రకాశికలో 'తత్పునః స్సంప్రదాయజ్ఞైః తానప్పాద్యై రనాదృతమ్' అని ఒకచోట వ్రాశాడు. వేంకట మఖి గురు పరంపరలోని ఈ తానప్పాచార్యుడు ఔత్తర దేశీయుడట – అంటే ఆంధ్రదేశీయుడా ? కాదు. బహుశా అక్బర్ పాదుషా కొలువులోని తాన్‌సేన్ ఏమో అని కొందరి ఊహ. షాజహాన్ కొలువులో మాత్రము జనార్దనభట్టను ఆంధ్రదేశీయుడయిన వాగ్గేయకారు డున్నాడనీ, పండితరాయ బిరుదాంకుడైన

ఆంధ్రదేశంలోని ముంగండ అగ్రహారీకుడూ అయిన జగన్నాథుడు సంగీతశాస్త్ర గ్రంథమునుకూడా రచించిన కవిగాయక శిఖామణి అనీ కొందరు పండితులు ఊహిస్తున్నారు. హెచ్. ఎ. పాప్లేగారు తన మ్యూజిక్ ఆఫ్ ఇండియాలో ఈ అభిప్రాయము వెలిబుచ్చారు.

## భావభట్టు :

షాజహాన్ చక్రవర్తి ఆస్థాన సంగీత విద్వాంసుడైన జనార్దనభట్టు కుమారుడు భావభటు. రసగంగాధర కర్తయైన పండిత రాయలవలెనే జనార్దనభట్టుకు కూడ పాదుషా పండితరాజ బిరుదమిచ్చాడని (కవిరాజ) పాపేగారు వ్రాశారు. జగన్నాధ పండితునివలెనే భావభట్టు పూర్వీకులుకూడ ఆంధ్రదేశం నుంచి ఉత్తరాది ఆభీరదేశమూ అక్కడనుంచి మొగల్ రాజధానీ చేరుకొని ఉంటారు. భావభట్టు మాళవ రాజైన అనూపసింహుని కోరికపైని సంగీత లక్షణం రచించాడు. దాక్షిణాత్య సంప్రదాయం ఆధారం చేసుకొంటూ, ఇతడు 20 జనకరాగాలను నిర్దేశించాడు.

## గోవింద దీక్షితుడు :

"తల్లక్షణంత సంగీత సుధానిధి రితిశ్రుతే
చెవ్వయ్యాచ్యుత భూపాల రఘునాధ నృపాంకితే
అస్మాత్తాతకృతే గ్రంథే ప్రోక్తాః శ్లోకాన్ లిఖామ్యహం...."

అని వెంకటముఖి తన చతుర్దండి ప్రకాశికలో చెప్పడంచేత రఘునాథ భూపాలుని పేర వెలువడిన సంగీతసుధ గోవింద దీక్షితునిదని తెలుస్తోంది. స్వర రాగ వివేక, ప్రకీర్ణక, ప్రబంధ, తాళ, వాద్య, నర్తనాధ్యాయాలీ గ్రంథంలో ఉన్నాయి. సంగీత రత్నాకరకారుని తరచు ఖండిస్తూ వచ్చినా, ఈ గ్రంథం రత్నాకరకారుని శ్లోకాలను కల్లినాథుని వ్యాఖ్యలనూ ఛందస్సు మార్చుకుని తిరిగి వ్రాసినట్టే కనబడుతుందని. గ్రంథ పీఠికాకారు లన్నారు. ఔమాపతీయమనే గ్రంథాన్నీ, విద్యారణ్యుల సంగీతసారాన్నీ తరచు ప్రామాణికంగా ఈ గ్రంథంలో పేర్కొనడం గమనించవచ్చు.

విద్యారణ్యులు, నాడే 15 మేళకర్త రాగములను. 50 జన్య రాగములను పేర్కొన్నాడని గోవింద దీక్షితులు సంగీతసుధలో చెప్పినట్లు, ముందు విద్యారణ్యుని విషయంలో చెప్పుకొన్నాము. రామామాత్యుడు కనుగొన్న సర్వరాగ వీణపైని కొన్ని సంస్కరణలుచేసి రఘునాథ భూపాలవీణ అని గోవిందదీక్షితులే పేరుపెట్టినట్లు పరిశోధకులు చెప్పుతున్నారు. 72 మేళకర్తల పద్ధతిని తానే

కనిపెట్టినట్లు వేంకటమఖి తన గ్రంథంలో ఘంటాపథంగా చెప్పుకొన్నప్పటికీ ఆ పద్ధతి కర్తృత్వం కూడా గోవిందదీక్షితునికే కొందరు పరిశోధకు లాపాదిస్తున్నారు ఏది ఏమైనప్పటికీ మహావిద్వాంసుడూ, వాగ్గేయకారుడూ అయిన వేంకటమఖికి తండ్రియైన గోవిందదీక్షితుడు సంగీత సాహిత్యాలలో మహావిద్వాంసుడు. రఘునాథభూపాలుని మంత్రి (1577-1614) రఘునాథుని తండ్రియైన అచ్యుతప్ప నాయకుని నాడుకూడా గోవిందదీక్షితులే మంత్రి. అచ్యుతప్ప నాయకునికీ, గోవిందామాత్యునకూ క్రమంగా శస్త్రమందూ, శాస్త్రమందూ, యుద్ధమందూ, యాగమందూ అనన్యసామర్థ్యం ఉండేదట.

## వేంకటమఖి:

గోవిందదీక్షితుని పెద్ద కుమారుడు యజ్ఞనారాయణ దీక్షితుడు రెండవ కుమారుడు వేంకటమఖి - అన్నగారి శిష్యుడు. ఉత్తరదేశం (ఆంధ్రమో, కర్ణాటమో) నుంచి వచ్చిన వాగ్గేయకారకులలో మేటియైన తానప్పాచార్యుల వద్ద సంగీతశాస్త్రంలో లక్ష్యలక్షణజ్ఞానం అఖండంగా సంపాదించాడు తానప్పాచార్యుడు 50 రాగాలకు లక్షణం స్థిరపరచి, వాటిలో చతుర్దండి అనబడు గీత, ప్రబంధ, ఠాయ ఆలాపాలలో సంగీతరచనలనుకూడ తయారుచేసిన వాగ్గేయకారుడు - తన శిష్యుడైన వేంకటమఖిని తనకు మించిన వానినిగా చేశాడు. గురువుగారైన తానప్పాచార్యులనుగురించి 'గంధర్వజనతా ఖర్వదుర్వార గర్వ భంజనురే' అను గీతమును త్రిఖండంగా రచించి తండ్రికీ, అన్నకూ, గురువుకూ వినిపించి మెప్పుపొందాడట వేంకటమఖి. రఘునాథభూపాలుని కుమారుడైన విజయరాఘవ నాయకుని ప్రేరణచేత వేంకటమఖి - శ్రుతి, స్వర, మేళ, రాగ, ఆలాప, ఠాయ, గీతప్రబంధ, తాళములనే పది ప్రకరణాలతోకూడిన చతుర్దండి ప్రకాశికను రచించెను (1620). రాగలక్షణమను మరొక లక్షణగ్రంథంకూడా వేంకటమఖి రచించెను. ఇందులో 72 మేళకర్తలను వివరించి, వాటి జన్యరాగములను నిర్దేశించాడు. వాటికి లక్షణగీతాలనుకూడా రచించాడు. విద్యారణ్యుల నాడు 15 గాను, రామామాత్యునినాడు 20 గాను స్థూలపరిశీలనతో నిర్దేశింపబడిన మేళకర్తరాగాలను వేంకటమఖి సూక్ష్మపరిశీలనచేసి తనకాలంలో వ్యవహారంలో ఉన్న 19 మేళాలకుతోడు మిగిలినవాటిని శాస్త్రీయదృష్టితో పెంచి, విభజించి 72 గా నిర్ణయించాడు.

వేంకటమఖి లక్షణ గీతములను గురించి సంగీతసంప్రదాయ ప్రదర్శినిలో సుబ్బరామదీక్షితులు ఇలా వ్రాశారు :

లక్ష్యములైన ప్రతి గీతమునందునుగల ధాతువుల చమత్కారమును, శుద్ధవికృత స్వరము లివియని తెలుసుకొనుటకుగల సంకేతాక్షరములును. చక్రము,

మేళము లివియని యెరుగుటకై గల సంకేతములను రాగాంగరాగ గీతమాతువులం దమర్చియున్న చమత్కారమును యీ పుస్తకమందుగల (చతుర్దండి) రాగాంగ ఉపాంగ భాషాంగరాగ గీతముల గమనించి చూచితే స్పష్టమగును."

జయదేవుని గీతగోవిందంవంటి అష్టపదుల ప్రబంధం ఒక దానిని వేంకటమఖి శ్రీ త్యాగరాజేశ్వరాంకితంగా రచించాడట. ఆకువుగా రచించిన గీతముల ద్వారా వేంకటమఖి (మాళవగౌళ పాడి) చోరబాధను, (రీతిగౌళ పాడి) రాజు ఉదరబాధను మాయింపగలిగాడట.

గీత, ప్రబంధ, ఠాయ, ఆలాపములలో దిట్టయైనవాడు 'చతుర్దండి' అని బిరుదం పొందేవాడని - గోపాలనాయక ప్రశంస సందర్భంలో వేంకటమఖి గోపాలనాయకునిగూర్చి పేర్కొన్న మాటలతోపాటు చెప్పుకొన్నాము. ఈ చతుర్దండిఅనే పదాని కర్ధం మానపల్లి రామకృష్ణకవిగారు ఇంకొక విధంగా చెప్పారట:

"గానక్రియావర్ణయతి ప్రోచ్యతే స చతుర్విధః
స్థాయ్యా రోహీ, అవరోహీ, చ సంచా రీతి క్రమాదిమాః
చతుర్దండీతి సంప్రోక్తాః నారదాదిమునీశ్వరైః"

## గోవిందామాత్యుడు, తులజాజి మహారాజు :

"రఘువీర పదాంభోజ మిళిందశుభచేతసా
గోవిందనామ్నా సంగీతశాస్త్రం సంక్షేపతోచ్యతే"

సుమారు 1577 - 1614 కాలంవాడని ఊహింపబడిన గోవిందామాత్యుని సంగీతశాస్త్ర సంక్షేప మనే గ్రంథం సంస్కృత భాషలోనిది తెలుగులిపిలో దొరికిందట. ఇందులో అచ్యుత రాజేంద్రమేళవీణ (రామామాత్యుడు పేర్కొన్నదే) పేర్కొనబడడంచేత ఇతడు ఆ కాలపువాడుగాని. కొంచెం తర్వాతివాడుగాని అయిఉండాలి. ఇందులో చెప్పిన రాగముల మేళకర్తా పద్ధతి. రాగముల పేర్లు చతుర్దండి ప్రకాశికలోని 72 మేళకర్త రాగాల పేర్లను, ప్రధాన సూత్రాలను త్రోసిరాజన్నవి. స్కాందపురాణ భాగమని చెప్పబడి గోవింద విరచితమయిన సంగ్రహ చూడామణి అనే గ్రంథంకూడా ఇదే పద్ధతిపైని రచింపబడింది. వేంకటమఖి మేళకర్త రాగములు కనకాంబరీ ఇత్యాది పేర్లతో ఉంటాయి. వాటిలో మేళకర్తలు ఆరోహణావరోహణాలలో సంపూర్ణ - సంపూర్ణములై ఉండాలి అనే నియమంలేదు. 'ఆరోహ ణావరోహణాలలో సంపూర్ణతలేని రాగం జనకరాగం ఎలా అవుతుంది - అది జన్యరాగమే అవుతుంది. సంపూర్ణ సంపూర్ణము లైతేనేకాని జనకరాగా లనిపించుకోవడం సంభావ్యం కాదు.

అనే ప్రాతిపదికపై ఈ గోవిందుని పద్ధతి ఆధారపడివుంది. రాగాల పేర్లు కనకాంగి ఇత్యాదిగా ఉంటాయి. కాలంచూస్తే ఇతడు వేంకటమఖికి ముందు వాడుగా కనిపిస్తున్నాడు. అదికాక, వేంకటమఖికి తర్వాత 1735 లో తంజావూరు నేలిన తులజాజి (మహారాష్ట్రుడు) తన సంగీత సారామృతంలో వేంకటమఖి పద్ధతి మేళాలు పాతపడి వ్యవహారంలోనుంచి తొలగిపోయాయనీ, అందుచేత తను తనకాలంలో వ్యవహారంలో ఉన్న కొత్త పద్ధతిని అనుసరించి రాగాలపేర్లు యిస్తున్నానని గోవిందాచార్యుని పద్ధతినే అనుసరించాడు అంతేకాక, తర్వాతి వాగ్గేయకారులలో ముత్తుస్వామి దీక్షితులవారు వేంకటమఖి రాగపద్ధతిని అనుసరిస్తే త్యాగరాజు గోవిందాచార్యుని పద్ధతిని అనుసరించి, కనకాంగి ఇత్యాది రాగాలనే వాడాడనీ, అందుచేత యిదే అవలంబనీయమని కొందరు ఆధునికులుకూడా వాదిస్తూవచ్చారు. టి యల్. వేంకటరామయ్యర్‌గారు మొదలైన ఆధునిక విద్వాంసులు గోవిందాచార్యుని పద్ధతిని ఖండించి వేంకటమఖి పద్ధతి సరియైనదని చెప్పారు. అంతేకాకుండా, సమకాలికులైన ముత్తుస్వామి దీక్షితులతో పాటు త్యాగరాజు కూడా వేంకటమఖి పద్ధతి రాగాలనే అనుసరించారు. కాని అచ్చు వేయించడానికి ముందు వారి కీర్తనలను శిష్య పరంపరవారు నోటికి చెప్పుకోవడమే కాని, వ్రాసుకొనేటప్పుడు రాగాల పేర్లు వ్రాసుకోలేదనీ, పేర్లు యెవరిష్టం వచ్చినట్లు వారు వ్రాసుకోవడంలో అచ్చు పుస్తకాలలో త్యాగరాజ కృతులకు కనకాంగి ఇత్యాది పేరులే వ్యవహారానికి వచ్చాయి అనీ, అది సరికాదని వాదించారు. అంతే కాకుండా, ఈ అస్వాభావికమైన కనకాంగిత్యాది రాగపద్ధతి వలన ప్రాచీన సంప్రదాయానుసారమైన స్వరూపాలు చెడిపోయి 72 కొత్త రాగాలు వచ్చిపడుతున్నాయి కాని, కనకాంబరి మొదలయిన సంపూర్ణతా నిబంధనలేని రాగాలే సాంప్రదాయికమైన కర్ణాటక సంగీత రూపాన్ని నిలబెట్టేవనీ టి. యల్. వేంకటరామయ్యర్‌గారు వాదించారు. ఆ వాదం సమంజసంగానే కనబడుతుంది. కాని, అప్పుడే పాతుకుపోయి జన వ్యవహారంలో చొచ్చుకుపోయిన సంప్రదాయం మారడానికి మళ్ళీ కొంతకాలం పట్టవచ్చు.

మానపల్లి రామకృష్ణకవిగారు ఈ గోవిందుడు ఆంధ్రుడనీ, అచ్యుత దేవరాయల కాలపువాడనీ, వేంకటమఖికి పూర్వమే- ఈ పద్ధతి కనుగొన్నవాడనీ పైని చెప్పిన సంస్కృత గ్రంథాలేకాక, రాగతాళ చింతామణి అనే తెలుగు పద్య గ్రంథాన్నికూడ రచించాడనీ చెప్పారు. విస్సా అప్పారావుగారీ గ్రంథాన్ని గురించి మద్రాసు సంగీత పరిషత్పత్రికలో వ్రాశారు. రచయిత పూర్తి పేరు పోలూరి గోవిందామాత్యుడు. కొసలూరు గ్రామ కాపురస్తుడు. కొట్టమూరి బుస్సనృపాలుడు కోరగా గోవిందుడు కొసలూరులోని శ్రీరామచంద్రమూర్తి కంకితంగా రాగతాళ చింతామణిని రచించాడు. ఇది 6 ఆశ్వాసాల గ్రంథం. మొదటిది నాదవిషయికం. రెండవది దేశిరాగముల ఉత్పత్తి. 22 శ్రుతులు, శుద్ధవికృతి స్వరాల వివరణ.

మూడవది మూడు గ్రామాలు. షడ్జ మధ్యమ గ్రామాలకు చెందిన 14 మూర్ఛనలు, శుద్ధతానాలు, కూటతానాలు, స్వరప్రస్తారం వీటి గురించి చెపుతుంది. నాల్గవది 20 మేళరాగాలు, జన్యరాగాలు, వాగ్గేయకార లక్షణం, గాయకభేదాలు, బృందాలు, స్వరదోషాలు, రాగదోషాలు మొదలైన వాటిని వివరిస్తుంది.

రాగతాళ చింతామణినీ, ముందు చెప్పబడిన గ్రంథాలను వ్రాసిన గోవిందామాత్యు లొకరే అయితే రామామాత్యు ననుసరించినట్లు కనబడే రాగతాళ చింతామణి ముందు రచించి, 72 మేళకర్తల పద్ధతి నిర్వచించిన సంగ్రహ చూడామణీ, సంగీతశాస్త్ర సంక్షేపమూ తర్వాత రచించాడని అనుకోవాలి. ఏమైనా, రాగతాళ చింతామణి కర్త సంగ్రహ చూడామణీత్యాదుల కర్తా ఒకడే అనుకోడానికి గాని, ఇతడు వేంకటమఖికి తప్పకుండా పూర్వుడే అనుకోడానికి గాని ఇంతవరకు ప్రబలమైన ఆధారాలు లేక పరిశోధకుల మధ్య వివాదాలు తెగలేదు. వేంకటమఖి 72 మేళకర్త రాగ పద్ధతిని- హిందూస్తానీ సంగీతానికి లక్షణం వ్రాసిన ఆధునిక విద్వాంసుడు ఖాట్కండేగారు పూర్తిగా ఆదరించి, ఉత్తరాది వారికికూడ ఆ పద్ధతే అవలంబించ దగినదిగా నిర్ణయించారు ఇప్పుడు దక్షిణాదిని సంగీత విద్వాంసుల శిక్షణాభ్యాస పద్ధతులలోను, సభా ప్రయోగాలలోను కూడా దీక్షితుల రచనలలో వేంకటమఖి రాగాల పేర్లను. త్యాగరాజు రచనలలో గోవిందామాత్యుని రాగాల పేర్లను పక్కపక్కనే వ్యవహరిస్తున్నారు.

## మూడవ అధ్యాయము

# వాగ్గేయకార లక్షణము

శార్ఙ్గదేవుడు తన సంగీత రత్నాకరంలోని ప్రకీర్ణకాధ్యాయంలో వాగ్గేయ కారుని లక్షణం పంద్రెండు శ్లోకాలలో చెప్పాడు.

'వాఙ్మాతు రుచ్యతే గేయం ధాతు రి త్యభిధీయతే.
వాచం గేయం చ కురుతే యః స వాగ్గేయకారకః'

గేయమనే మాటను ఈ కాలంలో పాటకు పర్యాయపదంగా వాడుతున్నాము. ఇక్కడ ఉదాహరించిన శ్లోకంలో శార్ఙ్గదేవుడు మాటలకూర్పును వాక్కుగాను, మాటలనుండి వేరుచేసిన సంగీతపు కూర్పును గేయముగాను వ్యవహరించాడు. అంటే, పాటలోని మాటల కూర్పును 'మాతువు' అనీ, సంగీతపు కూర్పు (గేయము)ను 'ధాతువు' అనీ, అంటారనీ, వాక్కునూ, గేయమునూ అనగా మాటల కూర్పును, సంగీతపు వరుసను తానే చేయగలవాడు వాగ్గేయకారుడనీ ఈ శ్లోకంలో శార్ఙ్గదేవుడు నిర్దేశించాడు. అయితే ఈ రెండూ వాగ్గేయకారుడనే పేరులోనే యిమిడివున్న ప్రధానావశ్యక లక్షణాలు. ఇవిగాక, వాగ్గేయకారుని ఘనతకు ఆవశ్యకమైన ముఖ్య ధర్మాలను శార్ఙ్గదేవుడు ఇంకా ఏడురకాలలో పేర్కొన్నాడు.

'శబ్దాను శాసనజ్ఞాన మభిధాన ప్రవీణతా
ఛన్దః ప్రభేద వేదిత్వ మలంకారేషు కౌశలమ్'

శబ్దానుశాసన జ్ఞానమంటే వట్టి వ్యాకరణ జ్ఞానమేకాదు, సుశబ్దాపశబ్ద వివేచనమూ కలిగి వుండాలి. శబ్దముల మంచి చెడ్డలను వ్యాకరణ రీత్యానే కాకుండా సప్రమాణముగా నిరుష్టముగా ప్రయోగింప గలిగే పరిజ్ఞానం ఉండాలి అభిధాన ప్రవీణత అంటే అమరకోశాధి నిఘంటులలో శబ్దములకు లోకప్రమాణరీత్యా ఏ అర్థములు సాధువులని నిర్వచించారో అదంతా చక్కగా తెలిసి వుండాలి. ఛన్దఃప్రభేదవేదిత్వం అనగా అనుష్టుబాది ఛ్ఛందస్సులను, సమ, అర్ధసమ, విషమాది వృత్తములను గురించి ఎరిగి ఉండాలి అని వ్యాఖ్యాన కర్తలన్నారు.

సంస్కృత చ్ఛందస్సులమాత్రమేకాకుండా దేశిచ్ఛందో భేదములుకూడా తప్పకుండా తెలిసిఉంటే దేశభాషలలో వాగ్గేయకారుడు కాగలుగుతాడు. ఉపమాది అలంకారములను, ప్రసిద్ధకవి సమయములను తగురీతిని ప్రయోగించే నేర్పరితనమే 'అలంకారేషు కౌశలమ్'

'రసభావ పరిజ్ఞానం దేశస్థితిషుచాతురీ
అశేష భాషావిజ్ఞానం కలాశాస్త్రేషు కౌశలమ్'

అలంకార శాస్త్రజ్ఞులు వివరించిన ప్రకారము నవరసములు, వాటివాటి స్థాయి భావములు, విభావానుభావసంచారీ భావములు మున్నగువాటిని గురించిన పరిపూర్ణ జ్ఞానమే రసభావ పరిజ్ఞానం. దేశస్థితిషు చాతురి అంటే పాంచాల్యాదిషు చాతురీ అని కల్లినాథుడు, దేశకాల పరిజ్ఞానమ్మని సింహభూపాలుడూ వ్యాఖ్యానించారు. వివిధ దేశములను గురించీ,దేశమందలి వేర్వేరుజాతుల జనులనుగురించీ లోకజ్ఞానము కలిగి వుండాలి అని ఒక పక్షమునా, పాంచాలీ, గౌడీ వైదర్భి ఇత్యాదిగా ఆ యా దేశముల పేరులతో అలంకార శాస్త్రజ్ఞులు నిర్దేశించి నశయ్యారీతులను తెలిసి ఉండాలని రెండో వ్యాఖ్యాతపక్షమునా చెప్పుకొని, రెండు విధములయిన పరిజ్ఞానమూ అవసరమే అని మనం అనుకోవచ్చు. ఆ తర్వాత చెప్పిన 'అశేషభాషా విజ్ఞానం' తదనుగుణ్యంగానే, వేర్వేరు భాష లన్నిటిలో విశేష పరిజ్ఞానమనీ, తన భాషలో అశేష పరిజ్ఞానమనీ కూడా చెప్పుకోవచ్చు. గోవింద దీక్షితుడు సంగీతసుధలో—

'గీర్వాణ వాక్ప్రాకృతశౌరసేనీ బాండీర పైశాచక చూళికాశ్చ
మాగధ్యపభ్రంశ ఇతిస్యురష్టౌ భాషాః పరిజ్ఞాతృకలా ప్యమూషాః'

అని ఆనాడు వ్యవహారములో ఉన్న ఎనిమిది విధములయిన ప్రాకృతములందును, సంస్కృతమందును పరిజ్ఞానముకలిగి ఉండాలన్నాడు. అంతేకాక—

'కర్ణాటక ద్రావిడ కాంధ్ర గౌడ లాటాదిభాషా పరిశీలనేన
ఏలా ప్రబంధాదిషు పాటవంచ తథా చతుఃషష్టికలా వివేకః'

అని కర్ణాట ద్రావిడాది దేశభాషలనుకూడ పరిశీలించి వాటిలోని ఏలా మొదలయిన రచనలనుచేసే మెళుకువలు తెలిసికోవాలన్నాడు. అదే ఈనాడైతే, మన రాజ్యాంగంలో పేర్కొన్న 14 భాషల సాహిత్యాన్ని పరిశీలించవలసి ఉంటుంది. ఇతర భాషలలోని ధాతుమాతుసంయోగ ప్రయోగ వైఖరులు బాగా తెలిసి ఉంటే, తన భాషలో ప్రయోగానికికూడా తనకు ఎన్నో కొత్త మెళుకువలు తెలిసివస్తాయి. సంగీతాది కళలయందు, శాస్త్రములందు, ఒకటేమిటి చతుష్షష్టి

కళలందు కూలంకషమైన నేర్పరితనం 'కళాశాస్త్రేషు కౌశలమ్' అని చెప్పాడు శార్ఙ్గదేవుడు.

'తూర్యత్రితయ చాతుర్యం హృద్యశారీర శాలితా
లయతాల కలాజ్ఞానం, వివేకోఽనేకకాకుషు'

తూర్యత్రితయమంటే, నృత్య గీత, వాద్యాలు – ఈ మూడింటిలోను నేర్పుండాలి. శారీరం అంటే గాత్రం (కంఠం) హృద్యంగా ఉండాలి. లయలోని ద్రుత మధ్యమాది భేదాలు, చచ్చత్పుట, చాచపుట ఇత్యాదిగా ఆదిమలక్షణ కర్తలచేతా, ఆది, త్రిపుట, రూపక, జంపె ఇత్యాదిగా తరువాతి కాలపు లక్షణ కర్తలచేతా, వివరింపబడిన 108 తాళములను గురించి తెలిసి ఉండడమే లయ తాలకలాజ్ఞానం ; 'అనేకకాకుషు వివేకః' (కాకవః) స్వరకాక్వాదయః షడ్విధాః స్థాయేషు వక్ష్యమాణలక్షణాః (కల్లినాథుడు). కాకువంటే ఛాయ అని వ్యాఖ్యాత లన్నారు. అంటే గానపద్ధతిలోని 'యాస' అని మనం చెప్పుకోవాలి. ఈ యాసలు ఆరు విధములుగా ఉండవచ్చు. స్వరకాకు ప్రత్యేకం స్వరములకే సంబంధించిన యాస. ఏ స్వరమును ఏ స్థానములో ఏ విధముగా పట్టవలెనో ఆ యాస అన్నమాట; రాగకాకువు అనగా ఆ యా రాగములకు ప్రత్యేక లక్షణమై స్వరూపనిర్దేశక మయిన యాస. అన్యరాగకాకువు అంటే–కొన్ని రాగాలలో తదితర రాగములకు చెందిన సంగతులు ప్రయోగించడానికి వీలుకలిగినపుడు–అలా ప్రయోగించినపుడు కలిగే ప్రత్యేకపు యాస: ఆ యా దేశాలలో ఒక్కొక్క రాగాన్ని వేర్వేరు యాసలలో పాడవచ్చు – ఆ ప్రశంస వచ్చినపుడు ఆ యాసలోని తేడాను 'దేశకాకు' వంటారు. పాడేగాత్రము పురుషుడో, స్త్రీయో, అందులో ఒకేలింగము నకు చెందినవారిలో సన్నగొంతో, గొడగాత్రమో ఆ వత్యాసాన్ని నిర్దేశించే యాసను క్షేత్రకాకువంటారు. ఒక్కొక్క జంత్ర వాద్యమునకు ప్రమోగించే పద్ధతినిబట్టి వేర్వేరు యాసలు కలుగుతాయి కనుక, ఆయాసను యన్త్రకాకు వంటారు.

వాగ్గేయకారునికీ కాకువులన్నీ తెలిసి ఉండడం అత్యాంతావశ్యకం. ఆ కాకువులు తెలిస్తే, వాటికి అనుగుణమైన పదప్రయోగమూ, ఆ పదబంధానికి సరిపోయే సంగీతరచనా అతనికి వశమౌతాయి.

'ప్రభూత ప్రతిభోద్భేద భావత్వం సుభగగేయతా
దేశీరాగే ష్వభిజ్ఞానం వాక్పటుత్వం స భాజ్యతే'

వ్యతీత విషయములందు స్మృతీ, ఆగామిగోచర పరిజ్ఞానమూ, తత్కాల విషయములందు బుద్ధీ కలిగి ఉండే శక్తిని ప్రజ్ఞ అని అలంకారికు లన్నారు.

అటువంటి ప్రజ్ఞ నవనవోన్మేషశాలిని అయితే దానినే ప్రతిభ అంటారు. నిత్యలోక పరిశీలనా, శాస్త్రకావ్య పారాయణమూ, నిత్యకవితాకళాసాధనా హేతువులుగా ప్రభవించేశక్తి ప్రతిభ అనిపించుకుంటుంది. దానినే ప్రమేయస్ఫూర్తి అనికూడా అన్నాడు రత్నాకరవ్యాఖ్యాత సింహభూపాలుడు. వాగ్గేయకారుని కిదెంత ఆవశ్యక మైనదో వేరే చెప్పనక్కరలేదు; అంతేకాదు; తానే శ్రావ్యగాయకుడై యుండాలి. అదే సుభగగేయత. దేశిరాగాలను గురించిన పరిపూర్ణజ్ఞానం అవసరం. దేశిరాగాలు తెలిస్తేనే దేశభాషలలో గేయరచన ఆ రాగానుగుణ్యంగా చేయడానికి వీలవుతుంది గదా! ఆయా దేశభాషలకు ప్రత్యేకమైన కాకువు లుండడంవల్ల వాటికి అనుగుణ మైన సంగీత రచన ఆ దేశములోని దేశిగాన పద్ధతిలో జరిగితేనే ఆ దేశ ప్రజ లకు ఆస్వాదయోగ్యం అవుతుంది. దీనివల్ల ఒక దేశపు సంగీతఫణితిలోను మరొక దేశపు భాషలోను, గేయమును పొదిగినట్లయితే యాస అతకక విర సంగా ఉంటుందని స్పష్టం. వాగ్గేయకారునికి వాక్పటుత్వం కూడా ఉండాలని పేరులోనే వ్యక్తమౌతుంది.

> 'రోషద్వేష పరిత్యాగః సార్ద్రత్వ ముచితజ్ఞతా
> అనుచ్ఛిష్టోక్తి నిర్బంధో నూత్నధాతు వినిర్మితిః
> పరచిత్త పరిజ్ఞానం ప్రబన్ధేషు ప్రగల్భతా
> ద్రుతగీత వినిర్మాణం పదాంతర విదగ్ధతా
> త్రిస్థాన గమకప్రౌఢి ర్వివిధాలప్తి నైపుణమ్
> అవధానం గుణై రేభి ర్వరో వాగ్గేయకారకః'

రోషం వాక్కునకు కాఠిన్యమిచ్చే గుణం; ద్వేషం మనస్సును కుమిలించే గుణం; మొదటిదానివలన ఎదుటివారికి నొప్పి. రెండవదానివలన తనకే బాధ. ఈ రెండు గుణములకు అతీతులు కావడం ఋషులకేచెల్లు. ఈగుణములను త్యజిం చడమే కాకుండా సార్ద్రత్వం అంటే సరసత్వం అలవరచుకోవాలి. తనను నొప్పించు కోకుండా ఎదిరిని నొవ్వచేయకుండా ఉండడమేకాక, ఎదిరిని మెచ్చుకోగలగడమూ, అధమం సానుభూతి కలిగి వుండడమూ సరసత్వము. ఆదర్శప్రాయులైన ఈ సద్గుణాలు కలిగిన వారే మహాకవులూ ఋషులూ అయినారు. అట్టివాడే కావాలి వాగ్గేయకారుడుకూడా.

కవుల కందరకూ ఉండవలసినదే ఉచితజ్ఞత — ఔచిత్య వివేచనం. 'అనౌచిత్యాదృతే నాన్యద్రసభంగస్యకారణమ్ - ప్రసిద్ధౌచిత్య బంధస్తు రసస్యోపని తత్పరా' అని ఆలంకారికు లన్నారు. భావములకు తగిన వాఙ్నిర్మాణము చేయడం వరకే కవీశ్వరుని ఔచిత్య వివేచనం ఉపకరిస్తుంది. వాగ్గేయకారుని ఔచిత్య జ్ఞానమో, మాతుధాతు రచనములు రెండింటను ప్రయోజనకారి.

'బాణోచ్ఛిష్టం జగత్సర్వం' అనిపించుకొన్న మహాకవిలాగ వాగ్గేయకారునకు కూడ తన రచన యితరుల కనుకరణీయము కావాలికాని, తా నితరుల ననుకరించకూడదని శాసించాడు శార్ఙ్గదేవుడు. అది ఎలాసాధ్యం? నూత్నధాతు వినిర్మితి – ఎప్పటికప్పుడు కొత్త ఫణితుల గేయరచనలను కూర్చుకొనే శక్తిని సాధించాలి. తాను రచించిన గేయము తానొక్కడు కూర్చుని పాడుకొని ఆనందించటానికికాదు. అది పరుల ఆనందానికే, అది వారికి ఎలాచేస్తే ఆస్వాదయోగ్యమవుతుందో, తెలిసిఉండి, ఎప్పటికప్పుడు కొత్తగాను, వారికి తెలిసిన పుంతలలో స్వీకారయోగ్యముగాను ఉండే పరిస్థితులను కల్పించుకోడానికి పరచిత్త పరిజ్ఞానం ఎంతో అవసరము. దీనినే సంగీతసుధాగ్రంథంలో 'పరోక్త సందర్భ వివర్జనేన, స్వతంత్రసందర్భ విధౌపటుత్వం, స్వతంత్ర మాతుగ్రథనే పటుత్వం సంవేద–నంచాపి పరాశయస్య, అని చెప్పాడు గోవిందదీక్షితుడు.

ప్రబంధేష ప్రగల్భతా : అంటే సంగీతశాస్త్రములో భరతాది లక్షణకారులచే ప్రోక్తములై, దేశభాషలలో పరివ్యాప్తములై ఉన్న శాస్త్రీయసంగీత రచనారూపములకు ప్రబంధములని పేరు. సూడ ప్రబంధం, ఏలా, (గణైలా, మాత్రైలా, వికృతైలా, వర్ణైలా, దేశాఖ్యైలా, కర్ణాటైలా, ద్రావిడైలా, ఆంధ్రైలా) కరణ, వర్తనీ, ఢేంకి, ఝొంబడ, లంభక, రాసక, ఏకతాళీ, వర్ణ, వర్ణస్వర, గద్య, కైవాడ, అంకచారిణీ, కంద, హయలీల గజలీల, ద్విపది, చక్రవాళ, క్రౌంచపద, స్వరార్థ. ధ్వనికుట్టనీ, ఆర్యా, గాథా, ద్విపద, కలహంస, తోటక, రాగకదంబ. పంచతాళేశ్వర, తాళార్ణవ, చదుష్పది, షట్పది, దండక, కందుక, ధవళ, మంగళాచార – ఇవి శార్ఙ్గదేవుడు సలక్షణముగా నిర్వచించిన ప్రబంధాలలో కొన్ని.

ఈ ప్రబంధములలో పాండిత్యం సంపాదిస్తే వాగ్గేయకారుని గేయరచనాశక్తి విస్తృతమయితీరుతుంది. ద్రుతగీత వినిర్మాణమంటే వ్యాఖ్యాత శీఘ్రగీత నిర్మాణమన్నాడు. దీనికి శీఘ్రగతిని నడిచే గీతముల రచనమనీ, గీతరచనము శీఘ్రముగా చేయగలుగు శక్తి అనీ రెండు విధములా చెప్పుకోవచ్చును. పదాంతర విదగ్ధత అంటే నానాగీత నిర్మాణం అని ఒక వ్యాఖ్యాత అన్నాడు. ప్రబంధ ప్రాగల్భ్యం చెప్పినవెనుక తిరిగి నానాగీత నిర్మాణం పునరుక్తి అనుకోనక్కర లేదు. సంగీత శాస్త్రలక్ష్యములైన ప్రబంధాలలో అతడు నిరంతరాభ్యాసం, సాధన చేయవలసిన ఆవశ్యకత ప్రబంధ ప్రాగల్భ్యంలో సూచితమైనదనీ పదాంతర విదగ్ధత అంటే వివిధగీత వినిర్మితి అనీ చెప్పుకోవచ్చు. ముందు ప్రసక్తమయిన నూత్న ధాతు వినిర్మితి ఉండగా ఇది పునరుక్తియేమో అనికూడా తోచవచ్చు. అప్పుడు పదాంతర విదగ్ధత అంటే ఒకమాటను ప్రయోగించేచోట

ఇంకా వేరే యెన్ని ఇతర పదాలను ప్రయోగించవచ్చో అవలీలగా తెలిసి ఉండాలి అని చెప్పుకొంటే పేచీలేదు.

త్రిస్థానగమకప్రౌఢి – మంద్ర మధ్యతారములు మూడు స్థాయులలోను గమకముల నే విధముగా ప్రయోగించవలెనో పరిపూర్ణముగా సాధించాలి. వివిధాలపి నైపుణమ్ – శాస్త్రములో చెప్పబడిన ఆలాపన పద్ధతులన్నీ సాకల్యముగా నేర్చినవాడై ఉండాలి.

ఈ పైని చర్చించిన గుణము లన్నిటితోపాటు అవధానం – పూర్వాపర వినిశ్చితి అంటే చిత్తైకాగ్రత కలిగినవాడు శ్రేష్ఠుడైన వాగ్గేయకారుడు అని శార్ఙ్గదేవుని నిర్వచనము. అంటే ఈ గుణాలలో ఏ కొన్నైనా లోపించినవారుండవచ్చు. వారూ వాగ్గేయకారులు కావచ్చు. కాని, ఇవన్నీ ఉన్నవాడే ఉత్తముడూ అని.

ఆ తర్వాత శార్ఙ్గదేవుడు వాగ్గేయకారులలో ఉత్తమ, మధ్యమాధముల లక్షణం కూడా చెప్పాడు. సంగీత రచన బాగా చేయగలిగి మాటలకూర్పులో మందుడైతే మధ్యమ తరగతి వాగ్గేయకారుడు ధాతుమాతువుల రెండిటి రచనా తెలిసీ, ప్రబంధములలో ప్రౌఢిలేనివాడుకూడా మధ్యముడే. మాటలకూర్పులో నేర్పరీ, సంగీత రచనలో మందుడూ అయితే అతడు అధముడు. ఇంకొక విధమైన భేదనిరూపణము :— వస్తుకవి అనగా ఇతివృత్తమును తీసికొని కథగా అల్లగలిగే కథాకవి ఉత్తముడు. కథలో రామణీయకత లేకుండా వర్ణనలు మాత్రం బాగా చేయగలుగువాడు మధ్యముడు, ఇతరుల సంగీత రచనకు మాటలు కూర్చువాడు అధముడు – లేక కుట్టికారుడు.

సుమారు 16 వ శతాబ్దంనుంచీ వాగ్గేయకారుడు అను శబ్దానికి పర్యాయముగా 'బయకారుడు' అనే మాట వ్యవహారంలో ఉంది. స్వరమేళ కళానిధి రచించిన రామామాత్య తోడరుమల్లునికి బయకార రామయ్య అని కొన్ని గ్రంథాలలో వ్యవహారం ఉంది. ఈ బయకార శబ్దానికి వ్యుత్పత్తి (తంజావూరి రఘునాథ నాయకుని పేర ఆయన మంత్రి గోవింద దీక్షితుడు రచించాడని చెప్పబడుతున్న) సంగీత సుధలో తృతీయ ప్రకరణంలో ఉంది.

'మాతూంశ్చధాతూ నుభయాన్ కరోతి
యస్తం విదుశ్చోభయకారసంజ్ఞం
తమేవలోకా బయకారనామ్నా
వదం త్యపభ్రంశ పదేన సర్వే '

'మాతువునూ, ధాతువునూ ఉభయమునూ(రెండింటినీ)బాగుగా తెలిసినవాడు ఉభయకారుడు. లోకులంతా ఉభయకారుడు అనడానికి బదులు దాని అపభ్రంశమైన బయకార శబ్దంతో పిలుస్తున్నారు'.

సంగీత సమయసార మనే గ్రంథంలో ఉక్తములయిన వాగ్గేయకార దోషములను కూడా తెలిసికోవడం అప్రస్తుతం కాదు.

'గ్రామ్యోక్తి రపశబ్దశ్చ తద్వ దప్రస్తుతి స్తుతిః
గమకేచ పదేజాడ్యం ప్రబంధజ్ఞానహీనతా'
రసానురూపరాగాణా మజ్ఞత్వ మవిదగ్ధతా
క్రియానిర్వహణాజ్ఞత్వం మందశారీరతా తథా॥
మానే న్యూనాధికాజ్ఞత్వం రీతిభంగ స్తథా పునః
ఛాయాపరిచ్యుతి స్తద్వ ద్గానం చాసమయే తథా
అశ్రావ్యం లక్షణం త్యక్త్వా ధాతుమాతు కరోతి యః
దోషైరేతై రుపేతో యో నింద్యో వాగ్గేయకారకః'

గ్రామ్యోక్తి ఒక దోషం. అపశబ్దం దోషమే. అయితే అందరూ అన్ని కాలాల్లోనూ ఒప్పుకుంటారా అని సందేహం. ఏ భాషలోనైనా ఆ కాలపు వ్యవహారాన్నిబట్టి శబ్దములు శిష్ట సమ్మతంకాని రూపాలలో వాడినట్లయితే అది అపశబ్దమనిపించుకుంటుంది. ఒక కాలపు అపశబ్దము, కాలక్రమాన తరువాతి కాలంలో శిష్టులకు స్వీకారయోగ్యం కావచ్చుకూడా. నాటకాదులలో కాని, ఇప్పుడిప్పుడు సామాజిక గౌరవాస్పదాలవుతున్న జానపద గీతాలలో కాని పాత్రౌచితిని అనుసరించి గ్రామ్యోక్తులను వాడడంకూడా దోషం అవుతుం దనడానికి వీలులేదు. అయితే, సంగీత సమయసార గ్రంథకర్త తన కాలమునాటి విద్వాంసులా,శిష్టులా, నిశ్చితాభిప్రాయానుసారం గ్రామ్యోక్తి దోషం అనడం సహజమే. అప్రస్తుత స్తుతి- సందర్భోచితముకాని స్తుతి సర్వదా సర్వత్రా దోషమే. గమకేచ పదే జాడ్యం అంటే ఆ యా సందర్భాలలో అవసరమైన గమకాలుగాని, పదాలుగాని స్ఫురించక పోవడం. గమకాలు స్ఫురించకపోవడం లాగే అవసరమైన దానికంటె అతిగా గమకప్రయోగం చెయ్యడం కూడా దోషమే అని మనం చెప్పుకోవచ్చు. ఈ దోషానికి ప్రధాన కారణం మరొక దోషం - దీనిప్రక్కనే చెప్పిన ప్రబంధజ్ఞానహీనత- అంటే పూర్వ వాగ్గేయకారులు రచించిన ప్రసిద్ధ సంగీత రచనల అభ్యాసముగాని, పారాయణముగాని చేయకపోవడము.

రసానికి తగిన రాగాన్ని ఎన్నుకోడం తెలియక పోవడం ఒక దోషం: అవిదగ్ధత - అంటే నేర్పరితనం లేకపోవడం, ఆదొక దోషం. క్రియానిర్వహణా

జత్వం- క్రియఅంటే తాళములోని కాలప్రమాణమును లెక్కించే పద్ధతి. తాళములోని వేర్వేరు అంగాలను నిర్దేశించేది క్రియ. చేతితో రెండవ చేతిపై వేసే ఘాత, ఆచెయ్యి మళ్ళీ గాలిలోకి ఎగురవేసే ఉసీ, వ్రేళ్ళను మడుచి వేసే లఘువూ ఇవి వేర్వేరు క్రియలు. ఇవి సశబ్దములనీ నిశ్శబ్దములనీ, రెండు రకాలు. వీటినిగురించినజ్ఞానం లేకపోయిననాడు లయజ్ఞానశూన్యుడే. అటువంటివాడు వాగ్గేయకారు డనిపించు కోడు. తర్వాతి దోషం మందశారీరత- అంటే గాత్రం హీన స్వరం కావడం. ఇది వాగ్గేయకారుడు కావలసినవానికి ముఖ్యమైన లోపమే అవుతుంది కాని, అతని రచనా శక్తికి బొత్తిగా తోడ్పడనిదోషం అనిపించుకోదేమో. క్రియలు మున్నగు వానిలో ఇది హెచ్చు. ఇది తగ్గు అని తెలియకపోవడం, ఆరంభించినరీతినే రచన కొనసాగింపలేక మధ్యలో భంగం చేయడం, నిర్దిష్టమైన లక్షణాన్ని విడిచిపెట్టి ధాతుమాతువులను చేయడమూ దోషాలే. అయితే ప్రతిభావంతుడైన తన కాలంలో ప్రసిద్ధి పొందిన బయకారుడైనా, తన కాలంవారి మెప్పుపొందని ఉపజ్ఞగల బయ కారుడైనా సంప్రదాయసిద్ధమైన లక్షణమును విడిచిపెట్టి నూతన లక్షణమును సృష్టించుకోగలిగితే అది దోషంకాదని మనం ఇక్కడ చెప్పుకోవాలి. తన కాలం లోనే ప్రసిద్ధిపొందినవాడు ఏ నూతన లక్షణం అనుసరించినా అంతా శిరసా వహిస్తారు. ఆ కాలపువారు మెచ్చుకోకపోయినా తర్వాతి కాలపువారు మెచ్చుకో గలిగేటట్లు కొత్తపుంతలు తొక్కే బయకారులూ ఉంటారు. కాని లక్షణమును విడిచి రచించేవారందరూ కాని, నూతన లక్షణమును ప్రకాశింపజేసే వారు కాని అందరూ తప్పకుండా తర్వాతి కాలపువారి మెప్పు పొందలేరు అలా పొందగలిగే వాడు నిజంగా ఆదర్శప్రాయులైన వాగ్గేయకారుల కోవకు చెందవలసిఉండి కూడా కాలము, కర్మము కలిసిరాక తాత్కాలికంగా వెనుకపడవచ్చును గాని. ప్రతిభా వంతుని కృతికి ఎప్పటికైనా మెప్పురాకపోదు. అటువంటివారిని గమనించక పోవడంవల్ల దోషం ఆనాటి లోకపుదే।

దీని కుదాహరణముగా ఏడవ ప్రకరణంలో మనం ప్రశంసించుకొనబోయే అన్నమాచార్యునే తీసికోవచ్చు.

## నాల్గవ అధ్యాయం

# ప్రబంధ లక్షణ క్రమం పరిణామం

వాగ్గేయకారుల సంగీత (ధాతు) రచనకు ఆలంబములై వారి కల్పనా సామర్థ్యానికి దృష్టాంతాలై లక్షణకర్తల నిర్వచనాల కుదాహరణాలైన ప్రబంధరీతులు భరతముని నాటినుండీ కూడ అసంఖ్యాకంగా ఉన్నాయి. సంపూర్ణ వివరాలతో కాకపోయినా, కొంతవరకైనా, స్థాలీపులాకంగానైనా ఆ ప్రబంధ రీతుల స్వభావాలను ఈ ప్రకరణంలో పరిశీలిస్తే, ముందు రాబోయే ప్రకరణాలలో ఆ యా వాగ్గేయకారులు ఏయే ప్రబంధాలను ఏ విధంగా రచించారో, ఎలా గానం చేశారో కొంతవరకైనా అవగాహన చేసుకోడానికి అవకాశం కలుగుతుంది.

భరతముని నాట్యశాస్త్రంలో 14, 15 అధ్యాయాలలో ఛందోవిధానం, ఛందోవృత్త విధానం అను శీర్షికలక్రిందనూ, 32 వ అధ్యాయంలో ధ్రువాధ్యాయం అను శీర్షికక్రిందనూ ప్రబంధ రీతులను ప్రవచించాడు. పదబంధమును ప్రబంధమును పర్యాయపదాలుగా వాడినందువల్ల ప్రబంధానికి ఆనాడే పదం అనే వ్యవహారం ఉన్నట్లు కనిపిస్తుంది. అన్నమాచార్యులు సంకీర్తన లక్షణంలో ఈ విషయమై లక్షణ గ్రంథాలకన్నిటికీ మూలమైన భరతుని గ్రంథమే గేయరచనల కన్నిటికీ పదమే మూలమని చాటుతోందని స్పష్టంగా చెప్పాడు. పదములు ద్వివిధం — నిబద్ధములు, అనిబద్ధములు-అనిబద్ధ రచనలలోకి చూర్ణములు లేక చూర్ణికలు అనేవి వస్తాయి. నిబద్ధ పదాలలో ప్రధానములు వృత్తపదాలు, ఇవి సమవృత్తాలూ, అర్ధసమవృత్తాలూ, విషమవృత్తాలు అని మూడు రకాలు. ఉక్త, అత్యుక్త, మధ్య, ప్రతిష్ఠ, సుప్రతిష్ఠ, గాయత్రి, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతి, పంక్తి, త్రిష్టుప్, జగతి, అతిజగతి మొదలైన 26 ఛందస్సులలో నుంచి (సంస్కృత ఛందశాస్త్రంలోనివి) వృత్తాలనుతీసి ధ్రువాధ్యాయంలో పదములుగా భరతుడు లక్షణం చెప్పాడు. శ్రీ, ప్రతిష్ఠ, సుప్రతిష్ఠ, విద్యుద్భ్రాంత, భూతలమాన్య, కమలముఖి మొదలయిన రెండువందలవరకు పదములను చెప్పి, వీటినే ధ్రువపదములుగా నిర్దేశించాడు. దేశీయ వ్యవహారంలోని దరువునుంచి ధ్రువ పదమనే లక్షణ నామంగాని, ధ్రువపదంనుంచి దరువు అనే వ్యవహారంగాని వచ్చి ఉండవచ్చునని ప్రాజ్ఞుల అభిప్రాయం.

మతంగుని నాటినుండి, శార్ఙ్గదేవుడు మున్నగు మధ్యయుగపు లక్షణకర్తలే కాకుండా 17 వ శతాబ్దివారయిన గోవింద దీక్షితుడూ, వేంకట మఖీకూడ తమతమ గ్రంథాలలో ప్రబంధాధ్యాయాలలో చెప్పిన ప్రబంధ రీతుల వివరాలూ. లక్షణమూ ఏమీ మార్పులులేకుండా అదేవిధంగా పారంపర్యంగా వస్తున్నాయి. ఈ రీతుల ప్రబంధాలు ప్రధానంగా మూడురకాలు – కేవల నాదవిన్యాసాత్మకమై మాతువు సాహాయ్యకంగా మాత్రం సాగే సంగీత ప్రబంధాలు ఒక రకమూ, మాతువూ. భావమూ ధాతువుతో సమాన ప్రాముఖ్యం కలిగి సాగే ప్రబంధాలు రెండవరకము, ఈ రెండవరకపు రచనలు మతంగుని నాటినుండికూడ ఆ యా లక్షణకర్తలు ఆ యా కాలలో ప్రజల వ్యవహారంలోఉన్న గేయరీతులను పరిశీలించి లక్షణం ఏర్పరచినవి, ఈ రెండింటి మిశ్రమూ మూడవ రకము.

## ప్రబంధ ధాతువులు :

శార్ఙ్గదేవుని మొదలు లక్షణకర్తలు చెప్పిన ప్రబంధాల స్వరూపస్వభావాలు పరిశీలిద్దాము, ధాతువు అనేది ప్రబంధమునకు గల అవయవము అని సంగీత శాస్త్రజ్ఞులు నిర్వచించారు. ప్రబంధ శరీరం 4 భాగాలు : 4 ధాతువులు. అవి ఉద్గ్రాహము, మేలాపకము. ధ్రువము. ఆభోగము, ఉద్గ్రాహం ప్రబంధపు మొదటిభాగం, అనగా ఆరంభం. ధ్రువము, ప్రబంధపు ముగింపు. మేళాపకం ఉద్గ్రాహధ్రువాలను కలుపునది, ఆభోగము ప్రబంధ రచయిత నామమో, అంకితమిచ్చిన దేవతా నామమో ముద్రగా కలిసిన తుదిభాగం. ఆభోగమ పైని చెప్పిన ధాతువుల స్వరాలకంటె హెచ్చయిన స్వరాలలో పాడబడేది. కొన్ని ప్రబంధాలలో అంతరీ అనే అయిదవ భాగం వస్తుంది. ఈ ధాతువుల ఏర్పాటునుబటి ప్రబంధాలు మూడు విధాలు, ద్విధాతుకాలు, త్రిధాతుకాలు, చతుర్ధాతుకాలు. ద్విధాతుకం అంటే ఉద్గ్రాహధ్రువములు మాత్రమే ఉంటే ప్రబంధం. ఉద్గ్రాహధ్రువాభోగా లుండెవి త్రిధాతుకం, ఉద్గ్రాహ మేళాపక ధ్రువా భోగాలుండేది చతుర్ధాతుకం, పరిణామంలో ఉద్గ్రాహ ధ్రువాభోగా లుండే త్రిధాతుకాలే పదములుగా సంకీర్తనములుగా రూపొందినట్లు కనబడుతుంది. పదంలో ధ్రువం పల్లవిగామారి, అన్నమాచార్యుల సంకీర్తన లక్షణంలో ఈ విధంగా నిర్వచింపబడింది.

క. పదముల యర్థము పల్లవి
వదలక యన్నిటికి నేకవాక్యత జేయన్
గుదిగ్రుచ్చినట్లు తగులై
పదముతుదిన్ మరియు మరియు పల్లవి యలరున్.

## ప్రబంధాంగాలు :

స్వరం, బిరుదం, పదం, తేనకం, పాటం, తాలం అను ఆరూ ప్రబంధానికి అంగాలు. స్వరమంటే సరిగమాది సప్తస్వరాలు, బిరుదం సంబోధన ప్రథమలో నాయకుని గుణగణాలను వర్ణించడం, క్రియా, కారక క్రియలచేత నాయకునిగూర్చి చెప్పుట. తేనకం అనేది ఖాండీర భాషలో 'తేన' అనే శబ్దంనుంచి కలిగిన వికారం, తత్ అనగా పరమేశ్వరుడు 'తేన' అనేది పరమేశ్వరుని సంబంధించి పలికే ఊతపదం. పాటం అనేది వీణాది వాద్యాలలో కలిగే తక తక మొదలైనవీ, శంఖం మొదలైన వాద్యాలలో కలిగే తుకు తుకు మొదలైనవీ, మర్దళాదులలో కలిగే ధింత ధింత మొదలైన అవ్యక్తాక్షర సముదాయం. తాళం అంటే స్పష్టం. ఈ అంగాలతో విరచితములయే ప్రబంధాలు ప్రత్యేకం నాదాత్మకములు. అంటే మాతురచనా ప్రధానములు కావన్నమాట.

## ప్రబంధ జాతులు :

వీటిలో ఆరు అంగాలతో కూడిన ప్రబంధాలకు మేదినీజాతి అనీ ఐదంగాలతో కూడినవి ఆనందినీజాతి; నాల్గింటితో కూడినవి దీపని, మూడింటితో కూడినవి భావని, రెండింటితో కూడినవి తారావళీజాతి.

మరొక విభాగం ప్రకారం 6 అంగాలతో కూడినవి శ్రుతి ప్రబంధాలు. వీటి అంగాలు శిక్షాజ్యోతిష నిరుక్తనిఘంటుచ్ఛందో వ్యాకరణాలు. 5 అంగాలతో కూడినవి: నీతి ప్రబంధాలు, కర్మారంభోపాయములు, పురుషద్రవ్య సంపద దేశ కాల విభాగం, వినిపాత ప్రతీకారం, కార్యసిద్ధి అనేవి. నీతి ప్రబంధాల అంగాలయిదు సేనాప్రబంధాలకు రథగజ తురగపదాతులు చతురంగాలు, ఈ ప్రబంధాలు ప్రత్యేకము సైనిక విన్యాసాలకు యుద్ధసమయాలలోను, రాజలాంఛన గౌరవ సమయాలలోను వాడబడి ఉండేవి. కవితా ప్రబంధాలకు 3 అంగాలు ఏవి అంటే శక్తి, వ్యుత్పత్తి, అభ్యాసము. చంపూ ప్రబంధాల 2 అంగాలు గద్యమూ,పద్యము.

మరొక మూడువిధాలయిన ప్రబంధ విభజనం ఉంది. అవి ఏవంటే సూడ ప్రబంధాలు, ఆశిసంశ్రయాలు, విప్రకీర్ణాలు. మొదటి తరగతిలోని ప్రబంధాలు 8 – అవి 1. ఏల, 2. కరణం, 3. ఢేంకి, 4. వర్తని, 5. ఝొంబడ, 6. లంభ, 7. రాస, 8. ఏకతాళి. రెండవ తరగతిలోనివి. 1. వర్ణ, 2. వర్ణస్వర, 3 గద్య, 4. కైవాడ, 5. అంకచారిణి, 6. కంద, 7. తురగలీల, 8. గజలీల, 9. ద్విపది. 10. చక్రవాళ, 11. క్రౌంచపద, 12. స్వరార్థ, 13. ధనికుట్టని, 14. ఆర్యా, 15. గాథా, 16. ద్విపథకం, 17. కలహంస. 18. తోటక, 19. ఘట, 20. వృత్త, 21. మాతృక, 22. రాగకదంబక, 23. పంచతాళేశ్వర, 24. తాళార్ణవ.

మూడవ తరగతిలోనివి 36. అవి : 1. శ్రీరంగ, 2. శ్రీవిలాస, 3. పంచభంగి, 4. పంచానన, 5. ఉమాతిలక, 6. త్రిపది, 7. చతుష్పది, 8. షట్పది, 9. వస్తు, 10. విజయ, 11. త్రిపథ, 12. చతుర్ముఖ, 13. సింహలీలా, 14. హంసలీల, 15. దండక, 16. ఝంపట 17. కందుక, 18. త్రిభంగి, 19. హరవిలాస, 20. సుదర్శన, 21. స్వరాంక, 22. శ్రీవర్ధన, 23. హర్షవర్ధన, 24. వదన, 25. చర్చరి, 26 చర్య, 27. పద్ధడి, 27. రాహడి, 29. వీరశ్రీ, 30. మంగళాచార, 31. ధవళ 32. మంగళ, 33. ఓవి, 34. లోలి, 35. ఢోల్లరి, 36. దంతి.

## ఏలా లక్షణం :

శార్ఙ్గదేవుడు సంగీత రత్నాకరంలో చెప్పిన ప్రకారం ఏలా లక్షణం ముందు ఒకే స్వరరచన (ధాతువు) తో సమాన గణాలలో నడిచే రెండు ఖండాలు (పంక్తులు) పాడవలెను తరువాత గమకాలాపయుతమైన ప్రయోగం ఉంటుంది. తర్వాత పల్లవం అను పేరున మూడు ఖండాలు - వానిలో మొదటి రెండూ విలంబితంగాను, మూడవది ద్రుతకాలంలోను పాడవలెను ఈవిధంగా మూడు పాదాలు పాడితే ఉద్గ్రాహం అవుతుంది. మూడవ పాదం పాడిన వెనుక పల్లవ పదం (పల్లవి) పాడనక్కరలేదు. ఒక మతం ప్రకారం ఆ పాదాన్ని సంబోధన పదంతో ముగించాలి. సోమేశ్వరాదులు - రత్నావళ్యాది గ్రంథకర్తలు ఈవిధంగా పాడే మూడవ పాదాన్ని మేళాపక మన్నారు. ఈ మతం ప్రకారం ఉద్గ్రాహంతో ధ్రువం వస్తుంది. (స్తుత్యానామాకింతమైన నాయకుని గూర్చిన సంబోధన). మధ్య విలంబకాలంలో నడిచే మూడు ఖండాల పాదం ధ్రువం. ఏకధాతుకమైన ఖండాలు రెండైన వెనుక భిన్నధాతుకమైన మూడవఖండం వస్తుంది. తర్వాత మళ్లీ పూర్వ ధ్రువాన్ని (పల్లవిని) పాడాలి అని సోమేశ్వరాదుల మతం. ఏలాపదం గ్రహం (గేయ ప్రారంభం) విషమంగా ఉండవలెను. అంటే తాళంలో ఆవృతారంభంతో సమంగా దెబ్బపైనే ప్రారంభించక, త్రోసికాని, దెబ్బవేయకముందేగాని పాట ప్రారంభమౌతుంది. ఔదార్యము లోకానురాగము, ధార్మికత్వము మొదలైన నాయకగుణాలు ఏలలలో కీర్తనీయాలు కావలసిన అంశాలు.

## ఏలా భేదాలు :

ఏలలలో చాలా భేదాలున్నాయికాని, గ్రంథవిస్తర భీతిచేత కొన్నింటిని గురించి మాత్రమే వివరిస్తానని శార్ఙ్గదేవుడు చెప్పాడు. అవి గణైలా, వర్ణైలా, మాత్రైలా, దేశైలా.

వర్ణ గణములతో నిబంధింపబడు ఏల గజెల. వర్ణ గణములంటే ఛంద శ్శాస్త్రములో చెప్పబడిన మ, య, ర, స, త, జ, భ, న గణములు. అటువంటి గజెల మూడు విధాలు. 1 శుద్ధము, 2 సంకీర్ణము. 3. వికృతము, వాటిలో మళ్ళీ శుద్ధము నాల్గు విధాలు : నాదావతి, హంసావతి, నందావతి, భద్రావతి, నాదావతికి 5 భగణాలు ఒక న గణము కైశికీవృత్తిలో ఉండవలెను. పాంచాలీరీతి, శృంగారం రసం.

వృత్తులు 4 : అవి : కైశికి అనగా అత్యర్థ సుకుమారార్థ సందర్భ, సరస్వతీ ప్రీతికరం అత్యుద్ధతార్థ సందర్భ ఆరభటి; ఈషన్మృద్వర్థ సందర్భ భారతి, ఈషత్ప్రౌఢార్థ సందర్భ సాత్వతి—

రీతులు 4 : అవి : గుణాశ్లిష్ట పదసంఘటనముకలది పాంచాలి; సమాసాను ప్రాస ప్రాయమైనదీ తాత్పర్యభేదం స్ఫురించే దీలాటి; ఓజఃకాంతి గుణోపేత గౌడి; బంధపారుష్యరహిత శబ్దకాఠిన్యవర్జిత, నాతి దీర్ఘసమాస – వైదర్భి:— నాదవతి టక్కరాగంలో మంఠతాళంలో పాడాలి. ఋగ్వేదంనుంచి ఉత్పత్తి.

ఉదా :—నా న న నా న న నా న న నా న న
నా న న న న న

హంసావతికి 5 రగణాలు. ఒక సగణం. దీని ఉత్పత్తి యజుర్వేదం నుంచి, ద్వితీయ తాళము, హిందోళరాగము. ఆరభటీవృత్తి, లాటీరీతి, రౌద్రరసం, చండికా ప్రీతికరం.

ఉదా : లా ల లా లా ల లా లా ల లా లా ల లా
లా ల లా ల ల లా....

నందావతికి 5 తగణాలు ఒక జగణం, మాలవకౌశికరాగం, ప్రతితాళం, సామవేదంనుంచి ఉత్పత్తి, సాత్వతీవృత్తి, గౌడీరీతి, వీరరసం, ఇంద్రాణి ప్రీతి కరం.

ఉదా : నా నా న నా నా న నా నా న నా నా న
నా నా న న నా న....

భద్రావతికి 5 మగణాలు, ఒక యగణం, కంకాలతాళం, కకుభరాగం, అధర్వవేదం నుంచి ఉత్పత్తి, భారతీవృత్తి, వైదర్భీరీతి, బీభత్సరసం, వారాహీ ప్రీతికరం.

ఉదా : లా లా లా లా లా లా లా లా లా లా లా లా
లా లా లా ల లా లా....

ముందు చెప్పిన శుద్ధేలలు నాలుగింటిలోను ఒక్కొక్కదానికి ఒక్కొక్క గణాన్ని వికారం చేస్తే (రూపం మారిస్తే) వాసవి అనే వికృతైలా - రెండేసి గణాల రూపుమారిస్తే సంగత అనే వికృతైలా, మూడు గణాలను మారిస్తే త్రేతా అనే భేదమూ. 4 గణాలు మారితే చతుర అనేదీ, 5 గణాలు మారితే బాణ, అనే వికృతైలా భేదాలు సిద్ధిస్తాయి. ఆ విధంగా వాసవి 5 రకాలు, సంతత 10 రకాలు, త్రేతా 10 భేదాలు చతుర 5 భేదాలు.

మాత్రైలా : రతి గణాలు, కామ గణాలు, బాణ గణాలు అనే మూడు విధముల మాత్రా గణాలతో నిబద్ధమైన మాత్రైలా.

రతి గణాలు = U U : I U ; U I ; I I

కామగణాలు = U U U ; I U U ; U I U ; I I U ; U U I ;
I U I ; U I I ; I I I

బాణగణాలు = U U U U : I U U U ; U I U U ;
I I U U ; U U I U ; I U I U ;
U I I U ; I I I U ; U U U I ; I U U I ;
U I U I ; I I U I ;
U U I I ; I U I I ; U I I I ; I I I I.

ఈ మాత్రైలా 4 విధాలు : రతిలేఖ, కామలేఖ, బాణలేఖ, చంద్రలేఖ, దీని ఉద్గ్రాహమందు 3 పాదాలుండాలి. మొదటి పాదంలో 11 మాత్రలు, రెండవ పాదంలో 11 మాత్రలు, మూడవ దానిలో 10. ఈ మాత్రలు పైని చెప్పిన రతి గణాలవల్లనే పూరింపబడాలి.

రతిలేఖకు ఉదా :- వసంతాగమన
ప్రసూన సౌరభ
హాసన్ముఖికి హారతి.

కామలేఖకు రతిలేఖలో చెప్పిన మాత్రలకు ద్విగుణంగా వస్తాయి. అంటే మొదటి రెండుపాదాలకు 22 మాత్రలు, మూడవదానికి 20 మాత్రలు - ఇవి కామ గణాలతో పూరింపబడాలి.

బాణలేఖకు మొదటి రెండుపాదాలకు 33 మాత్రలు, మూడవదానికి 30 మాత్రలు - ఇవి బాణగణాలతో పూరింపబడాలి.

చంద్రలేఖకు మొదటి రెండు పాదాలకు 44 మాత్రలు, మూడవదానికి 40 మాత్రలు. ఇవి రతి, కామ, బాణ గణాలమిశ్ర సంయోగం ద్వారా పూరించాలి.

ఆ తర్వాత శార్ఙ్గదేవుడు మతాంతరం (అర్జునమతం) ప్రకారం - అనియత గణములద్వారా - నందినీ, చిత్రిణీ, చిత్రా ఇత్యాదిగా 20 రకాలుగా మాత్రైలా భేదాలను చెప్పారు.

వర్ణైలా : గుణమాత్రాది నియమాలు లేక వర్ణముల సంఖ్యామాత్రమే నిర్దిష్టమై రచింపబడేది వర్ణైలా. ఆరక్షరాల పాదఖండం మొదలు 29 అక్షరాల పాద ఖండంవరకూ 24 వర్ణైలా భేదాలున్నవి. అవి మధుకరి, సుస్వర, తరల మున్నగునవి.

దేశైలా : ఇది 5 విధాలు. కర్ణాట భాషలో రచన కర్ణాటైలా. లాటభాష లోని రచన లాటైలా, అలాగే గౌడైలా, ఆంధ్రైలా, ద్రావిడైలా. ఇవి ఒక్కొక్కటి 40 భేదాల చొప్పున మొత్తం 200 రకాల దేశైలాలు.

కర్ణాట దేశైల : అనుప్రాసాలంకృత, మొదటి రెండు పాదఖండాలలోను ఆద్యనుప్రాసం అంటే కందపద్యాలలో రీతిగా ద్వితీయాక్షర ప్రాసం పాటించాలి. చివర రెండు మగణాలు ఉండాలి. పాదఖండాదిని ద్వితీయాక్షర ప్రాసమూ, పాదంమధ్యను ప్రాసయతీ కూడా పాటించాలి. పాదాంత్య ప్రాసంకూడా ఉండాలి. సులేఖ; కామలేఖ; స్వరలేఖ; భద్రలేఖ మొదలైనవి దీనిలో భేదాలు.

లాటదేశైల :—అనుప్రాసాన్వితం, బహురసాన్వితం.

గౌడదేశైల :—గమక ప్రాసనిర్ముక్తం (నిర్యుక్తం అని పాఠాంతరం) ఏక రసాశ్రయం.

ఆంధ్రైలా :—నానాప్రయోగ రాగాంశ రసభావోత్కట అనీ, ద్రావిడైలా భూరిభావరసోత్కర్ష, ప్రాసవర్జితమనీ చెప్పాడు శార్ఙ్గదేవుడు. గోవింద దీక్షితుడూ, వేంకటమఖీ సరిగా ఇవే మాటలు చెప్పారు.

వస్త్వైల :—రెండు చరణాలు అనుప్రాసం లేకుండానూ, మూడవది సాను ప్రాసంగానూ ధ్రువాభోగాలు అనుప్రాసం కలిగి వేరు వేరుగా ఏపాదానికా పాదం నాలుగో గణంవద్ద యతిని కలిగి ఉండాలి.

మొత్తంమీద ఏలా భేదాలన్నీ 356.

కందుకూరి రుద్రయ (16 వ శతాబ్దం) రచించిన సుగ్రీవ విజయంలోని ఏల నొకదాన్ని ఇక్కడ పరిశీలించవచ్చు.

భాను వంశమూన బుట్టి
దానవకామిని గొట్టి
పూని మఖము నిర్వహింపవా, ఓ రామచంద్ర
మౌనివరులు సమ్మతింపగా....
రాతి నాతిజేసి పురా
రాతి చేతి విల్లు విరిచి
భూతలేంద్రులెల్ల మెచ్చగా, ఓ రామచంద్ర
సీతనూ వివాహమాడవా....

ఈ ఏలల్లో మూడుకాక నాలుగు ఖండాలు: ఆ భోగంకూడా కలిసినట్లు కనిపిస్తాయి. మూడవ ఖండంలో సంబోధన కూడా ఉంది.

కరణ ప్రబంధం : స్వరాద్యం, పాటపూర్వకం, బంధాధిమం, పదాద్యం, తేనాద్యం, బిరుదాదిమం, చిత్రాద్యం, మిశ్రకరణం అని 8 విధాలు. ఉద్గ్రాహ ధ్రువాలు సాంద్రస్వర బద్ధములు. రాసతాళం, ద్రుతలయ.

ఢేంకి :—4 విధాలు. ముక్తావళి, వృత్తబంధని, యుగ్మిని, వృత్తమాల. శబ్దములులేని ధాతుమాత్ర విశిష్టప్రబంధం ముక్తావళి, ఏకవృత్త సమన్వితమైనది వృత్తబంధని, వృత్తద్వయవతి యుగ్మిని, బహువృత్తవతి వృత్తమాల. ఇవి ఇంకా అంతర్భేదాలతో 30 రకాలు.

ఝోంబడ :—తారజము, అతారజము అని రెండు రకాలు. నిస్సారుకం నుంచి ఏకతాళం వరకు పది తాళాలలో ఈ రచన లుండవచ్చు. తారస్థానోత్పన్నం కనుక తారజం యిది నాలుగు రకాలు. తారస్థాయికంటె హీనమయిన స్థాయిలో ఉత్పన్నమయేది అతారజం- ప్రాయోగిక. క్రమవిలాస, చిత్ర, విచిత్రలీల మున్నగు 90 భేదాలు. వీటినింకా రసాలనుబట్టి విభజిస్తే 1170 భేదాలు. గద్యజ ములు, పద్యజములు అనే విభజనం వల్ల 3510 ఝోంబడాలు వస్తాయి.

లంభకం- ప్రలంభం :—ఉద్గ్రాహమును తాళరహితంగా రాగాలాపన వతుగా పాడి, ధ్రువస్థానోద్గ్రాహమయిన వెనుక ప్రథమోద్గ్రాహములోని మాతు వును అన్యధాతుబంధంలో పాడవలెను. ఇతర భేదాలు. భాగలంభము, లంభ పదం, అనులంభం, ఉపలంభం, అనాభోగం, విలంభం. ఇంకొక మతం ప్రకారం 8 భేదాలు. ఇది తారావళీ జాతికి చెందినవి.

రాసకం :—గమకస్థాన వర్జితమై ఝొంబడలక్షణం ప్రకారం రచితమై రాసతాళంలో పాడబడేది రాసకం. రాసభేదాలు : గణాలతో నిబద్ధమైనది రాస వలయమూ, అక్షరసంఖ్యతో నిబద్ధమైనది హంస తిలకము, మాత్రాగణ నిబద్ధ మైనది రతిరంగకము; ఇంకొకగణం అధికమైతే మదనావతారం. అక్షరసంఖ్యా నిబద్ధ రాసభేదాలు – పాదఖండానికి ఆరు అక్షరాలనుంచి 30 అక్షరాలవరకు ఒక్కొక్క అక్షరం చొప్పున హెచ్చించుకొంటూపోతే 25 భేదాలు వస్తాయి. అలాగే 8 మాత్రల చరణంనుంచి 60 మాత్రల చరణందాకా ఆ వృత్తిచేస్తే, మాత్రాగణనిబద్ధమైన రాసభేదాలు 53 వస్తాయి. ఇవన్నీ శార్ఙదేవునినాటికే అప్రసిద్ధాలట. లీలాశుకుని కృష్ణ కర్ణామృతంలో ఈ క్రింది పద్మినీవృత్తంలో చేసిన రాస లీలాష్టకం రాసప్రబంధభేదమే కావచ్చు.

అంగనామంగనా మంతరే మాధవో
మాధవం మాధవం చాంతరేణాంగనా....

ఏకతాళి :—ఉద్గ్రాహ ధ్రువములను రెండింటిని పాడి, ఆభోగ ధ్రువములు రెండు పాడి, సమాప్తముచేయాలి. ఏకతాళోపనిబద్ధము కనుక ఏకతాళిక అని ఈ ప్రబంధం పేరు. కొందరిమతం ప్రకారం ఉద్గ్రాహం తర్వాత ఆలాపం ఉంటే చాలు.

వర్ణప్రబంధం :—వర్ణానికి తాళం త్రిశ్ర, చతుశ్ర, మిశ్రములలో ఏదైనా ఒకటి కావచ్చు. ఇందలి ఉద్గ్రాహ ధ్రువములు బిరుద బద్ధములై ఉండాలి. ఇది త్రిధాతుకం. సూడ ప్రబంధాలలో ఇది మొదటిది. భావనీజాతి ఇందలి బిరుదాలు కర్ణాటభాషలో ఉండాలి అనే నియమంచేతనే కాబోలు ఆంధ్ర మండలాధీశ్వరు లయినా కన్నడ రాజ్య రమానుఖులైనా, రాయవేశ్యాభుజంగేత్యాది బిరుదులతో పాటు మూరురాయరగండ, గాయగోపాళ వంటి కర్నాటభాషా బిరుదాలు కన్పిస్తుంటాయి. బిరుద శబ్దానికి వ్యుత్పత్తి గోవింద దీక్షితుడిలా చెప్పాడు. (సంగీతసుధ)

'ఆర్యప్రసిద్ధే ర్బిరుదాఖ్య శబ్దో మ్లేచ్ఛప్రసిద్ధే రథవా నిరుక్తః
ఏవంప్రసక్తే సతి సంశయేఽస్మిన్ వినిశ్చితం శ్రీ చరణై ర్వివిచ్య....
విరుద్ధవాచీ బిరుదాఖ్యశబ్దో భవే న్మహారాష్ట్ర జనప్రసిద్ధః
నిర్జిత్య శత్రూన్ బిరుదం దదానం రాజాన మాసాద్య సపత్నభూపం....

బిరుద శబ్దం ఆర్యభాషా ప్రసిద్ధమో మ్లేచ్ఛభాషా ప్రసిద్ధమో నిర్వచించడం కష్టమని విద్యారణ్యులుకూడా అభిప్రాయ పడినట్లు చెప్పి, గోవింద దీక్షితుడు మహారాష్ట్ర భాషలో బిరుదానికి విరుద్ధ శబ్దంనుంచి వ్యుత్పత్తి ఉన్నట్లున్నూ.

శత్రువులను జయించి రాజులు చేకొనేది కనుక బిరుదపదం సార్థకమనీ వ్రాశాడు. ఎన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో కూడా ఇలాగే చెప్పాడు.

> ' బిరుశబ్దంబు విరోధో
> త్కరము మహారాష్ట్ర భాష తత్పదవిధులన్
> బిరుదములన జను వాని న
> ధర బిరుదావళి యనంగ దగు నండ్రు బుధుల్....

<u>వర్ణ స్వర ప్రబంధం</u> :—స్వర పాట పద తేనకము లనే అంగాలతో, వాటిని ఇష్టమువచ్చిన క్రమంలో ఉంచుకొని చేయబడేది వర్ణస్వర ప్రబంధం.

గద్య ప్రబంధం :—ఛందోహీన పద కదంబకము గద్య యనబడును. ఇది ఆరు విధములు, ఉత్కలికా, చూర్ణకం, లలితం, వృత్తగంధి, ఖండం, చిత్రం. వీటి ఉత్పత్తి సామవేదంనుంచి ఉత్కలిక వీర రసోచితం, రుద్రదైవ తాకం, గౌడీయరీతి, ఆరభటీవృత్తి, చూర్ణకం శాంత రసోచితం. బ్రహ్మదైవ తాకం, వైదర్భీరీతి సాత్వతీవృత్తి. లలిత గద్యం శృంగార రసోచితం, కైశికీ వృత్తి, పాంచాలీరీతి, మదన దైవతాకం, వృత్తగంధి గద్యం శాంతోచితం, మునిదైవతాకం, పాంచాలీరీతి, భారతీవృత్తి, పద్యభాగ విమిశ్రితమై వుండాలి. ఖండగద్య అనేది గణేశదైవ తాకం, సాత్వతీవృత్తి, వైదర్భీరీతి, ఆరంభంలో హాస్యరస సూచన ఉండాలి. చిత్రగద్య విష్ణుదైవతాకము, శృంగార రసాత్మకం చిత్రకైశికవృత్తి, వైదర్భీరీతి చూర్ణక, వృత్తగంధి ప్రకారముల రెంటితోను మిశ్రమై ఉండే వేణీగద్యా, అన్ని ప్రకారములతోను మిశ్రమై ఉండే వేణీగద్యా అని మరి రెండు భేదాలుకూడా కొందరు చెప్పారు. ఉత్కలికలు, కలికలు రగడ భేదాలుగా ఉదాహరణ ప్రబంధాలలో ఉపయుక్తములైనవి.

గద్య ప్రబంధానికి ఆరు గతులు చెప్పారు. అవి : దృత, విలంబిత, మధ్యా, ద్రుతమధ్య, ద్రుత విలంబ, మధ్యవిలంబ – ముందు చెప్పిన ఆరు ప్రకారాల గద్య ప్రబంధాలకూ ఈ ఆరు గతులు క్రమంగా వర్తిస్తాయి. ఉత్కలిక ద్రుతగతి: చూర్ణం విలంబితగతి; లలిత మధ్యగతి; వృత్తగంధి ద్రుత మధ్యగతి; ఖండం ద్రుత విలంబితగతి; చిత్రం మధ్య విలబితగతీ; కలిగి ఉంటాయి. ఇవి మొత్తం 36 భేదాలు. తాళవర్జితమై స్వరగమకాలతో మాతువుతో కొంత నడిచి, తాళంలో రెండుపాదాలు నడిచి తర్వాత విలంబగతిలో సాగుతుంది. తర్వాత తాళ యుక్తంగా వర్ణం అంకితం చేయబడిన నాయకుని పేరు, రచించిన వాగ్గేయకారుని పేరు విలంబితగతిలో పాడి; నాయకునిపేరు తిరిగి ఇంకొకసారి విలంబగతిలో పాడి, విలంబగతిలోనే ముగింపుచేస్తూ గద్యమని చివర చెప్పాలి.

అన్నమాచార్యులకు పూర్వము 13 వ శతాబ్దంలో (కాకతీయులకు సమకాలికుడై) సింహాచల క్షేత్రంలో వెలసిన కృష్ణమాచార్యులు రచించిన సింహగిరి వచనాలు, అన్నమాచార్యుల కుమారుడైన పెద తిరుమలాచార్యులు రచించిన వేంకటేశ్వర వైరాగ్య వచనమాలికా గీతాలు ఇదే పద్ధతిలో రచితములైన విన్నపములు ఈ గద్య ప్రబంధభేదాలుగా పరిగణించాలి. కర్ణాటకభాషలో బసవేశ్వరుడు, అక్కమహాదేవి శివభక్తిపరంగా వచనాలు చెప్పారు. ఇది వచనంలాగే నడిచినా తాళం బహు విలంబగతిలో అంతర్గతమై ఉంటుందని తజ్ఞుల అభిప్రాయం. ఆధ్యాత్మరామాయణ కీర్తనలలో జటాయుకృత రామస్తుతి, నారాయణతీర్థుల తరంగిణిలోని గద్యలూ చూర్ణికలనే పేర వెలసిన ఈ ప్రబంధ వికారములే.

సంగీత సాహిత్య ప్రియులైన ప్రాచీన మహారాజుల ఆస్థానాలలో తరచు పాడబడుతుండే ఈ గద్య ప్రబంధపు ఛాయలు మన సాహిత్యకవుల కావ్యాలలో ఆశ్వాసాంత గద్యలలో కొంతవరకు కనిపిస్తాయి.

కైవాడ ప్రబంధం :—వందిమాగధులు చేస్తూండే కైవారము అనే శబ్దం దీనికి రూపాంతరమే. సంగీతవాద్య శబ్దానుకరణ ధ్వన్యాత్మకమైన పాటము, అక్షరాత్మకమైన మాతువుతో కూడిన ఉద్గ్రాహధ్రువాలూ ఉంటాయి. కైవాడానికి సమాప్తి ఉద్గ్రాహంతో జరుగుతుంది.

అంకచారిణి :—ఇదికూడ బిరుదావళితో కూడి ఉంది. వందిమాగధ గేయమాన మయ్యేదే.

కంద ప్రబంధం :—కర్ణాటాంధ్రాది దేశభాషాపదాలతో, వాక్యానుకారి శబ్దాలతో, బిరుదాలతో తాలవర్జితమై సంస్కృతంలోని ఆర్యాచ్ఛందస్సులో నడిచే ప్రబంధము. ఆర్యాఛందస్సులోని చివరిపాదంలో చివరి గురువు నొకదానిని చేరిస్తే మన ఆంధ్రకర్ణాట భాషలలో ప్రసిద్ధిపొందిన కందపద్యం అవుతుంది. నన్నయభట్టు నాడో, అంతకుముందో ఆంధ్రకర్ణాట దేశాలలో అప్పటికే ప్రసిద్ధి పొందిన కంద ప్రబంధంనుంచే ఈ కందపద్యం పుట్టి సాహిత్యంలోకి యెక్కి ఉంటుంది. వీర రసోచితం. మన యక్షగానాలలో ప్రసిద్ధమైన కందార్థం అనే గేయరచన కంద ప్రబంధపు తర్వాతి పరిణామమే. కందార్థంలో తాళరహితంగా కందమును గానముచేసి చివరి పాదాన్ని తాళయుక్తంగా కీర్తనవలె ఆ పాదాన్ని పల్లవిగా చేసుకొని తదిగిణతోం ఇత్యాది శబ్దాలతోసహా పాడతారు. ఈ పాట ఆదితాళములోను, చాపుతాళములోనుకూడా గానం చేస్తారు. పదాన్ని మొదటినుంచీ సరాసరి పాడితే రూపకతాళంలో నడుస్తుంది. గాన ప్రస్తార విస్తారాలకి ఎక్కువ యోగ్యమైన నడక కలది కంద ప్రబంధం. అతి ప్రాచీనమైంది. తిరిగి పునరుద్ధ

రింపదగినది. ఆంధ్ర యక్షగానాలలో కందార్థాలలాగే వృత్తార్థాలూ, సీసార్థాలూ కూడా అక్కడక్కడ ఉన్నాయి.

తురగలీల :—తురగలీల (హయలీల) అనే ప్రబంధంకూడా ఆర్యాచ్ఛందస్సుపై ఆధారపడినదే. మనం కందార్థమని పయిని చెప్పుకొన్న పరిణామం తురగలీలా రూపాంతరమే అని చెప్పవచ్చు. ఆర్యావృత్తంలో ఒక పాదం తాళంతో పాడి రెండవది తాళం లేకుండా అలాపిగా పాడితే తురగలీల అవుతుంది. ఒకటవపాదం తాళరహితంగా పాడితే రెండవది తాళసహితంగా పాడాలి. కొందరి మతం ప్రకారం తురగలీలకు ఆర్యాచ్ఛందస్సు కాక, హయలీల అనే ఛందస్సు అవలంబనీయం. దానికి కల్లినాథు డిచ్చిన ఉదాహరణం :

'పవన విధూత వీచిచపలం విలోకయతి జీవితం తనుభృతాం
వపురపి హీయ మాన మనిశం జరావని తయా వశీకృత మిదం...

ఆర్యాప్రబంధం :—ఆర్యాఛందస్సులోనే ఉంటుంది. ప్రథమార్థం ఉద్గ్రాహంగాను ద్వితీయార్థం ధ్రువంగాను వర్తిస్తుంది. ప్రథమ చరణాంతమున సరిగమాది స్వరాలను విన్యసించాలి. గాతృ నేతృ ప్రబంధ నామాంకితమైన ఆభోగ ఖండంతో గేయం ముగుస్తుంది. ప్రథమ ఖండాన్ని రెండుసార్లు పాడి, ద్వితీయ ఖండం కొంతవరకు పాడి ఆభోగం పాడాలి. అలా ప్రబంధభేదాలు 26 చెప్పారు. వినికిడికి ఇదికూడా కంద ప్రబంధంలాగే ఉంటుంది

గాథా :—ఈ పైని చెప్పిన ఆర్యాప్రబంధ లక్షణంలోనే ప్రాకృత భాషలో చెప్పిన గేయములు గాథలు అంటారు. శాలివాహన సప్తశతి అనబడే గ్రంథం లోనివన్నీ ఇలాటి ప్రాకృత గాథా ప్రబంధాలే. వినికిడికి ఇదికూడా కందప్రబంధం లాగే ఉంటుంది.

ద్విపథకం లేక దోధకం :—కల్లినాథు డిచ్చిన ఉదాహరణ :

'దోధక మర్థనిరోధన ముగ్రం స్త్రీ చపలం యుధి కాతర చిత్తం
స్వార్థపరం మతిహీన మమాత్యం ముంజతి యో నృపతిః స సుఖీ స్యాత్...

తోటకం :—త్యజ తోటక మర్థవియోగకరం ప్రమదాధికృతం వ్యసనోపహతం
ఉపధాభిరశుద్ధ మతం సచివం నరనాయక భీరుక మాయుధికం ......

మాతృకాప్రబంధం :—అకారాదిగా 52 వర్ణములను ఆద్యక్షరములుగా వచ్చేటట్లు 52 పదాలతోకూడి పాడతగినది మాతృకాప్రబంధము. అది దివ్య, మానుషి, దివ్యమానుషి అని మూడు భేదాలు. సంస్కృతభాషలో మార్గతాళము

లలో పాడబడేది దివ్య. దేశీయభాషలో దేశితాళాలలో పాడతగినది. మానుషి ప్రాకృత దేశభాషలను మిశ్రంచేసి మార్గదేశి తాళాలను మిశ్రంచేసి పాడదగినది, దివ్యమానుషి. ఆకారాది అద్యక్షరమాలికా ప్రబంధం సాహిత్యరీత్యా, సంగీతరీత్యా కూడా ప్రత్యేక ప్రాముఖ్యం కలది.

రాగకదంబకం :—ఇది రెండు ప్రకారాలు : నంద్యావర్తకం, స్వస్తిక, నంద్యావర్తకంలో నాలు వృత్తాలు, నాలు తాళాలు, ప్రతి పాదానికీకాని, ప్రతి పాదార్థానికీగానీ వేర్వేరు రాగాలు నాలుగు వాడాలి. ఝంపాది అల్పమాత్ర తాళాలుకాని; సింహనందనాది అధికమాత్రాక తాళాలుగాని వాడవచ్చు. రాగకదంబకమును కేవలం గద్యలోకూడా చేయవచ్చునని కొందరి మతం.

స్వస్తిక రాగకదంబానికి 8 వృత్తాలు, 8 తాళాలు, 8 రాగాలు వాడాలి. కొందరి మతంప్రకారం దీనికి అబ్జపత్రమని పేరు

16 తాళాలు, 16 రాగాలు, 16 వృత్తాలు ఉపయోగిస్తే దాన్ని అబ్జగర్భమనీ, 32 తాళాలు, 32 రాగాలు, 32 వృత్తాలు ఉపయోగిస్తే భ్రమరమనీ అంటారు. ఈ స్వస్తికాభేదాలను గద్యరూపంలోకూడా పాడటం మతాంతరం. కల్లినాథుడు రాగకదంబకం గురించి శార్ఙ్గదేవుని లక్షణానికి వ్యాఖ్యచేస్తూ (14 వ శతాబ్దిలో) గోపాలనాయకు డను వాగ్గేయకారుడు రాగకదంబక గాయనదక్షుడని చెప్పాడు.

తథాహి గోపాలనాయకేన గీతద్వాంత్రింశ ద్రాగతాళయుక్త గద్యాత్మకే భ్రమరాఖ్యే స్వస్తికభేదే రాగకదంబే ప్రథమ సింహనందన తాలబద్ధే మాలవ శ్రీపదే పద తాలావే వోద్గ్రాహ ధ్రువయోజితావితి ద్వ్యంగత్వం....

ఈ గోపాల నాయకుడు అల్లాఉద్దీన్ ఖిల్జీ ఆస్థానానికి పోయి, అతనిని మెప్పించిన ప్రాచీనాంధ్ర వాగ్గేయకారుడని రెండవ ప్రకరణంలో చెప్పుకొన్నాము. స్వరమేళకళానిధి రచించిన రామామాత్యుడు రాగ కదంబాది ప్రబంధాలతో అళియరామరాయలను మెప్పించాడు.

పంచతాళేశ్వరం :—(ఇతర ప్రబంధాలు)ఆలాపనానంతరం ఒక పదమును పాడి దాని అవయవములుగా స్వరమును, వాద్యశబ్దానుకారులైన పాటాక్షరములను గానం చేయాలి. ఆ తర్వాత రెండవ పదం అదేవిధంగా పాడాలి. ఈ విధంగా 5 పదాలను ఐదుతాళాలలో గానంచెయ్యాలి. హుడుక్కవాద్యం, శంఖవాద్యం,కాంస్యవాద్యం (చిప్పతాళాలు),మురజాదివాద్యాలు వీని శబ్దాలను అనుకరించే పాటాక్షరాలు ఇందులో వాడాలి. పదాంత్యములందు మంగళవాచకాలుండాలి. వీరరసాత్మకంగా ఉండేది వీరావతారము; శృంగారాత్మకంగా ఉండేది శృంగారతిలక. రామామాత్యుడు రామరాజును మెప్పించిన ప్రబంధాలలో పంచతాళేశ్వరంకూడా ఉంది.

ఐదు తాళాలకు ఐదులు అనేక తాళాలను వాడి చెప్పిన ప్రబంధం తాళార్ణవం. నాల్గు తాళాలతో నాల్గు రాగాలతో పదాన్వితంగా గానం చేయబడేది శ్రీరంగ ప్రబంధం. ఐదు తాళాలతో ఐదు రాగాలతో స్వరాన్వితంగా గానం చేయబడేది శ్రీవిలాసప్రబంధం.

షట్పది :—ఆరు చరణాలు, మూడు ఆరు చరణాలకు మూడేసి గణాలు 1, 2, 4, 5 పాదాలకు ప్రత్యేకంగా ఒక్కొక్కదానికి రెండేసి గణాలు, మూడు ఆరు చరణాలకు బాణగణాలు, మిగిలిన చరణాలకు కామగణాలు. ఇది కర్ణాట సాహిత్యంలో ప్రసిద్ధిపొందిన దేశిచ్ఛందస్సు.

వస్తుప్రబంధము :—4 పాదాలు, 1, 3 పాదాలకు పదిహేనేసి మాత్రలు; 2, 4 పాదాలకు 12 మాత్రలు సూర్యగణాలు. ప్రథమార్థానికి చివర స్వరములూ, పాటమూ గానంచెయ్యాలి. ద్వితీయార్థానికి చివర స్వరములూ తేనకమూ పాడాలి.

విజయప్రబంధము —రాజుల విజయయాత్రలను పొగడుతూ పాడే ప్రబంధం. తేనకములతో, స్వరాలతో, పాటముతోకూడి. విజయతాళంలో పాట పాడవలెను. తేనకంతో ముగింపు.

త్రిపథం :—మూడు పాదాలు, ఒక పాదంలో పాటమూ, రెండవదానిలో బిరుదమూ, మూడవదానిలో స్వరాలు. మొదటి పాదద్వయం ఉద్గ్రాహంగాను, తృతీయపాదం ధ్రువంగాను వర్తిస్తుంది. చివరి పదంతో ఆభోగం కల్పించాలి. తాళాది నియమాలు లేవు

దండకం :—'దండకో నౌరః' అను లక్షణం ప్రకారం (ఛందశ్శాస్త్రం లోనిది) దండకం రెండు నగణాలతో ప్రారంభించి 7 రగణాలతో ఒక పాదం చొప్పున మొత్తం 4 పాదాలు. ఇది సంస్కృత వృత్త చ్ఛందోనుసారమైన లక్షణం. తెలుగులో లెక్కకుమించిన దండకాలున్నాయి. వాటిలో ఇలా పాద విభజనంలేదు. రెండు నగణాలయాక ఇష్టంవచ్చినన్ని రగణాలతో దండకాన్ని పెంచి,చిట్టచివర నమస్తే నమస్తే నమః అని ముగింపు. ఇది ఆంధ్ర సాహిత్యంలో నన్నయ, శ్రీనాథ, పోతనాదులందరూ వాడిన పదతి, ఛందశ్శాస్త్రంలో దండక భేదాలు భూరితరంగా వున్నాయని సంగీత రత్నాకర వ్యాఖ్యాతలయిన కల్లినాథ సింహభూపాలు రిద్దరూ చెప్పారు.

చర్చరి :—'షోడశమాత్రాః బహవః పాదః' — 16 మాత్రలు, బహు పాదాలు కలిగి అనుప్రాసాన్వితమై ఉంటుంది. ప్రాకృతంలోను, (ఆంధ్రాది) దేశభాషలలోను ఎన్నో చర్చరీ పదాలు ఉన్నవని సింహభూపాలుడు వ్రాశాడు.

వసంతోత్సవంలో పాడతగినది. శ్రీహర్షుని రత్నావళి నాటకంలో వసంతోత్సవ సందర్భంలో చర్చరి ప్రశంస ఉంది. ఆంధ్రభాషలో దేశీయపదాలలో జాజర అనేదే చర్చరిగా మారినదని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాశారు. నాచన సోముని ఉత్తర హరివంశంనుంచి యీ క్రింది జాజర పాట నుదాహరించారు.

'వీణా గానము వెన్నెలతేట
జాణలు మెత్తురు జాజరపాట '

ఇది పైని చెప్పిన 'షోడశమాత్రాః బహవః పాదాః ' అను నడకకు అనుగుణంగానే ఉంది.

పద్ధడీ ప్రబంధం :—మతంగుని బృహద్దేశిలో దీనికి వర్ధటీ అనీ, తెలుగు ఛందోగ్రంథాలలో పద్ధళి అనికూడా ప్రయోగాలు కనబడతాయి.చరణాలు అంత్యానుప్రాసం కలిగిఉండాలి. ఛందశ్శాస్త్రంలో పద్ధడీ లక్షణం ప్రకారం ఇది చర్చరికి ద్విగుణంగా ఉంటుంది.

'షోడశమాత్రాః పాదే పాదే యత్ర భవంతి నిర స్తవివాదే
పద్ధడికా జగణేన విముక్తా చరమ గురుస్సా సద్భి రిహోక్తా '

బిరుదాలతో స్వరాలతోకూడిన ప్రథమార్థం ఉద్గ్రాహము, బిరుదాలతో, పాటాక్షరాలతో కూడిన ద్వితీయార్థం ధ్రువము మూడవది ఆభోగము పదానిత్యము తెలుగు ఛందో గ్రంథాలలో దీనికి పద్ధళి అనికూడా ప్రయోగం ఉంది. శంకర భగవత్పాదుల గోవింద ద్వాత్రింశత్పంజరికా స్తోత్రం (భజగోవింద శ్లోకాలు) ఈ ఛందస్సులోనే నుడివినట్లు స్పష్టం.

రాహడీ ప్రబంధం :—వీర రసోచితము. సంగ్రామ రచితస్తుతి. చరణాలు చాలా ఉంటాయి. కొన్ని ఉద్గ్రాహాలు, కొన్ని ధ్రువాలు చివర ఆభోగం కల్పన చేయాలి. రాహడీ అనే శబ్దం తెలుగు కన్నడాలలో దేశిచ్ఛందస్సులలో ప్రసిద్ధమయిన రగడ....రగళె....అనే శబ్దాల రూపాంతరం...అని పరిశోధకులు నిశ్చితంగా చెప్పారు. వృషభగతి, ద్విరదగతి, మధురగతి, తురగవల్గనం లేక హయప్రచారం, జయభద్ర, హరిగతి, హరిణగతి, 7 రగడ భేదాలను అనంతుడు చెప్పాడు. తెలుగు యక్షగానకర్తలు ఈ రగడ భేదాలను విరివిగా వాడారు.

మంగళాచారం :—కైశికీరాగంలో (శుద్ధపంచమనే రాగానికి భాషాంగం), నిస్సారు తాళంలో సర్వసహితంగా గానం చేయబడేది మంగళాచరణం. ఇది మూడు విధాలు. గద్యజము పద్యజము. గద్యపద్యజము. జయదేవుని గీతగోవిం

దంలో హరివిజయ మంగళాచారం. ఉదా : శ్రితకమలాకుచమండల, ధృతమండల, హేకలితలలితవనమాల, జయ జయ దేవ హరే.

ధవళం :— మూడు విధాలు. 4 చరణాలు ఉండేది కీర్తిధవళం; ఆరు చరణా లుండేది విజయ ధవళం; 9 చరణాలది, విక్రమ ధవళం, 1, 3 బేసి పాదాలలో భగణమూ, భగణద్వయమూ; 2, 4 పాదాలలో భగణమూ పగణమూ అధికమైతే విజయధవళ మవుతుంది. ధవళాలు ఆశీర్వాదాత్మకాలు. లోకప్రసిద్ధ మైనది యీ గేయమని సింహభూపాలుడు తన వ్యాఖ్యలో వ్రాశాడు. ఇది ఆంధ్ర దేశీయమైన గేయాలలో ప్రసిద్ధమైనదానిగా మధురకవితా రీతులలో జాజరలు, అర్ధ చంద్రికలు, ఏలలు మున్నగువానితో చేర్చి ప్రభాకరశాస్త్రిగారు కూడా పేర్కొన్నారు ఆ విషయమును వారు వార్తకవి రాఘవయ్య (1600 ప్రాంతమువాడు) రచించిన లక్షణదీపికనుంచి ఉద్ధరించారు

జయదేవుని గీతగోవిందంలోని దశావతార కీర్తి ధవళం :

ప్రళయ పయోధిజలే ధృతవా నసి వేదం
విహితవహిత్ర చరిత్ర మఖేదం - కేశవ
ధృత మీనశరీర, జయ జగదీశ హరే...

సుగ్రీవ విజయంలోని ధవళం :

శ్రీరాముడు గుణధాముడు వారిజదళ లోచనుడు
శూరత రావణుగూలిచి నారీమణి తేవలయున్ - శోభానామే...

అలమేలుమంగా విలాసంలో ధవళం వేరుగాను, శోభనం వేరుగాను సూచింపబడ్డాయి.

ధవళం : జయ రవికోటి సంకాశా జయ జయ కారుణ్యనివాసా
జయ జయ సద్గుణకోశా జయ జయ శ్రీ వేంకటేశా.

శోభనం : వేదము లొసగిన ధన్యునకూ
విబుధుల బ్రోచిన మాన్యునకూ
భూధరము గాచిన మూర్ధన్యునకు
ఆదిమమూర్తి నృసింహునకూ శోభానామే....

మంగళం :—కైశికీరాగమునకు భాషాంగమైన బోట్టరాగంలో కళ్యాణవాచికములతో కూడిన పదం - విలంబితలయగలది మంగళచ్ఛందస్సు కుదాహరణగా కల్లినాథుడు.

పంచకార గణాః ప్రతిపాదగతాశ్చేత్
మంగళ మాహూరిదం సుధియః ఖలు వృత్తమ్...

దీని లక్షణ మేమైనప్పటికీ, మంగళం అనే పేరుతో రకరకాల మధుర చ్ఛందోరీతులలో ఎన్నో గేయ రచనలు ఆంధ్ర భాషలో వెలువడ్డాయి.

ఇవికాక, ఓవీ, లోలీ, డోల్లరీ, దంతీ అనే దేశభాషా ప్రబంధాలను శార్ఙ్గదేవుడు, గోవింద దీక్షితుడు మొదలయినవారు చెప్పారు. దేశభాషలలో ప్రసిద్ధిగల గేయాలని చెప్పారేగాని, అవి పాడబడే సందర్భాలను ఇతర లక్షణాలను స్పష్టంగా నిర్దేశించలేము. ఓవీ, డోల్లరీ ఊయలపాటలనిగాని, జోలలనిగాని లోలి లాలిపాటలని గాని ఊహిస్తే ఆ ఊహ సరికావచ్చునా? పరిశోధన ఇంకా జరగవలసిన విషయమిది. సరియైన దృష్టాంతాలు సమగ్రమైన లక్షణమూ దొరికితే సరిపోల్చవచ్చు.

## ఉదాహరణ ప్రబంధం :

సంగీత లక్షణ కర్తలెవరూ చెప్పి ఉండనిదీ, ఆంధ్ర వాఙ్మయంలో 13 వ శతాబ్దం నుంచీ బహుళ ప్రచారం కలదీ, ఉదాహరణ ప్రబంధం తాళ, లయాత్మకములయిన రగడ భేదాలతోను, సంస్కృత వృత్తాలతోను కలసిమెలసి ఉంటుంది ఉదాహరణం బిరుద, కైవార, గద్యాది ప్రబంధాలతోపాటు ఉదాహరణములను కూడ రాజాస్థానములలోని వందిమాగధ, రాయబయకారాదులు, దేవాలయములందు మహాభక్తులయిన కవీశ్వరులు సంగీతాత్మకములుగా గానముచేసి ఉండవలెను.

కాళిదాసు రఘువంశంలో రఘువు జైత్రయాత్ర సందర్భంలోను, విక్రమోర్వశీయంలో ఒకచోటను జయోదాహరణములు గానముచేయబడుట ప్రస్తావించబడింది. సంస్కృత వాఙ్మయంలోని ఈ ఉదాహరణ ప్రబంధాల లక్షణమేదో తెలియను. ఈ ఉదాహరణ వాఙ్మయానికి లక్షణం చెప్పడమే కాకుండా 23 తెలుగు ఉదాహరణ కావ్యములనూ, 6 సంస్కృతోదాహరణములనూ, ఉపోద్ఘాతముతో మూలములతోసహా నిడదవోలు వేంకటరావుగారు ప్రకటించారు. ప్రాచీనాలంకారికులలో విద్యానాథకవి ప్రతాపరుద్రీయంలో క్షుద్రప్రబంధాలలో ఒకటియైన ఉదాహరణ లక్షణము 14 వ శతాబ్దంలోనే వివరించాడు. ఇతడాంధ్రుడై ఉండడం వల్ల సంస్కృతాలంకారిక గ్రంథమైనా తన గ్రంథంలో ఉదాహరణకి లక్షణం చెప్పాడు.

రాజో, దేవుడో, నాయకుడుగా- అతని గురించి ప్రథమాది సప్తవిభక్తులూ, సంబోధన ప్రథమావిభక్తి ఈ ఎనిమిదింటిలోను ఒక్కొక్క విభక్తిలో ఒక్కొక్క

సంస్కృత ఛందోవృత్తమూ, దేశి చ్ఛందస్సులయిన రగడ భేదాలలో ఒక కళికా, దానిలో సగంమాత్రం మాత్రాల పాదాలతో ఒక ఉత్కళికా, చివర సార్వవిభక్తిక మయిన వృత్తమూ కలిసి- ఉదాహరణ ప్రబంధంలోని భాగాలు ఈ కళికో త్కళికలు గేయ చ్ఛందస్సులు; రగడ భేదాలు. 16 వ శతాబ్దిలో అళియరామ రాయల ఆశ్రితుడయిన భట్టుమూర్తి తన నరసభూపాలీయంలో ఉదాహరణ ప్రబంధ లక్షణం చెప్పాడు. 17 వ శతాబ్దపు అప్పకవి తన అప్పకవీయంలో లక్షణం చెప్పి, కృష్ణుడు నాయకుడుగా తాను రచించిన ఒక ఉదాహరణాన్ని ఉదహరించాడు. అన్నిటికంటె ప్రాచీనోదాహరణం పాల్కురికి సోమన రచించిన బసవోదాహరణ 13 వ శతాబ్దిలోది. 14 వ శతాబ్దపువాడైన రావిపాటి త్రిపురాంతకుడు త్రిపురాంతకదేవుని గురించి ఒక ఉదాహరణ ప్రబంధం చెప్పాడు. 15 వ శతాబ్దివాడైన తాళ్ళపాక పెద తిరుమలాచార్యుడు (అన్నమా చార్యుల కుమారుడు) వేంకటేశ్వరోదాహరణము రచించాడు.

ఉదాహరణ ప్రబంధంలోని రగడలూ, ఈ అధ్యాయంలో ముందు వివరించిన రాహడీ అనే ప్రబంధమూ ఒకటే అని ముందు చెప్పుకొన్నాము. కన్నడంలో రగడను రగళె అంటారు. కళికోత్కళికలను భరతుడు కూడా చెప్పాడు. ఉదా హరణపు రగడలను త్ర్యశ్ర, చతురశ్ర, మిశ్ర జాతులలోనూ, వరుసగా 3, 4, 7 అక్షరముల కాలములలోను త్రిపుట, జంపె, రూపక తాళములలోను పాడతగును. ఇంతకుమించి ఉదాహరణ ప్రబంధమును గానంచేసే పద్ధతిని గురించి లాక్షణికులు చెప్పలేదు.

## గీతములు :

శార్ఙ్గదేవుడు గీతములకు, ప్రబంధములకు ఒకే అధ్యాయం చెప్పాడు. వేంకటమఖి మాత్రం గీతాలకు ప్రత్యేకాధ్యాయం చెప్పాడు. గీతములు శుద్ధసూడ, సాలగసూడ (ఛాయలగసూడ) అని రెండు భేదాలు. శాస్త్రనియమాలుగల ఛాయలో పాడబడే గీతం శుద్ధము. సాలగసూడ గీతాలు ధ్రువ, మఠ్య, ప్రతిమఠ్య, నిస్సారుక, అట, రాస, ఏక అనే ఏడు తాళములకు ఏడు భేదాలు. వీనిలో ధాతు మాతువులతో చేరిన రెండు గీతఖండాలలో మొదటిది ఉద్గ్రాహం. దానికి న్యాసం ఉంచబడేచోట రెండవఖండం ధ్రువంగా వర్తిస్తుంది. ఉద్గ్రాహఖండంలోని స్వరాల కంటె ఉచ్చమైన స్వరాలతో ఆభోగఖండం. ధ్రువానికి 11 అక్షరాలు మొదలు 26 అక్షరాలవరకు వచ్చే 16 భేదాలు చెప్పబడ్డాయి. వాటికి వేరు వేరు పేర్లు, రసాలు, తాళాలు నిర్దేశించారు.

ధ్రువము మొదలైన సూళాది ఏడు తాళాలు ఝంపట. రగణమఠ్యము అను 9 తాళాలలోమాత్రం గీతాలను రచించాలని వేంకటమఖి నిర్దేశించాడు. ఇప్పటికీ వాడుకలోఉండిన గీతాలు యీ పద్ధతిలోనే నడుస్తాయి. సంగీతాభ్యాస పరులయిన విద్యార్థులకేగాని. సంగీత సభలలో వీటికి యీనాడు ప్రచారంలేదు. గీతాలు కొన్ని రెండు ఖండాలవీ, కొన్ని మూడు ఖండాలవీ, రెండు ఖండాల గీతాలలో మొదటి ఖండంలోనే ధ్రువం మధ్య పదన్యాసంగా ప్రయోక్తమవుతుంది. మూడు ఖండాల గీతాలలో మొదటిది ఉద్గ్రాహము, రెండవది ఆభోగము. మూడవది ముద్రాఖండము. మొదటిదయిన ఉద్గ్రాహంలో ధ్రువం తర్వాత అంతరి. తర్వాత జావడ (గీతంలో సగం అని అరం ఇచ్చే దేశీయపదం). ఆ తర్వాత రెండవదైన ఆభోగఖండం. మళ్ళీ అంతరి. చివర ముద్రాఖండము. అంతరి అనే ఖండం ఎన్నిసార్లు వచ్చినా ధాతువు మాతువు మారకుండా ఒకే విధంగా ఉంటుంది.

గీతాలలోని మాతువు (సాహిత్యం) గురించిన లక్షణం ఇది :

అష్టభాషా పదైర్యుక్తం అయ్యా అంవోతి యెర్యుక్తం
స్వరరాగైః ప్రగాయంతి గీత మిత్యభిధీయతే...

గీతాలమాతువు ఎనిమిది భాషలలో ఉండవచ్చునని లక్షణంలో ఉన్నప్పటికీ, వ్యవహారంలో ప్రాకృతాది భాషాపదాలను (కర్ణాటకంహూడా) ఆభోగఖండ మాతువులలో అర్థంలేని అఅ అయ్యా, తియ్యా అంవో, ఇయ, అరే అను శబ్దాలను కూడుకొని ఉండాలి. పిళ్ళారి గీతాలలో ఆ అనలే ఎకర....అనీ.... అయ్యా తియ్యా...అనీ ప్రయోగాలు అందరికీ తెలిసినవే.

సుబ్బరామ దీక్షితులు సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో వివరించిన కీర్తన పదవర్ణ చౌకవర్ణ తానవర్ణాదుల లక్షణం తెలుసుకోవడం అవసరం.

కీర్తనము :—మాతువు దేవతాస్తుతిగాను, పల్లవి, అనుపల్లవి, చరణాలతోను, మొదటి చరణపు కడపటి భాగము అను పల్లవియొక్క ధాతువును అనుసరించీ, తక్కిన రెండు చరణాలూ మొదటి చరణధాతువును అనుసరించీ ఉంటాయి. కొన్ని కీర్తనలలో అనుపల్లవి, చరణాల కడపటి భాగాలు మధ్యమకాలపు ఆవర్తములుకాగా, అనుపల్లవి చరణాంతములలో తిరిగి పల్లవి ఎత్తుకొనుటతో మాతువులో భావం పూర్తి అవుతుంది పల్లవి ఒక ఖండమయితే, అనుపల్లవి రెండు ఖండాలు, చరణాలు నాలుగు ఖండాలు. పల్లవి రెండు ఖండాలయితే తక్కినవి రెట్టింపుగాను ఉంటాయి. కీర్తనకర్తలతోనే మన వాగ్గేయకార చరిత్రము ప్రారంభమవుతుంది.

పదము :— పదముయొక్క మాతువు శృంగారరస నాయికా నాయక లక్షణ వ్యవహారాదులతో పల్లవి వెంట అనుపల్లవి చరణ మాతువులు విళంబకాల

ముగా పాడదగినది. అనుపల్లవిలోను, మూడవ చరణమందును నాయక ముద్రలు అనగా నాయక నామాంకితము ఉండవలెను. అనుపల్లవిలో నాయక ముద్ర ఇచ్చి, కము. మొదటి చరణధాతువు ప్రకారమే రెండవ, మూడవ చరణములుకూడ అనుసరించి ఉండాలి. కీర్తన శృంగారాత్మకమై పదంగా మారింది.

దరువు :—దరువు పదమువలెనే శృంగార రసాత్మకము సాధారణంగా ఒకే చరణంతో కొంచెం కాలమే పాడదగినది. కొన్ని దరువులకు రెండు మూడు చరణాలుకూడా ఉంటాయి. ఇవి యెక్కువగా యక్షగాన కర్తలచేతను, హరికథా కారులచేతను వాడబడినవి.

చౌకవర్ణం :—చౌకవర్ణం పదంవలెకాక, అనుపల్లవి ఆవర్తానికి రెట్టింపు అయిన ముక్తాయి స్వరముతో పల్లవి నెత్తుకొనునట్లును, చరణం నాలుగు ఖండాలుగాను, చరణం మొదటి ఖండం చివర న్యాసం చేసుకొని – విళంబలయగా ఒక్కావర్తమైన మొదటిదీ, మధ్యకాలముగా ఒకదాని కొకటి రెట్టింపైనఆవర్తంగల రెండవదీ, మూడవదీ, నాలుగవదీ అయిన స్వరాలను క్రమంగా పాడి, ఒక్కొక్క స్వరం చివర చరణం మొదటి ఖండం పాడి న్యాసం చేసుకొని, తర్వాత చరణపు తక్కిన మూడుఖండాలూ పాడి, అనుపల్లవిని గల ముక్తాయి స్వరం పాడి, పల్లవి నెత్తుకొని నిలుపవలెను కొన్ని చౌకవర్ణ స్వరాలకు భక్తిరసపూరితములైన సాహిత్యములుకూడ కొందరు వాగ్గేయకారులు చేశారు.

తానవర్ణం :— ఇది మధ్యకాలంలోనే ఉండడం సంప్రదాయం. పల్లవి, అనుపల్లవి చరణాల మాతువులోగల ప్రతి అక్షరాన్నీ అకార ఇకారములతో తానయుక్తంగా ఎక్కువగా సాగదియ్యవలసి ఉంటుంది. మిగిలిన లక్షణం చౌకవర్ణానికి చెప్పినట్టే. తానవర్ణాలు ఎక్కువగా నృత్యమునకు ఉపయోగపడతాయి.

స్వరజతి :—మధ్యమకాలంలో శృంగార రసావలంబియై సాగే మాతువూ, పల్లవి, అనుపల్లవి, చరణాలు : అనుపల్లవికి చివర ముక్తాయి స్వరరూపమయిన ధాతువులో సగం పాటము, సగం స్వరమూ, చిట్టచివర తధింగిణతోం అనే పాటమునుచేర్చి పల్లవి ఎత్తుకోవాలి. సాహిత్యంకూడా ఉంటుంది. స్వరరూపమైన చరణపు మొదటి ఖండికనూ, ఆ స్వరసాహిత్యమూ పాడుకొని క్రమంగా చరణము యొక్క మొదటిదీ రెండవదీ, మూడవదీ, నాలుగవదీ అయిన స్వరసాహిత్యాలను పాడి, అప్పటప్పటికి చరణపు మొదటి ఖండపు స్వరంలో న్యాసంచేసుకొని, తర్వాత చరణపు తక్కిన ఖండికలను చౌకవర్ణానికి చెప్పినట్లే పాడవలెను. కొన్ని స్వరజాతులు పాటసమూహమును గర్భమందుంచుకొని, స్వరసందర్భ రూపమై సాహిత్యములతో ఉండుటలో ఆయా రాగ మూర్ఛనలకు తగినట్లు ఆరోహణక్రమమైన స్వరాలలో ఒక్కొక్క [illegible]

స్వరసాహిత్యాలను పెంచి రచించడము. అదేవిధంగా అవరోహణక్రమంగా రచించడమూకూడా ఉన్నది. స్వరజతుల మాతువులు దేవతాస్తుతిగా ఉండడమే కాక, కొన్నిటికి ఆరంభంలో పల్లవివంటి మాతుకల్పనకూడా కద్దు.

జతిస్వరం :—ఇది నృత్యాని కుపయోగించేది పల్లవి, అనుపల్లవి, చరణాలకు ధాతువు మాత్రమే ఉంటుంది. దీనిలో మూడవ స్వరము ఏ రాగాని కేది జీవస్వరమో ఆ స్వరాన్నే ఆరంభస్వరంగా పెట్టి రచిస్తారు.

జావళి :—ఇది దరువు లక్షణమును, గ్రామ్య గానమును అనుసరించి ఉంటుంది. సరళమైన వ్యావహారికభాషలో సాగే శృంగారాత్మకమైన తేలికపాట. ధాతువు మధ్యమకాలంలో చిందులుతొక్కుతూ ఉంటుంది.

తిల్లన :—అన్యదేశీయముతైన తిరితిల్లానా అనే గ్రామ్యపాటములతో దేశీయ రాగాలలో, వర్ణక్రమంతో తాళబద్ధమై ఉంటుంది.

శబ్దము :—తాళపాటసాహిత్యాలతో కూడిన ఈ ప్రబంధాలను నృత్యకారులూ, యక్షగానకారులూ ఉపయోగించారు. మేరటూరు భాగవత విద్వాంసులలో శబ్దకర్తలున్నారు.

## కీర్తన లక్షణ క్రమ పరిణామం :

'అఖిల భువన సృష్టిస్థితిలయకారణభూతుండైన సర్వేశ్వరుని నామసంకీర్తనం చేయుటకై ఒక ధాతుశైలిని అనుసరించి వ్రాయబడిన సాహిత్యము కీర్తన మన బడును' అని శ్రీనివాస అయ్యంగారు తమ గానభాస్కరంలో నిర్వచించారు. స్వరావళి, అలంకారములు, గీతములు మొట్టమొదట రచించిన వాగ్గేయకారుడైన పురందరదాసు లక్ష కీర్తనలదాక రచించాడని చెప్పుకొన్నాము. అతనికంటె వయోవృద్ధుడును సమకాలికుడును అయిన అన్నమాచార్యుడు సంకీర్తనాచార్యుడనీ, పదకవితా పితామహుండని — భజనసంకీర్తన సంప్రదాయము నెలకొల్పినవాడని, సంకీర్తనరచనలలో అన్నమాచార్యులకుకూడ కించిత్ ప్రాచీనులైన శ్రీపాదరాయస్వామి, నిజగుణ శివయోగి అనువారు కర్ణాటకభాషలో రచించిన భక్తివేదాంతాత్మకమైన కీర్తనలు అన్నమాచార్యుల లక్షణరచనకు, లక్ష్యరచనకు కొంతవరకు మార్గదర్శకములయి యుండవచ్చునని రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి సూచన కూడ శిరోధార్యము. అన్నమాచార్యుల సంకీర్తన లక్షణంలో స్తుతిపాత్రుడైన గీతగోవిందకర్త జయదేవుడు (12 వ శతాబ్ది) కూడా ఆయనకు మార్గదర్శి అయి ఉండవచ్చు.

(కీర్తనలు పల్లవ అనుపల్లవ (పల్లవి, అనుపల్లవి) చరణములతోకూడి ఉండాలి. వృత్తముఃకువలెనే యతిప్రాసలు, పల్లవులు సుబోధకంగా చోదన రూపముగా నుండును. పల్లవిలోని అభిప్రాయము అనుపల్లవిలోను చరణముల లోను విశదముగా తెలుస్తూ తిరిగి తిరిగి పాడబడుతుండే పల్లవితో భావము, వాక్యము పూర్తి అవుతూ వుంటుంది. పల్లవి ఒక ఖండముగాను, అనుపల్లవి రెండు ఖండములుగాను, చరణములు నాలుగు ఖండములుగాను వుంటాయి. (తాళ్ళపాకవారి సంకీర్తనా లన్నిటిలోను పల్లవి రెండు ఖండాలుగా ఉండి. అను పల్లవి అనేది వేరే లేకుండా నాలుగేసి పాదాలుగల మూడుచరణా లుంటాయి,/ జయదేవుని అష్టపదులలో మొదటి ఉద్గ్రాహమనే ఖండము అనుపల్లవిగాను, తరువాతి ధ్రువమనే ఖండం పల్లవిగాను తరువాతి రచనలలో పరిణమించాయి. ఉద్గ్రాహంలో రెండు పంక్తులు, ధ్రువంలో రెండు పంక్తులు ఉంటాయి. చరణాలు రెండేసి పంక్తులచొప్పున ఎనిమిది ఉంటాయి. అందుకే వానికి అష్టపదులని పేరు వచ్చింది. అష్టపదులకే శరభ పదాలని శాస్త్రీయనామం ఉందని అన్నమాచార్యుల సంకీర్తన లక్షణంలో చెప్పారు. (శరభం అంటే 8 కాళ్లుండే చరిత్రాతీతకాలపు మృగం). నారాయణతీర్థులనాటికి ఆయన తరంగాలలో పల్లవి (ధ్రువం) ముందుకువచ్చి ఒకపంక్తిగాను, తరువాత రెండుపంక్తుల ఉద్గ్రాహం అనుపల్లవి గాను మారి తాళ్ళపాకవారి నాటివలె ఒక్కొక్కటి నాలుగేసి పంక్తులుగల మూడు చరణాలతో ముగియవచ్చింది. అంతేకాకుండా, కొన్ని తరంగాలలో ఒకపంక్తి పల్లవీ, రెండుపంక్తులు అనుపల్లవీ, లేదా రెండుపంక్తులు పల్లవీ, రెండుపంక్తులు అనుపల్లవీ, ఒక్కొక్కసారి అనుపల్లవి లేకుండా పల్లవే కొన్నిటిలో ఒకపంక్తిగాను కొన్నిటిలో రెండు పంక్తులుగాను ఉంటాయి. చరణాలు కొన్నిటిలో 3 మాత్రమే కాకుండా 4, 8, 9 10 కూడా ఉంటూవచ్చాయి. క్షేత్రయనాడు తరువాత త్యాగ యాదులనాడు కూడ పల్లవి. అనుపల్లవి 3 చరణాలుఉండే సంప్రదాయం వచ్చింది. నాటినుండి నేటివరకు చివరి ఆభోగఖండంలో వాగ్గేయకారుడు నిర్ణయించుకొన్న నామముద్ర వస్తూనేవుంది. అయితే జయదేవుని అష్ట పదులలో ముద్ర భార్యాసహితంగా స్వనామాంకితమై ఉంటుంది. (తాళ్ళపాక కవుల కీర్తనలన్నీ వేంకటేశ్వర ముద్రాంకితాలు. పురందరదాసు కీర్తనలు పురందర విఠల (స్వనామాంకితాలు) నారాయణ తీర్థుల తరంగాలు కొన్నిటిలో గురునామ సహితంగాను, కొన్నింటిలో మాత్రం స్వనామాంకితాలు. సుబ్రహ్మణ్య కవి అధ్యాత్మ కీర్తనలలో ప్రతిదానిలోను కృతిభర్త అయిన శేషగిరీశుడయిన వేంకటేశ్వరుని నామమును కొన్నిటిలో కర్త అయిన తన నామమునుకూడా చివర ముద్రలో చేర్చాడు. భరత శార్ఙ్గదేవాదులు నిర్దేశించిన పద్ధతి యిదే. క్షేత్రయ్య పదాలన్నీ మువ్వగోపాల ముద్రాంకితాలు. ఈ ముద్ర పల్లవిలో కొన్నిటా, చివర

కొన్నిటా వస్తుంది. త్యాగరాజు కీర్తనలు స్వనామాంకితాలు. దీక్షితులవారి కీర్తనలు గురుగుహ ముద్రాంకితాలు. ఇతరుల ముద్రలను గురించి ముందు ఆయా ప్రకరణాలలో తెలిసికోవచ్చు.

క్షేత్రయవరకూ వ్రాసినవారి కీర్తనలలో పదాలలో చరణాలు మూడేసి ఉండటం కద్దు. త్యాగయ్య దీక్షితులు మొదలైన అద్యతన వాగ్గేయకారుల రచనలలో కొన్నిటిలో ఒకే చరణం కనబడుతోంది. ప్రాచీనుల కీర్తనల్లో కొన్నిటిలో 5, 6, 10, 15 చరణాలుకూడా ఉన్నవి. తొలిరోజులలో పదము, సంకీర్తనము పర్యాయపదాలుగా ఒకే అర్థంలో వ్యవహారముండేది. అవి శృంగార సంకీర్తనలనీ, అధ్యాత్మ సంకీర్తనలనీ రెండు విధాలయి రాను రాను క్షేత్రయ్యనాటికి శృంగార సంకీర్తనలు పదాలనీ, త్యాగరాజునాటికి అధ్యాత్మ సంకీర్తనలు కీర్తనలనీ వ్యవహారం రూఢం అయింది.

రాయ ప్రబంధ, గీతముల శైలికంటెకూడ కీర్తనలశైలి ఎంతో శ్రావ్యమైనదని పండితుల అభిప్రాయమేకాకుండా ఈనాటి బహుజనాభిరుచికూడ. కీర్తనలో ధాతువు, మాతువు సమపాళాలల్లో ఉంటాయి. క్షేత్రయ్యకాలంనుంచి ధాతువు అధికంగా ఉండి మాతువు తక్కువగా విళంబంగా, గమక, మరికలతోను, విన్యాసంతోను గానంచేసే పదశైలి వ్యాపించింది. ఆ తరువాత త్యాగరాజాదుల కాలంలో విలంబపదశైలి మధ్యమకాల సంగతులతోకూడి ఇప్పటి కీర్తనశైలిగా పరిణమించింది.

కీర్తన ధాతువులో సంగతుల విస్తృతితో కూడిన ప్రస్తారముతోడయి త్యాగరాజునాటినుంచీ నెరవలకల్పనతో చిట్టస్వర కల్పనలతో మరింత పటిష్ఠమయి కీర్తనకు కృతి అనే వ్యవహారం వచ్చింది.

తానం, పల్లవి :—తానములు పాడేటప్పుడు భగవన్నామము అనంతానంతా అని పదే పదే గానం చేస్తూ ఆలపి విన్యాసం చేయడంవల్ల ఆపేరు వచ్చింది. తాళంతో రాగవిన్యాసం కల్పనచేస్తూపాడే పద్ధతికి ఆలంబముగా, ఒక కీర్తన పల్లవి నొకదానిని మాత్రం తీసుకొని దానికి చివర సర్వవిన్యాసం ప్రస్తారానుసారంగా త్రికాలములలోను, పట్కాలలోను పాడే సంప్రదాయం సుమారు 18, 19 శతాబ్దములలో ఏర్పడింది. భగవన్నామ ప్రబంధమైన పల్లవిని విరసముకాని దిట్టమైన విళంబకాలంలో రాగభావం చెడకుండా పదార్థభావం తొలగకుండా గానం చేస్తారు. స్వరాలు పాడేటప్పుడు వర్ణాలంకారాలను అనుసరించి పాడతారు. స్వరాలలో రాగకళలు నిబిడమై ఉండాలి.

ప్రబంధాలను గురించి స్థాలీపులాకంగా చెప్పుకొన్న తర్వాత దేశీయ గానమును గురించి పార్శ్వదేవుడు సంగీత సమయసారంలో చెప్పిన శ్లోకాలను యిక్కడ ఉద్ధరించడం అప్రస్తుతంకాదు.

"ఆచార్యాః సమ మిచ్ఛన్తి వ్యక్తి మిచ్ఛన్తి పండితాః
ఉచ్చ నీచ స్వరోపేతం నద్రుతం నవిలంబితం
పద తాలైః సమం గీతం సమ మాచార్య వల్లభం
క్రియా కారక సంయుక్తం సంధిదోష వివర్జితం
వ్యక్త స్వర సమాయుక్తం వ్యక్తం పండిత సంమతం
లలితైః రక్షరైర్యుక్త్యం శృంగార రసరంజితం
శ్రావ్య నాద సమోపేతం మధురం ప్రమదాప్రియం
స్వరైః రుచ్చతరైర్యుక్తం ప్రయోగ బహుళీకృతం
వికృష్టం నామ తదీత మితరేషాం మనోహరం
గానమారభటీ వృత్త్యా వీర సంగర వర్ధకం
ఉచ్చ నీచ స్వరం గీతం సోత్సాహం శూరవల్లభం
ప్రేమోద్దీప్త పదప్రాయం శృంగార రసభూషితం
కరుణాకాకు సంయుక్తం కరుణం విరహిప్రియం
విపరీత పదైర్యుక్తం స్వరభం గ్యుపబృంహితం
గీతం హాస్యరసోదారం పరిహాసం విట ప్రియం
గూఢార్థైః పరమార్థైశ్చ సంసార సుఖముఖ్యకైః
పదైర్నిర్యోజితం గీత మధ్యాత్మం యోగివల్లభం
శుభవాక్యయుతైః గీతం శుద్ధ పంచమ నిర్మితం
వివాహాద్యుత్సవే గేయం మంగళం మహిళాప్రియం
దేవతా స్తుతి సంయుక్త తత్ప్రభావం ప్రబోధకం
ఆస్తిక్యోత్పాదనం గీతం రమ్యం భక్త జనప్రియం
అవ్యవస్థానకం గీతం తాల పాటై రలక్షితం
ప్రయోగ బహుళం రూక్షం విషమం వాదివల్లభం—

సింహభూపాలుడు సంగీత రత్నాకరవ్యాఖ్యలో ఉదహరించిన ఈ పార్శ్వ దేవుడు శార్ఙ్గదేవునికి తర్వాత 16 వ శతాబ్దంలో ఉండినవాడు. వ్రాతలనుబట్టి (జైనమతస్థుడును) దాక్షిణాత్యుడుగాను, బహుశా ఆంధ్రదేశీయుడుగాను కని పిస్తాడు. శ్రీశైల ప్రాంతపువాడేమో. ఇత నీ శ్లోకాలలో చెప్పిన దేశీయగాన రీతులుగాని, సంగీత రసికులలో భేదాలుగాని, ఎంత నాగరికమైన, ఏకాలపుదైనా ఏదేశమందైనా యథాతథంగా యీనాటికీ సరిపోతాయనిపిస్తుంది.

<u>చిట్టస్వర కల్పన</u> :—అర్థమూ, తాత్పర్యమూ లేనివే అయినప్పటికీ స్వరా క్షరాలను గానం చేస్తే, కృతీ, రాగమూ పాడేటప్పుడు కలిగే రసానందమే కలుగు

తుంది. (చిట్టస్వరము అనేది ప్రత్యేకంగా నిలిచే సంగీతరచన కాకపోయినా కృతిగా పరిణమించిన కీర్తనగానంలో తప్పనిసరిగా రక్తి గలిగించే చిట్టచివరి అంశము. ఈ అంశము సభాసంప్రదాయాలు వర్ధిల్లిన యుగంలో బాగా అభివృద్ధి చెందింది. ఈ చిట్టస్వరములు రాగ లక్షణమునకు లక్ష్య ప్రాయములు. వీటి కల్పన కృతి అనే సంగీతరచనకు ప్రత్యేక వ్యక్తిత్వమూ, ఠవీ, సౌందర్యమూ సమకూరుస్తుంది. చిట్టస్వర కల్పనతో సహా రచింపబడిన కృతులు సంపూర్ణ వికాసముగల రచనలుగా గౌరవింపదగినవి) త్యాగరాజు పంచరత్నకృతులలో ఈ చిట్టస్వర కల్పనలకు సాహిత్యబంధము కూడా రచితమయింది, ముత్తుస్వామిదీక్షితులు కొన్ని కృతులలో చిట్టస్వరాలు, మరికొన్నిటిలో 'మిశ్ర' లు కొన్నింటిలో జటిస్వర సహితమైన స్వరకల్పనా రచించాడు. శ్యామాశాస్త్రిలు తన విలంబకాల కృతులలో అనుపల్లవి తర్వాత ముద్దులొలికే చిట్టస్వరాలను చేకూర్చాడు. ఈ చిట్టస్వర కల్పనలో శ్యామాశాస్త్రిలను మించినవాడట ఆయన కుమారుడు సుబ్బారాయ శాస్త్రిలు

<u>యుగ విభజనం</u> :— వాఙ్మయ చరిత్రను యుగములుగా విభజించినట్లు వాగ్గేయకార చరిత్రమునుకూడా విభజించవచ్చు. ప్రబంధ రచనా పద్ధతిలోని విశిష్ట లక్షణాలనుబట్టి ఆ యా యుగాని కాయాపేరు పెట్టడం అన్ని భాషలలోను వాఙ్మయ చరిత్రకారు లవలంబించిన ప్రసిద్ధసంప్రదాయం. ఈ సంప్రదాయాన్నిబట్టి మనవాగ్గేయకార చరిత్రమును ఏయే యుగాలుగా విభజించవచ్చునో పరిశీలిద్దాము.

<u>సామగానయుగం</u> :— ఆదికాలంలో భారతదేశమంతటా వేదకాలంనాటి ప్రబంధాలు-ఋక్కులు, గాథలు, సామములు, ఇవి దేశభాషలోనే ఉండేవి. ఈ యుగాన్ని సామగాన యుగం అనవచ్చు.

<u>గాంధర్వయుగం</u> :— దీని తిరువాతి యుగం మార్గయుగం, లేక గాంధర్వ యుగం, గాంధర్వపద్ధతి ప్రబంధాలు భక్తి ప్రధానములై సంస్కృత కావ్యభాషలో ఉండేవి. ఇవి బ్రహ్మవిరచితములని చెప్పి, వీటిని స్వరబద్ధములుగా చేసి, భరతుని నాట్యశాస్త్రమూ, శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరమూ మొదలయిన లక్షణగ్రంథాలలో నస్వరంగా వాటిని ఆ యా లక్షణకర్తలు ఉదాహరించారు, ఇవి శివస్తుతి పరాలు.

<u>ఆఖ్యాన యుగం</u> :— ఆ తరువాతిది ఆఖ్యాన యుగం. ఈ యుగంలో రామాయణ, మహాభారతాది ఇతిహాసాలను ఆఖ్యానములుగా, వీణాది వాద్యములు వంతగా పెట్టుకొని గానం చేసేవారు. అలా గానం చేసేవారిని కుశీలవు లనేవారు. ఇంతవరకూ సంస్కృతేతరములయినదేశభాషలలో ప్రబంధాలు (గేయ రచనలు) లేనే లేవని చెప్పలేము. ఉండేవికాని ఆ భాషలకువలెనే ఆరచనలకుకూడా సమాజ

గౌరవమూ, సాహిత్యస్థాయీ (అప్పటి పండితుల దృష్టిలో) కలగలేదని చెప్పుకోవాలి.

ధ్రువాగాన యుగం :— దేశి సంప్రదాయంలోని సంగీత రీతులకు లక్షణ నిర్ణయంచేసిన మతంగునినాడు బృహద్దేశిలో దేశిరాగస్వరూపం ప్రవచింపబడినట్లే, దేశభాషలలోని ప్రబంధరీతులనుకూడా పరిశీలించి వాటిని తమ లక్షణ గ్రంథాలలో చేర్చి ధ్రువాగానములుగా సభాగౌరవస్థాయికి తెచ్చారు. ఈ ప్రయత్నం భరతునినాడే ప్రారంభమయిందని ముందు చెప్పుకొన్నాము. శార్ఙ్గదేవాదుల కాలంనాటికి ఈ ప్రకరణంలో ముందు చర్చించుకొన్న ప్రబంధరీతులన్నీ లక్షణస్థాయిని పొందినది ఈ యుగంలోనే. ఈ నాలుగో యుగాన్ని ధ్రువాగాన యుగం అనవచ్చు;

రాగకావ్య యుగం :— (ఆ తరువాత అభినవ గుప్తాచార్యుడు తన అభినవ భారతిలో రాగకావ్యములనే ప్రబంధాలనుగురించి చెప్పాడు. టక్క రాగంలో పాడవలసిన రాఘవ విజయ కావ్యమూ, కకుభరాగంలో పాడవలసిన మారీచవధా కావ్యమూ దృష్టాంతములుగా ఉదహరించాడు అభినవ గుప్తుడు.)

గీతగోవింద యుగం :— ధ్రువాపదయుగంనాటి లక్షణాలు. రాగ కావ్య యుగ లక్షణాలు కలుపుకొని, బహురాగములతో బహుధ్రువాపదముసుద మధ్య మధ్య శ్లోకములతో భక్తి శృంగారాత్మకేతి వృత్తంలో సర్గములుగా విభజింపబడిన గీత గోవిందం తరువాతి యుగలక్షణానికి మార్గదర్శి.

ఇది 11, 12 శతాబ్దాల మధ్య వెలసిన జయదేవుని కాలం. 11 వ శతాబ్దం ఆంధ్రభాషకు సాహిత్య స్థాయినీ, రాజసభా గౌరవాన్నీ యిచ్చింది.

దేశభాషా సంకీర్తన యుగం :— 13 వ శతాబ్దం దేశిగేయ రచనారీతులను స్వీకరించి వాగ్గేయకారులు తమ మాతృభాషలలో సంకీర్తనములను రచించడం ప్రారంభించినకాలం. సింహగిరి నరహరి వచనాలు రచించిన కృష్ణమాచార్యుని సంకీర్తనలు ఆంధ్రభాషలో తొలి గేయ రచనలని ముందు చెప్పుకొన్నాము. ఇవి తాళగంధులేకాని తాళబద్ధములు కావు. తాళబద్ధ సంకీర్తనములను వివిధరీతులలో వేలకొలది ఆంధ్రభాషలోను కూడా రచించిన తాళ్ళపాకవారు 15, 16 శతాబ్దులలో వెలిశారు. ఇది సంకీర్తన స్వర్ణ యుగం.

యక్షగాన యుగం :— 16 వ శతాబ్ద ప్రారంభంలో యక్షగాన రచనలకు సాహిత్యస్థాయీ, సభాగౌరవము లభించాయి. కాని, యక్షగానాల స్వర్ణయుగం చెప్పదగిన కాలం – తంజావూరును నాయకరాజులూ, మహారాష్ట్రులూ పాలించిన 17, 18 శతాబ్దములే. ఒక యుగం జరుగుతూండగానే మరొక యుగం ప్రారంభించడమూ, ఒకశతాబ్ది దాటిన తర్వాత ఆ ప్రారంభించిన ప్రబంధ రూపం పరి

పక్వస్థితిని పొందడమూ, యిలాగే సాగుతుంది. మన ఆంధ్రభాషా వాగ్గేయకార చరిత్రము. సంకీర్తనయుగం 13 వ శతాబ్దిలో ప్రారంభించినా, తాళ్ళపాకవారు వెలసిన 15, 16 శతాబ్దాలలో సంకీర్తనం తన రూపాన్ని బహువిధాల పరిపక్వ స్థితిలో సవరించుకొని, 17 వ శతాబ్దిలో రామదాసు సుబ్రహ్మణ్య – (అధ్యాత్మ రామాయణకర్త) కవుల కీర్తనలలో క్రమంగా భక్తిప్రపత్తినీ, ఆఖ్యానపద్ధతినీ అవలంబించింది. ఆ కాలంలోనే వెలసిన నారాయణతీర్థులు – సంకీర్తన పద్ధతి లోని భక్తిరసాన్ని ఆధ్యాత్మికౌదార్యాన్ని పుణికి పుచ్చుకొని, తన యుగానికి విశిష్ట లక్షణమైన యక్షగాన రూపంలోనే రచన సాగించాడు.

ధాతుకల్పనా పరిణామ యుగం :— యక్షగాన స్వర్ణ యుగమని చెప్పదగిన నాయకరాజుల కాలంలోనే (17 వ శతాబ్దం) క్షేత్రయ్య శృంగార భావమునకు ప్రాముఖ్యం యిచ్చి, భావప్రధానమైన రాగవిన్యాసమునకు అనుగుణమైన ధాతు రచనలో సమాన ప్రాధాన్యంగల పదాలు రచించాడు. ఇంతమ ముందు యుగాల కీర్తనల్లో మాతు రచన ప్రధానముగా ఉంది, ధాతు రచన – మాతువుకు కవచ మాత్రమైన ఉపాంగంగా ఉండేది. అంటే (అన్నమాచార్యాదుల కీర్తనలలో మాటలు ప్రధానములు. వానికి సంగీతం ఒక ఉపాంగం. ఆ సంగీతపు వరుసకూడ అల్లిక జిగిబిగువులు లేని సరళపద్ధతిలోనే సాగిపోయేది. సంకీర్తనలన్నీ అంతే. రామదాసు కీర్తనలుకూడా అంతే) క్షేత్రయ్య పదాలలో మాటలూ, సంగీత వరుసా కూడా సమప్రాధాన్యం కలిగి మనోధర్మానుగుణమైన భావప్రకర్ష కలిగించే పద్ధతిలో రెండింటి రచనా సాగింది. ధాతుకల్పనకు మాతువుతో సమప్రాధాన్యంయిచ్చి క్షేత్రయ్య వేసిన ప్రాతిపదిక త్యాగరాజాదుల నాడు పరిపక్వత చెందింది.

సభాసంప్రదాయ యుగం :— క్షేత్రయ్య నాటినుండే రాజన్య రసిక పరివేష్టితమైన సంగీత సభల సంప్రదాయానికి కూడా ప్రాతిపదిక ఏర్పడినప్పటికీ త్యాగయ్య నాడే స్పష్టరూపం దాల్చింది కనుక త్యాగయ్య కాలం సభాసంప్రదాయ యుగం అని కూడా అనవచ్చు. ఈ సంప్రదాయ స్వరూపం త్యాగరాజాదుల తర్వాత యింకా అభివృద్ధి పొందిందని చెప్పవచ్చు. త్యాగరాజాదుల కాలంలో కీర్తనల్లో ధాతు కల్పనకు ప్రాధాన్యం క్రమంగా హెచ్చింది. అంటే పాటలోని సంగతుల కల్పన ద్వారా సంగీతపు వరుస ఎక్కువ ప్రధానమై మాటలు మట్టుకు ఉపాంగంగా మారిన వన్నమాట.

హరికథా యుగం :— 19 వ శతాబ్దంలో చివర కాబోలు యక్షగానములే హరికథలుగా పరిణామం చెందాయి. ఈ కాలంలో సంగీత సభాసంప్రదాయాలు విశిష్టరూపం దాల్చి, పల్లవి రచనములూ, చిట్ట స్వరకల్పనలూ మున్నగునవి విరివిగా జరిగాయి. క్రమంగా ధాతుప్రాధాన్యం మరీమరీ హెచ్చిపోయి, మాతువులోని భావప్రదర్శనంకూడా మృగ్యమై పోయేటంతవరకూ వచ్చింది. హరికథల రచయితలు వాగ్గేయకారకులుగా సుప్రసిద్ధిపొంది రచనలు విరివిగా సాగించారు. విద్వత్ప్రకర్షకములైన సంగీతసభ లొకపక్క పండిత రంజనం చేస్తూంటే హరికథలు పండిత పామరరంజకాలై వ్యాప్తిపొందాయి.

# అయిదవ అధ్యాయం

# జయదేవుడు

అది పండ్రెండవ శతాబ్దారంభం. అప్పటికింకా భారతీయ సంగీతంలో ఉత్తర హిందూస్తాన, కర్ణాటక పద్ధతులనే చీలికరాలేదు. ఇంకా శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరం వెలువడటాని కా శతాబ్దం పూర్తికావలసి యున్నది. చరిత్రకారులు ఆ కాలాన్ని రాజపుత్రయుగం అన్నారు. అప్పుడు ఉత్తర భారతదేశం అంతా ఖండఖండాలై వేర్వేరు రాజుల పాలనలో ఉంటోంది. పడమట పాంచాలం మొదలు తూర్పున గౌడదేశం (బంగాళం) వరకు వేర్వేరు రాజ్యాలు, మహారాష్ట్ర కర్ణాటకాలలో పశ్చిమ చాళుక్యులు. కళ్యాణి చాళుక్యులు, ఆంధ్రదేశంలో తూర్పు చాళుక్యులూ, దక్షిణాన చోళులు, తమతమ రాజ్య విస్తృతికి కట్టుదిట్టాలు చేసుకొని దేశభాషలలో సాహిత్య కళలను ఉద్ధరించడానికి ప్రారంభించారు. అప్పటి కప్పుడే రాజరాజనరేంద్రుడు నన్నయభట్టు చేత మహాభారతం తెలుగులో వ్రాయించాడు. (1060)

1131 ప్రాంతంలో కళ్యాణి చాళుక్యరాజు సోమేశ్వరుడు అభిలషితార్థ చింతామణి అనే సంగీత లక్షణగ్రంథం వ్రాశాడు. మతంగుడు వివరించిన దేశిరాగ లక్షణాన్ని అనుసరించి (1050- 1150) ప్రాంతంలో సంగీత సాహిత్యలక్షణద్రష్ట మమ్మటాచార్యుడు (కావ్యప్రకాశికాకర్త) తన సంగీతమాల అనే గ్రంథంలో దేశీయ రాగభేదాలను విపులీకరించాడు.

అప్పుడు గౌడదేశాన్ని సేనవంశపు రాజులు పాలిస్తున్నారు. వారిలో లక్ష్మణసేనుడనే రాజు 1116 నుంచి సుమారు 1160 వరకు పరిపాలించాడు. కావ్యగీతిప్రియుడు. కవిపండిత గాయకపోషకుడు. స్వయంగా సంగీత సాహిత్య పాండిత్యమూ, ప్రబంధరచనా దక్షతా కలవాడు. అతని ఆస్థానంలో వెలిశాడు జయదేవుడు. భారతదేశాని కంతకూ సంగీత సాహిత్యాత్మకమైన తొలి ప్రబంధం గీత గోవిందం యీ మహాత్ముని రచనమే. లక్ష్మణసేన మహారాజు ఆస్థానంలో ఉన్న తన సహకవులను గురించి వర్ణిస్తూ, తనను గురించి కూడా ఒక శ్లోకంలో చెప్పుకొన్నా డీయన. అది గీతగోవిందం గ్రంథావతరణికలోనే ఉంది :

'వాచః పల్లవయ త్యుమాపతిధరః సందర్భశుద్ధిః గిరాం
జానీతే జయదేవ ఏవ శరణః శ్లాఘ్యో దురుహ ద్రుతేః
శృంగారోత్తర సత్ప్రమేయ రచనై రాచార్య గోవర్ధనః
స్పర్ధీకోఽపిన విశ్రుతః శ్రుతిధరో ధోయీ కవిక్ష్మాపతిః'

ఇతర కవుల గుణాలేవైనా, తనను గురించి జయదేవుడు చెప్పుకొన్న మాటలు 'సందర్భశుద్ధిః గిరాం జానీతే జయదేవ ఏవ' అని — అంటే, ఆ కవు లందరిలోనూ కూడా శబ్దముల సందర్భశుద్ధి నెరిగినవాడు జయదేవు డొక్కడే అనీ. అంతేకాక, వంగదేశంలో లక్ష్మణసేనుని సభా గృహద్వార మందున్న శిలా శాసనంలో కూడా 'గోవర్ధనశ్చ శరణో జయదేవ ఉమాపతిః కవిరాజశ్చ రత్నాని సమితౌ లక్ష్మణస్యచ' అనే శ్లోకం చెక్కబడి ఉందట.

'శ్రీ భోజదేవ ప్రభవస్య రామాదేవీ సుత శ్రీ జయదేవకస్య
పరాశరాది ప్రియవర్గకంఠే శ్రీ గీతగోవింద కవిత్వమస్తు'

అని గ్రంథాంతంలో చెప్పిన ప్రకారం ఇతని తల్లిదండ్రులు రామాదేవీ, భోజదేవులు; పరాశరాదులు ప్రాణ స్నేహితులు, గీతగోవిందం గానం చేస్తూండే వారు.

జయదేవుని చరిత్రనంతా చంద్రదత్త విరచితమయిన భక్తమాల అనే గ్రంథంలో మూడు సర్గలదాకా విపులంగా ఉన్నదట.

'బిందుబిల్వ సముద్ర సంభవ రోహిణీ రమణేన'ఇత్యాదిగా ఇతడు తనజన్మ స్థానం బిందుబిల్వమని తన అష్టపదులలో చెప్పుకొన్నాడు. ఇది కొన్నిచోట్ల కేందు బిల్వమనీ,కొన్నిచోట్ల కిందుబిల్వమనీ,తిందుబిల్వమనీ చెప్పబడింది. భక్తిమాల అనే చంద్రదత్తుని గ్రంథంలో బిందుబిల్వమనే ఉంది. బిందుబిల్వం ఒరిస్సా రాజ్యం లోని జగన్నాథక్షేత్రానికి దగ్గరగా ఉంది. వంగదేశంలోని బీర్భూం జిల్లాలోని 'కేందులి' అనే గ్రామమే యీ కేందుబిల్వం లేక కిందుబిల్వమనీ వంగదేశీయు లంటున్నారు. అక్కడ ఏటేటా జయదేవుని జన్మదినోత్సవాలూ, అవీ జరిపి, అష్ట పదుల గోష్ఠిగానం చేస్తూంటారట ఒరిస్సారాజ్యంలోని కిందుబిల్వగ్రామానికి చెందిన కోటీరకృష్ణ పండాజీ అనే ఆయనవద్ద ఉన్న ఒక తాళపత్రంలో ఓఢ్రభాషలో శ్రీముఖ సంవత్సర మారశిర కృష్ణ ఏకాదశినాడు జయదేవకవి కైవల్యం చెందాడని వ్రాసివున్నదట ఆ తేదీ క్రీస్తుశకం 1153 డిసెంబరు 28 కి సరిగా సరిపోతుంది. దీనినిబట్టి అంతకు 60, 70 ఏళ్ళకు ముందుగా అతడు జన్మించి ఉండవచ్చును. దాదాపు 1090 ప్రాంతం అని అనుకోవచ్చు. జన్మతః ఆంధ్రుడై తమిళదేశంలో పుట్టి, జీవించి,వాగ్గేయకారుడైన త్యాగరాజువలె, జయదేవుడు జన్మతః ఓఢ్రుడై వంగదేశంలో జీవించి, వాగ్గేయకారుడై అక్కడ రాజపోషణము పొంది.

ప్రసిద్ధుడై ఉంటాడు. మొత్తానికి భారతదేశానికంతకూ అది ప్రబంధకర్తగా ఆరాధ్యుడయ్యాడు,

'వాగ్దేవతా చరిత చిత్రిత చిత్త సద్మా
పద్మావతీ చరణ చారణ చక్రవర్తిః'

అని గ్రంథావతరణికలో చెప్పుకొన్నదానినిబట్టి, ఇతని భార్య పేరు పద్మావతి అనీ, వారిరువురి దాంపత్యం అన్యోన్యమైనదీ, ఆదర్శమైనదీ అని తెలుస్తుంది. అంతేకాదు, అంతకుపూర్వం ఏ కవీ సాహసించని నవ్యరీతిని ఇతడు భార్య పేరును తన పేరుతో చేర్చి 'పద్మావతీ చరణ చారణ చక్రవర్తి' అనీ, 'జయతి పద్మావతీ సుఖసమాజే భణతి జయదేవ కవిరాజ రాజే' అనీ, 'జయతి పద్మావతీ రమణ జయదేవకవి భారతీ'... అని పలుచోట్ల ఉటంకించి, తనకు ఆమెపైని గల అద్వితీయానురాగాన్ని ప్రకటించి ఆమె అనురాగ ప్రోత్సాహాలు తన కవితకు ఉద్బోధక కారణాలని స్పష్టపరిచాడు. ఆయన కీర్తనలు రచించి పాడుతూంటే పద్మావతీ చరణములు నర్తించేవనికూడా పై శ్లోకంవల్ల మనకు విశదమవుతుంది.

వివాహానికి పూర్వం జయదేవుడు సకల విద్యలలోను పరిపూర్ణ పాండిత్యం సంపాదించినవాడైనా, భుక్తిగడవని దారిద్ర్యంలో తపస్స్వాధ్యయనాలతో కాలం గడుపుతూ ఉండేవాడు. ఇలా ఉంటూఉండగా దేవశర్మ అనే బ్రాహ్మణుడు అతని వద్దకు వచ్చి, పద్మావతి అనే తన కొమార్తెను అతడు పెండ్లి చేసుకోవలెననీ, స్వప్నంలో భగవానుడైన పురుషోత్తముడు తన కలా ఆనతిచ్చాడనీ చెప్పాడు. జయదేవుడు నవ్వి 'అగర్భదరిద్రుడైన తా నేమిటి? ఆ పిల్లను పెండ్లి చేసుకోవడ మేమిటి? వెళ్ళుం' డన్నాడు. అప్పటికే దేవశర్మ స్వప్నంలో కనబడ్డ దేవుని ఆనపైని యెంతో దిగివచ్చినాడు. మొదట తన కూతుర్ని భగవంతునికే యిచ్చి పెండ్లిచేస్తానని పట్టుపట్టి ఆఊరి దేవాలయానికి తీసుకువెళ్ళి ఆమెను అక్కడి అర్చకులకు అప్పగించి వెళ్ళిపోయాడు. అటుపైని ఆ విధంగా అర్చకులకు కూడా భగవంతుడు కనబడి, భక్తుడూ, పండితుడూ అయిన జయదేవునికి ఆమెనిచ్చి పెండ్లిచేయమని ఆనతియ్యడంవల్ల తా నా విధంగా జయదేవుడివద్దకు వెళ్ళాడు. జయదేవుడెంతకీ ఒప్పుకోకపోతే, దేవశర్మ వెళ్ళి అర్చకులను తీసుకొచ్చి, వారిచేతకూడా జయదేవునికి చెప్పించి ఒప్పించాడు.

నాటినుంచి పద్మావతీ జయదేవుల దాంపత్యం మానవజాతికంతకూ మాననీయమై వర్ధిల్లింది. రాధాకృష్ణ భక్తుడైన జయదేవుడు రాధాకృష్ణ ప్రణయలీలలను ప్రబంధములుగా గానంచేస్తూంటే పద్మావతి నర్తిస్తూ, ఆ కీర్తనములలోని భావాన్ని అభినయిస్తూండేది. ఆ ప్రబంధాలే ఒక కథాసూత్రంలో గీతగోవిందమై వెలిశాయి.

ఒకనాడు జయదేవుడు 'వదసి యది కించిదపి' అనే 19 వ అష్టపది రచిస్తున్నాడట. 'స్మర గరళఖండనం మమ శిరసి మండనం దేహి పదపల్లవ

ముదారం' అని శ్రీకృష్ణుడు మన్మథవిషంతో ఉద్రేకించిన తన శిరస్సుపైని రాధ పదపల్లవ మనే చిగురాకును ఔషధంగా చేర్చమని రాధను ప్రాధేయపడుతూ అడుగుతున్నట్లు రచించి, ఇసీ, భగవంతు డంతటివాని తలపై స్త్రీపాదాలను చేర్చడంగురించి వ్రాయడమేమిటని తోచి ఆ పంక్తులను కొట్టివేసి, జయదేవుడు అభ్యంగన స్నానానికి వెళ్ళాడట. ఆ తర్వాత శ్రీకృష్ణుడు ఒంటికి నూనె రాచుకొన్న జయదేవుని రూపంలోవచ్చి, పద్మావతిని గంటమూ ఆకులూ అడిగి, ఆ కొట్టివేసిన పంక్తులనే తిరిగి వ్రాసి వెళ్ళాడట. అభ్యంగనమయిన తర్వాత జయదేవుడు వచ్చి, ఆ పంక్తులు తిరిగి ఎవరు వ్రాశారని భార్యనడిగితే ఆమె మీరేవచ్చి వ్రాశారుగదా, ఇవిగో, అప్పటి తైలపుచుక్కలు కూడా పత్రంపైని పడివున్నాయని చూపిందట. శ్రీకృష్ణు డామెకు ఆ రూపంలో ప్రత్యక్షమై ఆ పంక్తులను తిరిగివ్రాసి, ఆ భావం ఉచితమైనదే అని తనకు స్ఫురింపజేసినందుకు జయదేవుడు పొంగిపోయి భార్య నభినందించి, ఆ చరణం 'జయతి పద్మావతీరమణ జయదేవకవి భారతీ భణిత మతిశాతం' అని పూరించాడట. దీనిని సంగీత సాహిత్యజ్ఞులు 'దర్శనాష్టపది' అంటూంటారు. కృష్ణ దర్శనము జరిగినది కనుక దీనికే మరొక సంఘటనవలన 'సంజీవనీ అష్టపది' అనికూడా పేరు.

జయదేవుని గీతగోవిందం వంటిదే రాజయిన లక్ష్మణసేనుడు కూడా రచించాడు. కాని ఆనాటి ప్రజలు జయదేవుని అష్టపదులపైని చూపే ఆదరం రాజు అష్టపదులపై చూపలేదు. రాజుకు అసూయ పుట్టింది. ఒకరోజున పండిత సమక్షంలో జయదేవుని పిలిపించి అతని గ్రంథాన్ని తెప్పించి తమ యిద్దరి రచనలలోను ఏది గొప్పదో తెలుసుకోడానికిగాను, రెండింటిని ఆలయంలో జగన్నాథుని సన్నిధిని ఉంచాడట. మర్నాడు తలుపులుతెరచి చూస్తే జయదేవుని గ్రంథం దేవుని శిరస్సుపైనీ, రాజు గ్రంథం క్రింద దూరంగానూ పడిఉన్నవట. రాజు గర్వము తగ్గి, కవికి సాష్టాంగపడి, అతన్ని మెచ్చుకొని గౌరవించాడట. అలాగే ఒకనాడు ఆ రాజు పట్టమహిషి పద్మావతి పతిభక్తిపరాయ తను అందరూ మెచ్చుకొంటూంటే విని ఈర్ష్య పడిందట. రాజు కవుతోకలిసి వేటకై గ్రామాంతరం వెళ్ళినపుడు జయదేవుడు వేటలో పులివాతపడి మరణించాడని మహారాణి ఒకనాడు పద్మావతికి కబురంపింది. దుర్వార్తవిన్న పద్మావతి వెంటనే మొదలు నరికిన తరువులా కూలి, అచేతనురాలై పోయింది పరివారంతో తిరిగి వచ్చేసరికి పద్మావతి మరణవార్తను. దానికి కారణమూ తెలుసుకొని, రాజు రాణిపై కోపించి శిక్షింపబోయాడు. జయదేవుడు అతనిని వారించి, 'భగవంతుని అనుగ్రహం ఉంటే ఆమె తిరిగి జీవించవచ్చని' చెప్పి, 'వదసి యది కించిదపి' అనే (19 వ అష్టపది) 'దర్శనాష్టపది'ని గానంచేశాడు. పాట పూర్తికాగానే ఆమె ముఖంపై నీళ్ళుచల్లి చూస్తే. ఆమె అందరికీ విస్మయంగలిగేట్టు కళ్ళు విప్పి లేచిందట ఈ సంఘటనవల్ల దీనికి 'సంజీనీ అష్టపది' అనికూడ ప్రతీతి వచ్చింది.

సాహిత్యరీత్యా గీతగోవిందం ఆలంకారికులకు ప్రామాణికమయింది. సాహిత్యదర్పణకారుడైన విశ్వనాథుడు (14 వ శతాబ్దం) జయదేవుని వృత్త్యను ప్రాసలను ఉదాహరించాడు. 24 అష్టపదులతో, 80 కి మించిన శ్లోకాలతో కూడిన 12 సర్గల గేయప్రబంధం, గోవిందునిగూర్చిన గేయప్రబంధం కనుక గీతగోవిందం. ఏ పంక్తి చూచినా రసం చిప్పిల్లుతూ, హృదయాన్ని పరవశంచేసే మధురకోమల కాంతములైన పదాలు.

'యది హరిస్మరణే సరసం మనో
యది విలాస కలాసు కుతూహలం
మధుర కోమల కాంత పదావళీం
శ్రుణు తదా జయదేవ సరస్వతీమ్'

అని తన శబ్ద మాధుర్యమును గూర్చి తానే చెప్పుకొనగల్గిన ఆత్మవిశ్వాసమూ శిల్పచాతుర్యమూ కల మహాకవి. ఇతని అష్టపదులలో కీర్తిధవళము, మంగళాచారము, భ్రమరపదము, గరుడపదమువంటి దేశి ప్రబంధరీతులు కనిపిస్తాయి. 'ప్రళయ పయోధిజలే' అను దశావతారాష్టపది కీర్తిధవళము. ఇది సంగీత లక్షణకర్తలు ప్రబంధాధ్యాయాలలో స్పష్టీకరించిన ధవళప్రబంధంగా మాత్రమే కాక, తెలుగు మధురకవితా రీతులలో ఒకటయిన ధవళంగా కూడా మనం గుర్తించవచ్చు. అలాగే ద్వితీయాష్టపది 'శ్రితకమలాకుచమండల' అనేది మంగళాచార ప్రబంధం.

భ్రమర పదాని కుదాహరణం :

చందన చర్చిత నీలకళేబర పీతవసన వనమాలీ
కేళిచలన్మణి కుండలమండిత గండయుగస్మితశాలీ.
హరి రిహ ముగ్ధవధూ నికరే
విలాసిని విలసతి కేళి పరే.

గరుడపదాని కుదాహరణం :

వహతి మలయ సమీరే మదన ముపనిధాయ
స్ఫుటతి కుసుమ నికరే విరహి హృదయ దళనాయ
తవ విరహే వనమాలీ, సఖి సీదతి, రాధే

ఇతని దశావతారపదంలో దశరథరాముని తర్వాత బలరాముడు. ఆ తర్వాత బుద్ధ, కల్క్యవతారములు వస్తాయి కాని, కృష్ణునిగూర్చిన చరణం లేదు. దీనిని బట్టి కృష్ణుడే మూలవిరాట్టయిన శ్రీ మహావిష్ణువు అనీ, మిగిలినవన్నీ అతని అవతారాలనీ జయదేవుని అభిప్రాయమని అనుకోవచ్చు.

మత్స్యః కూర్మ వరాహశ్చ నారసింహశ్చ వామనః
రామో రామశ్చ రామశ్చ బౌద్ధః కలికి మేవచ....

అని వ్యవహారంలోఉన్న శ్లోకంకూడా జయదేవుని అభిప్రాయాన్ని ధ్రువపరుస్తుంది. రాధా గోవిందుల ప్రణయ, విరహ, విశ్లేష, కలహ, ఖండన, సానునయ, సమాగమ, సంధానములద్వారా జీవబ్రహ్మైక్య సంధాన వేదాంతం వ్యంజిత మవుతోందని గీతగోవింద పరమార్థం తెలిసిన పెద్దలు చెపుతారు. 11వ శతాబ్దంలో వంగదేశంలో ప్రారంభమై, ఆ తర్వాత అక్కడ వెలసిన చండీదాసాది మహాకవుల కవితలోను, ఇంకా భారతదేశమంతటా 15, 16 శతాబ్దాలలో కబీరు, తులసీ, సూర్‌దాస్, మీరాల కవితలలోను, కర్ణాటకంలో పురందరదాసు, ఆంధ్రంలో లీలాశుకుడు, అన్నమాచార్యులు, నారాయణతీర్థులు, రామదాసు మొదలయినవారి కవితల్లోను వ్యాపించిన భక్తి కవితావాహినికి జన్మస్థానమైన గంగోత్రి జయదేవుని గీతగోవిందమే! భక్త మీరాబాయి భర్త అయిన మహారాణా కుంభకర్ణుడు (మేవార్) గీతగోవిందానికి రసికప్రియ అనే వ్యాఖ్యానం వ్రాశాడు. శంకరమిశ్రుడనే అతడు రసమంజరి అనే వ్యాఖ్యానం, ఆరవీటి తిరుమలరాయని ఆస్థానంలోఉన్న చెరుకూరి లక్ష్మీధరుడు శ్రుతిరంజని అనే వ్యాఖ్యానం రచించాడు. వీనిలో అలంకారశాస్త్రం, కామశాస్త్రం, భరతనాట్య శాస్త్రమునుంచి అనేక ప్రమాణముల నుదాహరణములుగా గీతగోవిందాష్టపదులను వ్యాఖ్యానించారు.

## సంగీతం:

జయదేవుడు గీతగోవిందాన్ని పాటలుగా పాడుతూనే రచించాడనీ, అప్పు డతని భార్య నాట్యంచేస్తూ అభినయించేదనీ, అంతేగాక, పరాశరుడూ మొదలయిన మిత్రులుకూడా అష్టపదులను గానం చేసేవారని తెలుసుకున్నాము ఈనాటికీ వంగదేశంలోని కేందులీ గ్రామంలోను, ఒరిస్సాలోని పూరీజగన్నాథ దేవాలయంలోను అష్టపదులను పాడుతూంటారు. వీటికి వంగదేశంలో ఒక ఫక్కీ, ఓఢ్రదేశంలో ఒక ఫక్కీ, ఆంధ్రదేశంలో ఒక ఫక్కీ, అలాగే తమిళ, కర్నాటక, మళయాళ దేశాలలో రెండు మూడు ఫక్కీలు ఉన్నాయి. అచ్చయిన పుస్తకాలలోకూడ, ఒకే కీర్తనకు రెండు మూడు రాగాలచొప్పున ఉంటాయి. కాలక్రమేణా ఆ యా ప్రాంతాలలో సంగీత పరిణామాన్ననుసరించి విద్వాంసులో, భజన సంకీర్తనపరులో తమ కాలానికి ప్రయోగంలోఉన్న రాగాలను గ్రంథస్థంచేసి ఉండవచ్చును. జయదేవునికి ఒక శతాబ్దం తర్వాతివాడయిన శార్ఙ్గదేవుడు జయదేవుని రాగాలను ప్రాక్ప్రసిద్ధరాగాలని ప్రత్యేకించాడు. అంటే ఒకప్పుడు ప్రాచీనకాలంలో ప్రయోగంలోఉండి, తర్వాత వెనుకబడిన వని సాంబమూర్తిగారు

అర్థం చెప్పుతున్నారు. నూరేండ్ల లోనే ఆ రాగాలు వెనుకబడడం సంభవం కాదేమో అనుకుంటే ప్రాక్ప్రసిద్ధరాగాలు అనే పదానికి వంగ, ఓఢ్ర ఆంధ్ర మొదలయిన తూర్పుదేశాల్లో ప్రచారంలోఉన్న రాగాలు అని అర్థం చెప్పుకోవచ్చునేమో. శార్ఙ్గదేవుడు పశ్చిమ ప్రాంతమైన మహారాష్ట్రంలోని దేవగిరిలో ఉన్నవాడు కనుక, ఆ అర్థం సమంజసమే కావచ్చు. మాలవ, ఘూర్జరి, వసంత, రామక్రియ, మాళవగౌడ, కర్ణాట దేశాఖ్య, దేశవరాళి, గుణకరి, భైరవి, విభాస, వరాళి రాగములలో రూపక, నిస్సార యతి ఏకతాళి తాళాలలో పాడవలెనని యీ అష్ట పదులముందు వ్రాయబడింది. 17 వ శతాబ్దంలో తిరుమల్రాజ పట్ననివాసి, కామకోటి పీఠాధిపతికి భక్తుడూ అయిన రాముడు భాగవతార్ యీ అష్టపదులకు దక్షిణాదిని ప్రామాణికంగా ప్రచారంలోవున్న సంగీత స్వరాలను రచించాడు.

జయదేవుని గీతగోవింద రచానాపద్ధతిలో శ్రీ చంద్రశేఖర సరస్వతీ స్వామి శివాష్టపదీ, రామకవి రామాష్టపదీ, వేంకటమఖి త్యాగరాజేశ్వరాష్టపదీ రచించారు. ఇంకా స్కందాష్టపదీ, గీతాసుందరము అను ప్రబంధాలు యీ ఫక్కీనే రచింపబడ్డాయి. 1704 మొదలు 1713 వరకు మైసూరు రాజ్యమునేలిన కంఠీరవ రాజుపేర కట్టవె వీరరాజు అనే వాగ్గేయకారుడు రచించిన సంగీత గంగాధరము, పార్వతి పరమేశ్వరులు నాయికానాయకులుగా, అక్షరాలా గీతగోవిందమును అనుసరించి చేసిన ప్రబంధమే.

## గీతగోవింద సర్గ విభాగము – ఇతివృత్త వివరణము :

ప్రథమ సర్గః (సామోద దామోదరం)

1 వ అష్టపది : విష్ణువు దశావతారములను వర్ణించే కీర్తిధవళం.

2 వ అష్టపది : వనమాలాధారియైన కృష్ణుని పొగడే మంగళాచార ప్రబంధం.

3 వ అష్టపది ; వసంతాగమన వర్ణనం.

4 వ అష్టపది ; గోపీగణ పరివృతుడయిన శ్రీకృష్ణుని గురించి సఖి రాధకు వర్ణించి చెపుతుంది.

ద్వితీయ సర్గః (అక్లేశ కేశవం)

5 వ అష్టపది : రాధ గోపికాగణంతో కృష్ణుని రాసలీలను వర్ణించి సఖికి చెపుతూ కృష్ణుని ప్రేమకు పాత్రురాలు తానొక్కతే కాదనీ, అయినా అతడు ఎన్ని నేరాలుచేసినా తన మనస్సు కృష్ణాను రక్తమే అనీ, తాను అతనితో పొందిన మధురానుభవం మరచి పోలేనని అంటుంది.

6 వ అష్టపది : ప్రణయార్తయైన రాధ సఖిని దూతికగా భావించి, తన మనసులోని కోరికలన్నీ ఆమెకు నివేదించి, కృష్ణునకు, తనకు సమాగమం ఏర్పాటుచేయ మంటుంది

తృతీయ సర్గః (ముగ్ధ మధుసూదనం)

7 వ అష్టపది : గోపీగణ పరివృతుడైన తన్నుచూసి తన ఉదాసీనతకు రాధ కోపగించి వెళ్ళిపోయిందని కృష్ణుడు మనసులో పశ్చాత్తాపంతో పరితపించడం.

చతుర్థ సర్గః (స్నిగ్ధ మధుసూదనం)

8. 9 అష్టపదులు : రాధ చెలికత్తె యమునాతీర నికుంజంవద్ద నున్న శ్రీకృష్ణుని కలిసికొని, అతనితో రాధ విరహావస్థలను వర్ణిస్తుంది.

పంచమ సర్గః (సాకాంక్ష పుండరీకాక్షం)

10 వ అష్టపది : కృష్ణునివద్దనుంచి రాధవద్దకు తిరిగివచ్చిన దూతిక యమునాతీరంలో కృష్ణుడు రాధకోసం యెలా విరహతప్తుడై ఉన్నాడో వర్ణిస్తుంది (గరుడపదం).

11 వ అష్టపది ; యమునాతీరంలో ధీరసమీరం వీస్తూండగా, వనమాలి రాధ ఆగమనాన్ని నిరీక్షిస్తున్నాడని చెప్పి రాధను వేగంగా కృష్ణుని వద్దకు పొమ్మంటుంది సఖి.

షష్ఠసర్గః (సోత్కంఠ వైకుంఠం)

12 వ అష్టపది ; కృష్ణునివద్దకు తిరిగివచ్చిన దూతిక, రావడానికి అశక్తురాలై రాధ పక్షి కదలినా, ఆకు రాలినా దిక్కులుచూస్తూ కృష్ణుని రాకకై నిరీక్షిస్తోందని చెపుతుంది

సప్తమ సర్గః (నాగర నారాయణం)

13 వ అష్టపది : చంద్రోదయమైనా కృష్ణుడు నిర్ణీత సమయానికి సంకేతస్థలానికి రాలేదని రాధ వాపోతుంది.

14 వ అష్టపది : తనకంటె అధిక గుణవంతురాలయిన వేరెవ్వతెతోనో కృష్ణుడు విహరించాడని రాధ దుఃఖిస్తుంది

15 వ అష్టపది : స్వాధీనపతికయైన వేరొక రమణితో కృష్ణుడు యమునాపులిన వనమందు విలాసవిహారాలలో తేలుతూంటే తానా పొదరింటిలో అతనికై ఎదిరుచూసి ఏమి ప్రయోజనమని రాధ సఖిని ప్రశ్నిస్తుంది.

16 వ అష్టపది ; కృష్ణుని సన్నిధిభాగ్యంపొందిన గోపిక సుఖములను, విరహంలో కుందుతున్న తన సంతాపాన్ని పోల్చుకుంటూ రాధ చెలికత్తెతో వలపోసికొంటుంది.

అష్టమ సర్గః (విలక్ష లక్ష్మీపతి)

17 వ అష్టపది : మరునాటి ఉదయం కృష్ణుడు వచ్చి క్షమాపణ వేడుకోగా, ఖండితయైన రాధ కోపంతో అతనిని వచ్చిన దారినే వెళ్ళమని దూషిస్తుంది.

నవమ సర్గః (అమంద ముకుందం)

18 వ అష్టపది : కృష్ణుడు వెళ్ళిపోయాడు. వసంత వాయువు వీచేవేళ కృష్ణుడు తిరిగివస్తాడు. అతనిపై కోపించకు సుమా అని సఖి రాధను అనునయిస్తుంది.

దశమ సర్గః (చతుర చతుర్భుజం)

19 వ అష్టపది : సాయంకాలం కృష్ణుడు రాధను చేరుకొని ఆమెను పొగుడుతూ తనపై కోపంవీడి, తన అపరాధానికి తగిన దండనగా ఆమె పదపల్లవాన్నిమ్మని వేడుకొంటాడు.

ఏకాదశ సర్గః (సానంద దామోదరం)

20 వ అష్టపది : చెలికత్తె, కోపం విడిచి కృష్ణుని అనుసరించి వెళ్ళమని రాధను ప్రోత్సహిస్తుంది.

21 వ అష్టపది : మంజుతర కుంజతలకేళిసదనానికి వెళ్ళి మాధవుని చేరుమని సఖి రాధను ప్రబోధిసుంది

22 వ అష్టపది : సాలంకృతయైన రాధ సంకేత లతాగృహం చేరి కృష్ణుణ్ణి కలిసికొంటుంది.

ద్వాదశ సర్గః (సుప్రీత పీతాంబరం)

23 వ అష్టపది : కృష్ణుడు రాధతో పలికిన ప్రణయ వాక్కులు.

24 వ అష్టపది : ప్రణయ సమాగమ మాధుర్యానుభవం పొందిన రాధ కృష్ణునితో పలికిన మధుర వచనాలు.

* * *

'సాధ్వీ, మాధ్వీక చింతా న భవతి భవతః శ్శర్కరే కర్కశాసి
ద్రాక్షే ద్రక్ష్యంతి కేత్వా మమృత మృతమసి, క్షీర నీరం రసస్తే
మాకంద క్రంద, కాంతాధర ధర నతులాం, గచ్ఛ యచ్ఛన్తి భావం
యావచ్ఛృంగార సారం శుభమివ జయదేవస్య వైదగ్ధ్యవాచః'

అని జయదేవుడు తన కవితామాధురిని గురించి తానే చెప్పుకొన్నాడు.
ఈ శ్లోకపు తాత్పర్యం :–

' ఓ ఇప్పపూదేనియా ! జయదేవుని కవితతో సమానత పొందగోరి చింతించడం నీకు తగదు;

ఓ చక్కెరా! నీకు కర్కశభావం ఉందిసుమా; ద్రాక్షా నీ ముఖం చూచేవా రెవరు ?

అమృతమా ! రామమాత్రానికేగాని, నీవు మృతవే: ఓ క్షీరమా నీ రసమంతా నీరమయం.

ఓసి తియ్యమామిడి ! నీ పని ఆక్రందనమే. కాంతాధరోష్ఠమా ! నీవు తులతూగలేవు పో !

జయదేవుని పదగ్ధవాక్కులు శుభములనే కాక సమస్త శృంగారరసాన్ని ఇస్తున్నవి.'

ఈ జయదేవుడు గీతగోవిందాన్నే కాక, చంద్రాలోకము, రతిమంజరి, కారకవాదము, తత్త్వచింతామణి అనే గ్రంథాలుకూడా రచించాడట. ప్రసన్న రాఘవ మను నాటకమును రచించిన కవీ, శృంగార మాధవీయచంపు వను గ్రంథాన్ని రచించినకవీ వేర్వేరు జయదేవ నామకులుకాని, గీతగోవింద కర్తకాదు.

## ఆరవ అధ్యాయము

# లీలాశుకుడు

జయదేవుని తర్వాత యావద్భారత విఖ్యాతిపొందిన వాగ్గేయకారులలో లీలాశుకుడు అగ్రగణ్యుడు. ఇతడు సంగీత శాస్త్రములోగాని, గానంలోగాని ప్రత్యేకంగా కృషిచేసి ప్రసిద్ధిపొందినట్లు చెప్పటానికి తగిన ఆధారాలు లేవుగాని. ఈ మహాకవీ, పరమభక్తాగ్రేసరుడూ రచించిన కృష్ణకర్ణామృత శ్లోకాలు గానముచేయని సంగీత సభలుగాని, భజనగోష్ఠులుగాని ఈనాటికి ఉత్తర భారతంలోగాని, దక్షిణ భారతంలోగాని లేవనిచెపితే అతిశయోక్తికాదు. సభలలో రాగమాలికలుగా విద్వాంసులు గానంచేసే శ్లోకాలు మాత్రమే కాకుండా తాళలయాన్వితములై మృదంగాది వాద్యములతోసహా పాడతగినవీ, నృత్యాభినయములతో సామాజికులకు పరవశము కలిగించేవి, నిబద్ధ గేయములనదగిన వృత్తచ్ఛందస్సులీయన కృష్ణకర్ణామృతంలో సగానికిమించి ఉన్నాయి. అందుచేతనే నారాయణతీర్థుల తరంగాలనూ క్షేత్రయ్య పదాలనూ పాడి నృత్యాభినయ ప్రదర్శనలద్వారా కూచిపూడివారు తరతరాలుగా ఆంధ్ర మహాజనులను భక్తి పరవశులనుచేశారు. చాగంటి శేషయ్యగారుఆంధ్రకవి తరంగిణిలో లీలాశుకుడు 13 వ శతాబ్దిలో ఉన్నవాదని వ్రాశారు, జయదేవుని తర్వాత నూరేండ్ల వాడయిన లీలాశుకుడు ఆంధ్రదేశీయుడని చాలమంది విద్వాంసుల అభిప్రాయము. ఓ. సి. గంగూలీ మొదలయిన పరిశోధకులితడు ఉత్కళుడనికూడా అన్నారు. ఉత్కళాంధ్రాలు చరిత్రలో చాలసార్లు ఒకదానినొకటి ఆక్రమించి ఉండినట్లుఆయా రాజ్యాల, వంశాల గాథలవల్ల తెలుస్తుంది. ఏ గజపతులో కొండవీటివరకూ జయించి అదంతా ఉత్కళమో కళింగమో అంటే, ఏ కృష్ణరాయడో కటకంవరకూ జయించి అదంతా కర్నాటకమో, ఆంధ్రమోఅని పిలుచుకొన్న చరిత్రఘట్టాలు చాలాఉన్నాయి. కొండవీడూ, రాజమండ్రీ రెడ్డిరాజులు కళింగాన్నీ, కళింగదేశపు గాంగరాజులు ఆంధ్రప్రాంతాన్నీ ఉండుండి జయించుకొనేవారు. అందుచేత ఇతడా సరిహద్దు సీమవాడు కావచ్చు. సాధారణంగా సంస్కృతకావ్యాలన్నీ సర్గలుగా విభజింపబడి ఒక్కొక్కసర్గ ఏ వృత్తచ్ఛందస్సులో ప్రారంభమవుతుందో ఆ ఛందస్సులోనే సర్గ అంతా నడిచి సర్గాంతశ్లోకాలు అంతకంటె పెద్ద చరణాలుగల వృత్తాలతో ముగుస్తాయి. ఆంధ్రకవులు మాత్రం తమ తెలుగు ప్రబంధాలను. కావ్యాలను (ద్విపదకావ్యాలు తప్ప) ఆశ్వాసాలుగా విభజించారు. భాగవతం స్కంధాలూ, రామాయణం కాండలూ, భారతంపర్వాలూ అయినా వృత్తాలూ, సీసాలు, కందాలు,

గీతాలు ఇత్యాదిగా ఒక్కొక్క ఆశ్వాసాన్ని స్వేచ్ఛగా అన్ని ఛందస్సులతోను నింపారు. కృష్ణ కర్ణామృతం 3 ఆశ్వాసాలుగా రచింపబడి. ప్రారంభించిన వృత్తమే ఆశ్వాసమంతటా నడవక యథేచ్ఛగా వృత్తభేదా లెన్నో మారి మారి రావడంచేత, తత్కర్తయైన లీలాశుకుడు తప్పకుండా ఆంధ్రుడేయని స్పష్టంగా చెప్పవచ్చు. ఇతన్ని ఆంధ్రదేశీయుడన్న విద్వాంసులూ, ఉత్కళు డన్నవారూ కూడ, ఆంధ్రదేశంలో నాటకంగా బహుజనాదరణ పొందిన చింతామణి కథలోని బిల్వమంగళుడే లీలాశుకుడని ఒప్పుకొన్నారు. దాని కాధారం కర్ణామృతంలోని మొదటి శ్లోకమే.

'చిన్తామణి ర్జయతి సోమగిరి ర్గురుర్మే
శిక్షా గురుశ్చ భగవాన్ శిఖిపింఛమౌళిః
యత్పాద కల్పతరు పల్లవశేఖరేషు
లీలాస్వయంవర రసం లభతే జయశ్రీః'

వ్యాఖ్యాత లీ శ్లోకానికి పరిపరి విధాల వ్యాఖ్యలు చెప్పారు. చింతామణి అంటే అదొక మంత్రమనీ, ఆ మంత్రం జపించిన కవి కృతార్థుడై ఉపదేశకు డయిన సోమగిరి గురువును స్మరించాడని ఒక వ్యాఖ్య ; లేదా చింతామణి అను పేరుగల ఒక యోగివద్ద యోగాభ్యాస శిక్షపొందినట్లూ, కవి ఆ గురువునకు జయమాకాంక్షించినట్లొక వ్యాఖ్యానం : శ్రీకాకుళేశ్వరానుగ్రహమున నిర్మలాంతః కరణయై భక్తురాలుగా మారిన చింతామణిని స్మరించాడని ఒక ఊహ ; చింతామణి వలె అభీష్టప్రదాయినియైన సోమగిరియను వేశ్యవలన జ్ఞానోపదేశం పొందినట్లొక ఊహ ; లేదా చింతామణి మంత్రోపదేశం చేసిన మహాయోగి సోమగిరి గురువునకు జయమని ఇంకొక వ్యాఖ్యానం.

చింతామణికథ సుప్రసిద్ధమే వేశ్యయందు బద్ధానురాగుడైన బిల్వమంగళుడు పతివ్రతయైన భార్యనూ, రోగగ్రస్తుడై మరణాపన్నుడైన తండ్రిని కూడ లక్ష్య పెట్టక, కామాంధుడై గాలివానలో పొంగివచ్చే ఏటిలో తేలిపోతున్న ఒక శవాన్ని చెట్టుమాను అనుకొని దానిసాహాయ్యంతో ఏటి కెదురీది తలుపులు బంధించి ఉన్న ప్రియురాలి మేడపైని వేలాడుతున్న పాము నొకదానిని తాడు అనుకొని పట్టుకొని పైకెక్కివెళ్ళి చింతామణిని కలుసుకొంటాడు. అప్పటికే జ్ఞాన ప్రబోధం కలిగిన ఆమె అలంకారశూన్యమైన సామాన్య వేషంతో అతని నెదుర్కొని తుచ్ఛశారీరక సుఖాలపై విరక్తి కలిగిస్తుంది. జ్ఞానోదయం కలిగిన బిల్వమంగళుడు కళ్లు పొడిచివేసుకొని శ్రీకృష్ణభక్తుడైన లీలాశుక మహాకవిగా కృష్ణ సాక్షాత్కారం పొందిన ఆవేశంలో కర్ణామృతగానం చేసాడు. ఈ భక్తి అతనికి కలగడానికి కారణం చింతామణికి ముందుగానే ఉపదేశం చేసిన సోమగిరి అనే యోగి. ఇది నాటకంలోని కథ. 15 వ శతాబ్దిలో అక్బర్ చక్రవర్తికి సమకాలికుడై మహా

భకుడూ వ్రజభాషలో వాగ్గేయకారుడూ అయిన సూర్‌దాస్ గురించి అక్షరాలా ఇదే కథ — ఇవే సన్నివేశాలు. హిందీ రామాయణకర్త, కీర్తనకర్త అయిన తులసీ దాస్ చరిత్రలోకూడా కొంతవరకు ఇలాంటి సంఘటనలతోకూడిన కథే చెపుతారు. తులసీదాసు మాటేమైనా సూర్‌దాస్ లీలాశుకుడా అని కొంతకాలం కొందరు సంఘటన సామ్యాన్నిబట్టి అనుకొన్నా హిందీ సాహిత్యచరిత్రలో సూర్‌దాస్ జీవిత సంఘటనలు, తిరిగిన ప్రదేశాలూ, అతని రచనలూ అన్నీ స్పష్టంగా పరస్పర సంబంధం కలిగిఉన్నాయి. కర్ణామృతకర్తకూ, సూర్‌దాస్‌కూ వారి రచనలనుబట్టి అవి కృష్ణాంకితము కావడంతప్ప మరొక సామ్యం లేదు. సూర్‌దాస్ రచనల్లో అతని అంధత్వం గురించి ఉంది. కర్ణామృతకర్తకు అంధత్వం ప్రాప్తించినట్లు అతనిరచనలో యెక్కడా మనకు స్ఫురించదు బాలకృష్ణుని దివ్యమంగళవిగ్రహాన్ని అతిలోకసుందరంగా దర్శించి తనివితీరకుండా వర్ణించిన వైవిధ్యంలో అతని నయనాలు మానవాతీతమైన దృష్టిని కలిగి ఉండినవా అనికూడా అనిపిస్తుంది.

కృష్ణ కర్ణామృతం భారతీయ భాషల్లోకెల్లా ఒక్క ఆంధ్రభాషలోకే పరివర్తితమైంది. తెనిగించినవాడు 16వ శతాబ్ది తొలిసగంలో ఉండిన వెలగపూడి వెంగాగ్రణి. ఇదికూడా లీలాశుకుడు ఆంధ్రదేశీయుడే అనడానికి తోడ్పడుతుంది. వేరే పై ఆధారాలు లేనందున, ఇతని జీవిత విశేషాలు ఇంకా అధికంగా ఏమైనా తెలుసుకోవాలంటే కర్ణామృతమే ఆధారం.

'శైవావయం నఖలు తత్ర విచారణీయం
పంచాక్షరీ జపపరా నితరాం తథాపి
చేతో మదీయ మతసీ కుసుమావభాసం
స్మేరాననం స్మరతి గోపవధూకిశోరం'

తాను జన్మతః శైవుడై, నిత్య పంచాక్షరీ జపపరాయణుడైనా అతని మనస్సు మాత్రం యశోద ముద్దుబిడ్డని శ్యామసుందరమూర్తినే స్మరిస్తుందట. ఓ సంధ్యావందనమా, నీకు శుభం, దయచేయి, ఓ స్నానమా నమస్తే; ఓ దేవత లారా, పితరులారా, ఏదో మారుమూల కూర్చొని కంసారియైన యాదవమూర్తిని స్మరించి స్మరించి పాపముక్తి పొందితే అంతేచాలు; ఇతర విషయాలంటే నాకు లెక్కేమిటి ? అని రెండో అశ్వాసంలోని 106వ శ్లోకంలో అంటాడు.

'మాతర్నాతః పరమనుచితం యత్ఖలానాం పురస్తాత్
అస్మాశంకం జఠరపిఠరీ పూర్తయే నర్తితాసి,
తత్ క్షన్తవ్యం సహజసరళే వత్సలే వాణి కుర్యాం
ప్రాయశ్చిత్తం గుణగణనయా గోపవేషస్య విష్ణోః'

అమ్మా, వాణీ తొలిరోజులలో నా కడుపు కక్కుర్తికోసం నిన్ను జంకు లేకుండా అనర్హులముందు నాట్యం చేయించాను. అంతకంటె అనుచితం మరొకటుందా ? సహజ సరళవు, వాత్సల్యపూరితవు అయి ఆ అపరాధాన్ని క్షమించమ్మా. దానికి ప్రాయశ్చిత్తంగా విష్ణుని గోపకిశోరావతారాన్ని స్తుతిస్తాను' అని ద్వితీయాశ్వాసంలోని 4 వ శ్లోకంలో అన్నాడు. దీనినిబట్టి లీలాశుకుడు కర్ణామృత రచనకు ముందు మానవమాత్రుడైన ఏ రాజుకో అంకితంగా కొన్ని కావ్యాలు చెప్పి, డబ్బు గడించి ఉంటాడు. దానికి తర్వాత పశ్చాత్తాపం చెంది కృష్ణభక్తుడయాడు. ద్వితీయాశ్వాసంలోనిదే 34వ శ్లోకంకూడా లీలాశుకుని జీవిత చరిత్ర పరిశోధనకు ఉపకరింపగలదేమో.

'మాయాత పాంథాః పథిభీమరథ్యా
దిగంబరః కోపి తమాలనీలః
విన్యస్త హస్తోపి నితంబబింబే
ధూర్తస్సమాకర్షతి చిత్తవిత్తమ్'

ఓహో పాంథులారా, భీమరథి ఒడ్డున ఉన్న బాటను ప్రయాణించకండి పిరుదులమీద చేతులు పెట్టుకొని నల్లని దొంగ ఒకడు కాచుకొని ఉన్నాడు. అతడు మీ హృదయధనాన్ని కొల్లగొట్టిపోగలడు.

యమునానదిని గురించి కర్ణామృతంలోనే ఎన్నోశ్లోకాలున్నాయి. మరే యితర నదిని గురించిన ప్రశంసాలేదు - ఒక్క భీమరథి తప్ప. భీమరథి ఒక్కటీ అతని మనస్సులోనుంచి పైకి రావడానికి ప్రత్యేక కారణం ఉండాలి. తెనాలి రామకృష్ణకవి తన పాండురంగ మాహాత్మ్యంలో భీమరథిని గురించి పలుచోట్ల చెప్పాడు.

పంచమాశ్వాసం, 260 పద్యం :

అలఘు దివ్యాకల్పములు చూడగలవాని
భీమరథ్యాపగా సీమవాని....

అదే ఆశ్వాసం, 158 వ పద్యం ;

భైమీతీర్థ నివాసు రాసకుశలున్ పద్మేక్షణున్ యాదవ
స్వామిన్ సామజ వత్సలున్ గొలిచి....

చతుర్థాశ్వాసం, 13 వ పద్యం :

'మువ్వంక మురువుతో మురళి యొకొక్క వేళ (త్రిభంగి)
మ్రోయించు భువనైక మోహనముగ
క్రీడించు నొకవేళ తోడి బాలుర గూడి
అక్షీణగతి కుబేరాక్ష కేళి

సవరించు నొకవేళ జలవిహారము చాల
ప్రేమ భీమరథీగభీరవారి
కొలువుండు నొకవేళ నలినసంభవ పుండ
రీకాక్షాదులు ప్రీతి గొలువ
ఉరగ రిపువాహనమున నొక్కొక్కవేళ
వేడ్క వేంచేసి మెరయు తిర్వీథులందు
ఎన్ని కల్పంబు లరిగిన నేన యేండ్ల
వెలయు ప్రాయంబు గల కొయ్య విట్ఠలయ్య.

రామకృష్ణకవి పాండురంగమాహాత్మ్యం మహారాష్ట్రదేశంలో షోలాపూరుకు దగ్గరగా భీమరథీనది ఒడ్డున ఉన్న పండరీపురంలోని పాండురంగ విఠలుని మాహాత్మ్యమును గురించి చెప్పిన ప్రబంధం (కావ్యం). ఈ విఠలదేవుడు నందయశోదల సుతుడైన బాలకృష్ణుడు, కటిబద్ధహస్తుడు ... 'భైమీతీర్థనివాసి రాసకుశలుడు' కూడాను. ఈ పాండురంగ విఠలుని దర్శించుకొని, సేవించుకొని లీలాశుకుడు పొందిన కవితావేశపు ఫలితంగా కృష్ణకర్ణామృతం ఉద్భవించి ఉండవచ్చునా ? అంతమాత్రం ఊహించవచ్చునేగాని, అతడు భీమరథీతీరమందలి పండరీపుర నివాసి అనడానికింతకంటె ఇంకా ప్రబలమైన ఆధారాలు కావాలి. ఈ భీమరథితోను, పాండురంగనితోను సంబంధం ఉన్నట్లే లీలాశుకునకు తెనాలి రామకృష్ణునితోకూడ అవ్యాజానుబంధం ఉన్నట్లున్నది. సుప్రసిద్ధమైన కర్ణామృత శ్లోకం 'కస్తూరీ తిలకం లలాటఫలకే, అనేది ముక్కకు ముక్కగా మధ్యా చివరా ఒకటి రెండు చిన్న మార్పులతో రామకృష్ణుని గ్రంథంలో తెనుగుచేసినట్లు కనపడుతుంది.

కస్తూరీ తిలకం లలాటఫలకే వక్షస్థలే కౌస్తుభం
నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం కరే కంకణం
సర్వాంగే హరిచందనం చ కలయన్ కంఠేచ ముక్తావళిః
గోపస్త్రీ పరివేష్టితో విజయతే గోపాలచూడామణిః....

అరచంద్రులోని చిహ్నాంశంబునుం బోలె
నుదుట కస్తురిబొట్టు పదనుకొనగ
గగనంబు నందలి ఖర మరీచియు బోలె
ఉరమున కౌస్తుభం బొరపు మీర
సుర భూజశాఖల చుట్టు తేటులవోలె
కేల పచ్చల కడియాలు మెరయ

కొదమ సంపెగమొగ తుదపొన్నవిరివోలె
ముక్కున ముంగర ముత్య మమర

నీలగిరి కప్పు వెన్నెల నిగ్గువోలె
నవకమగు మేన హరి చందనంబు వొదువ
వివిధ మణి భూషణ ప్రభల్ వెలయ ఫలిత
కల్పతరులీల రాధ యగ్రమున నిలిచి.

రామకృష్ణకవి 1530 ప్రాంతపువాడు. ఆనాటికి కర్ణామృతానికి మించి ప్రాచుర్యం లభించిందన్నమాట. అతనికి కొంచెం యించుమించు సమకాలికుడో, తరువాతివాడో అయిన వెలగపూడి వెంగాగ్రణి తెనుగుచేసిన కృష్ణకర్ణామృత పద్యాలు లీలాశుకుని ఆంధ్ర సాహితిపరులకు, భక్తిపరులకు, నృత్య సంగీతాభినివిష్టులకు మరింత సన్నిహితం చేశాయని ముందు చెప్పుకున్నాం.

ద్వితీయాశ్వాసంలోని 78 వ శ్లోకం....
'ప్రహ్వేవ భాగధేయం నిగమమహాద్రే ర్గుహాంత రాధేయమ్
నరహరి సదాభిధేయం విబుధ విధేయం మమానుసంధేయం'
ఈ శ్లోకంలోని నరసింహక్షేత్రమైన వేదాద్రి ఆంధ్రదేశంలోని కృష్ణాజిల్లాలోనిది కావచ్చు. గోదావరీ సంగమంవద్ద నరసింహక్షేత్రానికి వేదాద్రి(అంతర్వేది) అని వ్యవహారం ఉండినట్లు భీమఖండంలో ఉన్నట్లే, వరాహనరహరి క్షేత్రమయిన సింహాచలానికి కూడా వేదాద్రి అని వ్యవహారం ఉండేదేమో, అప్పుడు ఈ ప్రాంతాల్లో ఏదో ఒకటి లీలాశుకుని స్వస్థలం కావచ్చు.

'మాలా బర్హ మనోజ్ఞ కుంతలభరాం వన్యప్రసూనే క్షితాం
శైలేయ ద్రవక్లప్త చిత్రతిలకాం శశ్వన్మనోహారిణీం

లీలావేణురవామృతైకరసికాం లావణ్య లక్ష్మీమయీం
బాలాం బాలతమాలనీలవపుషాం వందే పరాం దేవతాం'
'లావణ్యవీచీ రచితాంగభూషాం
భూషాపదారోపిత పుణ్యబర్హాం
కారుణ్య ధారాశ కటాక్షమాలాం
బాలాంభజే వల్లవ వంశలక్ష్మీం.

ఈ శ్లోకాంలో శ్రీకృష్ణుని లావణ్య లక్ష్మీమయి, పరదేవత అయిన బాలగా, దేవీమూర్తిగాకూడా వర్ణించాడు. ఈ వర్ణన చూస్తే బాలాజీ అని వ్యవహరింపబడుతూ తిరుమలలో వెలసిన వేంకటరమణమూర్తిని దర్శించినప్పుడు లీలాశుకుడు ఈ శ్లోకాలు చెప్పాడేమో అనిపిస్తుంది.

13 వ శతాబ్దివాడే అయి సింహగిరి నరహరిపైని వచన మాలికాగేయాలు రచించిన కృష్ణమాచార్యుడు లీలాశుకునికి సమకాలికుడవుతున్నాడు. ఆ కాలంలో ఆంధ్రదేశాన్ని పరిపాలించిన కాకతీయరాజులు శైవమతాభిమానులు. దేశంఅంతటా శైవమతం ప్రచారంలోఉండే కాలంలో లీలాశుకుడు ఆరంభంలో. పంచాక్షరీ మంత్రోపాసకుడు కావడం సమంజసమే. కృష్ణమాచార్యుల నెలవైన సింహగిరి లాగే కాకతీయ రాజధానికి అంత సమీపంగాలేని వైష్ణవ క్షేత్రమైన వేదాద్రికి చుట్టు పక్కల ఇతడు సగం జీవితం గడిపి ఉండవచ్చును ఆ కాలంలో ఏ కాకతీయ దండనాయక మండలాధిపతులనో ఆశ్రయించి, కొంత కావ్యరచనం చేశాడు. కృష్ణభక్తి లభించాక ముందుచేసిన నరాశ్రయాన్ని గురించి పశ్చాత్తాపపడ్డాడుకూడ. ఆ కాలపువారు కాకతీయదండనాథులో, సామంతులోఅయిన గోన గన్నారెడ్డి, బుద్ధారెడ్డుల వంశం వైష్ణవాభిమానంతో సింహాచలస్వామికి కైంకర్య శాసనాలు వేయించారు. వారెవరితోనైనా సంబంధం కలిగిన వాడేమో లీలాశుకుడు। చింతామణి వేశ్యకథ జరిగి ఉంటుందనడానికి కొందరు పరిశోధకులు సందేహిస్తున్నారు. జరిగితే జరిగివుండవచ్చు. సోమగిరి గురూపదేశం అయాక ఇతడు తీర్థపర్యటనం చేసి మహారాష్ట్రదేశంలోని పండరీపుర క్షేత్రానికివెళ్ళి, అక్కడ కొంతకాలం గడిపిఉంటాడు అప్పటికే మహాభక్తుడై తిరుమలలో వేంకటేశ్వరుని దర్శించి కృష్ణుడే తన వాఙ్మయజీవితంగా ప్రకటించుకొన్నాడు.

'మదశిఖండి శిఖండ విభూషణమ్
మదన మంధర ముగ్ధ ముఖాంబుజమ్
వ్రజ వధూనయనాంచల వంచితమ్
విజయతాం మమవాఙ్మయ జీవితమ్.'

లీలాశుకుడు సరస్వతినిగూర్చి 'మాతర్నాతఃపరం' అనే శ్లోకంలో తానే చెప్పుకొన్నట్లు ఇతని కవితా సరస్వతి సహజ సరళ. చదువరికీ, శ్రోతకు, శబ్దశబ్దమునా బాలకృష్ణునిపైని వాత్సల్యమూ, కిశోరమూర్తియైన పరమాత్మపై భక్తి కలుగుతాయి.

'కరారవిందేన పదారవిందం
ముఖారవిందే వినివేశయంతం
వటస్యపత్రస్య పుటే శయానం
బాలం ముకుందం మనసా స్మరామి'

చెయ్యి అనే తామరపూవుతో పట్టుకొన్న పాదం అనే తామరపూవును ముఖం అనే తామరపూవుపై చేర్చి, వటపత్రపు దొప్పలో పండుకొన్న బాలముకుందుణ్ణి మనస్సులో స్మరిస్తాను. ఈ శ్లోకంలోని అర్థాన్ని ఇంకా ఇటువంటి ఎన్నో శ్లోకాల అర్థాన్ని నాట్యశాస్త్రవిజ్ఞులైనవారు సాభినయంగా నృత్య

ప్రదర్శనలలో చేర్చుకోవడమేకాకుండా, శిల్పులు విగ్రహాలుగాను, చిత్రలేఖకులు రేఖాచిత్రాలుగా, వర్ణచిత్రాలుగా, తీర్చి వివరించడానికి ఎంతో అమూల్య సామగ్రి ఉంది కర్ణామృతంలో.

గురూపదేశం అయిన తర్వాత యితడు వెంటనే సన్యాసాశ్రమ స్వీకారం చేసివుండడని మా ఊహ. గార్హస్థ్య వానప్రస్థాశ్రమాలలో పుత్రపౌత్రాభివృద్ధిగా గడుపుతూ తన యింటిలో పారాడు శిశుమూర్తుల లీలను తనివితీర అనుభవించినవాడై వానిని తన కవితలో కృష్ణకిశోరలీలలుగా అనువదించి ఉంటాడు. తాళ్ళపాక అన్నమాచార్యుల అనుభవంకూడా సరిగా యిదే. లోకానుభవంలో యింకొక రీతి కూడా కనబడుతుంది. తనకు సంతానం లేక, అన్నదమ్ముల సంతానాన్నో, బంధుమిత్రుల శిశువులనో ఎత్తిముద్దాడి ఆడించి, ఆ తీరని కోరికను భగవత్స్వరూపుడైన బాలకృష్ణ లీలాకథనంద్వారా తీర్చుకొన్నవాడును కావచ్చును. అయితే లీలాశుకుడు సాక్షాత్కారం పొందిన కృష్ణకిశోరమూర్తి మానవ శిశువుగా కనబడుతూ తాను పరమాత్మననే ఆత్మజ్ఞానంతో ఒక్కొక్కసారి పూర్వావతార స్మృతితో తానే మైమరచి ఒక్కొక్కసారి మనకు పరమాద్భుతం కలిగించి మైమరపిస్తాడు.

> 'రామోనామ బభూవ హుం తదబలా సీతేతి హుం తౌపితు
> ర్వాచా పంచవటీతటే విహరతస్తా మాహరద్రావణః
> నిద్రార్థం జననీ కథామితి హరేర్హుంకారతః శృణ్వతః
> సౌమిత్రే క్వధను ర్ధను ర్ధనురితి వ్యగ్రా గిరః పాన్తు వః'

అనగనగా రాముడని ఉండేవాడట. ఊం. అతని భార్య సీత; ఊం. వారిద్దరూ తండ్రిమాట పాటించడానికని పంచవటీతటానికివెళ్ళి ఉంటూండగా సీతను రావణుడు ఎత్తుకు పోయాడట; అని యిలాగ తల్లి నిద్ర వచ్చేదాకా విష్ణువు పూర్వావతార కథ చెపుతూంటే ఊ కొటి వింటూ చటాలున 'లక్ష్మణా – ఎక్కడ నా ధనువు – ధనుస్సు ధనుస్సు' అని కేకలుపెట్టే కృష్ణుని ఆవేశంతో కూడిన మాటలు మిమ్మల్ని రక్షించుగాక.

ఇక్కడ బాలకృష్ణునికి పూర్వస్మృతి కలగడం ఒక అద్భుతం; ఆ తర్వాత తన ప్రస్తుత జన్మ కృష్ణావతారం అని మరిచిపోయినా; ఆ ఉద్రేకం అతన్ని వదలక, అతని తల్లికి మరింత వాత్సల్యపాత్రుడూ, మనకు మరింత వంద్యుడూ అవుతాడు ఇలాగ అనేక రసాలతో మనస్సులను ఉర్రూతలూగించే శ్లోకాలు ఎన్నో ఉన్నాయి కర్ణామృతంలో.

సంస్కృత భాగవతం దశమ స్కంధంలోని వ్రేపల్లెలోని బాలకృష్ణుని లీలలు, గోపికాకృష్ణనాయికా నాయకీభావం ఆధారంగా వ్యంజితమైన జీవాత్మ పరమాత్మ సంబంధము రాసక్రీడా మొదలయిన రసవద్ఘట్టాలన్నీ లీలాశుకుడు తన

చుటూ జరిగిన సంఘటనలను స్వయంగా దర్శించి పారవశ్యం పొందినట్లుగానే కర్ణామృతంలో వర్ణించి మనకూ ఆ పారవశ్యాన్ని కలిగిస్తాడు. సంస్కృతంలో శుకమహర్షి కథనం చేసిన ఘటాలనే తానూ వర్ణించినందువల్ల, తాను అభినవ శుకుడని ప్రజ్ఞానామం ధరించినట్లుగా ఇతని లీలాశుక నామాన్నిబట్టి తోస్తుంది. ఇతని అసలుపేరు మరేదో. బాలకృష్ణ లీలలను కీర్తన ఘటితంచేసిన అన్నమాచార్యులుకూడా లీలాశుకుని కవితవల్ల తన్మయుడై యుండవచ్చు.

'దధిమథన నినాదై స్త్యక్త నిద్రః ప్రభాతే
నిభృత పదమగారం వల్లవీనాం ప్రవిష్టః
ముఖకమల సమీరై రాశు నిర్వాప్య దీపాన్
కబళిత నవనీతః పాతు గోపాలబాలః '

'ప్రాతఃకాలాన్నే పెరుగు చిలికే సవ్వడికి నిద్రలేచి, పడిలేని అడుగులు వేస్తూ గొల్ల పడుచుల యిల్లుచొచ్చి ప్రమిద దీపాలను నోటితో ఊది ఆర్పివేసి, కడవలోని వెన్న తినివేసే గోపాలుడు రక్షించుగాక'.

జయదేవుడు గీతగోవిందంలో రాధాకృష్ణుల ప్రణయశృంగారంలో అవస్థాభేదాలను ప్రదర్శించి. మానవ మనస్తత్వానుగుణమైన రూపక నిర్మాణం చేశాడు' లీలాశుకుడు గోపికలతో పాటు తన్ను, మనలను కూడా నాయికలను చేసి, నాయకుడైన శ్రీకృష్ణ కిశోరమూర్తి దివ్యమంగళ విగ్రహాన్ని తనివితీరా కోటిభంగులలో ప్రదర్శించడమే కాకుండా ఆ దర్శనంలో తనకూ మనకూ కూడా కలిగే సత్య సౌందర్య పరమావధియైన అధ్యాత్మికానందం ద్వారా 'నిర్వాణాన్ని' ప్రసాదించిన వాడయాడు.

'జాగృహి జాగృహి చేత
శ్చిరాయ చరితార్థతా భవత ః
అనుభూయతా మిద మిదం
పురస్థితం పూర్ణ నిర్వాణమ్ '

'మేలుకో మేలుకో' చిత్తమా, చిరకాలం కోరిన చరితార్థత లభించింది. ఇదిగో ఇదిగో. బ్రహ్మానందదాయియైన పూర్ణ నిర్వాణం కన్నుల యెదుటనే నిలిచింది అనుభవించు —

కృష్ణకర్ణామృతమునకు వ్యాఖ్యానము వ్రాసిన వారిలో పాపయల్లయ సూరి అను ఆంధ్రుడూ, ఉత్కళదేశీయుడైన రూపగోస్వామి శిష్యుడైన కృష్ణదాసూ ముఖ్యులు. కృష్ణదాసు 'సారంగరంగద' అను పేర వ్రాసిన కృష్ణకర్ణామృత వ్యాఖ్యలో లీలాశుకుడు దాక్షిణాత్యుడనీ కృష్ణవేణ్ణా పశ్చిమతీరవాసి అయిన పండిత

కవీంద్రుడగు బిల్వమంగళుడే లీలాశుకుడనీ వ్రాసినాడు. ఆ బిల్వమంగళుడు సుమంగలస్తోత్రమనే గ్రంథంకూడా వ్రాశాడు. దానిలోని ఒక శ్లోకం చూస్తే కృష్ణకర్ణామృత శైలే జ్ఞాపకం వస్తుంది.

'యే శైవాస్సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాన్తినో
బౌద్ధా బుద్ధ ఇతి ప్రమాణ పటవః కర్తేతి నైయాయికాః
అర్హన్నిత్యథ జైనశాసనరతాః కర్మేతి మీమాంసకాః
స్సోఽయం నోవిదధాతు వాంఛిత ఫలం శ్రీ దేవకీనందనః

శైవులు శివుడని, వేదాంతులు బ్రహ్మమనీ, బౌద్ధులు బుద్ధుడనీ, నైయాయికులు కర్తయనీ, జైనులు అర్హతుడనీ, మీమాంసకులు కర్మ అనీ, ఎవరిని పేర్కొని ఉపాసిస్తున్నారో ఆ దేవకీనందనుడు మాకు వాంఛిత ఫలముల నిచ్చుగాక' అని భావం. ఇట్టి తాత్పర్యంతోనే అన్నమాచార్యులు శ్రీ వెంకటేశ్వరులను స్తుతించిన కీర్తన నొక దానిని తాళ్ళపాకవారిని గురించిన అధ్యాయంలో ఉదహరించాము.

సాధారణంగా సంగీత సభలలో రాగమాలికలుగా గానం చెయ్యడానికుపయోగించే కృషకర్ణామృత శ్లోకాలివి :

1. కస్తూరీ తిలకం లలాటఫలకే
2. కస్త్వంబాల బలానుజః
3. కాళిందీ పులినేషు
4. గోధూళి ధూసరిత కోమల
5. సాయంకాలే వనాంతే కుసుమిత సమయే
6. హే గోపాలక హే దయాజలనిధే
7. రామో నామ బభూవహుం

గేయచ్ఛందస్సులు గల వృత్తాలు :— భరతముని నాట్యశాస్త్రంలోని (15 వ అధ్యాయం) వృత్తాధికారంలో చెప్పిన వృత్తపదాలలో సుమారు 20, 30 భేదాలకు మించి, లీలాశుకుడు వాడుకొన్నాడు.

<u>నర్కుటం :</u> మృగమద పంకసంకర విశేషిత వన్యమహా
గిరితట గండగైరిక ఘనద్రవవిద్రుమితమ్ —: రూపకతాళం :—

మంజుభాషిణి:— మమచేతసి స్ఫురతు వల్లవీ విభోః
మణినూపుర ప్రణయి మంజుశింజితమ్ :—
త్రిశ్రగతి ఏకతాళం—చివరి గురువు నాలుగుమాత్రలు

హరిణీప్లుతం:— అధర బింబ విడంబిత విద్రుమం
మధుర వేణువినాద వినోదినమ్.

—: ఆదితాళం, మొదటిమూడు అక్షరాల తర్వాత సమం — అనాగతగ్రహం :—

తరుణారుణ కరుణామయ విపులాయతనయనం
కమలాకుచకలశీభర విపులీకృతపులకమ్

—: రూపకతాళం :—

(నారాయణ తీర్థుల తరంగాలలోని 'శరణం భవ కరుణాం మయి కురుదీన దయాళో' — ఇదేవృత్తం)

మాలిని :— త్రిభువన సరసాభ్యాం దీప్త భూషాపదాభ్యాం
దృశిదృశి శిశిరాభ్యాం దివ్యలీలాకులాభ్యాం

(ఆదితాళం, 8 వ అక్షరం ప్లుతం - 3 మాత్రలు, పదవ అక్షరంతో రెండవ ఆవృతం ఆరంభం)

పృథ్వీ :— కలక్వణిత కంకణం కరనిరుద్ధ పీతాంబరం
క్రమ ప్రసృత కుంతలం కలిత బర్హభూషం విభోః

వృషభలలిత :— కిమివ శృణుమః కస్యబ్రూమః కథం కృతమాశయా
కథయత కథం ధన్యామన్యామహే హృదయేశయమ్

పాలాశదళ :—అహిమకర కరనికర మృదు ముదితలక్ష్మి
సరసతర సరసిరుహ సదృశదృశిదేవే.

మత్తకోకిల :— పల్లవారుణ పాణి పంకజ సంగి వేణురవాకులం
ఫుల్లపాటల పాటలీ పరివాది పాదసరోరుహం

తోటకం :— చికురం బహుళం విరళం భ్రమరం
మృదులం వచనం విపులం నయనమ్

రథోద్ధత :— స్యందనే గరుడ మండితధ్వజే
కుండినేశ తనయాధి రోపితా

పద్మినీ :— అంగనా మంగనామంతరే మాధవో
మాధవం మాధవం చాంతరేణాంగనా
ఇత్థమాకల్పితే మండలే మధ్యమం
సంజగౌ వేణునా దేవకీ నందనః

ఇత్యాదిగా, సంగీతానికీ, నృత్యానికీ, అభినయానికీ చిత్రలేఖానానికీ శిల్పానికీ ప్రదర్శనయోగ్యాలయిన గేయచ్ఛందస్సులు కృష్ణకర్ణామృతం ద్వారా మనకు అందించిన లీలాశుకుడు శిశు సౌందర్యములో పరబ్రహ్మను చూపి, భక్తి శృంగార పరమావధిలో ఆధ్యాత్మిక బ్రహ్మానందము కలిగించిన ప్రముఖ వాగ్గేయకారులలో అద్వితీయుడు

## ఏడవ అధ్యాయం

# తాళ్లపాక వాగ్గేయకారులు

తాళ్ళపాక వంశంవారిలో అన్నమాచార్యుడు, ఆయన రెండవకుమారుడైన పెద తిరుమలాచార్యుడు. పెద తిరుమలార్యుని పెద్ద కుమారుడైన చినతిరుమలయ్య, నాల్గవ కుమారుడైన చిన్నన్న (లేక చిన తిరువెంగళనాథుడు) సుప్రసిద్ధ కవులు. వీరిలో మొదటి ముగ్గురు సంగీత సాహిత్యకళాదక్షులైన వాగ్గేయకారులు, మహా భక్తులు; చిన్నన్న బహుళ ద్విపద కావ్యకర్త. వీరు నలుగురు 15 వ శతాబ్ది ప్రారంభంనుంచి దాదాపు 16 వ శతాబ్దాంతంవరకు తిరుపతి వేంకటేశ్వరస్వామిని సంగీత సాహిత్య సుకృతులైన సంకీర్తనముల ద్వారా అర్చించినవారు. అయితే తాళ్ళపాక వంశకవులు వీరువరనిగాని, వీరి రచనలో సంకీర్తనములో ఇవియని గాని రూఢియైన చరిత్ర మొన్నమొన్నటిదాకా తెలియలేదు. తిరుపతి తిరుమల దేవస్థానమువారు 20 సంవత్సరాలక్రితం వేంకటేశ్వర దేవాలయంలోని స్వామి హుండిగుమ్మానికి పక్కగా ఉన్న ప్రదక్షిణపు ఆవరణలోని అన్నమాచార్యుల సంకీర్తన భాండారంలోని రాగిరేకులను పైకితీయించి, వాటిలోని సంకీర్తనములను పరిష్కరించి ఇప్పటికి పది సంపుటాలువరకు వేయించారు.

సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో సుబ్బరామదీక్షితులు వాగ్గేయకారుల చరిత్రములో తాళపాకము చిన్నయ అనుశీర్షికను వ్రాసిన చరిత్రను విశేషాదులివి :

'ఇతడు తెనుగు బ్రాహ్మణుడు. వెంకటాచలపతి భక్తుడు. తిరుపతిలో నుండినవాడు. వెంకటరమణ విషయమై భాగవత సంప్రదాయముగా వాడుకలోగల ఉత్సవ పద్ధతి నేర్పరచిన పుణ్యపురుషుడు. దానిలో తోడయము, మంగళము, శరణు, హెచ్చరిక తెలిపే కీర్తనములు, ధూప దీపాలంకార నైవేద్యాద్యుపచార ముల కీర్తనములు. పవ్వళింపు, దివ్యనామసంకీర్తనము, వసంతోత్సములు కీర్తన ములు స్వామిని మేలు కొలుపుటకై కీర్తనములు ఇవి మొదలైనవియు నణగి యున్నవి. ఇవిగాక విడికీర్తనములును గలవు. భక్త్యతిశయము వలన మాటి మాటికి వెంకటరమణుడు ఇతనికి సాక్షాద్దర్శన మిచ్చి మాట్లాడినట్లు పెద్దలు చెప్పుచున్నారు. భజన పద్ధతి కితడే మూలపురుషుడు ఇతడు రామామాత్యులకు ముందటివాడని చెప్పుచున్నారు.'

సంప్రదాయ ప్రదర్శినిలో 'చిన్నయ్య'ను గురించి చెప్పిన ఈ అంశము లన్నీ అన్నమాచార్యులకే సరిపెట్టుకోవలెను. మొత్తానికి ఈ అంశాలలో చాల మట్టుకు, పరమ భక్తులూ, సంకీర్తన కర్తలూ అయిన పెదతిరుమల, చిన తిరుమ లార్యులకు కూడా సరిపోతాయి కాని, చిన్నన్నకు చెందవు. చిన్నన్న అష్టమహిషీ కల్యాణము, పరమయోగి విలాసము, ఉషా పరిణయము, అన్నమాచార్య చరిత్రము అను గ్రంథాలను ద్విపద కావ్యములుగా రచించినవాడు కాని, సంకీర్తన కర్త అయినట్లు సూచించే ఆధారాలులేవు.

'చిన్నన్న ద్విపద కెరగును
పన్నుగ పెదతిరుమలయ్య పదమున కెరగున్
మిన్నంది మొరసె నరసిం
గన్నకవిత్వంబు పద్యగద్యశ్రేణిన్.

ఈ పద్యము తెనాలి రామకృష్ణకవి చెప్పినట్లు అప్పకవీయంలో ఉదా హృత మయినది. ఈ పద్యంలో చిన్నన్న ద్విపద కవియని తెలుస్తోంది.

' దినములోననె వేయి ద్విపద లింపొంద
వినుత వర్ణనలతో విరచించువాడ
కవిశిరఃకంప యోగ్యప్రతి ద్విపద
నవ బిరుదాంకుడ' నని చెప్పుకొన్న యీతడు అన్నమాచార్యుని

చరిత్రము ద్విపదలోనే రచించాడు. అన్నమాచార్య చరిత్రమును పరిశోధించి, పరిష్కరించి తిరుపతి దేవస్థానము ద్వారా ప్రకటించిన ప్రభాకరశాస్త్రిలవారు వ్రాసిన పీఠికలోను, చాగంటి శేషయ్యగారి ఆంధ్ర కవితరంగిణి 6, 8 భాగాల లోను అన్నమాచార్య, పెదతిరుమలాచార్య, చినతిరుమలాచార్య, చిన్నన్నల కాల నిర్ణయాదులు సహేతుకంగా చేశారు. అన్నమాచార్యుడు 1408 నుంచి 1507 వరకును, పెదతిరుమలచార్యుడు 1460 నుంచి 1547 వరకును, చినతిరుమ లయ్య 1485 నుంచి 1550 వరకును, చిన్నన్న 1498 నుంచి 1561 వరకును జీవించి యుండినట్లు నిర్ణయించారు.

## దేశకాల పరిస్థితులు :

ఆకాలంనాటికి ఉత్తరాన గజపతులు, రాజమహేంద్రవరంలో రెడ్డిరాజులు, తెలంగాణాలో బహమనీ సుల్తానులు, రాయలసీమ ప్రాంతాన విద్యానగరం రాజధానిగా సాళువ, తుళువ వంశపు రాజులు పరిపాలిస్తున్నారు. అన్నమాచార్యుల వంశీకులు తాళ్ళపాక గ్రామవాసులైనా, అన్నమయ్య నాటినుంచీ తిరుపతి వాస్తవ్యు లయారు. అన్నమయ్యనాటికి వేంకటేశ్వరుని తిరుమలకూడా తురుష్క దండ

యాత్రల దెబ్బతగిలినట్లు వారి సంకీర్తనాలనుబట్టి తెలుస్తుంది. రెడ్ల సామ్రాజ్యం క్రమంగా క్షీణించి, విద్యానగరం, విజయనగర సామ్రాజ్యంగా బలపడిపోతూ వుంది. కాని తాళ్ళపాక వాగ్గేయకారులు ముగ్గురికీకూడ వారి కవితా సంగీత కళోపాసనకు ఈ రాజులూ. రాజ్యాలూకాక, తిరుపతి వేంకటేశ్వరులే ఉద్బోధక కారణమైనాడు.

'నీపాలి వారిగా నియమించి మమ్ము
హరిమిమ్మునే గొనియాడు మా జిహ్వ
నొరులను గొనియాడకుండంగజేసి' అని చిన్నన్న అన్నమాచార్య చరిత్రమున చెప్పిన మాటలిందుకు తార్కాణములు.

'శివుడని. శక్తియని, భైరవుడని, జినుడని. స్కందుడని, ఆయా మతముల వారు తమ తమ నిర్ణయముల కనుకూల రూపరేఖలను, ప్రమాణములను చూపుకొనుచు. వైవిధ్యముతో నర్చించుకొనుచు వచ్చిన శ్రీ వేంకటేశమూర్తిని ఆళ్వారాచార్యుల అభివర్ణనానుగుణముగా విష్ణుమూర్తిగా శ్రీ రామానుజాచార్యులవారు క్రీ. శ. పదకొండవ శతాబ్దిలో విఖ్యాతపరచిరి, సింహాచలము, శ్రీకూర్మము మొదలగు స్థలములలో కూడ నిట్టి నిర్ధారణములే వారు చేసిరట. అంతేకాక, రామానుజులు వేంకటేశ్వరస్వామి సన్నిధిని శ్రీవైష్ణవుల స్థానపతిత్వమును స్థాపించి. తనకు రామాయణోపదేశము చేసిన గురువు తిరుమలనంబిగారిని కొంత పరివారంతో స్వామి కొలువున ఏర్పాటు చేశారు. అది మొదలు వైఖానసాగమ విధానానికి ప్రధాన క్షేత్రమైనది తిరుపతి. 14 వ శతాబ్దిలో వేదాంత దేశికులు, వారి శిష్యులు. మనవాళ మహాముని, వారి శిష్యులు. స్వామి వైభవాలకు విఖ్యాతి గూర్చారు. 15వ శతాబ్దిలో అహోబలమఠ ప్రతిష్ఠాపకులయిన శఠకోపయతులును, వారి శిష్యుడయిన అన్నమాచార్యులును స్వామి వైభవానికి ప్రఖ్యాతి కలిగించారు.

శ్రీ మహావిష్ణువు వక్షస్థలమందలి కౌస్తుభమే శఠకోపయతిగా అవతరించెననీ, వేంకటేశ్వరస్వామి గుడిఘంట వేదాంత దేశికులుగా జన్మించెననీ మహావిష్ణుని హస్తమందలి నందక ఖడ్గాంశమున అన్నమాచార్యులు అవతరించెననీ ప్రాజ్ఞుల విశ్వాసము. ఆముక్తమాల్యదలో శ్రీకృష్ణదేవరాయలును, మనుచరిత్రలో అల్లసాని పెద్దనగారును తమ తమ విద్యా గురువుగా కొలిచిన శఠకోపయతి ఒకరున్నారు కాని ఆదిమ శఠకోపయతి అను వారికి అన్నమాచార్యులు శిష్యుడు కాగా తరువాత ఆ పీఠము నధివసించిన మరొక తరపు శఠకోపయతి రాయలకు, ఆయన ఆస్థాన కవికీ గురువయి ఉండవచ్చు.

## అన్నమాచార్యులు :

అన్నమాచార్యుని తండ్రితాతలనాడు తాళ్ళపాకలో కాపురం ఉండడంచేత వారింటి పేరు తాళ్ళపాక వారయింది. నందవరీక బ్రాహ్మణులు, ఋగ్వేదులు,

ఆశ్వలాయనసూత్రులు, భారద్వాజగోత్రులు. ఈ వంశమున పండితాగ్రేసరుడు-విష్ణుభక్తుడు అయిన నారాయణసూరికి, అక్కమాంబకు శ్రీ వెంకటేశ్వర వరప్రసాదమున పుట్టిన కారణజన్ముడు అన్నమాచార్యుడు. ఈయన జననం 1408 క్రీ. శ. సంవత్సరంలో వైశాఖపూర్ణిమనాడు విశాఖా నక్షత్రమునందు, శైశవంనుంచీ వేంకటేశ్వరునిపై భక్తితో 'ఆడిన మాటెల్ల నమృత కావ్యముగ, పాడిన పాటెల్ల పరమగానముగ.' — 'వెన్నుని వరముచే విద్యలన్నియును జిహ్వారంగసీమ తమ దామె నొచ్చి నర్తనమాడగా,' తన కవిత్వమునకు, తన గానమునకు సకల ప్రజలు కీర్తింపగా వెంకటపతిమీద వింత వింతలౌ సంకీర్తనములు రచించాడు. ఈ బాలభక్తునికి బాల్యంలో తలిదండ్రులూ, వదినెయన్నలూ పొలముచాకిరి, పనులు చెప్పి చీకాకు పెట్టగా అన్నమయ్య సంకీర్తనములలో స్వామికి మొరపెట్టుకొన్నాడు వానిలో ఒకటి :

సామంతం

అయ్యో పోయెం బ్రాయము కాలము
మయ్యంచు మనసున నే మోహమతినైతి...
చుట్టంబులా తనకు సుతులు, కాంతలు చెలులు
వట్టియాసం బెట్టువారే కాక
నెట్టుకొని వీరు కడు నిజమనుచు హరినాత్మ
బెట్టనేరక వృథా పిరివీకునైతి.... అయ్యో....
తగు బంధులా తనకు తల్లులును తండ్రులును
వగలబెట్టుచు తిరుగువారేగాని
మిగుల వీరల పొందు మేలనుచు హరినాత్మ
తగిలించలేక చింతాపరుడనైతి... అయ్యో....

తిరుపతి పైనము :

గడ్డి తవ్వడం, ఇంటికి పశువులకోసం మోపులు కట్టి మోసుకురావడం, ఇటువంటి పనులతో ఇంటివారు విసిగించగా, ఒకనాడు చేతిలోని కొడవలి పారవేసి, తాళ్ళపాక గ్రామము విడిచి, వేంకటేశ్వర దర్శనాపేక్షతో తిరుపతికి బయలుదేరినాడన్నమయ్య. ఆనాటి కాతని వయస్సు ఎనిమిదేళ్ళని అన్నమాచార్యచరిత్రలోఉంది. 16 ఏండ్లయి ఉండవచ్చునని ప్రభాకరశాస్త్రిలవారి యభిప్రాయమే సరి అయి ఉండవచ్చు. దిగువ తిరుపతి పొలిమేరలోనున్న గ్రామదేవత గంగమ్మకు నమస్కారములు చేసి, అన్నమయ్య యాత్రికుల వెనువెంట ఏడుకొండలు ఎక్కనారంభించాడు. మోకాళ్ళ పర్వతం దగ్గరికి వచ్చేసరికి చాల బడలిపోయి ఆకలితో ఒక

రాతిపై శయనింపగా, జగదంబ లక్ష్మీదేవి అన్నమయ్యకు స్వప్నంలో కనబడిం దట. సకల సాలగ్రామమయమైన ఆ కొండను చెప్పులతో ఎక్కరాదు కనుక, చెప్పులు విడిచి యెక్కితే అలసటలేకుండా అతని మనోభీష్టం ఈడేరి స్వామిదర్శన మవుతుందని చెప్పి, దేవి స్వామీ, తానూ ఆరగించిన ప్రసాదాన్నము లాతనికి పెట్టి, సేదదేర్చి అంతర్ధానమయిందట. అప్పుడన్నమయ్య ఆశువుగా వేంకటేశ్వరస్వామి దేవేరి అలమేలుమంగాదేవిపై ఒక శతకం చెప్పాడు. తిరుమల యాత్రలోకొండపై అడుగడుగునా కనబడు బ్రహ్మపాదముపైనీ కురువనంబిపైనీ వేంకటేశు నగ మెక్కి వాకిటనుగల బాష్యకారులపైని, కొండనెక్కిన తర్వాత స్వామి పుష్క రిణిపైని, గరుడ కంబమును, విష్వక్సేన మొదలారిని దాటి గర్భగృహాన స్వామి సన్నిధి చేరువరకు సంకీర్తనము లాశువుగా చెప్పుకొంటూ వెళ్ళాడట. అప్పు డాయనకు స్వామి సాక్షాత్కారమైనట్లు తిరుమలలో దొరికిన సంకీర్తనములు చెక్కిన రాగి రేకులపై గ్రంథాదిని లిఖితమై ఉన్నది. సంకీర్తనముల రాగిరేకుపై నున్న శాసనాక్షరాలు; 'స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు 1346 (క్రీ. శ. 1424) అగు నేటి క్రోధి సంవత్సరమందు తాళ్ళపాక అన్నమా చార్యులు అవతరించిన పదారుయేండ్లకు తిరువెంగళనాథుడు ప్రత్యక్షమైతే. అది మొదలుగాను శాలివాహన శకవరుషంబులు 1424 (క్రీ. శ. 1502) అగు నేటి దుందుభి సంవత్సర ఫాల్గుణ బ 12 నిరుథానకు తిరువేంగళనాథదేవుని మీద అంకితముగాను తాళ్ళపాక అన్నమాచార్యులు విన్నపంచేసిన అధ్యాత్మ సంకీర్తనలు. అనగా క్రీ. శ. 1424 తిరుమలలో ఆయన స్వామి సాక్షాత్కారం పొందినది మొదలు రచన ప్రారంభించాడన్నమాట.

| కీర్తనలు మొదలు | సందర్భము | రాగము |
|---|---|---|
| బ్రహ్మ కడిగిన పాదము | స్వామి శ్రీపాదములు | ముఖారి |
| కురువనంబి తిరుమల కురువనంబి | స్వామిని మద్దిపూవులతో అర్చించి మెప్పించిన భక్తుని కథాశిల్పాలు దర్శించినపుడు | కాంభోజి |
| గతులన్ని ఖిలమైన | వాకిటి భిష్యకారులను దర్శించినపుడు | దేశాళం |
| దేవునికి దేవునికి | స్వామి పుష్కరిణి | గుండక్రియ |
| సేవించి చేకొన్నవారి | ఆలయ ప్రవేశము | పాడి |
| నీవేకా చెప్పజూప | విష్వక్సేనుడు | లలిత |
| మొక్కరో మొక్కరో వాడె | హనుమంతుడు | సాళంగనాలు |
| ఏ పొద్దు చూచిన | ప్రసాదములు | దేసాక్షి |

| | | |
|---|---|---|
| పొడగంటిమయ్యా | స్వామి దర్శనం | శంకరాభరణం |
| కంటి కంటి నిలువు చక్కని | ,, | రామక్రియ |
| పావనముగా వో జిహ్వా | ,, | భూపాళం |
| ఇందరికి నభయంబు | స్వామి అభయహస్తం | సామంతం |
| ఎటువంటివాడవో | స్వామి మహిమలు | శంకరాభరణం |
| ఎంతమాత్రమున నెవ్వరు | ,, | బౌళి |
| ఏమి వలసిన నిచ్చు | ,, | ,, |

వీనిలో వేంకటేశ్వరస్వామిని గురించిన చారిత్రక పర్యాలోచన గల కీర్తన ఒకటి ఇక్కడ పూర్తిగా చదువతగినది,

ఎంతమాత్రమున నెవ్వరు దలచిన అంతమాత్రమే నీవూ
అంతరాంతరము లెంచిచూడ, పిండంతే నిప్పటి యన్నట్లూ....
కొలుతురు మిము వైష్ణవులు కూరిమితో విష్ణుండని
పలుకుదురు మిము వేదాంతులు పరబ్రహ్మ మనుచు
తలతురు మిము శైవులు తగిన భక్తులను శివుడనుచు
అలరి పొగడుదురు కాపాలికులు ఆదిభైరవు డనుచు ॥ఎంత॥

సరి నెన్నుదురు శాక్తేయులు శక్తిరూపు నీ వనుచు
దరిసెనముల మిము నానావిధులను తలపులకొలదుల భరింతురు
సిరుల మిమ్ము నే యల్పబుద్ధి తలచినవారికి నల్పం బవుదువు
గరిమల మిమ్మునే ఘనమని తలచిన ఘనబుద్ధులకు ఘనుడవు ॥ఎంత॥

నీ వలన కొరత లేదు, మరి నీరుకొలది తామరవు,
ఆవల భాగీరథి బావుల ఆ జలమే వూరినయట్లు
శ్రీ వేంకటపతి నీవైతే చేకొని ఉన్నదైవమని
ఈవలనే నీ శరణనియెద నిదియే పరతత్త్వము నాకు....

ఆ విధంగా 16 వ ఏటనే సంకీర్తనములు పాడి, స్వామిని మెప్పించి, సాక్షాత్కారము పొంది, దేవాలయములోని స్థానాపతులవలనా, శఠకోపయతీంద్రుల వలనా మెప్పుపొంది, శఠకోప యతీంద్రుల వద్ద గురూపదేశము పొంది కొన్నేళ్లు అక్కడనే ఉండిపోయా డన్నమయ్య. వెదకికొంటూ కొన్నాళ్ళకి అక్కడకు వచ్చిన తల్లిదండ్రుల కోరికపైనీ, గుర్వాజ్ఞపైనీ అన్నమయ్య తిరిగి తాళ్ళపాక చేరుకొన్నాడు. అక్కడ తిరుమలమ్మ (తిమ్మక్క), అక్కలమ్మ అనే ఇద్దరు కన్యల నిచ్చి అన్నమయ్యకు పెండ్లి చేశారు. గార్హస్థ్యం అనుభవిస్తూ అహోబలమూ, తిరుమల మొదలైన పుణ్యక్షేత్రాలు దర్శిస్తూ అన్నమయ్య వేంకటేశ్వరుని కంకితముగా చాల శృంగార సంకీర్తనలు రచించాడు. మంచి ప్రాయంలోనే

రామాయణమంతా సంకీర్తనములలో రచించాడట. అన్నమాచార్యుల సంకీర్తన పద్ధతి నానాటికి జనవిఖ్యాతమై, కర్ణాకర్ణిగా ఆనాటికి విజయనగర సామంతుడై 1450 ప్రాంతంలో టంగుటూరులో పాలకుడుగా ఉన్న సాళ్వనరసింగరాయ లాయన కీర్తినిగురించి విని ఆయనను తన ఊరికి పిలుచుకొనిపోయి 'శ్రీకృష్ణ మన్నన, క్రీడి భూచక్ర మేకచక్రంబుగా నేలిన పగిది నాలాగు మీ సహాయము నాకు గలుగ, ఏలుదు ధరయెల్ల నేక చక్రముగ' అని తన కోర్కె తెలుపు కొన్నాడు. టంగుటూరులో కొంతకాలమున్న తర్వాత అన్నమయ్య ఆశీస్సువలన శత్రువులను జయించి పెనుగొండలో పట్టాభిషేకము చేసికొన్నాడు (1487).

సాళ్వ నరసింగరాయడు 1487 లో విజయనగర సామ్రాజ్య సింహాసనం సంపాదించడానికి ముందు విరూపాక్షరాయల కుమారులలో పెద్దవాడు తండ్రిని చంపి గద్దె యెక్కడము, అతనిని చంపి అతని తమ్ముడు రెండవ విరూపాక్షుడు రాజు కావడము, అతని దండనాయకుడయిన సాళ్వ నరసింగరాజు ప్రజలూ, సామంతులూ తోడురాగా అతనిని చంపి కర్ణాటసింహాసనము చేకొనడమూ ఈ విప్లవ సంఘటనము లన్నిటిని ప్రత్యక్షముగా చూచియో, వినియో ఉండిన అన్నమాచార్యులు 'వెరతు వెరతు నింద వేడుకపడ నిట్టి కురుచ బుద్ధుల నెటు కూడుదు నయ్యా' అని ఆ కాలపు రాజుల క్రౌర్యజీవితాన్ని గురించి వాపోయి అట్టివారి పొందు తనకు వలదనుకొన్నాడు.

## శృంఖలా యోగం:

ఒకనాడు నరసింగరాయడు అన్నమాచార్యుని పిలిపించి, స్వామిపై రచించిన శృంగార సంకీర్తనములు పాడమని కోరాడు. అప్పు డాయన నాదనామక్రియ రాగంలో 'ఏమొకో చిగురుటధరమున యెడనెడ కస్తురి నిండెను. భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదుగదా' అన్న కీర్తన గానంచేశాడు. అది విని, ఔన్నత్యగర్వంతో అప్పటికే మైమరచిన రాయలు అటువంటి పదములు తనపైని రచింపుమని అన్నమయ్య నడిగాడు. అప్పుడు అన్నమయ్య లలితరాగంలో

'తలగరో లోకులు తలపకురో మము
కలిగిన దిదె మా కాపురమూ....
నరహరి కీర్తన నానినజిహ్వ
ఒరుల నుతింపగ నోపదు జిహ్వ
మురహరు పదముల మ్రొక్కిన శిరము
పరుల వందనకు పరగదు శిరము'

అనే కీర్తనతో రాజు కోర్కెని నిరాకరించాడు. క్రుద్ధుడైన రాయలు అన్నమాచార్యునికి మూరురాయరగండమనే సంకెలవేయించి కారాగృహంలో ఉంచాడు. అప్పు డన్నమయ్య ముఖారిరాగంలో 'సంకెల లిడువేళ చంపెడువేళ, అంకిలి ఋణదాత లాగెడువేళ' అనే కీర్తన పాడి, స్వామిని వేడుకొని, ఆ మహిమతో సంకెలలు విదిలించుకొన్నాడు. అన్నమయ్య మహిమకు రాయ లాశ్చర్యపడి పశ్చాత్తాపపడి, ఆయన శరణు వేడుకొన్నాడు.

ఈ సంకెలగాథ చారిత్రకమే అనడానికి సందర్భోచితములైన కీర్తనలూ మనుమడైన చిన్నన్న రచనమునూ ప్రబలసాక్ష్యం. కాని ఈ సంఘటన నరసింగ రాయడు 1487 న కర్ణాటక సింహాసన మధిష్ఠించినప్పుడుకాని, ఆ తర్వాతకాని జరిగివుంటుందనుకొనడానికి 1408 లో జన్మించిన అన్నమాచార్యుల వయోధికత అడ్డువ సుంది. టంగుటూరులో చిన్న దండనాధునిగా ఉండిన రాయడు శత్రువులను జయించి, పెనుగొండలో చిన్న సామంతాధీశుడై నప్పు డీ సంఘటన జరిగి, ఆ తర్వాత వయోధికుడైన అన్నమాచార్యుల ఆశీస్సువలననో, వేంకటేశ్వరస్వామి ఆశీఃప్రభావాననో 1487 లో కర్ణాటరాజ్య రమారమణుడై ఉంటాడు. ఇతడు అన్నమాచార్యులకు తిరుపతి చుట్టుప్రక్కల కొన్ని యగ్రహారాలిచ్చి గౌరవించాడని ఊహించవచ్చు. ఎందుకంటే, అన్నమాచార్యుని కుమారుడు పెదతిరుమలయ్యాస్వామి కనేకాగ్రహారములు సమర్పించాడని శాసనాలవల్ల తెలుస్తోంది.

రాయల కొలువు విడిచిన వెనుక అన్నమయ్య తన అగ్రహారాలలోను, తాళ్ళపాకలోను కొంతకాలముండి, చరమకాలములో దిగువ తిరుపతిలోను, కొండపైని స్వామిసన్నిధిని 'గృహాది వసతు' లేర్పరచుకొని కాపురముండేవాడు. ఆ రోజులలోనే సంకీర్తన భండారం నెలకొల్పి, సంకీర్తనములను భద్రపరచడం, పాడించడం, దీపారాధన చేయడం ఆరంభించినట్లు కనబడుతుంది.

గుండక్రియ : దాచుకొని పాదాలకు తగ నేజేసిన పూజ లివి
పూచి నీ కీరితి రూపు పుష్పము లివి యయ్యా
ఒక్క సంకీర్తనే చాలు వొద్దికై మమ్ము రక్షించగ
తక్కనవి భండారాన దాచిఉండనీ
వెక్కసము నీ నామము వెల సులభము ఫల మధికము
దిక్కై నన్నేలితి వింక నవి తీరని నా ధన మయ్యా....

**మ హి మ లు :**

'మరులంక' అనే తమ అగ్రహారంలో ఒక జీడిమామిడి పుల్లని పండ్లను కాస్తుంటే, అన్నమాచార్యు లానా డా పండ్లుకోసి, స్వామికి నైవేద్యమిచ్చి, తా మారగించిచూస్తే పుల్లదనం కనబడి వెంటనే ఆ చెట్టును

స్పృశించి. స్వామిని ప్రార్థించి, ఈ పులుపుకాయల చెట్టును తీయనిదానినిగా జేయమని వేడుకొంటే వెంటనే ఆలాగే అయినదట. ఆ మహిమ కథ విన్న ఒక గాయకు డాయన దగరకు పోయి, తన పెండ్లికి 'కాసువీసం' కలిగేటట్లు దీవింపమని 'నానుడి' లో కోరాడట ఆపైని వాడు పోయి దండుకొనబోతే కాసువీసమే కాని దానికిమించి ఒక్క రూకయైనా యెవ్వరూ ఇవ్వకపోయి రట. అప్పు డాతడు తన కోరికలోని తెలివితక్కువయే కారణమని అన్నమయ్య గారి దగరకు తిరిగిపోయి, తండ్రీ! నా పెండ్లికి కావలసిన ధనం చేకూరేటట్లు ఆశీర్వదించమని కోరితే అన్నమాచార్యులు తథాస్తనగా రా జొక డా గాయకుని పిలిచి అడిగిన ధనమును, కన్యాదానమును చేశాడట.

రచనలు ; అన్నమాచార్యుల అధ్యాత్మ సంకీర్తనములు, శృంగార సంకీర్తనములు రాగ తాళ సంయుతమైనవి 32,000 మొత్తం కలవని ఆయన మనుమడు చిన్నన్న తన అన్నమాచార్య చరిత్రంలో వ్రాశాడు. అవి కాక ద్విపద ప్రబంధంగా నవ్యరీతిని రామాయణము, సంస్కృతంలో వేంకటాద్రి మాహాత్మ్యము, తెలుగున శృంగారమంజరి, 12 శతకాలు, యింకా సకల భాషలలో అనేక ప్రబంధాలు సంస్కృతంలో సంకీర్తన లక్షణమును రచించాడు అన్నమాచార్యుడు.

ఈయన 1502 వ సంవత్సరమున ఫాల్గుణ బహుళ ద్వాదశినాడు సంకీర్తనములు పాడుతూనే వేంకటేశ్వరునిలో ఐక్యం చెందాడట, చనిపోవునాటికి 95 ఏండ్ల వయస్సుండవచ్చు.

## ఆంధ్ర వేదము :

ఆళ్వారులు రచించిన ద్రావిడ వేదమనీ, పంచమాగమమనీ పిలువబడే నాలాయిరం 4000 సంకీర్తనములు కలది. అన్నమాచార్య డొక్కడే రచించిన ఆంధ్రవేదము ముప్పది రెండువేల సంకీర్తనములు కలది. వీటిలోకూడ ద్రావిడ ప్రబంధాలలోవలెనే భక్తునకు పరమేశ్వరునకు నాయికానాయక భావము, పతిపత్నీ భావము కల్పితమై 'ఉజ్జ్వల రసానుభూతి నొదవించుచు ననేక దేవాలయముల లోని యర్చామూర్తుల నభివర్ణించుచు శరణాగతి మహత్త్వమును ప్రతిపాదించుచు నింక ననేక విధముల లోకనీతి ధర్మోద్బోధ భూతదయాది విశేషాంశముల వెలయించుచు ఎంతో వింతగా వేడుకగా సంగీత సారస్యముతో, సవరనిభాషతో, వేద వేదాంతేతిహాసాది సూక్తి తదర్థ ప్రతిపాదనములతో వెల్విరిసి. విజ్ఞాననిధులై విరాజిల్లుచున్నవి' అని ప్రభాకరులవారు వ్రాశారు.

అన్నమాచార్యాదులు ఆంధ్రవేదముగా సంకీర్తనములు రచించినా, తాళ్ళపాక వారికి ద్రావిడ వేదమంటే ఎంత గౌరవమో సూచించడానికో అన్నట్లు అన్నమాచార్య

చరితను ద్విపదలో వ్రాసిన చిన్నన్న పరమయోగివిలాసము' అను పేర ఆళ్వారుల చరిత్రనూ సూక్తులనూ ద్విపదలో ఉద్గ్రంథంగా రచించాడు.

సంకీర్తన లక్షణంలో అన్నమయ్య, చిన తిరుమలయ్య జయదేవకవి గీతగోవిందమును కొనియాడారు. అంతేకాదు, అన్నమయ్య తెలుగు సంకీర్తనములే నూర్లకొలది సంస్కృతభాషలోకూడ సంకీర్తనములు వేంకటేశాంకితములుగా రచించాడు.

వెలసినప్పటినుండి 20 ఏళ్ళక్రితంవరకు ఈ సంకీర్తనములు తిరుమల వేంకటేశ్వరుని ఆలయ ప్రాంగణంలో గర్భగుడిప్రక్క భాష్యకారుల అరకు పొంతనే సంకీర్తన భాండారము అనేగదిలో భద్రపరుపబడి ఉన్నవేకాని, బైటికి పొక్కలేదు. అన్నమాచార్యులు, పుత్రపౌత్రులు ఆలయంలో పలుకుబడి కలిగిఉన్నన్నాళ్లు స్వామి వైభవోత్సవాలలోనేకాక, అనుదిన సేవలలోకూడ ఈ సంకీర్తనములను స్వామిసన్నిధిని విన్నవించేవారు. అంతేకాక, తమ తర్వాతి తరములందు కూడా కొనసాగేటట్లు వసతు ఏర్పాటు చేశారు. కాని, కొంతకాలానికి శ్రద్ధ తగ్గింది. భజన గోష్ఠులలో మాత్రము మొదట తాళ్ళపాక సంకీర్తనములవాడుక ఆంధ్రదేశములోను దక్షిణాదినికూడ అక్కడక్కడ నిలిచింది.

## అన్నమయ్య, పురందరదాసుల భేటి :

పాండురంగ విఠల భక్తుడై కన్నడంలో పదములు రచించిన పురందరదాసు పరమ భాగవతోత్తముడైన అన్నమాచార్యుని సంకీర్తనముల పేర్కొన్నంత మాత్రన భూతభేతాళ పిశాచములు పారిపోయి శుభములు కలుగునని మహిమలు విని, ఆయనను సందర్శించి సాక్షాద్విష్ణువుగా భావించి కీర్తించాడట. అప్పుడన్నమయ్య పురందరుని సాక్షాత్తు పాండురంగ విఠలునిగా తలచి సంభావించాడట. ఈ సంగతిని కూడ చిన్నన్న అన్నమాచార్య చరిత్రలో వ్రాశాడు అన్నమయ్యకు పూర్వము, కొంచెమించుమించు ముందుతరంలో కర్ణాటకభాషలో నిజలింగచిక్కణ మొదలైన శైవభక్తులు శ్రీపాదరాయరు అనుమాధ్వ మతాచార్యులు మధుర ఫణితిలో సంకీర్తనములు రచించినట్లును, శ్రీపాదరాయర ప్రభావము అన్నమయ్య కవితపై ఉండియుండవచ్చుననీ శ్రీ అనంతకృష్ణ శర్మగారు వ్రాశారు. పురందరదాసు శ్రీపాదరాయర శిష్యులయిన వ్యాసతీర్థులవారి శిష్యులు సాళ్వనరసరాయల కాలమునా, కృష్ణరాయల కాలమునా కూడా వ్యాసతీర్థులూ, పురందరదాసూ జీవించి ఉండిరి. వ్యాసతీర్థులు కృష్ణరాయలకు గురువుకూడ అన్నమాచార్యులకు, పురందరదాసులకు 30, 40 సంవత్సరాల వ్యత్యాసముండి యుండవచ్చు. పురందర దాసుల సంకీర్తనములు కొన్ని అన్నమాచార్యుల సంకీర్తనములకు ఛాయానుకారులుగా కనబడతాయి. ఉదాహరణకు ఒకటి :

మాళవి రాగం :

శరణు శరణు సురేంద్ర నన్నుత శరణు శ్రీ సతివల్లభా
శరణు రాక్షస గర్వసంహార శరణు వెంకటనాయకా....

ఇది అన్నమాచార్యుల భజనపద్ధతి సంకీర్తనములోని పల్లవి. ఈ క్రిందిది పురందరదాసుల పల్లవి.

మాళవి రాగం :

శరణు శరణు సురేంద్రవందిత శరణు శ్రీపతి సేవిత
శరణు పార్వతీ తనయ మారుతి శరణు సిద్ధివినాయక...

అన్నమయ్య వేంకటేశ్వరునకేకాక. అహోబల నారసింహునికి, శ్రీరంగ నాథునికి విద్యానగర విఠలేశ్వరునికి అంకితముగా ఆయా క్షేత్రములు దర్శించి నప్పుడు సంకీర్తనములు రచించి స్తుతించాడు. అన్నమాచార్య చరిత్రమున అన్నమయ్యగారికొకేసారి ఇద్దరి కన్యల నిచ్చి పెండ్లి చేసిరని ఉన్నప్పటికీ, శ్రీ చాగంటి శేషయ్యగారు ఒకరి మరణము తర్వాత, ఒకరికి తిరుమ లాంబకు, అక్కలమ్మకు అన్నమయ్యతో వివాహమయి ఉండునని వ్రాశారు. చిన్నన్న ప్రబలసాక్ష్యమును కాదనలేము, అందుచేత ఇద్దరికీ ఒకేసారి పెండ్లి అయిఉంటుంది. ప్రబల కారణం కూడా స్పష్టమే. వైరాగ్య బుద్ధితో తిరుమలకు పారిపోయిన అన్నమయ్యను తిరిగి తీసికొనివచ్చి, సంసారబంధంవైపు దృష్టి మరలించడాని కలా చేసిఉండవచ్చు. ఇందువలని అన్నమయ్య దక్షిణ నాయక త్వానుభవం అక్కడక్కడ ఆయన రచించిన కీర్తనలలోని వేంకటేశ్వరుల దక్షిణ నాయకత్వాన్ని సహజంగా నిరూపించడానికి సహాయపడి ఉండవచ్చును. ఆయన అధ్యాత్మ సంకీర్తనాలలోకూడ. తరచు, కామపురుషార్థానికి తన మనస్సు తరచు లోబడిపోతున్నదని. ఆర్థికములూ, సాంసారికములూ అయిన బంధాల నుండీ, బాధలనుండి ఇంద్రియాల తిరుగుబాటునుండి తనను ఉద్ధరింపుమని భగవంతుని అక్కడక్కడ వేడుకొన్నాడు. దినమున కొక కీర్తనకు తక్కువ కాకుండా జీవితమంతా కీర్తనమయంగా రచిస్తూ ఉండిన మహాకవి స్వానుభవం చొప్పింపకుండా అట్టి భావాలను ప్రవర్తింపడని అనుకోవచ్చు.

ఈ స్వానుభవ వైరాగ్యానికి ఉదాహరణలు :

1. బౌళి :

ఛీ ఛీ వో బదుకా సిగ్గులేని బదుకా
వాచవికి బతిమాలి పడబడ బదుకా....
భోగించ వేళ కద్దు, పొద్దువోదపు. గుంకును. ॥ఛీ॥

వేగమె హరి దలచ వేళ లేదు :
భోగుల లంపటమున కోపి కెంతైనా కదు
యోగపు సత్కర్మాన కొక యింత లేదు... ॥చీ॥

మది శ్రీ వేంకటేశుడు మమ్ము నిబ్బ కాచెగాని
పదరి నా నేరములు పాప మరి లేదు.... ॥చీ॥

2. కాం డ మ ల హ రి :

ఎన్నడు దేవుని గనే మెన్నడు బుద్దెరిగేము
తన్నుదానే హరి మమ్ము ధయజూచెగాక....
మాటాడు టొక్కటేకాని మాకును పనులకు
చాటున పంచేంద్రియాలు సర్వసమమే
గాటాన జరియించుటెకాని రాళ్ళకును మాకు
యీటులేని భవ బంధా లిన్నియును సమమే....

3. బౌ ళి :

ఎక్కడి మానుషజన్మం బెత్తిన ఫలమే మున్నది
నిక్కము నిన్నే నమ్మితి నీ చిత్తం బికను...
మరవను ఆహారంబును. మరవను, సంసారసుఖము
మరవను యింద్రియభోగము, మాధవ నీ మాయ....
తగిలెద బహు లంపటముల, తగిలెద బహు బంధంబుల
తగులను మోక్షపు మార్గము, తలపున యెంతైనా
అగపడి శ్రీ వేంకటేశ్వర అంతర్యామివై
నగినగి నను నీ వేలితి నాకా నీమాయ...

ఈ మూడు పాటలలోను యింద్రియలంపటత్వమునకు తరచు లొంగిపోయి పొందే పశ్చాత్తాపం కనుబడుతుంది శృంగారములో తరితీపులు పొందిన అనుభవమును స్పురింపజేసే రచనలు కొన్ని :

బి ల హ రి

అలుగక కూటమి చవి గాదనుచు పలికేవు. నీ
పలుగక ప్రాణము లేమానో యామీవటి మే లెవరికిరా....

పా డి :

ఆడువారు కడు కోపు లగుట నీ వెరగవా
నేడు కొత్తలుగా భూమి నేర్చుక వచ్చారా...

గునిసి సవతులపై కోపాన పతి నంటేను
విని నవ్వకుండేవాడు విభుడా వాడు....
పాయరాని యట్టివారు బలుములు చూపితేను
సాయాల బెట్టెడివాడు నాధుడా వాడు
ఈయెడ శ్రీ వెంకటేశ యింతి నిట్టె కూడితివి
చాయకు రాకుండువాడు సరసుడా వాడు...

కన్నడగౌళ (పురుష విరహం) :

తలచిన హృదయము ఝల్లను తరుణీమణి ఒయ్యారము
కలిగినా ఇక నొకపరి కన్నుల జూడగను...
మో మరవాంచి పదాంగుటమున నిల నొయ్యన వ్రాయుచు
కోమలి కన్నీ రెడనెడ గ్రుక్కుచు రెప్పలను
వేమరు నాదెస చూచుచు వీడగ నొల్లని భావము
ఏమని తలపోయుదు విధి నేమని దూరుదును....

మాళవశ్రీ (స్త్రీ విరహం) :

దుప్పటెల్లా జవ్వాదినే తొప్పతోగె, నీకడ నే
వొప్పదా యింతేసి నీకు వో వలపా....
నిదుర కంటికి రాక నెలత పానుపుమీద
నెదురు చూచీ నీకు నిందు కొరకా
ముదితల కౌగిట ముంచిన కస్తూరి నీకు
ఉదివెడి ఉరమున నోహో వలపా....

అలమేలుమంగ నృత్యము - శంకరాభరణము :

అలరులు కురియగ నాడె నదే
అలకల పొలుపుల నలమేల్మంగ...
అరవిరి సొబగుల నతివలు మెచ్చగ
అర తెరమరుగున నాడె నదే
వరుసగ పూర్వ దువాళపు తిరుపుల
హరి గరణింపుచు నలమేల్మంగ...

అలమేలుమంగ పల్లకి - దేసాళం :

కులుకక నడవరో కొమ్మలారా
జలజలరాలీని జాజులు మా యమ్మకు...
ఒయ్యనే మేను గదలీ నొప్పుగా నడవరో

గయ్యాళి శ్రీ పాద తాకు, కాంతలారా
పయ్యెద చెరగు జారి భారపు గుబ్బలమీద
అయ్యో చెమరించీ మా యమ్మకు వెన్నుదురు...

బాలకృష్ణుని లీలలు—

దేశాక్షి :

అనరాదు వినరాదు అతని మాయలు నేడు
దిన దిన కొత్తలా యదృష్ట మదె మాకు....
ఆడెడి బాలుర హరి అంగిలి చూపుమని
తోడనే వాండ్ల నోర దుమ్ములు చల్లి
ఈడ మాతో చెప్పగాను ఇందరము కూడి పోయి
చూడబోతే పంచదారై చోద్యమాయ నమ్మ...

కాంబోది :

మొత్తకురే అమ్మలాల ముద్దులాడు వీడే
ముత్తెమువలె నున్నాడు ముద్దులాడు
చక్కని యశోద తన్ను సలిగతో మొత్తరాగా
మొక్కబోయీ కాళ్ళకు ముద్దులాడు...

లాలి :

జో అచ్యుతానంద జో జో ముకుందా
రావె పరమానంద రామ గోవింద
నందు నింటను జేరి నయము మీరంగ
చంద్రవదనలు నీకు సేవ చేయంగ
అందముగ వారింద్ల నాడుచుండంగ
మందలకు దొంగవౌ మా ముద్దురంగ...

శంకరాభరణం :

గురుతెరిగిన దొంగ, కూగూగు, వీడె
గురిలోనె దాగీని, కూగూగు...
నెలతల దోచీని నీళ్ళాడగానె
కొలని దరిని దొంగ కూగూగు
బలువైన ఉట్ల పాలారగించీని
కొలది మీరిన దొంగ, కూగూగూ....

సౌరాష్ట్రి :

చందమామ రావో జాబిల్లి రావో
కుందనంపు పైడికోర వెన్నపాలు తేవో
పరమ వేదాంతసారములైన సంకీర్తనములు—

సామంతం :

ఇందిరాధిపుని సేవ యేమరకుండుట గాక
బొందితోడి జీవులకు బుద్ధులేటి బుద్ధులు
రేయెల్లా మింగి మింగి రేపే వెళ్ళనుమియు
బాయట నిద్రాదేవి పలుమారును
చాయలకు నిచ్చ నిచ్చ, చచ్చి చచ్చి పొడమేటి
మాయ జీవులకు నెల్ల మనికేటి మనికి....
మేలుకొలుపులు—

భూపాళం :

విన్నపాలు వినవలె వింత వింతలు
పన్నగపు దోమతెర పైకెత్త వేలయ్యా....
తందాన పదం—

బౌళి :

తందనాన ఆహి, తందనాన పురె తందనాన భళా తందనాన
బ్రహ్మ మొకటె పరబ్రహ్మ మొకటె పరబ్రహ్మ మొకటె, పరబ్రహ్మ మొకటె.

## రచనావైశద్యం :

ఇద్దరు భార్యలతో, పుత్రులతో, మనుమలతో కూడిన పెద్ద సంసారంతో మొదట తన స్వేచ్ఛకూ వేంకటేశ్వర భక్తికీ భంగంకలగని పద్ధతిని రాజుతో స్నేహం, ఆ వైభవం, తర్వాత దేవుని సన్నిధానంలో ఆచార్య పీఠం :— దేవుని నిత్యభోగాలకు, పవ్వళింపులకు, మేల్కొలుపులకు, అర్చనలకు, కల్యాణములకు గరుడోత్సవం, రథోత్సవం, తెప్పతిరునాళ్ళు, బ్రహ్మోత్సవం మొదలైన పండుగలకు నిత్యకృత్యములుగా అన్నమాచార్యులు తన సంకీర్తనములను వెనకు వేలు రచించి భక్తలోకాన్ని, పండిత పామరజనాన్ని సమ్మోహనపరచినవాడు. సాంసారిక జీవితంలో తనకు శిశువు పుట్టినప్పుడో, శిశువు దినదినప్రవర్ధమానుడై యింటిలో పారాడుతూ పెరుగుతూ ఆటలాడుతున్నప్పుడో అతనికి బాలకృష్ణుడి లీలలు కన్నులకు కట్టినట్లుతోచి, తన శిశువు లీలలలోనే బాలకృష్ణ రూపియైన వేంకటేశ్వరుని

లీలలను దర్శించి సహజ సౌందర్యం ఉట్టిపడే కీర్తనలను పాడేవాడు. ఇలాగే శృంగార కీర్తనలు, అధ్యాత్మ కీర్తనలు, ఆత్మప్రబోధాత్మకములో ఆత్మానుభవ వ్యంజకములో లోకవృత్త విమర్శకములో లోకోద్బోధకములో ఆయేరీతిగా వేనకువేలు పాడుకూవచ్చాడు. మహాభక్తాగ్రేసరుడుగా, మహాకవిగా, వాగ్గేయ కారునిగా మాత్రమేకాక. మహావిష్ణుని ఖడ్గమైన నందకపు అంశమున జన్మించిన అవతారపురుషుడుగా, ఆళ్వారుగా ప్రసిద్ధిపొంది దేవుని సన్నిధిలో తన కీర్తనలకు తన ప్రతిమామూర్తికి శాశ్వతస్థానం సంపాదించుకొన్నాడు.

కృతి, కీర్తన అని నేడు పిలువబడుతున్న సంగీత రచనకు అన్నమాచార్యులా నాడు పదమనీ, సంకీర్తనమనీ వాడుక. పదము భరతాచార్యునినుండీ అనేక సంగీతలక్షణ కర్తలు నిర్వచిస్తూ వచ్చిన గేయప్రబంధాలలో ఒకటి. మన సాహిత్య చరిత్రలో ఆదికవి యని పేరుపొంది మహాభారతంతోపాటు నన్నయ భట్టు ఆంధ్ర శబ్ద చింతామణి యనే భాషాశాస్త్రగ్రంథాన్ని (రచించాడో లేదోఅని పండితులవాదం) రచించి ఉండినట్లు ఆది గేయకవి అని పేర్కొనదగిన అన్నమాచార్యుడు తన కాలంలోనే పదకవితా మార్గదర్శి అనీ, పదకవితా సార్వభౌముడనీ బిరుదులు పొంది, అసంఖ్యాకములైన సంకీర్తనలతోపాటు సంస్కృతంలో సంకీర్తన లక్షణాన్నికూడా శాసించాడు. దీనిని ఆయన మనుమడైన చిన తిరుమలయ్య (చిన్నన్నకు అన్న) తెనిగించాడు. అందులోని కొన్ని ముఖ్యమైన పద్యములు ఇక్కడ తప్పక పరిశీలించతగినవి.

క॥ పదముల యర్థము పల్లవి
వదలక యన్నిటికి నేకవాక్యత చేయన్
గుదిగ్రుచ్చినట్లు తగులై
పదము తుదిన్ మరియు మరియు పల్లవి యమరున్.

క. పదములు శృంగారవధూ
మృదుమధుర మనోజ్ఞవాక్య మిశ్రములైనన్
విదితార్థ గ్రామ్యోక్తుల్
పదిలముగా పొంకమెరిగి పలుకం జెల్లున్

క. వల్లవనారీ మ్లేచ్ఛా
దుల్లాస మనోజ్ఞ బంధురోక్తులు చవియై
చెల్లును గ్రామ్యములైనను
హల్లీసక ముఖ్యనాటకాధిక ఫణితిన్.

క. వైరాగ్య వృద్ధికర గం
భీర పదశ్రేణి పొసగ చెనుపుచు నగ్రా
మ్యా రమ్య విష్ణుపరితో
దారములై యున్న జాలు ధరణి న్వెలయున్.

దేశి సంగీత ప్రబంధాలకు లక్షణం చెప్పడమే కాక, లక్ష్యరూపమైన పదములు నసంఖ్యాకంగా వ్రాసి పండిత, పామరజనుల సమానాదరం పొందినవాడన్నమాచార్యుడు ఆ దేశికైతలలోని సొగసులు పండితులకు తెలియడంకోసమో, తన తర్వాతి పండిత కవులకు, వాగ్గేయకారులకూ మార్గదర్శి కావడంకోసమో, దేశి పలుకుబళ్లు గ్రామ్య మధురోక్తులు, రసాస్వాదనకారులేగాని, పరిహారయోగ్యములు కావని చాటిస్తూ, ఆయన సంస్కృతంలోనే సంకీర్తన లక్షణం రచించాడు. ఆనాటి పండితలోకాని కది కొత్త కనుక, పాత్రోచితభాష మిషపై నాయికా నాయకభావం కల శృంగార సంకీర్తనలలో గ్రామ్య మధురోక్తికి చోటిచ్చినా, వైరాగ్యపదాలు మాత్రం గంభీర భాషలో ఉండాలని శాసించాడు. పదమనే పేరు అన్నమయ్యనాడు సంకీర్తనంతో సమానార్థకమే అయ్యుండినా క్షేత్రయ్యనాటికి శృంగార పదాలు పదాలుగా వేరుపడ్డాయి, త్యాగయ్యనాటికీ, నేటికీ వైరాగ్యపదాలు, సంకీర్తనలూ, కీర్తనలూ, కృతులూ అనిపించుకోతేలాయి. పద్య కవిత్వపు ఛందోబంధాలలో అస్వాభావిక మార్గాలు తొక్కిన భాషాదేవి పద కవితలో స్వేచ్ఛగా సహజ సుందర స్వరూపంలో దర్శనమిచ్చింది.

అన్నమాచార్యుడు అద్వితీయ ప్రతిభాశాలి, ఋషికల్పుడూ, పదంయొక్క అనంతరూపాలను తన రచనలలో ప్రదర్శించాడు. సంవాదగీతులు (డ్యూయట్స్) అన్నమయ్య కీర్తనలలో కొల్లలు: గోపికకు కృష్ణునకు సంవాదం: చెంచెతకు వేంకటేశ్వరునకు; యశోదమ్మకు గోపికలకు; బావామరదళ్ళ పరిప్రియాచక సంవాదాలు, అత్తా కోడళ్ల (లక్ష్మి సరస్వతుల) ఎత్తిపొడుపుల సంవాదం. ఈ విధంగా ఎన్నో. అన్నమయ్య శృంగార వైరాగ్యాలను పరిపూర్ణంగా సమానస్థాయిలో ఆరాధించాడు. తన తర్వాతి పదకర్తలకు, కీర్తన కర్తలకు ఆయన మార్గదర్శి అయినాడు.

ప్రభాకరశాస్త్రిగారు పరిశోధించి చెప్పిన చొప్పున అన్నమయ్యగారు రచించిన మధురకవితా రచనా విశేషాలు: జాజరలు (చర్చరి), చందమామలు, కోవెల, చిలుక, తుమ్మెద పదములు, లాలి సువ్వి, గొబ్బి, ఉయ్యాల, లాలి, జోల, జో జో, జే జే జయజయ, విజయీభవ, శోభన, మంగళ, వైభోగములు, మేల్కొలుపులు, నలుగులు దంపుళ్లు, కొట్నాలు, కూగూగులు, గుజ్జెనగూళ్ళు, చందమామ గుటకలు, నివాళులు, ఆరతులు; మంగళారతులు, జయమంగళాలు,

అల్లోనేరేళ్ళు, చాంగుబళాలు, బళాబళాలు, సాసముఖాలు, అవధానములు, తందానలు, వెన్నెలలు, చిత్తమా, మనసా, బుద్ధి సంభోధనలగు తత్త్వగేయాలు.

విజయనగరంపైకి గజపతులో మరే శత్రురాజులో దండెత్తి వచ్చినపుడు ఈయన అర్చించుకొనే దేవతా విగ్రహా లెత్తుకొనిపోవడం జరిగిందట. అప్పుడు చెప్పిన కీర్తన :

బౌళి :

ఇందిరా రమణు తెచ్చియియ్యరో మాకిటు వలె
పొంది యీతని పూజించ పొద్దాయనిపుడు....

అని ఆంజనేయుని, గరుత్మంతునీ, ప్రహ్లాదునీ, అర్జునుని, ఆదిశేషునీ, కార్తవీర్యునీ నుతించి శత్రువుల నోడించి విగ్రహాల తెచ్చిపెట్టమని అడుగుతాడు. ఇంకా యీయన సంకీర్తనముల వైవిధ్యాని కుదాహరణములు.

1. గోపీకృష్ణ సంవాదం - రామక్రియ

కృ. వద్దే గొల్లెతా, వదలకువే

గో. నీ, ముద్దు ముద్దు మాటలకు మొక్కేమయా ...

కృ. యాలే యాలే యాలే గొల్లెతా
నాలా గెరుంగవా నన్ను నేచేవు

గో. చాలున్ చాలునింక చాలు నీ రచనలు
పోలవు బొంకులు పోవయ్యా...

కృ. రావా రావా రావా గొల్లెతా
శ్రీ వెంకటగిరి చెలువుండనే

గో. నీవే నీవే నను నించితి కవుంగిట
కైవసమయితిని గదవయ్యా...

2 జాజఱ (ముఖారి)

చాలు చాలు నీ జాజఱ
జాలి పరచె నీ జాజఱ....
వలపు వేదనల వాడేను, యీ
తలనొప్పులచే తలకేను
పులకలమేనితో పొదలేను కడు
జలిగొని చల్లకు జాజఱ......

3. గొబ్బిళ్ల (నేపాళం)

కొలని దోపరికి గొబ్బిళ్లో యదు
కులస్వామికిని గొబ్బిళ్లో....
కొండ గొడుగుగా గోవుల గాచిన
కొండుక శిశువుకు గొబ్బిళ్లో...

4. అల్లోనేరేళ్ల (నేపాళం)

నెయ్యములల్లో నేరేళ్లో
ఒయ్యన నూరెడి ఉవ్విళ్లో....
పలుచని చెమటల బాహుమూలముల
చెలమలలోనా చెలువములో
తలతలమను ముత్యపు చెరగు సురటి
దులిపెడి నీళ్ల తుంపిళ్లో....

5. సాసముఖాలు (సహస్ర ముఖాలు = ఆదిశేష నుతులు) ధన్నాసి

సందడి విడువుము సాసముఖా
మందరధరునకు మజ్జనవేళా....
అమరాధిపు లిడు ఢాలవట్టములు
కమలజ ! — పట్టుము కాళాంజ.
జమలి చామరలు చంద్రుడ, సూర్యుడ
అమర నిడుదు పరమాత్మునకు...

6. చాంగుభళీ (పాడిరాగం)

చక్కని తల్లికి చాంగు భళా, తన
చక్కెర మోవికి చాఁగు భళా...
కులికెడు మురిపెపు కుమ్మరింపు తన
సళుపు జూపులకు చాంగు భళా...

7. సువ్విపాట (కేదారగౌళ)

సువ్విసువ్విసువ్విసువ్వని
సుదతులు దంచెదరోలాల....
వనితలు మనసులు కుందెనచేసిటు
వలపులు తగనించోలాల
కనుచూపులను రోకండ్లను
కన్నెలు దంచెదరోలాల...

8. మంగళం (రామక్రియ)

మరలి మరలి జయమంగళం
సొరిది నిచ్చలును మంగళం....
కమలారమణికి కమలాక్షునకును
మమతల జయజయ మంగళం
అమరజననికిని అమరవంద్యునకు
సుముహూర్తముతో శుభమంగళం...

## పెద తిరుమలాచార్యులు :

అన్నమాచార్యులకు పెద్దకుమారుడు నరసింహయ్య. రెండవ కుమారుడు పెద తిరుమలయ్య, పెద తిరుమలయ్యంగారు, తిరుమల తిరుమలాచార్యుడు, తిరుమలరాయదేశికుడు, తాళ్లపాక తిరుమలయ్య, మున్నగు పేర్లీయనకు వ్యవహారంలో ఉండేవి. వేటూరి ప్రభాకరశాస్త్రిగారీయన జన్మకాలం క్రీ. శ 1473 ప్రాంతమని వ్రాసి ఉన్నారు. అన్నమాచార్యుని జననం కూడ శాస్త్రిగారి పరిశోధిత గ్రంథాలలో ఒకచోట 1408 అనీ మిగిలినచోట్ల 1420 అనీ వ్రాశారు. చాగంటి శేషయ్యగారు వారి ఆంధ్రకవితరంగిణి 8 వ సంపుటంలో సహేతుకంగా చర్చించి అన్నమయ్య జననం 1408 అయి ఉండవలెననీ పెద తిరుమలయ్య జననం 1460 ప్రాంతమున అయి ఉండవలెననీ నిర్ణయించారు. తండ్రివలెనే పెద తిరుమలయ్య కూడా దాదాపు 90 సంవత్సరాలు జీవించి 1547 ప్రాంతముల వేంకటేశ్వరైక్యము చెంది ఉండవలెననికూడా చెప్పారు.

తండ్రిగారిలాగానే ఇతడుకూడ మహాభక్తాగ్రేసరుడు. సంగీత సాహిత్యముల దిట్టతనముకలిగి: వేంకటేశ్వరస్వామి కంకితముగా వేలకొలది సంకీర్తనములు రచించి, పాడి, అన్నమాచార్యులతోపాటు స్వామిసన్నిధి నున్న సంకీర్తన భాండాగారమువద్ద తనకుకూడ ప్రతిమామూర్తిని నెలకొల్పవలసిన మహిమను సంపాదించుకొన్నాడు. ఇతడు జన్మించునాటికి సాళ్వ నరసింహరాయలు పెనుగొండలో సామంతప్రభువయి ఉండి, అన్నమాచార్యులయెడ గురుభావముకలిగి ఉన్నాడు. ఆ తర్వాత 1487 నాటికి విజయనగర సింహాసనం ఆక్రమించి సాళ్వ నరసింహరాయలై 1495 వరకు పాలించడం, అటుపైని తుళువ వంశమువాడైన ఈశ్వర నరసనాయకుడు సింహాసన మాక్రమించి కన్నడరాజ్య రమారమణుడు కావడము, నరసనాయకుని వెనుక కొంతకాలం అతని పెద్ద కుమారుడు వీర నరసింహరాయల ఏలుబడి, పిమ్మట 1509 నాటికి కృష్ణదేవరాయలు గద్దె ఎక్కడమూ పెద తిరుమలయ్య ఎఱుకలో వరుసగా జరిగిన చారిత్రక సంఘటనలు, కృష్ణరాయలు సింహాసన మెక్కేనాటికి అన్నమాచార్యుడు లేడు. పెద తిరుమలా

చార్యుడు తిరుమలలో స్వామికి సంకీర్తనలద్వారాను అగ్రహార ప్రదానంద్వారాను నిత్యకైంకర్యములు చేయుస్తూ స్వామిసన్నిధిని మంచి పలుకుబడి కలిగి ఉన్నాడు. నిత్యమును స్వామి సాక్షాత్కారమును పొందుతూండడమే కాక, ఇతని చరిత్రలో కూడ కొన్ని మహిమాన్వితములయిన సంఘటనలున్నవని ఐతిహ్యము.

ఈయన చిన్నకుమారుడు చిన్నన్న అన్నమాచార్య చరిత్రలో....

"మండెముకోటలో మండలంబెరుగ
మండలాగ్రాహతి మహనీయ పుష్ప
దామమైధర్మాంగదసితిపొలిచె
ఏ మహామయుని అహీనగాత్రమున..."

అని తన తండ్రియైన పెదతిరుమలయ్య మండెముకోటకు పోయినపుడు అక్కడి మండలాధిపతి నరసనాయకుడనువాడు ఆచార్యునిపైకి కత్తి విసరగా అది పుష్పమాల యైనదట. ఆ నరసనాయకుడు తుళువంశపువాడైన కృష్ణరాయని తండ్రి ఈశ్వర నరసనాయకుడే అయి వుండాలని, అందువలన తాళ్ళపాకవంశమువారికిని, రాయలవంశమువారికిని మధ్య ఈర్ష్యాస్పర్థలుండేవనీ అనేక భాషాకవిపండితులకు అగ్రహారాదికము దానములు చేసిన కృష్ణరాయలు తాళ్ళపాకవారికేమీ ఈయక పోవడమూ, వారి పైతృకగ్రామమైన తాళ్ళపాక తమ గురువులైన వ్యాసతీర్థులకు దానము చేయడము అందుకు తార్కాణములనీ ప్రభాకరశాస్త్రిగా రూహించారు. తన మెడపైన కత్తి పూలమాలయిన కథను సూచిస్తూ పెదతిరుమలయ్య తానే వ్రాసికొన్న సంకీర్తనంకూడా ఉన్నది..."

శంకరాభరణం:

నాటికి నాడు క్రొత్త నేటికి నేడు క్రొత్త
నాటకపు దైవమవు నమో నమో.......
సిరుల రుక్మాంగదు చేతి కత్తిధార తొల్లి
పరుస ధర్మాంగదు పై పనిమాలాయ
హరి నీకృపకలిమి నట్లనే యరులచే
కరఖడధార నాకు కలువదండాయ........

ఈకీర్తన ప్రబలసాక్ష్యంగా కత్తికలువదండయినకథ చారిత్రికమయితీరవల సిందే; అంతేకాని, ఆ కత్తిని తిరుమలయ్యపైకి విసరిన నరసనాయకుడు కృష్ణ రాయల తండ్రియైన యీశ్వరనరసనాయకుడే అనడానికిగాని, అందువలన రాయల వంశమునకు తాళ్ళపాకవారి యెడల ఆదరం లేకపోయిందనడానికిగాని విశ్వాస నీయమైన ఆధారాలులేవనీ, ఆ నరసనాయకుడెవరో సామంత ప్రభువే అయి

వుంటాడని ఆంధ్ర కవితరంగిణీకారులైన చాగంటి శేషయ్యగారు అభిప్రాయ పడినారు. రాయలమంత్రియైన తిమ్మరుసును, అతని తమ్ముడైన గోవిందరాజును పెదతిరుమలాచార్యుడు స్వామికి చేసిన కైంకర్యములకు నిర్వాహకులుగా ఏర్పాటయినట్లు తిరుమలదేవస్థానశాసనాలలో కనబడుతుంది. అంతేకాక, కృష్ణరాయల తమ్ముడైన అచ్యుతరాయలు పూండి, సంగమకోటగ్రామాలను శాసనపూర్వకంగా పెదతిరుమలాచార్యులకు దానముచేసినట్లును ఆచార్యుడు వానిని తిరిగి స్వామికే సమర్పించినట్లును కూడ ఆ శాసనాలలో ఉన్నది. ఇందువల్ల వారికీ వీరికీ వంశ వైరముండినదనే వాదం నిలవదు. నరకృతివిముఖులును, వేంకటేశ్వర పాద పద్మారాధకులునైన తాళ్ళపాకవారును, కృష్ణరాయలును పరస్పరం ఉదాసీనులయి ఉండవచ్చును.

పెద తిరుమలయ్య అచ్యుతదేవరాయలతో స్నేహము కలిగియుండెను. రాయల జన్మనక్షత్రంరోజున తిరుమలయ్య తన ద్రవ్యముతో స్వామికి కైంకర్యం చేయించాడు. విజయనగరంలో విఠలేశ్వరస్వామి కైంకర్యాలకై పెద తిరుమలయ్య భూమి దానమిచ్చాడు స్వామి పుష్కరిణి జీర్ణోద్ధారము, మెట్లు, మండపాలు, నీరాడుమండపం, కొండమీన తాళ్ళపాకవారి యింటిముందరి మండపం, "సంకీర్తనపు రాగిరేకులు దాచిఉంచిన" సంకీర్తన భండారము, అక్కడ దీపారాధనలు, అక్కడ సంకీర్తనలుపాడే వైష్ణవులకు జీతాలు, గుడి అరణపు గ్రామాలలో చెరువులు, కాలువలు బాగుచేయించడానికి ధనదానం, ఆళ్వారుతీర్థం దగ్గర శ్రీ లక్ష్మీనారాయణస్వామి ప్రతిష్ఠ, ఎగువ దిగువ తిరుపతులను, ఇంకా ఇతర స్థలాల వెలసిన దేవుళ్ళకు భక్ష్యభోజ్యాది నైవేద్యములను, నిత్య, పక్ష, మాస, వర్షోత్సవాదులను, వనభోజనాది వినోదాలను, తమ వంశపారంపర్యంగా తమ పేర జరిపించడానికి 13 గ్రామాలను వేలకొలది వరహాలు, పణాలు, నర్పణాలు శ్రీ భండారమునకు అర్పించగా అందుకు స్థానపతులు సమ్మతిగా శాసనాలు చెక్కించారు.

రచనలు :

పెదతిరుమలాచార్యుల రచనలు :

1. శృంగార సంకీర్తనములు
2. అధ్యాత్మ సంకీర్తనములు
3. వైరాగ్య వచనగీతాలు
4. శృంగార దండకము
5. చక్రవాళ మంజరి

6. శృంగార వృత్తశతకము
7. వేంకటేశ్వరోదాహరణము
8. నీతి సీస శతకము
9. సుదర్శన రగడ
10. రేఫఱకారములు
11. భగవద్గీత తెలుగు వచనము
12. ద్విపద హరివంశము
13. మేలుకొలుపు ద్విపద "?"
14. ఆంధ్ర వేదాంతము

ఆంధ్ర వేదాంతకర్తలలో తన తండ్రిని చేర్చి చిన్నన్న యిలా వ్రాశాడు :

"వేదంబు తెనుగు గావించి సంసారఖేదంబు మాన్పిన కృష్ణమాచార్య
ఘనతర పంచమాగమ సార్వభౌము ననఘు శ్రీతాళ్ళపాకాన్నమాచార్య తలచి"

"—ఉరుయోగ సామ్రాజ్యవిభవజనకుండు తిరుమలాచార్యవరుండు
వేదాంత విద్యాప్రవీణుడై ఆంధ్ర వేదాంతమొనరించి ద్విపద రూపమున
హరివంశకావ్య మాయతరసస్ఫూర్తి.... ..."

సింహగిరి నరహరి వచనములను పేరితో తాళగంధి వచన గీతములను రచించిన కృష్ణమాచార్యులు, అన్నమాచార్యులు, పెద తిరుమలాచార్యులు తమ సంకీర్తనములద్వారా ఆంధ్రవేదాంతకర్తలని, పంచమాగమ సార్వభౌములని అనిపించుకొన్నారు. పెద తిరుమలయ్యకు శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్య శ్రీరామానుజ సిద్ధాంతస్థాపనాచార్య, వేదాంతాచార్య, కవితార్కికకేసరి, శరణాగత వజ్రపంజర బిరుదాలు కలవు. ఈతనికి వెంకటేశ్వరస్వామి మూడు పురుషాంతరములవరకు ప్రత్యక్షమును ఏడు పురుషాంతరములవరకు మోక్షమును ఇచ్చెదనని వరమిచ్చాడట. పెద తిరుమలాచార్యులకు ఉపదేశగురువైన కందాళ అప్పలాచార్యులే తెనాలి రామకృష్ణకవికికూడ వైష్ణవమిచ్చిన గురువు.

అన్నమాచార్యుల రచనలలో పురాణయుగపు సారళ్యము, సౌకుమార్యము, దేశిపలుకుబడుల తియ్యదనము కనిపిస్తాయి. పెద తిరుమలాచార్యుడు పట్టుమని ప్రబంధయుగంలో రాయలకు సమకాలికుడైనవాడు గనుక ఆయన కవితాకన్యక ముక్తపదగ్రసములు, యమకాలు, మొదలయిన శబ్దాలంకారముల సొమ్ములను ధరించిన ప్రౌఢతనంతో రామరాజభూషణాది ప్రౌఢప్రబంధకవుల కవితాసుందరిని తలపింపజేస్తుంది

వేంకటేశ్వరస్వామినీ పద్మావతీ అమ్మవారినీ నాయికా నాయకులం జేసి సుమారు 120 పం క్తుల వరకు చెప్పిన చక్రవాళమంజరి అనే ఖండకావ్యము ప్రతి పాదమూ ముక్తపదగ్రస్తాలంకారంతో నడిపాడు.

"తన రాక కోరు కాంతామణి యలరు అలరుల పొదరింటికరిగి చెల్వార
ఆరయ చేపట్టి యనుభవం బొసగి సగియించుగతి ఘర్మజలమార విసరి
సరిలేని విరహంబు చల్లార్చి కలసి కలసిగు చేర్చి వేంకట శైలవాస
వాసవార్చితుడు శ్రీవామాక్షితోడ తోడప్రవేశించె తొల్లింటినగరు..."

ప్రతిపాదంలోని చివరిమాటతో దాని తరువాతి పాదం ఆరంభిస్తుంది. అక్షరాలు అవే అయినా అర్థం వేరవుతూ వుంటుంది.

ఇతడు రచించిన నీతి శతకం మాత్రం పసిబాలురు మొదలు ప్రౌఢ వయస్కులైన పరిపాలకుల (రాజుల) వరకు అందరకు సులభంగా యీనాటికిని బోధపడే తేటతెనుగు పలుకుబడులతో రచించాడు.

చెరయు కొల్లయు లూటి సీమలో లేకుండ దండెత్తవలయు శాత్రవులమీద
గడియు దవసంబు కడునీరు కలుచో టరసి పొందుగ విడియంగవలయు
కైకొన్నభూముల కాపుగా పాళెంబు లొనరించి మరి యవ్వ లొత్తవలయు
గజముగుర్రము బంటుగాసి పొందకయుండ అని పోరి పగర గెల్వంగవలయు
బుద్ధిపదరక యెప్పుడు భూవిభుండు మెల్ల నే బాహుశౌర్యంబు మెరయుటొప్పు
కలితలక్ష్మీశ సర్వజగన్నివేశ విమలరవికోటి సంకాశ వేంకటేశ.

అన్ని పద్యములూ....కలిత లక్ష్మీశ.... వేంకటేశ.... అనే మకుటంతో నడుస్తాయి.

"ఇందీవరశ్యాము సందేశముంగాంచి, హర్షించి ధాత్రీకుమారీ కరస్థంబు గావించి, ఉన్నంతలో తత్సఖుల్ చేరనేతెంచి అయ్యిందుబింబాస్య నుద్యానకేళిన్ వినోదింప బోధించి, నానాద్రుమస్తోమ విశ్రామకామప్రియా రామసీమం బ్రవేశించి మందారముల్ దూసి, కుందంబులంజేరి, అందంద బైలాచి, సందీకచేవైచి, నీపంబులంబట్టి ధూపంబులన్‌ముట్టి పంతంబులన్, రంతులన్ వింతగా, ఏలలం, తూగుటుయ్యాలలన్ పాడుచున్ బాలలన్ పోకపూబాలలన్ వేయుచున్, బంతులన్ మల్లెపూబంతులన్ రువ్వుచున్ వంతులన్ మారి పేమంతులన్ మీటుచున్..." ఈ విధంగా శబ్దాలంకారాలతో సుందరాతి సుందరంగా సాగిపోతుంది శృంగార దండకం.

సంకీర్తనములకు రాగములనే సూచించారు గాని, తాళాలను సూచించలేదు. కాని, పెద తిరుమలయ్య వైరాగ్యవచనమాలికా గీతాలు తాళగంధులై వచనగేయములుగా రచించాడు. వీటికి రాగములను, తాళములనుకూడ సూచించారు.

రామక్రియ - రూపకము

" క్షీరాబ్ధిశయనా కమలంబు సూర్యుని కెదురు చూచినట్టు
నా హృదయపద్మంబు రవిమండల వర్తివైన నీ కెదురు చూచుచున్నది
కుముదంబులు చంద్రోదయం బపేక్షించినట్లు నా కన్నుంగలువలు
భవదీయముఖ చంద్రదర్శనం బపేక్షించుచున్నవి
మయూరంబులు మేఘాగమనంబునకుం జెలంగినట్లు నా మనోమయూరంబు
నీలమేఘవర్ణంబైన తిరుమేను దలంచి యానందించుచున్నయది...."

ఈ వచనమాలికా గేయాలలో సూచించిన తాళాలివి ; ఏకతాళి, తివడ, రూపకం, జంపె,పల్లవి. వీనిలో తివడపల్లవి అనేవి ప్రాచీనకాలంలోనే ప్రయోగంలో వుండేవి; మిగిలిన వీనాటికీ ప్రసిద్ధమైనవి. గుజ్జరి, శంకరాభరణం, శ్రీరాగం రామక్రియ, లలిత, మలహరి, భూపాళం, సాళంగనాట, వరాళి, భౌళి, ముఖారి, నాదనామక్రియ, పాడి, ఆహిరినాట, గుండక్రియ, శుద్ధవసంతం, మాళవి, ధన్నాసి, సామంతం, దేశాక్షి, కాంభోజి, దేవగాంధారి, నారాయణి, మాళవిగౌళ, హిందోళవసంతం, నాటరాగాలు యీ వచమాలికా గేయాలలో వాడబడినాయి.

తాళ్ళపాక వారి సంగీతం గురించి ఆమూలాగ్రంగా మిగిలిన ఒకరిద్దరు తాళ్ళపాక కవులను గురించి తెలుసుకొన్నాక పరిశీలించవచ్చు.

జ్ఞానం వచ్చిన నాటినుండి సగం వయస్సు వరకు తండ్రి చాటునే ఉండి, తండ్రిగారి అనుభవసారమంతా ఆకళించుకొన్న పెద్ద తిరుమలయ్యకు వేంకటేశ్వర భక్తి-సాహిత్య సంగీతములద్వారా స్వామిసేవ తప్ప వేరు కోరికలేవీ లేని సంతృప్తితో సకల మానవులకూ జీవితానుభవసారమును ప్రబోధింప గల ఆత్మ విశ్వాసంతో కనిపిస్తాయి ఆయన సంకీర్తనములు.

లలిత : ఇచ్చితివి తొల్లె నాకు యియ్యంగల వన్నియును
మచ్చిక నీ శరణన్న మాత్రమే చాలు,
సామీప్యమునడుగ, సారూప్యమునడుగ
కామించి సాయుజ్య సాలోక్యము లడుగ
భూమింగాని పాతాళంబునగాని దివింగాని
సమాన నీ దాసులలో సహవాసమియ్యవే,

బౌళి : నాగుణాలు తలంచక నీగుణాలె తలంచుకో
ఏ గతిని మానరాదు యింకనైనను.
తెచ్చినాడు గురుడునిన్ను తిరువారాధన సేయ
ఇచ్చినాడు తలంచుకో యింకనైనను,
అచ్చుమోపి దాసునిగా అంగవించిరి నీదాసు
లిచ్చనన్నుం జేపట్టు మిందులకునైనను....

ఈ కీర్తనలో తమ గురువైన అన్నమాచార్యుని మహిమవలన వేంకటేశ్వరుడువచ్చి తమ యింటిలో వెలసినాడనీ, గురువులు తనకు శంఖచక్రము లచ్చువేసి, స్వామికి దాసునిగా చేశారుగనుక, తనను చేపట్టుమని స్వామిని వేడుకొన్నాడు. మిగిలిన కీర్తనలలో నేమి, వచనమాలికా గీతాలలో నేమి తిరుమలయ్య ధోరణి యింటిలో వెలసిన రక్షకుడూ, ప్రేమాణవూ అయిన తండ్రితో గారాబు కొడుకు గోముగా ఆడుకొనే చనవుమాటలలో సాగుతుంది. రామాయణ భారత భాగవతాలలోనివీ, ఇతర పురాణాలలోనివీ విష్ణుని అవతార లీలలను గాథలుగా స్ఫురింపజేసే కీర్తన లెన్నో రచించాడు. వేదాలనుంచీ, ఉపనిషతులనుంచీ కూడా చాల విషయాలను తన కీర్తనలలో సంగ్రహించడంచేత ఈయన తన తండ్రివలెనే ఆంధ్ర వేదాంతకర్త అనీ ఆంధ్రాగమ సార్వభౌముడనీ కూడా అనిపించుకొన్నాడు.

ధన్యాసి : హరి నీ దాస్యమునకు నవియేమి సరిగావు

అరయ శుకుండు నిన్నునంటి నీయంతాయెను....
వగలం దపముసేసి, వసిష్ఠ న య్యెద నంటె
వొగి వసిష్ఠుండు మింట నొక్కచుక్క
ఎగువ యజ్ఞాలుచేసి యింద్రుండ నయ్యెద నంటె
దిగువ నా యింద్రుండొక దిక్పాలుడే....
అడిగాన యేయుపాయములు నే నొల్లక
కడిసి నీ శరణనే గతిగంటిని
యెదుట శ్రీ వేంకటేశ యిట్టె నాదెసజూచి
సదయుండవై మమ్ము చక్కంగ నేలితివి.........

శ్రీహరి శరణమనే అవస్థాభేదముతో పుణ్యపాపములా, మంచిచెడ్డలా కొలది గొప్పలా విలువ లెలాగు మారునో ఒక సంకీర్తనంలో వివరించాడు.

గౌళ : అప్పుడే కృతార్థుండు అప్పుడే లోకపూజ్యుండు
తప్పులేదు ముప్పులేదు దైవమే గురుతు
ఎవ్వడు పుణ్యుండుకాడు ఎవ్వడు పాతకికాడు
ఇవ్వల తొంటి జన్మములెంచి చూచితే
నెవ్వగని జీవునికి నేరుపేది నేరమేది
అవ్వల శ్రీహరి శరణమన్నదే గురుతు....
పుట్టని కులములే విభజించని వసువేది
ఇట్టి యీ జీవులనెల్ల యెంచిచూచితే
గుట్టుతెలిసితి మిందు కొంచెమేది దొడ్డయేది
అట్టువిట్టు హరిదాసుడైనదే గురుతు....

పెదతిరుమలయ్య అహోబిల నారసింహునిపై ని తెలుగునా, సంస్కృతమునా కూడా కీర్తనలు చెప్పాడు. శ్రీరంగ దైవమును గురించి చెప్పిన కీర్తన - కావేరి మీది శ్రీరంగనాథునిగురించే: ఆ సంగతి చరణంలో స్పష్టంగా ఉంది.

ధన్యాసి : బ్రహ్మ పూజించె రఘుపతి విభీషణునకిచ్చె
బ్రహ్మణ్యం దీ రంగపతిం గొలువరో॥
కావేరి మధ్యరంగక్షేత్ర మల్ల దిగో
శ్రీ విమానమదిగో శేషపర్యంక మిదే
దేవుండల్లదె వాడే దేవి శ్రీలక్ష్మి యదే
సేవించరో నాభిం జిగురించె నతండు.

కవిపండిత పోషకుడైన కృష్ణదేవరాయలవంటి కావ్యగీతిప్రియుడు సమకాలికుడైన పెదతిరుమాలాచార్యుని తన కొలువునకు రప్పించుకోడానికి తప్పకుండా ప్రయత్నించి ఉంటాడనీ, కాని వేంకటేశ్వరభక్తి విభూతి సంపన్నుడైన యీతడు హరిదాసస్వామి అక్బరును తిరస్కరించినట్లు నిరాకరించి ఉంటాడనీ ఊహించడానికి అవకాశమిచ్చే కీర్తనలు కొన్ని పెదతిరుమలయ్యగారి రచనలలో కనిపిస్తాయి. వానిలో ఒకటి....

భూపాళ : పోయిన బంధము లటు పోవుగాక
ఛీ యని రోసి యొంగిరి చేకొనేదా॥
తొల్లి చేసిన కర్మాలు తొలగచేసె గురుండు
చెల్లెబో ఇంకనవి సేసేదా
వొల్లక విత్తుగా తమ వుముకం బాసినమీద
మొలమి క్రమ్మర నవి మొలచేనా॥....
శ్రీవేంకటేశ్వరుని జేరంజూపె గురుండు
దావతి యితరులం దడవేదా
భావించి పరుసవేది పసిడియైన లోహము
వేవేలైన తొల్లిటి విధమయ్యే॥

అందుచేతనే రాయలు తన పేరుమీదకాక, తిమ్మరుసు గోవిందయ్యల నిర్వాహకముద్వారా తిరుమలయ్యగారిచే స్వామికి కైంకర్యములు సాగేటట్లు ప్రచ్ఛన్నముగా ఏర్పాట్లు చేయించినట్లుకూడ ఊహించుకోవచ్చు.

పెద తిరుమలయ్యగారి రాజాస్థాన వైముఖ్యాన్ని చాటే మరొక కీర్తన :

సామంతం : తాము దెలియరు తగం జెప్పిన వినరు
పామరపుం దమ కర్మఫలమో హరిమాయయో॥
ధర గొందరు మూర్ఖులు తగనొక్క రాజుగొల్చి

పరిచారకునిదిట్ల భంగపడ్డట్టు
ఇరవుగ శ్రీవేంకటేశుం గొల్చేవారి వారు
విరసాలాడుచుం దామే విఫలులై పోవుదురు.

ఈ కీర్తనను బట్టి, ఎవరో రాజు కొల్వులోనివారు ఇతనిని విరసాలాడి తిరస్కృతులైనట్లు స్పష్టంగా స్ఫురిస్తుంది.

అన్నదమ్ములా, తల్లికొడుకులా మమత లెటువంటివో చెపుతూ అన్నిటి కంటె శాశ్వతమైనది వేంకటేశ్వరునియెడ మమతారహితమైన భక్తియే అని ప్రకటిస్తాడొక కీర్తనలో :

దేశాక్షి ; ఇద్దరి దేహసంబంధమిదిగో మాయ
గద్దించి యేడనుండునో కడసారి తాను...
తోడబుట్టిన మమత తొడగికొన్నాళ్ళకు
వాడిక పుత్రులమీద వలె నుండదు
వేడుక వారెవ్వరో వీరెవ్వరో కాని
కూడుపెట్టి వీరికి కొట్లాడే వారికే....
తల్లిమీదగల భక్తి తనకే కొన్నాళ్ళకు
ఇల్లాలిమీదవలె యింతవుండదు...

భక్తిలో హాస్యరసమును చొప్పించు సంకీర్తనములు కూడా పెదతిరుమలయ్య రచించాడు. ఇలాటి కీర్తనలద్వారా పసివారిని, పామరులను కూడ రంజింపజేసి, భక్తిపైపు మనస్సులను మళ్ళింపవచ్చు. ఇందులో రామునితో పోరి ఓడి పోయిన రావణ సైనికుల తత్తరపాటు వర్ణించాడు.

బౌళి : అనుచు రావణ సేనలటు భ్రమయుచు వీగె
ఇనకులచంద్ర నేడిదిగో నీ మహిమ...
దదదద దదదద దశరథతనయా
కదిశితి కకకక కావవలె
అదెవచ్చె బాణాలు హానాధ హానాధ
పదపద పదపద పారరో పవుంజులు...
తెతెతెత్తె తెతెతెత్తె తెరువేదిలంకకు
తతతత్త తలమసి దాగుదురు
గతియైన శ్రీ వేంకటగిరి రఘునాధ
సతమై మమ్మింకనేలు జయజయ నీకు...

సుద్దులు అనబడే దేశీయములైన పాటల ఫణితిలో సాగిన కీర్తనలు ఒకటి రెండు మచ్చునకు :

ఆహిరి : మాయింటికి రావోయి మాధవా
మాయలెల్ల గంటిమిదే మాధవా...
మచ్చు చల్లేవు వలపు మాధవా
మచ్చికలెల్ల జేసితి మాధవా
మచ్చెము నీపై నిదె మాధవా, యింక
మచ్చరపు చూపులేల మాధవా...

లలిత : ఆసలు చెరచకుమీ అచ్యుతా
ఆ సుద్దులె యీ సుద్దులు అచ్యుతా...
అలవాటె తొల్లి నీకు అచ్యుతా
అలుగము ఇంక నీతో అచ్యుతా
అలయకుమింక నీవు అచ్యుతా నిన్ను
అలమి పట్టెంగాని అచ్యుతా...

దేసాళం : కొల్లవలపులు చల్లే గోవిందరాజనిన్ను
గొల్లెతలు నవ్వేరు గోవిందరాజ...

శ్రీరాగం : వట్టివలపు చల్లకు విష్ణుమూరితి. నా తో
వెట్టిదీర మాబాడు విష్ణుమూరితి...

వేదాంత తత్త్వ బోధకములైన కీర్తనలు :

దేవగాంధారి : ఎంతకాలంబైన తప్పదు ఎవ్వరికి నేమనగవచ్చును
దొంతికడవలబోని కొలుదులు తొలుత పుణ్యములు॥

శ్రీరాగం ; తలమేల కులమేల తపమే కారణము
ఎలమి హరిదాసులు ఏజాతి యైననేమి॥

సాళంగం : ఇవియె తొల్లిటి వారు యెంచినడచిన శాంతి
వివరించి కొలిచితే విష్ణుదే శాంతి॥
వూరకే నిశ్చింతమున నుండగలదే శాంతి
కోరకుండే సాత్త్వికగుణమే శాంతి
భారము శ్రీవెంకటేశుపై బెట్టుటే శాంతి
ధీరతతోడుత గుణాతీతుండౌటె శాంతి॥

పాడి : ఎవ్వరేమి సోదించే దెవ్వరే మెరింగేరు
అవ్వలనివ్వల శ్రీహరియే దైవము...
ధరం గాశిలోన హరి తారకబ్రహ్మమని
హరుడే బోధింపజొచ్చె నందరికిని
అరుదుగా రామనామ మతని పట్టపురాణి
గిరిసుత పార్వతి కీర్తింపదొడగె...

ఈ కీర్తనలోని చరణంలో అధ్యాత్మరామాయణ ప్రశంసకలదు. ఇది సంస్కృతంలోని అధ్యాత్మమును గురించియే అయి ఉండవలెను. తెనుగులో అధ్యాత్మరామాయణం కీర్తనరూపమున మరొకనూరేండ్లకు మునిపల్లె సుబ్రహ్మణ్య కవిచేత వేంకటేశ్వరాంకితంగానే వెలువడింది.

అన్నమాచార్యులు పరమపదమందిన ఫాల్గుణ బహుళ ద్వాదశినాడు పెద తిరుమలయ్యగారు ఆర్థికశ్రాద్ధమున రచించిన ఆహ్వాన సంకీర్తనం.

శ్రీరాగం : దినము ద్వాదశినేడు తీర్థ దివసమునీకు
జనకుండ అన్నమాచార్య విచ్చేయవే..
వై కుంఠాననుండి యాళువారలలోపలనుండి
లోకపు నిత్యముకులలోన నుండి
శ్రీకాంతతోడనున్న శ్రీవేంకటేశుగూడి
ఈ కడ నారగించ నింటికి విచ్చేయవె,..

## చిన తిరుమలాచార్యులు :

పెద తిరుమలాచార్యుల పెద్ద కుమారుడు చిన తిమ్మయ్య. చిన్న తిరుమలయ్య, లేక సిరుతిరుమలయ్యంగారు, లేక చిన్న తిరుమలాచార్యులు. తాతగారయిన అన్నమాచార్యులు నరసింగరాయల కొలువువదిలి, తిరుమల చేరుకొన్న తర్వాత 1480 ప్రాంతాన చిన తిరుమలాచార్యులు జన్మించి ఉండవచ్చును 1553 ప్రాంతమువరకూ ఇతడు వేంకటేశ్వరస్వామికి కైంకర్యము చేయించిన శాసనాలు కనబడుతున్నవి.

తండ్రి తాతల సత్కవితాసంగీత సంప్రదాయము, వెంకటేశ్వర భక్తినిష్ఠా, సంస్కృతాంధ్రప్రాకృతాది భాషావైదుష్యమూ కలిగిన చిన తిరుమలయ్యకు అష్టభాషాకవి చక్రవర్తి అనీ, శ్రీ రామానుజ సిద్ధాంతస్థాపనాచార్య, వేదాంతాచార్య, కవితార్కిక కేసరి అను బిరుదాలున్నట్లు శాసనాలవల్ల తెలుస్తోంది.

### రచనలు :

ఇతడు అన్నమాచార్యులు సంస్కృతంలో రచించిన సంకీర్తన లక్షణాన్ని తెలుగు చేశాడు. దీన్నిగూర్చి ముందే చెప్పుకొన్నాము, సంస్కృత, ప్రాకృత, శౌరసేని, మాగధి, పైశాచి. ప్రాచీ, అవంతీ, సార్వదేశి, భాష లెనిమిదింటిలోను శ్రీ వేంకటేశ్వరస్వామిని గూర్చి అష్టభాషా దండకం రచించాడు.

సంకీర్తన లక్షణంలో గీతగోవిందకర్త అయిన జయదేవునిగూర్చి యీ విధంగా స్మరించాడు.

"ఘనతమీరంగ జయదేవ కవివరేణ్యు
డందమైనట్టి గీతగోవిందమందు
అంచితాష్టపదులు పల్కొనట్ల పచము
పరగునెనిమిది పదములు పల్లవియును..."

మ॥ "ధరలో తాళ్ళపాకయన్నమగురూ త్తంసుండు సంకీర్తనా
పరిశుద్ధిన్ మును జేయబూనితగ నుత్పాదించె తల్లక్షణం
బరుదై మించిన సంస్కృతంబున కవీంద్రానంద సంధాయియై
పరిపూర్ణాఖిల శాస్త్రసమ్మతముగా భావజ్ఞు లౌనౌననన్."

గీ॥ అలరు తాళ్ళపాకయన్న యార్య సుతుడు
తిరుమలార్యు డఖిలదేశికుండు
తత్పుత్రాగ్రజుండ ధరలోన చిన తిమ్మ
యాహ్వయుండ తండ్రియనుమతమున.

మ॥ పరమామ్నాయసమానమై వెలయు నుత్పైతామహగ్రంథమున్
వరచాటూక్తి మదీయపుణ్యజనక వ్యాఖ్యాతమున్ వేడ్కదా
చరణాంభోరుహముల్ మదిందలచి సచ్ఛాస్త్రజ్ఞులింపొందగా
వరుసంజెప్పెద బద్యరూపమున తద్వాక్యానుసారంబుగన్.

ఇవికాక ఇతడు తండ్రితాతలవలెనే వేలకొలది శృంగారసంకీర్తనములను, అధ్యాత్మ సంకీర్తనములను రచించాడు

వేంకటేశ్వరస్వామికి, దిగువ తిరుపతిలోని దేవుళ్ళకు చాలా కైంకర్యాలు చేయించాడు

గోవిందరాజస్వామికి పెండ్లి తిరునాళ్ళు జరుపడానికి నేడియం అనే గ్రామపు రాబడిలో సగం యిప్పించేటట్లు, గోవిందరాజ, విఠలేశ్వర, అచ్యుత పెరుమాళ్, రఘునాథ, వరదరాజ, లక్ష్మీనారాయణులకు, హనుమదాలయంలో తానే ప్రతిష్ఠించిన నరసింహస్వామికిని సేవలకై చిత్తి చిత్తానక్షత్రంలో తన జన్మదినోత్సవ కాలంలోను, వైశాఖ మృగశిరలో తనతండ్రి తిరునాళ్ళకాలంలోను గోవిందరాజస్వామి గుడిదగ్గర సుదర్శనచక్రానికి కైంకర్యాలకై వెదుమప్పాక మనే గ్రామాన్ని అర్పిస్తూ శాసనాలు చేయించాడు.

మంగాపురం కళ్యాణ వేంకటేశ్వర దేవాలయం పునరుద్ధరణం చేయించి స్వామి దివ్యవిగ్రహాన్ని వెలయించి, ఆళ్వార్లతో, భాష్యకార్లతో, దేశికులతో సహా తన తాతగారయిన అన్నమాచార్యుల విగ్రహాన్నికూడా ప్రతిష్ఠించాడు. కాని, తరువాతివారెవరో అన్నమాచార్య్య విగ్రహాన్ని అక్కడ లేకుండా చేశారు. కళ్యాణ వేంకటేశ్వర దేవాలయ్స్థంలో చిన తిరులయ్య చెక్కించిన శాసనాలన్నీ

తెలుగులో ఉన్నాయి. తిరుమలలోని స్వామి సన్నిధిని చెక్కించిన తాళ్ళపాకవారి శాసనాలన్నీ స్థానాపతుల ప్రాబల్యంవల్ల కాబోలు తమిళంలోనే ఉన్నాయి. పెద తిరుమలయ్య పుష్కరిణి శాసనంమాత్రం తెలుగు పద్యంలో ఉంది.

చిన తిరుమలయ్య కృష్ణరాయని తర్వాత నేలిన అచ్యుతరాయ సదాశివరాయల పరిపాలనమును కన్నులార కాంచినవాడు. సదాశివరాయల రాచరికకాలమున పరిపాలనా వ్యవహర్త అళియరామరాయలు. ఆయన ఆస్థాన బయకారుడయిన రామామాత్యుడు స్వరమేళకళానిధికర్త చిన తిరుమలయ్యకు సమకాలికుడే. అచ్యుత దేవరాయలు స్వామికి ప్రతియేడును ప్రబంధ పుష్పాంజలులను (సంగీత సాహిత్య రచనాత్మక సేవ) అర్పించేవాడు.

అన్నమాచార్యుల పదములను గురించి చిన తిరుమలయ్య చెప్పిన ప్రస్తుతి పదం :

సురలకు నరులకు సారిది వినవిన
అరుదు తాళ్ళపాక అన్నమయ పదములు॥
చక్కెరై చవిజూపీ జాలై తావిచల్లీని
అక్కజపు మాతువజ్రాలై మెరసీని
నిక్కటద్దములై మా నిలువునీడలు చూపీని
అక్కర తాళ్ళపాక అన్నమయపదములు॥
నెట్టన వేదాంతములై నిత్యములై పొడచూపీని
పుట్టుతోనె గురువులై బోధించీని
గట్టివరాలిచ్చే శ్రీ వేంకటనాథుని మెప్పించీని
అట్టె తాళ్లపాక అన్నమయ పదములు

అన్నమాచార్యుని పొగడుతూ ఇతడు వ్రాసిన సంకీర్తనములు చాలా ఉన్నాయి.

లలిత :

తాళ్లపాకాన్నమాచార్య దైవమవు నీవు మాకు
వేళమె శ్రీహరి గన వెరవానతిచ్చితివి
గురుడవు నీవేసుమ్మీ కుమతినైన నాకు
సరవి బ్రహ్మోపదేశము సేసితి
పరమ బంధుడవై నా పరికింప నీవే సుమ్మీ
వరుసనే జెడకుండా వహించుకొంటివి

దేసాళం :

ఈతడే ముక్తిదోవ యీతండే మాయాచార్య
డీతడు గలుగబట్టి యిందరు బదికిరి

అదివో తాళ్ళపాక అన్నమాచార్యులు
యిదె వీడె శ్రీ వేంకటేశు నెదుట
వెదవెట్టి లోకములో వేదములన్నియు మంచి
పదములు సేసిపాడి పావనము చేసెను

సౌరాష్ట్రం :

హరియవతారమె యాతడితడు
పరమ సంకీర్తన ఫలములో నిలిపె...
చరియించు నొకవేళ సనకాది మునులలో
హరిబాడుతాళ్ళపా కన్నమయ్య
తిరమై యాళువారల తేజముతానె యుండు
గరుడా నంతముఖ్యఘనుల సంగడిని....

ఇవీ ఇటువంటివే అన్నమాచార్యులనూ ఆయన సంకీర్తనములను స్తుతి చేస్తూ రచించిన కీర్తనలు కొన్ని తప్ప, ఇతర సంకీర్తనములు ఇప్పటికి అచ్చు పడినవాటిలో చిన తిరుమలయ్య రచనలు ఎక్కువగా బయల్పడలేదు.

చిన్నన్న :

పెద తిరుమలయ్యకు జ్యేష్ఠపుత్రుడైన చినతిరుమలయ్యకు తర్వాత అన్నయ్య పెదతిరువెంగళనాథుడు, చిన తిరువెంగళనాథుండనే చిన్నన్న, కోనేటి తిరువెంగళనాథుడనే మరొక కుమారుడూ కూడా కలిగారు. వీరిలో అన్నయ్యను గురించి ఏమీ తెలియదు. పెదతిరువెంగళనాథుడు పరమభక్తుడనీ, సంకీర్తనములు పాడుతుంటే వేంకటేశ్వరస్వామి సాక్షాత్కారమిచ్చి, వింటూ నర్తించే వాడనీ ప్రతీతి. అన్నయ్యా పెదతిరువెంగళుడుకూడా అల్పాయుష్కులై ఉంటారు. తరువాతివాడైన చిన్నన్న ద్విపదకవిత్వానికి పేరుపొందిన మహాకవి. అద్యతనులు చాలమంది ఇతనిని వాగ్గేయకారునిగా పేర్కొన్నారు; కాని, ఈతని సంకీర్తనము లేవీ దొరకలేదు తాను రచించిన అన్నమాచార్య చరిత్రము, అష్టమహిషీకళ్యాణము, పరమయోగి విలాసము, ఉషాపరిణయము అను ద్విపద కావ్యాలలో కూడ ఇతడు తన సంకీర్తనరచనమును గురించి చెప్పుకొన్నట్లు కన బడదు. దినములోననె వేయి ద్విపదలంపొంద వినుత వర్ణనలతో విరచించువాడ, కవిశిరః కంపయోగ్యప్రతిద్విపదనవ బిరుదాంకుడ వేంకటేశ్వర పాదపద్మవాసనాలోలుపస్వాంత షట్పదుడ అని మాత్రం చెప్పుకొన్నాడు.

ఇతని అష్టమహిషీ కళ్యాణం – శ్రీకృష్ణునికి రుక్మిణీ సత్యభామాది అష్ట భార్యలు కలిగిన కథలు చెప్పు 5 అశ్వాసాలగ్రంథం. పరమయోగి విలాసం

విష్ణుభక్తులైన పన్నిద్దరాళ్వారుల చరిత్రము, యామునాచార్య రామానుజాచార్యాది వైష్ణవ ప్రవర్తకుల చరిత్రము వర్ణించే గ్రంథం. ఉషాపరిణయం హరివంశంలోని ఉషానిరుద్ధుల పరిణయగాథ. అపూర్వ గేయమాధుర్యం ఉట్టిపడుతూ పరమయోగి విలాసంలో ఇతడు రచించిన శ్రీరంగరాజ ప్రబోధన ద్విపదలు ఇతని సంకీర్తనములు మనకు లభించని లోపం తీర్చగలవు.

"వ్రేపల్లె గోవుల వేణునాదంబు
లేపారె రవళించి వృషభసంతతుల
గాటంపుమేతల గబ్బులమీరె
తేటిదాటుల మ్రోతదెసలెల్ల మీరె
పాలించి కరుణచొప్పడయోగ నిద్ర
చాలించి శ్రీరంగశాయి మేల్కొనవె...
రాత్రి తొలంగె నారామ భూజముల
పత్రులు వికసిత పత్రంబులయ్యె
అలరె నంబుధిఘోష మమర బృందంబు
తళుకొత్తు కలువ పూదండ కానుకలు
పూని నీ పదపద్మముల సేవకోరి
యూనిన వేడ్కతో నున్నారు వీరి
పాలించి కరుణచొప్పడ యోగనిద్ర
చాలించి శ్రీ రంగశాయి మేల్కొనవె"

ఇతడు రచించిన అన్నమాచార్య చరిత్రముద్వారా వీరి వంశక్రమము, అన్నమాచార్యుల జీవిత చర్యలో ప్రధాన ఘట్టాలు మనము ముందు చెప్పుకొన్న అంశములెన్నో లభించాయి.

## తాళ్ళపాకవారి సంగీతము :

సంగీత రత్నాకరవ్యాఖ్యాతలయిన సింహభూపాల కల్లినాథులకు ఇంచుమించు సమకాలికుడు విద్యారణ్యుడు సంగీతసారం రచించి అప్పటికి నూరేళ్లు కావస్తోంది. కుమారగిరి వసంతరాజు నాట్యశాస్త్రము, పెదకోమటి వేమారెడ్డి సంగీత చింతామణి వెలువడి అప్పటికి 50, 60 ఏళ్ళు అయి ఉండవచ్చు. అన్నమాచార్యుల సంకీర్తన లక్షణంలో పదమును గురించిన ఉపోద్ఘాతంలో అప్పటికి ప్రామాణికులైన లక్షణకర్తల నలుగురి గ్రంథాలను అన్నిటికిని మూలమైన భరతుని నాట్యశాస్త్రంతో గలిపి 5 గ్రంథాలను ప్రమాణములుగా పేర్కొనడం జరిగింది.

సీ॥ రమణీయ సంగీతరత్నాకర ప్రబంధాధ్యాయమున నుక్తమయ్యె పదము
సముచిత సంగీతచంద్రికా దేశైకయందు మిక్కిలి తేటయయ్యె పదము
అతుల తత్సంవాదమైనట్టి సంగీతచూడామణికి పట్టుచోటు పదము
నున్యసంగీత సుధాకర గ్రంథంబునందు మిక్కిలి చెలువొందు పదము

తానె యిన్నిటికిని మూలమైన భరత
మందు పంచదశాధ్యాయమందు విమల
వృత్త చూర్ణ నిబంధక వివిధ నామ
భివ్యలక్షణములకు నాస్పదము పదము.

ఈ పద్యంలో మొదట పేర్కొన్న సంగీత రత్నాకరం. 1210–1242 లో ఉండిన శార్ఙ్గదేవునిదని ముందు చర్చించుకొన్నాం. సంగీత చంద్రిక వారాణసీ వాస్తవ్యుడయిన మాధవభట్టను వానిరచన. ఇతని కాలం 1614 కు ముందు అని డా. వి. రాఘవన్‌గారు అన్నారు. ఈ సంకీర్తన లక్షణంలో దాని ప్రశంస ఉన్నదికనుక, అన్నమాచార్యులకు అంటే 1400 కు ముందరిదే ఆ గ్రంథమని చెప్పుకోవచ్చును. సంగీతచూడామణి ఉత్కళదేశ రాజయిన ప్రతాపునిది. అతనికాలం 1497–1511 అని పరిశోధకుల ఊహ, అలాగయితే అన్నమాచార్యుల గ్రంథంలో పేర్కొన బడడానికి వీలుండదు. కనుక, దీని కర్తయైన ప్రతాపుడు 1400 కు ముందరివాడైన మరే లక్షణకర్తోఅని చెప్పుకోవాలి. 4 వ గ్రంథం సంగీత సుధాకరం 1309–1312 ప్రాంతపువాడైన హరిపాలదేవుని రచన.

వృత్తపదము, నిబంధపదము, చూర్ణపదము అని మూడు విధముల పదములకు లక్షణము. పల్లవి, శిఖాపదముల లక్షణము, ప్రయోగ సంప్రదాయము, చతుర్ధాతుక. త్రిధాతుక, ద్విధాతుక, ఏకధాతుక పదముల లక్షణము, పదమాలిక, శరభములేక అష్టపది. (పద్యజాతిలో ముక్తకము, కుళకము అని ఉండేటట్లుగానే) పదములలో కనబడే దరువులు, ఆ దరువులలో రకాలుగా జక్కులరేకులు, ఏలలు గొబ్బిళ్ళు, చందమామ పదాలు, అర్ధచంద్రము, చూర్ణము, తచ్చూర్ణము, యక్షగానపదాలు, పదసంధులు వీటి లక్షణం అన్నమాచార్యుల సంకీర్తన లక్షణంలో వివరించారు, అయితే ఛందోలయలను గురించి చెప్పె లక్షణమేకాని, రాగాల స్వరూపమునుగాని, ప్రయోగ విధానమునుగాని అందులో తడవలేదు.

సంకీర్తనములు లిఖితములైన రాగిరేకులపైని ప్రతి కీర్తనకును మొదట దాని రాగం సూచితమై ఉంది. ఈ రాగాలపేర్లు తప్ప వాటి గానపద్ధతి మనకు తెలియగల మరొక ఆధారమేదీ లేదు. తాళ్ళపాక సంకీర్తనములలో ఇప్పటికి లభించిన 14 వేల కీర్తనలలోను ఉపయుక్తములైన రాగాలసంఖ్య 89 మాత్రమే అని రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు వ్రాశారు. ఆ 89 లోను మరీ ఎక్కువగా ప్రయోగించిన రాగాలు 25 మాత్రమేనట. అయితే లభించిన త్యాగరాజ కీర్తనలు 7

వందలకు 250 కి మించి రాగాలు ఉపయుక్తాలైనాయట. దీనినిబట్టి, వారి కానాడు సంగీత ప్రయోగదృష్టి అప్రధానము, సాహిత్య భావప్రదర్శనము ప్రధానముగా కనబడుతుంది. తాళాలపేర్లు రాగిరేకులలో లేనేలేవు. పాటల అక్షర ప్రమాణమును యతిప్రాసలను పరిశీలించి, ఆది, రూపకము, జంపె, అట్ట మిశ్రచాపు. త్రిపుట మొదలగు సుప్రసిద్ధ తాళాలన్నీ, ప్రయోగకములైనాయని శ్రీ శర్మగారు వ్రాశారు. అంతేకాక "భావము భాషా రూపముగా మనస్సులో స్ఫురించిన వెంటనే తత్కాల మునకు స్ఫురణకు వచ్చిన ఏ సిద్ధమైన వర్ణమెట్టునో గ్రహించి రచన సాగించినట్లే కానవచ్చునే తప్ప నూతన నాదశరీర కల్పనకై (అనగా కొత్త సంగీతపు వరుసల కల్పనకై) ప్రత్యేకముగా వారు పరిశ్రమించినట్లు తోపదు." అని కూడా వ్రాశారు. అంటే. ఆ నాటికి పండిత జనాదరణం, సమాజగౌరవం, లేని జక్కులవారి యక్ష గాన ప్రదర్శనాలలోనో, ఇతర జానపద గీతనృత్య ప్రదర్శనాలలోనో కర్ణాకర్ణిగా వినిపించే దరువులను, పదాలను వరవడులుగా పెట్టుకొని; వాటికి వాడుకలో ఉన్న ఆ రాగతాళాలలోనే తాళ్ళపాకకవులు తమకుతోచిన సంకీర్తనములన్నీ పాడి ఉంటా రని మనం శ్రీ శర్మగారి ఊహకు వ్యాఖ్యానము చేసుకోవచ్చును. భరతముని ధ్రువా ధ్యాయంలోను ఇతర లక్షణకర్తలు ప్రబంధాది అధ్యాయాలలోను ఆయా దేశిపద రచనా రీతులకు లక్షణము నిర్వచించి ఉండడంచేతా, అన్నమాచార్యులు పండితులకు తాము చేసున్న సంకీర్తన రచనము ప్రామాణికమే అని చెప్పడానికే సంకీర్తన లక్షణం సంస్కృతంలోనే రచించాడని ముందే చెప్పుకొన్నాము. అలాగే వీరు వాడిన రాగాలుకూడా ఆనాటికి లక్షణకర్తలు నిర్వచిస్తూ వచ్చిన దేశీయరాగాల లక్షణాన్ని అనుసరించే ప్రామాణికములే అయిఉంటాయి. వానిలో 21 రాగాలకు శ్రీ అనంతకృష్ణశర్మగారు చారిత్రిక పౌర్వాపౌర్యం పరిశోధిస్తూ, ఆనాటి స్వరూపాన్ని స్థూలంగా నిర్ణయించడానికి ప్రయత్నించారు

13 వ శతాబ్దపువాడైన పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో పేర్కొన్న 108 రాగాలలో సుమారు 20 కి మించిన రాగాలు తాళ్ళపాక కవుల సంకీర్తనలలో కనిపిసాయి. అవి యివి : కన్నడగౌళ, గుండక్రియ, కాంభోజి, దేశాక్షి, దేశి, దేసాళం, ధన్యాసి, నాట, భూపాళం, భైరవి, బౌళి, మలహారి, మాళవి, మాళవగౌళ, మాళవశ్రీ, రామక్రియ, లలిత, వసంత, శంకరాభరణం, శ్రీరాగం, సాళంగనాట. సౌరాష్ట్రి గుజ్జరి.

పాల్కురికి సోమనాధుడు పేర్కొననివీ, అతని తర్వాత రెండు వందల ఏళ్ళలో ప్రచారానికి వచ్చినవీ అయిన రాగాలలో తాళ్ళపాకవారు వాడినవివి ;. సామంతం, ముఖారి, వరాళి-మంగళకౌశికి, నాదనామక్రియ, దేవగాంధారి, పాడి, మధ్యమావతి, కేదారగౌళ, ఆహిరి.

తిరుపతి దేవస్థానంవారు అచ్చువేసిన తాళ్ళపాకవారి సంకీర్తనముల రెండు మూడు సంపుటాలలోని కీర్తనల సంఖ్యను వాటికి ఉపయోగించిన రాగాలను

స్థూలంగా పరిశీలిస్తే ఆ యా రాగాలపై వారి అభిరుచి యీ క్రింద చూపిన అను క్రమంలో ఉంటుంది.

| | | |
|---|---|---|
| ఆహిరి | 107 | కీర్తనలు |
| సామంతం | 103 | ,, |
| శ్రీరాగం | 89 | ,, |
| ముఖారి | 82 | ,, |
| పాడి | 60 | ,, |
| బౌళి | 57 | ,, |
| శంకరాభరణం | 53 | ,, |
| రామక్రియ | 44 | ,, |
| కాంభోజి | 37 | ,, |
| వరాళి | 37 | ,, |
| భైరవి | 36 | ,, |
| సాళంగనాట | 26 | ,, |

వారు వాడిన అపూర్వ రాగాలివి : అబాలి, అమరసింధు, కొండమలహరి, (కొండజాతివారు పాడుకొనే మలహరిభేదం) తెలుగు కాంభోజి, ఇప్పుడు ఎరుకుల కాంభోజి అనీ, యదుకుల కాంభోజి అనీ పిలువబడుతున్న రాగం దీనికే చెంచు కాంభోజి అని కూడా వ్యవహారం వుంది. దేసాళం, నారణి (నారాయణి) నారణి దేసాక్షి మేంచబౌళి, మేసబౌళి (ఈ రెండు ఒకే రాగపు నామాంతరము లేమో); ముఖారివంతు, రాయగౌళ, గీతనాట, బౌళి రామక్రియ.

వారు వాడిన యితర ప్రసిద్ధ రాగాలలో కొన్ని : కన్నడగౌళ, కన్నడ బంగాళ, కేదారగౌళ, గుండక్రియ, గౌళ, దేవగాంధారి, దేశాక్షి, ధన్యాసి, నాట నాదనామక్రియ, ఫలమంజరి, భూపాళం మంగళకౌశిక, మలహరి, మధ్యమావతి, మాళవి, మాళవిగౌళ, మాళవి శ్రీ, రీతిగౌళ, లలిత, వసంతం, వసంతవరాళి, శుద్ధదేశి, శుద్ధరామక్రియ, శుద్ధవసంతం, సావేరి, సాళంగం, సౌరాష్ట్రం, సౌరాష్ట్ర గుర్జరి, గుజ్జరి, హిజ్జిజి, హిందోళవసంతం, కుంతలవరాళి, ఛాయనాట, దేశి బంగాళం.

## ఎనిమిదవ అధ్యాయం

# పురందరదాసు – 1484–1564

తెలుగులో వేలకొలదీ సంకీర్తనములు రచించి, సంకీర్తన పితామహుడని పేరుపొందిన అన్నమాచార్యుల కాలంలో యువకుడై, తరువాత తానుకూడా కన్నడంలో లక్షవరకూ సంకీర్తనములు (దాసుపదగళు) రచించి, కర్ణాటక దేశంతోనేకాక, ఆంధ్ర, ద్రావిడ, మహారాష్ట్ర దేశాలలో ఆరాధ్యుడైన వాగ్గేయకారుడూ, పరమ భక్తాగ్రేసరుడూ పురందరదాసు. ఇతడు లక్షణగ్రంథాలు రచించినట్లు కనబడదుకాని, తనకాలంలో స్పష్టరూపం పొందుతూన్న కర్నాటక సంగీత రీతులకు లక్ష్యములుగా, నాదకల్పనాత్మకములై, ధాతుమాతు సంయుతములైన అనేక రచనలను చేశాడు. మన సంగీత చరిత్రలో ముందు చెప్పుకొన్న యుగ విభజన ప్రకారము సంకీర్తన యుగంలో 15, 16 శతాబ్దములలో ఉండిన యితడు తన రచనలలో అత్యధికాంశమును సంకీర్తనములుగానే రచించాడు సూర్‌దాసు, తులసీదాసు, మీరాబాయి మొదలైన మహాభక్తులు వెలసి భారతీయ సంగీతానికి భక్తి సంకీర్తనములను ప్రసాదించిన కాలమిదే. మధ్వ తత్త్వప్రబోధకములై భక్తిరసాత్మకములైన యీతని పదగళు మధ్వాచార్య పీఠములలో నేటికీ వేదముగా పరిగణిస్తారు.

మధ్వదాస కూటములో ప్రసిద్ధులై, పురందరదాసుకంటే ప్రాచీనులైన భక్తియోగులు కన్నడభాషలో సంకీర్తనములు రచించినట్లూ, అన్నమాచార్యులవారి రచనలవల్ల వికాసం పొందివుండవచ్చుననీ, ముందు చెప్పుకొన్నాము. అటువంటివారిలో నరహరితీర్థుడని, రాజమహేంద్ర వాస్తవ్యుడయిన మధ్వపండిత యోగి అతిప్రాచీనుడట. ఇతడు కన్నడభాషలో పదములు రచించాడట. తరువాతి వారిలో శ్రీపాదరాయలు, వ్యాసరాయలు, కనకదాసు, వాదిరాజు మొదలైనవారు పదరచయితలు. వీరి కాలంలోనూ, పురందరదాసు కాలంలోనూ కూడా భక్తి సంకీర్తనలకు పదమనే వాడుక ఉండేది. పురందరదాసుకు వ్యాసరాయలే ఉపదేశ గురువు. తమ గురువుల కన్నడ పదాలకు తోడు మహారాష్ట్రంలోని జ్ఞానదేవాదుల సంకీర్తనముల ప్రభావంకూడా యితని రచనలకు ఉద్బోధకమై ఉండవచ్చును. ఇతడు క్రీ. శ. 1484–1564 సంవత్సరముల నడిమికాలంలో జీవించినవాడని విద్వాంసులు నిర్ణయించారు. ఇతని జీవితంలో కొంతకాలం ఆనాడు మహారాష్ట్ర, కరాటక దేశముల పరిహద్దులో ఉండిన పునహానగరంలోను, తరువాత కన్నడ

రాజ్యరమా నిలయమైన విజయనగరంలోనూ గడిపాడు. విజయనగర రాజుల్లో సాళువ నరసరాయలు, తుళువ వీర నరసింహరాయలు, శ్రీకృష్ణదేవరాయలు యితనికి సమకాలికులు.

మొదట పిల్లికి బిచ్చంపెట్టని పిసినిగొట్టు కోటీశ్వరుడయినా, తన జీవితంలోని విచిత్ర సంఘటన మూలంగా యితడు వైరాగ్యవంతుడై మహా భక్తాగ్రేసరుడుగా మారి లక్షదిపదకర్త అయినాడు. ఇతని జననం బళ్ళారి జిల్లాలోని హంపికి దగ్గరగా ఉండే పురందరగడ అనే గ్రామం. మధ్వ బ్రాహ్మణుడూ, కోటీశ్వరుడూ అయిన వరదప్పనాయకుడికీ, కమలాంబకూ లేక లేక జన్మించిన యితనిని శీనప్ప తిరుమలరాయప్ప, తిమ్మప్ప అనికూడా అనేవారు. చతురులైన పండితుల శిక్షణలో యితడు సంస్కృత కర్ణాట భాషలలోను,సంగీతంలోను 16ఏళ్ళ నాటికే పాండిత్యం సంపాదించాడు. 16వ ఏటనే యితనికి వివాహం అయింది.ఇతని భార్య సరస్వతీబాయి యితనివలె లోభికాదు. ఉదారహృదయ, దానదయాపరత్వం కలది. పతిభక్తి, ఇలవేల్పులభక్తి కలిగి పూజలతో సదాచారంతో వర్తించేది.

20వ యేట పురందరుని తండ్రి మరణించాడు. తండ్రి చేస్తూఉండిన రత్న వ్యాపార భారమంతా కుమారుని తలపై పడింది. అతని చాతుర్య సామర్థ్యాలవల్ల వ్యాపారం బాగా వృద్ధిఅయి కోటీశ్వరుడై తోటి వర్తకులచేత నవకోటి నారాయణ అనిపించుకొనేవాడు. వర్తకంలో లాభాలు వస్తున్నకొద్దీ అతని పిసినిగొట్టుతనమూ హెచ్చుతూఉండేది. దయాధర్మవంతురాలైన అతని భార్యకది కష్టంగా ఉండేది.

ఒకనాడొక పేదబ్రాహ్మణుడు నవకోటి నారాయణుని వద్దకుపోయి తన పుత్రుని ఉపనయనానికి వెచ్చం నిమిత్తం విరాళం ఇమ్మని కోరాడు. కోటీశ్వరుడా బ్రాహ్మణుణ్ణి చూదాం మర్నాడు రమ్మన్నాడు. ఆ బ్రాహ్మణుడలా ఎన్నిరోజులు వెళ్ళి అడిగినా తిరిగి తిరిగి వర్తకుడినుంచి అదే జవాబు రావడంచూసి విసిగి, వేసారి, ఒకనాడు పురందరుని భార్య దగ్గరకు వెళ్ళి అడిగాడు. ఆమె అతనికి తన ముక్కున ఉండిన వజ్రంతాపిన ముంగర దానం చేసి దానిని అమ్ముకొని సొమ్ము తీసుకొని శుభకార్యం చేసుకొమ్మని పంపింది.

ముంగరను అమ్మజూపడానికి విపణివీధికి వెళ్ళిన బ్రాహ్మణుడు తిన్నగా పురందరుని వద్దకే పోవలసివచ్చింది. ఆ నగను చూడగానే అంతటి అమూల్యమైన రాయిగల ఆ నగ తన యింటిలోదే అయివుండాలని రత్నశాస్త్రంలో నేర్పరియైన పురందరుడికి అనుమానం తోచి, తన భార్య ముక్కున ఉండే ముంగరను పంపమని ఇంటికి కబురంపాడు. భర్త ఆగ్రహంతో ఏం చేస్తాడో అని భయకంపితురాలై సరస్వతీబాయి వేరేమీ తోచక ఇంటిలో తాను పూజ చేసుకొనే దేవతా మందిరంవద్ద ప్రార్థన చేసుకొని విషపానం చేసి ఆత్మహత్య చేసుకొన సంసిద్ధురాలయింది. అచ్చంగా ఆ బ్రాహ్మణుడి కిచ్చినలాటి నగే ఆ విషపాత్రలోకి వచ్చి

పడింది. ఆమె ఇలవేల్పుకి కృతజ్ఞతాప్రార్థనం చేసుకొని ఆ నగను వచ్చిన మనిషి ద్వారా భర్తవద్దకు పంపింది. ఒకేలాగున రెండు ముంగరలనూ చూసి అద్భుతంలో మునిగిపోయి పురందరుడింటికి వచ్చి ఏమి జరిగిందని భార్యనడిగాడు. ఆమె తన వద్దకు బ్రాహ్మణుడు వచ్చి విరాళ మడిగినది మొదలు తిరిగి తాను విష పాత్రలో నుంచి తీసిన రెండవ ముంగరను భర్తకు పంపించే వరకు జరిగినదంతా పూసగుచ్చినట్లు చెప్పింది. పురందరుడా బ్రాహ్మణుడి కోసం మనుష్యుల్ని పంపితే వారి కతడెక్కడా కనబడకుండా అదృశ్యుడయ్యాడు. ఈ సంఘటన పురందరుని జ్ఞాననేత్రాన్ని తెరచింది. దానితో అతనిలో గొప్ప పరివర్తనం కలిగి అతడు ఐహిక జీవిత విముఖుడై పోయాడు. తన ఆస్తినంతా దాన ధర్మాలకు వినియోగించి, అప్పటినుంచీ పురందరుడు నిరాడంబరంగా ఉవాతాళ యాలతో జీవించాడు. ఆ సంఘటనకు తర్వాతనే అతడు అఠాణా రాగంలో మోసహోదెనల్లో అన్న తొలికీర్తన రచించాడట ఆ కీర్తన చరణంలో ... యౌవనదల్లి శ్రీహరిపాద నంబదే మూవత్తు వరుష మోహాబ్ధి యల్లి బిడు...అని యౌవనంలో శ్రీహరి పాదములను నమ్మకొనక ముప్పదియేళ్లు మోహాబ్ధిలో మునిగిపోయానే నేను మోసపోయాను గదా అని పశ్చాత్తాప పడినాడు. (త్యాగరాజు తొలి రచన – ఏల నీ దయరాదు అనే కీర్తనకూడా అఠాణారాగం లోనిదే) అటుతర్వాత కొంతకాలానికి భారతదేశంలోని పుణ్యక్షేత్రా లన్నిటికీ యాత్రజేశా డట. అతని జీవితంలో ఆసేతు హిమాచలమూ అటువంటి యాత్రలు మూడుసార్లు చేశాడట.

ఇతడు తన 40వ ఏట ప్రసిద్ధ మధ్వగురువులైన వ్యాసతీర్థులవద్ద ఉపదేశం పొంది, పురందరదాసుగా పేరు మార్చుకొన్నాడు. ఈ పురందరదాసను పేరు వ్యాసతీర్థులకు తర్వాత వారి మఠమునకు అధికారియైన సత్యధర్మ తీర్థులనేవా రిచ్చినట్లున్నూ, అప్పటినుంచీ ఆ పేరు వ్యవహారంలో నిలిచినట్లున్నూ సాంబ మూర్తిగారు వ్రాశారు. అంతేకాకుండా, సత్యధర్మతీర్థులు పురందరదాసు రచించిన పదాల తాళపత్రములను తాము ఆరాధించే విఠలస్వామి ఒడిలోఉంచి,పురందరదాసు అవతారమూర్తియైన ఋషియనీ, అతని రచనలు పురందరోపనిషత్తుగా సకల భక్తు లకూ శిరోధార్యాలనీకూడా చెప్పారని టి. వి. సుబ్బారావుగారు వ్రాశారు. పురంద రుని గురువైన వ్యాసతీర్థులే కర్ణాట సింహాసన మెక్కిన సాళువ నరసింగరాయలకు కూడా గురువని అన్నమాచార్యులను గురించిన అధ్యాయంలో చెప్పుకొన్నాము.

రాజగురువైన వ్యాసతీర్థులవారు కర్ణాటక సామ్రాజ్య రాజధానియైన విజయ నగరంలో ఉంటూండడంవల్ల, ఆయన శిష్యుడయిన పురందరదాసు తంబురా, చిరతలూ పుచ్చుకొని తాను రచించిన పదాలను భక్తిరస మొలుకగా గానంచేస్తూ ఉంఛవృత్తివలన లభించిన బియ్యం తెచ్చుకొని, దానితోనే భార్యనూ, ఐదుగురు

పిల్లల సంసారమునూ పోషించుకొనేవాడట వరదప్ప, గురురాయడు, అభినవుడు, మధ్వపతి అని నలుగురు కుమారులూ, రుక్మిణీబాయి అని ఒక కుమార్తె ఇతని సంతానం. విజయనగరంలో మఠావాసం చేసుండే రోజుల్లో కూడా ఇతని యింటికి భాగవతులైన అతిథి అభ్యాగతులూ క్షుధార్తులైన దరిద్రులూ మాత్రమే కాకుండా తాను మొదట వర్తకుడుగా కోటీశ్వరుడుగా ఉన్ననాటి బంధువులూ భాగ్యవంతులూ ఆతిథ్యానికి వచ్చి పరామర్శించి పోతుండే వారట. అటువంటి సందర్భాలలో ఒకనాడు పురందరు డింట లేనప్పుడు ఒక చుట్టం వారింటికి వచ్చాడు. అతన్ని సత్కరించడానికి అతని హెూందాకి సరిపోయే సంబారాలు వారింట్లో లేవని సరస్వతీ బాయికి చింత కలిగింది. ఆమె పొరుగింటికి వెళ్ళి, ఆ యింటియావిడ నడిగి వారి పరుసవేది నొకసారి యెరువు తెచ్చుకొని, దానితో ఇంటిలో ఉన్న అధమ లోహ పాత్రలను కొన్నింటిని బంగారపు పాత్రలుగా మార్చి, వాటిని బజారులో అమ్మి, ఆ సొమ్ముతో చుట్టమునకు గౌరవంగా విందుచేసే సామగ్రులను యింటికి తెచ్చిందట. ఉంచవృత్తి చేసుకొని యింటికి తిరిగివచ్చిన పురందరు డింటిలోని ఈ మార్పును చూసి జరిగిన సంగతి అంతా తెలుసుకొని, తన యింటికి వచ్చే అతిథు లెవరైనా తన తాహతుకు తగిన మర్యాదే పొందాలిగాని, వారి తాహతు కోసమని తాము అలా సువర్ణసృష్టి చెయ్యనక్కరలేదని భార్యకు చెప్పి, ఆ సామగ్రులనూ, బంగారు పాత్రలనూ పరుసవేది రాయినీ అక్కడి పుష్కరిణిలో పారవేశాడట. పొరుగింటి ఆవిడ తన పరుసవేది రాయికోసం పోరుపెడితే, పురందరుడు తన కొడుకును పుష్కరిణిలో కిదింపిదోసిటితో ఆమెకు కావలసినన్ని రాళ్ళిప్పించాడట.

'వాసుదేవన నామావళియ'— అనే ఇతని ముఖారిరాగ కీర్తనను బట్టి ఇతని పదములన్నీ కలిసి మొత్తం 4,75,000 అని తేలిందట. అయితే, ఇతని పదములన్నీకాని, వాటి సంగీతంకాని పూర్తిగా యింతవరకూ లభించలేదు. పురందరుని ఉపనిషత్కర్తగా నేకాక, నారదుని అపరావతారంగాకూడా పరిగణించారు. త్యాగరాజు తన ప్రహ్లాద భక్తివిజయంలో ఇతన్ని స్తుతించాడు.ఇతనికీర్తనలను దాసపదగళు అనీ, దేవరనామ అనీ వ్యవహరిస్తుంటారు. సులభగ్రాహ్యమైన సంవాదశైలిలో చక్కని జాతీయములైన సామెతలతో అందమైన సామ్యములతో, ఉదాత్తభావాలతో ఇతని కీర్తనలు వేదాంత పరతత్త్వ బోధకములై, లోకవృత్త విమర్శాత్మకములై, స్వానుభవ ప్రబోధకములై ఉంటాయి. అన్నమాచార్యుల వలెనే నామ సంకీర్తనాత్మకములైన పదములనేకాక, బాలకృష్ణ లీలాగాథలను వర్ణించే కీర్తనలు, గోపికా గీతములు, యశోదతో గోపికల విన్నపాలు, కృష్ణుని గురించి గోపికల విరహగీతాలు, ఇటువంటి రచన లెన్నో ఉన్నాయి. మంజీశ, భైరవి, ద్విజావంతి, శ్యామకళ్యాణి, మారవి, మధుమాధవి, వసంతభైరవి వంటి అపూర్వ రాగాలలోను, ప్రసిద్ధ రాగాలలోను కూడా ఇతడు రచించాడు. ఇతని కీర్తనలన్నీ పురంధర విఠలాంకితములు. సంగీతాభ్యాసపరులకు

క్రమ తరగతులలో శిక్షణ గరపడానికి వీలుగా సరళి, జంట స్వరవరుసలనూ, అలంకారములనూ, పిళ్ళారి గీతాలనూ, ఘనరాగ గీతాలనూ, ప్రబంధాలనూ ఇతడు రచించాడు. వీటిలో చాలమట్టుకు ఈ నాటికీ కర్ణాటక సంగీత ప్రాథమిక విద్యార్థులకు నేర్పుతూ ఉండడం మనం గమనించవచ్చు. ఇతడు రచించిన సూళాది ప్రబంధములను గురించి ఉగాభోగములను గురించీ సంగీత క్రమ పరిణామాధ్యాయంలో చెప్పుకొన్నాము. ఈ రచనలన్నిటివల్లా ఇతనికి ఆదిగురువనీ, కర్ణాటక సంగీత పితామహుడనీ పేరువచ్చింది. ప్రాథమిక దశలో విద్యార్థుల అభ్యాసానికి మాయామాళవ గౌళమేళం ప్రారంభించినవాడు పురందరదాసే. అప్పటినుంచి నేటివరకూ ఆంధ్ర కర్ణాటక తమిళ కేరళ దేశాలలో ఇదే సంప్రదాయం వస్తోంది. ఈ మేళకర్తలో ప్రాథమిక శిక్ష ఇచ్చే దేశం ప్రపంచంలో కెల్లా దక్షిణభారతదేశ మొక్కటేనట. పురందరదాసు మాయామాళవ గౌళమేళానికిచ్చిన ప్రాముఖ్యమువల్లనే తర్వాత 72 మేళకర్తల పరిణామం కలిగింది. దక్షిణదేశంలో పారంపర్యంగా వస్తూనిల్చిపోయిన కొన్ని సంగీత ప్రయోగ సంప్రదాయాలనుబట్టి ఇతణ్ణి కర్ణాటక సంగీత పితామహుడన్నారేగాని ఇతడు కీర్తనలకు వాడిన రాగాలలోని వైవిధ్యాన్నిబట్టీ, అతడు జీవించి తిరిగివుండిన దేశాలనుబట్టి, అతడు మహారాష్ట్రాది ఉత్తర దేశాలలోని సంగీత రీతులనుకూడా బాగా తెలిసినవాడనీ, అన్ని పద్ధతులనూ ఆకళించుకొన్న తర్వాతనే కర్ణాటక పద్ధతికి ఒక రాచబాట వేశాడనీ చెప్పవచ్చు. అన్నమాచార్యుల తర్వాత పురందరదాసు ద్వారా వ్యాప్తి పొందిన సంకీర్తన రచన త్యాగరాజునాటికి పరిపక్వరూపం పొందింది. పురందరదాసు మలహరి రాగంలో చేసిన గీతాలు ఆదర్శప్రాయములైన ద్విధాతు ప్రబంధాలు.

విజయనగరపు హంపిలోని ఒక మంటపంలో ఇతడు చాలాకాలం నివసించడంవల్ల దానికి పురందరదాస మంటపం అనిపేరు వచ్చింది. చరమ దశలో ఇతడు సన్యాసాశ్రమం స్వీకరించి రక్తాక్షి నామ సంవత్సర పుష్య అమావాస్యనాడు అనగా 1564 జనవరి 2 వ తేదీ మంగళవారంనాడు సిద్ధి పొందాడు.

## తొమ్మిదవ అధ్యాయం

# తొలి యక్షగాన కర్తలు

### పుట్టుపూర్వోత్తరాలు :

(16 వ శతాబ్దిలో కందుకూరి రుద్రకవి సుగ్రీవ విజయం) రచించడానికి దాదాపు అర్ధ శతాబ్ది ముందటివరకూ యక్షగానానికి సాహిత్యపరుల ఆదరం లభించినట్లు కనపడదు. కాని (సామాన్య ప్రజలకు వినోద వికాసాలు కలిగిస్తూ సంస్కారహీనమైన భాషా సంగీతాలలో - సహజ సరళమైన యక్షగానములో, యక్షగానములవంటి రూపక ప్రదర్శనలో సుమారు 12 వ శతాబ్దంనుంచి కూడ ఆంధ్రదేశంలో ఉంటూ ఉండినట్లు రాజకళింగ గంగు గాథలనుబట్టి, పాల్కురికి సోముని పండితారాధ్య చరిత్రలోని వర్ణనలనుబట్టీ తెలుస్తుంది.

'భ్రమరులు జాళెముల్ బయనముల్ మెరసి, రమణపంచాంగ పేరణియాడువారు
ప్రమథపురాతన పటుచరిత్రములు, క్రమమొందర బహునాటకములాడువారు
లలితాంగ రసకళాలంకారరేఖ, లలవడ బహురూపమాడెడువారు.........
అమరాంగనలు దివినాడెడుమాడ్కి, అమరంగ గడలపై నాడెడువారు
ఆ వియన్నతి పక్షులాడెడునట్టి, భావన ప్రోకులపై నాడువారు
భారతాది కథలు చీరమరుగుల, నారంగ బొమ్మల నాడించువారు.
కడు నద్భుతంబుగ కంభసూత్రంబు, లడరంగ బొమ్మలనాడించువారు
అవట గంధర్వయక్ష విద్యాధరాదులై పాత్రల నాడించువారు.........'

దీనినిబట్టి 13 వ శతాబ్దిలో (సోమునినాడే) బహునాటకములు, బహురూపములు అనబడు వీథినాటక రీతులు, బొమ్మరాటలు, తోలుబొమ్మలాటలు, యక్ష విద్యాధర పాత్రలు వచ్చే నాటకాలు ఉండేవని స్పష్టం 1100 ప్రాంతంలో వేములవాడ భీమకవి శాపంవల్ల రాజ్యం కోలుపోయిన రాజకళింగ గంగు బికారియై, తిరిగి భీమకవి అనుగ్రహపాత్రుడై వీథిబాగోతుల మేళంలోచేరి, తానే శత్రురాజు కొలువుకుపోయి రాజకళింగగంగు(తన)వేషంలో గుర్రమూ, ఖడ్గమూ సంపాదించి, నాటకం ఆడుతున్నట్లు నటిస్తూ. శత్రురాజును చంపి, రాజ్యం తిరిగి సంపాదించుకొన్నాడని ఐతిహ్యం ఉన్నది. కన్నడదేశంలో 13 వ శతాబ్దానికి ముందు యక్షగానాలు, శివలీలాత్మకాలు ప్రచారంలో ఉండేవట. తోలుబొమ్మలాటలవారు తెరపై బొమ్మల నాడిస్తూ వెనుకనుండి శివలీలలను, విష్ణులీలలను.

రామాయణ, మహాభారత గాథలను పాత్రల సంభాషణలను పద్యాలతో, దరువులతో సూత్రధారుని సంధివచనాలతో కలిపి గానం చేస్తూండేవారు. బసవ పురాణ, రంగనాథరామాయణ ద్విపదలు వారికెంతో ఉపయోగపడ్డవట.

16 వ శతాబ్దివాడైన చిత్రకవి పెద్దన-ఆశు, మధుర, చిత్ర, వి స్తరములను నాల్గువిధాల ఆంధ్ర కవితారీతులలో మధుర కవితాశాఖ లీవిధంగా వివరించాడు. అందులో యక్షగానం కూడా ఉందికనుక, మనకు ప్రసక్త విషయం:

'మధురకవిత్వంబన్నది నాటకాలంకారంబులు, కలికోత్కళికలు, విభ్య క్తధి దేవతోదాహరణములు, సప్తాళనటనలు, నట్టొట్లు, గీత ప్రబంధంబులు, చతుష్ప్రదికాష్ట భద్రికలు, బిరుదావళి నామావళి, భోగావళి, రంగఘోష, జయఘోష, త్యాగఘోష చతురుత్తర సంఘటనలు, యక్షగానంబున వెలయు పదంబులు, దరువులు, ఏలలు, దవళంబులు, మంగళహారతులు, శోభనంబులు, ఉయ్యాల జోలలు జక్కుల రేకుపదంబులు, చందమామ సుద్దులు, అష్టకంబులు, ఏకపద ద్విపద, త్రిపద చతుష్పదాష్టపదలు, ఇవి యాదిగాకల్గునన్నియు'-లక్షణదీపిక.

## జక్కుల ప్రదర్శనాలు:

మధుర కవితలు సంగీతాత్మకములై, శ్రవణ పేయములూ, చర్వణ యోగ్యములూ అయి మిగిలిన కవితా రీతులవలె లిపికెక్కకపోయాయి. వీనిలో ఉదాహరణములను గురించి ప్రబంధాధ్యాయంలో చర్చించుకొన్నాము. యక్షగానంబున వెలయు పదములని లక్షణదీపికలో పైనిచెప్పిన గేయరీతులన్నీ దేశీయ రచనా విశేషాలు, యక్షగానము అనేపేరూ, జక్కుల రేకులపదాలు అనేపేరూ, వాటిని నృత్యగానముల ద్వారా ప్రదర్శిస్తూ వుండే జక్కులవారి ద్వారా వ్యవహారంలోకి వచ్చాయి. ఈ జక్కుల ప్రదర్శనాలు ఆ ప్రాచీనకాలంలో ఎలా ఉండేవో తెలుసుకోవాలంటే శ్రీనాథుని గ్రంథాలలో దృష్టాంతాలు దొరుకుతాయి. ఆయన భీమఖండంలో దక్షారామ భీమేశ్వరుని పూజోత్సవకాలములలో సానులు (దేవదాసీలు) వేషములు వేసికొని నాటకము లాడుటను పర్ణించాడు:

"....సాని యీశానియై మహోత్సవమునందు
కేల నవచంద్రకాంతపు గిన్నె పూని
వీథి భిక్షాటన మొనర్చు వేళ జేయు
మరులు నృత్యంబు జగముల మరులు కొలుపు"—

శ్రీనాథుని భీమఖండంలోనే - తృతీయాశ్వాసంలో 'కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు - గాంధర్వమున యక్షగాన సరణి' అని చెప్పడాన్నిబట్టి యక్షగానం భీమఖండ రచనా కాలంనాటికే (1420 ప్రాంతం) ద్రాక్షారామసీమలో ప్రచారంలో

ఉన్నట్లు స్పష్టం. ఇంతేగాక, ఓరుగంటిలో అక్కలవీర నృత్యములు, మైలార భటుల వీరవిలాసముల కనుగుణముగా గొరగ (కొరవ) పడుచు మూర్ధాభినయము, శుద్ధ, సాళవ, సంకీర్ణ రాగాలాపములతో, తంత్రీవాద్యాలతో, డమడమ ధ్వనులతో, బవనీల పరశురామగాథా గానం, - ఒక పడతి పల్నాటివీరుల గాథలను ద్విపద ప్రబంధములలో ద్రుతతాళంబున - ఆంతరాళిక యతి గ్రామాభిరామంబుగా గానం చేస్తూంటే అనుగుణంగా వీరపురుషులు చేసే అభినయాలూ యివన్నీ శ్రీనాథుడు రచించాడని చెప్పబడుతున్న క్రీడాభిరామంలో వర్ణింపబడ్డాయి. యక్షాదివేషములు వేసి, రాజసభలలోను, దేవోత్సవాదులలోనూ, గ్రామ జాతరలలోను నాటకము లాడు వృత్తివలన ఆనాటినుంచీ దేవదాసీలకు జక్కులవారనే వ్యవహారం కలిగి ఉండవచ్చని ప్రభాకరశాస్త్రిగారు వ్రాశారు. ఈ ప్రకరణంలో అనేక విషయాలు సరి పరిశోధనా ఫలితాలే. శ్రీనాథుడు క్రీడాభిరామంలో జక్కులపురంధ్రి ప్రదర్శన ము నిలా వర్ణించాడు :

> 'కోణాగ్ర సంఘృష్ట ఘుమఘుమధ్వని తారకంఠస్వరంబులో గారవింప
> మసిబొగ్గుబోనాన నెసలుకొల్పిన కన్ను కొడుపుచే తాటించు నెడప దడప,
> శ్రుతికి నుత్కర్షంబు చూపంగవలయుచో చెవిత్రాడు బిగియుంచు జీవగఱ్ఱ
> గిల్కుగిల్కున మ్రోయు కింకిణీ గుచ్ఛంబు తాళమానంబుతో మేళవింప
>
> రాగమున నుండి లంఘించు రాగమునకు
> ఉరుము యూరుద్వయంబుపై నొత్తిగిల్ల
> కామవల్లీ మహాలక్ష్మి కై టభారి
> వలపు పాడుచువచ్చె జక్కుల పురంధ్రి'

విజయరాఘవ నాయకుడు ప్రహ్లాద చరిత్ర యక్షగానంలో నాట్యవిశేషాలను వర్ణిస్తూ - కొరవంజి-, జక్కిణిదురుపదము (యక్షిణీధ్రువ పదం) మదనపద దౌత్యము, శారదా సామ్రాజ్యము, చిందు సవతి మచ్చరములు, నాట్యకదంబము మొదలైన వాటిని పేర్కొన్నాడు. శ్రీనాథుని వర్ణననుబట్టి ఒకే స్త్రీ లక్ష్మి వేష ధారిణియై విష్ణువుపై వలపును గురించి పాడుతూ వచ్చినట్లు తెలుస్తోంది. అలాగే ఉమావేషధారిణియై శివునిపై వలపు పాడుతూ వచ్చే ప్రదర్శనము లుండవచ్చును ఈనాటికీ సత్యభామా పాత్రధారిణి ఒక్కతే ప్రవేశించి ఒక్క హాస్యగాని సాహా య్యంతో భామాకృష్ణుల ప్రణయకలహ కలాపాన్ని ప్రదర్శించే భామకలాపం జక్కుల పురంధ్రులు ప్రాచీనకాలంలో చేసిన ప్రదర్శనల తర్వాతి పరిణామమే. ఇందులో చిందులు, మదనపద దౌత్యాలూ ఉంటాయి. వీటికి కొరవంజి. సవతి మచ్చరములు అనే నాట్య విశేషాలు కూడా జతపడి యక్షగాన స్వరూపానికి ప్రాతి పదిక యేర్పడింది. సవతి మచ్చరాలంటే గంగా-పార్వతీ సంవాదం, ఆదిలక్ష్మి - చెంచులక్ష్మి సంవాదం వంటివి. ఈ సవతుల కయ్యాన్ని పింగళి సూరన కళా

పూర్ణోదయంలో అనుకరించాడు. జక్కులు కామేశ్వరీ దేవతను పూజించు జాతి వారు అని పరిశోధకులు వ్రాశారు. అనంతపురం, బళ్ళారి జిల్లాలలో జక్కుల చెరువు, జక్కులోడికి ఆరణాలు అని గ్రామాలు కలవట సమాజంలోని జక్కుల తెగవారి ప్రదర్శన లోక భాగమూ, కొరవలనబడే ఆటవికజాతివారి ప్రదర్శన లోక భాగమూ కలిసి యక్షగానంగా పరిణామం చెందింది.

## కొరవంజి :

కురవ, కురువ, గొరవ, గొరగ కురుబ; అనే పదాలన్నీ ఆంధ్ర, కన్నడ, తమిళ దేశాలలోని ఆటవికులజాతికి పేరుగా వాడుతూంటాము. ఇవన్నీ ఒకేజాతి పేర్లని పరిశోధకుల అభిప్రాయం. కొరవజాతివారి అంజె (నాట్య విశేషం) కొరవంజె అయినదని ప్రభాకరశాస్త్రిగారు వ్రాశారు. కొరవలేకాక, చెంచులు, కోయలు, సవరలు, యేనాదులుకూడ తమ తమ నాట్యనాటక సంప్రదాయాలను పల్లెలలో ప్రదర్శిస్తూండడం కద్దు. శైవక్షేత్రములయిన శ్రీశైలము మొదలయినచోట్లను, వైష్ణవక్షేత్రాలయిన వేదాద్రులు (విశాఖ, గోదావరి, కృష్ణా జిల్లాలలో మూడింటిలోను ఉన్నవట) గరుడాద్రి, మంగళాద్రి, మాల్యాద్రి, వెంకటాద్రి మొదలయిన పర్వత క్షేత్రాలలో జరిగే జాతరలలో ఆయా ప్రాంతాల ఆటవికులు నృత్యగానాత్మకములైన తమ ప్రదర్శనముల ద్వారా ధనార్జన చెయ్యడం అనాదిసిద్ధమైన ఆచారంగా నేటికీ వస్తోంది. వారి నాట్యములు మొటమొదట తమ ఆటవిక గ్రామీణగాథలతో రచింపబడి, తర్వాత రానురాను ఆయా క్షేత్రాల్లో వెలసిన శివునిగురించో, విష్ణుని గురించో, షణ్ముఖుని గురించో పురాణప్రసిద్ధాలైన గాథలతో రచితములవుతూ వచ్చాయి. మాయాకిరాతులయిన ఉమామహేశులు అర్జునునితో తలపడిన కిరాతార్జునీయగాథ, పార్వతీ పరిణయ కథ, నరసింహస్వామి చెంచులక్ష్మిని వలచిన కథ, కుమారస్వామి వళ్ళిని వలచినకథ కురవంజులుగా వెలిశాయి. ఈ కురవంజులలో తొలిరోజుల్లో గేయ భాగం తక్కువగాను, నృత్యభాగం ఎక్కువగాను ఉండేది. సింగి, సింగడు ఇద్దరు ఆటవిక గ్రామీణ దంపతులు (సంస్కృత నాటకాలలోని నటీనటులలాగ) కొన్నిచోట్ల కథాగతిని తెలిపే సంధివచనాలకును, కొన్నిచోట్ల పామర వినోదానికిన్నీ పనికివచ్చే పాత్రలు, కోణంగి, చోడిగాడు అనువారుకూడా హాస్యానికై ఉద్దేశించబడిన పాత్రలు. ఈ దేశి రూపకాలలోని సింగి సింగడు సంస్కృత నాటకాలకంటె ప్రాచీనులై సంస్కృత నాటక కర్తలచేత నటీనటులుగానూ, కోణంగి విదూషకుడుగానూ, దరువు అనబడే గేయపద్ధతి ధ్రువాగానముగానూ అనుసరింపబడి ఉంటాయని ప్రభాకరశాస్త్రిగారు అభిప్రాయపడినారు.

అన్నమాచార్యుల సంకీర్తన సంపుటాలలో ఒకదానిని యథాలాపంగా తిరగలేస్తే అందులో 12 దాకా సంవాద గీతులు కనిపించాయి. వాటిని గురించి

అన్నమాచార్య చరిత్రలో పేర్కొన్నాముకూడా, అవి: గోపీకృష్ణ సంవాదమూ, చెంచెతతో వేంకటేశస్వామి సంవాదమూ, గొల్లపడుచుతో వేంకటేశ్వరుల సంవాదమూ, అత్తాకోడళ్ల (లక్ష్మి - సరస్వతుల) సంవాదమూ, బావ మరదళ్ల సంవాదమూ....

చెంచెతతో వేంకటేశ్వరుని సంవాద గీతి .

చెం : వేటకాడపంట నావెంటం బాయపు రోరి
వేం : చీటకపు చెంచెతా నా చేతిలావెరంగవా
చెం : చేరీ నా మాటునం జేరిన మెకముల
నేరుపరి నంటా నీవు నేసేవు
వేం : జీరలుగా రొమ్ము గోరండింతునొ వూరకుంటేవా
ఓరుకల చెంచెతా నా బిరుదు లెరంగవా...

ఈ పాట వేంకటేశ్వరాంకిత మైనప్పటికీ, అర్థ సందర్భాలనుబట్టి గరుడాద్రి (అహోబలపు) నరసింహానికి చెంచెతతో (గరుడాచలం యక్షగానంలో) జరిగిన సంవాదంలాగే నడుస్తోంది.

అత్తా కోడళ్ల (లక్ష్మి, సరస్వతుల) సంవాద గీతి :

అత్త : రావే కోడల రట్టడి కోడల (రావే కోడల)
కోడ : పోవే పోవే అత్తయ్యా పొందులు నీతో చాలును
అత్త : రంకెలు వేయుచు రాజు నెదుట నీవు
కొంకు కొనరులేని కోడల
కోడ : పంకజముఖి నీవు వలు దొడ్డవా రింద్ల
అంకెలం దిరిగేవు అత్తయ్య.

వైష్ణవసంప్రదాయంప్రకారం లక్ష్మిసరస్వతుల నడుమజరిగిన యీసంవాదం శైవ సంప్రదాయంలోని గంగా పార్వతుల (సవతుల) సంవాదాన్ని తలపింప జేస్తుంది. ఇలాంటి సంవాదగీతులు అన్నమాచార్యాదులు తమకాలంలో తిరుపతిలోను, అహోబిలంలోను చెంచులు మున్నగు ఆటవికులు ఆడుతూండే ఆటలను చూసి వారి పాటలను విని, ఆ పదతిలో రచించడమేకాక, వీటిని స్వామియెదుట నాట్యాభినయములతో సహా వేషధారులైన నటీ నటులచేత ప్రదర్శింపించి ఉంటారని నిశ్చయంగా చెప్పవచ్చును. ఆటవికుల ఆట సంప్రదాయాలకు సాహిత్యరూపముల నిచ్చి, దేవాలయములలో సగౌరవస్థాయికి తెచ్చిన వారిలో ప్రథముడు తాళ్లపాక అన్నమాచార్యు లన్నమాట.

## నాగరక యక్షగానం :

ఏకపాత్రాకములైన ప్రదర్శనము లిస్తూండే జక్కులవారు - కొరవంజుల లోని పద్ధతులను, కలుపుకొని, బహువిధ పురాణ దేవతా కథలనూ. రాజకథలనూ ఇతివృత్తాలుగా తీసుకొని నాటకములను నగరాల్లో, రాజసభల్లోనూ, దైవ క్షేత్రాలలో దేవుని సన్నిధినీ, ప్రదర్శించడం తర్వాతి పరిణామం. సింగీ, సింగడూ పోయి రామ, నల, హరిశ్చంద్ర, సీతా. దమయంతీ. చంద్రమత్యాది పాత్రలు వచ్చాయి. ఇలా ఎరుకులు, చెంచులు మొదలయినవారి కొరవంజి సంప్రదాయాల నుంచే ఎరుకుల కాంభోజి (ఇటీవల యదుకుల కాంభోజి అయింది) చెంచు కాంభోజీ, కురంజీ వంటిరాగాలు నాగరక యక్షగానాలలోకి ప్రవేశించి, తర్వాత త్యాగరాజాది వాగ్గేయకారుల రచనలకు కూడా అర్హతపొందాయి.

ఈ నాగరక యక్షగాన పరిణామంలో గాన ప్రాధాన్యమూ, నాటకీయ ప్రదర్శనమూ హెచ్చి, నృత్య ప్రాధాన్యం కొంత తగ్గింది. తద్వారా వీటికి యక్ష గానములనే పేరువచ్చి, క్రమంగా పల్లిజనం నడుమనుంచి నాగరజన వినోదానికి గాను అభివృద్ధి పొందాయి. — యక్షాఘగీతమపి గానశైలిమ్ — అని 1628 లో గోవింద దీక్షితుడు సంగీత సుధలో — ఆనాటి గాన పద్ధతులలో యక్ష గానమును పేర్కొన్నాడు. అప్పుడు సాహితీపరులు, పండితులు యక్షగానాలు రచించి, రాజులకో, దేవతలకో అంకితం చేసి, ఆస్థానాలలోనో, ఆలయప్రాంగ ణాలలోనో ఆడించేవారు. ఇది 16 వ శతాబ్ద ప్రారంభం. సాహితీపరుల లక్ష్యాలు వెలసిన తర్వాత 17 వ శతాబ్దంలో అప్పకవి యక్షగానానికి లక్షణం కూడా చెప్పాడు.

"తుద నేడు లఘువులు తొలగించి చదివిన
త్రిపుటకు వృషభగతి పదయుగము;
లలి కడపల నొక్కలఘువు మానిన జంపె
మనుద్విరదగతి సమపదయుగము
గురుతు రూపకమునకు తురగవల్గ నా
హ్వాయ మేకతాళి యా మధురగతికి;
హరికి నిర్వదినాలు గటతాళమున మాత్ర
లోలి విశ్రాంతి పథ్యాలుగింట

తెలియ నర్ధంబు నర్ధచంద్రికలు వీట
యక్షగాన ప్రబంధంబు నతుకవచ్చు
రగడభేదంబు లివి యంద్రు రసకవీంద్రు.
లవిత విజసేవక స్తోమ యద్రిధామ— "

అప్పకవి పేర్కొన్న యీ రగడ భేదాలు: వృషభగతి, ద్విరదగతి, తురగవల్గనం, మధురగతి, హరిగతి. వీటికి వరుసగా త్రిపుట, జంపె, రూపకం, ఏకతాళి, అటతాళములు, పదతాళు. ఇవికాక, అర్ధచంద్రిక లను మాత్రమే పేర్కొన్నారు కాని, యక్షగానాలలో కనిపించే ఇతర దేశిరచన లివి: ఏలలు, జోలలు, సువ్వాలలు, ఆరతులు, ధవళాలు, చందమామ సుద్దులు, వెన్నెలపదాలు, విరాళి పదాలు, తుమ్మెద పదాలు, గొబ్బి పదాలు, కోవెల పదాలు, చిలుక పదాలు, అల్లోనేరేళ్లు, సీసార్థాలు, కందార్థాలు, త్రిభంగులు, ద్విపదలు, త్రిపదలు, చౌపదలు, షట్పదలు, మంజరులు, జక్కుల రేకులు మొదలయినవి.

## ప్రోలుగంటి చెన్నశౌరి :

సాహిత్య స్థాయిని పొందిన యక్షగానాలు వ్రాసిన కవులలో మనకు మొదట వినబడే పేరు ప్రోలుగంటి చెన్నశౌరిది. ఇతడు సౌభరిచరితము అనే జక్కుల కథను నవరసాలంకృతముగా రచించి, ఇంకా అనేక గ్రంథాలు రచించి నరసింగరాయను రాజుచేత అగ్రహారాలను, వివిధార్థములను పొందాడట. ఈ సౌభరిచరిత్రం పుస్తకం పరిశోధకుల కింకా లభించలేదు హరిభట్టు అను కవి రచించిన నృసింహపురాణం అనే పద్యకావ్యాన్ని అతని కుమారుడు రాఘవ పండితుడు, తండ్రి మరణానంతరం ప్రోలుగంటి రంగన మంత్రికి అంకితం చేశాడు. ఆ గ్రంథపు కృత్యాద్యవతరణికలో రాఘవ పండితుడు రంగన మంత్రికి వంశవర్ణన చేస్తూ, రంగన మంత్రికి పెదతండ్రి మనుమ డయిన చెన్నశౌరిని గురించి పేర్కొన్నాడు.

> ఆ నాగమంత్రి వరునకు
> ప్రాణప్రదంబైన దేవమాంబకు తానే
> దానింతనకానీనుం
> డోనాదగి చెన్నశౌరి యుదయము నొందెన్.

ఆ మంత్రిపుంగవుం డష్టభాషా కవి
　　వర్యుడై పొగడొందె వసుధయందు
ద్విపదగా నారసింహ పురాణ మొనరించి
　　భక్తి నహోబల భర్తకిచ్చె
బాలభారత మంధ్రభాషను వచన కా
　　వ్యంబు చేసెను కవీశ్వరులు మెచ్చ
సౌభరి చరితంబు జక్కుల కథ చెప్పె
　　లాలిత నవరసాలంకృతముగ

మరియు పెక్కుకృతు ల్పటు మతి రచించె
ఖ్యాతినరసింగరాయలచేత గొనియె
నగ్రహారంబులను వివిధార్థములును
వెలసె గొండను పెండ్లి యై విభవ మెసగ.

నరసింహపురాణం ద్విపదకావ్యమునూ, బాలభారతం వచన కావ్యమునూ, సౌభరి చరిత్రం జక్కులకథనూ రచించాడు. ఇతని భార్యపేరు కొండమ్మ. ఇతని తాతయైన తిప్పన కర్ణాటాధీశ్వరుడైన ప్రౌఢదేవరాయలవద్ద దండనాథుడని రాఘవ పండితుడు వ్రాశాడు. అందుచేత చెన్నశౌరికి అగ్రహారాదులిచ్చి సత్కరించిన నరసింగరాయలు – పిల్లలమర్రి పినవీర భద్రుని పోషించి, అంతకుముందు అన్న మాచార్యులకు మిత్రుడుగానుండ, కర్ణాట సింహాసనము (విద్యానగరం) సంపాదించు కొన్న సాళ్వనరసింగరాయలే. ఇతనిని గురించి యింతమట్టుకు పరిశోధించి చాగంటి శేషయ్యగారు ఆంధ్ర కవితరంగిణి ఆరవ భాగంలో మనకు తెలియ జేశారు. 1485 నుంచి 1512 వరకు నరసింగరాయల పరిపాలనా కాలము.

సాళ్వ నరసింగరాయల యక్షగాన రసికత అంతటితో ఆగలేదు. నరసింగ రాయలరాజ్యంలో ఒక మండలంలో సమ్మెట గురవరాజనే దుర్మార్గుడైన సామం తుడు అక్కడి ప్రజలపై అన్యాయమైన పన్నులను విధించి, ఈయని వారిని హింసాత్మకమైన శిక్షలతో బాధించేవాడట. ఆ రాజ్యంలోని యక్షగాన నటబృందం వారు కొందరు చేరి గురవరాజు దుర్మార్గచర్యలను యక్షగానంగా రచించి సాళ్వ నరసింహరాయల యెదుట ప్రదర్శించారట. రాయలు సరసజ్ఞుడై గురవరాజు దుష్టచరిత్ర తెలిసికొని, సైన్యంతో వెళ్ళి, అతణ్ని హతంచేసి, ప్రజల మన్ననకు పాత్రుడైనాడట. దీనినిబట్టి యక్షగానాలు ఆనాడు క్రమంగా ప్రజాదరణా, రాజా దరణా పొంది, సాహిత్యస్థాయికి వస్తున్నట్లు తెలుస్తుంది. మాచుపల్లి కైఫి యత్‌లో ఈ గాథ కలదని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు చెప్పారు.

## రెగళిగ నిమ్మనాథుడు :

గ్రంథము లభించి అచ్చయిన యక్షగానాలలో ప్రాచీనతమ మయినది కందుకూరి రుద్రయ్య రచించిన సుగ్రీవ విజయము. దీనిని గురించి చర్చించు కొనేముందు మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో తాళ పత్ర ప్రతు లుగా ఉన్న రెండు యక్షగానము లొకవేళ ఇంతకంటె ప్రాచీనములుఅయి ఉండ వచ్చును గనుక, వాటి కర్తృత్వాది విషయములు తర్కించుకోవాలి. నిజలింగ చిక్కయ్యకథ, గురునంబి చరిత్రా అనే రెండు యక్షగాన గ్రంథాలు ఆ భాండా గారపు తాళ పత్ర పుస్తకాలలో గుర్తింపబడ్డవి. వాటిలో మొదటిదానిపైని పిడుపర్తి నిమ్మనాథుని రచన అని వ్రాసిఉన్నది. రెండవది రెగళిగ నిమ్మనాథుని రచనము.

చాగంటి శేషయ్యగారు ఈ రెండు గ్రంథాలను పరిశోధించి, తమ ఆంధ్రకవి తరంగిణి ఆరవభాగంలో ఇవి రెండూ రెగళిగ నిమ్మనాథుని రచనలే అని నిర్ణయించారు. రెండు పుస్తకాలలోను శంకర పిడుపర్తి అను నతడు గురువనీ, పర్వతలింగయ్య తండ్రి అనీ ఆకాశలింగమయిన చుండిగ్రామస్థ కలికేశ్వరుని పేర నొకటీ, రాచవీటి వీరభద్రుదేవుని పేర నొకటీ ఆ యక్షగానాలు రచించాడనీ ఉన్నది. ఈ సామ్యాలవల్ల మొదటి గ్రంథం మీద పిడుపర్తి నిమ్మనాహ్వయుడు అనే పేరులో పిడుపర్తి అనేది లేఖక ప్రమాదంవల్ల పడిఉంటుందన్నారు పరిశోధకులు. పిడుపర్తి నిమ్మయ్య అయితే క్రీ శ. 1390 – 1440 కాలపువాడట. రెగళిగ నిమ్మయ్య అయినప్పటికీ, 16 వ శతాబ్దం దాటి యీపల పడదనే నమ్మకంతో యీతని గురించిన చర్చ కందుకూరి రుద్రయ్యకంటే ముందే తీసికొన్నాము. ఈ పిడుపర్తి, రాచవీడు (రాచకొండ) చుండి గ్రామాలు తెలంగాణాలోనివి. అందుచేత ఈ కవికూడా అక్కడివాడే నని శేషయ్యగారు వ్రాశారు గురునంబి చరిత్ర కావేరీ తీరమున జరిగిన కథ నిమ్మనాథుని యక్షగానాలలో కొరవంజి సంప్రదాయాల ప్రకారం ఎఱుకత పాత్ర రావడం ఎఱుక చెప్పడం ఉన్నది.

## సుగ్రీవ విజయం :

అచ్చయిన యక్షగానాలలో చారిత్రికంగా మొట్టమొదటిదైన సుగ్రీవ విజయాన్ని రచించినవాడు కందూకూరి రుద్రయ్య.

వంగూరి సుబ్బారావుగారు శతక కవుల చరిత్రలో వ్రాసిన విషయాలనుబట్టీ, ప్రభాకరశాస్త్రిగారు సుగ్రీవ విజయ పీఠికలో వ్రాసిన అంశాలనుబట్టీ ఈ రుద్రకవి క్రీ. శ 1600 కు దాదాపు పదిసంవత్సరాలయినా ముందుపుటి, 570 వరకూ ఉమారమి 80 సంవత్సరాలు జీవించినట్లు కనబడుతుంది. కృష్ణదేవరాయల ఆస్థానంలో అష్టదిగ్గజములని పేరుపొందిన ఎనమండుగురిలోను ఇతడు కూడ ఒకడని చాలమంది పరిశోధకులు అభిప్రాయపడినారు. ఈ వాదంతో కందుకూరి వీరేశలింగంగారు ఏకీభవింపలేదు. ఈతని తలిదండ్రులు చిన్నాంబ పెదలింగనార్యుడు ఆత్రేయాచార్యుడు గురువు ... ఈతని వంశీకు లిప్పటికిని నెల్లూరుజిల్లా కందుకూరిలో కవివారని ప్రసిద్ధులైయున్నట్లును కృష్ణరాయని యాస్థానమున అష్టదిగ్గజములకు నెనిమిది దిక్కులయందుమన్న యెనిమిది సింహాసనములలో ఈశాన్య సింహాసనము నీ రుద్రకవి కిచ్చినట్లును మనోహర విషయములు తెలియుచున్నవి అని వంగూరివారు వ్రాశారు.

ఇతడు కాళీకాంబా భక్తుడు. కందుకూరిలో వెలిసిన జనార్దనదేవునికి కూడ భక్తుడు. కందుకూరి జనార్దనా అనుమకుటంతో జనార్దనాష్టకమూ, బలవదలీ శత

కము, నిరంకుశోపాఖ్యానమనే ప్రబంధమూ, సుగ్రీవవిజయమనే యక్షగానమూ ఇతని రచనలు. క్రీ. శ. 1558 లో బహమనీ రాజగు మాలిక్ ఇబ్రహీం ఇతనికి ద్వయతింత్రిణీ జనపదం (రెంటచింతలపాలెం) అగ్రహారంగా దానం చేసినట్లు శాసనం ఉన్నది. ఇతని బలవదరీ శతకంలోని కొన్ని పద్యాలు మాత్రం లభించాయని వంగూరి సుబ్బారావుగారు శతక కవుల చరిత్రలో ఉదహరించారు.

ఆంధ్ర కవితరంగిణి పదవ సంపుటంలో శ్రీ చాగంటి శేషయ్యగారు నిరంకుశోపాఖ్యాన, సుగ్రీవ విజయకర్త (రుద్రకవి) కీ. శ. 1568 ప్రాంతమువాడేని. కొంత తర్వాతి వాడేని కాగలడు అని వ్రాసిన ప్రభాకరశాస్త్రిగారి అభిప్రాయంతో ఏకీభవించారు. రాయల ఆస్థానంలో అష్టదిగ్గజాలలో ఇతడు ఒకడు అయి ఉంటాడన్న విషయాన్ని వీరెవ్వరూ చారిత్రకంగా ఒప్పుకొనలేదు.

ఇతని నిరంకుశోపాఖ్యానములోని కథకు మూలమేదో తెలియలేదుగాని' అందులోని కథా సంవిధానం అపూర్వమై స్వకపోలకల్పితమా అనిపిస్తుంది' నిరంకుశుని చరిత్ర స్థూలంగా చూస్తే తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యంలోని నిగమ శర్మోపాఖ్యానాన్ని పోలి ఉంటుంది. ఇద్దరూ ఇంచుమించు సమకాలికులై ఉండడంచేత ఒకరినొకరు అనుకరించారనడానికి వీలులేదు. వీరికి నూరేండ్లు ముందరివాడైన శ్రీ నాథుడే కాశీఖండంలోని గుణనిధ్యుపాఖ్యానమును, శివరాత్రి మాహాత్మ్యంలోని సుకుమార చరిత్రమును వీరికి వరవడియా అనునట్లుగానే వ్రాసినారు. ఉత్తమవంశంలో పుటిన ఒక యువకుడు తన వంశాచారాలను విడిచి, కామినీలంపటుడై కాకతాళీయంగా ఏదో పుణ్యక్షేత్రంలోని దేవుని సంబంధం కలిగి, పాపవిముక్తుడై మోక్షం పొందడం ఈ గ్రంథాలన్నిటిలోని ఇతివృత్తం. వీరందరిలోను రుద్రకవి కథా సంవిధానంలో మాత్రం సొంతంగా కొత్తపోకడలు పోయినట్లు కనిపిస్తుంది.

నిరంకుశుడు శుద్ధ శ్రోత్రియ కుటుంబానికి చెందినవాడు. బాల్యంలో గురుశుశ్రూషచేసి, సకల విద్యల వార్జించి కర్మిష్ఠియై ప్రవర్తిస్తూ, యౌవనంరాగానే అగ్నిసాక్షిగా పెండ్లాడిన భార్యను వదలి, వేశ్యాలంపటుడై తన ఆస్తినంతా వెచ్చపెడతాడు. కాసు చేతలేని విటరాయని వేశ్యమాత గడప తొక్కవద్దని తరిమివేస్తుంది. చేసేదిలేక అరణ్యంలోకి పోయి, అక్కడి ఒక పాడుగుడిలో శివలింగాన్ని చూసి, తనతో నెతమాడమని అడుగుతాడు. శివలింగంనుంచి జవాబు రాకపోగా, ఇద్దరి పందాలూ తానే స్వయంగా ఆడుతూ ఓడిపోయినవాడొక వేశ్యను తెచ్చి గెలిచినవాని కర్పించాలని పందెం వేస్తాడు. ఆ ఆటలో శివు డోడిపోతాడు. అప్పుడు నిరంకుశుడు తన ఉత్తరీయాన్ని శివలింగానికి చుటి తనకు రంభను తెచ్చియిమ్మని గుంజుతాడు. శివుడు కరుణించి ప్రమథగణంతో సాక్షాత్కరించగా చూసి, నిరంకుశుడు భయకంపితుడై —

అపరాధంబులు పెక్కు-చేసితి, మహాహంకారి కామక్రియా
విపులాంభోనిధి గ్రుంకుపెట్టి జడతావేశంబున న్మిమ్ము ది
వ్యపదత్వప్తిని గొల్వనైతిని మనోవాక్కాయకర్మంబులన్
చపలాత్మున్నను బ్రోవ మీ దయయ కా సాక్షిత్కటాక్షేక్షణన్.

అని ప్రార్థిసాడు. శివుడు కరుణించి, అతనికి ఇంద్రునిచేత రంభను ప్రసాదించడం, ఆ రంభ ఇంద్రునిమాట జవదాటి ఇంద్రునిచేత శాపత ప్తురాలై రాయి కావటం, ఆ రాయిని పొడిగాచేయించి, నిరంకుశుడు రంభకు శాప విమోచనం కలిగించడం-ఇలాటి కల్పనలతో ఈ కథ సాగిపోతుంది. రుద్రయ్య ఇటువంటి చిత్రకల్పనాత్మకమైన పద్య ప్రబంధం కూడా రచించాడని తెలుసుకోవడం తప్ప, ఇంతకంటె దీనిని గురించి విస్తరించి యీ గ్రంథంలో తెలిసికొన పనిలేదు.

బలవదరీ శతకంలోని రెండు పద్యాలు

చ॥ కలతపయోధిమీద తరగల్ మరి హోయని మ్రోయ వేయుభం
గుల తలపాన్పు పాము బుసకొట్టగ నేగతి నిద్ర చెందెదో
అలసత తండ్రి చీమచిటుకన్నను నిద్దురరాదు మాకు నో
బలవదరీదరీ కుహర భాస్వదరీ యదరీ దరీహరీ.

చ। కలుషసరిత్తరీపుషితగంధకరీ మహిభృత్కరీ భవా
చలభిదురీ దయారస విశాలఝరీ నిగమార్థమాధురీ
ఖలగజ కేసరీ విభవ కంపిత మేరుగిరీ లతాదరీ
బలవదరీ దరీకుహర భాస్వదరీ యదరీ దరీ హరీ.

* * *

సుగ్రీవ విజయం రామాయణ సుందరకాండంలోని ఒక ఘట్టం. రామ లక్ష్మణులు కిష్కింధలో ఆంజనేయుని ద్వారా సుగ్రీవునికి పరిచితులూ, హితులూ కావడం, ఆ తరువాత సుగ్రీవునికి తమ చరిత్రమూ, సీతాపహరణ వృత్తాంతమూ చెప్పి, సుగ్రీవునికి వాలితోగల వైర కారణాలు విని, వాలిని చంపి సుగ్రీవునికి పట్టము కడతానని రాముడు ప్రతిజ్ఞచెయ్యడమూ, వాలివధ, తారావిలాపమూ, సుగ్రీవ పట్టాభిషేకమూ ఇందలి కథాంశములు.

త్రిపుట, జంపె, కురుచజంపె, అర్ధచంద్రిక, ఆటతాళి, ఏకతాళి, ద్విపద, ధవళం, ఏల అను దేశి గేయాలీ యక్షగానంలో ఉన్నాయి. ఆహిరి, సౌరాష్ట్రి, భైరవి, కల్యాణి, పాడిరాగాలు కొన్ని దరువుల ముందుమాత్రమే కొన్ని తాళ పత్ర ప్రతులలో సూచింపబడి ఉన్నట్లు ప్రభాకరశాస్త్రిగారు పాద విజ్ఞాపికలో (ఫుట్‌నోట్స్) వ్రాశారు.

ఇందులోని అర్ధచంద్రికలు వివిధ గతులలో నడిచేవిగా ఉన్నాయి. వాటిలో మొదటిది పాదానికి 4 చతుర్మాత్రాగణాలతో ఏకతాళంలో నడుస్తుంది :

చదువులు తెచ్చిన జలచరపతికిన్
కుధరము మోచిన కూర్మంబునకున్.... ఇత్యాది.

*　　　　*

కన్నులనశ్రులు గ్రమ్మగ వగచున్., ఇదికూడా పైదానిలాగే నడుస్తుంది.

*　　　　*

అంత నెత్తురుటేరు లంతటనె వచ్చెన్
రక్కసుని ఘోషములు వెక్కసములాయెన్ —

పాదానికి మూడు పంచమాత్రా గణాలున్నూ, నాల్గవగణం రెండు గురువు లున్నూ కలిగి, జంపెగేయంలో సగం ప్రమాణంలో జంపె తాళంలోనే నడుస్తుంది. అయితే, కురుచజంపె అని కొంచెం తేడాతో మరొక గేయం దీని క్రిందనే ఉన్నదానిని కొన్ని తాళపత్ర ప్రతులలో త్రిభంగు అని సూచించారట. అంటే మూడుపాదాలు మాత్రమే కల గేయమని అర్థము.

కురుచజంపె : వనచరోత్తము లెల్ల వచ్చి — మంచి
దినము చేకొని నన్ను తెచ్చి —

ఇంకొక అర్ధచంద్రికల గేయం పాదానికి రెండు సప్తమాత్రా గణాలూ, ఒక షష్ఠమాత్రా గణమూ కలిగి ఉంది. ఇది ఆటతాళంలో సగం, చాపుతాళంలో నడిచేటట్లుంది. మూడు గణాలూ అయాక మరి ఏడు మాత్రలకు రాగం అవసరం.

శృంగముల బడబొడిచె నగ్గిరి శృంగములను
పాదముల బడదన్నె నగ్గిరి పాదములను

ఇలాటిదే మరొకటికూడా ఉంది.

స్వర్ణకుంభములందు గంగాజలము దెచ్చి

ధవళం : శ్రీరాముడు గుణధాముడు వారిజదళలోచనుడు
ఘోరత రావణు గూలిచి నారీమణి తేవలయు....

ఏల ; భానువంశమున బుట్టి,
దానవకామిని గొట్టి
మానిమఖము నిర్వహించవా — ఓ రామచంద్ర
మౌనివరులు సన్నుతింపగాన్

ఆహిరి రాగంలో పాడదగిన రసవంతమైన రాముని శోకగీతం —

త్రిపుట: హా సతీమణి ధర్మచారిణి హా గుణోన్నత జనకసుత నను
బాసిపోయితి వింతలోనే పద్మనయనా
ఎంతభయపడి తల్లడించితొ ఎంతయడలితొ ఎంతబడలితొ
ఇంతి రావణు డెత్తుకొని చన నేమిసేతున్.

మంగళం : (త్రిభంగులు)
ఇందిరావరునకు నిభభయహరునకు
కందర్ప గురునకు కళ్యాణం
సుందరబాహునకు సురుచిరదేహునకు
కందర్ప గురునకు కల్యాణం
దినకరకులునకు దీనమందారునకు
ఘన నిభగాత్రునకు కళ్యాణం.

యక్షగాన పరిణామచరిత్రలో సుగ్రీవ విజయానికి ఒక విశిష్టస్థానం ఉంది. ఇందులో జక్కుల ఆటభాగవతపు పాత్రల సంప్రదాయాలూ లేవు; కొరవజాతివారి కొరవంజి సంప్రదాయాలూ లేవు. వానివలె ఇది శృంగారరస ప్రధానం కాక పోవడమే ఇందుకు ప్రధాన కారణం. ఇది వీర రస ప్రధానమైనది. రాముడు సుగ్రీవుని సఖ్యముచేసి వాలిని వధించే వీరగాథలో వీరరసమే ప్రధానం కావలెను గదా! కానీ, సీతావిరహత ప్తుడైన రాముని విప్రలంభ శృంగారము, తారావిలాపమూ, వీర రస ప్రసారమునకు నడుమ ఉపరసమై వర్ధిల్లి సామాజిక రక్తి సంపాదించింది. కథాకథనం పద్యాలలోను, వచనంలోను నడిచింది. వాటిని సూత్రధార వాక్యములని మన మనుకోవాలి. వెడలె సుగ్రీవుడు అనే పద్ధతిలో మిగిలిన యక్షగానాలలో ఉండే ప్రావేశిక అనే దరువులు ఇందులో లేవు. ప్రవేశ నిష్క్రమణోపక్రమణాలన్నీ కథాకథన పద్యాలలోను (సంధి) వచనాలలోను సాగిపోతాయి. మొత్తానికి యక్షగాన రచనలో ఇతనిది స్వతంత్రమైన ప్రత్యేక ఫక్కి అని చెప్పవచ్చును. ఈ పద్ధతికి ఏ కర్ణాటక దేశపు యక్షగానములలో నైనా ప్రాతిపదిక ఉన్నదేమో పరిశోధించవలసి వుంటుంది. సుగ్రీవ విజయ కర్తయైన కందుకూరి రుద్రయ్య తన యక్షగానములో తన సంగీతజ్ఞతను ఎంతవరకు ప్రదర్శించాడో తెలిసికొనే అవకాశం చాల తక్కువ.

యక్షగాన రచయిత లందరూ ధాతుమాతు రచనా దక్షులయిన వాగ్గేయకారులయి ఉంటారని అనుకోడానికి వీలులేదు. కొందరు యక్షగాన సాహిత్యం రచియింపగా, ఏ సంగీత నాట్యశాస్త్రకోవిదుడో దానిని రాగ తాళ బద్ధంచేసి, నాట్యాభినయ నిర్ణయంచేసి, నటకులకు అందులో శిక్షణ యిస్తూ ఉండవచ్చు.

కందుకూరి రుద్రయ్యకు చివరి వయస్సులో సమకాలికుడయిన పింగళి సూరన్న తన కళాపూర్ణోదయంలో రంభా, మాయారంభల కలహం సందర్భంలో కొరవంజులలోని నవతుల కయ్యాన్ని అనుకరించాడు అంతేకాక, అతని ప్రభావతీ ప్రద్యుమ్నంలో - శ్రీకృష్ణుని కొలువులో యక్షగాన దక్షుడైన భద్రాచార్యుని సలహా పైని, ప్రద్యుమ్నాది కుమారులను ప్రచ్ఛన్న వేషాలతో నటబృందంగా తయారుచేసి, ప్రభావతి తండ్రియైన వజ్రనాభుని రాజ్యానికి పంపిస్తాడు కృష్ణుడు అక్కడ వారు రామాయణ నాటక ప్రదర్శనచేసి, ప్రజల మెప్పు పొందగా, కర్ణాకర్ణిగా విన్న వజ్రనాభుడు వారిని తన కొలువు కూటానికి రప్పిస్తాడు. అక్కడ వారు గంగావతరణ నాటకం ఆడతారు. ఈ ప్రదర్శనలో స్త్రీ పాత్రలు స్త్రీలే ధరించారట. ఈ నాటకాలు పగలే వేశారట. ఈ విధంగా అంతఃపుర ప్రవేశం సంపాదించి ప్రద్యుమ్నుడు వజ్రనాభుని జయించడానికి పన్నాగం పన్నుతాడు. ఈ కథ వలన పింగళి సూరన్ననాటికి యక్షగాన ప్రదర్శనాలకు పరిపూర్ణమైన రాజ సభా గౌరవం కలిగిందని తెలుస్తుంది.

పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నంలోని ప్రద్యుమ్నాదుల యక్షగాన ప్రదర్శన ఘటంలోని పద్యాలు :

సీ॥ వజ్రనాభుడు రాజ్యవైభవం బెంతయు మెరసి నానాబంధుమిత్ర సచివ
సంఘంబుతోడ నాస్థాన మహామంటపమునందు నొడ్డోలగముననుండి
పరులదృష్టికి నగోచరమగు సంవృతస్థలినిల్చి రాణివాసపు జనంబు
చూచునట్లుగజేసి సొంపారు వేడ్కతో సావధాన స్వాంతుడగుచు జూడ
సంవిహితరంగ మంగళాచారుడగుచు, సురహితముగ మాయానాట్యసూత్రధారి
వృత్తిగైకొని శంబరద్వేషియొనరె, పూర్వరంగ ప్రవర్తన పొందుపరుప

శా॥ గాంధారప్రముఖ స్వరశ్రుతికళాగంభీర వారాంగనా
గాంధర్వంబు ఘనస్వనంబు తతనిక్వాణంబు వంశాది సం
బంధిస్వాన పరంపరామహిమయున్ మద్దెళ్ల దిందింధిమిం
ధింధోంధిక్కిధిమిక్కి శబ్దభరమున్ దీపించ నాపూర్ణతన్.

సీ॥ సరవిచంచత్పుట చాపపుటోద్ఘట షట్పితా పుత్రిక సంజ్ఞలమర
వెలయుచుండెడు సమవిషమతాళ ప్రవృత్తులు నాలు ప్రసారకలన వలన
గలుగు నానాతాళములు యథోక్తస్ఫూర్తిబరగు నేలాదిప్రబంధచయము
తత్తద్రాగస్థాన దత్తపటాక్షర బిరుదాదికాంగ విస్ఫురణదనర
క్షితిచతుర్దశ ముద్రకగీతభేదములు దురాపంబులంద్రు వర్తిలె ననియును
నిఖిల కళలను గల రౌక్మిణేయు శిక్షవలన తన్నాట్యకర్మ ప్రవర్తనమున.

ఉ॥ ఆ వనజాక్షినందనుడు నంతట నాంది తగం బఠించి యిం
పావహిలం బ్రరోచనయు నాముఖముం దనరారనొప్ప, బ్ర
స్తావనతో ముఖాదులగు సంధులు సాంగత బెంపుమీర గం
గావతరాది నాటకములాడె ననేకము లద్భుతంబుగన్.

ఈ పద్యములనుబట్టి పింగళి సూరన్ననాటికి ఏలాది దేశి ప్రబంధాలతో కూడిన నాటక ప్రదర్శనములు సంస్కృత రూపక లక్షణాన్ని అనుసరించి, ప్రదర్శితము లౌతూన్నట్లు తెలుస్తుంది. పామరజనాభిరామమయిన దేశిరూపకము ఆనాటికప్పుదే నాగరక యక్షగానముగా పరిణామము పొందుతున్నదని అనుకో వచ్చును.

## పెద కెంపరాయడు :

మైసూరు ప్రాంతంలో ఎలహంక ప్రభువులుగా ప్రసిద్ధిపొందిన రాజవంశంలో జన్మించి, 1513 నుంచి 1569 వరకు ఆ ప్రాంతాన్ని పరిపాలించి, 1537 లో బెంగుళూరు పట్టణాన్నినిర్మించిన పెదకెంపరాయడు గంగాగౌరీవిలాసమనే తెలుగు యక్షగానం రచించాడు. కృష్ణదేవరాయలు ఉమ్మత్తూరు శివసముద్రం ఇత్యాదిగా జయించానని చెప్పుకొన్న రాజ్యాలలో శివసముద్రరాజ్యమంటే ఈ ఎలహంక ప్రభువుల రాజ్యమే. వీరు కృష్ణరాయలకు, అచ్యుతరాయలకు సామంతులు. పెద కెంపరాయనికి హరియకెంపరాయడనీ, కెంపగౌడ అనీ కూడ వ్యవహారము. కెంపాంబుధి అనే చెరువూ, గంగాధీశ్వరాలయము, బసవనగుడి, హల్సూరులో సోమేశ్వరునిగుడి మొదలయిన దేవాలయాలు కట్టించాడు. ఇతడు తన గంగాగౌరీ విలాస యక్షగానాన్ని ఈ సోమేశ్వరునికే అంకితం ఇచ్చాడు. గ్రంథం పూర్తిగా లభించకపోయినా, ఉదాహరణలుగా కొన్ని పద్యాలూ, ఒకటి రెండు దరువులూ, ఆ దరువులకు రాగతాళప్రసక్తి ఉన్నది.

కం॥ గంగాగౌరి విలాసము సంగతి పద పద్యములకు సరసతమీరన్
రంగద్భూషణములు చెలగంగా పెదకెంపరాయ ఘనుడొనరించున్.

కం॥ తన ప్రాణేశుని వెదకుచు వనితామణి గంగవచ్చు వైఖరి యేలా
గన నెల్లనాడు నేడన గనుగొనవలె సకలజనులు కాంక్షరహింపన్,

సీ॥ ఏనుమోములవాడు యిరుగుపాయమువాడు, నెలబాసికమువాడు వలపుకాడు
చిలువసొమ్ములవాడు తెలిమేనుగలవాడు, నీలకంఠమువాడు నీటుకాడు
వేడికన్గలవాడు లేడిబట్టినవాడు, జగము లేలెడువాడు జాలకాడు
జడలు మోసినవాడు వెడవిల్లుపగవాడు, చుట్టాలుగలవాడు సొగసుకాడు

మింటిసిగవాడు పెనుగొండవింటివాడు, లీలహాసమువాడు నామేలువాడు
అలరు నీ గుర్తులకు నలుపైనవాడు, అనిన గౌరితో చెలివ్యంగ్యమనుచు పలికె

గీ॥ పాయమందున పతి నెడబాయుకన్న, పురుషదారిద్ర్యమున మది పొగులుకన్న
విరహవేదనచే జిక్కి పొరలుకన్న, ఈ శరీరము తృణముగానెంచ మేలు.

గుమ్మ కాంభోదిరాగం – ఏకతాళం – దరువు :

కేల మమ్మొన వాలు – నీ – కేలనే వానిమీద మేలు ?
పూనెను తలపై నొకయన్న – అటి – వానిపై నేలనే కన్న ?
జడలలోన నెలవంక – వాని – కడియాస లేలనే యింక ?
తెలి మేనిపై నివిభూతి – వాని – చెలువము నీ కేమి భ్రాంతి ?
అన్నింట కొరగానివాడు – ఓ – కన్నెరో నీ కీడుగాడు .

కాంభోది – ఏకతాళం–దరువు :

జాలిమాలి బొందితినె – వాని – పాయజాలక కుందితినె
చాలుజాలు అడపుట్టు – యిట్లైన మీద – బాల నా కేటిగుట్టూ
గడియ యేడాదియైన గదవే – వాని మా విడిదికైన తేగదవే
తలకెక్కె దానిమందు – నే నెంత – పిలిచిన రా దేమందు ...

దొరికినదానినిబట్టి యీ యక్షగానంలోవి పద్యాలు, పాటలు, నిరుపమా, సొంపై, జాతీయమైన తేటతెనుగులో సాగినవి. భావములు, వ్యంగ్యములు స్పష్టంగా తెలుస్తూ, అంత్యప్రాసతో, అనుప్రాసతో లయ అప్రయత్నంగా సాగి పోయే యీ దరువులు పాడితే ఆనాడే కాదు, ఏనాడైనా జనరంజకములే అని చెప్పవచ్చు. కెంపరాయని పేరు ఆ ప్రాంతపు ఇలవేల్పునుబటి కన్నడములాగ కనబడుతున్నా, అతడూ, అతని వంశపువారూ ఆనాడు వేయించిన తెలుగు శాసనాలనుబటీ, ఈయక్షగాన రచననుబట్టీ అతడు తెలుగువాడే నని చెప్పవచ్చును. రాగ తాళ జ్ఞానమూ, లయలోని మెళుకువలూ బాగా తెలిసిన సంగీతజ్ఞునిగానే అనుకొనవచ్చును.

ఈ కెంపరాయని యక్షగానాలు చదివిగాని, వాటి ప్రదర్శనములు చూసిగాని ఇతని కించుమించు సమకాలికుడైన పింగళి సూరన కళాపూర్ణోదయంలో సవతుల కయ్యపు ఘట్టమునూ, ప్రభావతీ ప్రద్యుమ్నంలో గంగావతరణ యక్షగాన ఘట్టమునూ ప్రవెశపెట్టినాడని ఊహించవచ్చును.

## పదవ అధ్యాయం

# శివనారాయణ తీర్థులు – 1580–1680

ముఖ్యంగా ఆంధ్రదేశంలోనూ, తర్వాత తమిళ, కేరళ, కర్నాటదేశాలలోనూ భక్తి, సంగీత ప్రమేయం గల ప్రతిగృహంలోనూ నారాయణతీర్థుల తరంగాలను వినో, పాడో, ఉండనివారు అరుదు. ఆ తరంగాలతో కూడిన శ్రీ కృష్ణలీలా తరంగిణి ఒక మహాయక్షగానమని, ఆ గ్రంథాన్ని చూసి, చేపట్టి, ఉపయోగించే వారిలో – ఎవరో కొందరు విద్వాంసులకూ జిజ్ఞాసువులకూ తప్ప – చాలమందికి తెలిసినట్లు కనబడదు. ఆ తరంగాలన్నీ ఆ మహానాటకంలోని ఆయా సందర్భాల కనుగుణంగా సంభాషణలుగాను, వర్ణనలుగాను, రచింపబడినప్పటికీ, దేనికది స్వతంత్రముగా శ్రీ కృష్ణపరమైన సంకీర్తనముగా, కృష్ణ పరతత్త్వ బోధకమైన అధ్యాత్మిక వివరణముతో కూడి ఉండడమే దానికి ముఖ్యకారణం. అంతేకాదు. తరంగం అనే మాట ఆ గ్రంథంలో ఆ ఒక్కొక్క కీర్తనకు ఉద్దేశించిన పేరు కానేకాదు. కృష్ణలీలా చరిత్రకు సంబంధించిన 12 అంకముల మహానాటకంలోని ఒక్కొక్క అంకమునూ ఒక్కొక్క తరంగంగా పేర్కొన్నాడా మహాకవి. ఆంధ్రులై వెలసిన వాగ్గేయకారులలో అన్నమాచార్యులకు తర్వాత ఇతడు అద్వితీయ ప్రతిభాశాలి. నృత్య సంగీత సాహిత్య వేదాంతాది బహుశాస్త్ర పారదర్శియై, విసర్గ సరళమయిన శిల్పంతో నవ్యమార్గాన సంస్కృతాంధ్రములలో యక్షగాన రచనసాగించాడు. పరమభక్తాగ్రేసరుడు. యోగిపుంగవుడు, తత్త్వవేత్త, సంస్కృతంలో వేదాంతశాస్త్ర గ్రంథాలను కూడ రచించిన మధురవాచియైన దేశికుడు.

### దేశకాల సంగీత పరిణామ పరిస్థితులు :

అప్పటికప్పుడే విజయనగర సామ్రాజ్యం అంతరించి, ఆరవీటి రాజుల అధిపత్యాన చంద్రగిరిలో ఒక రాజ్యమూ, దక్షిణాన తంజావూరులో ఆంధ్ర నాయకుల రాజ్యమూ, మధురలో మరొక నాయక రాజ్యమూ క్రమంగా నిలవదొక్కుకొంటున్నాయి. ఉత్తరాంధ్రంలో చల్లపల్లి, ముక్త్యాలవంటి చిన్న చిన్న సంస్థానముల అధిపతులు సాహిత్య కళాపోషణ చేస్తూ ఉండినా కూచిపూడి భాగవతుల వంటి కళాపరులూ, పండితులూ, కవులూ క్రమంగా కుటుంబాలతో సహా ఆశ్రయం కోసం దక్షిణ రాజాస్థానాలవైపు తరలిపోవ నారంభించారు. అటువంటి ఒకమేళా

నికి నారాయణతీర్థులు తానే గురుత్వమూ, నాయకత్వమూ వహించినట్లు కూడా తోస్తూంది. అంతకుముందు రామరాయల ఆ స్థానంలో ఉండిన రామామాత్యుని స్వరమేళ కళానిధి అనే లక్షణగ్రంథం అప్పుడే పాతపడి దానిలోని నిర్వచనాలు గోవిందదీక్షితాది విద్వాంసుల విమర్శలకు పాత్రము లయినాయి శాస్త్రీయ సంగీత రీతులను, దేశీయ సంగీత రీతులను విద్వాంసులు పరిశోధక దృష్టితో పరిశీలించి, లక్ష్యలక్షణ సమన్వయం చెయ్యడానికి బహుళ ప్రయత్నాలు చేస్తూ ఉండేవారు. తాళ్ళపాకవారు నెలకొల్పిన సంకీర్తన సంప్రదాయం దేశం నలుమూలలా వ్యాపించింది. కాని, అప్పుడే ప్రజాదరణమూ, రాజాదరణమూ సంపాదించుకొని పైకి తలయెత్తుకొంటున్న యక్షగానము పల్వురు వాగ్గేయకారులను భ్రమపెడుతూ ఉండినది.

## కాలం:

సంస్కృతంలో పరిపక్వమైన శైలిలో కృష్ణలీలాతరంగిణిని యక్షగానంగా రచించిన నారాయణతీర్థ లవతరించిన కాలపరిస్థితి అది. నారాయణతీర్థుల కాల నిర్ణయమును గురించి డాక్టరు వి. రాఘవన్‌గారు పరిశోధించి కొన్ని అంశాలు చెప్పారు. తీర్థులవారి శిష్యుడు రచించిన పంచకోశమంజరి అను గ్రంథ మొకటి తంజావూరు పుస్తక భాండాగారంలో ఉంది ఆ తాళపత్రప్రతి తులజాజీ మహారాజు వ్రాయించినది. ఆయన కాలం 1765-82. నారాయణతీర్థులు అప్పటికి రమారమి 100 ఏండ్లకు ముందుండవలెను. తీర్థులవారు తెలుగులో రచించిన పారిజాతాపహరణ యక్షగానంలో చివరి దరువులో అచ్యుతాబ్ధి ప్రభో వరదరాజ అనిఉన్నది. ఆ యక్షగానపు ప్రతి ఒకటి తంజావూరు భాండాగారంలోను, ఒక ప్రతి మేళటూరులో యక్షగానరచనా ప్రదర్శనములకు ప్రసిద్ధి చెందిన భాగవతుల కుటుంబంవద్దను దొరికినవి. ఆ మేళటూరుకే అచ్యుతరాయ సముద్రమని 1614 వరకు తంజావూరు పాలించిన అచ్యుతప్పనాయకుని దానంవల్ల కలిగిన పేరు ఉండేది. ఆ దానం యక్షగాన ప్రదర్శనములు చేసిన భాగవతుల కుటుంబానికి, ఆ మహారాజు వారి ప్రదర్శనకౌశలాన్ని మెచ్చుకొని యిచ్చినదే. ఈ భాగవతులు ఆంధ్రదేశంనుంచి దక్షిణదేశం రాజాశ్రయంకోసం వచ్చి, ఆ విధంగా అగ్రహారాలు పుచ్చుకొని అక్కడ స్థిరపడ్డారు. తరువాత 100 ఏళ్ళలో వారు చాలా తెలుగు యక్షగానాలు రచించారు. నారాయణతీర్థులుకూడ ఆంధ్రదేశంలోనే జన్మించి కొంతకాలానికి దక్షిణదేశానికి వెళ్ళినట్లుగా ప్రతీతి ఉన్నది. ఆయన బహుశా ఆ భాగవతులతో చేరి కాని, కొంచెం ముందువెనుకలుగా గాని వెళ్ళి ఉండవచ్చు. తీర్థులవారి గురువైన శివరామతీర్థులు గురుచంద్రిక అనే సంస్కృత గ్రంథం వ్రాశారనీ, కంచిలో ఉండేవారనీ, వారికాలం విక్రమశకం 1718 - 30

అనగా క్రీ. శ. 1675 ప్రాంతమని చెరువు లక్ష్మీనారాయణశాస్త్రిగారు వ్రాశారు. దీనినిబట్టి తీర్థులవారు అధమం క్రీ. శ. 1700 వరకూ జీవించినట్లు తెలుస్తోంది. మొత్తానికి ఆయన సుమారు 1580 ప్రాంతాన జన్మించి, 1614 లోపుగానే దక్షిణాది వెళ్లి, అక్కడ దాదాపు 1680 వరకు జీవించి ఉన్నట్లు చెప్పవచ్చు.

## గు రు వు :

ఈయన గురువుపేరు శివరామానంద తీర్థులు అని కృష్ణలీలా తరంగిణి లోని కీర్తనలలో చాలవాటిలో ఉటంకించారు. సుబ్బరామ దీక్షితులు సంగీత సంప్రదాయ ప్రదర్శిని యందు వ్రాసిన వాగ్గేయకార చరిత్రంలో సరిగా నారాయణ తీర్థులకు ముందు ఒక రామానంద యతీంద్రులను గురించి చెప్పారు. ఆయన సంస్కృత, సంగీత, రచనా సామర్థ్యము గలిగిన వారనీ, ఆయన రచించిన గౌరీ రాగ ప్రబంధము ఆయన పాండిత్యానికి దృష్టాంతమనీ, ఆయన అహోబిల పండితునికి వెనుకటి వారనీ వ్రాశారు. ఈ రామానంద యతీంద్రులే నారాయణతీర్థుల గురువులు కావచ్చు. తీర్థులు రచించిన భక్త్యధికరణమాలాశాండిల్య సూత్ర వ్యాఖ్యలో శ్రీరామ గోవింద సుతీర్థపాద కృపావిశేషా దుపలభ్యబోధం. శ్రీ వాసుదేవాదధిగత్య సర్వశాస్త్రాణి వక్తుంకిమపి స్పృహానః—అని చెప్పిన శ్లోకాన్నిబట్టి వాసుదేవ పండితులవద్ద సర్వశాస్త్రాలను అభ్యసించినట్లూ, రామగోవింద తీర్థుల శిష్యులయినట్లూ స్వామి శివశంకరులు వ్రాశారు. ఈ రామగోవిందతీర్థులూ శివరామానందతీర్థులూ ఒకరే అంటున్నారు. డా॥ వి. రాఘవన్‌గారు మద్రాసు సంగీత పరిషత్పత్రికలో వాగ్గేయకారుల చరిత్ర పరిశోధన వ్యాసములలో ఒక దానిలో ఒక రామానంద కవిరాయని గురించి పేర్కొన్నారు. అతడు ఉత్కళ రాజయిన వీరరుద్ర గజపతి ఆస్థానకవీ, సంగీత విద్వాంసుడూ మాత్రమే కాకుండా గజపతిరాజుల ప్రతినిధిగా రాజమహేంద్రవరంలో ఉండినవాడు కూడానట. సంస్కృతంలో జగన్నాథవల్లభ నాటకమును సంగీతాత్మకంగా రచించాడట. కవి నారాయణుడు రచించిన సంగీత సారణి అనే గ్రంథంలో గుండక్రియరాగంలో రామానందుడు చేసిన క్షుద్రగీతా ప్రబంధము ఉదహరింపబడిందట. అతని ప్రబంధంలో చివరి ముద్ర యిది. జయతు రుద్ర గజేశముదితం, రామానంద కవిరాయ కవిగీతమ్. ...

కృష్ణదేవరాయలకు సమకాలముననో లేక, కొంచెము తరువాతనో ఉండిన ఉత్కళ గజపతిరాజు కొలువుచేసిన రామానందకవిరాయడు తర్వాత కొంత కాలానికి సన్యసించి యతీంద్రుడై ఉంటాడు. అప్పుడు రామానందయతీంద్రుడు తన వార్థక్యంలో బాలుడైన నారాయణతీర్థులకు ఉపదేశం చేసి ఉంటాడు. దీనినిబట్టిన్నీ, నారాయణతీర్థులవారి స్వస్థలం గోదావరీ ప్రాంతమని అనిపిస్తుంది. కాని, యీ

రామానందరాయడే రామానందతీర్థయతి అయి ఉంటాడన్న విషయాన్ని పరిశోధకులు ఎంతవరకు అంగీకరిస్తారో ?

స్వ స్థ లం :

తీరులవారి కించుమించు రెండు శతాబ్దాల పూర్వుడైన శ్రీనాథ మహాకవి రాజమండ్రి రెడ్డిరాజయిన వీరభద్రారెడ్డికి కృతియిచ్చిన కాశీఖండంలో....

వేదాద్రి నరసింహవిపుల వక్షస్థలీ
కల్హారమాలికా గంధలహరి.—

తనకాశికా ఖండరచనమునకు కారణములు, ఉద్బోధకములు అయిన వాటిలో నొకటిగా పేర్కొన్నాడు. ఆ వేదాద్రి గోదావరీ సాగర సంగమం వద్దనున్న అంతర్వేదియే. ముద్రితములుగాని నారాయణతీరుల తరంగాలలో – ఆంధ్ర జిల్లాలలో వాడుకలో ఉన్నదానిలో–నందబాలం నవనీతచోరం బృందావన సంచారం లాలిత శ్రీ అంతర్వేది లక్ష్మీనృసింహం....అని ఉన్నదిట. దీనినిబట్టే మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారివంటి పండితులు నారాయణ తీర్థులను గోదావరీ తీర వాసిగా భావించారు. అయితే, నరసింహక్షేత్రము లెక్కకెక్కడున్నా వాటన్నిటికీ వేదాద్రులనే వ్యవహారం ఉన్నట్లు కనిపిస్తున్నదని ప్రభాకరశాస్త్రిగారు వ్రాసినట్లు లీలాశుకుని చరిత్ర సందర్భంలో చెప్పుకొన్నాము. కృష్ణలీలాతరంగిణిలో ముచుకుందుడు కృష్ణుని స్తోత్రం చేస్తూ....

వేదాద్రి శిఖర నరసింహ మా కలయామి — అంటాడు. దేవతలు కంస వధ చేరుకొన్న శ్రీకృష్ణుని నుతిస్తూ (దశమ తరంగంలోని కీర్తనలో)

అవలోకయత శ్రీ గోవిందం....

ఏకాంత దైవతం యాదవాద్రి సముదితం

శ్రీకాకుళనగరీ శ్రీ భూమి సహితం — అని ఉన్నది.

ఈ తరంగానికి వావిళ్ళవారు వేసిన పుస్తకంలోని వ్యాఖ్యానంలో – ఈ గీతములవలన నారాయణతీర్థుని నివాసము శ్రీకాకుళమని ఊహింపవచ్చును — అన్నారు. ఇది కృష్ణానదీతీరాన ఉండిన ప్రాచీన నగరం. ఆంధ్ర విష్ణువనీ, తెలుగు రాయడనీ, వల్లభుడనీ ఇత్యాది నామాలతో వెలసిన దేవుని నెలవు. ఇది కాక, గ్రంథాదిని, ఇష్టదేవతాదికస్తుతి శ్లోకాలలో ఒకదానిలో....

నీలాచల వరనిలయం నిఖిల జగన్నాథ మేక మాకలయే

నీరధివటతరు నికటం నిజసేవకబృంద హితవిధాతారమ్.... అనినీ,
ఆ తర్వాతి తరంగంలో పల్లవిలోనే.... (3 వ కీర్తన).

ప. సుభద్రా బలభద్ర సుదర్శన సహిత
అ. ప ఇభిరాజతారక ఈశ మామవ దేవ
ch. లవణ జలధి తీర నిరత నీలాచల
నవమణి పరిశోభి నవ్యదివ్యభవన.... అనినీ,

ఉత్కళదేశపు పూరీలోని జగన్నాథుని స్తుతించాడు. అక్కడే 4వ కీర్తనలో

ప. జయజయ రమానాథ జయజయ ధరానాథ
అ. ప. జయజయ వరాహపుర శ్రీ వేంకటేశ....

ఈ తరంగానికి వావిళ్ళవారి వ్యాఖ్యానంలో వరాహపురమంటే ఆదివరాహ క్షేత్రమైన తిరుమల అనీ, శ్రీ వేంకటేశుడా కొండపై వెలసిన శ్రీనివాసుడనీ వ్రాశారు కాని, దాక్షిణాత్య విద్వాంసులు ఇది తీర్థులవారు సిద్ధిపొందిన స్థలానికి దగరగా దక్షిణదేశంలో తంజావూరు వద్దనున్న వరహూరు అని అంటున్నారు. వీటిలో ఏ ఒక్క క్షేత్రాన్నిబట్టీ ఆయన స్వస్థలం ఇదమిత్థం అని నిర్ణయించ డానికి వీలులేదు.

ఒకటిమాత్రం నిష్కర్షగా చెప్పవచ్చు. గురువైన రామానందయతితో దేశా టనం చేస్తూండినపుడు వేదాద్రినీ, నీలాద్రినీ ఆయన దర్శించి అక్కడ వెలసిన వేల్పులను గురించి కీర్తనలను అప్పుడుగాని, ఆ తర్వాతగాని రచించి, తర్వాత తరంగిణిలో చేర్చుకొని ఉండవచ్చు. ఆయన స్మరించిన దింకొక క్షేత్రంకూడా ఉంది. షష్ఠ తరంగంలో ఏడవ కీర్తనలో—

కరుణాయాఽవ లోకయమాం శ్రీ నృసింహ
శూరా సురసంహార శోభనాద్రి శ్రీ నృసింహ....

అని చెప్పబడిన యీ శోభనాద్రి కృష్ణాజిల్లాలోనిది కావచ్చు.

## సన్న్యాస స్వీకార కథ :

నారాయణతీర్థుల జీవిత విశేషాలను గురించి పలువురు పండితులు పలు విధాల వ్రాశారు. మాడభూషి కృష్ణమాచార్యులవారు తమ సంస్కృత సాహిత్య చరిత్రలో మాధవానలకవి బిల్హణుడుగా, బృహన్మంగళుడుగా, జయదేవుడుగా, తుదకు నారాయతీర్థులుగా నవతరించినట్లు కనబడుచున్నదనీ, వారు కూచిపూడి అగ్రహారంలో 1700 ప్రాంతమున జీవించినవారనీ వ్రాశారు. విశ్వనాథ సత్యనారా యణగారు కూడ ఉయ్యూరు రాజావారు ప్రకటించిన కృష్ణలీలా తరంగిణి ప్రస్తా

వనలో పద్యరూపమున రచించిన కథలో తీర్థులు కూచిపూడి అగ్రహార నివాసి అనే వ్రాశారు. కామకోటి పీఠాధిపతి తీర్థులవారిని గురించి వ్రాసిన విషయాలు - ఆయన ఆంధ్ర బ్రాహ్మణుడు. కృష్ణాతీర నివాసి. కృష్ణకు ఆవలి ఒడ్డునగల వేదాద్రిఆయన అత్తవారి ఊరు ఒకనాడు తీర్థులు కృష్ణ యీదుకొనిపోతూ ఉండగా ఆయనకు ప్రాణాపాయస్థితి కలిగింది. గత్యంతరంలేక ఆయన ప్రేష్యోచ్చారణ చేసి మానసికంగా ఆపత్సన్యాసము అవలంబించారు. ఇంతలో చేతికేదో ఆలంబం దొరికింది దాని సహాయమున అత్తవారింటికిపోయి, భార్య సమ్మతిపైని సక్రమంగా సన్యాసం స్వీకరించి దేశాటనం ప్రారంభించారు. కాలక్రమాన ఆయన దక్షిణదేశంలోని వరహూరు చేరారు. అది తంజావూరు జిల్లాలో కావేరినది ఉపనదియైన కుడుముపత్తికి దక్షిణతీరాన ఉన్నది ఆ ఉపనది ఒడ్డునే ఉన్న తిరుప్పూందురుత్తి అనే గ్రామంలో ఆయన సిద్ధిపొందారు. ఆయన సిద్ధిపొందిన రోజున ప్రతి సంవత్సరమూ ఆ గ్రామంలో ఉత్సవం జరుగుతూ ఉంటుంది.

## వరహూరు ఆలయ ప్రతిష్ఠ :

ఆచార్య సాంబమూర్తిగారు వ్రాసిన ప్రకారం తీర్థులవారు ఆంధ్రదేశంనుంచి తంజావూరు జిల్లాకు తరలివచ్చిన ఆంధ్రబ్రాహ్మణ కుటుంబంలో దక్షిణాదినే జన్మించినవాడు. ఆయన తండ్రి గాంధర్వదేవుడు; తల్లి పార్వతి తంజావూరు జిల్లాలోని వెణ్ణాడునదికి ఆవలితీరమున ఒక గ్రామం ఆయన అత్తవారి ఊరు. నదిలో ఈదుకొని అత్తవారి ఊరికి పోతూవుండగా, ప్రవాహవేగంవల్ల ప్రాణాపాయ పరిస్థితి, ఆ తర్వాత ఆపత్సన్యాసస్వీకారము చేసి ఆపద గడిచి, అత్తవారి ఊరు చేరుకొని, అక్కడ సక్రమసన్యాసం స్వీకరించడం మొదలైన విషయాలు సాంబమూర్తిగారుకూడా వ్రాశారు. వారు వ్రాసిన ప్రకారం తీర్థులవారు సన్యాసం స్వీకరించాక చేసిన దేశ పర్యటనలో చల్లపల్లి, ముక్త్యాల సంస్థానములు చేరి కొంతకాలం ఉన్నారట. ఆ తర్వాత కలిగిన పరిణామఫలాల పోగొట్టుకొనడానికి తిరుపతికి పోయి స్వామి దర్శనం చేసి, స్వామి ఆజ్ఞమేరకు దక్షిణ దేశాన ఉన్న వరహూరుకు పోయి అక్కడ స్వామికి ఆలయం కట్టించి మూలస్థాన ప్రతిష్ఠా, చక్రప్రతిష్ఠా చేయించారట తత్ఫలితంగా ఆయనకు ఆరోగ్యం కలిగింది. అక్కడ రెండు మూడేండ్లు జీవించి, తర్వాత మాసిమాసం శుక్లపక్షం అష్టమీ కృత్తికా నక్షత్రయుక్త గురువారంనాడు తిరుప్పుందుర్తి గ్రామంలో సిద్ధిపొందారు. ఆ గ్రామంలో ఆయన ప్రతిదినమూ కూర్చుండే మామిడిచెట్టు ఆయన జీవసమాధికి ఉత్తరదిక్కున ఉన్నదనీ, వరహూరు వేంకటేశ్వరాలయంలో తీర్థులవారి చిత్తరువు నేటికీ ఉన్నదనీ, తీర్థులవారు ఆనాడు అక్కడ ప్రారంభించిన శిక్యోత్సవం (ఉట్ల పండుగ) ఈనాటికీ భాద్రపదమాసంలో ఆ గ్రామంలో జరుపుతూంటారనీ

కూడా వ్రాశారు సాంబమూర్తిగారు. ఈ ఉత్సవపండుగ ఆంధ్రజిల్లాలలో కృష్ణాష్టమికి ప్రతియేడూ జరుపుతూంటారు.

## పరిణామశూల :

కొల్లూరు వాస్తవ్యులయిన చెరువు లక్ష్మీనారాయణశాస్త్రిగారు వ్రాసిన ప్రకారం తీర్థులు పూర్వాశ్రమంలో తల్లావజ్ఝల వంశంలోని వారు; గుంటూరు జిల్లాలోని కాజ గ్రామ నివాసి; పేరు గోవిందశాస్త్రి; తండ్రిపేరు నీలకంఠశాస్త్రి; పరిణామశూలవలన బాధపడుతూ దానిని నివారించుకొనడానికి గుండ్లకమ్మకు (అద్దంకి) ఆవలనున్న సింగరాయకొండ గ్రామంలోని నరసింహ దేవాలయమునకు పోయి నలుబది రోజులు స్వామికి ప్రదక్షిణం చేసి వ్యాధి కుదుర్చుకొన్నారట. అక్కడనే గోవిందశాస్త్రి తరంగాలు రచించి అద్దంకి సీమలోని 60 గ్రామాల వారికి ఆ తరంగాలను స్వయంగా నేర్పారట. ఆ ప్రాంతంలో వారి శిష్యపరంపర యీనాటికీ ఉన్నదట. ఆ కాలంలోనే గోవిందశాస్త్రి అనేక నరసింహక్షేత్రాలను దర్శించాడట. కంచిలో శివరామతీర్థులవద్ద సన్యాసం అవలంబించి నారాయణ తీర్థులనే పేరు పెట్టుకొన్నారని, క్రమంగా కాశీవెళ్ళి అక్కడ దేహం చాలించారనీ లక్ష్మీనారాయణశాస్త్రిగారు వ్రాశారు.

## కాజగ్రామ నివాసం :

తల్లావజ్ఝల శివశంకరస్వామిగారు పై పండితుల వ్రాతలనన్నిటినీ పరిశీలించి, వారి షష్టిపూర్తి సంపుటంలో వ్రాసిన వ్యాసంలో – తేల్చిన విషయాలు – తీర్థులు ఆంధ్ర బ్రాహ్మణులని అందరూ అంగీకరించారు. తండ్రిపేరు నీలకంఠ శాస్త్రి అయి. గాంధర్వదేవుడనేది ఆయనకు సంగీతంలో ప్రజ్ఞవలన వచ్చిన బిరుదనామం అయి ఉండాలి. ఈ నీలకంఠశాస్త్రి గుంటూరు మండలంలోని కాజ గ్రామంలో ఉండేవారు. కాజ గ్రామం పరంపరాగతంగా నేటికీ తల్లావజ్ఝలవారికి ఆటపట్టు తల్లావజ్ఝలవారికి నాటినుండి అనేక తరాలుగా ముక్త్యాల ప్రభువుల ఆదరగౌరవాలు లభిస్తూండడం కద్దు. తల్లావజ్ఝలవారి కుటుంబంలోని వారు నేటికీ తప్పకుండా కృష్ణలీలా తరంగిణిలో అధమం మూడు తరంగాలయినా పారం చెయ్యాలని నియమం ఉన్నదట. తీర్థులవారు తిరునల్వేలి జిల్లాలోని శీర్ణమహాదేవి అనే గ్రామంలో నివసించి, అక్కడినుండి కాశీవెళ్ళినట్లు కూడా ఒక ప్రతీతి ఉన్నదట తీర్థులవారు కాజలో జన్మించి, పెరిగి కాలక్రమాన దక్షిణదేశం వెళ్ళి శీర్ణమహాదేవిలో ఉండి, తిరిగి ఉత్తరదేశయాత్ర చేస్తూ ఆత్మీయులపై అభిమానం కొద్దీ కాజ, కూచిపూడి మొదలైన గ్రామాలలో మళ్ళీ సంచారం చేసి ఉండ

వచ్చునసీ, ఆయన సిద్ధి పొందిన స్థలం దక్షిణదేశంలోని తిరుప్పందుర్తియే అని నిశ్చయంగా చెప్పవచ్చుననీ శివశంకరస్వామి వ్రాశారు.

## సిద్ధేంద్రయోగితో సంబంధం :

నారాయణ తీర్థులు కూచిపూడిలో నివసించినట్లు కొందరు వ్రాశారు గదా. కూచిపూడివారు తీర్థులవారి తరంగములను సంగీత నృత్యాభినయ యుక్తంగా ప్రదర్శించటం అనూచానంగా వస్తున్న ఆచారం. కృష్ణలీలాంతరంగిణి నంతనూ యక్షగానంగా ప్రదర్శించే పద్ధతి కూచిపూడిలో రెండువందల ఏండ్లకు పైగా ఉన్నదని కూడా వింటాము నారాయణతీర్థులకు చెప్పిన ఆపత్సన్న్యాసకథ కూచిపూడి భామాకలాప కర్తయయిన సిద్ధేంద్రయోగిని గురించి కూడా చెపుతూ ఉంటారు. భామకలాపానికే పారిజాతాపహరణమని పేరుకూడా ఉంది, నారాయణతీర్థులు కూడా ఒక పారిజాతాపహరణ యక్షగానం తెలుగులో రచించారు. తీర్థులవారు తరంగాలలో సిద్ధనారాయణతీర్థసేవిత శ్రీపాదం అనీ, శివనారాయణతీర్థ సిద్ధానందదాయకం అనీ ఒకటి రెండుచోట్ల సిద్ధనామం తన పేరుతో కలుపుకొన్నారు. ఈ అంశములను బట్టి, కొందరు పరిశోధకులకు నారాయణతీర్థులూ సిద్ధేంద్రయోగీ ఒక్కరే అయి ఉందురా అని అనుమానం కలగకపోలేదు. కాని, కూచిపూడివారు పారంపర్యంగా చెప్పుకొనే ఐతిహ్యాలలో నారాయణతీర్థులకు సిద్ధప్ప అనే శిష్యుడుండేవాడనీ, అతడే తర్వాత సిద్ధేంద్రయోగి అయాడనీ ఉన్నది.

## కూచిపూడివారి ఐతిహ్యం :

నారాయణతీర్థులకు దృష్టిదోషం ఉండేదట. ఆయన పండుకొని తరంగాలు పాడుతూంటే బాలకృష్ణుడువచ్చి ఆయన బొజ్జపైని చిందులుతొక్కుతూ పాటలోని లయకు అనుగుణంగా నాట్యం చేసేవాడట. ఆ బాలకృష్ణుడు బయట కూర్చుని పనిపాటలలో ఉండే శిష్యుడైన సిద్ధప్పకు కనబడేవాడు కాని తీర్థులకు కనబడేవాడు కాడు. గురువుగారి బొజ్జమీద ఆ కిష్టయ్య అలా నాట్యంచేస్తూంటే గురువుగారికి కడుపునొప్పి పుట్టలేదా అని ఒకనాడు అమాయకుడైన సిద్ధప్ప తీర్థులవారినడిగాడు. ఆ సంగతి తనకు తెలియదనీ యీసారి బాలకృష్ణుడు కనబడితే, తనకూ, సిద్ధప్పకూ జన్మరాహిత్యం యెప్పుడు సిద్ధిస్తుందో అడగమని తీర్థులవారు సిద్ధప్పతో అన్నారు. మరొకనాడు బాలకృష్ణుడు తీర్థులవారి బొజ్జపై నృత్యం చేస్తూండగా సిద్ధప్ప చూసి, నమస్కరించి తన గురువుగారికీ, తనకూ మోక్షం యెప్పుడని అడిగాడట! సిద్ధప్ప నాట్య సంగీతసాహిత్యాలలో ప్రవీణుడై పారిజాతాపహరణ కథ యక్షగానంగా రచించి, కూచిపూడి వారిచేత ఆడించి యీ

జన్మలోనే మోక్షం పొందుతాడనీ, తీర్థులవారికి మరొక జన్మవరకూ మోక్షం లేదనీ చెప్పాడట

నారాయణతీర్థుల కృష్ణలీలాతరంగిణిలోని అధ్యాత్మికపారమ్యమునూ, సిద్ధేంద్రుని పారిజాతాపహరణంలోని సహజసరళమైన శృంగార శిల్పమునూ పోల్చి చూస్తే, బాలకృష్ణుడు సిద్ధప్పతో చెప్పిన మోక్షనిర్ణయం న్యాయంగా చేసినట్లు కనిపించదు. ఈ కథ కటుకథే కావచ్చునుగాని, దీనివల్ల నారాయణ తీర్థులూ, సిద్ధేంద్రుడూ ఒకరు కారనీ, ఇద్దరూ సమకాలికులూ, గురుశిష్యులూ కావచ్చని తెలిసింది. ఆపత్సన్న్యాస కథ నారాయణతీర్థులకు జరిగినదే ఆనోటా ఆనోటా మారి సిద్ధేంద్రునికి కూడా ఆపాదింపబడి ఉండవచ్చు. సిద్ధేంద్రయోగి పారిజాతాపహరణానికీ, నారాయణతీర్థుల పారిజాతాపహరణానికీ రచనలో ఏమీ సామ్యంలేదు• రెండూ వేరువేరు పద్ధతులలో వ్రాయబడినవే. ఇద్దరూ కూచిపూడివారికి తమ యక్షగానముల రచనద్వారాను, సంగీత నృత్యములలో శిక్షణద్వారాను సహాయం చేసి ఉంటారు.

## జీవితచర్య – సింహావలోకనం :

గాంధర్వదేవుడని బిరుదు వహించిన తండ్రివల్ల తీర్థులు సంగీత సాహిత్య కోవిదుడై, అప్పటికి పల్లెపట్టులలో సాహిత్యజ్ఞానం లేక వారిచేత ప్రదర్శింపబడుతున్న యక్షగాన ఫణితిపై ఆదరంకలిగి, సంస్కృతంలో కృష్ణలీలా తరంగిణిని మహాయక్షగానంగా రచించాడు. యౌవనంలో సన్యాసం తీసికొన్న తర్వాతనే శోభనాద్రి, వేదాద్రి, శ్రీకాకుళం, పూరీ జగన్నాథము మొదలయిన క్షేత్రాలను దర్శించి ఆయా దేవతలపై కొన్ని కీర్తనలను సంస్కృతంలో రచించి, కూచిపూడి వచ్చి, అక్కడి భాగవతులకు భజనపరులకు వాటి గాన నృత్యములలో శిక్షణ యిచ్చాడు. తరంగములకు యక్షగానముగా అప్పుడే రూపం కలిగి ఉండవచ్చును. ఆ తరువాత పరిణామశూల కలిగి తిరుపతి వెళ్ళి వేంకటేశ్వరస్వామి దర్శనము చేసుకొని ఆయన ఆనతిపైని దక్షిణాదికి వెళ్ళి వరహూరులో ఆలయప్రతిష్ఠచేశాడు. జయజయ వరాహపుర శ్రీ వేంకటేశా అని ఈయన చెప్పిన కీర్తన ఆదివరాహ క్షేత్రంలో (తిరుమల) వెలసిన శ్రీ వేంకటేశ్వరుని గురించి చెప్పినదని ఆంధ్ర దేశీయులూ, వరహూరులో తీర్థులు నెలకొల్పిన వేంకటేశ్వరుడే అని దాక్షిణాత్యులూ అంటూ ఉంటారు. వరహూరు వెళ్ళిన తర్వాత అక్కడ భజనగోష్ఠుల వారును, భాగవతనాటక సంప్రదాయము వారున్నూ ఆయనను చుట్టుకొన్నారు మేళటూరు అని చెప్పబడుతున్న గ్రామం భాగవత మేళములు కట్టువారికి అచ్యుతప్ప నాయకుడు దానంచేసిన గ్రామం కనక అచ్యుతాబ్ధి అనీ, మేళత్తూరు అనీ మొదట వ్యవహారం ఉండేది. దీనిని ఋజువుపరచే శాసనాలుకూడా

లభిసున్నాయట. ఆ మేళవత్తూరు వారు తంజావూరు ప్రభువులను మెప్పించడానికి ప్రదర్శించిన తొలి యక్షగానం కృష్ణలీలా తరంగిణియేమో అనిపిస్తుంది. సొంతంగా తెలుగు యక్షగానాలు రచించిన మేలట్టూరు వేంకటరామశాస్త్రి వంటి వాగ్గేయకారులంతా నారాయణ తీర్థులకు తర్వాతవారే. మేళట్టూరువారు కూడా నారాయణతీర్థుల వలెనే అప్పుడే ఆంధ్రదేశంనుంచి వలసవచ్చినవారు కావడం వల్లనే వారు ప్రదర్శించిన తొలినాటకం కృష్ణలీలా తరంగిణి కావచ్చునా అనే అనుమానానికి వీలుకలిగింది.

కృష్ణలీలా తరంగిణిలో వరాహపుర వేంకటేశ్వరు నొక్కడినే దక్షిణదేశ దైవముగా చూపవచ్చునేమోగాని, తీర్థులు ప్రశంసించిన మిగిలిన దేవతాక్షేత్రము లన్నీ ఆంధ్రదేశములోనివీ, పూరీజగన్నాథం ఉత్కలదేశంలోనిదీని. అందుచేత తద్రచనాకాలంనాటికి తీర్థులవారికి ఆంధ్రోత్కలదేశాలతో ఉన్నంత పరిచితి దక్షిణ దేశంలో లేదనీ, అథవా ఆయన దక్షిణదేశంలో వరహూరు, తిరుప్పుందుర్తి, శీర్ణమహాదేవి గ్రామాలను దాటిపోయి ఉండలేదని స్పష్టము. తీర్థులవారు కృష్ణ లీలా తరంగిణిని పూర్తిచెయ్యడం దక్షిణదేశంలోనే జరిగివుంటే వారు కాశీ యాత్రకై ఉత్తరదేశ సంచారంచేసిన సందర్భంలో ఆంధ్రదేశంలోని ఆయా ఊళ్ళల్లో కృష్ణలీలా తరంగములను ఆయా భక్తకూటములవారికి, యక్షగాన భాగవతులకూ నేర్పి ఉండవచ్చును.

## తీర్థుల రచనలు :

1. సంస్కృతములో కృష్ణలీలాతరంగిణి యక్షగానం.
2. తెలుగులో పారిజాతాపహరణ యక్షగానం.

మిగిలినవన్నీ సంస్కృత గ్రంథాలు.

3. శాండిల్య భక్తిసూత్ర వ్యాఖ్య } ఇవి రెండూ
4. భక్త్యధికరణమాల } భక్తి సిద్ధాంత సంబంధములు

5. సాంఖ్యకారికా వ్యాఖ్య } సాంఖ్య సిద్ధాంతానికి
6. సాంఖ్యతత్త్వ కౌముదీ వ్యాఖ్య } సంబంధించినవి.

7. న్యాయకుసుమాంజలీటీక } తర్కశాస్త్రానికి
8. న్యాయముక్తావళీటీక } సంబంధించినవి.

9. భాట్టభాషాప్రకాశము — పూర్వమీమాంస గ్రంథము.
10. యోగసూత్ర వ్యాఖ్య
11. సిద్ధాంతబిందు లఘుచంద్రిక

12. వేద సవ టీక
13. వేదాంత విభావనాటీక

వీటిలో కొన్ని ముద్రితాలు - కొన్ని అముద్రితాలు. అచ్చుకానివి కాశీ విశ్వవిద్యాలయ గ్రంథాలలో ఉన్నవట. ఈ గ్రంథాలలో కొన్నిటికి నారాయణ తీర్థుల కర్తృత్వాన్ని పరిశోధకులు శంకించారు. ఇవికాక, తీరులవారు 14. హరిభక్తి సుధార్ణవమూ, 15 సురేశ్వరాచార్య విరచిత పంచీకరణవార్తికంపై వివరణదీపికను సంస్కృతంలో రచించారట. ప్రాచీన సంస్కృత కవులవలె ఈయన తన వ్యాఖ్యలను చంద్రికాలాంఛితములుగా చేశాడు.

## తరంగిణి :

భాగవత పురాణ దశమస్కంధంలోని కృష్ణగాథలలో ప్రధానమైన వాటిని తీసుకొని, కొన్నిటిని సంగ్రహించి, కొన్నిటిని విస్తరించి నారాయణతీర్థులు కృష్ణ లీలాతరంగిణిని 12 తరంగములు (అంకాలు)గా రచించారు. ప్రతి తరంగమూ ప్రారంభించేముందు దానిలోని కథను శ్లోకాలలో సూచించి, తర్వాత పాటలతో శ్లోకాలతో సంధి గద్యలతో ఆ కథనే విపులపరిచారు.

కృష్ణలీలా తరంగిణి తరంగ విభజనము - కథా వివరణము :

1. శ్రీకృష్ణావతారము - కంస దౌష్ట్యము.
2. శ్రీకృష్ణ బాలలీలలు - పూతనవధ, యమళార్జున భంజనం, మృద్భక్షణం, విశ్వరూపము.
3. గోవత్సపాలనము - అఘాసురవధ, బ్రహ్మ, యజ్ఞపత్నులూ కృష్ణుని స్తుతించుట.
4. కాళియ మర్దనము, ఖరప్రలంబాసుర వధ, దావాగ్ని భక్షణము.
5. గోపీ వస్త్రాపహరణము, గోవర్ధనోద్ధరణము.
6. శ్రీకృష్ణ గోపీ సమాగమము - అధ్యాత్మికతత్త్వ వివరణము.
7. రాసక్రీడ - కృష్ణుని అద్వైత తత్త్వోపదేశము
8. గోపికాగీతలు - అంతర్హితుడైన కృష్ణుని గోపికలు అన్వేషించుట.
9. అక్రూర సందేశం, కృష్ణుడక్రూరునికి విశ్వరూపం చూపుట, బలరామ కృష్ణుల మధురాప్రవేశము.
10. రజకాది నిగ్రహం, కుబ్జాప్రీణనం, చాణూర ముష్టికాది వధ, కంసవధ పితృదర్శనము.

11. గోపికావిరహం, ఉద్ధవ సందేశం, కాలయవన వధ, ముచుకుంద స్తుతి, ద్వారకాప్రవేశము.

12. రుక్మిణీకళ్యాణ కథ, అష్టమహిషీ కళ్యాణము.

ప్రారంభంలో మంగళాచరణ శ్లోకాలూ, ఇష్టదేవతా ప్రార్థనాత్మకములైన కీర్తనలూ, శ్లోకాలూ అయిన తర్వాత....

వాసుదేవే భగవతి భక్తిప్రవణయా ధియా
వ్యజ్యతే భక్తిసారాఢ్యా కృష్ణలీలా తరంగిణీ...

అని భగవంతుడైన వాసుదేవునియందు భక్తిప్రవణులైన ధీమంతులకు, భక్తిసారం సంపదగా కలవారికి యీ కృష్ణలీలాతరంగిణి బోధపడుతుందని అధికారి నిరూపణంచేసి, ప్రబంధప్రతిపాద్య కథాసంగ్రహాన్ని 4 శ్లోకాలలో క్లుప్తంగా చెప్పి, మరి మూడు శ్లోకాలలో మొదటి తరంగంలోని కథ సంగ్రహంగా చెప్పారు. అప్పుడు యక్షగానం ఉగ్రసేనుడు ప్రవేశించే దరువుతో ఆరంభిస్తుంది.

సౌరాష్ట్రి – ఆది :

అథ తత్రాదౌ ఉగ్రసేనాగమనమ్—
అగ్రేసరో మహాత్మనాం అగ్రగణ్యోపి ధీమతాం
ఉగ్రశాసనకాగ్రణీ రుగ్రసేనో విరాజతే...

దీనిని సరిగా తెలుగు యక్షగానములలో....వెడలె నుగ్రసేనుడు ... పాత్ర ప్రవేశకాలంలో పాడే సంప్రదాయాన్ని అనుసరించే తీర్థులవారు వ్రాశారు. ఆ తరువాత కంస ప్రవేశమూ, దేవకీ ప్రవేశమూ కూడా ఇలాగే దరువులతోనే జరుగుతాయి. అశరీరవాణిద్వారా దేవకి అష్టమగర్భ శిశువుద్వారా తనకు మృతి అని తెలుసుకొన్న కంసుడు దేవకీ వసుదేవులను చంపబోయినప్పుడు వసుదేవుడు కంసుని ప్రార్థించిన కీర్తన అచ్చమైన తెలుగు మంజరీ ద్విపద ఛందస్సు.

కాంభోజి – జంపె :

హే కంస రాజసుత హే నరశ్రేష్ఠ
హే సత్యసంధ కులజలధి భవరత్న....
హే సౌమ్యగుణయుక్త హితజనాసక్త
కల్యాణ వేద్యాం చ కలిత బహు భద్రాం
ముంచ భగినీమద్య ముహు రధిక హృద్యాం
సత్యం వదామి తవ సత్యసంధోస్మి........

ఈ మంజరీ ద్విపదలోనేకాక, మిగిలిన కీర్తనలలో – ఎక్కడో నూటికొక చోట తప్ప అన్నిటిలోను పల్లవిలోను, అనుపల్లవిలోను, చరణాలలోను పాదం మధ్య వర్ణసాజాత్య యతి పాటింపబడింది. సంస్కృతకవులూ, వాగ్గేయకారులైన జయదేవాదులూ తమ వృత్తాలలోను, కీర్తనలలోను పాదం మధ్య మాట పూర్తయి తెగిపోయే విరామ యతినే పాటించారు గాని, పాదం మొదటి అక్షరంతో వర్ణ సామ్యం గల అక్షరం పాదంమధ్య యతిస్థానంలో వచ్చే సాంప్రదాయాన్ని నారాయణతీర్థులే పాటించాడు. ఇది నన్నయాదులు తెలుగు కావ్యాలలో వాడిన సంస్కృతవృత్త రచనలో పాటించిన అచ్చమైన తెనుగు సాంప్రదాయమే. చాలచోట్ల కీర్తనలలో పాద ద్వితీయాక్షరములలో ప్రాసను పాటించే ఆంధ్రకవితా సంప్రదాయాన్ని కూడా తీర్థులవా రనుసరించాడు. అక్రూరుడు రామకృష్ణులను మేలుకొలుపుతూ 9 వ తరంగంలో పాడిన కీర్తన అచ్చమైన తెలుగు దేశీయ గేయములలోని మేలుకొలుపులనే జ్ఞాపకం చేస్తుంది.

దేశాక్షి – జంపె :

| | |
|---|---|
| శ్లోకాల | హే రామ హే కృష్ణ – ఇహ సముత్తిష్ఠ........ |
| | ప్రాచీదిగంగనా పరిహసతి హే కృష్ణ |
| కృష్ణలీలా | పతియోగ పరమ సౌభాగ్య మహితా |
| | ప్రాచీన వైరస్యమభినయంత్యధసా |
| | ప్రతీచీం దిశం రామ కామముదితా.... |

ఈ మేలుకొలుపులో పోనుపోను ... దధిమధనసంజాత మధురతరసంగీతాన్ని బుధజనాగమఘోషరమ్యఘోషతో కలిపి, భూపాలదేశాక్షి, దేవగాంధారి, శుభ బిలహరి, వసంత ముఖరాగబృందాన్ని గోపికలచేత పాడిస్తూ, మల్లికాకుసుమాల చేత నవ్విస్తూ బలరామునీ, శ్రీకృష్ణునీ అక్రూరునిచేత నిద్ర లేపిస్తాడు.

యశోద బాలకృష్ణుని ఉపలాలనం చేసే ఘట్టంలో ప్రతిపాదద్వితీయాక్షర ప్రాసంతో అచ్చమైన తెలుగు ద్విపదలే కనబడతాయి.

ద్వి. సకలలోకాధార సచ్చిదాకార
ప్రకటితాగమజాల పద్మావిలోల
అగణితగుణగ్రామ ఆత్మాభిరామ
మృగమదాంకితఫాల మిత్రానుకూల....

ధూర్తగోపాలుని మెల్లని నడకలను నవనీతాదిచోరలీలలను మందాక్రాంత వృత్తంలో సొగసుగా అతిలోకమోహనంగా వర్ణించాడు.

శ్లో॥ వీథ్యాం వీథ్యాం వ్రజభువిసుఖం సంచరంతం ముకుందం
మధ్యే మధ్యే ఘృతదధిపయః పాయయంతం పిబంతం
బుద్ధ్వా బుద్ధ్వా అహమహమితి స్వాంతమాభాసయంతం
భూయోభూయోః సుతమనునయంత్యాహ చేదం యశోదా....

శ్రీ గోపాలకమేవ దైవతం .... అని దేవతలు దావాగ్ని భక్షణంచేసిన కృష్ణుని స్తుతించేటప్పుడు పాడిన కీర్తనలో (గీర్వాణగంధర్వకోటి గీతగోవిందం) అని కృష్ణుని గూర్చిన పొగడ్తలోనే జయదేవుని గీతగోవిందంపైని తనకుగల గౌరవాన్ని వ్యంజితం చేశాడు.

అన్నమాచార్యులవలె - తీర్థులవారుకూడా సంవాదగీతులను తరంగిణిలో రెండు సందర్భాలలో రచించారు. గోపికా వస్త్రాపహరణ సందర్భములో శ్రీకృష్ణునకూ గోపికలతో జరిగిన సంవాద మొకటి....

ధన్యాసి - ఆట :

కృ. ఆవరణం మమ నహితే దాతుం
భావయ గోపవధూజనబృంద

గో. దేవ యదావరణం మమ నీతం
దేహి విభో భవతా తదనంత....

కృ. తర్హి తదావరణై రల మస్త్యైః
తస్య న కించి దలోక్య మిహాస్తి

గో. కిమిద మలౌకిక సిద్ధావరణం
కేవా వయ మిహ లజ్జాభరణాః....

స్వపరదృష్టి వ్యత్యాసంలేని జ్ఞానావస్థలో వస్త్రావరణం అనే మాయ, లేక - అహంకారమును విసర్జించిన గోపికలకు కృష్ణపరమాత్మ అద్వైత తత్వము నుపదేశించిన ఘట్టము గోపికా వస్త్రాపహరణము. తరంగిణిలో భాగవతంలోకంటే స్పష్టతరంగాను, విపులంగాను ఈ ఘట్టాన్ని తీర్చిదిద్ది తీర్థులవారు తమ అధ్యాత్మిక జ్ఞానసంపదను అందులో పదపోశారు.

అష్టమ తరంగంలోని రాధామాధవ సంవాద మింకొకటి....

మధ్యమావతి - జంపె

రా. కలభగతికలితఘన కాలమేఘాభ
కలయమమరహసికుతుకానిసుబహూని....

కృ. కలహంసగామిని తథైవకరవాణి
కథయసి యథాసపది కథయపరమద్య....

రా. విమల కళ్యాణగుణ వివిధ విశ్వాత్మన్
విగళితదుకూలమథ రచయ మమ సుదృఢం....

కృ బాఢమబలే తవ, దృఢం విరచయామి
హాటకదుకూలమాయాహి తరుమూలం....

రా. అధరసుధయా మమ మనోరథపయోధిం
అధికమిహ పూరయ కృపాపార జలధే

కృ. కలయవరవర్ణిని తథైవ కలయామి
మిళతు తవ హృదయం మదీయ హృదయేన....
ఇతి కలిత మిహ రాధికా కృష్ణచరితం
రహసి శివనారాయణానంద రచితం....

మిగిలిన కీర్తనల్లో శృంగారం వచ్చేచోటకూడా అధ్యాత్మిక భావవ్యంజనం చేస్తూ రచించిన తీర్థులవారు యీ ఘట్టంలో మాత్రం సూటిగా శృంగారరస పరమావధిని అందుకొన్నారు.

రాసక్రీడావర్ణన ఘట్టంలోని యీ కీర్తనలో—

ముఖారి - ఆది

అద్వయ మఖండిత మశేష జగదాదిం
యత్ర చ జగత్త్రయ మాస్థిత మనంతే
యత్ర విలయం పునరుపైతి మృదికుంభో
యద్వ దవధారయత సత్యమితి మామోం.... ....
శ్రీ మురరిపోర్వదన పద్మ మకరందం
బ్రహ్మ సుఖసార వచనం బహు పిబంతః
గోకులవధూ మధుకరాస్తు పరితృప్తాః
రాసభువి మండల కృతా బహు రమంతే.... ....

ఒక కుండకు తన ఉత్పత్తికి ముందును, పుట్టిన పిదపను, నశించినపుడును - కూడ దానికి కారణము మృత్తికయే అయినట్లుగా, ఈ ప్రపంచానికి సృష్టి స్థితి లయ కాలములందు కూడ మూలకారణము నాకంటె వేరొకటి లేదు. అని ఇత్యాదిగా - కృష్ణపరమాత్మ గోపికల కుపదేశించిన బ్రహ్మజ్ఞానము ఈ రాసక్రీడా కీర్తనంలో వివరింపబడింది.

శ్లోకములు, చూర్ణికలు, త్వరితగతినిసాగు సంగీత సంవాదములు, దరువులు, ద్విపదలు, మంజరులు, చతుష్పదులు, తద్ధిమితకాది జతులతో కూడుకొన్న కీర్తనలు మున్నగువానితో కృష్ణలీలా తరంగిణి అంతా ఒక్కసారిగా ప్రదర్శిస్తే ఒకరాత్రిరాత్రి అంతా చాలదు. కీర్తనలవీ 156 వరకూ ఉన్నాయి. బహుశా యీ యక్షగానాన్ని తొమ్మిది రాత్రులుగాని, పది రాత్రులుగాని, 12 రాత్రులుగాని ఆడేవారేమో.

## సంగీతం:

ఇందులోని 156 కీర్తనలలోను ఆంధ్రదేశంలో భజనపరులద్వారాను, గాయకుల ద్వారాను జనరంజకత పొందిన తరంగాలు యివి :

1. ఏహి ముదం దేహి – యదుకులకాంభోజి – ఆది
2. కలయ కళ్యాణాని – కేదారగౌళ – ఆది
3. కలయయశోదె – కెదారగౌళ – ఆది
4. కృష్ణం కలయసఖి – ముఖారి – ఆది
5. క్షేమం కురు సతతం – సావేరి – ఆది
6. గోవింద ఘటయ – కాంభోజి – జంపె
7. గోవిందమిహ గోపికానంద – మధ్యమావతి – జంపె
8. జయజయ గోకులబాల – కురంజి – ఆది
9. నందగేహనీ – ద్విజావంతి – ఆది
10. పూరయమమకామం – బిలహరి – ఆది
11. బాలగోపాలకృష్ణ – మోహన – ఆది
12. బాలగోపాల మాముద్ధర – మోహన (రేగుప్తి) – ఆది
13. మంగళాలయ – కేదారగౌళ – ఆది
14. వీక్షేకదా దేవదేవం – (ఆహిరి) ఆనందభైరవి – జంపె
15. శరణంభవకరుణాం – సౌరాష్ట్రం – ఆది
16. శ్రీనిలయం సఖి – వరాళి (ముఖారి) ఆది

ఈ కీర్తనల స్వరాలు ఏ తాళపత్రగ్రంథములలోను దొరకలేదుగాని, భజన సంప్రదాయగోష్ఠుల ద్వారాను, కూచిపూడి, మేళటూరు భాగవతుల ద్వారాను, సాంప్రదాయిక గాయకుల ద్వారాను, పరంపరాగతంగా నేటికీ పాడబడుతూవస్తున్న

కీర్తనలు చాలా ఉన్నవి. 156 కీర్తనలకూ మొత్తం 36రాగాలు ఉపయుక్తములయి నాయి.మంగళకాపి అనే అపూర్వరాగం ఈతరంగిణీ కీర్తనలలోఉపయుక్తమైనది. ఆహిరి, మంజరి, ద్విజావంతి కర్ణాటక సారంగ, గౌరీ రాగాలలోని కీర్తనలు ప్రశస్త రచనలని పండితుల అభిప్రాయం.

మొత్తంమీద ఈ కీర్తనలన్నింటిలోను భక్తిరసం ప్రధానంగా ఉంటుంది. ఇంచుమించు ప్రతికీర్తనలోను శ్రీ కృష్ణుడు అవతారమూర్తిగా మాత్రమేకాక, మూల విరాట్టయిన పరమాత్మగానే అన్ని పాత్రల చేతనుగూడ నుతి పొందుతాడు. అంతేకాదు. తానుకూడ తాను పరమాత్మననే ప్రజ్ఞానముతో భగవద్గీతా ఘట్టమున అర్జునున కుపదేశించిన రీతిగానే ఇంద్రుడు, బ్రహ్మ, గోపికలు, యశోద మొద లయిన పాత్రలతో సంభాషిస్తాడు.

తరంగిణీ రచన కీర్తనలలోగాని, శ్లోకాలలోగాని, గద్యలలోగాని, నిర్దుష్టమై వ్యర్థపదాలులేని బింకమైన కూర్పులో అనావశ్యకమైన శబ్దాలంకార విస్తృతిలేక. యథోచితమైన అలంకారాలలో సరళసుందరమై సాగిపోయింది. అధ్యాత్మిక భావవ్యంజనం ద్వారా రాధాకృష్ణ, గోపీకృష్ణ గాథలను ప్రవచించిన తీర్థులవారు జయదేవునికంటె ఒకఅడుగు ముందుకు వెళ్ళారని నిస్సంశయంగా చెప్పవచ్చు.

## పారిజాతాపహరణం :

ఇటీవలనే తీర్థులవారు రచించిన పారిజాతాపహరణ యక్షగానం తంజావూరు లైబ్రరీలో ఒకతాళపత్రప్రతినీ, మేళటూరు భాగవతులవద్ద ఒక ప్రతినీ కనుక్కొన్నారు. తంజావూరు ప్రతిలో కర్తృత్వ చిహ్నాలు లేకపోయినా, మేళటూరు వారి ప్రతినిబట్టి, ఆ యక్షగానపు దరువులలో చివరి కర్తృత్వ ముద్రనుబట్టే అది శివనారాయణతీర్థ కృతమే అని డా. రాఘవన్‌గారు నిర్ణయించారు, తంజావూరు ప్రతిని పరిశీలించి యస్ వి. జోగారావుగారు కూడా ఒకటి రెండు వ్యాసాలు వ్రాశారు. ఇది యక్షగానము దీని దరువులలోని శైలిగాని కూర్పుగాని కృష్ణలీలా తరంగిణివలె పటిష్ఠంగాలేదు. కొన్నిచోట్ల పేలవంగాకూడా ఉన్నది. కాని పారిజాతాపహరణాఖ్య చరిత్ర మభినీయతే అని... ప్రారంభించి ...

ఆదౌకృష్ణస్తతోభైమీ సత్యాభామాతతర్జన
నారదాగమనం పశ్చాత్ పారిజాత సమర్పణం
తతః శ్రీకృష్ణసంవాదౌ రుక్మిణీ సత్యభామయోః
కృష్ణేనాపికృతం సత్యభామాయాశ్చిత్తరంజనం
సత్యమయా వైనతేయేన గగనం గమనేపథం

సత్యభామాం పురస్కృత్య నరకాసుర మంథనం
నందనోద్యాన గమనం పారిజాత సమర్పణం
ఇంద్రసుత స్తతః సత్యభామాయాశ్చగృహాంగణే
పారిజాత తరుంసమ్యగారోప్య కృతకృత్యతా
ఇత్యేవం సంగ్రహంశాస్త్ర చరిత్ర సముదీరితా...

యీ విధంగా కథా సంగ్రహం శ్లోకాలలో చెప్పినపద్ధతీ అందులోని వాక్య నిర్మాణ పద్ధతీ కృష్ణలీలా తరంగిణీ ప్రారంభించిన పద్ధతిలోనే నడిచినట్లు స్పష్టం. అందుచేత ఇది తీరులవారి రచనే. అయితే, దీనిని ఆయన వార్ధక్య దశలో ఏ మేళటూరు భాగవతుల కోరికపైనో రచించడంచేత మధ్యవయస్సులోనో యౌవనంలోనో రచించిన తరంగిణినాడు చూపినశ్రద్ధా, పటిష్ఠతా పారిజాత రచనలో కనిపించకపోయాయి.

కృష్ణ ప్రవేశ ఘట్టంలో పారిజాతంలో-తరంగిణిలోగల కృష్ణావతార ఘట్టంలోని దరువే అక్షరాలా ఉపయుక్తమయినది.

శంఖీ చక్రీ గదీ పద్మీ శార్ఙ్గీ కిరీటకుండలీ
శ్రీవత్సకౌస్తుభీ దివ్యపీతాంబరో విరాజతే .......

ఈ విధంగా పూర్వ రచనలలోని వాటిని తరువాతి రచనలోకి ఉపయోగించడం కూడా అప్పటి అలస పరిస్థితినే ఋజువుచేస్తుంది. అలాగే రుక్మిణీ ప్రవేశ దరువూ, నారద ప్రవేశ దరువుకూడా తరంగిణిలోనివే పారిజాతంలో తిరిగి ఉపయోగింపబడ్డవి.

నారదుడు స్వర్గమునుంచి తెచ్చియిచ్చిన పారిజాతపుష్పాన్ని శ్రీ కృష్ణుడు రుక్మిణి కిచ్చిన సంగతిని చెలికత్తె సత్యభామకు చెప్పగానే, భామ—

పుడమిలోపలనాడు పుట్టువు కంటె
అడవిలో నొక పుష్పమైయున్న మేలు -

అని ద్విపదలో విలపిస్తుంది. సిద్ధేంద్రయోగి పారిజాతంలో ఇదే ఘట్టంలో - అడవిని ఒకవృక్షమై పుట్టగావచ్చు...అని ఒక సీసపద్య మున్నది.

తీర్థులవారి పారిజాతంలో భామ విరహం ఘట్టంలోని ఒక దరువు ,

ఎంతదుడుకు వాడు గోపాలుడమ్మ
దాని వలపులకె వశమాయెనమ్మ
తలచుకొంటేనే తాళలేనమ్మా
నారాయణతీర్థ నామ ధేయుడమ్మ...(?)

హరిహరిహరి ఆ నందగోపకుమారుడు
అలిగితే నన్నాదరించువారెవరు
ఎన్నరాని గుణరత్నాకరుడని
విన్నవింతురే వేదాంతములో
చిన్నవాడు ధీర నారాయణతీర్థ
చిత్తవృత్తి రంగనటన వినోది.

తీర్థులవారి పారిజాతంలో సత్యభామ చేటితోకలిసి రుక్మిణీ మందిరానికి వెళ్ళి కృష్ణుని రమ్మని ప్రార్థిస్తుంది. ఆ రుక్మిణి సత్యను ఇలా గద్దిస్తుంది.

భామా నీకింతైన భయములేదా
నా మరువున పిలువ న్యాయమా నీకు ?
మగువ నాలాగె నిన్ను మన్నించునటె
తగవేమే నాతో నీకు తరుణి పోపోవే—

ఈ ఘట్టం తర్వాత సత్య కోపాగారం ప్రవేశిస్తుంది. ఆ తర్వాత కృష్ణుడు సత్యభామను స్వాంతనపరచడం, సంవాదం, స్వర్గలోకయాత్ర, నరకాసుర వధ, పారిజాత సంగ్రహణం. బౌళిరాగంలో ఇంద్రుడు కృష్ణుని స్తుతించడంతో యక్ష గానం ముగుస్తుంది.

కమలనయన పురాణపూరుష కంసభంజన శ్రీనిధే
అమరవందిత పాదపంకజ ఆశ్రితార్తి విభంజన

*   *   *

శరణం శరణం మునీంద్ర సన్నుత శరణం కమలానాయక
శరణమచ్యుతపురనివాస స్వామి వరదరాజ ప్రభో.

ఈ కీర్తనమే ఈ యక్షగానానికి మంగళంగా కూడా ఉద్దేశింపబడింది. పారిజాతాపహరణంలోని దరువులకు శంకరాభరణం. ఘంటా, ఆహిరి, మధ్యమావతీ, పున్నాగవరాళి, బౌళిరాగాలు వాడబడ్డవి.

కూచిపూడివారి ఐతిహ్యంలో చారిత్రకత కొంచెమైనావుంటే, నారాయణ తీర్థులు నడివయస్సులో ఆంధ్రదేశ సంచారం చేస్తూండినప్పుడు ఆయనతో సిద్ధేంద్రుడుగూడా ఉండి, అప్పుడే ఆయన అనుమతిపైని తెలుగులో పారిజాతాప హరణం రచించి ఉండాలి కాలక్రమాన ప్రియశిష్యుడైన సిద్ధేంద్రుడికి దూరమై తీర్థులు దక్షిణదేశంలో స్థిరపడిపోయాక, మేళటూరి భాగవతుల సంపర్కమువలన తెలుగులో పారిజాతాపహరణం యక్షగానంచేసి వారి కియ్యవలసి వచ్చి ఉంటుంది. ఇది రచించినపుడు సిద్ధేంద్రుని కూర్పు తీర్థులకు మనస్సులో కొంతగా స్ఫురణ

ఉంటే ఉండవచ్చు ననడానికి ఒకటిరెండుచోట్ల ఇరువురి పారిజాతాలలోను సమాన భావాలు దొరలడమే కారణం.

తీర్థులవారి గేయరచనలు తమకు పూర్వయుగస్వభావమైన సంకీర్తన సౌరభాన్ని దట్టంగా పట్టుకొని, తర్వాతి యుగలక్షణమైన యక్షగాన స్వరూపం పరిపూర్ణంగా అవలంబించుకొని జయదేవాదుల భక్తిశృంగార భావంతో కంటె భక్త్యాధ్యాత్మికతా భావంతో ఉదాత్తతరములై, నారాయణతీర్థులను సంకీర్తన యక్షగాన సార్వభౌమత్వమనే అనితర సాధ్యమైన పదవికి అర్హునిగా జేశాయి.

అన్నమాచార్యులు ఆరంభించిన ఆధ్యాత్మిక సంకీర్తనములలోని భక్తి వైరాగ్యములను అవలంబించి, యక్షగానపద్ధతితో మేళవించి నారాయణతీర్థులనూ, శృంగార సంకీర్తనములలోని భక్తిశృంగారములను అవలంబించి యక్షగాన పద్ధతితోనే మేళవించి సిద్ధేంద్రాదులును – యక్షగానాలను రచించారు. మొదటిది నారాయణ తీర్థులతో ఆగక దేవాలయాలలో భజన పద్ధతిగాను, ఆ తర్వాత వాగ్గేయ కారుల కృతులుగాను మారిపోగా, రెండవది శృంగారంలోని రక్తివల్లా, జనరంజకతవల్లా రాజాస్థానాలలో కూడ అభివృద్ధి, ఆదరములను పొంది తంజావూరులో యక్షగాన స్వర్ణయుగానికి కారణమైంది. సిద్ధేంద్రుని గురించి తరువాతి అధ్యాయంలో కొంచెం విపులంగా చర్చించుకొందాము.

## పదకొండవ అధ్యాయం

# కూచిపూడి - సిద్ధేంద్రయోగి 1600-1700

## కూచిపూడి, ఆట భాగవతములు :

16 వ శతాబ్దం చివరి వరకూ జక్కుల పురంధ్రుల ఏకపాత్రాక ప్రదర్శనములూ, కొరవంజులూ వేటికవి వేరు వేరుగానే సామాజనానికి వినోదాన్ని కలిగిస్తూ ఉండేవి. దాదాపు ఆ ప్రాంతంలోనే ఈ ప్రదర్శనలకుగాని, ప్రదర్శకులకుగాని సామాజిక గౌరవస్థాయిగాని, సాహిత్య నిబద్ధతకాని లేకపోవుట గమనించి అఖిలశాస్త్రపారంగతుడూ, భరతోక్తనాట్యసంగీత లక్ష్యలక్షణపరిజ్ఞాతా అయిన నారాయణ తీర్థులో, సిద్ధేంద్రయోగో – చతుష్షష్టి కళలలో పాండిత్యం సంపాదించిన విద్వత్కుటుంబాలలోని పురుషులు నాట్యాభ్యాసమూ, యక్షగాన ప్రదర్శనమూ కులవృత్తిగా అవలంబించవలెనని శాసించారు. ఆ శాసనప్రకారం స్త్రీలు వేషాలు వెయ్యకూడదు సుమారు 1500 సంవత్సరం ప్రాంతంనుంచీ కూడా కూచిపూడిలో యక్షగాన ప్రదర్శనములు కులవృత్తిగా అవలంబించిన బ్రాహ్మణ కుటుంబాలుండేవని (విస్సా అప్పారావుగారి క్షేత్రయ్యపదముల ఉపోద్ఘాతంవల్ల) తెలుస్తోంది. ఈ విషయమై ప్రభాకరశాస్త్రిగారు సుగ్రీవవిజయపు ఉపోద్ఘాతంలో ఇలా వ్రాశారు

## సిద్ధేంద్ర యోగి :

"ఇవి (యక్షగానాలు) యిట్లు కలావతులచేత ప్రదర్శింపబడుచున్నవౌట కొరతగా కనిపెట్టియో యేమోగాని, కృష్ణాతీరమునందలి కూచిపూడి గ్రామమున సిద్ధేంద్రుడనుయోగి యొకడు భాగవతకథలను పారిజాతము, గొల్లకలాపము మొదలగు పేళ్ళతో యక్షగానములుగా రచియించి, శాస్త్రీయమయిన భరతనాట్య సంప్రదాయములకు రక్షగా స్త్రీ నిస్పృహాయముగా, ఆ యూరి బ్రాహ్మణులచేతనే ప్రదర్శనము చేయింప నేర్పాటు చేసెను. ఆయూర జన్మించిన బ్రాహ్మణుడెవ్వడు గాని, ఒక్కతూరియైనను యక్షగాన ప్రదర్శనమున స్త్రీ వేషము ధరించి తీరవలెననియు, అవి వారి కులాభ్యుదయ హేతువనియుకూడ శాసించెను. ఈ సంప్ర

దాయము వెలసిన పిదపనే తత్ప్రదర్శకులకు భాగవతులనియు, తత్ప్రదర్శనములకు ఆటభాగవతములనియు పేరయ్యెను.

ఆటభాగవతము అనబడిన ఈ పారిజాత, గొల్లకలాపములలో వరుసగా సత్యభామ, గొల్లభామ నాయికలు. పక్కను హాస్యసంభాషణ చతురుడైన ఒక బ్రాహ్మణుడు చెలిక త్తెగాను (మాధవి) విదూషకుడుగాను నటించడం సంప్రదాయం. ఆటవికుల కొరవంజి సంప్రదాయాలు వీటిలో చేరలేదనీ, జక్కుల పురంధ్రుల ఆటసంప్రదాయాలకు తరువాతి పరిణామమే. ఈ ఆట భాగవతములని మనం గ్రహించవచ్చు. అందుకే వీటిని రచించిన సిద్ధేంద్రయోగి యక్షగాన కర్తలలో, సంగీత నృత్య శాస్త్రీయ సంప్రదాయాలను పరిపూర్ణంగా ఆకళించుకొన్న వాగ్గేయ కారులలో నారాయణ తీర్థులకు తరువాతి స్థానం అలంకరించాడు.

అతణ్ణి గురించి ఐతిహ్యాలుగా చెప్పుకొంటున్న కథలు తప్ప సిద్ధేంద్రుని జీవిత చరిత్రాంశాలు స్పష్టంగా పరిశోధకులకు దొరకలేదు. అతడు రచించాడని చెప్పుతున్న పారిజాతాదులను కూడా వేరెవ్వరో వ్రాస్తే, ఇతడు కూచిపూడి నటకు లకు అభినయనాట్యాలు చెప్పి నటింపచేశాడని కొందరు విజ్ఞుల అభిప్రాయం. ఆ రచయిత లెవరో కూడా తెలియదు కాని, కారయిత సిద్ధేంద్రుడే కనుక అతన్ని స్మరించడం అప్రస్తుతం కాదు.

## జీవిత చరిత్రాంశాలు :

సిద్ధేంద్రుడు – రచనలలో అవలంబించాడని చెప్పబడుతున్న సంప్రదాయా లనుబట్టి – 17 వ శతాబ్ద ప్రారంభంలో ఉండినవాడని తెలుస్తున్నది. ఇతని జీవితం గురించి కూచిపూడివారు పారంపర్యంగా చెప్పుకొంటున్నకొన్ని ఐతిహ్యాలున్నాయి. వాటినిబట్టి ఆతడు బాల్యకౌమారదశల్లో విద్యాగంధంలేని దుర్జనుడుగా, అలగా జనంతో అల్లరిచిల్లరిగా తిరుగుతూండేవాడు. అప్పుడే నాటక ప్రదర్శకులతో సంబంధాలుండేవి. పెండ్లి కూడా అయింది. అత్తవారింట్లో తన విద్యావిహీనతను గురించి అవమానితుడై అభిమానంతోచి, ఊరువిడిచి, దూరదేశాలువెళ్ళి ఎక్కడో మంత్రోపదేశము ద్వారా, సకలవిద్యా పారంగతుడై ఇంటికి తిరిగి వచ్చాడట. ఒకనాడు నదికి అవతలి గ్రామంలోని మామగారు ఇతనికి నిషేకముహూర్తము నిశ్చయించి, రమ్మని కబురుపంపగా ఇతడు బయలుదేరే సరికి, కృష్ణ వరద వచ్చి పొర్లి ప్రవహిస్తోందట. అతడు సాహసించి నదిలోదిగి వెడుతూంటే ప్రవాహం మధ్య నడక సాగక, ఈతకుమించి అతనికి ప్రాణావసానం సమీపించినట్లయింది. యజ్ఞోపవీతం తెంచి విసరివేసి మయాసన్యస్తం అని మూడు మారులనుకొని ఆ సమయంలో ఆపద్ధర్మసన్యాసం స్వీకరించగానే ఆ వరద అతన్ని అవతలిఒడ్డుకు

తీసుకుపోయిందట. అత్తవారింటికి వెళ్ళిన తర్వాత. సన్యాసం సంగతి మరచి, నిషేకకార్యకలాపాలలో నిమగ్నుడయాడు. కాని ఆ రాత్రి భార్యతో సంభాషణలో తిరిగి తన సన్యాసం విషయం స్ఫురణకు వచ్చింది. అప్పుడామె సమ్మతినీ, అత్తమామల అనుమతినీ పొంది అతడు సన్యాసాశ్రమం యథోచితంగా స్వీకరించాడు.

సరిగా ఇదే కథ నారాయణతీర్థులకు కూడా జరిగినట్లు ప్రతీతి ఉందని వెనుకటి అధ్యాయములో చెప్పుకొన్నాము. తీర్థులకు జరిగినదానిని సిద్ధేంద్రునికో, లేక ఇతనికి జరిగినదానిని అతనికో తరువాతి తరాల ప్రజ ముడిపెట్టి ఉంటారు. ఏది ఎలా జరిగిందీ స్పష్టంగా చెప్పలేము. మొత్తానికి ఇద్దరూ మధ్య వయస్సుకు కొంచెం ముందుగానే యతులయినట్లూ తీర్థులవారి వద్ద సిద్ధేంద్రుడు కొన్నాళ్ళు శుశ్రూషచేసినట్లూ కూడా కూచిపూడి ఐతిహ్యాలవల్ల తెలిసింది. అంతేకాక తీర్థుల సంపర్కంలో ఉండగానే సిద్ధేంద్రునికి పారిజాత యక్షగానం రచించే సంకల్పం కలిగినట్లుకూడా తెలుస్తుంది.

తాను నాటక ప్రదర్శకులతో కలసి మెలసి తిరిగిన కౌమారవయస్సున తనకు నాట్యసంగీత శాస్త్రములపై కలిగిన అభినివేశం సన్యాసాశ్రమం స్వీకరించిన తర్వాత కూడ వదలలేదు కాబోలు. అంతేకాక, తన గురువుకూడ అదే ధ్యాస. ఆ అభినివేశం వల్లనే అతడు లోకమంగళకరమైన ఆదర్శ పద్ధతులతో కూచిపూడి నాట్య సంప్రదాయాన్ని వంశ పరంపరాగతమైన కుటుంబ వృత్తిగా ఏర్పాటు చేశాడు. ఆతడు స్వయంగా రచించి కూచిపూడి వారిచేత ఆడించిన యక్షగానం ప్రసిద్ధమైన భామాకలాపం. పురుషుడే స్త్రీ వేషం ధరించి సత్యభామగా నటిస్తాడు ప్రక్కను మాధవియను చెలికత్తె పాత్రను నటించు చతురభాషణుడైన హాస్యగాడు ఉంటాడు.

నారాయణతీర్థుల కృష్ణలీలా తరంగిణిలోని తరంగాలు,- సిద్ధేంద్రుని యక్షగానాలూ, లీలాశుకుని కృష్ణకర్ణామృత శ్లోకాలూ, క్షేత్రయ పదాభినయమూ పారంపర్యంగా కూచిపూడివారి ప్రదర్శనలలో తప్పని అంశాలు. వీరిలో ముగ్గురు అనగా తీర్థులూ, సిద్ధేంద్రులూ, క్షేత్రయా . 50 ఏండ్లు హెచ్చుతగ్గుల్లో సమకాలికులై యుండడం అసంభవం కాదు. మొదట నారాయణ తీర్థులూ, తరువాత సిద్ధేంద్రయోగీ క్షేత్రయ్యా తమ రచనలతో కూచిపూడి నాట్య సంప్రదాయానికి తోడ్పడ్డారనీ అనుకోవచ్చు.

భామా కలాపము :

ఏది యేమైనా, ప్రసిద్ధ యోగీశ్వరుడూ, సిద్ధుడూ, వాగ్గేయకారుడూ అయిన సిద్ధేంద్రుడు కూచిపూడివారి సంప్రదాయాన్ని ప్రతిష్ఠాపించినవాడని పారంపర్యంగా

వినవస్తున్న ఐతిహ్యాన్ని వాస్తవం కాదనలేము. సిద్ధేంద్రుడు రచించిన పారిజాతంలోని తొలి ఘట్టమే భామాకలాపం. దానిలో కొన్ని మార్పులూ, చేర్పులూ చేసినవాడు మంగు జగన్నాథ పండితుడు. ఇతడు బహుశా సిద్ధేంద్రునికి ౨౦౦ ఏండ్లకు తర్వాతివాడో కావచ్చు. సుమారు ఒక శతాబ్దంగా కళావంతులైన శ్రీ రత్నముల ప్రదర్శనల ద్వారాను, కూచిపూడి విద్వాంసుల ప్రదర్శనలద్వారాను మనకు పరిచితమైన భామాకలాపములలో ఒక పాఠం ౫౦ ఏండ్ల క్రితం కాకినాడలో మంగువారు అచ్చువేశారు. ఆ యక్షగానం చివర గద్యంలో ఇలా వుంది :

> “శ్రీమదు భయకవి రచిత అభినవ పారిజాత నవరసాలంకారశోభిత శ్రీమత్ భారద్వాజసగోత్ర తిమ్మయనామ సత్పుత్ర వాధూలాన్వయగోత్ర శ్రీమత్కందాళ వేంకటాచార్య కటాక్షాంచిత శిష్యవర మంగుకులోద్భవ శ్రీ జగన్నాథ నామధేయ శ్రీమన్ మహాకవి సిద్ధేంద్రయోగి కరుణా కటాక్ష వీక్షితంబైన శ్రీ సత్యభామావిలాసంబను పారిజాతగ్రంథంబు”

ఈ జగన్నాథ పండితుడు పశ్చిమ గోదావరి జిల్లాలోని ఆకుపీడుపుర నివాసి అనీ, గౌతమీ గోదావరీ తటానగల కుందపురీ గోపాలభక్తుడనీ, ఈ యక్షగానంలోని వేణీ ప్రబంధం (భామ తెరవెడలి బయటికి రాకమునుపు జడను తెరపై వేసి సభలోని పండితులను సవాలుచేస్తూ శాస్త్రార్థాలను చర్చించే ఘట్టం) వేంకటశాస్త్రి అనే అతడూ, పద్యాలూ, ద్విపదలూ, దరువులూ వీరేశలింగం అనే అతడూ రచించారనీకూడా ఉన్నది. జగన్నాథపండితుడు ఈ రచనలన్నిటికీ సంగీతమూ, నాట్యాభినయమూ కల్పించి సిద్ధేంద్రుని భామాకలాపంలోని కొన్ని భాగాలతో కలుపుకొని తయారుచేసి ఉంటాడు. సిద్ధేంద్రునిది భామాకలాపం కావడంచేత, జగన్నాథ పండితుడు తాను తయారుచేసినదానిని సత్యభామావిలాసంబను పారిజాతగ్రంథమని పేర్కొన్నాడుకాబోలు.

## గొల్లకలాపము :

ప్రభాకరశాస్త్రిగారు పారిజాతాపహరణము, గొల్లకలాపము సిద్ధేంద్రుని రచనలని వ్రాశారు. కిన్నెర సంపుటం ౬, ౨వ సంచికలో (౧౯౫౪) గొర్రిపాటి వెంకటసుబ్బయ్యగారు కూచిపూడి వారిని గురించి ప్రకటించిన వ్యాసంలో భామకలాపం సిద్ధేంద్రయోగి రచన అనీ, గొల్లకలాపం భాగవతుల రామయ్య రచన అనీ వ్రాశారు. కూచిపూడిలోని భాగవతుల కుటుంబానికి చెందిన రామయ్య అనే పండితుడు సిద్ధేంద్రుడు మొదట వ్రాసిన గొల్లకలాపమును పై మంగు జగన్నాథం వలెనే, మార్పులతో చేర్పులతో తిరిగి వ్రాసుకొన్నాడేమో.

గొల్లకలాపంలో నాయిక వ్రేపల్లె వాడలోని గొల్లభామ. చల్లోయమ్మ చల్ల అంటూ యాదవ ('గొల్ల') కాంతల సహజ సుందరమైన ధోరణిలో ప్రవేశించి,

హాస్యసంభాషణచతురుడైన బ్రాహ్మణ విద్వాంసునితో వివాదానికి దిగుతుంది. ఆ వివాదంలో పిండోత్పత్తి "మానవ శిశు జననం" మొదలు మరణంవరకూ చల్ల నుంచి వెన్న తియ్యడం మొదలు జీవాత్మ పరమాత్మ సంబంధం వరకూ మానవ జీవితం గురించిన, బ్రహ్మాండ సృష్టిని గురించినవీ, సకల విషయాలనూ ఆధ్యాత్మికంగా వారిద్దరూ చర్చిస్తారు ఆ చర్చ సంస్కృత శ్లోకాలలో వేదాలనుంచీ, ఉపనిషత్తులనుంచీ దృష్టాంతాలతో, తెలుగు పద్యాలతో, దరువులతో కందార్థాలతో సాగుతుంది. ఈ రచనకు ప్రాతిపదిక తప్పకుండా సిద్ధేంద్రయోగిదే అయి ఉండాలి. సిద్ధేంద్రుడు దీనిద్వారా పామరజనాహ్లాదకరమైన ఈ ఆట భాగవతంలో పండితాదరపాత్రమైన ఆధ్యాత్మిక తత్త్వాన్నికూడా చేర్చి ఉభయులకూ ఉభయ మార్గాలూ ఆదరణీయములయేటట్లు చేశాడు.

ఈ కలాపాలు అనబడే ఆట భాగవతాలను మొదట కూచిపూడివారే పురుషులు స్త్రీ వేషాలు ధరించి ఆడుతూ వచ్చినా, దాదాపు ౧౬ వ శతాబ్దపు మధ్య భాగంనుంచీ కళావంతుల స్త్రీలు కూచిపూడి విద్వాంసులవద్ద శిక్షణపొంది, భామ వేషములను స్త్రీలే ధరించి ప్రదర్శనలిస్తూ ఉండేవారు. ఇంతవరకు చెప్పుకొన్న భాగవత ప్రదర్శనల పరిణామ చరిత్రనుబట్టి భాగోతుల బుచ్చిగానిని గురించీ, పెండెం నాగినిగురించీ శ్రీనాథునిపేర ప్రచారంలోఉన్నచాటుపద్యం ౧౫ వ శతాబ్దిలోని శ్రీనాథునిది ఎంతమాత్రమూ కాదనీ, ౧౮ వ శతాబ్దపు వాడయిన తురగా రామకవి దనీ స్పష్టపడుతుంది. గోదావరిజిల్లాలో మండపేట, పిఠాపురం గ్రామాలలో దుగ్గిరాలవారు, కోనేవారు, పెండ్యాలవారు ఈ ప్రదర్శనల్లో ప్రసిద్ధిపొందారు. నటువవరాళ్లు జీవిత వ్యవహారంలో కూడా సత్యభామ అనే పిలిపించుకోవడం పరిపాటి అయింది. వారిలో పెండ్యాల సత్యభామను (ఇప్పుడు ౭౦ ఏళ్ళ వయస్సుండవచ్చు) ఈ గ్రంథకర్త ఐదేళ్ళ క్రితం కలిసికొన్నప్పుడు - సిద్ధేంద్రుని భామాకలాపం ఆమె ద్వారా వినేభాగ్యం కలిగింది.

సిద్ధేంద్రుని భామాకలాపంలో ఎక్కువభాగం భామావిరహమూ, కృష్ణుడు భామను అనునయించేవరకూ సాగి చివరి భాగంలో పారిజాతాపహరణ కథ స్వల్పంగా సూచితమవుతుంది మంగు జగన్నాథ పండితుడు వ్రాసినది పెండ్యాల సత్యభామాగారికి పాఠం కాలేదట. తాను చెప్పుకొన్న భామాకలాపం తనకు ముందు మూడు తరాలనుంచి తమ వంశంలో పాఠమట. ఆమె ప్రస్తుతం నివసిస్తున్న పిఠాపురంలో మా తండ్రిగారైన శ్రీ బాలాంత్రపు వేంకటరావుగారు మా యీ గ్రంథ రచనా సందర్భములో ఆమెను కలిసికొని, ఆమెద్వారా తెలిసికొని పంపిన విషయాలను ఇక్కడ వ్రాస్తున్నాము. ఈ సత్యభామకు పిఠాపురందగ్గరి చేబ్రోలు గ్రామకాపుర స్తులైన కొల్లూరు వెంకయ్యగారును, చెరుకూరి నాగరాజ పండితుడును సత్యభామా నామధేయురాలే ఐన ఆవిడ అమ్మమ్మకు అలమూరు కాపురస్తులయిన,

పుల్లాపంతుల చలమన్నగారును సంగీత నాట్యాభినయ యుక్తముగా భామాకలాప మును చెప్పిన గురువులు. ఈ గురువుల కుటుంబాలలో, కొల్లూరువారు తమ తమ గ్రామాలలో వంశపారంపర్యంగా నృత్యగీతాదులతో యక్షగానములను ప్రదర్శించే భాగవతులు. వారికి ఆ సాంప్రదాయం కూచిపూడినుంచే వచ్చినది.

భామాకలాపంలో చిపకనున్న స్వల్పభాగంలోతప్ప సిద్ధేంద్రుడు రచించిన పారిజాతాపహరణం ప్రత్యేకంగా లోక వ్యవహారంలో ఉండినట్లులేదు. గొల్ల కలాపం అని చెప్పబడుతున్న భాగవతములు రెండు ఉన్నాయి. వాటిలో యజ్ఞపుపట్టు గురించి చెప్పేది తరిగొండ వేంగమాంబ రచన. క్షీరసాగర మధన మును వర్ణించిన గొల్ల కలాపమును అత్రేయపురపు వేంకటదాసు తిమ్మన్నగారలు రచించారు పిండోత్పత్తిని గురించి చెప్పే కలాపం సిద్ధేంద్రుని పేరనూ, భాగ వతుల రామయ్యగారి పేరనూ చెల్లుబాటు అవుతున్నది.

సిద్ధేంద్రుడు కూచిపూడి నివాసి. తల్లిదండ్రులు అంధులయి ఉండగా సిద్ధేంద్రుడు ఊరిలో ఉంఛవృత్తిచేసి, వారిని పోషిస్తూ ఉండేవాడు ఒక రాజుగారు తన కొడుకుకు ఉపనయనం చేయిస్తున్నప్పుడు సిద్ధేంద్రునికి కూడా ఉపనయనం చేయించాడు. అప్పటినుండి ఉంఛవృత్తితో జీవనం చేసేవాడు. ఆకాలంలో ఒక నాడు శంకరాచార్యస్వాములు ఆ గ్రామానికి వచ్చి, పిల్లవాడయిన సిదయ్య సౌజన్యమును పితృభక్తి వినయాలను తెలిసికొని అతనికి శ్రీకృష్ణ మంత్రం ఉపదేశించారట. (ఈ శంకరాచార్యులస్వాములు తప్పక అద్వైత యతీంద్రపరం పరకు చెంది, శ్రీకృష్ణలీలా తరంగిణీ కర్తగా ప్రసిద్ధిపొందిన నారాయణతీర్థులే అయి ఉంటాడు) అది మొదలు సిద్ధేంద్రుడు శ్రీకృష్ణుని గురించి పాడుకొంటూ నర్తిస్తూ ఉండగా శ్రీకృష్ణుడువచ్చి సిద్ధేంద్రుని ఆట పాటలలో పాల్గొనేవాడట. తల్లిదండ్రులు సిద్ధేంద్రుడు నొకనాడు నీతో ఆడుకొంటున్నవా రెవరబ్బాయీ ? అని అడుగగా అతడు శ్రీకృష్ణ భగవానుడని చెప్పినాడట అంధులమైన మాకు శ్రీకృష్ణస్వామి దర్శనం చేయించు బాబూ అని వారు కోరగా సిద్ధేంద్రుడు శ్రీకృష్ణుని ప్రార్థించాడు. ఆ రాత్రి ఒకరికి కృష్ణ వేషమునూ, మరిద్దరికి సత్యా రుక్మిణుల వేషములూ వేయించి, గుగ్గిలపుమంట వేయించుమనీ అప్పుడు తాను వారికి దర్శన మిస్తాననీ శ్రీకృష్ణుడు సిద్ధేంద్రునికి చెప్పాడట. అతడా ప్రకారం వేషాలు వేయించి, గుగ్గిలపుమంట వేయించగా సిద్ధేంద్రుని తలిదండ్రులు ఆ వెలుగు వులో శ్రీకృష్ణస్వామిని దర్శించి సిద్ధిపొందారట ఆ తర్వాత సిద్ధేంద్రుడు ఆ ఊరి లోని బ్రాహ్మణ కుటుంబాలవారు భాగవత వేషములు కట్టి కృష్ణుని అనుగ్రహం పొందకపోతే వంశనాశనమవుతుందని శాంచాడు. అప్పటినుంచీ కూచిపూడిలోని బ్రాహ్మణ కుటుంబాలవారు ఆ నియమాన్ని పాటిస్తున్నారు. సిద్ధేంద్రుడు ఆజన్మ బ్రహ్మచారి. తీర్థపాద గురుస్వామి కృపవలన శ్రీకృష్ణభక్తుడై భామకలాపాదులను

రచించి, ఆ ఊరను, ఇతర గ్రామాలలోను భాగవత ప్రదర్శనము లిప్పిస్తూ శ్రీకృష్ణుని అనుగ్రహాన ముక్తిపొందాడు.

కూచిపూడివారు ప్రదర్శనల్లో శబ్దములూ, సలాములు, జతులూ పాడి నర్తిస్తూంటారు. వాటిలో ప్రసిద్ధ మయినది దశావతార శబ్దం. ఇదికూడా ఒకి ప్రాచీన దశావతార శబ్దమూ, రెండవది మంగు జగన్నాథం కాలంలోనిదీ – రెండు విధాల ప్రచారంలో ఉంది ప్రాచీనమైనది సిద్ధేంద్రునిదే అని ప్రతీతి

తక్కు దిక్కు తాహత ధీనుత
తద్దీనుత తాను ధణంతరి
తఝుంతరిత తఝుంఝుంతరిత
తధికుడిధికు దేకుకుడింకుకు....
మచ్చరమున మరి యంబుధిలో
చొచ్చి ముచ్చుసోమకు ద్రుంచీ
పచ్చలవిడి వేదము లజునకు
ఇచ్చితివొ మత్స్యావతారా...

సిద్ధేంద్రుని భామాకలాపం :

ఈ అధ్యాయం కొంతవరకు వ్రాసిన తర్వాత ఈ గ్రంథకర్తకు మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంలో సిద్ధేంద్రయోగి రచించిన భామాకలాపపు తాళ పత్ర ప్రతిని చూసే భాగ్యం లభించింది. ఈ పుస్తకం ప్రారంభంలో ఒక విఘ్నేశ్వ రాది ఇష్టదైవ ప్రార్థన పద్యం ఉన్నది.

శ్రీ విఘ్నేశ్వర పాదపద్మములనే సేవించి నా యాత్మలో
భావింతుం బరమేష్ఠి నచ్యుతుని సద్బాలేందుమౌళిన్ తగన్
శ్రీవాగ్వాణిరమాహిమాచలసుతల్ శ్రీలొంద మేల్పన్నుతుల్
గావింతున్ గృతికర్తబోచుటకు నా కావ్యార్థ మీడేర్పగన్.

సరిగా ఇదే పద్యం శృంగేరి శంకరాచార్య శిష్యుణ్ణని చెప్పుకొన్న సన్నిధానం జగన్నాథ కవి రచించిన ఎరుకుల కురంజిలో ఉన్నది అతడు బహుశా సిద్ధేంద్రునికి తరువాతివాడయి. అప్పటికి ప్రచారంలో ఉన్న ఈ పద్యాన్నే తన గ్రంథాదిని వాడుకొని ఉండవచ్చును.

తర్వాత సరస్వతీ ప్రార్థన, వెన్నెల పదం పాడుతూ సత్యభామ ప్రవేశమూ శ్రీకృష్ణు డెక్కడున్నాడో చూపమని చెలికత్తెల నడగడమూ, అప్పుడు నీ వెవర వని వా రడుగగా – భామానే సత్యభామానే అన్న దరువును పాడుతుంది.

సిద్ధేంద్రుని రచనకును, మంగు జగన్నాథ పండితుని రచనకును వ్యత్యాసం తెలియ
డానికి రెండింటినుండి ఈ దరువును ఇక్కడ ఉదహరిస్తాను.

సిద్ధేంద్రుని రచన :

ఆహిరి - అట : భామానే సత్యభామానే

భామారో శృంగారజగదభిరామనే ముఖవిజితహేమా
ధామనే ద్వారకాపురాధ్యురామనే వయ్యారి సత్యా.
మదనజనకుని వదలకను నా యెదను నదముకు సుదతిరో, మరు
కదనమరుదుగ నలిపి నెమ్మదిముదముగదియగనున్న సత్యా ॥

మంగుపండితుని రచన :

రేగుప్తి - అట : భామానే సత్యాభామానే వయ్యారి సత్యాభామనే,
భామనే పదియారువేల కోమలూ లందరిలోన
రామరో గోపాలస్వామికి ప్రేమదామమైన ముద్దుల ॥

ఈ విధంగానే శకునాలూ మంచివాయేనమ్మా మొదలైన సిద్ధేంద్రుని దరువు
లెన్నిటినో మంగు జగన్నాథ పండితుడు పల్లవి మాత్రం అలాగేవుంచి, చరణా
లను వేరువిధంగా వ్రాసుకొని గ్రంథమంతా మార్చుకొన్నాడు. కాని, సిద్ధేంద్ర
యోగి కృపాకటాక్షపాత్ర అని గద్యలో సిద్ధేంద్రునికి కృతజ్ఞత చూపి ఉండడం
ప్రశంసాపాత్రమే. తరువాత అత్తమామల ప్రశంసిచెప్పి, తిరిగి భామ కృష్ణ విర
హంలోపడి, హరియేదే అనుదరువు పాడిన తర్వాత భూదేవిని స్తుతిస్తూ రెండు
శ్లోకాలు పాడుతుంది. అంతవరకు నాటకం అంతరిక్షంలో జరిగిందన్నమాట,
పాత్రలు తమ స్వస్థలములనుంచి అంతరిక్ష మార్గాన ప్రయాణించి అప్పుడే అక్కడ
సమావేశమై ఉన్న ప్రేక్షకుల నడుమ రంగస్థలమందు భూమిపైకి దిగేరన్నమాట.
భూదేవీ స్తుతి శ్లోకాలు.

విష్ణుశక్తి సముత్పన్నే చిత్రవర్ణే మహీతలే
అనేకరత్న సంపన్నే భూమిదేవీ నమోస్తుతే
ఆదిశేష శిరోభూష అగ్రజన్మ పోషణ
హరి ప్రియమనోహరి భూమిదేవీ నమోస్తుతే

యక్షగాన ప్రదర్శకులు అడుగులతో రంగస్థల భూమిపై చిందులు
త్రొక్కడం భూదేవి యెడల అవిధేయతగా గ్రహి[illegible] [illegible]నికని,
భక్తితో భూదేవికి ఈ ప్రార్థన చేస్తారని ఈ గ్రంథక[illegible] [illegible]వాతో [illegible]వేష
ధారిణి చెప్పినది. అంతవరకూ సభాసదులముందు నటిస్తున్నా - భామ - తన
లోకంనుంచి అవతరిస్తూనే ఉంది. ఈ భూదేవి ప్రార్థన అయిన తర్వాతనే సభా

ప్రవేశం చేసినట్లు గ్రహించవలెను. అందుకే — ఇక్కడనే గ్రంథప్రారంభమున ఉండవలసిన గ్రంథకర్తనామంతో కూడిన ఉపోద్ఘాతపద్యం పాడబడుతుంది.

జనులార ఎనుడి హరికథ
వినవేడుక గల్గెనేని వీనుల కొలదిన్
వినుడీ ధన్యు కృతార్థుని
ఘనుడౌ సిద్ధేంద్రయోగి కవితారచనల్

ఈ పద్యంలో ఈ రచన స్పష్టంగా సిద్ధేంద్రయోగి రచన అని ఉన్నది. ఈ పద్యమును భామావేషధారులు జంఝూటిరాగంలో ఆలాపం చేయడం విని ఉన్నాము. ఈ యక్షగాన దరువులలో కర్తృత్వముద్రలేదు.

మచ్చుకు తరువాత వచ్చే మరికొన్ని దరువుల సభాసదులలోగాని హరి ఉన్నాడేమో తర్జనితో నిర్దేశించి చెలిని అడుగుతూ భామ పాడేపాట :

దరువు : అల్లల్లావాడూ హరియేమో ఓయమ్మా
ఉల్లామూభాసిల్లాగాను, పల్లావపాణూలా శిఖలా
మల్లే పూలాదండాలూ కొల్లాలూగా తురుమూచున్నా

వెన్నెలపదం : జాలి కాంభోజిరాగం (కరుణరసాపాదకరమైన కాంభోజి భేదం కాబోలు)

వెలయాకన్నులా చీకటి బాయూజెన్నాడో వెన్నెలారో నా
విరిగుబ్బాకాకాచల్లారూజెన్నాడూ వెన్నెలారో
ఎన్నాడూ వానికీ ఇల్లాలనైతినో వెన్నెలారో వాడు
నన్నంటె తలపాడూ నేనేమీచేతూనో వెన్నెలారో
చెట్టాపట్టిన మగడూ చేరికాలేదాయే వెన్నెలారో నే
దిట్టాతనమూలేకా, దిగచెడీయుంటిని వెన్నెలారో

ఇంకొక దరువు : కలగంటినమ్మా నిన్నారేయీ
అప్పాటనుండి కళవళమయ్యేయేమోకాని
బోటిగందుతేటితానాబోటి తుమ్మెదా నెడబాసి
మాటవదలి పువ్వుతేని మాటిమాటికినేనని

అక్కా[illegible]నిన్నాటిరేయీ, రిక్కానంటినా జాబిల్లీ
మక్కువాతో [illegible]రొక్కా చుక్కానూ కూడుండేకాన
మక్కువాతనమా యిల్లాలీ నక్కానా జేర్చుటామానీ
యిక్కువాతో వేరొక్కా పక్కానే కూడుండేకానీ,

సిద్ధేంద్రయోగి యీ దరువులు చూ సే దేశసంప్రదాయం చొప్పున సంగీతానికీ, తాళానికీ కావలసిన విధంగా పాటలోని పొట్టి అక్షరాలు దీర్ఘాలవుతూ సాహిత్యం సంగీతం చెప్పినట్లు లొంగుతున్నట్టు కనిపిస్తుంది. ఈ పాటలలోని భావాలూ అత్యంత మనోహరాలై, మాటలకూర్పు తెలుగు జాతీయాలతో ముద్దులమూట కట్టుతోంది. జాలి కాంభోజి రాగంలోనిదే మదనోపాలంబన దరువు:

మదనామోహనాయనుచును
వదలలేక నీ వలలో జిక్కితి ...
అదుగో చంద్రుం డుదయంబాయెను
నిదురలేక నీ కెదురే చూచితి....
శయ్యకురమ్మని పయ్యెదలో చెయి
వెయ్యవచ్చి సయ్యాటమరువకు....
ఆటప్రాయమున తేటగు కన్నుల
కాటుకదిద్దిన కూటమి మరువకు....
రంగుగ నా మెడ మంగళసూత్రము
పొంగుచుగట్టిన సంగతి మరువకు....

మందుబెటింది నా మగనికీ అనే దర్వుదగ్గరి ఘట్టంలో రుక్మిణీ ఏ వశీకరణపు మందునో పెట్టి కృష్ణుణ్ని తన వశం చేసేసుకొన్నదని వాపోతూ,

కస్తూరిజాఫలా కరివేప పత్రంబు తాళకంబును కొంతి రేలిచిగురు
తామరదుంపతో దవనంపు పుప్పొడి పచ్చిపసపు లేత బిసపుపత్తి

అనే పద్యంలో వశీకరణతంత్రం ఏకరువు పెట్టుతుంది.

కందార్థ దరువు :

విరహం బగ్గలమాయెను
సరసీరుహనేత్రలార సామికి నాపై
మరపేలబుట్టె నయయో

*　*　*　*

చెమ్మగిల్లె మదనకటారీ
నే చెల్లానే సుదతీ మిటారీ....
మదవతీ భద్రాద్రీరామూడు
మా నూగ...............

ఇత్యాదిగా ఉన్న కందార్థ దరువులో భద్రాద్రిరాముని ప్రశంస రామదాసుకు యించుమించు సమకాలికుడయిన సిద్ధేంద్రుడు కూడా చేసినట్లు కనబడుతోంది.

తలుపుదగ్గరి పాటలని ప్రసిద్ధిచెందిన దేశిగాన ఫణితిలో ఒక సంవాదగీతి:

సత్య : మత్స్యవేషివై యసురుల ద్రుంచిన
మర్మమెరుంగుదు రావయ్యా
నీ మర్మమెరుంగుదు రావయ్యా...

కృ : కరలివలన బ్రహ్మాండము నిలిచెను
కక్కసమాడక పోగదవే నను
కక్కసమాడక పోగదవే...

సత్య : భూమి త్రవ్వి తలపోసుక తిరిగేవు
పోకిళ్ళ కేమిక రావయ్యా, నీ
పోకిళ్ల కేమిక రావయ్యా...

కృ : భూమి దురంధరుడని యందురు నను
బొంకవద్దు పోపో గదవే నీవు
బొంకవద్దు పోపోగదవే...

ఈ సంవాదంలో దశావతారములలో ఒక్కొక్క దానిని గురించి సత్య నిందాస్తుతిగా హేళనచేయగా, కృష్ణుడు ఆ హేళనాంశములనే మహిమలుగా నిరూపించుకొంటూ ప్రత్యుత్తరమిస్తాడు.

పువ్వులవడికోసి బుజ్జగించెడినాడు...అనే పద్యం కలువాయి శతకం లోనిదిగాను, దండమయా...అనే కందపద్యం కృష్ణశతకంలోనిదిగాను యింకా మరికొన్ని పద్యాలు కొందరు తరువాత కవుల రచనలలోనివి యిందులో చేరినట్లు కనిపిస్తోంది. భాగవతుల ప్రదర్శన రక్తికోసం వాటి నప్పుడప్పు డిందులో చేర్చుకొని ఉండవచ్చు.

భామాకలాపం అను పారిజాతాపహరణ యక్షగానం యీ మంగళంతో పూర్తి అవుతుంది. ఇది సీసపద్య ఛందస్సులో నడిచే గేయము.

నారాయణాచ్యుతానంత కృష్ణముకుంద
కందర్పజనక మంగళము నీకు...
మాధవ గోవింద మధుసూదనోపేంద్ర
కరిరాజవరద మంగళము నీకు
గోపాల జనపాల గోపాంగనాలోల
కరుణాలవాల మంగళము నీకు...

తీర్థులవారి పారిజాతాపహరణముతో సిద్ధేంద్రుని పారిజాతాపహరణమును పోల్చిచూడాలి — తీర్థులవారి గ్రంథం సమగ్రంగా దొరకలేదుగాని, దొరికిన

మట్టుకు దరువులను, పద్యాలను చూస్తే గురువు రచనకంటే సిద్ధేంద్రుని గం ద్వారా మెరుగు అనిపిస్తుంది. అయితే కథాసంవిధానంలోను, పాత్రపోషణలోను తిర్ధులై వాలు దా, పోయినంత మేరకు సిద్ధేంద్రుడు పోలేదు. సిద్ధేంద్రుడు భామావిరహమునకు భామా కృష్ణసమాగమమునకూ ప్రాముఖ్యమిచ్చి, చివరి కథ తుంచివేశాడు. లేదా: భాగవతులు ఆభాగాన్ని ప్రదర్శించడంలో అశ్రద్ధచూపడంవల్ల మనకు దొరంక కుండాపోయిఉండాలి. సిద్ధేంద్రుడు శృంగార రసమును జాతీయమైన తెలుగు నుడికారంతో సూటియైన రచనలో పోషించాడు. ఆయన రచనలో కవికి సహజపాండిత్యం కలిగి గురు వర ప్రసాదలబ్ధ కవితాశక్తి కలిగినట్లు తోస్తుంది. ఆధ్యాత్మిక భావసంపదలో కృష్ణలీలాతరంగిణీ కర్తకు సిద్ధేంద్రుడు అల్లంతదూరాన ఉండవలసినవాడేమో! సిద్ధేంద్రుడు యక్షగానాలు జనసామాన్యాన్ని ఉద్దేశించి రచించడంచేత, వ్యంగ్యంగాగాని, వాచ్యంగాగాని తత్త్వబోధపొంతకుపోక, మానవస్వభావ మధురోక్తులలో సత్యభామకు కృష్ణపరమాత్మపై గల ప్రేమను చిత్రించి తరించాడు.

పంద్రెండవ అధ్యాయం

# కంచెర్ల గోపన్న — (భద్రాచల రామదాసు) 1620 — 1680

శ్రీరామనవమి నవరాత్రములలో రామదాసు భజన కీర్తనలను గానం చెయ్యని భజనకూటం గాని, భజనకూటం లేని రామమందిరం గాని, రామమందిరం లేని గ్రామంకాని, నగరంకాని ఆంధ్రదేశంలో కనపడదు. రామదాసు కీర్తనలను భజనలు చేసుకొంటూ, యాత్రికులు దేశం నలుమూలలనుంచీ గుంపులు గుంపులుగా భద్రాచలం వెళ్ళి, ఈ తిరునాళ్ళ సమయంలో భద్రాచల రామునీ, ఆ రామునికి అత్యంత ప్రియభక్తుడై కైంకర్యాలు చేసి, రామదాసు బందిఖానాలో బాధలుపడిన స్థలాలనూ దర్శించి తమ జన్మలను ధన్యం చేసుకొంటారు. అటువంటి శ్రీరామనవమినాడే యీ అధ్యాయం ప్రారంభించడం మా పూర్వ సుకృతమేమో. భద్రాచల రామదాసని పేరుపొంది, నాటినుంచి నేటివరకు ఆంధ్రదేశంలో ఆబాలగోపాలానికే కాక, యించుమించు భారతదేశమంతటా పరమ భక్తాగ్రేసరులలో ఒకడుగా గణ్యతకెక్కిన వాగ్గేయకారుని అసలు పేరు కంచర్ల గోపన్న.

## సమకాలిక చారిత్రక పురుషులు :

ఇతడు క్రీ. శ. 1620 — 1680 నడిమికాలంలో గోలకొండ రాజ్యంలో అబ్దుల్లా తానాషా, అబుల్ హసన్ తానాషాలు పరిపాలించినపుడు జీవించాడు అంతేకాక, మహాభక్తుడూ, భజనకీర్తనల రచయితా, వేదాంతీ అయిన కబీరుదాసుకితడు శిష్యుడట. అంటే యితడు నారాయణతీర్థులకు, సిద్ధేంద్రయోగికి, క్షేత్రయ్యకు కూడా సమకాలికు డన్నమాట. (నారాయణతీర్థులు దేశాటనంలో భద్రగిరి పోయినట్లు ఆయన తరంగాలనుబట్టి తెలియటంలేదు. సిద్ధేంద్రుని భామాకలాప దరువులలో మనసోపాలంభన దరువులో కృష్ణునికి పర్యాయపదంగా మనవతీ భద్రాద్రీరాము అని ఉన్నది) రామదాసుకు పూర్వం చాలాకాలం సీతారామలక్ష్మణ విగ్రహాలు ఆ భద్రగిరిపైని పూజా పురస్కారాలు లేక లతాగుల్మాదులతో కప్పబడి ఉండేవి. రామదాసు నాటికి వృద్ధురాలయిన తమ్మల దమ్మక్క అనే

భక్తురాలు రామదాసు తహసీల్దారీకి కొన్నేళ్ళు ముందుగానే స్వప్నదర్శనం ద్వారా ఆ దేవుని కనుక్కొని, గ్రామస్థుల సహాయంతో ప్రతిష్ఠచేసి బ్రహ్మోత్సవాలు చేయిస్తోందట.) ఆ క్షేత్రమునకు సిద్ధేంద్రుడు పోయియైన ఉండవలెను. లేదా, ఆ క్షేత్రమహాత్మ్యము సిద్ధేంద్రునినాటికి దేశవ్యాప్తమవుతూ ఉండవచ్చును. క్షేత్రయ్య ఒక గోల్కొండ పాదుషాను దర్శించి ఆయన అనుమతి చొప్పున 40 దినాలలో 1500 (1100 అని పాఠాంతరం) పదాలను చెప్పి మెప్పించాడట. పై యిద్దరు తానాషాలలోను మొదటి యాతడే ఆ పాదుషా అయి ఉంటాడు. బందిఖానాలో ఉండడంచేతగాని, కేవల భక్తి సంకీర్తన, దైవ సేవాపరుడు కావటం చేతగాని రామదాసుకు క్షేత్రయ్యతో కలయిక జరిగి ఉండదు కాని, కృష్ణగాథాత్మకములుగా మువ్వగోపాలాంకితములుగా అధికసంఖ్యాకములుగా పదరచన చేసిన క్షేత్రయ్య రామరామ-ప్రాణసఖి నెడబాసి రాముడెటువలె తాళెనో...అనే ఆహిరి రాగ పదము, గోలకొండకు తర్వాతనో ముందో భద్రాచలం వెళ్ళినపుడు చేశాడేమో అని ఊహింపవచ్చు. ఎందుకంటే శ్రీరాముడు సీతావియోగం పొందిన పంచవటి భద్రాచలం దగ్గరేనని ప్రతీతి)

## భద్రగిరి గాథ :

అంతేకాక దండకారణ్య వనవాస సమయాన ఒకనాడు శ్రీరాముడు సీతాలక్ష్మణులతో విహరించిన శిలయే భద్రగిరి యనీ, మేరుగిరి కుమారుడైన భద్రుడు భక్తితో తపస్సుచేసి, సాక్షాత్కారం పొంది లక్ష్మీశేష సహితుడైన శ్రీమహావిష్ణువు రామావతారరూపంలో తనపై నివసించే వరం పొందినట్లూ భద్రాచల మాహాత్మ్య కథలో అనాదిగా వినవస్తూంది. ఇది బ్రహ్మాండ పురాణంలోని గౌతమీ మాహాత్మ్యంలో చెప్పబడిన క్షేత్రగాథ. బ్రహ్మాండ పురాణం రామదాసుకంటె అత్యంత ప్రాచీనమయినది. కనుక భద్రాచలము ప్రాచీనక్షేత్రమే. ఇక్కడ వెలసిన సీతారామలక్ష్మణులకు కొంతకాలం పూజాదికం జరుగుతూవుండి, ఏ తురుష్క దండయాత్రల కాలంలోనో 14 15 వ శతాబ్దాలలో అడవిపొదల్లో మాటుమణిగి ఉంటుంది. కాకతీయుల కాలంలో భద్రాచలం వారి రాజ్యంలో ఒక మండలం; – తురుష్క దండయాత్రలకాలంలో 1424 లో అన్నప్ప అనే రాహుత్తు భద్రాచలం పరగణాను ఢిల్లీ సుల్తానునుంచి జాగీరుగా గ్రహించాడు. ఆ తర్వాత నెప్పుడో శ్రీరాముని ఆలయం అజ్ఞాతవాసంలోకి పోయి ఉంటుంది.

## భద్రాద్రి ఆలయ ప్రతిష్ఠ :

ఆ విధంగా అజ్ఞాతమైపోయిన రాముని ఆలయాన్ని వెలుగులోకి తెచ్చినది తమ్మల దమ్మక్క అనే భక్తురాలని ముందు చెప్పుకొన్నాము. ఈ సందర్భంలో

ఆమెకు కలిగిన స్వప్నంలో శ్రీరాముడు దర్శనమిచ్చి కొండపై వెలసిన తన్ను సమస్త జనులకు వెల్లడి పరచి నిత్యోత్సవాదులు జరిగేటట్లు ఏర్పాటు చేయమనీ, కొన్నాళ్ళకు తర్వాత తన ప్రియభక్తుడొకడు ఆ గ్రామానికి ప్రభుత్వాధికారియై రాగలడనీ, అతడు తనకు కోవెలను, గోపుర ప్రాకారాదులను కట్టించునంతవరకూ ఆమె తన పూజాదికములను నిర్వర్తిస్తూ ఉంటే, అప్పటికి కైవల్యం సంప్రాప్తిస్తుందనీ సెలవిచ్చాడు. తమ్మల దమ్మక్క రాముని ఆజ్ఞాప్రకారమే చేసింది. 1600 ప్రాంతంలో గోలకొండ రాజ్యంలోని నేలకొండపల్లెలో లింగనమంత్రికీ కామమ్మకూ పుత్రుడై జన్మించిన కంచెర్ల గోపన్న 1650 నాటికి భద్రాచలానికి తహశీలారై వచ్చేముందు శ్రీరామునిచేత స్వప్నంలో తమ్మక్కవలెనే ప్రబోధితుడయినాడట.)

## జీవిత చర్య:

గోపన్నకు భద్రాచలం తాలూకా తహశీల్దారీ రావడానికి అప్పుడు తానాషా కొలువులో అధికారులుగా ఉన్న అక్కన్న మాదన్నగార్లనీ. వారిద్దరూ గోపన్నకు మేనమామలనీ రామదాసు చరిత్ర అన్నే పేరుతొ ప్రచారంలో వున్న హరికథా గ్రంథాలనుబట్టి తెలుస్తోంది. బాల్యంలో బాలరామాయణము మొదలగు గ్రంథాలను పఠించేనాడే రామభక్తి యితని మనసులో పాదుకొని ఏలా పుట్టకపోతి నాడే రాములతోడ, మూలమైన బ్రహ్మమేతెంచి కౌసల్య గర్భగోళములోనుండి యవతరించి శ్రీరాములనగ లీలజగములను వరించి బాలక్రీడలపారాడెదునెడ - ఏలా పుట్టకపోతి - అని శ్రీరాముల సంకీర్తనములు చేయడం ప్రారంభించాడట. రఘునాథభట్టరాచార్యులనువారు గోపన్నకు మంత్రోపదేశం చేసి, వైష్ణవంలో దీక్ష యిచ్చినట్లు ఇతడు రచించిన దాశరథీశతకంలో ఉన్నది.

అల్లన లింగమంత్రి సుతు డత్రిజగోత్రజుడాదిశాఖ కం
చెర్లకులోద్భవుండన ప్రసిద్ధుడనై భవదంకితంబుగా
నెల్ల కవుల్ నుతింప రచియించితి గోపకవీంద్రుడన్ జగ
ద్వల్లభ నీకు దాసుడను దాశరథీ కరుణాపయోనిధీ.

పట్టితి భట్టరార్యగురుపాదములిమ్మెయినూర్ధ్వపుండ్రముం
బెట్టితి మంత్రరాజమొదిబెట్టితి నయ్యమకింకరాళికిన్
కట్టితి బొమ్మ మీచరణకంజములందు తలంపువెట్టి పో
దట్టితి పాపపుంజముల దాశరథీ కరుణాపయోనిధీ.

ఆర్యులకెల్ల మ్రొక్కి వినతాంగుడనై రఘునాథభట్టరా
చార్యులకంజలెత్తి కవిసత్తములన్వినుతించి కావ్య సౌ

> కర్యమెలర్ప నొక్క శతకంబొనగూర్చి రచింతునేను తా
> త్పర్యమునన్ గ్రహింపు మిది దాశరథీ కరుణాపయోనిధీ.

దాశరథీ శతకంలోని యీ క్రింది పద్యమువల్ల యితడు యింకా మరికొన్ని గ్రంథాలు రచించి, వాటిని నరాంకితం చేశాడనీ అందుకు పశ్చాత్తాప పడ్డాడనీ తెలుస్తుంది.

> మసగొని రేగుపండ్లకును మౌక్తికముల్ వెపోసినట్లు దు
> ర్వ్యసనముచెంది కావ్యము దురాత్ములకిచ్చితి మోసమయ్యెనా
> రసనకు పూతవృత్తి సుకరంబుగ చేకురునట్లు వాక్సుధా
> రసములు చిక్క పద్యముఖరంగమునందు నటింపవయ్యా సం
> తసమునుజెంది భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ.

ఇతని ఇంట్లో యెల్లప్పుడూ భజన గోష్ఠులూ, భాగవత సత్కారమూ జరుగుతూండేవి. తన భక్తికవితతో వేదాంత కీర్తనలతో ఉత్తర హిందూస్థానమంతా ఉర్రూతలూగించిన కబీర్‌దాస్ ఇతని గ్రామానికివచ్చి, ఇతనికి రామమంత్రోపదేశం చేశాడని రామదాసు చరిత్రం హరికథలలో ఉన్నది. అప్పుడితడు ఆ మంత్రం ఉపదేశం పొందిన ఆనందముతో ధన్యాసిరాగంలో ప్రసిద్ధమయిన...తారక మంత్రము కోరిన దొరికెను, ధన్యుడనయితిని ఓరన్నా...అనే కీర్తన రచించాడు. ఇతనికి వివాహమయిన కొంత కాలానికి తలిదండ్రులు మరణించారు. ఒక పుత్రుడు కలిగాడు. భక్తిమార్గంలో పడిన గోపన్న తనకున్నదంతా హరిదాసులకు సమర్పించివేసి కట్టుబట్టలతో జీవిస్తూ ఉండేవాడు. సంసార పోషణకు గడువక, బంధువుల సహాయాపైని ఇతడు గోలకొండ రాజ్యపు రాజధానియైన హైదరాబాదుపోయి తన మేనమామలయిన అక్కన్న మాదన్నలను తన కుద్యోగమేదయిన ఇమ్మని అడిగాడు. దీనికి ప్రబోధ కారణం. ఇతనికి స్వప్నంలో శ్రీరాముడు కనపడి, ప్రభుత్వోద్యోగము సంపాదించి, భద్రాచలంలో తన ఆలయాన్ని కట్టించి ప్రతిష్ఠచేయింపుమని ఆనతిచ్చి ఉండడమే అని కూడా చెపుతారు. మాదన్న మహాప్రధాని, అక్కన్న షర్‌లష్కర్; వారు వెంటనే అతనికి భద్రాచలానికి తహశీల్దారుగా ఉద్యోగం వేయించారు. పదవిలో ఉన్న రామదాసు రైతుల ఆదరాభిమానాలతో చూస్తూ, వారి ఆదరాభిమానాలను సంపాదించి, పన్నులు వసూలుచేసిన పైకంతో భద్రాచలరాముడికు కైంకర్యం చేయిసూ ఉండేవాడు. ఒకనాడొక సంతర్పణం జరుగుతుండగా రామదాసు కొడుకొక గంజిగుంటపడి అచేతనుడై పోయాడు. సంతర్పణం మధ్యలో బిడ్డ మరణవార్త పొక్కితే రసాభాసవుతుందని రామదాసు భార్య - సంతర్పణయిన తర్వాత విషాదవార్తకు తెలియజేసింది. "రామకార్యతత్పరుణ్ణయి ఉన్న సమయంలోనా వాకీ హద్దు రామరాజ్య గాథలలో మృతుడైన విప్ర పుత్రుని

బ్రతికించినట్లు విన్నది సత్యమైతే, నాపుత్రుని కూడా బ్రతికించు తండ్రీ..." అని కోవెలలో రాముని సన్నిధిని పుత్రుని దేహాన్నుంచి ఈ సంకీర్తనలు పాడాడట.

నాదనామక్రియ – ఏక

ఎంతపని చేసితివి రామా – నిన్నేమనందును సార్వభౌమ
పంతమా నామీద పరమపావననామ సంతోషముడిపితివి సకల సద్గుణధామ॥
నిన్నే దైవంబనుచు నమ్మి, రామ, తిన్నగా దుఃఖములజిమ్మి
కన్నదినమని నెమ్మి నిన్ను సేవింపగా సన్నిట్లు నష్టపటముంచు మెరుగకపోతి
అన్నన్న మాటాడవేరా నీ కన్నులను నను జూడవేరా
చిన్నెలన్నియు దరిగియున్న ఈ చిన్నన్న
గ్రన్ననను జూడుమాయన్న ఓ రామన్న
భద్రాద్రివాసుదేమనుచు, నిరుపద్రవముగనుండు నను
భద్రనుతికరుణాసముద్రయో శ్రీరామ, భద్ర నిన్నే మదిని భద్రముగనమ్మితి.

ఆనందభైరవి – చాపు

కోదండరామ కోదండరామ కోదండరామ కోట్యర్కధామ
నీదండ నాకు నీవెందుపోకు వాదేల నీకు నద్దు పరాకు

.... .... ....

నిరుపమగాత్ర నీరజనేత్ర పురుహూతమిత్ర పుణ్యచారిత్ర
మును విప్రసుతుని మనిచినట్లు గతిని, మనునట్లు సుతుని మన్నించు మదిని
లాలితహాస లక్ష్మీవిలాస పాలితదాస భద్రాద్రివాస
భద్రాద్రివాస భవ్యవిలాస క్షుద్రపనిశ్చితనుత రామదాస

ఇది సుమారు ౪౦ పంక్తులపాట. కరుణరసంతో వినువారి హృదయాల్ని ఆర్ద్రం చెయ్యగలిగే శక్తి ఉన్న పాట. ఈ పాటలు పాడిన వెంటనే శ్రీరాముని అనుగ్రహాన రామదాసు కుమారుడు నిద్రనుంచి లేచినట్లు లేచి కూర్చున్నాడట. అప్పటి నుంచి గోపన్నగారు భక్తరామదాసుగా ప్రజలకు వెల్లడి అయి అతని మహిమలు దేశమంతా వ్యాపించాయి. కాని, శిస్తు వసూలు పైకం గోల్కొండకు పోవడం లేదు. మొగలాయీ చక్రవర్తి అయిన ఔరంగజేబునుంచి దండయాత్రలవల్లను కప్పములకోసము ఒత్తిడి వల్లనూ చికాకు పడుతున్న తానాషాగా రామదాసు అంటే ఈర్ష్యాళువులైన తురక సరారుల చెప్పుడు మాటలు విని, శిస్తు పైకం యిమ్మని వెంటనే రామదాసుకు కబురుపంపాడు. రామదాసు ఈయపోగా రాజద్రవ్యాపహరణనేరం మీద అతనిని జైలులోఉంచి పండ్రెండేళ్ళు బాధలు పెట్టాడు. భగవంతునికోసమే తాను సద్వ్యయం చేసిన ధనం భగవంతుడే ఎలాగో ఒకలాగ తానాషాకు అప్పగిస్తాడనే అనంత విశ్వాసంతో రాజభటులు వ్యస్తపెట్టే, బాధలన్నిటినీ

రామ సంకీర్తనములు పాడి ఓర్చుకుంటూ ౧౨ ఏళ్లూ గడిపాడు కాని, చివరకు విసిగి, ఒక రోజున విషముపుచ్చుకొని ప్రాణహరణం చేసుకొనపోతూ ఉండగా, శ్రీరాముడు లక్ష్మణ సహితంగా తానాషాకు అంతఃపురంలో జవాను వేషంలో కనబడి, రామదాసుగారిచ్చినట్లుగా పైకంయిచ్చి, రశీదు తీసుకొని రామదాసును చెరవిడిపించాడు. ఆ తర్వాత రామదాసు తానాషా సమ్మతితో భద్రాచలరాములకు ఇతోధిక కైంకర్యాలు చేయించి, పరమభక్త శేఖరుడని పేరుపొంది, రామ సాయుజ్యం పొందాడు. ఇంతవరకు ఇది లోక వ్యవహారంలో ప్రసిద్ధమైన గాథ.

## రామదాసు చరిత్రకర్తలు :

రామదాసు చరిత్ర హరికథలుగాను, యక్షగానముగాను వ్రాసినవారు ముగ్గురు, నలుగురుదాకా ఉన్నారు. వారిలో అతి ప్రాచీనుడు యాదవదాసు. ఇతడు భద్రాచలవాసి. రెండవవాడు సింగరిదాసు, నరసింహదాసనే ఆయన తన పేరు ముద్రగా చివరి చరణాలలో వచ్చే కీర్తనలు ఈ రామదాసు చరిత్రములలో తరచు కనిపిస్తున్నాయి. సింగరిదాసే నరసింహదాసేమో తెలియలేదు. కాని నరసింహదాసనే ఆయన స్వయముగా వాగ్గేయకారుడూ కర్ణాటక వాగ్గేయకార రత్నత్రయం లోని త్యాగరాజును తిరువయ్యారులో కలిసి కొన్న రాజ తూము లక్ష్మీనరసింహ దాసే ఈ నరసింహదాసుకావచ్చు. తూము నరసింహదాసు చరిత్రము అని కీర్తన మయ మయిన చరిత్ర మొకటి గుజలీ పుస్తకాలలో ఉన్నది. అందులో రామ దాసు కీర్తనలుగా ప్రసిద్ధమయిన అదుగో భద్రాద్రి గౌతమి ఇదిగో చూడండి వంటి కీర్తనలు కొన్ని పల్లవిమాత్రం అలాగే ఉంచి, చరణాలలో మార్పులతో చేరి ఉన్నాయి ఈ నరసింహదాసు గుంటూరు పురవాసి, భక్తుడూ, వాగ్గేయకారుడూ, స్థితిపరుడూ, కంచి తిరువయ్యారు మొదలయిన దక్షిణదేశ క్షేత్రాలకు యాత్ర పోయి, కంచిలో వరద రామదాసు అను పేరుగల మరొకభక్తి సంకీర్తనకారు నితో కలిసి సుమారు ౧౮౩౨ ప్రాంతాన భద్రాచలం వెళ్ళి, అంతకు ౧౮౦ ఏళ్ళ నాడు ౧౬౫౨ భక్తరామదాసు తానీషాగారి ఆజ్ఞ చొప్పున భద్రాచల రాములకు కైంకర్యాలకు నిత్యపూజాదికములకు చేయించిన కైంకర్యముల దానశాసనమును పునరుద్ధరింపించి, తిరిగి వ్రాయించి, అప్పటి నైజాము అయిన నాసరుద్దౌలాద్వారా తిరిగి తన కైంకర్యాలను చేయించాడు. రామదాసు చరిత్రను హరికథగా వ్రాసిన ఇంకొకరు తిరుక్కడయూరి కృష్ణదాసు, ఈయనకూడ 1800 ప్రాంతపువాడు, ఇతడు స్వయంగా కృష్ణశతకాన్నొకదానినికూడా రచించాడట. బహుశా ఆంధ్ర తమిళదేశాల సరిహద్దు జిల్లాలలోనివాడుగాని, చిత్తూరు జిల్లావాడుగాని కావచ్చును.

## తానాషా:

గోలకొండ సుల్తానుల బిరుదు తానాషా కాని పై రామదాసు చరిత్రములలో చెప్పబడినట్లు తానీషాకాదని శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు చెప్పారు. ఈ చరిత్రములలో రామదాసును బందిఖానాలో పెట్టి, ఆ తర్వాత పన్నెండేళ్లూ అయిన తర్వాత శ్రీరాముని ద్వారా పైకం వసూలుపొంది, రామదాసును విడిచి పెట్టినవాడు ఒకే తానీషా. ఈ మధ్య వావిళ్లవారు వేసిన రామదాసు చరిత్రం పీఠికా కారులయిన వేదం లక్ష్మీనారాయణ శాస్త్రిగారూ, భారతిలోని వ్యాసంలో భావరాజు వెంకటకృష్ణారావుగారూ రామదాసు జీవితంలోని ఆయా ఘట్టాలకు కాల నిర్ణయంచేసూ ఆ నిర్ణయం ప్రకారం రామదాసు 1620 ప్రాంతమున జన్మించాడని, 1620 నుంచి 1672 వరకూ గోల్కొండ పాలించిన అబుల్లా తానాషా పాలనంలో రామదాసు 1650 ప్రాంతాన భద్రాచలానికి తహశీల్దారు అయినాడనీ, 1665 ప్రాంతాన బందిఖానాలోకివెళ్ళి బాధలు పడినాడనీ. 1672 లో అబుల్లా తానాషా మరణించిన తర్వాత తఖ్తుయెక్కిన అబుల్‌హసన్ తానాషా వేదాంతి, సూఫీతత్వానుభూతికలవాడూ, దయార్ద్రహృదయుడూ, కావ్య గీతిప్రియుడూ అయి ఉండడంచేత 1677 అతనికే శ్రీరామ సాక్షాత్కారం కలిగి, రామదాసుని విడిపించాడనీ వ్రాశారు. అంతేకాకుండా అతడు రాములవారికి మహారాజ బిరుదంతోసహా భద్రాచలాన్ని జాగీర్‌గా ఇచ్చి శిలాశాసనం కూడా చెక్కించాడట. ఇటువంటి సహృదయుడైన సుల్తాను 1685 లో ఔరంగజేబు దండయాత్రలో ఓడిపోయి, ఖైదీగా చిక్కాడు. 1687 లో గోల్కొండ మొగలాయి సామ్రాజ్యంలో కలిసిపోయింది. 1761 – 1803 లో అసఫ్ జాహీవంశానికి చెందిన నిజామలీఖాన్ మళ్లీ భద్రాచ రామ దేవాలయాన్ని పునరుద్ధరించి. సాలీనా 40 వేల రూపాయలు కైంకర్యాలకై మంజూరు చేశాడట.

## రామదాసు కీర్తనలు, సంగీతం:

రామదాసు తన జీవితంలోని ఆయా ఘట్టాలలో రచించిన కీర్తనలను వదుమ చూపిసూ దాశరథీశతకమూ, ఆర్తరక్షామణి శతకమూ, జానకీపతి శతకము, భావనారాయణ శతకమూ, మానసబోధ శతకము మొదలైనవాటిలోనుండి పద్యము లనూ, తాము రచించిన కందార్థాది దరువులతో; తోహరాలతో, అవసరమైన చోటుల తమ కీర్తనలనుకూడ కలిపి, యాదవదాసు తన యక్షగానమునూ, మిగిలినవారు తమ హరికథలనూ రచించారు. వీటిలో రామదాసు రచించినవి అవి గుర్తుపట్టబడిగిన కీర్తనలు 100 మొదలు 108 వరకూ దొరుకుతాయి. (ఈ విషయమై ఎవరూ తగిన పరిశోధన చేసి రామదాసుకీర్తనలిన్ని అనిగావి, ఇవే అనిగావి నిర్ణయించలేదు. ఆ విధంగా నిర్ణయించి, సంప్రదాయసిద్ధంగా పారం

పర్యంగా భజనకూటాలలోను, గాయకవర్యుల పాఠముఃలోను ఆ కీర్తనలను పాఠదగినస్వరాలను సేకరించి, ఆంధ్రదేశంలోని సంగీతప్రియులూ, భక్తిపరులూ సహకరించి, గ్రంథరూపంలో ప్రకటించడం ఎంతయినా అవసరం. కర్నాటక విద్వాంసుల సంగీత కచ్చేరీలలో వినిపించే పంతువరాళి కీర్తన .. ఎన్నగాను రామభజనకన్న మిక్కిలున్నదా - సన్నుతించి శ్రీరామచంద్రుని దలపవే మనసా.... ఇది పెరామదాసు చరిత్రములలో కనబడదు. దెవసన్నిధి సంకీర్తనలో తప్ప, రామదాసు రచించిన ఇతర కీర్తనలను వేటినీకూడ రానురాను కర్నాటక సంగీత విద్వాంసు లాదరిస్తున్నట్లు కనపడదు.) ఆ కీర్తనలలో ఆ విద్వాంసుల విద్వత్ప్రకర్షకు అవకాశం తక్కువయి. వాటి సంగీతరచన సరళ స్పష్టలయాన్వితమై, సూటియైన భావస్ఫురణతో సామాన్య జనానికికూడా అందుబాటులో ఉండేటంత సుగమంగా ఉండడమే ఇందుకు బహుశా కారణం కావచ్చును ఆనందభైరవి రాగం మన సంగీత చరిత్రలో మొట్టమొదట ఉపయోగించిన వాగ్గేయకారుడూ రామదాసే, నారాయణతీర్థుల తరంగాలలో కొన్నిటికి ఆనందభైరవిలో పాఠం ఉన్నటు వినికిడేకాని, వాటికి ఆహిరీ మొదలైన ప్రాచీన రాగాలలో పాఠాంతరాలను చూసి విద్వాంసులు తీరువారానందభైరవిని వాడినట్లు లేదంటున్నారు. సిద్ధేంద్రుని యక్షగానంలో భామానే సత్యభామానే అనే దరువు అహిరీ రాగంలో వాడడం ప్రాచీన సాంప్రదాయం : భావింప మాయత్త అనే మొదలైన పద్యాలు ఏవైనా ఆనందభైరవిలో పాడేవారేమో, అద్యతనుడైన మంగు జగన్నాథం మార్చి వ్రాసుకొన్న భామాకలాపంలోని భామానే అనే దరువు ఆనందభైరవిలో చేశాడు. అందుచేత రామదాసే స్పష్టంగా ఆనందభైరవిరాగంలో కీర్తనలు చేసిన మొదటి వాగ్గేయకారుడని చెప్పాలి. ఈ రాగం ప్రత్యేకంగా ఆంధ్రుల సొంతసొత్తు. క్షేత్రయకూడా దీనిని ఎక్కువగా వాడాడు. అంచేత ఇది మొదట ఆంధ్రభైరవి ఆ తర్వాత ఆనందభైరవి అయిందేమో, రామదాసు కీర్తనలలో ప్రసిద్ధమైన ఆనందభైరవిరాగ కీర్తనలు.

1. పలుకే బంగారమాయెనా కోదండపాణి
2. ఎటుబోతివో రామ ఎటుబోతివో
3 రామునివారము మాకేమి విచారము
4. కలియుగ వైకుంఠము భద్రాచలనిలయము సేవింతము
5. తెలియక నేమోసపోతినీ దేవదేవుడని
6 ఎందుకు కృపరాదు శ్రీరాములు
7. రామ నామమే జీవనము
8. రామా నీ చేతేమికాదుగా

ఇదికాక, పుత్రమరణ సందర్భంలో రామదాసు పాడిన కోదండరామ అనే కీర్తన పుస్తకాలలో కళ్యాణి అనీ, నాదనామక్రియ అనీ ఉండినా, భజన సంప్రదాయ గోష్ఠులలో ఆనందభైరవి రాగంలో పాడుతుంటారు. ప్రాసానుగుణమైన లయతో ఆ కీర్తన పాడుతూంటే వినేవారికి భావావేగంతో ఒళ్లు జలదరిస్తుంది. ఈ పాటతో రాముడికి హృదయం కరిగి, పుత్రుడికి, ప్రాణం పోశాడంటే వింత కాదనిపిస్తుంది. ఆహిరి, వరాళి, ధన్యాసి సౌరాష్ట్రి. యదుకుల కాంభోజి కాంభోజి, సైంధవి, సురటి, నాదనామక్రియ, కళ్యాణి, శంకరాభరణం, పున్నాగవరాళి, వరాళి, పంతువరాళి, గౌళిపంతు, బిళహరి, ముఖారి, సావేరి, అసావేరి నవరోజు, నీలాంబరి మొదలయిన రాగాలలో రామదాసు కీర్తనలు రచించాడు. ప్రాచీనదాక్షిణాత్య రాగాలలో మాత్రమేకాక, కాపీ, కమాసు, దర్బారు, బేగడ, కానడ, యమునాకళ్యాణి వంటి ఉత్తరాదిరాగాలు, రామదాసునాటి గోల్కొండ రాజ్యానికి ఉత్తరాది నుండి వస్తూపోతూ ఉండే గాయకులద్వారా తెనుగుదేశానికి దిగుమతి అయిఉంటాయి. అకుంఠితభక్తి దీక్షకలవాడూ అనర్గళ కవితాధార కలవాడు అయిన రామదాసుకు సంగీతాభినివేశము అప్రయత్నంగా ఔపచారికంగా వచ్చినదిగాని, ప్రత్యేకంగా అతడు సంగీతవిద్వత్తుకోసం ప్రయత్నించి కృషిచెయ్యలేదని కొందరు నేటి సంగీత విద్వాంసు లనుకొనవచ్చును. అతని కీర్తనలు సంస్కృతాంధ్ర భాషలు రెండింటిలోను కూడా వేర్వేరు రాగాలలో త్రిపుట, ఆది, చాపు, రూపక, అట, ఏక, ఝంపె తాళాలలో కనబడుతూవుంటే అతడు సంగీతంలో పాండిత్యం సంపాదించలేదని చెప్పడం సాహసమే. కాని, అతని సంగీతరచనలనుబట్టి, అతని ఆశయం పాండిత్య ప్రకర్ష కాదనీ, సంగీతం అతని భక్తిసాధనకు ఉపకరణ మాత్రమనీ చెప్పాలి. అతని కీర్తనలందుకే సహజభక్తి భావావేశంలో, తన్మయత్వంలో అప్రయత్నంగా సంకీర్తన భావానుగుణంగా వచ్చిన సరళమైన రచనలు, అందుకే ఒకేసారి ఎన్ని గొంతుకలు చేరి పాడినా, శ్రావ్యమైన మేళంలో వినిపించే బృందగీతులవి. రక్తికి భజన గోష్ఠులలో రామదాసు కీర్తనల తర్వాతనే మిగిలినవారి కీర్తనలకు పేరు. ఆంధ్రదేశంలో గ్రామగ్రామమునా వెలసిన ప్రతి రామమందిరంలోనూ నాటినుండి నేటివరకు శ్రీరామనవమి ఉత్సవములలో ఎక్కువగాను, ఏడాదిలో మిగిలిన వాళ్ళలో నిత్యమూ సాయంకాలాల్లోను శాఖోపశాఖల దీపపు సెమ్మెలను నడుమనుంచుకొని తంబురా, చిరతలతో తాళజాలరులతో, కాళ్ళకు గజెలుకట్టుకొన్న గ్రామీణ భక్త బృందం రామదాసు కీర్తనలను గానం చేస్తూ వుంటారు. పామరజనాని కింతగా ప్రమోదదాయకాలైన ఈ కీర్తనలలోని సంగీతాన్ని ఆంధ్రులు పునరుద్ధరించుకొని త్యాగరాజు సంగీతంలాగ స్వరనిబద్ధంచేసి, సంగీతసభలకు తీసుకొనిరాకపోతే, ఇప్పటికే నష్టపడి లుప్తమైపోతున్న తెలుగు కళలకు మరింత ద్రోహంచేసుకొన్నవార మవుతాము.

## కవిత్వం :

రామదాసుచరిత్ర పుస్తకాలనుబట్టి, అతడు బాల్యములోనే సంస్కృతాంధ్ర భాషలలో పాండిత్యం సంపాదించినట్లు తెలుస్తుంది. గోలుకొండ తురుష్క ప్రభుత్వంలో అధికారి కనుక, పారశీక, ఉరూ భాషలలోకూడా పండితుడై ఉండాలి. ఇతని కీర్తనలలోని వేరు వేరు ఛందోరీతు మబట్టి చూస్తే, దేశీయ గేయ రీతులను ఇతడు బాగా మనస్సుకు పట్టించుకొన్నట్లు కనబడుతుంది. తెలుగులోనేగాక, సంస్కృతంలోకూడా రామదాసు ముద్రతో ఉన్న కీర్తనలు ఐదారింటికి పైగా కనిపిస్తున్నాయి.

నవరోజు - ఆది :

భజరే శ్రీరామం హే మానస భజరే రఘురామం
భజ రఘురామం భండనభీమం రజనిచరౌఘవిరామం రామం....
శ్యామలగాత్రం సత్యచరిత్రం రామదాస హృద్రాజీవమిత్రం....

నవరోజు రాగంలోనే అటతాళంలో దీనివంటిదే ఇంకొకటి—

భజరే మానసరామం భజ భజరే జగదభిరామం ...
కరధృతశరకోదండం కరితుండాయత భుజదండం...
భద్రాచలాదివాసం భజ పరిపాలిత రామదాసం

రేగుప్తి రాగంలోని మరొక సంస్కృత కీర్తన ఆధ్యాత్మిక తత్త్వజ్ఞానముతో పటిష్ఠంగా ప్రౌఢమైన రచనలో నారాయణతీర్థుల తరంగాలను జ్ఞాపకం తెస్తుంది.

రూపక తాళం :

వందే విష్ణుం దేవ మశేష స్థితిహేతుం
త్వా మధ్యాత్మజ్ఞానిభి రతర్హృదిభావ్యం
హేయాహేయ ద్వంద్వవిహీనం పరమేశం
సత్తామాత్రం సర్వహృదిస్థం దృశిరూపం....
త్వం మేనాథో సాధిత కార్యాఖిలకారీ
మాన్యాతీతో మాధవ రూపాఖిలధారీ
భక్త్యాగమ్యో భావితరూపో భవహారీ
యోగాభ్యాసై ర్భావితచేత స్సృహభావీ...
నానా శాస్త్రైర్వేద కదంబైః ప్రతిపాద్యం
నిత్యానందం నిర్విషయ జ్ఞాన మనాదిం
మత్సేవార్థం మానుష భావం ప్రతిపన్నం
వందే రామం మరకతవర్ణం మధురేశం....

తీర్థుల తరంగాన్ని స్ఫురింపజేసే మరొకటి రెండు రామదాస కీర్తనలు—

సావేరి – ఆట :

కలయే గోపాలం కస్తూరి తిలక సుఫాలం
కుండలరుచిరం లలిత కపోలం
జలద సన్నిభ కాంతికాంతం
జగన్నాథపుర నిశాంతం....
భాసిత భానుం భద్రాద్రి నివాస నిదానం
దివ్యానంద భాసురగానం
రాసకేళివిరాజమానం రామదాస స్తుతినిదానం....

యమునారాగం – చాపు :

దీనదయాళో దీనదయాళో
దీనదయాపర దేవదయాళో....
కనకాంబర ఘన శ్యామదయాళో
సనకాది మునియోగి వినుతదయాళో....
ఆగమ రక్షిత అమిత దయాళో...
భోగి శయన పరమపురుష దయాళో...
వరభద్రాద్రి నివాస దయాళో
పాలిత శ్రీ రామదాస దయాళో....

పంతువరాళి – చాపు :

పతిదేవగతిరఘునా శ్రీ సీతాపతి దేవగతిరఘునా....
అతులిత రతియుత మతిశతధృతసుత
శతతార కీర్తిలాలిత హారసీతా.... (పతిదేవ)
హారరుచి విగళిత దీప్తిమిహిరో రామ
దాస దృగమిత శుభాకారః పీతాంబర
ధగధగధగధగ ధగితప్రకాశో జగదానంద
శ్శరణం భజే రఘు... (పతిదేవ)

భక్తికీర్తనలను సంస్కృతంలో రామదాసుకు సమకాలికుడే అనదగిన నారాయణతీర్థులు వ్రాసినా, వారికి 150 ఏళ్ళ పూర్వం అన్నమాచార్యాదులు వ్రాసినా శైలిలో కాక, భక్తిరసానుగుణమైన పదబంధంలోనో, ఛందంలోనో పోలిక లుండవచ్చు.

ఇతని తెలుగు కీర్తనలలో సంస్కృత సమాసా లక్కడక్కడ దొర్లినా, అవి సర్వజన సుబోధకమైన ద్రాక్షాపాక శైలిలో ఉంటాయి – వాటి పక్కపక్కనే

అచ్చమైన తెనుగు నుడికారపు చరణాలుంటూ వుంటాయి.

తోడి – ఆది (భజనగోష్ఠి లో నాదనామక్రియలో పాడతారు)

రామా దేవ శిఖామణి సురరాజ మహోజ్జ్వల భూమణి
తామరసాక్ష సుధీమణి భవ్యతారక భక్తచింతామణి....
నాడే మిము వేడుకొంటిగా శరణాగత బిరుదని వింటిగా
వేడుకై మిము పొగడగంటిగా నన్ను దిగవిడనాడవద్దంటిగా...
తమ్ముడు నీవొక్క జంటను రామదాసుని రక్షించుకుంటాను
సమ్మతినుండు మా యింటాను భద్రాచలవాస నీ బంటుబంటాను....

వరాళి – ఆది

అదిగో భద్రాద్రి, గౌతమి, ఇదిగో చూడండి
ముదమున సీతా ముదిత లక్ష్మణులు కదిసికొలువగా
రఘుపతి యుండెడి (దదిగో)
చారుస్వర్ణప్రాకార గోపుర ద్వారములను సుందరమై
యుండెడి (దదుగో)
అనుపమానమై అతిసుందరమై తనరు చక్రమున
ధగధగమెరిసెడి (దదిగో)
శ్రీకరముగ నిల రామదాసుని ప్రాకటముగ
బ్రోచే ప్రభువు నివాసము ... (అదిగో)

నాదనామక్రియ – చాపు

శ్రీరామనామం మరువాం మరువాం
సిద్ధము యమునకు వెరువాం వెరువాం
గోవిందు నేవేళ గొలుతాం కొలుతాం
దేవుని గుణములు తలుతాం తలుతాం....
విష్ణుకథలు చెవుల విందాం విందాం
వేరె కథలు చెవుల మానాం మాన్దాం....
భద్రగిరీశుని కందాం కందాం
భద్రముతో మన ముందాం ముందాం

ఆనందభైరవి – రూపకం

రాముని వారమూ మాకేమీ విచారము....
స్వామీ నీదే భారమూ దాశరథే జీవాధారము....
ఆ మహిమ విన్నారము భద్రాద్రిని కనుగొన్నారము
రామదాసులమైనారము మది రంజిల్లుచున్నారము ...

బందిఖానాలో తేలు కుట్టినప్పుడు పాడిన పాట ఆనందభైరవి- రూపకం

మేలైన చిటికెనవ్రేలు ప్రాతఃకాలమందునగుట్టె తేలు
బాలత్వమున నేను బావినీళ్ళకుపోయి కాలుబెట్టగ చిన్న
తేలుపొడిచె నయ్యా....

ఈ విధంగా వేరు వేరు ఛందస్సులలో అప్రయత్నంగా పడే అంత్యప్రాసలతో అందంగా సాగిపోతాయి రామదాసు కీర్తనలు.

భజన గోష్ఠులలో ప్రసిద్ధమైయిన జనరంజక కీర్తనలు మరికొన్ని....

1. తారకమంత్రము కోరిన దొరికెను – ధన్యాసి – ఆదితాళం
2. తక్కువేమి మనకు రాముం డొక్కడుండువరకు – నాదనామక్రియ ”
3. ఏతీరుగ నను దయజూచెదవో యినవంశోత్తమ రామా ” ”
4. గరుడగమన రారా నను నీ కరుణ నేలుకోరా – యమునాకళ్యాణి – ఆది
5. ఏమిరా రామా, నావల్ల నేర మేమిరా రామా – నాదనామక్రియ – ఆది
6. రక్షింప నిదియేమి రాచకార్యముపుట్టె – శంకరాభరణం – అట
7. ఏడ నున్నాడో భద్రాద్రి వాసుడు – వరాళి – ఆది
8. రక్షించేదొరవని నమ్మితి – బిలహరి – అట
9. ఓ రఘువీరా యని నే పిలిచిన ఓహో యనరాదా – మధ్యమావతి – ఆది
10. శ్రీరామ నీనామ మేమిరుచిరా – గౌళిపంతు – ఆది
11. పాహిమాం శ్రీరామ యంటే పలుకవైతివి – యదుకులకాంభోజి – ఆది
12. చరణములే నమ్మితి నీదివ్య చరణములే – కాపి – ఆది
13. సీతారామస్వామి నే జేసిన నేరం బేమి – సావేరి – ఆది
14. కరుణించు దైవ లలామా – సౌరాష్ట్ర – ఆది
15. ఇక్ష్వాకు కులతిలక ఇకనైన పలుకవే – కాంభోజి – అట
16. నమ్బ్రోవమని చెప్పవే సీతమ్మ తల్లి – కళ్యాణి – అట
17. ఆనబెట్టితినని ఆయాసపడవద్దు – కాంభోజి – అట
18. సకలేంద్రియములార యిపుడు సమయముగాదు – కాంభోజి – జంపె
19. అంతా రామమయం బీజగమంతా రామమయం – వరాళి – ఆది
20. గోవింద సుందరమోహన దీన మందార గరుడవాహన – మోహన – చాపు.

ఈ యిరవై కీర్తనలూ మాత్రమే కాక, యీ అధ్యాయంలో ముందు ఉదహరించిన కీర్తనల్లో చాలమట్టుకు అన్నీ భజనగోష్ఠులలో శ్రవణపర్వంగా వినబడేవే. పుత్రోత్పత్తి సందర్భంలో పాడిన కోదండరామ కీర్తన వంటిదే- జైలునుంచి విడుదల పొందిన తర్వాత భద్రాచలం వెళ్ళేటప్పుడో ఎప్పుడో కలిగిన దొంగలబాధనుంచి తప్పింపమని రాముని వేడుకొంటూ చెప్పిన పెద్ద దండకము

ఒకటి చాలా ప్రసిద్ధమైనది - చదివినా, పాడినా, వినినా పులకాంకురములు పుట్టించేది.

పాహి రామప్రభో పాహి రామప్రభో
పాహి భద్రాద్రి వైదేహి రామప్రభో
శ్రీమన్మహాగుణస్తోమాభిరామ మీ
నామకీర్తనలు వర్ణింతు రామప్రభో ॥పాహి॥
తమ్ముడును నీవు పార్శ్వమ్ములం జేరి వి
ల్లమ్ము లెక్కిడి నిల్చు టిమ్ము రామప్రభో
క్రమ్ముకొని శత్రువులు హుమ్మనుచు వచ్చెదరు
ఒమ్మైన బాణమ్ము లిమ్ము రామప్రభో ॥పాహి॥
కంటి మీ శంఖమ్ము కంటి మీ చక్రమ్ము
కంటి మీ పాదము లంటి రామప్రభో
ఏంటి మీ మహిమ వెన్నంటి తమ్ముడు నీవు
జంటరారయ్య నా వెంట రామప్రభో ॥పాహి॥

ఈ దండక రచనం సంస్కృత వృత్తచ్ఛందస్సులలోని దండక లక్షణాన్ని గాని, తెలుగు సాహిత్యంలో నన్నయాదులు పాటించిన దండక లక్షణాన్ని గాని అనుసరించక కొత్త పద్ధతిలో ఉంది. నన్నయాదుల దండకం తగణప్రస్తారంతో సాగిపోతుంది. వీటి వ్యత్యాసం ప్రబంధాలనుగురించి చెప్పిన నాల్గవ అధ్యాయంలో వివరించాము. రామదాసు దండకంలో మొదటిపంక్తి మాత్రం 8 రగణాలతో సంస్కృతంలోని పద్మినీ వృత్తంలాగ చేసి, చరణాలన్నిటిలోను రగణం నడిచే ప్రతి ఆవృత్తానికీ సరియైన వేర్వేరు మాత్రాగణాలను ఎంమిదేసి వాటి రచనలో కొంత స్వేచ్ఛ, వినేవారికి ఛందస్సులో వైవిధ్యం కలిగేటట్లు చేశాడు. రామదాసు దండక ప్రబంధాన్నే కాక చూర్ణికా ప్రబంధాన్ని కూడా చేశాడు ప్రబంధాధ్యాయం లోని గద్య ప్రబంధ భేదాలలో యిది ఒకటి. ఈ చూర్ణికలో శ్రీ మహా విష్ణువు అవతార లీలలను ఇరవైనాల్గింటిని పేర్కొని నుతించడంచేత దీనిని చతుర్విం శతినామ ప్రతిపాదకమైన చూర్ణిక అంటారు

శ్రీ మదఖిలాండకోటి బ్రహ్మాండభాండ తండోపతండ కరండమండల కాంతోద్దీపిత : సుగుణ నిర్గుణాతీత సచ్చిదానంద పరాత్పర తారకబ్రహ్మాహ్వాయ దశదిశప్రకాశం, సకల చరాచరాధీశం, కమలసంభవ శచీధవ ప్రముఖ నిఖిల బృందారక బృందవంద్యమాన సందీప్త దివ్యచరణారవిందం, శ్రీముకుందం.... ....భవతర సుగుణసాంద్రం, భవజనిత భయోచ్ఛేదచ్ఛిద్రమచ్ఛిద్రం, భక్తజన మనోరథోన్నిద్రం, భద్రాచలరామభద్రం, రామదాస ప్రసన్నం భజేహం భజేహమ్....

కేవల భక్తిమార్గమే కాక, జ్ఞానమార్గమును కూడ తోడుచేసుకొని, వైరాగ్యము సిద్ధింపజేసుకొన్న యోగిపుంగవుడు రామదాసు. అతని యీ కీర్తనలో ఆ విషయం స్పష్టపడుతుంది.

సైంధవి – ఆది

భళి వైరాగ్య మెంతో బాగైయున్నది చంచలమైన
నా మనసు నిశ్చలమైయున్నది....
అరిషడ్వర్గము నన్నంటకున్నది శ్రీహరినామస్మరణ
జిహ్వ కనువైయున్నది....
గురుధ్యానమందే మనసు కుదురైయున్నది
చిత్త మిగువదియారింటిమీద నిరవై యున్నది....
పరమశాంత మెన్న బాగై యున్నది
మాకు పరతత్త్వమందే బుద్ధి పట్టియున్నది....
విరసము వేరులేని విధమై యున్నది
ప్రకృతిగా తెగబాసి మోక్షమునకు తెరువై యున్నది....
గురి భద్రాద్రీశునందె గురుతై యున్నది
యిప్పు డరమరలేక రామదాసు డనదగి యున్నది....

# పదమూడవ అధ్యాయం

# క్షేత్రయ్య 1600 - 1680

ముందు జరిగిన మూడు అధ్యాయాలలోను ప్రసక్తులయిన నారాయణతీర్థులు, సిద్ధేంద్రయోగి, భద్రాచల రామదాసు జీవించి ఉండిన కాలంలోనే క్షేత్రయ్యకూడా జీవించి ఉండినట్లు విద్వత్పరిశోధకులు తేల్చారు. కాని క్షేత్రయ్యకు ఆ ముగ్గురిలో యెవరితోనైనా పరిచయ సంపర్కములు కలిగివుండినట్లు చెప్పదగిన చారిత్రికాధారాలుగాని, ఐతిహ్యాలుగాని దొరకలేదు.

## సంకీర్తన రచనాపరిణామం :

15 వ శతాబ్దంలో సంకీర్తన పితామహుడైన అన్నమాచార్యుడు శృంగార సంకీర్తనములను, అధ్యాత్మ సంకీర్తనములను వేలకొలది రచించి తరువాతి వాగ్గేయకారులకు పదకవితా మార్గదర్శి అయి బిరుదు పొందాడని చెప్పుకొన్నాము. 16 వ శతాబ్దంలో అన్నమాచార్యుల పుత్రపౌత్రులు పెదతిరుమల, చినతిరుమలాచార్యులూ, పురందరదాసూ, సంకీర్తనమును బహువిధాల రచించి వ్యాప్తికి తెచ్చారు. 17 వ శతాబ్దిలో – అనగా, నారాయణతీర్థులు, రామదాసు, క్షేత్రయ్య అవతరించునాటికి సంకీర్తన రచనము మూడు నవ్యమార్గములను తొక్కింది. నారాయణతీర్థుల కృషిలో సంకీర్తనము ప్రధానముగా అధ్యాత్మబోధను ఆదర్శముగా పెట్టుకొని, శృంగారమును ఔపచారికముగా ఉంచుకొని, ఒకప్రక్క నాట్యాభినయయుక్తములైన యక్షగానములకు ఉపాంగముగా ఔతూ, ఇంకొకపక్క భజన పద్ధతి ప్రాచుర్యానికి దారితీసింది. ఇది మొదటి మార్గము. ఇక, రామదాసు కీర్తనలు భక్తిరసపరమావధిని పొంది, పామరజనంకూడ భక్తిమార్గంలో సాధనచేయడానికి కనువయిన భజనగోష్ఠుల వ్యాప్తికి కారణమైనాయి: ఇది రెండవ మార్గము. మూడవది సిద్ధేంద్ర క్షేత్రయ్యలకు ఆలంబమైన మార్గము. ఇది కొంతవరకు నారాయణతీర్థుల రచనలకుకూడ దొరికిన మార్గమే. శృంగారం ప్రధానమై అధ్యాత్మబోధ అంతర్గర్భితమై సాగినవి సిద్ధేంద్రుని యక్షగానములూ, క్షేత్రయ్య పదములూకూడ. వీ రిరువురి రచనలూ తీర్థుల తరంగాలతోపాటు నాట్యాభినయ ప్రదర్శనలకు కూడా ఆలంబము లయినాయి. వీరందరిలోను ఒక

అడుగు ముందుకువేసినవాడు క్షేత్రయ్య. మిగిలినవారికంటె క్షేత్రయ్య వేసిన ముందంజ – ధాతుకల్పనలో, ఇది తన తరువాతి వాగ్గేయకారు లెందరికో అతనిని మార్గదర్శిగా చేసింది. (నేటి కర్నాటక సంగీతపు రాగము లెన్నో స్పష్టరూపం తాల్చినది క్షేత్రయ్య పదాలలోనే.)

## స్వ స్థ లం:

క్షేత్రయ అనేది పదరగనచేస్తూ క్షేత్రాటనం చేసినందువల్ల వచ్చిన ప్రజ్ఞానామమనీ, ఆతని అసలుపేరు మొవ్వ వరదయ్య అనీ శ్రీ విస్సా అప్పారావుపంతులు గారి పరిశోధనలద్వారా వెల్లడిఅయింది. ఇతని పదాలలో రాజులను నాయకులుగా చేసి చెప్పినవి కొన్నితప్ప, మిగిలినవన్నీ మువ్వ గోపాలుడు నాయకుడుగా మువ్వ గోపాల ముద్రతో ఉండడంచేతనూ, ఆ ముద్రలలో – మువ్వ గోపాల అనీ, మువ్వపురి గోపాల అనీ, మోవనాడు కలిగిన మువ్వగోపాల దేవా – అనీ ఉండడంచేతనూ, కృష్ణాజిల్లాలోని కూచిపూడికి సమీపంలో ఉన్న మొవ్వ అనే గ్రామంలో 500 ఏళ్లగా వేణుగోపాలస్వామి ఆలయం ఉండడంచేతనూ, ఆ మొవ్వ గ్రామంలో ఇప్పుడుంటున్న మొవ్వవారు అనే బ్రాహ్మణకుటుంబము వారు తాము క్షేత్రయ్య సంతతివారమని తరతరాలుగా చెప్పుకొంటూ ఉండడం వల్లనూ, మొవ్వకు దగ్గరే ఉన్న కూచిపూడిలోని భాగవతులకు క్షేత్రయ్య పదాభినయం తరతరాలుగా అరాధ్యమై ఉండడంవల్లనూ, క్షేత్రయ్య స్వస్థలం కృష్ణాజిల్లాలోని మొవ్వ గ్రామమే అనీ, ఇతరులు కొందరు విద్వాంసులు భ్రమించినట్లు చిత్తూరుజిల్లాకాని, ఉత్తరార్కాటు జిల్లాకాని కాదనీ విస్సా అప్పారావుగారు క్షేత్రయ పదముల పీఠికలో ఋజువుపరచి ఉన్నారు. ఇతడు ఆయా క్షేత్రములు పర్యటనచేసి అక్కడి దేవుళ్ళను నాయకులనుచేసి పదములను చెప్పినాడు. అయినా, అన్నిటిలోను ఆ యా దేవతల నామములతోపాటు మువ్వ గోపాల ముద్రకూడా వస్తుంది. అందరి దేవుళ్ళకంటెను కంచివరదుని గురించే ఎక్కువ పదాలను చెప్పి ఉండడంచేతను, మొవ్వలోని క్షేత్రయ సంతతివారు క్షేత్రయ పేరు మొదట వరదయ్య అనీ, క్షేత్రాలు తిరగడంవల్ల క్షేత్రయ్య అయినాడనీ చెప్పడంచేతను – క్షేత్రయ్య అసలు నామం మొవ్వ వరదయ్య అని కూడా శ్రీ విస్సా అప్పారావుగారే తెలియజేశారు. కంచివరదునిపైని క్షేత్రయ్య రచించిన పదాలన్నీ పరిశీలించగాను, యింకా మరికొన్ని యితర పదాలలోనూ వారికి క్షేత్రయ మువ్వలో ఆత నుండిన రోజులలో జరిగిన సొంత కథనే ఆ పదాలలో చిత్రించినాడని తోచి, ఆ పదాలలోని సంఘటనలను సమన్వయపరచి వా రానాటి క్షేత్రయ్య కథ నీ విధంగా స్పష్టపరిచారు.

"వరదయ్య మొదట సంగీత, సాహిత్య, నాట్యాభినయాలంకారాది విద్యలను అభ్యసిస్తున్న రోజులలో తన సహపాఠియైన ఒక దేవదాసిని ప్రేమించినవాడు. ఆమెకూడ సామాన్య స్త్రీ కాదు చక్కదనము, యౌవనము మాటలట్లుండ. క్షేత్రయ్యను పదరచన చేయుమని హెచ్చరించుచు, అతడు చెప్పే ముద్దు కవితను వ్రాయుచూ, ఆ యా సందర్భములలో ఆ పదములను పాడగలుగుచు, ఆ కవితా రహస్యముల నెరిగి మెప్పింపగలది....ఆట పాటలలో నేర్పరి.

కేదారగౌళ - ఆది

పిలువ నంపె నన్నీవేళ - ప్రేమమీరగా నిపుడు
చెలియ మువ్వగోపాలుడు - చిత్తము రంజిల్ల నేడు...
విరిబోణిరో రమ్మని - విరుల జడను జుట్టి
పరువమయిన నాటికి - పైడి యిదే నను చు
మరువకుమీ మాట - మనకిద్దరికీ పూట
చెరకు విల్తుడే సాక్షి - చెలి యనిన నా సామి....
ఎమ్మెకాడు నేను - నెనసిన చిన్ననాడే
సమ్మతిగా నొకచోట - చదువుచుండగ
పమ్మిన వేడుకతో - భామ నీవు ప్రౌఢవైతే
కమ్మవిల్తుని కేళి - కలసేమన్నది నిజమై...
ఎలమావితోటలో - నింపొంద నొకనాడు
యెలమి గౌరిపూజ - సలుపుచుండగా
అల మువ్వగోపాలు - డగు వేంకటేశుడు
కలువలకయ్యపై - గలసే మన్నది నిజమై....

పంతువరాళి - త్రిపుట

నన్నే పెండ్లాడు సుమీ - నాయాన మువ్వగోపాలా
అన్నన మావారు వరా - లడుగకుండ జేసేగాని....

మొదటి పదంలోని రెండవ చరణంలో వారిద్దరూ చిన్ననాడే ఒకచోట చదువుతూ ఉండడం - ఆమె అతని నాశించి ఎలమావితోటలో గౌరిపూజ చేయడమూ, అప్పుడు (నీవు ప్రౌఢవైతే) మన మిద్దరమూ కలసేమన్నది నిజమై.... అని అతడు అనడమూ జ్ఞాపకము చేసుకొంటూ, పరువమైననాడు ఆచారప్రకారము పైడి పంపి, తమ కిద్దరకు మనస్సాక్షి మన్మథుడే అని అతడు కబురంపాడని ఆమె చెలితో చెపుతుంది. కన్నెరికంనాడు కన్నెతరపువారు వరదయ్యను కట్న మడుగకుండా చేస్తానని ఆమె రెండోపదంలో చెప్పుతోంది.

'సామాన్యముకాదు వాని పొందు' అనే పదంలో ఆదర్శప్రాయమైన నాయిక యిలా వుండాలని చెప్పాడు క్షేత్రయ్య :

పాయపు హంతకారి కావలె, వాని పద పద్యరచన
సేయ నుత్తర మీయవలె, వాని ముద్దు కవిత తా
వ్రాయ చదువ నేరవలె. ఆ వగలయందు
గాయకురాలు కావలె, ఓ చెలియరో ॥సామాన్యముకాదు॥
ఆటకు మేటికావలె, తంబుర
గోట మీట రాగమనవలె, వానిపై సొగసు
పాటలు వినిపించవలె

వాని మనసు తెలిసి మాటలాడ నేరవలె, ఓ చెలియరో ॥ సామాన్యము॥

ఇవికాక 'ఇంతిరో వరదునికి నీపై నెంత మోహమే. అను పదంలోను. 'తరుణిరో నే నందాక జీవము బటుక తాళియుండేనమ్మా' అను పదంలోను ప్రేయసీ వరదయ్యల తొలివలపునాటి విరహావస్థలు సూచితము లవుతున్నవి.

వీరి యీ సాహచర్యమునాటికి క్షేత్రయ్య మువ్వగోపాలునిపై పదములు చెప్పి ఉండడు. ఆనాటికింకా 'సూనశరుని పాటలు సొంపుమీర పాడుకొనుచు' ఇషా విలాసంగా ఉండివుంటాడు. ఆమె గోపాలస్వామి ఆలయంలో నర్తకి అయి ఉండడంచేత, వీ రప్పుడప్పుడు ఆలయంవద్ద సమాగమాలు జరుపుతూ ఉండినప్పు డొకనాడు. ఆమె అతనిని గోపాలస్వామిపై పదరచన చేయకూడదో అని ప్రబోధించి ఉండుననీ, అత డందుకని దీక్షబూని ఆనందభైరవి రాగంలో ఆదితాళంలో

శ్రీపతి సుతు బారికి నే నోపలేక నిను వేడితే
కోపాలా ? మువ్వగోపాలా ?
ఏపొద్దు దానింటిలోనే కాపై యుండి నీ సరస స
ల్లాపాలా మువ్వగోపాలా ?

అని మొట్టమొదటి మువ్వగోపాల పదం – ఆముద్రతో రచించాడు. క్రమ క్రమంగా యీ పదరచనవల్ల కలిగిన అలౌకికానంద పారవశ్యంచేత అతని ఆంతర్యం మారి, జీవితాంతంవరకూ గోపాలాంకితంగానే పదరచన చేస్తూ వచ్చాడు.

వరదాంకితములైన 'ఏమిర వరద నీమోము చిన్నబోయినది', 'ఎంతలేదని యెంచకురా' – 'బాలయిందుకే నా మనసు జాలిబొందెరా – ఎన్ని తలచుకొందు నమ్మా ఎట్లా మరపువచ్చునమ్మా కన్నెరో, చక్కని నా దేవుడైన కంచవరదుని

గుణములు – కంచవరదునితో పొందు కద్దో లేదో – వచ్చే మనసో రాని మనసో వనిత నీవే తెలిసికోవే – ఊరికిపోక నే డిందుండేది మేరరా. వారిజాక్షులార కంచివరదుడు నా కెదురుచూడగానే – చక్కని దయగలదా యిది నీ జాగా చేవందిలింగా – అను యీ పదాలలో వరదయ్య ప్రేయసిని విడిచి దూరదేశం వెళ్ళివుండగా ఆమె విరహావస్థను పొందడమూ, దూతిచేత రాయబార మంప డమూ, తరువాత అతడుకూడా తనవలెనే విరహావస్థలో కుందుచున్నాడని తెలిసి, తానే బయలుదేరి అతణ్ణి అక్కడ కలిసికోవడమూ – ఈ సంఘటనలనుకూడ స్వీయచరిత్రాత్మకములుగా గ్రహించవచ్చునని శ్రీ అప్పారావు వ్రాశారు.

సుబ్బరామ దీక్షితులుగారు సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో క్షేత్రయ్య ఒక మహాయోగివలన గోపాల మంత్రోపదేశం పొందాడనీ, మువ్వపురి గోపా లాయంలో అమంత్రావృతి చేసుకొంటూండగా (శృంగార రసాధిదేవత గోపాలుడు దర్శనమిచ్చి యనుగ్రహించినతోడనే) – 'శ్రీపతి సుతుబారికి' అనే పదంతో – పదరచన ప్రారంభించాడనీ వ్రాశారు.

పదరచన చేసూండినప్పుడుగాని, కొంతకాలానికిగాని క్షేత్రయ్యకు దగ్గర గానే ఉండిన కూచిపూడివారితో సంపర్కం కలిగి ఉంటుంది. అదే కూచిపూడి వారితో అదే శతాబ్దంలో నారాయణతీర్థులకూ, సిద్ధేంద్రయోగికీ కూడ సంబంధ ముండినట్లు వెనుకటి ప్రకరణాలలో చెప్పుకొన్నాము. సాహిత్యభోజుడని పేరొందిన కృష్ణదేవరాయలూ, ఆయన అల్లుడు రామరాయలూ గతించిన తర్వాత విజయనగర సామ్రాజ్యం విచ్ఛిన్నమై ఆంధ్రనాయకులు దక్షిణాన తంజావూరు, మధురలలో రాజ్యాలు నెలకొల్పుకొని, సాహిత్య, సంగీత, నాట్యాది కళలను పోషిస్తున్న కాలమది. ఆంధ్రదేశంనుంచి పండితులేమి, కవులేమి, గాయకులేమి, నర్తకులేమి, భాగవతులేమి – రాజసన్మానం కోసం దక్షిణాదికిపోవడం ఆరం భించారు. ఏ నారాయణ తీర్థులవంటివారో తీర్థాటనంకోసం పోయి ఉండవచ్చు. క్షేత్రయ్యకూడా అలాగే క్షేత్రాటన వాంఛతోనో, రాజద్వార సన్మానాభిలాషతోనో ఏ నేస్తములో పురికొలుపగా దక్షిణయాత్ర చేశాడు. ఈ క్షేత్రాటనంలో అతడు 18 పుణ్యక్షేత్రాలను దర్శించి అక్కడి వేల్పులకు అంకితంగా పదాలు రచించాడు. మానవమాత్రుల ఆస్థానాలు నాలుగుమాత్రం దర్శించి, అక్కడి రాజుల కోరికకూడా చెల్లించి, పదాలు చెప్పాడు.

## ఇతడు దర్శించిన క్షేత్రాలు :

| క్షేత్రస్థలము | వేలుపు పేరు | రచించిన పద సంఖ్య |
|---|---|---|
| 1. మన్నార్గుడివద్ద నున్న మహాదేవ పట్టము; వరహూరు | శ్వేత వరాహుడు ఆది వరాహుడు | 3 పదాలు |

| | | |
|---|---|---|
| 2. చిదంబరం (ఆనాడు తిల్లె అని పేరు) | తిల్ల గోవిందరాజస్వామి | 2 పదాలు |
| 3. కడప | వేంకటేశుడు | 1 పదం |
| 4. కంచి | వరదరాజస్వామి | 13 పదాలు |
| | చెవ్వందిలంగరు | 6 పదాలు |
| 5. వేదారణ్యమో – వేదపురియో | వేదనారాయణుడు<br>వేదపురి నిలయుడు | 2 పదాలు |
| 6. హేమకూటము<br>విజయనగరంవద్ద–తుంగభద్రఒడ్డున | హేమాద్రిస్వామి<br>విరూపాక్షుడేమో | 1 పదం |
| 7. యాదుగిరి<br>(మైసూరులోనిదని ఒకరు, గుల్బర్గ వద్దనున్న యాదగిరి అని మరొకరు చెప్పినారు.) | చెలువరాయుడు | 1 పదం |
| 8. ఇనపురి–కడపజిల్లా ఇనంబ్రోలు | ఇనపురి సామి | 2 పదాలు |
| 9. తిరుమల | శ్రీవెంకటేశుడు | 4 పదాలు |
| 10. తిరువళ్ళూరు | వీరరాఘవస్వామి | 4 పదాలు |
| | శ్రీరంగేశుడు | 2 పదాలు |
| 11. శ్రీరంగం | (రంగనాథుడు) | |
| 12. మధుర | మధురాపురీశుడు<br>(సుందరేశుడు) | 1 పదం |
| 13. సత్యపురి (చిత్తూరుజిల్లా సత్యవీడు) | వాసుదేవుడు | 1 పదం |
| 14. పాలగిరి (కర్నూలు తాలూకా) | చెన్నుడు<br>(చెన్నకేశవస్వామి) | 1 పదం |
| 15. శ్రీనాగశైలం (శ్రీశైలం) | మల్లికార్జునస్వామి | 1 పదం |
| 16. చలువ చక్కెరపురి (చక్రపురం) | చలువ చక్కెరపురి<br>కోవళ్లూరు | 1 పదం |
| 17. కోవళ్లూరు | మువ్వగోపాలుడు | 1 పదం |
| 18. కదిరిగ్రామం (లంకలోనిదని సాంబమూర్తిగారన్నారు. రాయలసీమలోనిది కావచ్చు) | కందదేవుడు | |

ఈ పై క్షేత్రములలో ఆయా వేల్పులను గురించి పదాలను రచించి నప్పటికీ, అన్నింటిలోనను ఆ వేల్పులకు మువ్వగోపాలునితో అభేదం పాటించాడు క్షేత్రయ్య. గోపాలభక్తుడైనా, శివకేశవాభేదం పాటించినవాడు.

తాను విజయం చేసిన రాజాస్థానాలు, తాను రచించిన మొత్తం పదముల సంఖ్య యీ క్రింది దేవగాంధారి రాగపదంలో పేర్కొన్నాడు :

వేడుకతో నడచుకొన్న విటరాయడే...
ఏడు మూడు తరాలనుండి యెందునాగాని యెవతె
కూడుకొని మువ్వగోపాలుడు కృప గల్గినా విభుడు....
మధుర తిరుమలేంద్రుడు- మంచి బహుమానమొసగి
యెదుట గూర్చుండుమని యెన్నిన యిమ్మనెనే
యిదిగో రెండువేల పదము లిపు డెంచుకొమ్మనిన
చదురుమీదనే యున్న సామికి సంతోష మింతింత గాదె...
ఆశమీర తంజాపురి నెలకొన్న విజయరాఘవుని
వెలయ మనుజుల వెంబడి వేగమె పొడగాంచి
చలువ చప్పరమున నుండగ చక్కగ వేయి పదముల
పలుకరించుకోగానే - బహుమాన మిచ్చె నావేళ....
బలవంతుడై గోలకొండ పాదుషా బహుమాన మిచ్చి
తులసిమూర్తితో వాదు - తలచె నావేళ
వెలయ మువ్వగోపాలుడు - వెయ్యిన్నూరు పదములు
నలువది దినములలోన నన్ను గలిసి వినిపించెనే....

ఈ పదానికి రాగం యదుకుల కాంభోజి అనీ దీని పేరు - మేరు పదమనీ సంగీత సర్వార్థసార సంగ్రహంలో ఉన్నది. మూడవ చరణంలో గోలకొండ పాదుషా దగ్గర చెప్పినవి వెయ్యిన్నూరు అని సంగీత సంప్రదాయ ప్రదర్శినిలోని పాఠం. ఈ పదమునుబట్టి క్షేత్రయ్య రచించిన పదముల మొత్తం సంఖ్య 4500 కాని, 4100 కాని అయి ఉంటుంది. ప్రాతకాలపు అచ్చు పుస్తకములనుండి, వ్రాత పుస్తకముల నుండి, తాళపత్ర గ్రంథాలనుండి శ్రీ విస్సా అప్పారావుగారు 330 క్షేత్రయ్య పదములు సేకరించి అచ్చు వేశారు. పిఠాపురం రాజావారు శ్రీ గిడుగు సీతాపతిగారి పర్యవేక్షణలో 380 క్షేత్రయ పదాల వరకూ సేకరించి, ఇంకా 25 క్షేత్రయ్యవేమో అని అనుమానించ తగవాటిని కూడా కలిపి ప్రకటించారు. అంటే క్షేత్రయ్య రచించి ఉంచిన 4000 పైచిలుకు పదాలలో ఈనాడు మనకు 380 మాత్రమే లభించాయన్నమాట.

## పై పదంలోని రాజులు:

మధురలో తిరుమల నాయకుడు క్రీ. శ. 1623- 59 వరకును, విజయ రాఘవ నాయకుడు తంజావూరులో క్రీ. శ. 1633- 73 వరకును గోలకొండ

నవాబయిన అబుల్లా కుతుబ్‌షా 1620-1672 వరకు పరిపాలించినవారు. మండ నర సింహకవి రచించిన ఆంధ్రకౌముది అను అముద్రిత గ్రంథంలో క్షేత్రయ్య విజయ రాఘవనాయకుని తండ్రియైన రఘునాథ నాయకుని ఆస్థానానికి కూడ వెళ్ళి నట్లును, రఘునాథుని గురించి పద్యం చెప్పినట్లును ఉన్నది:

> 'మువ్వగోపాల భక్తేన క్షేత్రజ్ఞ కవినా ఉక్త్వత్వాచ్చచ
> తముదామె వత్తురర్థులు, క్రమ మెరిగిన దాతకడకు రమ్మన్నారా
> కమలంబు లున్నచోటికి, భ్రమరంబులు నచ్యుతేంద్ర రఘునాథనృపా...

## తంజావూరు యాత్ర :

ఎవరి ఆహ్వానంపైని ఈ సభకు వచ్చావని రఘునాథ నాయకు డడుగగా క్షేత్రయ్య పై పద్యంలో ప్రత్యుత్తర మిచ్చాడట. దీనినిబట్టి క్షేత్రయ్య రఘునాథ నాయకుడు పాలిస్తున్న కాలం నాటికే- సుమారు 1630 నాటికి తంజావూరు వెళ్ళి ఉంటాడని తెలుస్తోంది. కాగా, ఇతని జననం బహుశా 1600 ప్రాంతమని పరిశోధ కులు నిర్ణయించ గలిగారు. రఘునాథ భూపాలుడు స్వయంగా సంస్కృతాంధ్ర భాషలలో గ్రంథకర్తా, సంగీత సాహిత్యప్రియుడు. ఆయన అమాత్యుడైన గోవింద దీక్షితులచేత తన పేర సంగీత సుధ అను లక్షణ గ్రంథం వ్రాయించిన వాడు. అతని తర్వాత అతని కుమారుడు విజయ రాఘవ నాయకుడు తంజావూరును పాలించాడు. గోవిందదీక్షితుల కుమారుడూ, చతుర్దండి ప్రకాశిక అనే సంగీత లక్షణ గ్రంథం రచించినవాడూ అయిన వేంకటమఖి విజయరాఘవుని ఆస్థాన విద్వాంసుడే. మన్నారుదాస విలాస, ఉషా పరిణయాది యక్షగాన రచయిత్రి రంగాజమ్మ మున్నగు కవయిత్రులు అతని ఆస్థానరత్నాలు. ఆ రాజుకు యక్షగాన ప్రదర్శనములన్నా, సంగీత సాహిత్య గోష్ఠులన్నా బహుప్రీతి. అతని విషయమై ఇంకా వివరాలు 15 వ అధ్యాయంలో వ్రాయగలము. అతని ఆస్థానానికి క్షేత్రయ్య వెళ్ళి, అతని కోరికపైని విజయరాఘవ పంచరత్నము లన బడు ఐదు పదాలను చెప్పినాడని సుబ్బరామ దీక్షితులవారు మున్నగువారు వ్రాశారు. పైని 'వేడుకతో' అన్న పదంలో విజయరాఘవుని చలువ చప్పరంలో వేయి పదాలను చెప్పినట్లున్నది. ఇప్పు డచ్చయిన పుస్తకాలలో విజయరాఘ వాంకితము లయిన పదాలు 12 మాత్రమే కనిపిస్తున్నాయి. వీనిలో పంచరత్నాలేవో విద్వాంసు లెవరూ స్పష్టంగా చెప్పియుండలేదు. కాంభోజిరాగంలో త్రిపుట తాళంలో పాడ దగిన యీ కింది పదం విజయరాఘ వాంకితమైనదే. ఇందులోని నాయిక- స్వీయ, మధ్య, విరహోత్కంఠిత :

పల్లవి : ఇంతనా పొరుగింటనే-తావులేనట్ల....

అనుపల్లవి : ఇంతనా పొరిగింటనే- ఇంతి విజయరాఘవేంద్రునిమింత ....

చరణాలు : ప్రొద్దుపోదుగాబోలు నమ్మ దాని
వద్దనున్న సుద్దులే అందుచేత
నిద్దురపట్టక-నేనుంటే దానికి
ముద్దుమీద ముద్దులే అది
కద్దో లేదో మా-కలికి నడిగెదనని
సద్దు వినలేక సఖియ యింటనుండితి....
వారిజముఖి ననావలెనంట
కేరడంపు నవ్వులె దానింటి, క
వ్వారి కుంకుమ కస్తూరిగాక మితి
మేరలేని పువ్వులే
సారెకు నాయింటివాసన లిందు వచ్చితె
ఓరువజాలక యువిద యింట నుండితి....
భావజు కేళి నాపడతి కూడే వేళ
పావురంపు పలుకులే
ఆ వేళ విడువుమని నమ్మికలిమ్మని
ఆ వె కెంత కులుకులే
నా వద్దకి రాదో నాతో మాటాడదో
ఈ విజయరాఘవు డెలమీతో నుండేది....

ఈ పదంలోలాగా, పాము మెలికలలా సాగే త్రిపుటాది తాళాల మాతు బంధంలో ద్వితీయాక్షర ప్రాసమూ, అంత్యానుప్రాసములూ, అందాన్ని ఇనుమడించగా, తీయని భావాలతో, తేట తెలుగు నుడికారంతో క్షేత్రయ్య తన పద రచనలో జయదేవుడు అష్టపదులలో సాధించిన మాధుర్యంకంటే ఎక్కువగా సాధించి ధన్యుడైనాడు.

విజయరాఘవుని దర్బారులో క్షేత్రయ్య చెప్పిన 'విడు విడు నన్నంటకురా, ఓరోరి జాణ....విడు విడు నన్నంటకురా వెరతు ముమ్మాటికి నేను. విడిదికి మళ్ళి పోపోరా విజయ రాఘవ....జాణ' అన్న సైంధవి రాగపదంలో 'ఏరా రారా పోరా .. అని రాజును మంచీ మర్యాదాలేని పద్ధతిని సంబోధించి రచించిన పదాలకు, మెప్పేమిటి, ఆ కవికి అంతటి గౌరవం చెయ్యడమేమి'టని, అక్కడి ఆస్థాన పండితులు ఈర్ష్యాళువులై రాజుతో చాడీలు చెప్పారట. అప్పుడది విని, క్షేత్రయ్య కాంభోజి రాగంలో "వదరకపోవే" అన్నపదం పల్లవీ, అనుపల్లవీ రెండు చరణాలూ, మూడవ చరణంలో సగంవరకూ చెప్పి, మిగిలిన దానిని అక్కడి కవీశ్వరులను తాను తిరిగివచ్చేలోగా పూర్తిచేయుమని కోరి. తాను రామేశ్వరయాత్రకు వెళ్ళినాడట.

ఆ కాంభోజి రాగపద మిది :

పల్లవి : వదరక పోపోవే, వాడేల వచ్చీని – వద్దు రావద్దనవే....
అ. ప.: అది యొక్క యుగము వేరే జన్మ మిపుడు
అత డెవ్వరో నేనెవ్వరో – ఓ చెలియా...

చరణాలు: నిచ్చ నిచ్చలు నేడే వచ్చీని రేపైన వచ్చీ ననుచు మదిలో
నిచ్చగా బలువేడి నిట్టూర్పులచేత – ఇంతిరో పెదవు లెండి
హెచ్చైన వెన్నెల చిచ్చుల రాత్రులు
యెన్నెన్నో గడపితి నిక నేటి మాటలే ...

2. వలపుకా డిదే కదా వచ్చుననుచు తెర్వులు చూచి వేసారితి
నెల లెంచి యాఁసితి – నిలుపరాని ప్రేమ – నెమ్మది నడచుకొంటి
కలకంఠ పికనాద – ములు మించు మధుమాస
ములు గడపితీ వట్టి – ముచ్చట లికనేలే

3. భామరో శకునము లడిగితి మువ్వగో – పాలుడు వచ్చుననుచు
కామించి నాథుని గలయు చెలుల చూచి కరగి చింతనొందితి.

ఇంతవరకు రచించి యిచ్చి, క్షేత్రయ్య రామేశ్వరయాత్ర ముగించి తిరిగి వచ్చే వరకు, తంజావూరి ఆస్థాన కవీశ్వరులు దానిని పూరించలేక నీళ్ళు నమలి నారట. అప్పుడు క్షేత్రయ్య —

రామ రామ యీ మేనితో వాని మోము జూడవలెనా....
మొదటి పొందే చాలు వదరక పోపోవే

అని పూర్తిచేయగా అక్కడి పండితులంతా, రాజుతో సహా అతనిని సాక్షాత్తు మువ్వ గోపాలుడనే అని స్తుతించారట.

## ఇ త రా స్థా న ము లు

తుపాకుల వెంకట కృష్ణరాజుకు అంకితంగా చెప్పినవి రెండు మూడు పదాలున్నవి. గోలకొండ పాదుషా కొలువులో చెప్పినవి దొరకలేదు. తుపాకుల వెంకట కృష్ణుడు చెంజికోటలో ఉండిన ఒకానొక సర్దారని రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు సూచించినారు. గోలకొండ పాదుషా కొలువుకు వెళ్ళినపుడు పాదుషా క్షేత్రయ్యను సన్మానించెననీ "తులసిమూర్తితో వాదుదలచె'ననీ, పైని ఉదహరించిన వేడుక నడచుకొన్న....అన్న పదమునుబట్టి తెలుస్తున్నది. తులసిమూర్తి అన్న పేరుగల ఒక వాగ్గేయకారునితో అక్కడ క్షేత్రయ్యకు పోటీవచ్చి, క్షేత్రయ్య ఆ పోటీలో జయించి ఉంటాడు. 1672–1687 సంవత్సరాల నడుమ గోలకొండలో

అబుల్‌హసన్‌తుబ్లా ఆస్థానంలో గురజాల రంగశాయి అను వాగ్గేయకారచక్రవర్తి బిరుదులుగల పదప్రబంధ నిర్మాణకర్త ఉండినట్లు డాక్టర్ రాఘవన్‌గారు శృంగార రసమంజరీ వ్యాఖ్యా పీఠికలో వ్రాసినారు. క్షేత్రయ్య ఆనాడుంటే 70 ఏళ్ళ వృద్ధయి ఉంటాడు గనుక, క్షేత్రయ్య దర్శించినది అంతకు ముందరి పరిపాలకుడయిన అబుల్లా కుతుబ్షానే అని చెప్పవచ్చును. తులసిమూర్తి, గురజాల రంగశాయి గోలకొండలో 17 వ శతాబ్దపు ఆద్యంతములందు వెలసిన ఆంధ్ర వాగ్గేయకారులు– పదకర్తలు.

భారత వచన రచనయందు కళువె వీరరాజుకు తోడ్పడిన తుపాకుల అనంత భూపాలుని తండ్రియే తుపాకుల కృష్ణభూపతి అనిన్నీ, యీ కృష్ణభూపతి క్రీ. శ. 1637 లో చెంజినాయకుల సేనాధిపతియై ఉండినవాడనీ, 1648 లో చెంజికోటనూ, రాజ్యమునూ విజాపుర సుల్తాను ఆక్రమించుకొన్న తర్వాత కృష్ణభూపతి గోలకొండ పాదుషా మంత్రియైన మీర్‌జుమ్లా సైన్యంలో దండనాథుడుగా చేరాడనీ నేలటూరి వేంకట రమణయ్యగారు దాక్షిణాత్యాంధ్ర సాహిత్యమనే గ్రంథంలో వ్రాశారు. క్షేత్రయ్య గోల్కొండ వెళ్ళి అబుల్లా కుతుబ్షాను దర్శించడానికి ఇందు తుపాకుల కృష్ణభూపతి స్నేహం సంపాదించి, అతని ద్వారా కుతుబ్షా కొలువుకు పోయి ఉంటాడు. కృష్ణభూపతి కుమారుడైన అనంత భూపాలుడు వచనంలో మహాభారతము, రామాయణ సుందరకాండము, విష్ణుపురాణము, భగవద్గీతలు రచించిన గ్రంథకర్త. కృష్ణభూపతి కూడ సంగీత సాహిత్యప్రియుడు మాత్రమేకాక పండితుడుకూడ అయి ఉండవచ్చును. క్షేత్రయ్యవంటి ప్రజ్ఞాశాలిని సౌహార్దముతో ఆహ్వానించి పదములు పాడించుకొని అబుల్లా కుతుబ్షాతో పరిచయం కలిగించి, అతని ఆస్థానంలోకూడా క్షేత్రయ పదరచనా ప్రాగల్భ్యానికి విజయం కలిగించి ఉంటాడు.

పరదేశమున జేసిన పనులిందు చెప్పరాకురే అన్న మోహన రాగపదం చివరి చరణంలో ఎన్నగ మధురాపురీశుడైన మువ్వగోపాలు....డని ఉన్నది. ఇది మధుర నాయక రాజయిన తిరుమలనాయకుని కొలువుకు పోయినపుడు రచించినట్లు కనబడుతోంది.

## వరదాంకిత పదాలు :

క్షేత్ర దైవతాంకితములుగా క్షేత్రయ చేసిన పదాలలో కంచిలోని వరద రాజును గురించి 13 పదాలు, కంచియందలి చెవంది లింగని గురించి 2 పదాలు ఉన్నాయి. వరదరాజును చెవంది లింగడును ఒక్కడే దైవమయి ఉండవచ్చని శ్రీ విస్సా అప్పారావుగారు అభిప్రాయ పడినారు. పరమార్థంలో యిద్దరూ ఒకే దైవం కావచ్చునేమోగాని, వరదరాజు వైష్ణవార్చితుడును, చెవంది లింగడు

శైవార్చితుడైన ఏ ఏకామ్రేశ్వరుడో అయి ఉందురనీ శివ కేశవాభేదము వ్యంగ్యముగా చాట డానికని చక్కని దయగలదా.... అనే పదంలో....

చక్కని దయగలదా యిది నీజాగా చెవందిలింగా
యిక్కడికి వచ్చినదేమో హెచ్చు కంచివరదా
చెలికాడ నిను చూడవచ్చితి చెవందలింగా
తెలిసె మా యింటికి రానిదేమో కంచివరదా....
ఎవ్వడో యీ పడకింటిలో నవ్వేది చెవందిలింగ
మువ్వగోపాలుడు గాక మరెవ్వరు కంచివరద....

చెవందిలింగా, కంచివరదా అని నాయిక ఒక్కరినే సంబోధిస్తున్నట్లు రచించాడనీ మా అభిప్రాయం. శివకేశవాద్వైతం నిరూపిస్తూనే, ఈ పదములో 'గోత్రస్ఖలనం' అనబడు కామశాస్త్ర లక్షణానికికూడ దృష్టాంతంగా నాయిక సంభాషణలో ఔచిత్యభంగం లేకుండా ముగురు నాయకుల పేరులు సంబోధింప జేశాడు. ఇదీ. ఇంకా ఇలాటివెన్నో దృష్టాంతాలు క్షేత్రయ్యకు కామశాస్త్రం లోను, నాయికా నాయక మన స్తత్వ చిత్రణములోను కూలంకషమైన అనుభవమూ, జ్ఞానమూ ఉన్నదని చాటుతాయి. కేదారగౌళరాగంలో వ్రాసినపదం–పల్లవిలో ....

ప్రేమ కేశవరాయ – బెదరింపుల కేమాయె – అని ప్రారంభించి చిట్ట చివర....మాలిమి శ్రీ నాగశైల మల్లిఖార్జున ; మువ్వగోపాల–ఏలితివి న న్నీవేళ–మోదమంర శ్రీలోల .... అని పూ ర్తిచేశాడు. ఈ పదంకూడ శివకేశవాద్వైత త త్త్వనిరూపకమే.

కంచి దేవళంలో క్షేత్రయ పదరచనామగ్నుడై ఉన్నప్పుడు జరిగిన ఒక అలౌకిక సంఘటన గురించి శ్రీ అనంతకృష్ణ శర్మగారు వ్రాశారు :

ఒకనాడు క్షేత్రయ్య కంచి వరదరాజుల దేవళమందు రాత్రి పూజను దర్శించాడు. రాత్రి వరదునికి శయ్యాసనమును సమర్పించి అర్చకులు, భక్తులు, అమ్మవారి విగ్రహమును ఆమె ఆలయమునుండి వరదరాజ దేవళమునకు తీసికొని విజయం చేయించి, తలుపులువేసి వెడలిపోయిరి. ఏ మూలనో చీకటిలో కంబళమునకు చేరగిలబడి, కన్నులు మూసికొనియున్న ఈ పదాల పిచ్చయ్యనెవ్వరును గమనింపలేదు. ఇతని యాంతరదృష్టి యంతయును కేళీమందిరంలోని అమ్మ, అయ్యల అలౌకిక శృంగార రసానుభవ భావనలో లీనమైయున్నది. తెల్లవారు జామున ఇతడు యోగనిద్ర మేల్కొని కన్నులు తెరవగా మెట్లనుండి దిగివచ్చు చున్నట్లు ఒకానొక స్త్రీ వ్యక్తి కనిపించెనట. వెంటనే మోహనరాగములో ఝంపతాళములో—

'మగువ తన కేళికా మందిరము వెడలెన్
వగకాడ మా కంచివరద తెల్లవారె ననుచు....
విడజారు గొజ్జంగి విరిదండ జడతోను
కడు చిక్కబడి పెనగు కంటసరితోను
నిడుదకన్నులదేరు నిదుర మబ్బులతోను
తొడరి పదయుగమున తడబడెడు నడతోను....
సొగసి సొగయని వలపు సొలపు జూపులతోను
వగవగల ఘనసార వాసనలతోను
జిగిమించు కెమ్మోవి చిగురు కెంపులతోను
నగము కుచముల విదియ చందురులతోను
తరితీపు సేయు సమసురతి బడలికతోను
జరత పాపడ చెరగు జార్పైటతోను
యిరుగడల కై దండ లిచ్చు తరుణులతోను
పరమాత్మ మువ్వగోపాల తెల్లవారె ననుచు...'

అను పదమును పాడినాడట-ఈ పదరచనము క్షేత్రయ తంజావూరులో విజయరాఘవుని అంతఃపురానికి ఒక ప్రత్యూషకాలమందు పోయివుండగా జరిగినట్లు శ్రీ విస్సా అప్పారావుగారు తాము వినినామని వ్రాసినారు. విజయరాఘవుని అంతఃపురములో ఈ పదరచన జరిగివుంటే, విజయరాఘవుని నాయకునిగా చేసి పదాలు చెప్పిన క్షేత్రయ్య ఈ పదంలోకూడ కంచి వరదునికాక, విజయరాఘవునే నాయకునిగాచేసి ఉండునేమో. కంచివరదుడు నాయకుడు కావడంవల్లను, చివరి చరణంలో పరమాత్మ మువ్వగోపాల తెల్లవారెననుచు మగువ తన కేళికా మందిరము వెడలె అని నాయికచేత అనిపించి, దేవునికి మేలుకొలుపుగా మహోదాత్తంగా చేసిన ఈ పదం కంచిలో రచించాడనడమే సమంజసమేమో.

## అన్నమాచార్యుల రచనలతో పోలిక :

తేట తెనుగు పదాల కూర్పులోను, రసభావ వ్యంజనంలోను, సంగీత కల్పనలోను స్వతంత్రమైన మార్గము త్రొక్కి పదరచన చేసినప్పటికీ, క్షేత్రయ్య రచనలనూ, అన్నమాచార్యుల రచనలనూ ప్రక్కప్రక్కను పెట్టుకొని చదివేవారికి తెలుగు నుడికారంలోను, భావ వ్యక్తీకరణలోను - అక్కడక్కడ, సంఘటనల నేరుకోవడంలోను, నాయికా నాయక స్వభావ నిరూపణంలోను సామ్యము కనపడకమానదు. అన్నమాచార్యుని క్షేత్రయ్య అనుకరించాడని అనుకొనడంకంటె, విస్తృతంగా కృషిచేసిన ఒక పూర్వ వాగ్గేయకారుని రచనలను లెస్సగా చదివియో, పాడుకొనియో ఉండిన సత్ఫలితం క్షేత్రయ రచనలలో ప్రతిఫలించిన

దని చెప్పడం సమంజసం. కొన్ని పోలికలు :

అన్నమయ్య : నాకుం జెప్పరె వలపు నలువో తెలువో

క్షేత్రయ్య : 1. వలపనే దెటువంటి వస్తువో తెలియదే....

అన్నమయ్య : ఆపాటి చుట్టరిక మదె చాలును
కోప మేల కొత్తమేల గుట్టున్న నుండెను....
బాగుగ తానేడనైన బ్రతికితే చాలుగాక
చేరదేర దవ్వులం జూచే తన మేలు....

క్షేత్రయ్య : 1. అక్కరో, నను బాసినందు కాడితి నింతే
చక్కని మా మువ్వగోపాలు డెక్కడ నుండితే నేమి

2. లేమరో మా మువ్వగోపాలు డెందైన
లెస్స యుండితె చాలునే....

అన్నమయ్య : మొక్కలాన నీవు నేను మొరతోపు లాడంగాను

క్షేత్రయ్య : మేరగాదు రమ్మనవే నా సామిని
మొరతోపు శాయక మువ్వగోపాలసామిని....

'మొరతోపు' అనే ప్రయోగానికి మోరత్రోపు అనే పాఠాంతరాన్ని కొందరు పండితులు సూచించారు. మొరతోపు అంటే విన్నపం నిరాకరించడం మోరతోపు అంటే తొలగద్రోయుట. రెండు ప్రయోగాలూ సార్థకాలే. అన్నమాచార్యుల కీర్తనలలో మొరతోపు అని అచ్చుపడింది.

అన్నమయ్య : కొండలో కోవిల కుయ్య గుండెపగిలే, నీ
యండకు రాగా ప్రాణమంతలో బ్రతికెరా...

క్షేత్రయ్య : కోడికూసె నయ్యయ్యో నా గుండె ఝల్లు ఝల్లుమనెనే
చేడెరో నా సామివద్ద చేరి మాటాడేటంతలో...

అన్నమయ్య : అటు కొంతకాలంబు ననుభవించగ గలిగె
ఇటు కొంతకాలంబు యివి చూడవలెనె
వెన్నెలలు చీకట్లు వెలది సుఖదుఃఖములు

క్షేత్రయ్య : 1. అది యొక్కయుగము వేరే జన్మ మిప్పుడు
అత డెవరో నే నెవ్వతో...

2. ఈ పట్ల విడనాడె వెన్నెల చీకటి
ఎవరికైన లేదా...లేమరో....

అన్నమయ్య : ఆడదాని బ్రతు కింత ఆరడి కద్దా ?
క్షేత్రయ్య : ఆడపుట్టువు పుట్టు నన్నలయింతుర...
అక్కరో నా మోహ మింత ఆరడయ్యెగా...
అన్నమయ్య : ఏమి సేతు నా భాగ్యము యెరింగి యెరుంగ నీదు
నా మెహమె మిక్కుటమె నన్ను తడబరచెను....
భావించి నిన్ను జూచితె పరవశమౌదుం గాని
ఆవేళ నీతో సరసమాడ మరతును....
క్షేత్రయ్య : ఏమి సేతు కన్నెప్రాయము నెరజేసె దైవము
ఆముకొన్న రతిసుఖము అనుభవించే దెన్నటికో
నెనరుగల నగుమోము తనియజూచెద నంటే
తన మేన సిగ్గుచేత తలనెత్త నీదు....
అన్నమయ్య : చిత్తరువు వ్రాయబోతె చెలియకు నంతలోనె
హత్తి నీ రూపు తోచె హస్తములకు...యీరీతి రతిగొనెను
క్షేత్రయ్య : ఊరకుండలేక గోర నే వ్రాసిన నీ రూపుగా తోచురా...
నా మనసువంటి నీ మనసైతే...
2. సొలసి నే నేమైన వ్రాయ నీ యాకార శోభనమె కనుపించునే
పిలిచి పేరువ నొకటి పిలువబోయిన నీదు పేరు
ముందుగ తోచునే ఓ మగువ... ఎటువంటి మోహమో కాని ...
అన్నమయ్య : కటకటా అయ్యో కాంత నింత యేపుదురా
అటమటగాదు నీ యానసుమీ నిజమయ్యా....
కోరిన నిన్నేకాని, కసరినా నిన్నేకాని, కోపించినా నిన్నేకాని
మనసిచ్చి యలమేలు మంగపతీ వేంకటేశ
యెనసితివి మా చెలి నింక నేచ నేమిటి కయ్యా....
క్షేత్రయ్య : ఇంత తెలిసియుండి యీ గుణమేలరా
పంతమా మువ్వగోపాల నా సామి....
అలుకచేసి యింటికి రావైతివి నెనరైన
చెలికత్తె లున్నారా పిలువ వచ్చేరా
చెలికత్తె వైనా నీవే చెలువుడ వైనా నీవే
తలచిచూడ నా పాలి దైవము నీవే....

.... .... ....

శ్రీనిధి మువ్వగోపాల చేపట్టి నన్నేలితివి
నా నేర్పు లెవరైనా నందించెరా

నా నేర్పులైనా నీవే, నమ్మిక లిచ్చిన నీవే....
ఆనగ బలికెద నా యానందమైన నీవే....

అన్నమయ్య : ఏటి పొందు యేటి గుణము యేటి సవరందనము మనసు
నాటుకొలపంజేయలేని నటన లేటికే....

క్షేత్రయ్య : మానినిరా చేరరమ్మని పిలువని మాలి మేటి మాలిమే
పూని దాని ప్రాయ మనుభవింపగలేని పురుషుడేటి పురుషుడే....

అన్నమయ్యా పదములతోనే కాక పురందరదాసు రచించిన కన్నడ పద ములతో కూడ క్షేత్రయ్య పదములలో అక్కడక్కడ సామ్యము లున్నవట.

## భాషా శిల్పం :

అందమైన శబ్దసంపదతో, మనోహరమైన భావ సన్నివేశములను సంఘటించి అన్నమాచార్యుడు శృంగారపద రచనలో తొలిదారులు తీర్చినవాడు. క్షేత్రయ్య శబ్దసంపదను, భావ సన్నివేశములను మరింత పోషించి, ఆ దారుల కిరుప్రక్కలను సుందర పుష్పోద్యానములను నాటిన తోటమాలి వంటివాడు. ఇతని పదాలన్నీకూడా నాయికా నాయకులూ సఖులూ ఆయా సన్నివేశాలలో సహజంగా సంభాషించుకొనే శైలిలో సాగిపోతాయి. పాత్రౌచిత్యం కాని, కవితా శిల్పానికి కావలసిన తీవిగాని కొరవడదు; మారుమూల అచ్చతెనుగు మాటలుగాని, పాండిత్య ప్రకర్షకమైన సంస్కృత పదాలుగాని చొరపడి అర్థాన్ని అయోమయం చెయ్యవు; అతని పాత్రలుకూడా అతని సాహిత్య కళాసంస్కృతులకు అనుగుణమైన ఉన్నత సంస్కారమును కలిగి కనిపిస్తాయి. 'దీర్ఘములైన సంస్కృత సమాసములును క్లిష్టములైన తత్సమ పదములును' కలుపక, ఎక్కువగా వ్యవహారంలో ఉండిన తత్సమపదాలు సర్వజన సామాన్యంగా అర్థమయేవి ఎన్ని కలిసినా, అది జాను తెనుగనీ, శిష్టుల వాడుకలో ఉండి, 'తననాటి కవు లాదరించిన' అటువంటి జాను తెనుగునే క్షేత్రయ్య తన పదాలలో వాడినాడనీ శ్రీ మల్లాది సూర్య నారాయణ శాస్త్రిగారు వ్రాశారు.

అన్యాయకారి అను అర్థంలో అన్నెకాడు (అన్నెకారి) శబ్దాలు:— అరమరిక – వ్యత్యాసము అను అర్థంలో 'అమరిక'; అల్లరి అను అర్థంలో 'ఆరుదూరు' ఓర్వలేని తనంతో ఆడిపోసుకొను అనే అర్థంలో 'ఉప్పతించు'- ఏమీ లేనివాడు అనే అర్థంలో 'గుల్లకాడు' కఠినుడనే అర్థంలో 'గొంటుకాడు' జలతారు పావడా అనడానికి 'జరత పావడా' మెలిపడు అనే అర్థంలో 'వడిగొను' ప్రాణసఖులనే అర్థంలో 'అంతరంగులు' నఖక్షతములనే అర్థంలో 'చందురు పిల్లలు; విదియ చందురులు' మిక్కిలి అనే అర్థంలో 'సేనా' కలహము అనే

అర్థంలో చేపట్టు; తలంపు అనే అర్థంలో ఎంచిన యెన్నికలు... ఇచ్చెదను ఇచ్చేడును అనే అర్థములలో యిచ్చేను వంటి క్రియారూపాలు. ఇచ్చెడిని అనే రూపానికి బదులు 'ఇచ్చీని' వంటి క్రియారూపాలు. క్షేత్రయ్య పదాలలో వాడిన స్వతంత్ర ప్రయోగాలు. వీటిలో చాలమట్టుకు కొందరు ప్రామాణికులయిన కవీశ్వరులు కూడా వాడారు

పదాలలో క్షేత్రయ్య వాడిన లోకోక్తులు కొన్ని :

1. అనుకో పనేమున్నది ? - అరటాకుముల్లు సామ్యమైనందు కిప్పుడు.
2. కలిపోసిన సుట్టివంకలు చూచే వయ్యయో.
3. తోటకూర దొంగవలె తొలగిపోయేవాడవు.
4. పామాడి జోగివలె పోయెనా బ్రతుకు.
5. బావిలోని నీరు వెల్లువ పొయ్యీనటవే.
6. పదరివానికి నీకు బోయపగలవలెనే యుండెనే.
7. నే నొకటి తలచితే దైవ మొకటి తలచినందుకు.
8. వలపు సిగ్గెరుగదు.
9. ఇంట గెలిచి రచ్చ గెలువవలెను.
10. ఏరు గడిచితె పుట్టివానికే బొమ్మన్నమాట నిజమాయె.
11. పెడిచేతికి వచ్చినదే చాలునటవే.
12. చేత కాసులేదు, గాని చేసైగలే.
13. ఊరికిపోయిన మగడు ఉట్టిపడ్డట్టువచ్చి.
14. ఇత్తడి సొమ్ములు హెచ్చైన బంగార మౌన, చలి వడగండ్లు ముత్యమౌన.

ఇతర సాహిత్య కవులలో శ్రీనాథునిపైనీ, చేమకూర వేంకటకవిపైనీ క్షేత్రయ్యకు గౌరవ మున్నట్టు - ఈ క్రింది పద్యాలలోని పలుకుబళ్లు అతని పదాలలో కనిపించడాన్నిబట్టి తెలుసుకోవచ్చు.

శ్రీనాథుడు : కంచి యరవత లసమాస్త్ర ఖడ్గలతలు (కాశీఖండం)
క్షేత్రయ్య : కాయజుని తలిరుపదను కత్తులమ్మ యీ చెలులు
చేమకూర : ఎగు బుజంబులవాడు మృగరాజ మధ్యంబు
పుడికి పుచ్చుకొను నెన్నడుమువాడు
— ... మెరుగు చామనచాయ మేనివాడు.

క్షేత్రయ్య : ఎంత చక్కనివాడే- నా సామి వీడెంత చక్కనివాడే
మెరుగు చామనచాయ మేన మరువాడే
కొదమసింగపు నడుము కొమ రమరువాడే....

చేమకూరి కవికీ,క్షేత్రయ్యకూ కూడ అన్నమాచార్యుల భార్యయైన తాళ్ళపాక తిమ్మక్క రచించిన సుభద్రాపరిణయ మనే మంజరీ ద్విపదకావ్యంలో అర్జునుని గురించిన ఈ క్రింది పద్యం పరవడి అయి ఉండవచ్చు.

ఎగు భుజమ్ములవాడు మృగరాజు నడుము
నడచి పుచ్చుకొను నెన్నడుము గలవాడు
గరగరనివాడు చక్కనివాడు నతడు...

'మొత్తముమీద క్షేత్రయ్య పదములందలి భాష జయదేవుని అష్టపదులందలి సంస్కృతభాష కంటెను ఎక్కుడు పదలాలిత్యముతో ఇంపెసలారు చుండును; తేటతెలుగు పలుకులతో భావగాంభీర్యమును వ్యక్తముచేయగల రచనాచాతుర్య మీ క్షేత్రయ్యకు అలవడినట్లు మరీ యే వాగ్గేయకారునకును అలవడలేదని చెప్ప వచ్చు'...నని శ్రీ సీతాపతిగారు వ్రాసిన ప్రశంస అతిశయోక్తి కాదు. అందుకు కొన్ని దృష్టాంతాలు :

1. ఇంతలో నీడకు రాకుంటే కన్నీరు కావేరి కాలువ సుమీ
.... .... ....
వినరా నీవు కౌగిట లేకుంటే పున్నమ వెన్నెల వేడి సుమీ
వనజాక్ష నీ వీడకు వచ్చేదాక తలవాకిలె యిల్లు సుమీ –
నా ప్రాణనాథ అట్టే యుండేవు సుమీ.

2. ధనము చేత, జవ్వనము చేత చక్కదనమున నటవే ఘనతలు
వినయము జాణతనము గలుగుట వినుతికెక్కరే వనితలు.

3. అనుసరించిన రాడు – అలిగితినో రాడు – వనితా యీ నెనరేమొ.

4. వెలది నా మోము రెప్పవేయక కనుగొన
కలయ నిండు సంజచీకటి గమ్మితే
కలికి నీ ముద్దుమోము గానరాక యుండునని
తెలిపి ప్రొద్దుండగానె దీపము తెమ్మనే సామికి – అయ్యయో వెగటాయెనే

5. అలుకో పొలయలుకో తెలియ దమ్మలార
తలుపులు తెలియవలెను. తాళరే మీరు చెలులార
కన్నె చిన్నతన మేమంటే కన్నులు తేలవేసెను
చిన్నెలు చూపి యాపె విభుడు చిరునవ్వు నవ్వెను

ఉన్న రీతిదేమంటే ఉవిద యెంతే నుస్సురనెను.
వెన్నుని నే నదలించితే విని వినన ట్లుండెను

.... ....

ఎమ్మెతో మీ యిద్దఱు నెనసి యుంటిరా అంటే
నెమ్మితో నాపె కద్దనెను, నెలత, అతడు తలయూచెను....

6. నిడివికన్నుల నీరు నించుచు తల యూచి
తడయలేక వేగ తానే వచ్చెద నని
అడు గడుగునకు నుసు రుసు రని మదిలోన
కడు మోహమున ప్రాణేపతు పలికినమాట – ఏమని తెలుపుదు.

7. ఏమిర వరద నీ మోము చిన్నబోయినది
నా మనసు నీ మనసు ప్రేమనిండి యుండగ
ఒడిమీద నుండగా వడతులందరు రాగా
వడిగా లేచిపోయినదే వలపులేని దానా
ముడిబొమ్మ లేలరా, నా యడపక త్తెచే ఆకు
మడుపుల నంపించినదే మమతలేని దానా...

క్షేత్రయ్య మొదటిలో మితిమీరిన స్వానుభవ శృంగార విషయికముగానే పదాలు రచించినా, అన్నమాచార్యులవలె కృష్ణ మంత్రోపదేశము పొంది కృష్ణ భక్తుడై, తన శృంగారరస పరిప్లుతిని మువ్వగోపాలుని కంకితంచేసి, మధుర పద్ధతిలో తానే నాయికగా, గోపాలుడు నాయకుడుగా పదాలు రచించి జీవాత్మ పరమాత్మైక్యానుసంధాన తత్వాన్నికూడ "ఇద్దరి సందున పవళించియున్న ఇంతి పే రెవరురా" వంటి పదాలలో వ్యంగ్యంగా చొప్పించినాడు. నాయికా నాయకు లిద్దరూ జీవాత్మ పరమాత్మలూ, సందున నున్న ఇంకొక యువతి మాయ.

## అలంకారశాస్త్ర లక్ష్యం:

క్షేత్రయ్య పదాలలో – అలంకార శాస్త్రములోను, వ్యాత్స్యాయనుని కామ శాస్త్రము, కొక్కోకము మొదలయిన గ్రంథములలోను క్షేత్రయ్యకుగల పరిపూర్ణ పాండిత్యం కూడా విశదమవుతుంది. 15 వ శతాబ్దంలో తెలంగాణాలో వెలసిన భానుదత్తుడను మహాపండితుడు సంస్కృతంలో రసతరంగిణీ, రసమంజరి అనే అలంకార శాస్త్రగ్రంథాలను రచించి, వాటిలో అంతకు మునుపటి అలంకారికులు చూపని నాయికా నాయక భేదాలను వివరించి లక్షణము చెప్పి, వాటికి లక్ష్య శ్లోకములను కృషపరంగా రచించాడట. క్షేత్రయ్య తన పదరచనలో లక్ష్య నిరూపణలో భానుదత్తాదులు పోయిన కొత్తత్రోవలనే పోయినాడు. ఈ విషయం వివరిస్తూ శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు, 'రసమంజరీ కర్తయైన భాను

దత్తునిలో గోచరించని ఒకవిశేషము తెలుగుక్షేత్రయ్యలో గోచరించును. అలంకారికుల లక్ష్యములు శృంగారమును సూచించునవియే యయినను అందలికామతంత్రము అస్పష్టము, అజ్ఞేయమునై దూరదూర మైనది. ఇందు క్షేత్రయ్య పదాలలో అది అదూరమైన తంత్రము......అని వ్రాసినారు. అంటే సంస్కృతాలంకారికులలో చాలమంది లక్షణానుసారము ఆ యా మానవ ప్రకృతులు, ఆ యా సన్నివేశాలలో ఆ యా విధాల వర్తించుట సంభావ్యమని ఊహించి సన్నివేశాలను కల్పించుకొని లక్ష్యములను రచించినవారు. క్షేత్రయ్య మానవ జీవితంలో నుంచి సహజమైన సన్నివేశాలలో వారి మనోభావాలను గేయరూపంగా వివిధావసలలో చిత్రించాడు. అతని మన స్తత్వ పరిజ్ఞానమూ, అనుభవ పరిణతీ అలంకారశాస్త్ర జ్ఞానముకంటె మించినట్టివి.

## శృంగార రస మంజరి:

క్షేత్రయ్యకు తరువాత ఎప్పటివాడో ఎక్కడివాడో పేరేమో తెలియని ఒక అజ్ఞాత రచయిత భానుదత్తుని రసమంజరిని 'శృంగారరసమంజరి' అను పేర తెనిగించాడు. ఈ అనువాదకర్త వివిధ నాయికలకు లక్షణం వివరిస్తూ ఆ లక్షణమునకు ఉదాహరణములుగా క్షేత్రయ్య పదములను సూచిస్తూ వచ్చాడు. క్షేత్రయ్య పద రచనలో నాయికా నాయకాదుల భేదనిరూపణం భానుదత్తుని రసమంజరిలోని నిరూపణాన్నే అనుసరించినదని అనువాదమును బట్టి తెలిసింది. ఈ రసమంజరి కృష్ణా-గోదావరీ తీరస్థులయిన పండితులకు, కాశీవంటి ప్రాచీన విద్యాపీఠములకు పోయి చదువు కొనువారికి మాత్రమే కాక, నాట్యశాస్త్ర వేత్తలయిన కూచిపూడి వారికీ, వారి సంప్రదాయపు శాఖలుగా దక్షిణాదిని తంజావూరు జిల్లాలోని మేళటూరు, శూలమంగళం, ఊత్తుకాడు ప్రాంతాలలో నుండే భాగవత కుటుంబాల వారికీ, పాఠ్యమై వెలసింది. కూచిపూడిలో సంగీత అలంకార శాస్త్రములను అభ్యసించిన ముష్టి వరదయ్యకూడ యీ రసమంజరిని చదివి, అందులో లక్ష్యములుగా యివ్వబడిన శ్లోకాలకంటే హృద్యములయిన లక్ష్యాలను తెలుగులో పదాలుగా రచించాలనే కుతూహలం కలిగి రసమంజరిలోని నాయికా, నాయక, సఖీ, దూతికా లక్షణాలకు లక్ష్యాలుగా తన పదాలను రచించి ఉంచాడని శ్రీ విస్సా అప్పారావుగారు ఊహిస్తూ, అలా కాకపోతే రసమంజరిలోని అన్ని లక్షణాలకు యితని పదాలలో ఉదాహరణలు దొరకడం తటస్థించదని వ్రాశారు. వారు ప్రకటించిన క్షేత్రయ్య పదాల పుస్తకంలో చివర శృంగార రసమంజరిని కూడ చేర్చారు.

## లక్ష్య లక్షణ సమన్వయం:

నాయికా భేదాలలో స్వీయ అను తరగతి నాయికకు చెందిన పదాలు శ్రీ అప్పారావుగారు పరిష్కరించి ప్రకటించిన గ్రంథంలో 100 పదాలు, పరకీయకు సంబంధించినవి 56, సామాన్యకు సంబంధించినవి 63 ఉన్నాయి. శ్రీ గిడుగు సీతాపతిగారు పరిష్కరించి, శ్రీ పిఠాపురం రాజావారు ప్రకటించిన గ్రంథంలో స్వీయను గురించిన పదాలు 160. పరకీయవి 110. సామాన్యవి 109 ఉన్నాయి. మొత్తంమీద స్వీయను గురించిన పదాలు యెక్కువ ఉండడంవల్ల గ్రంథకర్తయైన క్షేత్రయ్యకు స్వీయ నాయిక యందే అభిమాన మెక్కువ అని చెప్పవచ్చు. స్వీయ నాయికలో తిరిగి కన్య, ముగ్ధ, మధ్య, ప్రౌఢ, ధీర, అధీర ధీరాధీర, జ్యేష్ఠ, కనిష్ఠ మొదలయిన 13 భేదా లున్నవి. పరకీయ – పరోఢా, కన్యా అని రెండు ప్రధాన భేదాలు–అవాంతరభేదాలు: గుప్త. విదగ్ధ. లక్షిత,కులట అనుశయాన, ముదిత. తరువాత–సామాన్య. ఉత్తమదివ్య. అన్యాసంభోగ దుఃఖిత, వక్రోక్తిగర్విత. స్వీయాది భేదాలేకాకుండా, అష్టవిధ నాయికా భేదములు అని మణకుడు చెప్పిన లక్షణం ఉంది స్వాధీనపతిక. వాసవసజ్జిక. విరహోత్కంఠిత, విప్రలబ్ధ. ఖండిత. కలహాంతరిత, ప్రోషితపతిక. అభిసారిక, ప్రవత్స్యత్పతిక, సమాగచ్ఛత్పతిక, ఇవిగాక మానవతి, లఘుమాన,మధ్యమాన, గురుమాన,గర్విత, సౌందర్య గర్విత. ప్రేమగర్విత, విద్యాగర్విత, యౌవనగర్విత, కులగర్విత అనే నాయికా భేదాలుకూడా కొందరు చెప్పారు. నాయకుడు పతి, ఉపపతి, వైశికుడు అని మూడు విధాలు. పతి–అనుకూలుడు, దక్షిణ నాయకుడు, ధృష్టుడు. శఠుడు,

'ఏమి సేయుదు మోహ మెటువలె తీరును' అనే పదం నాయకుడు చెప్పు మాటలు. దీనినిబట్టి నాయికా నాయకు లిద్దరి లక్షణాలూ తెలుస్తాయి. నాయిక స్వీయ, ప్రౌఢ, ప్రోషిత పతిక నాయకుడు అనుకూలుడు. ఈ పదంలో ప్రవాస విప్రలంభ శృంగారం చిత్రింపబడింది. విరహవేదనలో ఉన్న నాయకుడు ఊరటకోసం నాయికా చిత్రం గీచి చూచుకొంటాడు. ఆకృతిని గీయగలిగాడే గాని, ఆమె అవయవాలలో కన్నులకు కనబడని సుగుణ సంపదను చిత్రింపలేక పోయానని వాపోతాడు.

'అలిగి యేల యిందు వచ్చితి నయ్యయో యింక నే నేమిసేయుదు' అని విలపిస్తూ నాయకుడు తన నాయిక యెంత ఉత్తమురాలో తన యెడల ఎంత అనురక్తురాలో వర్ణించి మెచ్చుకొంటాడు. జయదేవుని అష్టపదులలో తనపై నాయిక కోపించి వెళ్ళిపోయిందని నాయకుడు చింతించే దొకటున్నది.

> 'మామియం చలితా విలోక్య వృతం వధూనిచయేన
> సాపరాధతయా మయాపి నవారితా తిభయేన,
> హరి హరి హతాదరతయా సాగతా కుపితేవ....'

'మన మెట్టి నాయికా నాయకుల నెట్టి యవస్థలను తలచుకొన్నా అందుకు తగిన పదము క్షేత్రయ్య రచనలందు కనబడగలదు. అట్లనుటవలన ఇతడు లక్షణశాస్త్ర మెదుట పెట్టుకొని ఒక్కొక్క లక్షణమున కొక్కొక్క లక్ష్యముగా నీ పదములను రచించెనని చెప్పుట ఒప్పుకాదు. క్షేత్రయ్యవంటి ఉత్తమ కవు లెప్పుడు అట్టిపని చెయ్యరు .. శృంగార రసమంజరిలోని లక్షణములకు క్షేత్రయ పదములనుండి లక్ష్యము లా యా స్థలములందు సమన్వయించిన వా రిటీవలి పండితులు' అని సీతాపతిగారు వ్రాశారు.

## పచ్చి శృంగారం:

క్షేత్రయ పదాలను రసాభివ్యక్తిని బట్టి శ్రీ సాంబమూర్తిగారు మూడు విధాలుగా విభజించారు. 1. అంతరికంగా భక్తి, బాహిరంగా శృంగారం కన్పించేవీ; 2. గౌరవ శృంగారం ఇతివృత్తంగా కలవీ. 3. పచ్చిశృంగారపువీ. ఈ పదాలలో పచ్చిశృంగారం పరకీయ నాయికకు సంబంధించిన వాటిలో కొన్నిటి లోనూ, సామాన్య నాయికకు సంబంధించిన వాటిలో కొన్నిటిలోనూ వస్తుంది. అన్నిటిలోను స్వీయను గురించినవే ఎక్కువ అని ముందు చెప్పుకొన్నాము. వాటిలో కూడ కొన్నిచోట్ల స్త్రీల అవయవముల ప్రసక్తి, సురతపు బడలికలు, ఉపరతులు, చౌశీతి బంధాలు, కళలు, ముదుబూ మొదలగు విషయాలు యీనాటి నాగరకత ప్రకారము అశ్లీలము లనిపించేవి దండిగా కనిపిస్తాయి. కామశాస్త్ర గ్రంథాలలో విపులంగా వర్ణించబడిన యీ విషయములన్నీ సంఘోపయోగం కోసం వ్రాయబడినవికాని, సంఘంలోని స్త్రీ పురుషులను దుర్మార్గ ప్రవర్తకులుగా చెయ్యడానికి కాదు చౌర్యంకూడా చతుష్షష్టి కళలలో ఒక దానిగా మన దేశపు విద్వాంసులు చేర్చినప్పటికీ దొంగలయేవారు ఆ శాస్త్రం చదవకుండానే నేర్పరు లవుతారు. కామశాస్త్రంవంటి గ్రంథాలుగాని, క్షేత్రయ పదాలవంటి రచనలుగాని - ఆనాటి సంఘమర్యాద ప్రకారం గౌరవాస్పదములయి, ఈనాటి మర్యాదల ప్రకారం దూష్యములు కానక్కరలేదు. వాటిని చదివినా చెడిపోని మనస్సంయమసం కల ప్రౌఢులకు మాత్రమే వాటిని అందుబాటులో ఉంచవచ్చును. ఈనాడు కూడా సంగీతయుక్తములై పదాలు పాడబడేటప్పుడు ప్రౌఢులయిన వారికే వాటి సాహిత్యంలోని భావంకాని ఆ సంగీత రచనగాని ఆస్వాదయోగ్యం గావడమూ అప్రౌఢులకు అందులో ఏమున్నదో అగమ్యగోచరంగా ఉండడమూ చూస్తూ ఉంటాము. పచ్చిశృంగారం గల పదాలలో కొన్ని భాగాలు అశ్లీలద్యోతకాలని ఉదాహరించి, యీ పదాలు రచించిన క్షేత్రయ్యా మొదలయినవాళ్లంతా దేవదాసీల భోగంమేళాలలో ఫిడేలుగాళ్లు, తార్పుడుగాళ్లు అని యీనాటి విమర్శకులు కొందరు వ్రాయడం ఆ విమర్శకుల అజ్ఞతనే చాటుతుంది.

నా ట్యం :

నాట్య శాస్త్రానుసారం పదాలను పాడుతూ అభినయించేటప్పుడు ఒక్కొక్క పల్లవినిగాని, అనుపల్లవినిగాని, ఒక్కొక్క చరణమునుగాని – 10 సార్లనుంచి 50 సార్లదాకా వీలయితే వేరు వేరు సంగతులు ప్రవరిస్తూ పాడి, ఒక్కొక్కసారి పాడినదానికి ఒక్కొక్క అర్థం వచ్చేటట్లు అభినయిస్తూ 50 సార్లకూ 50 విధాలయిన అభినయాలనూ చూపిస్తారు. మచ్చుకు 'మంచి దినము నేడే ?? మహరాజుగా రమ్మనవే' – అనే పదం పల్లవి తీసుకొందాం. ఇందులోని నాయిక సామాన్య ప్రౌఢ. నాయకుడు వైశికుడు. ఈర్ష్యామాన విప్రలంభ శృంగారం యిందులో చిత్రితం – (స్వీయ, ఉత్తమ నాయిక అనీ, శఠనాయకుడనీ కె. వి. శ్రీనివాస అయ్యంగారి అభిప్రాయము) ఔత్సుక్యమూ, విశ్వాసమూ అనే భావాలు చూపిస్తూ యీ క్రింది అర్థములు ద్యోతకమయేటట్లు పాడుతూ అభినయించాలి. మారుతున్న మాటలన్నిటికీ వేరు వేరు హస్తాలూ, ముద్రలూ ముఖసంజ్ఞలూ ఉంటాయి.

1. మంచిదినము నేడే మహరాజుగా రమ్మనవే
2. ,, సొగసుగా రమ్మనవే
3. ,, ఇప్పుడే రమ్మనవే
4. ,, ఆటంకములేక రమ్మనవే
5. ,, బహిరంగముగ రమ్మనవే
6. ,, సర్వాలంకృతుడై రమ్మనవే
7. ,, భయములేక రమ్మనవే
8. ,, చింతించక రమ్మనవే
9. ,, సంకోచములేక రమ్మనవే
10. ,, ఇదే మంచి సమయము రమ్మనవే
11. ,, నే నతని రాక కెదురు చూచుచున్నాను రమ్మనవే
12. ,, నే నతనికై మంచిగంధం నూరిఉన్నాను ,,
13. ,, మంచి పుష్పాలు సేకరించినాను ,,
14. ,, అతని కిష్టమైన అలంకారాలు సిద్ధపరచాను ,,
15. ,, షడ్రసోపేతమైన భోజ్యములను సిద్ధపరచాను ,,
16. ,, నా కేళీగృహాన్ని అలంకరించుకొని ఉన్నాను ,,

ఈ విధంగా ఈ పల్లవికే 55 విధాల అభినయార్థాలను శాస్త్రంలో చెప్పారు. ఏ కొత్తపదం తీసుకొన్నా నాట్యాచార్యుడు స్వోపజ్ఞ ఉపయోగించి పదకర్త భావం చెడకుండా యిలా అభినయం కల్పిస్తాడు.

అలంకారశాస్త్రమూ, నాట్యశాస్త్రమూ పరస్పరము అవినాభావసంబంధం కలిగి ఉంటాయి. అలంకార శాస్త్రంలో చెప్పిన నాయికా నాయక లక్షణాను గుణంగా వేషధారణచేసి నర్తకులు పదాలను పాడుతూ ఆ యా సన్నివేశాల ననుసరించి, ఆ యా హావభావ విలాసములను వాటికి నిర్దేశింపబడిన హస్తముద్రల తోను, ముఖాద్యంగవిన్యాసములతోను అభినయించి, ప్రేక్షకులకు రసస్ఫురణ కలిగిసాయి. కూచిపూడిలోను, తంజావూరులోను క్షేత్రయ కాలమున ఉండిన భాగవత మేళములవారు అతనివద్ద పదములను నేర్చుకొని నాట్య ప్రదర్శనము చేస్తూండేవారు. నటులకు, గాయకులకు, కవి పండితాది ప్రేక్షకులకు కూడా ఆ పదాలలో భావౌన్నత్యమూ, అనుభవ గాంభీర్యమూ పరిపూర్ణంగా గ్రహింపగలిగి నప్పుడే ఆనాడు సభామర్యాద లభించేది.

## సంగీత రచన :

రస నిర్వహణమునకు కావలసిన అంగ నిరూపణములో సుకుమారమయిన భేదాలను కల్పించడమూ, వాటిని చిత్రించడానికి కావలసిన మాటల పొందికా, సంగీత రచనా క్షేత్రయ్య సొమ్ము. మాటలలోని భావాలకు అనుగుణమయిన రాగవిన్యాసమూ, రాగస్వరూపాన్ని పరిపూర్ణంగా స్ఫురింపజేసే మాటల కూర్పూ ఇతనికి తోడ్పడినట్లు వేరే వాగ్గేయకారునికీ సహాయపడలేదు. రాగములందు భావోద్రేకం కలిగింపగల స్వరసంగతులు తెలిసిన ప్రౌఢుడు కనుక దానికి తగిన సాహిత్యం అప్రయత్నంగా రాగభావంలోని ఆవేశంతో కలిసి పైకి తీగలు సాగి, పూవులు పూచింది. ఆ యా రసభావాల తీవ్రతలోని వ్యత్యాసాలు, ఆ వ్యత్యాసాలకు అనుసరించిన రాగవైవిధ్యప్రయోగజ్ఞానమూ తెలిసిన అతని పాండిత్యం అతి నిశితమూ. అతి సుకుమారమూ, కరుణరసంలో బాహ్యమాత్రమైన దుఃఖమూ, ఉపశమించుకోగల దుఃఖమూ, దుర్భరమైన దుఃఖమూ, హృదయవిదారకమై బావురుమనే విలాపంతో కూడిన దుఃఖమూ, ఈ వివిధ దుఃఖావస్థలుగల పదాలకు ముఖారి, ఘంటా, నాదనామక్రియ, పున్నాగవరాళి, కాంభోజి వంటి రాగాలను వాడు కొన్నాడు. ప్రస్తారానికి పూర్తి అవకాశంలేని ఆహిరి, ఘంటా, సైంధవి, కర్ణాటకకాపి. నవరోజు వంటి రాగాలనుకూడ బహుసూక్ష్మ ప్రయోగాలతో వాడి, ఒడలు ఝల్లుమనిపించ గలిగిన మహాశిల్పి. ఇతని ప్రతి పదంలోను రాగభావం మీగడవలె పైని తెరకట్టి ఆచ్ఛాదించి ఉంటుందని విద్వాంసుల అభిప్రాయం. ఒకపదము పూర్తిగా పాడునప్పటికి దానికి జతపరచిన రాగము

పూ ర్తిగా అన్ని గతులను ప్రస్ఫుతమవుతుంది. గేయములకు పల్లవితోపాటు అనుపల్లవి చేర్చు సంప్రదాయమునకు క్షేత్రయయే మార్గదర్శకుడైనాడు.

తాళ్ళపాకవారినాడు ప్రచారంలో ఉండిన పాడి, సామంతము, ఆబాలి, అమరసింధు, రాయగౌళ, కొండమలహరి, హిజ్జజి, గుజ్జరి, తెలుగు కాంభోజి, సాళంగం, ముఖారిపంతు వంటి అపూర్వ రాగాలు క్షేత్రయ్యనాటికి అంతరించి పోయాయి. అన్నమాచార్యులు వాడిన ఆహిరి, కాంభోజి, కేదారగౌళ, ధన్యాసి, భైరవి, మధ్యమావతి, ముఖారి, రామక్రియ (లేక) పంతువరాళి, శంకరాభరణం, సావేరి, సౌరాష్ట్రి రాగాలను క్షేత్రయ్యకూడ వాడినాడు. అన్నమాచార్యులనాడు యీ రాగాలను పాడే పద్ధతియేమో అప్పుడు వారి సంగీత రచనలను స్వరపరిచి వ్రాసుకొనే పద్ధతి ఉండేదో లేదో స్పష్టంగా తెలియదు. 13 వ శతాబ్దివాడైన శార్ఙ్గదేవుడు తన సంగీత రత్నాకరంలో కింబళములు, కపాలములు మున్నగు కొన్ని శివస్తుతి గేయాలకు, ఆంధ్రి మొదలయిన గేయాలకు స్వరాలిచ్చాడుకాని, ఆ స్వరాల మేళకర్త లేవో యిప్పటి విద్వాంసులకు కూడ అగమ్యగోచరం. కాని, క్షేత్రయ్య నాటినుంచి అతని పదాలు పారంపర్యంగా వినవస్తూవుండ కొంతవరకూ ఆంధ్రదేశంలోనూ ఎక్కువగా దక్షిణాదినీ కొన్ని విద్వత్కళా కుటుంబాలలో నేటికీ నిలిచి ఉండడంచేత దొరికినంతమట్టుకు కొన్ని పదాల స్వరాలతో రంగ రామానుజయ్యంగారు ఒక సంపుటాన్నీ, 78 పదాలవరకూ రాజమండ్రి ఆంధ్రగాన కళాపరిషత్తు వారొక సంపుటాన్నీ ప్రచురించారు.

శ్రీ అప్పారావుగారు సాహిత్యంతో మాత్రం ప్రకటించిన సంపుటంలోని 334 పదాలు 39 రాగాలలో ఉన్నాయి. వానిలో ఆరు రాగాలలో రాగానికి ఒక్కొక్క పదమే ఉంది. అవి : వసంతభైరవి, వరాళి, ఖండె, గౌళిపంతు, కేదార, గౌరి. వీటిలో ఖండె అనేది అపరూపనామం. మిగిలినవి ప్రాచీన రాగాలే. ఇవికాక మిగిలిన 32 రాగాలు క్షేత్రయ్యనాడు బహుళ ప్రచారంలో ఉండేవని చెప్పవచ్చును.

| రాగము | పదాలు | రాగము | పదాలు | రాగము | పదాలు |
|---|---|---|---|---|---|
| కాంభోజి | 37 | బిళహరి | 11 | నీలాంబరి | 4 |
| ముఖారి | 22 | ఆనందభైరవి | 10 | కన్నడ | 4 |
| భైరవి | 22 | మధ్యమావతి | 10 | ధన్యాసి | 4 |
| కళ్యాణి | 22 | శంకరాభరణం | 9 | సురట | 4 |
| సావేరి | 16 | ఆహిరి | 9 | అఠాణ | 4 |
| తోడి | 15 | ఉసేని | 8 | కాపీ | 3 |
| కేదారగౌళ | 13 | పున్నాగవరాళి | 8 | అసావేరి | 3 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| పంతువరాళి | 13 | సౌరాష్ట్ర | 8 | సారంగ | 3 |
| ఘంటారవం | 13 | బేగడ | 5 | శ్రీ | 2 |
| మోహన | 12 | నవరోజు | 5 | మారువ | 2 |
| యదుకులకాంభోజి | 12 | సైంధవి | 5 | నాదనామక్రియ | 2 |

ఈ పట్టికనుబట్టి చూస్తే శృంగారరసానికి జీవగర్రయైన కాంభోజిరాగాన్ని క్షేత్రయ ఎక్కువగా వాడుకొన్నట్టూ, ఆతర్వాత ప్రధానమైనవి ముఖారీ, కళ్యాణీ, భైరవి రాగాలనీ తెలుస్తుంది. రామదాసును గురించిన అధ్యాయంలో ఆనందభైరవి రాగంలో కీర్తనలు రచించిన తొలి వాగ్గేయకారుడు రామదాసు అని చెప్పుకొన్నాము. రామదాసూ, క్షేత్రయ్యా ఇంచుమించు సమకాలికులే కనుక, ఆనందభైరవి వారిరువురికాలంలోను వారి రచనలద్వారా ప్రచారంపొంద నారంభించిందని చెప్పవచ్చును. ముఖారీ, కళ్యాణీ, భైరవుల తర్వాత సావేరీ, తోడిరాగాలు ఎక్కువ ప్రచారంలో ఉన్నవి. 1860 ప్రాంతంలో తంజావూరుజిల్లాలో మన్నారుగుడివద్ద మూవనల్లూరు సభాపతయ్యా అనే ఆంధ్ర నాట్యాచార్యుడు ఈ మువ్వగోపాల పదాలను రసవంతంగా పాడి నాట్యం చెయ్యడమే కాకుండా ఆ వూరి రాజగోపాలస్వామి కంకితంగా తానుకూడ పదరచన చేశాడు. అతని తర్వాత పి. ఆర్. స్వామినాథ అయ్యరు, వీణ ధనమ్మాళ్ సంతతివారు. బంధువులు ఈ పదముల గాన సంప్రదాయమును పోషించుకుంటూ వచ్చారు.

క్షేత్రయపదములలోని సంగీత రచనను గురించీ, పాడదగు పద్ధతిని గురించీ, శ్రీ అప్పారావుగారు వ్రాసిన వాక్యములను, సుబ్బరామ దీక్షితులుగారు సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో చెప్పిన సంగతులనూ ఇక్కడ ఎత్తి వ్రాస్తున్నాము.

'క్షేత్రయ్య పదములలోని పల్లవి, అనుపల్లవి చరణములతో క్రమముగా రాగవృద్ధి ఎట్లు చేయబడినదో ఒకే రాగమందలి వివిధ పదములలోని స్వర సంచారములు, గమక భేదములు, అలంకారములు. పదముయొక్క భావానుగుణముగా రసమును పోషించుచు ఎట్లుండునో, ఎన్ని భావభేదములకు ఒక్క సంగీతానుభవము యెంత ప్రతిభావంతమైనదో వ్యక్తము కాగలదు. ఎత్తుగడ, తర్వాతి నడక, స్వర సంచారములు, కూడికలు, పోకడలు, రాగము యొక్క జీవకళను పదగమనములో చిప్పిల్ల జేయుచుండును. క్షేత్రయ్య రాగస్వరూప చిత్రము అతి సుందరము, మనోహరము. అదిపర కెవ్వరును రాగమున కిట్టి అందమును తీర్చిదిద్దినవారు లేరు. ఇట్టి రాగరచన చేసి, రాగమునకు రససిద్ధిని కల్పించి, రాగము యొక్క సంపూర్ణ స్వరూపమును నిరూపించి, సంగీతములో రాగమునకు గల ఉన్నతస్థానమును నిర్ణయించి, క్షేత్రయ్య. తర్వాతి వాగ్గేయకారులకు, సంగీత వేత్తలకు మార్గదర్శియైనాడు. ఈ పోకడలనేబట్టి త్యాగరాజస్వామి

ఎన్నో నూతన రాగములకు ప్రథమమున స్వరూపము చిత్రించియున్నారు. సైంధవి, ఘంటారవము, ఆహిరి, ముఖారి బేగడ, సౌరాష్ట్ర మొదలగు రాగములకు నేటికినీ క్షేత్రయ్య పదములే మాతృకలు, ప్రమాణములు. అందలి రాగముల జాడలనే ఇతర వాగ్గేయకారులు నడచియున్నారు. ఇతని పదాలలో స్వరసంచారము రెండు స్థాయిలకు తక్కువగా ఉండదు. సాహిత్యమును తాళము కొరకు అడ్డదిడ్డముగా విరువ నవసర ముండదు. సాహిత్యశుద్ధి కలిగి, భావము తెలిసి కాల ప్రమాణము నెరిగి పాడినచో పల్లవి నుండి అనుపల్లవికి అందుండి చరణములోనికి రాగభావములు పెరిగి, తిరిగి పల్లవిలోని రాగభావములకు చేరుకొనుట స్పష్టము కాగలదు.

సుబ్బరామదీక్షితుల వారిలా వ్రాశారు : 'ఈతని పదములు శబ్దార్థముల చక్కగా నెరిగి రసానుభవముతో నెవడు విళంబముగా పాడుచున్నాడో ఆ పదములు మాత్రము రుచించును. ధాతువులు వ్రాసిచూచితే వచ్చినదే వచ్చినట్లుండును. ఇట్లుండుటయే పదసాహిత్యముల శయ్య. ధాతువులు వచ్చినది రాకయుండుట కీర్తనముల కృతుల-శయ్య.'

అన్నమాచార్యులవలె క్షేత్రయ్య యుగళ గేయములుగా పాడదగిన నాయికా నాయకుల సంవాద పదములుకూడ రచించినాడు.

మంగళ కైశిక – చాపు :

ఆమె : అలల్ల అలల్ల అలల్ల కృష్ణ పదర నాతో నీ వగలెల్ల
అతడు: చిలుకల కొలికిరో చెలగు నీ పైటలో కులికేవి అదియేమొ తెలుపవే
ఆమె : అది కలికి జక్కవజంట తెలియవ ?
అతడు. అయితే సెలవియ్యవే పట్ట జీరునో
ఆమె : అవి పట్టరాదు బలుకొండలు
అతడు: అయితే ఎలనాగ పై నెక్క నిచ్చేన
ఆమె: ఓరి చిలుకల తేజివాని చికిలి దుర్గములవి
తలపున నీవెక్క తరమౌన ఓరి...అలల్ల...

... ... ...

అతడు: వినవే నీ మొగ మింత తళుకుమీరి తనరేని అదియేమె
ఆమె : అది యనగ అద్దములంట తెలియవ ?
అతడు: అయితే వనిత నీడవచ్చునా ?
ఆమె : నీడ కానగరాదు కపురంపు తునకలు
అతడు: అయితే నేవరుగ కలియవచ్చేద

ఆమె : ఘనుడ మువ్వగోపాల నినుగలసేను మునుపటి నెనరుగ తనరేవ ఓరి...

ఈ మంగళ కైశిక రాగం అన్నమాచార్యులు ఎక్కువగా వాడినదే. ఈ విధమైన సంవాద చాతుర్యం ఒలికే ఆచార్యుల గీతములను ఆ అధ్యాయంలో ఉదాహరించాము. ఈ పై గేయంలో నాయిక స్వీయ, ప్రౌఢ, ప్రేమగర్వీత, స్వాధీన పతిక, శృంగారం కొంత పచ్చిగా ఉంది.

కళ్యాణి రాగంలోని మరొక సంవాదపదంలో నాయిక పరకీయ, పరోఢ, నాయకుడు - ఉపపతి, శఠుడు.

కళ్యాణి - చాపు :

అతడు : మంచిదానవే చెలియ మాటలకును

ఆమె : వంచనగల సఖి యని వార్త చెప్పుకో వస్తి—

అతడు : చెలియ నీ నెమ్మోము చంద్రు డందురుగాని
చంద్రు డైతే చంద్రకళ గావా

ఆమె : సరసుడవు నీవు నేను సరసము లాడంగ
కళవేళన కళవచ్చు చంద్రకళ గానా....

అతడు : కమ్మని నీ ముంగురులు తుమ్మెద లందురుగాని, యేవే
తుమ్మెద లయితే ఎగరవా ?

ఆమె : కామాంధకారముగ గతులు రేయిపగలు
తామసపు రతివేళ తా మెగసి యాడున్.

... .... ....

క్షేత్రయ్య జీవిత రహస్యంగాని మాటల అర్థాలమాటున గర్భితమై ఉన్నదా అనిపించే ఒక సమస్యా పదమును ఎత్తి వ్రాసి, ఈ అధ్యాయాన్ని ముగిస్తాము. ఇందులో మాటలన్నీ స్పష్టములే కాని, అర్థం అయోమయం - పరిశోధకులకు తగిన శ్రమ ఇయ్యగలదు.

ముఖారి రాగం - ఆదితాళం :

ప. లలనామణిరో యీ భావము తెలుపవే లలితముగా నిపుడు

అ. వెలదిరో మామువ్వ గోపాలుని దయచేత వేడుకగా దెలుపవే ఓ బాల

చ. 1. అలివేణి నీదేశ మే దేశమంటేను అపుడు చెట్టు చూపెను
చెలియరో నీయూరి పేరేమని యడిగితే చెట్లు రెండు చూపెను
చిలుకలకొలికి నీ చెలుల పేరేమంటేను చెట్లు రెండు చూపెను
పలుమారు నీ జాతి పేరేమని యడిగితే పదరి చెట్టే చూపేనే ఓ బాల....

2. నక్షత్రసఖ నీకు హితవేమని అడిగితే పక్షి హితవని అనెను
లక్షణవతి నీదు చెక్కిట నేమంటె పక్షి యున్నదనెను
వక్షస్థలాన ఉన్నది యేమంటే పక్షి యున్నదనెను
సూక్ష్మముగ నీ పేరేమని యడిగితే పక్షిపేరే చెప్పెనే ఓ బాల...

3. వారిజానన నీకు ఎన్నేండ్లాయెనంటే ఊరిపేరే చూపెనే
చేరి నీ తోడుబుట్టువు లెవరంటే ఊరిపేరే చెప్పెను
తీరుగా మెరసెడు మేలుంగర మే మంటే ఊరిపేరే చూపెను
ఓ రమణి నీ మోమందున్నది యేమంటే ఊరిపేరే చెప్పెనే ఓ బాల....

# పదునాల్గవ అధ్యాయం

# మంచిపల్లె సుబ్రహ్మణ్యకవి 1730-'80

రామదాసు కీర్తనలకు తర్వాత ఆంధ్రదేశంలో అధిక జనరంజన పొందిన సంగీత సాహిత్య రచన కీర్తనాత్మకమైన అధ్యాత్మరామాయణము. భక్తి, అధ్యాత్మ పరత్వమూ కలిగిన కుటుంబాలలో ఏ కొన్నియైనా అధ్యాత్మ రామాయణ కీర్తనలు తప్పకుండా పాఠం చేసినవారుంటారు. సంకీర్తనాత్మకంగా అన్నమాచార్యులు ప్రారంభించిన గేయం అధ్యాత్మరామాయణంలో కథనాత్మకంగా పరిణమించింది. రామాయణ కథ అంతా ఆరుకాండలలో 104 కీర్తనలలో చెప్పబడింది. దీనిని రచించిన వాగ్గేయకారుడు సుబ్రహ్మణ్యకవి. యుద్ధకాండంలోని మంగళానికి ముందున్న 46 వ కీర్తనలో చిట్టచివరి చరణంలో ఇలాగ ఉన్నది :

> శ్రీ శేషాచల వేంకటాఖ్య లక్ష్మీరమణుని పేర,
> ఈశ బ్రహ్మాది లక్ష్మీ సర్వేశిత్వశాలి పేరను
> కోశాతీతనిరీశ సత్యజ్ఞాన గురుడౌ
> విష్ణుని పేరను కృష్ణుని పేరను
> ఈ శుభాధ్యాత్మ రామాయణము
> తెనుగు కీర్తనలుగ నేర్పరించెన్
> సగుణ ముక్తామణుల పేరను కౌశలంబునను
> యుద్ధకాండము ఇది షట్కాండ మఖండ చిదనుభవి
> రుచిరవి సుబ్రహ్మణ్యకవి....
> శ్రీరాముని శ్రీమచ్చరితము శ్రీ జ్ఞానప్రసూన వినవే...

దీనినిబట్టి శేషాచలమని పేరుపడిన తిరుమలపై వెలసిన వేంకటేశ్వర స్వామికి అంకితముగా సుబ్రహ్మణ్యకవి రచించినగ్రంథం అధ్యాత్మ రామాయణం. ఇతని వంశ చరిత్రముగాని, స్థలమూ కాలమూగాని తెలియడానికి తగిన ఆధారాలు ఇందులో స్పష్టంగా ఏవీ లేవు. మొదటి ధన్యాసిరాగ కీర్తన - నమశ్శివాయ తే నమో భవాయ అను దానిలో 4 వ చరణంలో చివర—

> తరుణేందుశేఖరాయ పరమ పురుషాయ భవ
> హరణాయ శ్రీ కాళహస్తీశ్వరాయ....

అనిన్నీ, గ్రంథం చిట్టచివరి మంగళంలో చివరి చరణంలో...

శ్రీ కాళహస్తి నగరీ శంభు మిత్రునికి
సౌకర్యశాలికి జయమంగళం సు
శ్రీకకుల్స్థాన్వయసింహాసనసునికి, వి
వేక కార్యశేషగిరి వేంకట సుబ్రహ్మణ్యునికి
మంగళం శుభమంగళం...

అనిన్నీ వ్రాసిన దానినిబట్టి. తిరుమల వేంకటేశ్వరస్వామియందే కాక, కాళహస్తిలో వెలసిన ఈశ్వరుని యందుకూడా భక్తికలవాడనీ. బహుశాః ఇతడు తిరుపతిలోకాని కాళహస్తిలోగాని, ఆ చుట్టుపట్లగాని ఉండినవాడని ఊహించవచ్చు.

సంగీత విద్వాంసులకుగాని చరిత్రకారులకుగాని. సుబ్రహ్మణ్యకవి జీవితాంశములను గురించి మొన్న మొన్నటిదాక, పైని తెలియజేసిన విషయాలను మించి కొంచెమైనా తెలియలేదు. సుమారు 15 ఏళ్లక్రితం శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు కాళహస్తి జమీందారులయిన దామెరవారి వద్దనుంచి వారి సంస్థానంలో చాలకాలంగా ఉంటూన్న తాళపత్రగ్రంథాలను కొన్నిటిని తిరుపతి ప్రాచ్యపరిశోధనాలయానికి తీసుకు వెళ్ళారు. వారి సలహాపైని ఆ గ్రంథాలలో ఉన్న దామెరవారి పదాలు....అనే తాళపత్రప్రతిని చదివి పరిశోధించగా తేలిన అంశములను తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు ఖర భాద్రపదపు భారతిలోని ఒకవ్యాసంలో వ్రాశారు. దానినిబట్టి అధ్యాత్మరామాయణ కీర్తనలు రచించిన సుబ్రహ్మణ్యకవి దామెర్లవారి కాళహస్తి సంస్థానంలో పోషితుడనీ, ఆ సంస్థానపు ప్రభువుల ప్రోత్సాహంపైని, వారికి అంకితంగా అతడు కొన్ని పదాలనుకూడా రచించాడనీ తెలిసింది. సుబ్రహ్మణ్యకవి ఇంటిపేరు మునిపల్లె వారయినట్లుకూడా తేలింది.

ఆ తాళపత్ర గ్రంథముపైని ఇలా వ్రాసి ఉన్నది......
మునిపల్లె రామలింగార్య పుత్రులైన సుబ్రహ్మణ్యకవి చాతుర్యంబుగా
రచియించిన రామాయణ కీర్తనలు తమ ప్రియశిష్యులైన రాజశ్రీ
దామెర కృష్ణస్వామివారికి కృపచేసి యిచ్చిన పుస్తకం—

ఆ తాళపత్రాలలో దామెరవారి పదాలు అని చెప్పబడిన పదాలే ఉన్నవిగాని, రామాయణ కీర్తనలు లేవు. ఆ పదాలలో నాలుగు దామెర తిమ్మభూపాలుని కుమారుడైన కుమార వెంకట సార్వభౌముని మీదను, మరి రెండు దామెర వేంకటేంద్రుని కుమారుడైన కృష్ణభూపాలునిమీదను వ్రాసినవి, ఈ వే... సార్వభౌముడు లేక వేంకటేంద్రుడు అను రాజు కాళహస్తిపాళెము...గించలేదు. ఇండియా కంపెనీవారికి లొంగిపోయిన 1780 వ సంవత్సర ... శరభయ్య, పరిపాలించినవాడు. కృష్ణభూపాలుడు. లేక కృష్ణస్వామి అతని ...శా అందరూ ఈ తండ్రి కొడుకు లిద్దరివద్దను పోషితుడై, కొడుకుకు గురువైన ...ంచారు. సుబ్ర... కవి, ఆనా దక్కడ సంగీత సాహిత్య నాట్య శాస్త్రాదులలో ప్రావీణ

పండితుడూ, వాగ్గేయకారుడూ అయి ఉండెను. పై గ్రంథంలో కృష్ణరాజుకు అంకితమైనవి 2 పదాలు, కాళహస్తీశ్వరునికి అంకితమైన దొక పదమూ, అగస్త్యనాథునికి అంకితమైన దొక పదమూ కూడా ఉన్నాయి. 1780 ప్రాంతంలో వాగ్గేయకారుడై, పండితుడై, రాజకుమారునకు సాహిత్య కళాచార్యుడై యుండిన సుబ్రహ్మణ్యకవి సుమారు 1730 ప్రాంతంలో జన్మించి ఉండవచ్చును.

సంస్కృతాంధ్ర భాషలలోను, సంగీత నాట్యాలంకార శాస్త్రములలోను, వేదాంతశాస్త్రంలోనుకూడ సుబ్రహ్మణ్య కవికి అపారమైన పాండిత్యం ఉన్నట్లు అతని రచనలవలన తెలుస్తుంది. అంతేకాకుండా, ఇతడు సంస్కృతాంధ్రములలో గేయరచనాదక్షుడు, క్షేత్రయ్య, త్యాగరాజుకు నడుమ వెలసి, బహుజన రంజకుడయిన వాగ్గేయకారకుడు.

## అధ్యాత్మ రామాయణం :

అంతటి ప్రతిభావంతుడయిన అధికారి కనుకనే, సుబ్రహ్మణ్యకవి— రామాయణగాథద్వారా అద్వైత తత్త్వమును బోధించే అధ్యాత్మ రామాయణమును కీర్తనలుగా రచించి ఆంధ్రదేశానికి అర్పించాడు.

అక్షరం బ్రహ్మ పరమం స్వభావో ధ్యాత్మ ముచ్యతే—
బ్రహ్మ సత్యం జగన్మిథ్యా—జీవో బ్రహ్మైవనా పరం—

క్షరాక్షర రూపమైన దేహమునందు అధ్యాత్మము అక్షరమనీ, దేహము అధిభూతమనీ గీతలందూ, ఉపనిషత్తులందూ వివరింపబడింది. దేహధారులకందరికీ చైతన్యకారణమయిన జీవాత్మ పరమాత్మకంటె అన్యముకాదనే అద్వైత తత్త్వమును — బోధించుజ్ఞానము అధ్యాత్మ జ్ఞానము, రామాయణ నాయకుడైన రాముడు అట్టి పరమాత్మ స్వరూపు డయినప్పటికీ, దేహధారియై అవతరించి, లోకవ్యవహారమనే మాయలో చిక్కుకొనికూడా: ఆత్మజ్ఞానము కలిగి దుష్ట సంహారం చేసిన వాడని నిరూపించినది అధ్యాత్మ రామాయణము. ఇది సంస్కృతంలో బ్రహ్మాండపురాణంలో మొదట ప్రసక్తమయినది. ఈ తత్త్వమును శివుడు పార్వతికి బోధించినట్లు బ్రహ్మాండపురాణంలోనే చెప్పబడింది. సంస్కృతాధ్యాత్మ రామాయణంలో వాల్మీకి రామాయణంలో వలెనే ఏడుకాండ లున్నవి. ఇతి ...హ్మణ్యకవి కృతమైన తెలుగు అధ్యాత్మములో ఆరుకాండలే — యుద్ధ ఇందులో గ్రంథం ముగుస్తుంది. అధ్యాత్మ రామాయణంలోని ఇతి వృత్తమూ, నమో భవా మొ తంమీద వాల్మీకి రామాయణంలోనివే అయినా, అక్కడక్కడ ...లో విచ్చలవిడిమార్పు లున్నాయి. వాల్మీకి రచించిన రామచరిత్రం ...మానవోత్తముని చరిత్ర. సామాన్య మానవునివలె ఆ రాముడుకూడా అనిగానికి దుఃఖిస్తాడు శత్రువుపై పగపడతాడు. కాని అధ్యాత్మమందలి

రాముడు పరబ్రహ్మస్వరూపుడు, సీత ఆదిమాయ, లేక అవిద్య, లేక ప్రకృతి స్వరూపిణి; ఇందలి రామచరిత్ర మంతా లీలా నటనము. ఇందులో అద్వైత సిద్ధాంతమే పరతత్త్వమనీ, శ్రీరామునిపై భక్తే భక్తి అనీ పరమేశ్వరు డంతటి వాడు పార్వతికి ఉపదేశిస్తాడు.

## ఇతివృత్తంలో మార్పులు :

రావణ సంహారమనే దేవకార్యం నిర్వర్తించడానికని పరబ్రహ్మస్వరూపుడైన విష్ణువు బ్రహ్మాదుల కోరికపై శ్రీరాముడై భూలోకంలో జన్మించి, ఆత్మస్వరూపాన్ని మరచి ఉండగా, ఒకనాడు నారదమహర్షి వచ్చి... నీవు రావణ వధార్థమై భూమిపై అవతరించావు, రేపు నీకు పట్టాభిషేకమయితే ఆ సౌఖ్యంలో కర్తవ్యాన్ని మరచిపోగలవు. జాగ్రత్త.... అని ప్రబోధిస్తాడు. అప్పుడు రాముడు ఆత్మజ్ఞానం కలిగి దేవకార్య నిర్వహణంకోసం అరణ్యవాసం చెయ్యడానికి నిశ్చయించుకొంటాడు. దేవతలు రామ పట్టాభిషేకం భంగంకలిగించాలని సరస్వతిని కోరగా ఆమె మంథరలో ప్రవేశించి, ఆమె చేత కైకకు దుర్బోధ చేయించి దశరథుని రామవనవాసము, భరత పట్టాభిషేకమూ అడిగేటట్లు చేస్తుంది. సీతారామ లక్ష్మణులు అరణ్యవాసంలో ఉండగా, రావణుడు సీత నెత్తుకొని పోతాడని రాముడు ముందే దివ్యదృష్టితో తెలిసికొని, సీతతో—నీవిక ప్రచ్ఛన్నురాలివై మాయా సీతను పర్ణశాలలో ఉంచమని... చెప్తాడు. అప్పుడు వాస్తవ సీత అగ్నిలో దాగి, మాయాసీతను పర్ణశాలలో వుంచుతుంది. రావణుడు మాయాసీతనే ఎత్తుకొనిపోగా, ఆ మాయాసీత కోసమే రాముడు లోక వ్యవహారరీత్యా వియోగ శోక బాధితుడై, రావణాదులతో యుద్ధం చేసి జయిస్తాడు. యుద్ధానంతరం మాయాసీత అగ్ని ప్రవేశం చెయ్యగా సత్య సీత అగ్నిలో నుంచి వెలువడుతుంది. జ్ఞాన పిపాసువులూ, ముముక్షువులూ అధ్యాత్మరామాయణమును నిరంతరం పారాయణం చేస్తారు. సీతారామాంజనేయ సంవాదం అని తెలుగులోకి కూడా వచ్చిన వేదాంత తత్త్వ చర్చ అధ్యాత్మ రామాయణంలోనిదే. అధ్యాత్మంలోని ఉత్తరకాండలోని ఐదవ అధ్యాయానికి రామగీత అని పేరు. అందులో రాముడు లక్ష్మణునికి అద్వైత వేదాంతమును, ఏది పరబ్రహ్మ స్వరూపమో అదే నీవు.... అనే తత్త్వమసి సిద్ధాంతమును బోధిస్తాడు.

ఈ రామగీత కల ఉత్తర కాండాన్ని సుబ్రహ్మణ్య కవి తెనిగించలేదు. అధ్యాత్మ రామాయణాన్ని కొణాద పెద్దన సోమయాజి, కంచర్ల శరభయ్య, దూర్వాసుల రామయార్యుడు, కోటంరాజు నాగయామాత్యుడు బహుశా అందరూ సుబ్రహ్మణ్యకవి కిటీవలివారే తెలుగులో పద్యకావ్యములుగా రచించారు. సుబ్ర

హ్మణ్య కవికి 100 ఏళ్లు ముందు మైసూరులో (1600-'23) చెన్నపట్టణం నిర్మించి విజయనగరపు వేంకటపతిరాయల సామంతుడై ఏలిన ఇమ్మడి జగదేవరాయలు సంగీత సాహిత్య విద్యా చతురుడు, అధ్యాత్మరామాయణమును తెలుగు చేశాడు. వీరుకాక, ఆధునిక యుగంలో అధ్యాత్మ రామాయణమును పిసుపాటి నారాయణ శాస్త్రిగారు తెలిగించారు. గుండు అచ్చమాంబ, మామిడన్న, సుభద్రమ్మగార్లు ద్విపద కావ్యముగా చేశారు.

## కాండములు, ఇతివృత్త వివరణము :

బాలకాండము : 17 కీర్తనలు. కవికృత శివస్తుతి : పార్వతీదేవి తనకు కలిగిన రామజీవితాత్మకమైన సంశయములను నివారించమని ఈశ్వరుని అడుగగా సీతారామమారుతి సంవాదంలో సీత శ్రీరాముడు ఆంజనేయునికి బోధించిన రామావతార తత్త్వారమును శివుడు పార్వతికి వివరిస్తాడు. శ్రీమన్నారాయణునికడ బ్రహ్మాదుల వేడుకోలు; దశరథపుత్రకామేష్టి, రామాదుల జననం, విశ్వామిత్ర యాగరక్షణం, అహల్యాశాపవిముక్తి, సీతాకల్యాణం, పరశురామ గర్వభంగము.

అయోధ్యాకాండము : 9 కీర్తనలు. నారదాగమనం; రామునికి ఆత్మజ్ఞానమూ, అవతార కర్తవ్యమును జ్ఞాపకముచేసి, రావణవధాప్రతిజ్ఞ చేయించడము పట్టాభిషేక ప్రయత్నాలు; కైకవరాలు; సీతారామలక్ష్మణుల చిత్రకూటగమనం; దశరథ మృతి, భరతాగమనం; పాదుకా పట్టాభిషేకం; దండకారణ్య ప్రస్థానము.

అరణ్యకాండము : 11 కీర్తనలు. విరాధవధ; మున్యాశ్రమాతిథ్యం; రావణ మారీచుల కుట్ర; మాయలేడి; రాముడు సీతతో మాయాసీత నుంచి అంతరితవు కమ్మని చెప్పుట; మాయా సీతాపహరణం; జటాయుదర్శనం; జటాయుకృత రామస్తుతి చూర్ణిక; జటాయు కైవల్యం; శబరీ మోక్షం.

కిష్కింధాకాండము : 10 కీర్తనలు. సుగ్రీవ సఖ్యం; దుందుభి వధ; సప్తతాలకృంతనం; వాలి వధ; తారావిలాపం; సుగ్రీవ పట్టాభిషేకం; రామ విరహం; సీతాన్వేషణం, వానరులు నలుదిక్కులకు పోవుట; హనుమత్సంపాతి సమాగమం; సంపాతి జ్ఞానోపదేశం; హనుమల్లంకా యాత్ర.

సుందరకాండము : 10 కీర్తనలు. సింహికాలంకిణుల వధ; హనుమంతుని లంకాప్రవేశం; అశోకవన దర్శనం; సీతారావణ సంవాదం; త్రిజటా స్వప్నం, హనుమత్సందేశం; సీతమ్మ ఆనవాళ్ళు; హనుమంతుడు బ్రహ్మాస్త్ర బద్ధుడగుట; రామునిచేరి చూడామణి నిచ్చుట.

యుద్ధకాండము : 47 కీర్తనలు. రావణుని మంత్రిగోష్ఠి; కుంభకరుడు, విభీషణుడు, రావణునికి రామునితో వైరం తగదని బోధింప, రావణుని ఆగ్రహం; విభీషణుడు అన్నను విడిచి రాముని చేరుట; రావణుని ఆజ్ఞపై శుకుడను రాక్షసుడు సుగ్రీవుని వద్దకు రాయబారంవచ్చి యుద్ధం తప్పదని తెలిసికొనుట; సాగర విధేయత; సేతు నిర్మాణము; శుకుని హితవచనాలు రావణుడు నిరసించుట; ఇంద్రజిత్తు యుద్ధం; అంగదుని పోరు; అతికాయుయుద్ధం; రావణుని యుద్ధము; లక్ష్మణమూర్ఛ; సంజీవని, కుంభకర్ణునికి మేలుకొలుపు, యుద్ధము, మృతి, ఇంద్రజిద్వధ; రావణుని అభిచారహోమానికి వానరసైన్యం విఘ్నం కలిగించుట, రామరావణ సంగ్రామం; రావణవధ; విభీషణ పట్టాభిషేకం; మాయా సీత అగ్నిప్రవేశము; పుష్పక ప్రయాణం; భారద్వాజాతిథ్యము; అయోధ్యాప్రవేశం; పట్టాభిషేకం.

## సాహిత్య శిల్పము :

అన్నీ కలిసి మొత్తం 104 కీర్తనలు, ఇంచుమించు అన్ని కీర్తనలూ అనుప్రాసలతో కూడి శృంగార రసాత్మకమైన విశేషణాలతో శివుడు పార్వతిని సంబోధించి రామకథను వినిపిస్తున్నట్లుండే పల్లవితో ప్రారంభిస్తాయి. మనోహరమైన కొన్ని పల్లవులు—

1. వినవే శర్వాణి అలివేణి నీరజపాణి
2. వినుము ధరావర తనయా ధృతవినయా సరసగుణాభినయా
3. అందముగ నీ కథ వినవే రజతాచలసదనా, పరిహసిత
   వినిందితారవింద చంద్రవదనా కుంద బృంద సుందరరదనా.
4. చేరీ, వినవె శౌరిచరితము గౌరీ, సుకుమారి గిరివరకుమారీ
5. చికురనిందితాళీ రణకేళీ జిత మదాసురాళీ నిలయీకృత
   సకల భువనపాళీ, లలనా జనకకాళీ, కాళీ, వినవే
6. కలికీ అలరులములికీ, చిలుకలకొలికీ, వీనులసుధ జిలికీ కథ వినవే
7. ఇంతీ, చెంగల్వపూబంతీ, చెలువల మేల్బంతీ, గుణములదొంతీ వినవే
8. వినవే ఘనవేదాంత వనపాలికా, దివ్యమణిమాలికా, బాలికా ।

అధ్యాత్మ రామాయణము భక్తి, వేదాంత ప్రధానమైనా, సుబ్రహ్మణ్యకవి తన కథాకథనంలో శృంగార రసాత్మకమైన మనోహర పదజాలాన్ని పై మాదిరి పల్లవులలోనే కాకుండా, కీర్తనలలో చాలా చోట్ల అవకాశం చిక్కినప్పుడల్లా అనుసంధిస్తూనే వచ్చాడు. భక్తితత్త్వ ప్రబోధితులయిన పోతనాది మహాకవులు పోయిన మార్గమే అది. (రామజనన ఘట్టంలో—శ్రీరాముని గాంచెను అన్న శంకరాభరణ రాగకీర్తన—

శ్రీరాముని గాంచెను, పార్వతీ వినవె మన కౌసల్య ఆత్మారాముని గాంచెను
తోరమై హర్షాశ్రుపూరము కన్నుల,
జార, భయసంభ్రమ మాశ్చర్యము ల్చెనగొనగా
అల నల్లరేకుల చాయమేనిచే, చెలగువాని పసిడిచేలగట్టినవాని
వెలయు నాల్గు భుజములవాని కనుగొల్కుల నరుణరేఖలు కలవాని స్వర్ణకుం
డల లసిత గండమండలములవాని యస్ఖలితరవికోటి ప్రకాశుని రత్నో
జ్జ్వలకిరీటమువాని అళినీలకుటిల కుంతలములచే ముద్దుకులుకుచుండెడువాని–

* * *

రాముని సకల గుణాభిరాముని........అనే ముఖారిరాగంలోని కీర్తనలో శ్రీరాముని శైశవలీలలు ; కౌసల్యా దశరథుల లాలింపులూ తేట తెలుగు మాటలతో సహజ రమణీయమైన దృశ్యాలను కన్నులకు కట్టేటట్లు వర్ణించాడు.

చెలగి సౌమిత్రితోగూడ మెలగుచు తేనియలొలుక
బలుకు సుతుని నృపుడు గాంచి, భూషణ జాల
ములతోడ నలంకరించి, కస్తురి
తిలకము నుదుటనుంచి, గళమున రత్న
కలిత హారములు కీలించి, ముద్దాడునపుడు
కలకల నవ్వుచు మద్ది కాయలల్లాడ నందియలు
ఘలుఘలుఘల్లనుచు మ్రోయ లలితగతుల నటియించు....
చిన్నారిబొజ్జలో నన్ను, గన్నవాడా నా పాలిటి
పెన్నిధానమ రారా, ఓరి నా చిన్ని
అన్న బూచివచ్చె రారా, పరుగెత్తవల
దన్న నాతో నలుగ మేరా, పాటబాడుచు
నిన్ను లాలియూచే రారా, లాలబోసెను
మిన్ను చేతనంటవద్దు వెన్నబెట్టేననుచు చాలా
మన్నించి పలుకు కౌసల్యకు మరులు రెట్టింపజేయు....
ధరణీ విభుడు భుజియించుతరిని కౌసల్యా తనయుని
మురిపెమున రమ్మనుచు జీర, వరయోగి హృదయాం
తరమునందు చెల్వుమీర, వసియించుదేవుడు
చిరుతవాడయి ముద్దుగాక, వచ్చిన జూచి
తరుణీ తనదు కోర్కెలుమీర, కౌగిటనుంచి
కరుణించి భుజియించుమనిన కబళము చే నందుకొని
తిరుగా నాటాలాడ పరుగెత్తిన మాయాబాలకుడౌ...

* * *

సీతాస్వయంవర సందర్భంలో జనకుని కొలువుకూటంలో సీతాప్రవేశ వర్ణనం కూడా ఇంత మధురంగాను, లలితమైన తెలుగుపదాలతో అందమైన భావాలను కలిగిస్తుంది (వినీలవేణి అనే బేగడరాగ కీర్తనలో)

పట్టుచీరకట్టి గటిరవికను కట్టుదిట్టముగ గట్టి మృగమదము
బొట్టు నుదుటనునిచి కనుల కాటుకబెట్టి కురులుడుప్పి చట్టముగా
కీల్కొడివైచి మరిన్
మట్టుమీర వేడుకచే సరములుదుట్టి స్వర్ణభూషణములు మేనను
దట్టముగాపూని యొక్కచెలి కేల్ పట్టి జనకునిపట్టి శౌరికి
పట్టంపురాణి నౌదు నేనని బాళితోడ కుందనపు బొమ్మవలె
నెట్టన రాజమరాళకరిగతుల నెరా నిరాకరింపుచునడిచెను...(వినీల)
తాటంకద్యుతి ఓక్కులనెల్లను, దీటుకొనగ పాపటబొట్టును సరి
సాటిలేని చంద్రసూర్యులను సయ్యాటమునను మెరయ,
తేటపు ముత్యపుసరులు పతకములు మేటిచిలుకతాళితోడ బెనగొన
మాటికినందెలు ఘల్లని మ్రోయగ దీటులేని వైఖరిని సీతావ
ధూటి గుణములపేటి హారకిరీటాది భూషణాఢ్యు శేషగి
రీశు రామ భూవిభునిచేరి మణిహాటకమయమాలిక గళమున నిడి
హరిన్ వరించితినని చనె ముదమున... (వినీలవేణి)

కథాఘట్టములను, పాత్రలను సూటిగా వర్ణించేటప్పటి శైలికి పైకీర్తన భాగము ఉదాహరణములు. అధ్యాత్మతత్త్వము బోధించే పట్టులలో సుబోధకమైన సంస్కృతసమాసాలతో సాగిపోతాయి. చరణాలు. వినుమని శ్రీరాముడు తాబలికెను...అను సావేరి రాగ కీర్తనలో ఆంజనేయునికి రాముడు జ్ఞానబోధ చేసే ఘట్టము.

సమతను ఆత్మానాత్మపరాత్మల జాడలు త్రివిధములు పవనజా
మమతాహంకార కర్తృత్వముల నమరి నయ్యది యాత్మ
రమణ నన్నృత జడదుఃఖములను నీరసమయినది యనాత్మ, నిత్యము
విమలము సత్యజ్ఞానానందాత్మిక మిదియెపరాత్మ.

... ... ...

చెలగు నవిచ్ఛిన్నత బ్రహ్మము విచ్ఛేదము కల్పితము కావున
అలభిన్నునకు పూర్ణాత్మకు నైక్యమువలనను సుజనులచే
అలఘు తత్త్వమస్యాది మహావాక్యములచే ప్రకటమై, అలరెడు
వెలయగ నైక్యజ్ఞానముకల్గనవిద్య మాయమౌను; గుణములతోను....

సుతీక్ష్ణుడను మునీశ్వరుడు శ్రీరాముని పరబ్రహ్మమూర్తిగా స్తుతించే ఘట్టంలో – పినులవిందుగను వినవే యీచరిత మిమ్ముగను....అనే కీర్తనలోని చరణాలు: సుతీక్ష్ణుని భక్త్యావేశమునూ, ఆధ్యాత్మికజ్ఞాన గాంభీర్యాన్నీ ప్రకటించడానికి వీలయిన చిక్కని సంస్కృత సమాసాలతో సాగుతాయి.

పరమేశ ప్రకృతికి పరుడవౌ నీదివ్యచరణములంటి దృక్స్వాంతములకు గో
చరుడవు కావైన హరినీనామస్మరణ పరమతుల కెపుడు గనుపట్టుదువనెమౌని॥
రూపాద్యుపాధిదూరుడవైన మాయానటనాపాదితమౌ నీమానవరూపము నిది
గో పొడగంటి స్మరకోటి సుందరము శరచాపాన్వితము కరుణాశ్రయనేత్ర
యనెను ముని

.... .... ....

దేశకాలకర్మాతీత విజ్ఞానమఖిలేశ నీరూపమతిహిత మమలము
నాశరహితము స్వప్రకాశము నిఖిలావకాశముచిద్ఘనాకాశమనిపొగడెముని...

ఈ అధ్యాత్మ రామాయణములో నాలుగో, ఐదో,పూర్తిగా సంస్కృతంలో రచించిన కీర్తన లున్నాయి. జటాయువు మరణించేముందు చేసిన రామస్తవం చూర్ణిక అనబడే సంస్కృత గద్యప్రబంధం.

శ్రీమదగణిత గుణమణిగణాలంకృత రుచిరచిరతర శుభస్వరూపం, సకల జన భయావహ మహదజ్ఞాన జనిత కలకలుషాంధతామిస్రనివారకభవతారక దీపం....అనుపమాద్భుత మహత్ప్రతాపం, హతదీనజనతా మనస్తాపం. కరధృత విదితామోఘ శరచాపం—ఇత్యాది.—చూర్ణిక.

1. శ్రీ జగన్నాథ హేరఘువర దయానిధే (శ్రీజగ)
   ఓజసాతేజసాభ్రాజసే త్వన్నమో హరే (శ్రీజగ)

ఇది యుద్ధకాండంలో దేవమునివరులు చేసిన రామస్తుతి. పూరిరాగం.

2. వందేవిష్ణుం విష్ణుమశేషస్థిత హేతుం
   త్వా మధ్యాత్మజ్ఞానిభి రంతర్హృది భావ్యం.

ఇది బ్రహ్మకృతమైన రామస్తుతి. రామదాసు కీర్తనలతో హరికథలుగా రచించినవారు ఈ కీర్తనను కూడా అందులో చేర్చి, ఇది రామదాసుదా అన్న భ్రమ కల్పించారు. అయితే, మిగిలిన తెలుగు కీర్తనలలోను, సంస్కృత కీర్తనలలోను సుబ్రహ్మణ్యకవి చివరి చరణాలలో వాడుకొన్న శేషగిరీశముద్రా ఈ కీర్తనలో లేదు. శ్రీ జగన్నాథ అనే కీర్తనలో ఆ ముద్ర ఉన్నది.
పున్నాగవరాళి రాగంలోని —

భజేహం భవాని హృదాభావితం బుధసేవితం
నిజాశ్రిత భవ దవానల వినిర్మల నామధేయం

ఇత్యాదిగా రచించిన కీర్తనలో శేషాచలాధీశముద్ర ఉన్నది.

గ్రంథాదిని ఉన్న ధన్యాసిరాగ కీర్తన—

నమశ్శివాయ - తే నమో భవాయ
సమానాధిక రహితాయ శాన్తాయ స్వప్రకాశాయ
ప్రమోద పూర్ణాయ భక్తౌఘపాలనాయ (నమశ్శివాయ)

ఈ కీర్తనలోనే నాల్గవ చరణంలో కాళహస్తీశ్వరాయ అనిన్నీ, ఐదవ చరణంలో శేషశైలాధీశ మిత్రాయ అనిన్నీ - సుబ్రహ్మణ్యకవి తన వాసస్థలమైన కాళహస్తిలోని ఈశ్వరుని గురించిన ప్రార్థనతో గ్రంథాన్ని ప్రారంభిస్తూ చేసిన కీర్తనలో ఆయనను శేషశైలాధీశమిత్ర అని పేర్కొని, తన ముద్రా నియమం కూడా పాటించుకొన్నాడు.

ఈ రామాయణంలో చాలాచోట్ల వారును, వీరును రాముని స్తుతించారు గాని, అహల్య చేసిన స్తుతిలో శరణు శరణని రామచంద్రుని అహల్య సన్నుతించెను వినవే అన్న కీర్తనలో....నీ చరణ నీరజపరాగమునను దురిత మెల్లను తొలగె నహహా గరిమతోను కృతార్థనైతి జగత్ప్రభో కమలావిభో .... అని అనుపల్లవిని ముగించి....ఏ విభు పాదరాజీవరేణువులచే పావనమైనది భాగీరథి .... అన్న చరణంలో భక్తిరసం పరమావధిని చెందుతుంది. శ్రీ రఘువర నీలీల లద్భుతములు అనే చరణంలో రామావతారతత్త్వాన్ని ప్రకటించాడు. జటాయువుచేసిన స్తుతిలో సంస్కృతసమాసాలు అప్రయత్న ధారాప్రవాహంగా సాగి భక్త్యావేశాన్ని గగుర్పాటునూ కలిగిస్తాయి.

## సుబ్రహ్మణ్యకవి పదాలు :

తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారి 'భారతి' వ్యాసములో దామెర్లవారి పదములు ఈ సుబ్రహ్మణ్యకవి రచనలే అని పేర్కొన్నారని - ఈ వాగ్గేయకారుని దేశకాలనిర్ణయం చేసినప్పుడు చెప్పుకొన్నాము గదా. వారు తమ పరిశోధనా వ్యాసంలో తొమ్మిది పదాలు ఉదాహరించారు. ఆ పదాలు దామెర్ల కుమార వేంకటేంద్రునీ, అతని కుమారుడైన కృష్ణస్వామినీ, కాళహస్తీశ్వరునీ, అగస్త్యనాథునీ నాయకులుగా చేసి చెప్పినవి. ముఖారి రాగపదం-కుమార వేంకటేంద్రుని గురించి చెప్పినది.

పల్ల : మనసు వచ్చితే రమ్మనవే దామరల కుమార వేంకటేంద్రుని
అ. ప: వనితరో చెలగుచు పరిపరిగతులను బహుబంధంబుల పెనగుదును నాసామిని
చ : సదయుడవని మ్రొక్కి సారెకు వానిపై పదములు వినిపింతును.
మదిరాక్షినాసామి మది, రా, నడచి, దక్కి, మనవి అంతయు తెల్పుదు

మృదుపాదములు తమకమునను వాని తొడలమీద నుంచుకొందును
కుదురుగ బాగా లొసగి ఆకుమడుపును నేకొరికి సగమందింతును–నాసామిని
కోరికలిమ్మని కురులచే కట్టుదు కొట్టుదు విరిసరుల;
తీరైన మన్నెహజూరు డనుచు వెరచి ఊరకె నేనుండను;
ఔర మంచిదికాని–లేరా ఓరియని నేరము లెన్నుదును;
పేర బిలి చొకసారి పెనగొందు నొకసారి
పెనగొందు, పైకొందును–నాసామిని (ఇలాగే 5 చరణాలు)

సావేరి – త్రిపుట

ప॥ నృపశిఖామణి వౌరా,

అ॥ ప॥ విపులశ్రీ దామరల వెంకటపజీరా...

చ॥ వగమీర తాళికై వజ్ర మడిగినను, నె
య్యొగ తమ్మి మాంజాళిపగది ముద్దాడేవు,
జిగిబన్న సరమునకు పగడంబు లడిగితే
పొగరతగు కన్ను చూపులనె తేలించేవు॥ ॥నృపశిఖా॥
కొదమ పుంగోరునకు గోమేధిక మడిగితే
వదరకని పరమ పావనత జూచేవు
పొదలు మేఖలకు నిను పుష్యరాగ మడిగితే
మదికుచగిరిక్షేత్ర మహిమ గొనియాడేవు....॥
వెలయు కమ్ములకు కురువిందమణు లడిగితే
లలిత రాగము లెచ్చి కలియగూడేవు
వెలలేని మాణిక్యములు నీ గుణము లెన్న
గలనె కుమార వెంకట సార్వభౌమ॥

ఆనందభైరవి (పురుషవిరహం)

ప॥ చెలియ యీ విరహ మగ్గలమాయె నెవ్వొరు
చెలిని తోడితేవె....

అ॥ ప॥ చెలగి చంద్రుడు కాయగ నెలమి మరుదేయగ
చిలకలు గూయగ, అళులు రొదసేయగ...

... .... ....

చ॥ సరసముకోరి నా సరణి వీణమీటుచు సరసగతుల వాయించుచు,
భరత ప్రౌఢిమీర భావజ్ఞుడె ధర వెలసిన శ్రీ దామెర వెంకట
ధరణిపాలుని తనయా కృష్ణాయని నను గూడె....

ఈ ఆనందభైరవి పదం పల్లవి, అనుపల్లవులకూ, క్షేత్రయ్య రచించిన ఆహిరి రాగంలోని యీ క్రింది పదానికీ కొంత పోలిక ఉంది. అయితే పైది పురుష విరహం. క్రింది పదం స్త్రీ విరహాత్మకం.

ఏమి సేతునే ఓ యమ్మ నే నేమి సేతునే
ఏమి సేతునే వెన్నెల కాకల ఎట్లోర్తునమ్మా....॥
కలకలరవములు చిలుకల పలుకులు
సొలపులు నామీద ఝల్లుఝల్లు మనెనే
అళులచే నళుకుచు సొలపుల వలచితి
తెలతెల్ల వారదే చిలుకల కొలికి....॥
మింట చందురుడు నన్నంటి కాయుగాక...ఇత్యాది.

పైవి కాక, ఆనందభైరవిలోనే – అంతటి విలుకాడననుచు సంతతము కలహము సేయుచున్నాడే యేమిసేతు నమ్మలారా – అని ఒక పదమూ–నిందెపయి నిందలుపుట్టెను, ఇందుకేమిసేతు–అనే ఇంకొక పురుష విరహపదమూ, కళ్యాణి రాగంలో కాళహస్తీశ్వరుడు నాయకుడుగా ఒక పదమూ, ఆహిరిరాగంలో అనన్యనాథు డనుపేర వెలసిన మరొకదేవునిపై మరొక పదమూ, కేదారగౌళలో ఇంకొక పదమూ, సుబ్రహ్మణ్య కవికృతములైన వాటిని కోదండరామయ్యగా రుదాహరించారు.

సుబ్రహ్మణ్యకవి స్వతహా గొప్ప ఆధ్యాత్మికతత్వవేత్తా భక్తినిష్ఠాగరిష్ఠుడూ ఆయినప్పటికీ. జీవితంలోని శృంగారమునూ, సృష్టిలోని సౌందర్యమునూ అనుభవానికి తెచ్చుకొన్నవాడేననీ, శృంగారరసనిష్యందియయినమధురభావసంపదా లలితపదజాలమూ అతనికి కరతలామలకములే అని పై పదాలనుబట్టేగాక,ఆధ్యాత్మ రామాయణంనుంచి పైని ఉదహరించుకొన్న కీర్తనభాగములనుబట్టి కూడా స్పష్టంగా తెలుస్తుంది. తనను ఆచార్యపీఠాన ఉంచి గౌరవించిన కాళహస్తి పాలకుల కోరికపైని కొన్ని పదాలుకూడా వ్రాసిపెట్టి, వాటితోపాటు ఆశీఃపూర్వకంగా తనకు తానుగా దైవాంకితంగా రచించుకొన్న రామాయణ కీర్తనలను కూడా దామెర్లవారికి ఇచ్చిఉంటాడు.

ఇతని పదరచనలోని పోకడలు కొన్ని యథాలాపముగా ఉన్నా. కొన్ని క్షేత్రయ్య పోకడలకు అత్యంతము సమీపంగా ఉన్నవి. ఇతడు క్షేత్రయ్య పదాలను బాగా వినిగాని, పాడుకొనిగాని ఉండవచ్చును. ఇప్పటిమటుకు 1730 – 1780 ప్రాంతములో ఉన్నవాడని నిర్ణయించినందున ఇతడు క్షేత్రయ్యకు దాదాపు 100 ఏళ్ళు ఇటీవలివాడని తేలుతుంది, అంతకు ఇంకా ముందరివాడేమో అనీ. క్షేత్రయ్యకు ఇంచుమించు దరిదాపులోనివాడేమో అనీ రచనలనుబట్టి అనిపిస్తుంది. ఈ విషయం ఇంకా పరిశోధించతగినదే. దానికి ముఖ్యసూత్రం తిమ్మభూపాలుని

కుమారుడైన వేంకటభూపాలుడు. అతని కుమారుడు కృష్ణస్వామి యీ ముగ్గురి పేర్లు కాళహస్తి దామెర్లవారి వంశంలో ఎక్కడెక్కడున్నారో చూచి తేల్చవలసిన విషయం. 1780 నాటికి ఒకసారి కనిపించిన యీ పేరులే అంతకు ముందు తరాలలో 17 వ శతాబపు చివరిభాగంలో కూడా కనిపించినట్లున్నూ, కాని, అన్ని వివరాలూ సరిపోలేదనీ కోదండరామయ్యగారు వ్రాశారు.

## సంగీత రచన :

సుబ్రహ్మణ్యకవి పదాలు ఈ మధ్యనే లభించిఉండటంచేత వాటిపైని సూచించిన రాగాలుతప్ప, అవి పాడతగిన స్వరసంపుటినిగురించి మన కేమీ తెలియదు. పరంపరాగతంగా వాటిని పాడుకొంటున్నవా రెవరైనా కాళహస్తి ప్రాంతాలలో ఉన్నారేమో పరిశోధించవలసిన విషయం. అయినా రాగాలనుబట్టి, పదాల కూర్పునుబట్టీ వాటిని పాడేతీరు, దరిదాపుగా క్షేత్రయ్యపదాలను పాడే తీరుకు దగ్గరగా ఉండవచ్చునని ఊహించవచ్చు. క్షేత్రయ్యనాడే ఏర్పడిన కీర్తన పదపరిణామలక్షణాలప్రకారం ఇతని పదాలలోను, రామాయణ కీర్తనలలోను కూడ పల్లవికి తోడు అనుపల్లవి యేర్పడి, చరణాలు మూడో, ఐదో, ఏడో ఇంకా యెక్కువగానో ఉంటూవచ్చాయి. అధ్యాత్మరామాయణ కీర్తనలు బహుశా సుబ్రహ్మణ్యకవినాడే ప్రచారంపొంద నారంభించి, ఇప్పటికి సుమారు 25 సంవత్సరాలకు మునుపటివరకూ ఆంధ్రదేశంలో పలుచోట్ల సంకీర్తనాభ్యాసపరుల కుటుంబాలలోను, కొందరు గాయకులవద్దా గానపాఠం వినిపిస్తూండేవి. అన్నమాచార్యుల గేయాలు సంకీర్తనాత్మకములు, క్షేత్రయపదాలు అభినయాత్మకములు కాగా, సుబ్రహ్మణ్యకవి కీర్తనలు ఆఖ్యానాత్మకములు – అంటే ఒక వ్యక్తి కథ చెప్పుతున్నట్లుగా కీర్తనలను గానముచేసుకొనిపోవుట.

ఈ కీర్తనల ఆఖ్యానాత్మకశైలికి అనుగుణంగా ఆది, అట, జంపె, త్రిపుట, రూపకతాళాలలో ఆ కీర్తనలకు ఆ యా రసాలకు ఉచితమైన ధాతుకల్పన చేశాడు సుబ్రహ్మణ్య కవి. కొందరు నేటి విద్వాంసులు ఇతని ధాతుకల్పన అంత విద్వత్పరిపుష్టము కాదనీ, ఇతడు కేవలము భజనగోష్ఠులకు పనికివచ్చు సంకీర్తనములను సులభశైలిలో చేసిన వాగ్గేయకారు డన్నట్లుగా భావిస్తారు. త్యాగరాజును గురించి అతని కాలపు విద్వాంసు లిటువంటి అభిప్రాయమునే వెలిబుచ్చగా, అతడు జగదానందకారక మున్నగు ఘనరాగ పంచరత్న కీర్తనలను చిట్టస్వర సాహిత్యంతోసహా రచించి, తన ఘనత నిలుపుకొన్నాడు. రామాయణ కీర్తనలను వివరంగా చదివినవారికైనా, పాడగా వినినవారికైనా ఆ కీర్తనలలో చాలమట్టుకు– చరణనిర్మాణము చిట్టస్వర సాహిత్యములాగే చౌక, మధ్యమ కాలగతులలో సాగి, సాహిత్యముతోనే చివర ముక్తాయింపులు వేసుకొని తిరిగి పల్లవికిపోయే ప్రౌఢ

రచన గోచరిస్తుంది. వేదాంతబోధనపు బరువుతో, కథా కథనపు బాధ్యతతో పొడుగాటి చరణములను ఒక్కొక్క పాటలో ఏడెనిమిదింటికి మించి కూడా రచించిన సుబ్రహ్మణ్య కవి, ఆ చరణముల రచనాపద్ధతిలోనూ, గానపద్ధతిలోను కూడా ఒక సౌలభ్యాన్ని ఏర్పాటుచెయ్యకపోలేదు. చరణము అనుప్రాసలతో అంత్యప్రాసలతో ఖండాలుగా తెగి, ఖండఖండానికీ ఒకేమాదిరి ధాతువు తిరిగి తిరిగి వచ్చి, పై కాలంలో చివరి ఒకటి రెండు ఖండాలు రాగంలో పై స్థాయి నంతటినీ చుట్టుకొనివచ్చి ముక్తాయింపుతో చరణం ముగిసి పల్లవి అందుకొంటుంది. కొన్ని కీర్తనలలో తధిగిణతోం మొదలగు శబ్దాలు (సొల్లుకట్లు) కూడా అతని లయపాండిత్యాన్ని చాటుతాయి.

## రాగప్రయోగం :

రామాయణ కీర్తనలు నూటనాలుగింటికీ దాదాపు 58 రాగాలు వాడబడాయి. లభించిన క్షేత్రయపదాలలో మున్నూటికీ 36 రాగాలే వాడబడ్డాయి. క్షేత్రయ్యనాటి మోహన, ఈ కీర్తన రాగాలలో కనబడదు. అన్నమాచార్యులనాటి కర్ణాటసారంగ, మంగళకౌశిక, లలితపంచమం, గౌరి, కన్నడగౌళవంటి ప్రాచీన రాగాలలో కీర్తన లున్నాయి. ఇందువల్ల సుబ్రహ్మణ్యకవి క్షేత్రయ్యకు ఇంకా దగ్గరవాడు మాత్రమే కాక కించిత్పూర్వుడు కాగలడా అనికూడ అనిపిస్తుంది. ఏమంటే, ఈ రాగాలలో గౌరినితప్ప మిగిలినవాటిని వేటినీ క్షేత్రయ్య వాడలేదు. క్షేత్రయ్యనాడే బహుశా ప్రచారంలోకి వచ్చి ఉంటాయని ఇంతవరకూ విద్వాంసు లనుకొంటూవున్న ఉసేనీ, కాపీ, ఆనందభైరవీ సుబ్రహ్మణ్యకవి కూడా వాడాడు. మాంజిరాగంలో ఒక కీర్తన అధ్యాత్మంలో ఉంది. గుమ్మకాంభోజి, హిందూఘంటా, అనే అపూర్వ రాగాలూ. అహిరి, రేగుప్తి భైరవి, ధన్యాసి, కాంభోజి, కన్నడ, గౌళిపంతు, శంకరాభరణం, నాదనామక్రియ, సౌరాష్ట్రి, కళ్యాణి, సురటి, పూర్వికళ్యాణి, యదుకులకాంభోజి, ఘంటా, మారువ, నవరోజు, జుజావంతి, పూరి, సారంగ, నాట, ఆరభి, శ్రీ, వసంత, పున్నాగవరాళి, సైంధవి, ముఖారి, బేగడ, బిళహరి, సావేరి, శహన, అఠాణ, ఫరజు, తోడి, దేవగాంధారి, దేశియదేవగాంధారి, కేదారగౌళ – సుబ్రహ్మణ్యకవి వాడిన ఇతర రాగాలలో కొన్ని. వాడిన తాళాలు : త్రిపుట, ఆది, రూపక, జంపె, చాపు.

ఇతని కీర్తనలలోని ధాతుకల్పన, పల్లవి యెత్తుగడలోనే రాగస్వరూపాన్ని స్పష్టంగా నిర్దేశిస్తూ, ఒక్కొక్క చరణములోను అందలి భావాన్ని అనుసరించి, ముందు చెప్పుకొన్న ప్రకారం, అనుప్రాసాన్వితమై తెగుతూ వినిపించే ధాతు ఆవర్తాలలో తిరిగి తిరిగి వినిపిస్తూ, చివరి ఖండాలతో రాగస్వరూపం మళ్ళీ పూర్తిగా నిర్దేశింపబడుతుంది. కొంచెం వ్యత్యాసంలో, ఇతని కీర్తనలలో కూడ

క్షేత్రయ్య పదాలలోవలెనే ధాతుమాతువులు రెండూ సమాన ప్రాధాన్యంకలిగి ఉంటాయి. ఆ వ్యత్యాసం ఏమిటంటే, వేదాంతభావముల భారంవల్ల కొన్ని కీర్తన లలో సంగీతరచనకంటే, సాహిత్యం ఎక్కువ పటిష్ఠంగా ఉన్నదా అనిపిస్తుంది. అటువంటి కీర్తనలలో ధాతుకల్పన కొంతవరకు సులభపద్ధతిలో ఉంటుంది.

విద్వాయకుల ఆదరం క్రమంగా తగ్గికాబోలు యీనాడు అధ్యాత్మ రామాయణ కీర్తనల గానపద్ధతి అప్రౌఢు లైనప్పటికీ, అభిమానంతో ఆదరించిన కొందరు వృద్ధ స్త్రీ జనం నోళ్ళలోను, మారుమూల గ్రామాల సంకీర్తనపరుల గొంతులలోను మిగిలి, క్రమంగా హరించుకపోవడానికి సిద్ధంగా ఉన్నది. ఆంధ్ర దేశంలో పుట్టి, పెరిగి పాదుకొన్న, ఆంధ్రులను ఆబాలగోపాలమును పాడించిన ప్రసిద్ధ వాగ్గేయకారుల కోవలో ఇంచుమించు చివరివాడు సుబ్రహ్మణ్యకవి. అతని కీర్తనల సంగీతాన్ని ఉద్ధరించుకొనడము వరదలో మునిగిపోనున్న నాగార్జున శిల్పకళాఖండాలను ఉద్ధరించుకొనడంవంటిదే. ఎక్కడో దక్షిణాదివారి బాణీనో, ఉత్తరాదిబాణీనో అనుకరించడంతప్ప, ఆంధ్రులకు సొంత సంగీతం లేదనుకొనే వారందరికీ—అన్నమాచార్యులతో ప్రారంభించి, సుబ్రహ్మణ్యకవి వరకూ జరిగిన అధ్యాయాలలో మనము స్మరించిన వాగ్గేయకారులందరి జీవితములూ సరియైన ప్రత్యుత్తర మియ్యగలవు.

పదిహేనవ అధ్యాయము

# యక్షగాన, పదకర్తల స్వర్ణయుగం
# 1600 – 1850
# నాయకరాజులు - సమకాలికులు

సంగీత సాహిత్య చరిత్రములు వ్రాసేటప్పుడు కాలంలో కొన్ని కొండ గురుతులు పెట్టుకొని, ఆ యా గురుతుల నడుమ ఆ యా పరిణామాలు సంభవించా యని స్థూలంగా నిర్దేశించుకొనడానికే యుగవిభజనం సహాయపడుతుంది. కాని, యీ క్రమపరిణామంలో ఒక యుగపు లక్షణాలు మరొక యుగంలోనికి చొచ్చు కొనిపోతూ, ఆ రెండవ యుగంలో మరొక మూడవ యుగపు కొత్త లక్షణాలు తలచూపుతూ ఉంటాయని నాల్గవ అధ్యాయం చివర చెప్పుకొని ఉన్నాము. సంకీర్తన యుగమని చెప్పుకొన్న 15, 16 శతాబ్దాలలో, 16 వ శతాబ్దపు మొదటి సగంలోనే యక్షగాన రచన ప్రారంభమైందనికూడా ముందు అధ్యాయాలలో తెలిసింది. ఆ యక్షగానాలు పరిపక్వదశకు వచ్చినదీ, తామరతంపరగా వర్ధిల్లినదీ 17, 18 శతాబ్దాలలోనే. 17 వ శతాబ్దంలో ధాతుకల్పనలో ముందంజ వేసిన పదరచన తరువాతివారికి మార్గదర్శియైన క్షేత్రయ్య చేతిలోనే పరమావధిని అందుకొన్నది అయిపోయిన నాలుగు అధ్యాయాలలో నారాయణతీర్థులూ, సిద్ధేంద్రయోగీ క్షేత్రయ్యా, సుబ్రహ్మణ్యకవీ వారి రచనలనుబట్టి. కాలాన్నిబట్టి ఈ అధ్యాయపు శీర్షికలో చర్చించుకొన తగినవారే అయినా, ఆంధ్రదేశ ప్రజల నిత్య జీవితంపైనీ, సంగీత సంప్రదాయాలపైనీ, పై నలుగురు వాగ్గేయకారులకూ గల అనల్ప ప్రభావాన్నిబట్టీ, వారిలో ఒక్కొక్కరికీగల ప్రత్యేక వ్యక్తిత్వాన్నిబట్టీ. వారి రచనల ఉత్కృష్టతనుబట్టీ, వారిని గురించీ వేరు వేరు అధ్యాయాలు చెప్పి, వారి సమ కాలికులలోను, వారి అనుయాయులలోను వాడుచూపిన మార్గాలలో ముందడుగు వేసిన వాగ్గేయకారులను గురించి యీ అధ్యాయంలో వివరిస్తున్నాము.

## చారిత్రక పరిస్థితి :

1565 లో రక్షసితంగడి (లేక తాళికోట) యుద్ధానంతరం విజయనగర సామ్రాజ్యపీఠం విజయనగరం వదిలి సదాశివరాయ, తిరుమలరాయల ఆధ్వర్య

ములో చంద్రగిరికి మార్చబడింది. అంతవరకు విజయనగర సామ్రాట్టు ఆధిపత్యంలో రాజప్రతినిధి దండనాధులుగా తంజావూరు, మధుర, చెంజి, మైసూరు ప్రాంతాలలో పరిపాలిస్తున్నవారిని అమర నాయంకరు లనేవారు, ఈ అమర నాయంకరులలో చాలామంది సామ్రాజ్యపీఠం చంద్రగిరికి మారిన నాటికి, సామ్రాట్టుల బలహీనతను గమనించి, తమ్ము తాము స్వతంత్రులుగానో, సామంత ప్రభువులుగానో ప్రకటించుకొని, క్రమంగా విజయనగర రాజులకు దాసోహమ్మనుట మానుకొన్నారు. ఉత్తరాన గోల్కొండ విజాపురాలలో ఉండిన బహమనీ సుల్తానుల దండయాత్రల వేడి – విజయనగరరాజులకు చంద్రగిరిలో విడిసినా, తగలక తప్పలేదు. అందుచేత అంతకంటే దక్షిణాన వెలసిన తంజావూరు మధుర నాయక రాజులు స్వతంత్రులై, నిశ్చింతగా పరిపాలన చేసికొంటూ చెక్కుచెదరని భోగభాగ్యాలతో సంగీత సాహిత్య కళలను పోషిస్తూ కృష్ణదేవ రాయల సాహిత్య భోజత్వమునకు వారసులైనారు. వీరి పోషణలో యక్షగానం క్రొత్త అందాలు తిర్చుకొని రాజాస్థానములోకూడ రంగస్థలాన్ని నెలకొల్పుకొన్నది. రాజులుకూడ యక్షగానకర్తలైనారు. రాజులలో, కవులలో, గాయకులలో శృంగారభావాలు వెల్లివిరిసి, భరత కామశాస్త్రములకుకూడ ప్రామాణిక లక్ష్యరూపములయిన పదాలను విరివిగా రచించారు.

# తంజావూరు సారస్వత కేంద్రం – నాయక రాజులు

## అచ్యుతప్పనాయకుడు :

తంజావూరు నాయకరాజ్యము చిన చెవ్వప్పనాయకుని ఏలుబడిలో స్వతంత్రమైనది. అతని కుమారుడైన అచ్యుతప్పనాయకుడు 1580నుంచి 1614 వరకు పరిపాలించాడు. ఆంధ్రదేశంనుంచి తంజావూరుప్రాంతానికిపోయి, యక్షగాన ప్రదర్శనాలతో మెప్పించిన తెలుగు భాగవత కుటుంబాల బ్రాహ్మణులకు ఈ అచ్యుతప్పనాయకుడు తంజావూరు జిల్లాలో కొన్ని గ్రామాలను బహుమాన పూర్వకంగా దానమిచ్చినట్లు శాసనములున్నవని ఆచార్య శ్రీ విస్సా అప్పారావుగారు వ్రాశారు. అటువంటి గ్రామాలలో ఒకటి అచ్యుతరాయసముద్రం, దీనికే భూపతిరాజపురమనీ, అచ్యుతాబ్ధి అనీ, తరువాత భాగవతమేళములవారినిబటి మేళత్తూరు, మేరటూరు అనీ పేర్లు వ్యవహారంలోనికి వచ్చాయి. ఈ అచ్యుతాబ్ధి గ్రామంలో వెలసిన వరదరాజస్వామికి అంకితంగా నారాయణతీర్థులు తన పారిజాతాపహరణ యక్షగానాన్ని తెలుగులో రచించాడు. అదిమేళట్టూరి భాగవతులవద్ద దొరకడంవల్ల, ఆ భాగవతులూ, తీర్థులవారూ ఒకేకాలంలో–బహుశా అచ్యుతప్పనాయకుని కాలంలోనే తంజావూరు

వచ్చి నాట్యగానవైదుష్యము చూపి, ఈ రాజువల్ల మెప్పుపొంది ఉండవచ్చునన్న విషయము ముందొకసారి చెప్పుకొన్నాము. సంగీత లక్షణకర్తలలో చెప్పుకొన్న గోవిందదీక్షితుడు తొలుత ఈయన మంత్రి.

## రఘునాథ నాయకుడు:

తిమ్మరుసువంటి ధీచతురుడైన మహామాత్యుడేకాక, సంగీత సాహిత్య రాజ్యతంత్రాది బహుశాస్త్ర విశారదుడుకూడా అయిన గోవిందదీక్షితునకూ, చేమకూర వేంకటకవి, కృష్ణాధ్వరీవంటి మహాకవులకూ, రామభద్రాంబ కృష్ణాజి, మధురవాణి వంటి సంస్కృతాంధ్రాది బహుభాషా కవయిత్రులకు పోషితుడయి, తన ఆస్థాన సారస్వతపీఠమును విజయభవనముగా, అన్వర్థనామకముగా దిద్ది తీర్చుకొన్న సాహిత్యభోజుడు, అపర కృష్ణదేవరాయలు – ఈ రఘునాథుడు, స్వయముగా ఖడ్గమునా, గంటమునాకూడ వడితిరిగిన చేయిగల పరాక్రమోపేతుడు, సరసుడయిన కవిరాజ శిఖామణి, కృతిభర్తా, కృతికర్తాకూడ అయిన రాజకవిచంద్రుడు, పారిజాతాపహరణమును పద్య ప్రబంధముగా రెండు జాములలో ఆశువుగా రచించినందుల కీతని తండ్రి యచ్యుతప్పనాయకు డితనికి కనకాభిషేకము చేసెనని గోవిందదీక్షితుల కుమారులు యజ్ఞనారాయణ దీక్షితులు, రాజచూడామణి దీక్షితులు వ్రాశారు. మనకు ప్రసక్తమయినవి ఇతని యక్షగానములు మూడు. అవి గజేంద్రమోక్షము, రుక్మిణీ కృష్ణ వివాహము, జానకీ పరిణయము, ఇవిగాక నలచరిత్రము, అచ్యుతాభ్యుదయము ద్విపద కావ్యములుగాను, వాల్మీకి చరిత్రమును, రఘునాథ రామాయణమును పద్యకావ్యములుగాను రచించాడు. అచ్యుతాభ్యుదయము తన తండ్రిని గురించిన చారిత్రక కావ్యము. ఇతని వాల్మీకి చరిత్రములో తాను కొత్తగా కనిపెట్టిన రఘునాథమేళను యిలా వర్ణించాడు.

సీ॥ ఆదితాళము, ద్వితీయక, మంతరక్రీడ, జయమంగళంబును, జంపె, లీల
చాచపుటంబు చంచత్పుటంబును షష్టితా పుత్రకంబు విద్యాధరంబు
రతిహంసలీల శ్రీరంగంబు రంగంబు కంకళఖండకా కొధములును
కోకిలప్రియము విలోకితంబు హుడుక్క, డెంకి, త్రిభంగి, మట్టిగ విజయము
నంది నందిన జయసింహ నందనములు మొదలుగాగల తాళముల్ మొనసియున్న
గూడికవచట్టముగ కొనియాడితెని బిరుదు లివి యిత్తు నేను నే బిరుదటంచు.

రఘునాథమేళనే కాక, రఘునాథుడు జయంతసేన, రామానందము అనే కొత్త రాగాలను కనిపెటిన సంగీతజ్ఞుడు. గోవింద దీక్షితుడు సంగీతసుధ అను సంగీత శాస్త్ర గ్రంథమును రఘునాథ నాయకుడే రచించినట్లు రాజు పేరనే వెలయిం

చాడు. ఆ గ్రంథము దీక్షితులదే అని ఆయన కుమారుడయిన వేంకటమఖి వలన మనకు తెలిసినది. అంతేకాక సాహిత్యసుధ అనే అలంకారశాస్త్ర గ్రంథాన్ని కూడ వ్రాశాడు. నైషధపారిజాతమనే తెలుగు ద్వ్యర్థికావ్యము రచించి రఘునాథున కంకితమిచ్చిన కృష్ణాధ్వరి తన గ్రంథానికంటె ముందుగా రాజకృతిపొందిన ఇతర గ్రంథాలను పేర్కొన్నాడు. అవి రఘునాథ భూపాలీయము, పారిజాతాపహరణ కథావతారికా, హృదయము, కళ్యాణకౌముదీకందర్ప నాటకము, అమరుకాలంకారహారి భంగ్యైక శృంగారసంజీవని – తాళచింతామణి, పదాల క్షేత్రయ్యా, శతకమును వ్రాసిన కుందవరపు కవి చౌడప్పా ఇతని ఆస్థానంలో గౌరవం పొందినట్లు ఐతిహ్యాలూ, చాటువులూ చెప్పుతున్నవి. బహుళ ప్రచారం పొందిన ద్రాక్షాపాక మధుర కావ్యం విజయ విలాసమును – చేమకూర వేంకటకవి రఘునాథనాయకునికే కృతియిచ్చాడు. వేంకటకవి సారంగధర కూడ జనరంజక గ్రంథమే.

## విజయరాఘవనాయకుడు :

1633 నుంచి 1673 వరకు తంజావూరును పరిపాలించిన యితడు రఘునాథ నాయకుని కుమారుడు. రఘునాథ నాయకాభ్యుదయ మనే చారిత్రక కావ్యమును ద్విపదలో రచించాడు. 23 యక్షగానములు, 3 ద్విపద కావ్యములు, గోపికా గీతలు, భ్రమర గీతలు, ఫాల్గుణోత్సవ రగడ – చౌపదినీ రాజగోపాల దండకమునూ రచించిన ఇతని పాలనకాలమును ఇతని యక్షగానములవల్లను, ఇతని ఆస్థాన కవులా, రచయిత్రులా రచనలవల్లనూ యక్షగాన పదరచనలకు స్వర్ణయుగముగా పేర్కొంటారు. రఘునాథుని కొలువులో కంటే విజయరాఘవుని కొలువులోనే క్షేత్రయ్య ఎక్కువకాలము గడిపి, కొన్నివేల పదాలు చెప్పాడట. విజయరాఘవాంకితములైన పదాలు ఇప్పుడు 12 దాకా కనిపిస్తున్నాయి.

రఘునాథ నాయకుడును ఇతని ఆస్థాన కవులూ, కవయిత్రులూ సంస్కృతాంధ్రములలో రచనలు చేసినా, సంస్కృతములో ఎక్కువరచనలను వెలువరించారు. విజయరాఘవ నాయకునినాడు ఆంధ్రరచన లెక్కువగా వెలువడ్డాయి. అయినా విజయ రాఘవుడు అష్టభాషాధురీణుడు; సంస్కృతాంధ్రములలో వైదుష్యము, చతుర్విధకవితా నిర్వాహక సార్వభౌమ బిరుదాంగద విరాజమాన చరణాంభోజుడు. సోమశేఖర శర్మగారు వ్రాసినట్లు విజయ రాఘవుని కాలమున తంజావూరి కొలువు కూటము నిజముగా కనులపండువు సేయు శారదా నాట్యమందిరమే. సంగీత నాట్యములందు సయితము విజయ రాఘవునిది అందెవేసిన చేయి. అతడు నవరసికుల కెల్ల నాయకుడు. అతని కొలువు కూటమునకు ప్రధానాంగమైన శారదా ధ్వజమును చెంగల్వకాళకవి రెండు సీసపద్యాలలో వర్ణించాడు.

సీ॥ ఒక్కొక్క యెడ చీని చక్కెరపానకం బానిన ట్లాహ్లాద మావహిల్ల
ఒక్కొక్క యెడ తావినెక్కొన విరజాజి సరములెత్తిన రీతి పరిమళింప
ఒక్కొక్క యెడ చల్వ లుప్పతిల్లగ మంద మారుతంబులు వీచు మహిమచెలగ
ఒక్కొక్క యెడ మేనచొక్కు సంపాదించు వెలదివెన్నెలతేట విధముమించ
కవిత రచియింప విజయరాఘవవిభుండె నేర్చునని వాణి నత్రించు నేర్పుమీర
చామరానిలకందళచలితమగుచు తనరు సభయందు నల శారదాధ్వజంబు.

సీ॥ నవనవోల్లేఖనానంద యోగ్యముగాని పద్యంబు జనులకు హృద్యమగునె
ఘనతరాలంకార కారణంబులుగాని వాక్యవైఖరుల నెవ్వారు వినరు
శేషభాషిత వాగ్విశేషాన్వితముగాని పదము విద్వత్ప్రియ పదము కాదు
ఘనసారసారంబుగాని సందర్భంబు లర్భకులైనను నాదరింప
రనుచు వివరించు చలనామరాంచదనిల చలిత చేలాంచలాగ్ర హస్తంబుచేత
విజయరాఘవ మేదినీవిభుని సభను తనదు మహిమంబుచే శారదాధ్వజంబు.

విజయరాఘవుడు కాలికి నవరత్న ఖచితమైన సాహిత్యరాయ పెండేర మనే బిరుదంచె ధరించియే, సంగీత సాహిత్య నాటకాది గోష్ఠులో అధ్యక్షత వహించే వాడట. ఇతని ఆస్థానకవులలో ప్రముఖుడు చెంగల్వకాళకవి - రఘునాథ నాయని కాలమునుండీకూడ రామభద్రాంబ, కృష్ణాజి మొదలయిన కవయిత్రులకు విద్యా గురువై విజయరాఘవునిచే మన్ననలను పొందినవాడు. రాజగోపాలవిలాస మను పద్యప్రబంధమును రచించి విజయరాఘవునికి కృతియిచ్చాడు. విజయరాఘవుని పుత్రుడైన మన్నారుదేవుడు, కోనేటి దీక్షితుడు, పురుషోత్తమదీక్షితుడు, కామరసు వేంకటపతి సోమయాజి అనువారు యక్షగాన కర్తలు. పసుపులేటి రంగాజమ్మ, కృష్ణాజి అనే కవయిత్రులు కూడ విజయరాఘవాస్థానాన్ని యక్షగాన, పద్య ప్రబంధాది రచనలతో అలంకరించిన వారే. వీరుకాక విజయరాఘవుని కొలువు నలంకరించిన గాయన నర్తకులలో అగ్రేసరురాలు చంద్రలేఖ. రూపవతి చౌపదములయందు, చంపకవల్లి, శబ్దచూడామణియందు, మూర్తి జక్కిణి యందు, కోమలపల్లి కొరవంజియందు, లోకనాయకి నవపదములందు, శశిరేఖ దేశి యందు, రత్నగిరి దరుపదములయందు అనగా దరువులుగా ఆనాడు వ్యవహరింప బడుతున్న ధ్రువపదములయందు, భాగీరథి పేరణియందు- ఆ యా కళావళి, ఆయా గీత, నృత్యవిశేషములందు ప్రత్యేక విశిష్టత కన్నవారు. ఇంకా మదన పదములు, దూత్యము, నవరత్నమాలికలు మున్నగువానిని అభినయించే వారుకూడా ఉండేవారు.

విజయరాఘవుని యక్షగానములు 23. 1. రాజగోపాలవిలాసము, 2. చెంగ మలపల్లీ పరిణయము, 3. గోవర్ధనోద్ధరణము, 4. రతిమన్మథవిలాసము, 5. రాస క్రీడానవనీతచోరము, 6. పారిజాతాపహరణము, 7. రుక్మిణీకల్యాణము, 8. రాధా

మాధవము, 9. ధనాభిరామము, 10. సత్యభామా వివాహము, 11. ఉషాపరిణయము, 12. దక్షిణద్వారకాస్థలవర్ణనము, 13. కాళియమర్దనము, 14. రఘునాథాభ్యుదయము, 15. ప్రహ్లాద చరిత్రము, 16. పూతనాహరణము, 17. విప్రనారాయణ చరిత్రము, 18. సముద్రమథన నాటకము, 19 కృష్ణవిలాసము, 20. మోహినీ విలాసము, 21. జానకీ కళ్యాణము, 22. ప్రణయ కలహము, 23. కంస విజయము. ఇవికాక 1. పాదుకాసహస్రము, 2 మోహినీ విలాసము, 3. రఘునాథనాయకాభ్యుదయము అను మూడూ ద్విపద ప్రబంధాలు. గోపికా గీతలు, భ్రమరగీతలు సంస్కృతం నుంచి తెలిగించినవి.

రఘునాథాభ్యుదయము యక్షగాన నాటకము శృంగారరస ప్రధానము. రఘునాథనాయకుని చిత్రరేఖ అను సుందరి మోహించడం, చిలక రాయబారము, సమాగమము ఇందలి ఇతివృత్తం. నాయకుని విద్యాగోష్ఠివినోదాలు, రామభద్రాంబ, శుకవాణి మున్నగు కవయిత్రుల సమస్యాపూరణములు, రాజకీయాదాయ వ్యయ విచారణమూ, కమ్మరివారి వక్కాణా ఇందులోని ముఖ్యమైన ఇతర ఘట్టములు.

విజయరాఘవుని విప్రనారాయణచరిత్ర పన్నిద్దరాళ్వారులలో ప్రసిద్ధుడయిన తొండరడిప్పొడి యాళ్వార్ చరిత్ర- రసవంతమైన యక్షగానము. ఇతనికి పూర్వము విప్రనారాయణ చరిత్ర పద్య ప్రబంధముగా చదలువాడ మల్లయ్యా, వైజయంతీవిలాస మను పేరుతో పద్యప్రబంధముగా సారంగు తమ్మయ్యా రచించారు. విజయరాఘవుని రచన కొన్ని పట్టులలో యీ రెండు ప్రబంధాలను మించి ఉంది.

ఇతని యక్షగానాలన్నీ సీసపద్యంతోనూ, గద్యబిరుదాత్మకమై- ప్రేక్షక సభాధ్యక్షుడైన రాజుకు (తనకే) కైవారముతోనూ ప్రారంభిస్తాయి. ఈ కైవారము యు సమాసాత్తములైన బిరుద గద్యలతో సాగి, విన నవధరించవయ్యా విజయ రాఘవస్వామీ పరాకుస్వామీ పరాకు అని ముగిస్తాయి.

కురంజిరాగంలో దరువు :

పాదికి నూఱుబానల నీరు
చేదితే పొదలు చేమంతిపొవలు
ఒండె గోపాల రెండె గోపాల
చెండు జేకొన్న శ్రీరాజమన్న...
చలువలతేప సంపంగి పైరు
కాల్వలకై నూరుకడవల నీరు
విరజాజి పొదలు వికసించె నేడు
సురపున్నాగలు సొంపు రాణించె....

యదుకుల కాంభోజి - దరువు (దేవదేవి పాట)

ఎంత వింతాయె నెలదోట, ఇంతిరో, చూచితే యిచ్చోట ..
కంతుడు విరిసానకత్తి జిమ్మిని. కాంతారము వావి గనిడి కాబోలు...
కన్నెరో చూచితె యీ గబ్బూరదీవి, విన్నాణమాయనే విరిగున్నమావి ..
పొన్నమాకుల కింది పూదేనె బావి, సన్నగాడ్పులు తెచ్చె సంపంగితావి...

కాంభోజి- దరువు (విప్రనారాయణుని పాట)

చదివేది దివ్యప్రబంధము, మాకు, పై పదు సంసారబంధము,
ఎవనుండు హరిభక్తిగంధము, యోగీంద్రులతోనె సంబంధము, భామా....
మాతో మీకేటి మాటలు విన ప్రాతిగాదు మీ పాటలు భామా....
భవనంబులు పర్ణశాలలు మా పాటలు హరిమీది యేలలు
తగిలియుందురు ముకిబాలలు మా దాపునములు హరిలీలలు...

కాంభోజిలోనే - దేవదేవీ విప్రనారాయణుల సంవాద దరువు;

విప్ర : ద్రావిడవేదము చదివినవాడనె ధవళాక్షి నీవు నన్నేలవే
దే : ద్రావిడవేదము చదివినవారు కందర్పుని వేదము విందురా
వి : అంగన మన్నలు తళిగప్రసాదము పొంగలి చవిగొన్నాడనే
దె : పొంగలి చవిగొన్నవానికి వనితల యెంగిలిచవి మనసాయెనా
వి : ఆరామకైంకర్య మాచరించి మన్నారుని గొలిచినవాడనే
దే : ఆరామ కైంకర్య మాచరించువాని కీ రామకైంకర్య మేలయా ...

ఈ యక్షగానంలో కేదారగౌళ, గౌళిపంతు, కాంభోజి, యదుకులకాంభోజి, ఘంటారవం, కురంజి, గుమ్మకాంభోజి రాగాలు వాడబడినవి.

## వేంకటమఖి:

అచ్యుతప్ప, రఘునాథనాయకులకు మంత్రిగా మాత్రమే కాకుండ, సంగీత సుధాది లక్షణగ్రంథకర్తయై పేరుపొందిన గోవిందదీక్షితుని కుమారుడు వేంకటమఖి విజయరాఘవుని ఆస్థాన విద్వాంసుడు, వాగ్గేయకారాగ్రణి, విజయ రాఘవుని కోరికపైని చతుర్దండి ప్రకాశిక అను లక్షణగ్రంథమును రచించాడు.దీని విషయమై ఇంకా, వేంకటమఖి చేసిన ఇతర లక్ష్యరూపములైన సంగీతరచనల విషయమై, సంగీతలక్షణ క్రమపరిణామమును వివరించిన మా రెండవ అధ్యాయంలో వివరించాము. నాయకరాజులనాటికి దేశంలో ప్రచారంలో ఉండిన సంగీత స్వరూపం మనకు వేంకటమఖి గ్రంథంవల్ల స్పష్టపడుతుంది.

## కోనేటి దీక్షితచంద్రుడు :

విజయరాఘవుడు కథానాయకుడుగా విజయరాఘవ కళ్యాణము అను యక్షగానమును రచించి, విజయరాఘవునిచేత అగ్రహారతారహారాది బిరుదవాద్య పారితోషికము లందినాడు. రామానుజాచార్య పుత్రుడు రాజగురువైన శతక్రతు చతుర్వేది శ్రీనివాస తాతాచార్యుల శిష్యుడు. విజయరాఘవకాంతిమతీ వివాహము ఈ యక్షగానంలో వర్ణితము.

## పురుషోత్తమ దీక్షితుడు :

ఇతడు రచించిన యక్షగానము – తంజాపురాన్నదాన మహానాటకము. రఘునాథ నాయకుడును, విజయరాఘవ నాయకుడును కూడ సత్రనిర్మాణమునకు, నిరతాన్నదాన నింతికీ పేరుపడిన నెరదాతలు. విజయరాఘవుడు దినమున కేబది వేలమంది కన్నదానము చేసేవాడట. నెల్లూరినుండి తరలివచ్చిన ఎల్లమరాజు సత్రముల కధికారి – యిందులో ఒక పాత్ర. ఈ కృతిలో విశేషముగా తెలుగు వారి వంటకములే వర్ణితములు.

## పసుపులేటి రంగాజమ్మ :

ఈమె తండ్రి వేంకటాద్రి; తల్లి మంగమ్మ. ఈమె రచించిన గ్రంథాలు : 1. మన్నారుదాస విలాసము – ప్రబంధము; 2. ఉషాపరిణయము – ప్రబంధము; 3. మన్నారుదాస విలాసము – నాటకము; 4. రామాయణ సంగ్రహము; 5. భారత సంగ్రహము; 6. భాగవత సంగ్రహము – ఇవిగాక సంగీతమున నీమె లలిత ఫణితిని మృదురసాస్పదములగు పెక్కు పదములు రచించినట్లు కూడ తెలుస్తోంది. తననుగూర్చి చెప్పుకొన్న గద్యలో కొన్ని అంశాలు :

శ్రీమద్రాజగోపాల కరుణాకటాక్షవీక్షణానుక్షణ ప్రవర్ధమాన సారస్వతధురీణ.
విచిత్రతరపత్రికాశతలిఖితవాచికార్థావగాహన ప్రవీణ.
తత్ప్రతికాశత స్వహస్తలేఖన ప్రశస్తకీర్తి,
శృంగార రసతరంగిత పదకవిత్వ మహనీయమతిస్ఫూర్తి,
అష్టభాషాకవితా సర్వంకషమనీషా విశేషవిశారద,
రాజనీతి విద్యావిశారద,
విజయరాఘవమహీపాల విరచిత కనకాభిషేక....

---

ఈ బిరుదాలలో చిట్టచివర దానినిబట్టి, ఆమె వైదుష్యానికి మెచ్చుకొని విజయరాఘవుడు శ్రీనాథ కవిసార్వభౌమునికీ, తన తండ్రి రఘునాథ నాయకునికీ లభించిన కనకాభిషేక గౌరవమును రంగాజమ్మకుకూడ ప్రసాదించాడని తెలు

సుంది. ఈమెకు తెలిసిన అష్టభాషలు; సంస్కృత, ప్రాకృత, శౌరసేని, మాగధి, పైశాచి, చూళిక, అపభ్రంశ, ఆంధ్రములు, మన్నారుదాస విలాస యక్ష గానంలో ఈ యెనిమిది భాషలలోను విజయరాఘవునిపై ఈమె రచించిన గేయములున్నవి. ఈమె యక్షగానములో పాత్రోచితభాషాప్రయోగమూ, వ్యాకరణ శాస్త్ర ప్రశంసాకూడ చేసిన విదుషీమణి. కోనేటి దీక్షితచంద్రుని యక్షగానంలో వలెనే- ఈమె మన్నారుదాస విలాసంలో కూడ విజయరాఘవ. కాంతిమతుల ప్రణయకథయే ఇతివృత్తము : రాజచంద్రుని కుమార్తెయైన కాంతిమతి స్వప్నంలో దర్శించిన విజయరాఘవుని – మెలకువలో ఊరేగింపులో చూసి ప్రేమించడమూ. విరహమూ, రాయబారములూ, పెద్దల పెండ్లి కబురులూ, వివాహము. మన్నారుదాస విలాసంలోని దరువులు – చాలమట్టుకు క్షేత్రయ పదాలలోని నుడికారంతో, అనుప్రాసలతో, భావములతో క్షేత్రయపదము లేమో అనిపించేటంతటి మధురంగా ఉంటాయి.

పదం : 1. చెల్లబో యిందరు చెలులు కలిగిన ఫలము
ఉల్లసంబులాడనేకాని ఒద్దికసేయగలరా
కలలోన నేడు నా చెలువుని రమ్మంటినా
నలినాక్షు లిందరు నన్ను దూరెదరు
వచ్చితి నేమాయె వలపు పుటించవలె
మచ్చుగప్పేరుగా మగువలందరు కూడి.

పదం : 2. ఏలరా, నే తాళజాలరా, చాల నీపై నేను బాళితోనున్నాను....
బాలా రమ్మని నన్ను లాలింపవేరా....
ఈడరా నను దయజూడరా కోడెకాడా మరుండు దాడివచ్చి నిపుడు
మోడిసేయక జోడుకూడి చేకోరా....
వింటిరా నీ వగలెల్ల కంటిరా, తుంటవింటి నెరదంటబంటు నాపై
గంటుచేసెను మా యింటికి రారా. ..

లయగ్రాహి: 3. తావిజగజంపు సిగ పూవుల నరుల్ తళుకు
మోవి పలుకెంపు బురుసా వలువ సొంపుల్
ఠీవి తులకింప నొకతావి. చురుకు న్మరుతు
మావిపయి నెక్కి పురిలో వెడలిరాగా
నీ వగలు చూచి చెలి రే పగలు పొక్కుచును
పూవుజము దాడి దొరహావళికి చిక్కెన్
మా వెలది నేలుకొన రాదలదె నీవు దయతో
విజయరాఘవ మహీవర పరాకా....

పదం : 4. ఎన్నరాని వలపు యింతికి నీమీద
మన్నారుదాస ధీర మక్కువ నేలుకోర....
తుమ్మెద నారిగల తుంటవిలు పూని
కమ్మవి ల్తుండు చాల గాసి చేయగను....
వెలయంగ వెన్నెలవేడిమి చల్లుచు
కలువల చెలికాడు కడు మచ్చరింపగను....

పదం : 5 పదరెదవేల వెన్నెలరాయ
నీకు నే పగదాననటరా....
బెదరించేవేమిరా విజయరాఘవేంద్రుని
ముదమున తోడ్కొని యిదె చెలి వచ్చీని
నా మాట వినురా కల్వలరాయ నా మాట
వినురా ఓరీ నీకు మోమోట లేదా
రామాపాంచాలుని రఘునాథ తనయుని
ప్రేమతో తోడ్కొని రామ యిదె వచ్చీని....

ఎఱుకతపాట : 6
ఎరుఖాడు గెరుఖాడు గెరుఖాడు గేమండి (ఎరుక + అడుగే)
నీవు తలంశిన తలంపు నిజముగా సెప్పేనే....
నిక్కముగా సెప్పేనే - తార్కాణగా సెప్పేనేమండి....
అమ్మా యమ్మ అమ్మా యమ్మ యీఋరుకని బువ్వతేవే ...
శ్రీ రాజగోపాల, దోరకానాత, బంగారుమన్న, సెంగమలరేడా....

సువ్విపాట: 7. సువ్వి మన్నారుదాస సువ్వి రమ్యహర్మ్యవాస
సువ్వి రుచిరముఖవిలాస సువ్వి సువ్వి....
సువ్వి చోళ భూమిపాల సువ్వి సుజనవినుతశీల
సువ్వి యువతీపాంచాల సువ్వి సువ్వి
సువ్వి మన్మథాకార సువ్వి సుకవిమందార
సువ్వి సారసగుణహార సువ్వి సువ్వి.

రంగాజమ్మ పదములలో క్షేత్రయ ప్రభావమునుబట్టి చూడగా, క్షేత్రయ్య విజయరాఘవుని ఆస్థానమునకు ఏ ఒకటి రెండుసార్లో వచ్చి, పదములు పాడి వెళ్ళిపోయి వుండడనీ, కొన్ని యేళ్ళపాటు అక్కడ వుండి తన సంగీత సాహిత్యాలతో అక్కడివారిని సమ్మోహితులను చేసినాడనీ చెప్పవచ్చు. నాయికా కథన ప్రధానములైన పదాలయినా, నాయక కథనములయినా అతి సుకుమారమయిన మృదుల శబ్దాలతో కూర్చిన క్షేత్రయశైలి రంగాజివంటి మధురహృదయమైన

కవయిత్రికి అనుకారయోగ్యం కావడం సహజమే. రంగాజమ్మ నాటకరచయిత్రి గనుక, ఆమె పాత్రల అవసరములను బట్టి బహువిధములైన భాషాప్రయోగాలను వాడింది. క్షేత్రయ పదాలకు రంగాజమ్మ పదాలలో కనబడే సామ్యము విజయ రాఘవుని దరువులలోకాని, సమకాలికులైన ఇతరుల దరువులలోకాని కనబడదు. అందుచేత ఏరా, మేరా, వచ్చీని, పోయీని అని వ్రాసినంతమాత్రాన క్షేత్రయ్యను దక్షిణాంధ్రకవి అనడంకంటే, అదే శైలిలో వ్రాసిన రంగాజమ్మకూడ పసుపులేటి యింటిపేరునుబట్టి, ఏ కృష్ణాగోదావరీ తీరములనుండో క్షేత్రయ్యవలెనే సారస్వత ధ్వజం నెలకొల్పడానికి దక్షిణాదికి తరలి వెళ్ళిందని చెప్పవచ్చు.

## పెద్ద దాసరి:

విజయరాఘవుని కాలంలో పెద్దదాసరి అని నరసింహస్వామి యెడల మహాభక్తుడైన పదకర్త ఉండేవాడనీ, రాజు కోరిక మన్నించనందున అతనిపై రాజుకు ఆగ్రహం కలిగ ఉరిశిక్ష విధించాడనీ, అతడు శిక్షను తప్పించుకొని, నరసింహాలయం ప్రవేశించి, అంతర్థానుడయినాడనీ ప్రభాకరశాస్త్రిగారూ మున్నగు పెద్దలు వ్రాశారు. గ్రహఫలము మాయను అనే దేవగాంధారి రాగంలో కీర్తన పెద్ద దాసరి రచనగా సంగీతలోకంలో ప్రచారంలోవున్నది.

## మన్నారు దేవుడు:

ఇతడు విజయరాఘవుని కుమారుడు. తండ్రితో కలిసి మహారాష్ట్రులతో యుద్ధానికి వెళ్ళి ఆ పోరులో వీరస్వర్గం అలంకరించాడు. తండ్రి తాతలవలెనే సంగీత సాహిత్యవైదుష్యం కలిగిన కవి. విజయరాఘవాభ్యుదయమనే చారిత్రక ప్రబంధమూ, హేమాబ్జ నాయికా స్వయంవరమనే యక్షగానమూ యితని రచనలు. విజయరాఘవ నాయకుడు – రక్తాబ్జనాయిక లేక హేమాబ్జనాయిక అను చెంగమ్మను మన్నారుడను రాజగోపాలునకు కళ్యాణం చేసిన కథ – యీ యక్షగానంలోని ఇతివృత్తము. ఇందులోని ఒక దరువు.

ననబోణి దక్షిణద్వారకాపురిని, చెలువుమీరినయట్టి చెలువమన్న డితండు
వెలదిరో పదియారువేవురు జవ్వనుల, వలపించి యేలిన వన్నెకాడె యితండు
కనకాంగి విజయరాఘవునింట పెలయుచు, దినదినము పూజించుదేవుడే యితడు.

శృంగార విలాసపరు డనిపించే విజయరాఘవుని భక్తిపర జీవితమును అతని కుమారు డీ యక్షగానంలో వెల్లడించాడు. 1674 లో విజయరాఘవుడూ, మన్నారు దేవుడూకూడ మహారాష్ట్రులతోటి యుద్ధంలో మరణించడంతో తంజావూరు రాజుల సారస్వత సంప్రదాయమును ఇతోధిక శ్రద్ధతో మన్నించి పోషించారు.

## నాయకరాజులనాటి యక్షగానసంగీతసాహిత్యరచనా విశేషాలు:

ఆనాడు యక్షగానానికి ప్రధాన లక్షణాలయిన నృత్యగీతాదులను వర్జింపక సంస్కృతనాటకముల త్రోవను నడిపిన వారికెక్కువని తలచిరని శ్రీ నేలటూరి వేంకట రమణయ్యగారు వ్రాశారు. వారు వ్రాసినట్లు తంజావూరు యక్షగానములలో కొన్ని కొత్త కొత్త ఒరవడు లున్నమాట నిజమేకాని, దేవతాస్తోత్ర పద్యముతో ప్రారంభించడం కొత్తకాదు. రాజాస్థానములో రాజు ఎదుట ప్రదర్శింపవలసిన నాటకాలు కనుక, రాజస్తుత్యాత్మకమైన కైవారాలు యక్షగానములో ప్రవేశించాయి. కైవాడ ప్రబంధం రాజస్తుత్యాత్మకమైన బిరుద, గద్యాది ప్రబంధాలతోపాటు దేశిప్రబంధ విశేషముగా శార్ఙ్గదేవుడూ, రామామాత్యుడూ, గోవింద దీక్షితుడూ తమ లక్షణగ్రంథాలలో పేర్కొని ఉన్నారు. ఇది మహారాష్ట్రరాజుల యక్షగానాలలో శబ్దముగాను, సలాముగాను పరిణమించింది. కైవారము సంస్కృత నాటకములలోని నాందీప్రస్తావనలకు సరియైనది అని వేంకట రమణయ్యగారు వ్రాసినది సంస్కృతరూపక లక్షణకర్తలు చెప్పనదానితో సరిపోవటంలేదు. తొలి యక్షగానములలో త్రిపుట, జంపె, ఆట తాళములలో నడిచిన రగడలు నాయకయుగపు యక్షగానాలలో ఆ తాళములలోనే సాగే దరువులుగా, పదాలుగా పరిణమించాయి. మొదట సుగ్రీవ విజయాది యక్షగానాలలోని రగడలలో లయానుకూలత ఉన్నంతగా గేయానుకూలత లేదు. రాగకల్పనా, సాహిత్యానుగుణముగా రాగ ప్రయోగమూ వర్ధిల్లిన నాయకరాజుల కాలంలో లయ – క్షేత్రయ పదాలలో వలెనే కాలప్రమాణము చౌకమై రాగానుకూలతను, పాటలో భావానుగుణమైన రాగవిస్తృతినీ సంపాదించుకొన్నది. ఈ యక్షగానాలలో సాధారణముగా ఉపయుక్తములైన రాగాలు ఆహరి, ఉసేని, కన్నడ కళవాణి, కురంజి, కాంభోజి, ఎరుకల కాంభోజి, గుమ్మకేదార, కేదారగౌళ, కేదారిపంతు. ఖాచి (ఖమాచి), గౌడపంతు, ఘంటారవము, తోడి, నటనారాయణి, నాగగాంధారి, పంతువరాళి, పూరి, బిలహరి, భైరవి, మధ్యమావతి, మనోహరి, మారువధన్యాసి, ముఖారి, మోహన, రేగుప్తి, లలితపంచమము, శంకరాభరణము, శుద్ధసావేరి, సామ, సామంత, సారంగ, సావేరి; సాళగ సౌరాష్ట్ర, సైంధవి, సౌరాష్ట్ర మున్నగునవి. వీటిలో చాలామట్టుకు క్షేత్రయ్య తన పదాలలో వాడిన రాగాలు, క్షేత్రయ్య వాడనివీ, అన్నమాచార్యాదులు వాడినవీ అయిన సామంత, కేదారిపంతు, గుమ్మకేదార, సాళగసౌరాష్ట్రవంటి ప్రాచీనరాగా లున్నాయి. అట, ఆది, ఏక, జంపె, త్రిపుట, రూపక, విజయభూషణతాళములు వాడబడినవి. ఈ రాగాదుల పరిశోధనాంశాలు వ్రాసూ శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు సుగ్రీవవిజయపు తాళపత్ర ప్రతులలో కొన్నిటిలో దరువులకు రాగాలుకూడా వ్రాసిఉన్న విషయమును గుర్తింపక, సుగ్రీవవిజయములో దరువులు లేవనీ, ఆ త్రిపుటలూ, జంపెలూ మొదలైన

పాటలకు రాగాలు పాడటం ఆనాడు తెలియదనీ వ్రాశారు. ఇది సరియైన పరిశీలన కాదని తొలి యక్షగానకర్తలు అనే ఈ గ్రంథంలోని 9వ అధ్యాయంలోని అంశాల వలన స్పష్టంగా తెలియగలదు. యక్షగానాలలో ఎరుకత పాత్ర ప్రవేశం నాయక రాజులనాడే కొత్తగా ప్రవేశపెట్టినట్లు మనకు తెలిసింది. కాని. ఈ యెరుకత పాత్రల అభినయాలూ. చెంచెతపాత్రల అభినయాలూ, నృత్యగీతాలూ సాహిత్యం లోని కెక్కకుండా ఆ జాతులవారి దేశి నాట్య విశేషాలలో ఉండినట్లూ, అన్నమా చార్యులు ఆ సందర్భాలను కొన్ని సంవాదగీతాలు రచించాడనీ వెనుక చెప్పు కొన్నాము, ఏది ఏమైనా, తరువాతి శతాబ్దంలో మహారాష్ట్రుల పోషణలో సంగీత సాహిత్యాలితోధికాభివృద్ధిపొంది ప్రబల. వాగ్గేయకారులు జనించడానికి. తంజా వూరులో నాయకరాజుల కృషివల్ల అంకురారోపణం జరిగినది.

# మైసూరు సారస్వత కేంద్రం

## కంఠీరవరాజు:

1672 నుంచి 1704 వరకు మైసూరు పాలించిన చిక్కదేవరాయలు సంస్కృత కర్ణాటాంధ్రవాఙ్మయ పోషకుడు, ఇతని చరిత్రమును చిక్కదేవరాయ విలాసము అనుపేర పేరుతెలియని అజ్ఞాతకవి యెవరో యక్షగానముగా రచించి నాడు. ఇందులోని కవిత్వం ప్రశస్తముగా నున్నదట. గ్రంథము ముద్రితము కాలేదు. చిక్కదేవరాయని కుమారుడు కంఠీరవరాజు బహుళ యక్షగాన పద కర్తగా ప్రసిద్ధిపొందినాడు. ఇతడు 1704 మొదలు 1713 వరకు పాలించాడు. పుటుకచే మూగవాడు, చెవిటివాడు అయి, మూకరసు అని నామాంతరము కలిగిన ఇతడు కేవలం హస్తసంజ్ఞలతోనే రాజకార్యాలను నిర్వహించేవాడట. అయినా. కమనీయమగు కవనశక్తినీ, బహుభాషావేతృత్వమునూ ఇతనికి పరమేశ్వరుడు ప్రసాదించెనట. ఇతని యక్షగాన రచనముల మూలమున ఇతడు సంగీత సాహిత్య నాట్య విద్యలందు నేర్పరి యగుటతోపాటు సంస్కృతమున, ప్రాకృతమున, కన్నడమున, తెలుగున, తమిళమున కవితారచన చేయగలవాడని విశదమగు చున్నది అని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు వ్రాశారు. ఇతని రచనలు:

1. కొరవంజికల్లె – ఇందులో ఆంధ్రకొరవంజి, కన్నడకొరవంజి. ప్రాకృతకొరవంజి, తిగుళకొరవంజి లేక తమిళ కొరవంజి అను నాల్గు కృతులు ఉన్నవి.

2. పంచాయుధకల్లె

3. లక్ష్మీవిలాసము
4. కలవాణీవిలాసము
5. నాట్య విద్యావిలాసము
6. వసంతోత్సవ విలాసము
7. విభక్తికాంతా విలాసము
8. అష్టదిక్పాలక విలాసము
9. పావకి నాటకము
10. వైవస్వత నాటకము
11. నైరుతి నాటకము
12. వారుణి నాటకము
13. వాయవి నాటకము
14. కౌబేరి నాటకము

ఈ కృతులలో కొన్నిటియందు గ్రంథాదిని సంస్కృతశ్లోకమూ, కొన్నిటి ముందు తెలుగుపద్యమూ ఉన్నవి. మధ్య మధ్య వచనా లున్నవి. ద్విపదలు, సీసాలూ, మత్తేభాదివృత్తాలూ, దరువులు, జంపెలు, త్రిపుటలు, - అటతాళం,ఏక తాళం, ధ్రువతాళం, మఠ్యతాళం ఈ యక్షగానాలలో ప్రయుక్తములు. కొన్నిటిలో ప్రాకృతమూ, కన్నడమూ వాడబడింది. తెనుగున లేక కన్నడంలో ఉండిన— సాంగత్యచ్ఛందోపద్ధతి ... వాడబడినది. అన్నిటియందును రచన సరళమును హృద్యమునునై యున్నది.

## కళువె వీరరాజు సాహాయ్యం :

సంగీత గంగాధర మను సంస్కృతగేయ నాటకము - జయదేవుని గీత గోవింద పద్ధతిని ఉమామహేశ్వరుల ప్రణయ శృంగారమును వరించునది. కంఠీరవరాజుకు అంకితముగా కళువె వీరనంజరాజను ఆతని దండ నాయకునిచే రచితమైనట్లు ఇటీవల మైసూరు పండితుల సాహాయ్యమున ఆకృతిని సంపాదించి సంగీతయుక్తముగ పాడించిన మా విద్వన్మిత్రులొకరు మాకు తెలియజేశారు. కంఠీరవరాజు మూకరసు అయినందువలన ఆంధ్రవచన భారతాదులు రచించిన కళువె లేక కళలె వీరరాజు, అతని పుత్రులు ఆ రాజునకు యక్షగానరచనలో సాహాయ్యపడి ఉండవచ్చును.

ఆంధ్ర కొఱవంజి : కంఠీరవరాజు శ్రీరంగనాథుని దర్శించి, తిరిగి వస్తూ ఉండగా పాంచాలదేశ రాజకుమారి కాంచనలత అతనిని చూసి మోహిస్తుంది.

ఇంతలో కొలువంజి అనగా యెఱుకత ప్రవేశించి, పాంచాలరాజ కుమారికి ఆమె మనోభీష్టము నెరవేరి, కంఠీరవ రాజామెను చేపట్టగలడని చెపుతుంది. రాకుమారి యెఱుకతకు బహుమానమిచ్చి పంపుతుంది.

మాళవిరాగంలో ఎఱుకత ప్రావేశికీ గేయం ;

వచ్చె నెఱుకత యెఱుక యెఱుకని
వాడ వాడల వెంటనూ
హెచ్చుగా తార్కాణ లెల్లను యిదిగొ చెప్పెద ననుచునూ ...
తళుకుజెక్కుల పసిడికమ్మలు తళుకు తళుక్కని మెరయగా
కులుకు గుబ్బలపై నిహారము వెలసి వేడుక మీరగా....

సాంగత్యచ్ఛందోపద్ధతి (కన్నడ సంప్రదాయం)

సాత్యవతి నేనుందు స్వర్గాన నేనుందు
నిత్యమ్ము ధరలోన నుందూ
అత్యంతాద్భుతమైన అమరాద్రియందుంచు
సత్యము సర్వత్రనుందూ....

దీనిలో ఆహిరి, కాంభోజి, ఘంటారవమాళవి అనే రాగాలు ప్రయుక్తములు. కంఠీరవుని కృతు లన్నిటిలోను ఇదే పెద్దది.

పంచాయుధకల్లె : విష్ణుమూర్తి పంచాయుధాలు కంఠీరవుని రక్షించునట్లుగా, ఆ యా వాత్రను అభినయించేటట్లు రచింపబడిన ఇందులో సంస్కృత శ్లోకాలు ఎక్కువగా ఉన్నవి.

లక్ష్మీ విలాసము : కంఠీరవరాజు సభలో శ్రీ మహాలక్ష్మి నృత్యం చేసి రాజును ఆశీర్వదించినట్లు రచితమైన ఈ యక్షగానంలో దరువు, ద్విపద, వచనములు ఉన్నవి.

కలవాణీ విలాసము : కలవాణి అనే వేశ్య కంఠీరవరాజును మోహించిన ఇతివృత్తము కలది.

నాట్య విద్యావిలాసము : నాట్యకత్తెలు తమ తమ ప్రత్యేక విశేషములను గురించి ప్రకటించుకొను ఇతివృత్తం కలది.

వసంతోత్సవ విలాసము : నాచన సోము డిటువంటి పేరుగల గ్రంథాన్ని రచించినట్లు లక్షణగ్రంథాలలో ఉన్నది కాని, గ్రంథము లభించలేదు. కంఠీరవుని రచన ప్రశస్తంగా ఉన్నది. ఇందులోని నటీప్రవేశపు దరువు ఆహిరిరాగంలో సూచితమైనది. దాని పల్లవి :

వచ్చెను నటి తమి
హెచ్చైన కంఠీరవేంద్రుని సమ్ముఖమున
ఆటల పాటల తేటల నలరిన
పాటలగంధి నెఱ నీటుతో నదిగో.

ఆ విధంగా పాడుతూ ప్రవేశించిన నటిని సూత్రధారుడు వసంతోత్సవ విలాసం వినిపింపుమని అడుగగా, నటి ఆ కృతికి కర్త యెవరని అడుగుతుంది. సూత్రధారుడు ఒక సీసపద్యంలో కృతిపతియైన కంఠీరవరాజును వర్ణిస్తాడు.

....రాజ, కంఠీరవ రాజేంద్రచంద్రుండు
చారు కారుణ్య విస్తార యశుడు
మృదుమధురవాక్య సందర్భ మగుచునెగడి.
నవరసాలంక్రియా కల్పనముల దనరి.
లలితమైన వసంతవిలాస మనెడి
నాట్య మేళాగతి ప్రబంధము రచించె—

ఆ తర్వాత నటి వసంతసమయాన్ని వర్ణిస్తుంది.

యదుకులకాంభోజి - ఆటతాళం

ఈ వసంతము లింపాయె, భావించి చూడ బాగాయె
ఠీవితో రాజకంఠీరవరాయ, డీ విధముల వింత లిటువలెసేయు (పల్లవి)
అలరు నల్కల క్రొవ్విరులు తేనెజాఱ, చెలరేగి యాసించి అలులందుజేర.
చెలువైన మావిడి చిగురాకుసారముల మదించిన కోయిలల సొంపుమీర——

ఆ సమయమున రాజకంఠీరవుండు కొలువై యుండు క్రమంబు వర్ణింపబడి వసంతోత్సవ విలాసంబను నాట్యప్రబంధము వినుపించుటకు వేళ - తగిన పాత్రలు ఎవ్వరంటే - మల్లిక, మందారిక, మంజుభాషిణి, మధురవాహిని మొదలైన అంగనామణులు ముస్తాబై వచ్చు క్రమం - దరువులో వర్ణింపబడింది.

వచ్చెను మల్లిక వరుసతో నిదిగో, హెచ్చైనకంఠీరవేంద్రపరాకు (పల్లవి)
ఈ దరువు చరణాలు ధ్రువతాళంలోను, రూపకంలోను, ఝంపెలోను రచితములు.

కంఠీరవరాజు రచించిన పదాలనుకూడ కొన్నిటిని శ్రీ వేంకటరావుగారు ఉదాహరించారు. భైరవిరాగం, త్రిపదితాళం వారిధిగంభీర, శారదనీరదాశ్రిత హారరుచిరవిహార - ఇత్యాది బిరుదాలతో ఒక జయవాచకపదము, ఘంటారవ రాగంలో వడ్డి మఠ్యతాళంలో ఒక పదం.

కొమ్మ నీవది యేమే నాసామి నీవెంత కొదవగా యేమి జేసేవే
ఈ మహిని రాజకంఠీరవేంద్రుని యేమని తెలియలేను (పల్లవి)
ఆటపాటల వింత మాటల తేటల అందచందములు గలిగినా

మీసై న నీటు బలుజాటు పసుబోటుల మిటుకులాడులె నటి
పాటల గంధులు పదము మోపినగాని పాన్పు జేర్చనివాడమ్మా
పాట పాడియైన పడుచుల నెల్లా పాటిజేసునచే ఓ భామా
ఏనాక్షి వినవే యిలలో వారికెల్ల యెక్కువై న రూపము.
ఈ విధంగా ఈ పదంలో ఇంకా ఏడు చరణఖండా లున్నవి.

ఘంటారవరాగంలో ఆటతాళంలోని ఒక పదం.

అక్కరో వినవె యీవేళ వలపు జూడ యెక్కడనుండి వచ్చెనే
సొక్కు పొడి జల్లెనో సొగసు కంఠీరవేంద్రుని (పల్లవి)
అటుగా జూచిన వాని అలరు మోము లందము....
ఇటు జూడ వాని నీటు యింత హీనమె
ఎటుగా జూచిన వాని ఏమన వచ్చునో అందు—

* * * *

అనవరతము నన్ను అంగజు కేళిని గూడి
వినయమున కంఠీరవేంద్రు నున్నాడై యున్నది—

ఘంటారవంలోనే మరియొక పదం – క్షేత్రయ్య పదాలను జ్ఞప్తికి తెస్తున్నది.

కాని లేర చక్కని సామి కాని లేర
దానశూర కంఠీరవ ధరణిపాల యీలాగై తె
పడుచుదాననంటా నడిప్రాయాన నన్ను జూడక
విడిచి దానినే జేరున్న వివర మెరుగనా—

అశోకవరాళి రాగంలో ఒక పదం

ఏమే భామినీ ప్రేమము యెంతటిదో కాననమ్మా
కామకోటిరూపరాజ కంఠీరవేంద్రునియందు....

ఈ పదం క్షేత్రయ్య పదాలలోని – వలపనే దెటువంటి వస్తువో తెలియదమ్మా అనే పదాన్ని జ్ఞాపకం చేస్తుంది.

తోడిరాగం పదం—

పదిరి నన్నంటి వచ్చేవేర
మొదటివలె గాదు
చాలు మోహనాకారా—

ముఖారిరాగ పదం

విన్నవించరో ఓ యమ్మ
కన్నెరో యీ వగలెల్ల కంఠీరవేంద్రునితోన

విడిదికే వచ్చిన బొమ్మనెదె నన్నిపుడు విడనాడెదె
విడెమీయగా నందుకోరాదా, వింతజేసెదు...

కాంభోజిరాగం - వడ్డిమత్యతాళం

ఇపుడు జాణవైతివా చెలియా నీ విపుడు జాణవైతివా
ఆపటి దినమున మరచి నీవే పై పయివారి
యందమె నుపంతి సమరే వేమొ (పల్లవి)
ముద్దుగాడ్డిరో నీవు చిన్నప్పాయమునాడు
ముద్దుగుమ్మలతో బొమ్మలపెండ్లిండ్లు చేయించి
కొద్దిగా సతిపతి నిద్దరిని గూర్చి కులుకుచు నీ వుండగా
అద్దపాయనె నేను రాగా కనుగొని
అదరి చెదరి మోమువార చేసుకొంటి
వద్దనున్న చెలులమరుగు దాగున్నట్టి
వలపులాడి వింతెగదవె నీ వపుడు ...

కంఠీరవరాజుకు దండనాథుడును, బహుశా కవితాసహచరుడును అయిన కళువె వీరరాజుకు - వచనభారత రచనంలో తోడుపడిన వాడు తుపాకుల అనంత భూపాలుడు. అతని తండ్రి తుపాకుల కృష్ణభూపతి. ఇతడు చంద్రగిరి, చెంజి, గోలకొండలలో దండనాథుడుగా పనిచేసి, తరువాత బహుశా గోల్కొండలో ఉండగా పదకర్తయైన క్షేత్రయ్యచేత పదములు చెప్పించాడని ముందు చెప్పుకొన్నాము. అటుతర్వాతి తరమువాడైన కంఠీరవరాజుకుగాని. అతని సాహిత్యసహచరులకుగాని క్షేత్రయ్యపదములతో పరిచయమూ, గౌరవమూ ఉండి, వాటి ప్రభావము వారి రచనలపై కనబడటము సహజమే. కంఠీరవుని పదాలలో కొన్ని పల్లవులు పెద్దవి, చరణములు కూడా క్షేత్రయ్యపదాలవలె కాక అంతగా శిల్పంతో దిద్ది తీర్చినట్లు కనబడవు. కాని, పలుకుబళ్లు, భావములు చాలమట్టుకు క్షేత్రయ్య పదాలకు ప్రతిబింబాలు.

క్షేత్రయ్యకే తరువాతి తరమువాడయిన కంఠీరవరాజు తప్పక తంజావూరు రాజాస్థానములోని సారస్వత వైభవములను, యక్షగాన రచనాప్రదర్శన ప్రాగల్భ్యమును రఘునాథ, విజయరాఘవ నాయకుల వైదుష్య, వైదగ్ధ్య వితరణములను బాగుగా తెలిసినవాడె. తమ ఆస్థానమున కూడ అటువంటి సారస్వతపీఠముగా పేరొందుటకు తగినకృషి చేసినవాడని చెప్పవచ్చును. అతని కృషినిబట్టి తప్పక ఆంధ్రసాహిత్య చరిత్రలో రాజకవిమాన్యులలో కంఠీరవరాజు సమాజగౌరవస్థాయి సంపాదించుకొన్నాడు. ఈ యక్షగానములనూ, పదాలనూ రచించినది ఒకవేళ 'మూకరసు' (మూగరాజు) అయిన కంఠీరవుడుకాక, అతని దండనాథుడైన కళువె వీరరాజే అయినప్పటికీ వాగ్గేయకారుడైన వీరరాజూ, తత్పోషకుడైన కంఠీరవరాజూ కూడా మనకు సమ్మాన్యులే!

## పదహారవ అధ్యాయము

# యక్షగాన, పదకర్తల స్వర్ణయుగం
# మహారాష్ట్రులు - సమకాలికులు
# తంజావూరు మధుర సారస్వత కేంద్రములు

విజయరాఘవుని మరణానంతరం నాయకరాజుల పరిపాలనం అంతరించింది కాని, తంజావూరు సారస్వత కళావైభవం తరుగలేదు. పరిపాలన హస్తగతం చేసుకొన్న మహారాష్ట్ర రాజులు తమ మాతృభాష మహారాష్ట్రమయినా, పాలించేది ద్రావిడదేశమయినా, సంస్కృతాంధ్రభాషలలో సంగీత, సాహిత్య గ్రంథాలను స్వయముగా రచించీ, అనేక కవి పండిత గాయకాదులను పోషించీ, వారిచేత వ్రాయించీ, నాయకరాజులనాడు ప్రారంభించిన సంస్కృతీ బీజాలను ఇతోధికభక్తి శ్రద్ధలతో పోషించి అభివృద్ధిచేశారు. నాయకరాజులవలెనే ఈ మహారాష్ట్రరాజులుకూడా చాలామంది స్వయముగా యక్షగానాలను, పదాలను రచించడమే కాకుండ, సంగీతలక్షణ గ్రంథాలను కూడా వ్రాశారు. అనేకమంది వాగ్గేయకారులను పోషించి వారి రచనలకు ప్రోత్సాహమిచ్చారు. నాయకరాజులు నెలకొల్పిన విజయభువన సాహితీ సభాంగణమున మహారాష్ట్రుల ఏలుబడిలోకూడ కలకలలాడుతూ శారదాధ్వజము మొక్కవోక నిలిచింది.

## శాహభూపాలుడు :

మహారాష్ట్రులలో మొదటి రాజయిన ఏకోజీ (1676 - 1683) స్థానిక సంస్కృతీ సంప్రదాయాలను అవగాహన చేసుకొంటూ, తమ రాచ కుటుంబంవారి జీవితమును అభ్యాసములను ఆ పరిసరాలకు అనుగుణంగా మార్చుకొనడంలోనే గడిపినట్లు కనపడుతుంది. ఇతని కుమారుడైన శాహజీ పూర్తిగా స్థానికులలో కలిసిపోయి, సంస్కృతాంధ్ర ద్రావిడభాషా కవిపండిత పోషకుడై కృష్ణదేవరాయ, రఘునాథులవలె స్వయంగా గ్రంథకర్తయై అభినవ సాహిత్యభోజ బిరుదాంకితుడయినాడు. ఇతడు తంజావూరు పాలించినకాలం 1684-1712. శాహజీ సంస్కృతంలో

శబ్దరత్న సమన్వయము, శబ్దార్థ సంగ్రహము అను రెండు నిఘంటువులను రచించాడు. 1693 లో తిరువాసనల్లూరు అనే గ్రామాన్ని శాహరాజపురమనే పేర నలభై యారుగురు విద్వాంసులకు ధారాదత్తం చేశాడు.

## పోషిత విద్వాంసులు :

పతంజలి చరిత్రము, షడ్దర్శన సిద్ధాంతసంగ్రహ వ్యాఖ్య, జానకీపరిణయము మొదలయిన సంస్కృత గ్రంథాలు రచించిన రామభద్రదీక్షితుడూ, శాహేంద్రవిలాస కావ్యమునూ, అనేక స్తుతిగ్రంథాలనూ రచించిన శ్రీధర వేంకటేశార్యుడూ, లలితా సహస్రనామములకూ సిద్ధాంత సిద్ధరంజన మనే వేదాంత గ్రంథానికీ వ్యాఖ్యానాలు రచించిన భాస్కరరాయమఖీ, శృంగారమంజరీ శాహజీయ మనే శాహజీ జీవిత చరిత్రాత్మకమైన నాటకమును రచించిన పెరియప్పకవీ, విద్యాపరిణయమూ, జీవానందమూ మున్నగు గూఢవస్తుమయ నాటకముల కర్త అయిన వేదకవీ, ప్రబోధ చంద్రోదయ పద్ధతిని అద్భుత దర్పణమును శుకసందేశమనే కావ్యాన్నీ రచించిన మహాదేవకవీ, వల్లీ పరిణయాది గ్రంథాలను రచించిన వీరరాఘవకవీ, సుభద్రా పరిణయ నాటకకర్తా, ధర్మవిజయ కావ్యకర్తా అయిన నల్లదీక్షితుడూ శాహరాజ పురమందలి విద్వద్వర్యులు. భోసల వంశావళి రచించిన గంగాధరమఖీ, అతని ముగురు కుమారులు నరసింహరాయమఖీ, త్ర్యంబకరాయమఖీ, భగవంతార్యమఖీ శాహజీ ఆస్థానంలో ఉండినవారు. వీరిలో రాజమంత్రి పదము నందినవారుకూడా ఉన్నారు. శ్రీనివాసకవి అను నతడు శాహరాజాష్టపది అనే గేయ గ్రంథాన్ని రచించాడు—ఇంకా యెందరో ఉన్నారు.

శాహజి మహారాజు రచనలు దాదాపు 20 వరకూ ఉన్నవి. ఇవి అన్నీ యక్షగానపద్ధతి నాటకాలే. పద్య గద్య గేయాత్మకాలే. 1. కిరాతార్జునీయ కథాత్మకమైన కిరాతవిలాసము; 2. కృష్ణలీలా విలాసము; 3. గంగా–పార్వతీ సంవాదము, 4. జలక్రీడలు, 5. సంస్కృతాంధ్ర మహారాష్ట్రభాష లాయా పాత్రలద్వారా మాటాడించిన త్యాగరాజవినోద చిత్రప్రబంధ నాటకము 6. ద్రౌపదీ కళ్యాణము; 7. నటరాజస్వామియెదుట నర్తకాంగనలు నాట్యవిలాసముజు చూపే పంచరత్న ప్రబంధనాటకము; 8. పార్వతీ కళ్యాణము: 9, రతీ కళ్యాణము; 10 రామపట్టాభిషేకము; 11. రుక్మిణీ సత్యభామా సంవాదము; 12. వల్లీ కళ్యాణము; 13. విఘ్నేశ్వర కళ్యాణము; 14. శంకర పల్లకిసేవా ప్రబంధము; 15. విష్ణు పల్లకిసేవా ప్రబంధము; 16. శచీ పురంధరము; 17. శాంతా కళ్యాణము: 18. పతిపతిదాన విలాసము; 19. సరస్వతీ కళ్యాణము; 20 సీతా కళ్యాణము; 21. సతిదానశూరము.

# రచనా పద్ధతి

ఈ యక్షగానములు కొన్ని శివునకు, కొన్ని కృష్ణునకు ఒకటి రెండు రామునకు, రతీ కళ్యాణము గౌరీదేవికి అంకితం చేయబడినవి. అంకిత మీయ బడిన దేవతను గూర్చిన బిరుద సంబోధనలతో 'జయ జయ' శబ్దపూర్వకంగా ఉండే 'శోడయము' అను గేయంతో వీరిలో ప్రతియక్షగానమూ ప్రారంభమవు తుంది. ఆ తరువాత 'ఈ విధంబున సకలదేవతాప్రార్థనం చేసిన యా తదనంతరం శ్రీ శాహమహారాజ ప్రణీతంబైన—అనెడు నాటకంబునందు తొలుత కథా క్రమం వినిపించేమారం అని సూత్రధార వాక్యములను పురస్కరించుకొని యక్ష గానములో రాబోవు కథంతా ద్విపదలలో క్లుప్తంగా పాడబడుతుంది. ఆ తర్వాత నాటకములోని ఇతివృత్తాన్ని అనుసరించి, వినాయకుడో, దౌవారికుడో దరువు పాడుతూ ప్రవేశించడం, ఆ తర్వాత యక్షగానపు ప్రధానేతివృత్తం, ప్రదర్శితమవు తుంది. ప్రతి యక్షగానంలోను దరువులూ, ద్విపదలూ, సంధివచనాలూ, పద్యాలూ ఉంటాయి. అంకితమీయబడిన దేవుని వివిధనామాలకు షష్ఠ్యంతములతో 'మందర ధరునికి, మాధవునికి, నందకుమారునికి, నరహరికి, పొందుగ గోపకన్యలను పెండ్లాడిన గోవిందునికి యశోదా నందనునికి శోభానమే శోభానమే' అని యీవిధ మయిన శోభనమనే దేశిగేయాలతోగాని, శ్రీ కంథరునిపేర సిత దేహుపేర లోకనాయకుపేర రుద్రునిపేర ... సాహితీపుంభావ శారదయైన శాహభూపాల శాసనుడు రచించె, సరస సత్కవులెల్ల సన్నుతిసేయ, ధరణిలో నా చంద్ర తారార్కముగను' – అని యీ విధమయిన ద్విపదలతోగాని. యీ యక్షగానాలు పూర్తవుతూ ఉంటాయి. కొన్నిటికి చివర శోభనమో మంగళమో, పాడిన వెనుక, 'ఇతి శ్రీమద్భోసలకుల శాహమహారాజ విరచిత రతీ మన్మథ విలాస మహానాటకం సకల విద్వజ్జనప్రీతయే సకలశ్రేయసే శ్రీత్యాగేశ సాంబసదాశివ శ్రీ పూర్ణానందార్పణమస్తు' అని ముగింపు.

శాహజీ శంకర పల్లకిసేవా ప్రబంధమును తిరువారూరి శ్రీవీథీవిటంక త్యాగ రాజస్వామి పల్లకిసేవను గురించి మనోహరంగా రచించాడు. ప్రతి శుక్రవారము స్వామి శయనస్థానమునకు పల్లకిలో వేంచేయునపుడు ఈ పల్లకి సేవాప్రబంధము అక్కడి ఆలయపు దేవదాసులు నృత్యసంగీతాత్మకంగా ప్రదర్శించేవారు. ఈ నృత్యగానము లానా డెలాగు సాగేవో – అవే స్వరములతో భంగిమలతో, ఆనాటి కళావంతుల సంతతివా రీనాటికికూడ ఆ దరువులను, పద్యాలను, చూర్ణికలను గానం చేసూంటారు. ఈసేవ పారంపర్యంగా సాగడానికై శాహమహారాజు పది వేల నేల సర్వమాన్యముగా ఇచ్చాడట. పార్వతీదేవి పల్లకీ మోసే చెలులుపాడే దరువు :

'సింగారంపు పల్లకి చెలువుజూడవే
సంగీత మేళముతోను సన్నుతించీని దేవుని ... సింగా....

జిగిమించు జలపూత జీని పన్నాంగము
బిగువునిండు బురుసా పింజెలును
నిగ నిగయను పచ్చి పగడంపు దండియు
మగరాల సిగరాల మంచి చట్టములుగల ....సింగా....

సౌరాష్ట్రం – ఆది

ఇంకొక దరువు—

'కదలింపకురోయి పల్లకి, కదలనీకు రోయి చాల...
మృదువైన జంగమయ్య మేను నొచ్చీ....అ–అ–అ–
హరువుగ మెల్ల మెల్లనె అడుగులిడ రోయి, మా
పురవైరికి బడలిక బుట్టపొయ్యీని....' అ-అ–అ–

ఈశ్వరాంకితంగా శంకరపల్లకిసేవా ప్రబంధం రచించినట్లే, శాహభూపాలుడు విష్వంకితంగా విష్ణుపల్లకిసేవా ప్రబంధం రచించాడు, అందులో నాయికా నాయకులు ఉమామహేశులైతే, ఇందులో లక్ష్మీనారాయణులు.

విష్ణుపల్లకిసేవా ప్రబంధంలోని పల్లకీ దరువు—

కేదారగౌళ – ఆది

సొగసు పల్లకి చూడవే కలికి
తెగువను బోయలు తెచ్చిరి హరికి
సరసీరుహముల చట్టములెల్లను మెరయుచున్న వీవేళ
మరువగు మొల్లల కత్తెరకోలలు ముద్దుగలిగెడిని చాల...

ఈ పల్లకి సేవలలోని దరువులకూ అన్నమాచార్యుల కీర్తనలలోని అలమేలు మంగ పల్లకిని చెలులు మోసేటప్పటి ఒక పాటకూ భావములోను, మాటలలోను పోలికలు చూడవచ్చును.

కులుకక నడవరో కొమ్మలారా
జలజలరాలీని జాజులు మా యమ్మకు....
ఒయ్యన మేనుగదలీ నొప్పుగా నడవరో
గయ్యాళి శ్రీపాదతాకు కాంతలారా....

.... .... ....

చల్లేటి గందవొడి మెజారీ నిలువరో
పల్లకి పట్టిన ముద్దు పడతులారా........

ఈ పల్లకిసేవా ప్రబంధాలలో శంకరాభరణము, సావేరి, మోహన, బేగడ, మధ్యమావతి, పంతువరాళి, సౌరాష్ట్రి, నాటరాగములు వాడబడినవి. అన్ని యక్షగానాలలోని ప్రారంభదరువు నాటరాగంలో ఉన్నట్లు కనబడుతుంది. సంగీత రచనలో వీటి సంగీతానికినీ, త్యాగరాజు రచించిన నౌకా చరిత్ర, ప్రహ్లాద భక్తి విజయ యక్షగానములలోని సంగీతానికినీ చాల పోలికలు కనిపిస్తాయి. కొన్ని దరువులు పాడగా వింటే మాటల సందర్భంనల్ల తప్పితే, వట్టి సంగీతాన్ని బట్టి అది ఎవరి రచనో చెప్పడం సులువుకాదు.

## గి రి రా జ క వి :

శాహభూపాలుని ఆస్థానంలోని ప్రసిద్ధ వాగ్గేయకారుడు గిరిరాజకవి. ఇతనికి పూర్వులసంగతి తెలియదుగాని, ఇతడూ, ఇతని తమ్ము లిద్దరూ సంస్కృతాంధ్ర పాండిత్యంలోను, కవిత్వంలోను పేరుపొందినవారు. నేటి కర్ణాట సంగీతానికి అవతార గురుమూర్తిగా ఎన్నదగిన త్యాగరాజు ఈ గిరిరాజకవికి పుత్రుని పుత్రుడే.

1684 నుంచి 1712 వరకు తంజావూరు పాలించిన శాహభూపాలుని కొలువులోను, ఆ తర్వాత 1712 నుంచి 1728 వరకు ఏలిన శరభభూపాలుని కొలువులోను ఉండి బహువిధ యక్షగానములను, పదములను రచించి ప్రసిద్ధి పొందినవాడు గిరిరాజు, మొదటి శరభోజీకి తరువాత వరుసగా వచ్చిన నలుగురి రాజులకాలంలోను గిరిరాజు కుటుంబానికి తంజావూరు ఆస్థానంతో సంబంధం అంతగా ఉన్నట్లు కనబడదు. త్యాగరాజును, ఆ నల్గురికి తర్వాత వచ్చిన రెండవ శరభోజీ గౌరవించాడు. (1798-1833).

గిరిరాజకవి – 'మార్తాండకుల శాహమహిపాలు సభను, కీర్తికెక్కినవాడు గిరిరాజసుకవి' అని తన యక్షగానములలో వ్రాసుకొన్నాడు. మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారంలో గిరిరాజకవి శాహజీకి అంకితముగా చెప్పినవి కొన్నీ, శరభోజీకి అంకితంగా చెప్పినవికొన్నీ పదములుగల తాళపత్రగ్రంథాలు ఉన్నవి. 'గిరిరాజ నుతుండు అందముననూ', 'గిరిరాజనుత నీ రొమ్మున చెదరిన గంధము అందము మదమున శాహేంద్రు ముగువలు గూడిన చందము', అనేవి శాహేంద్రుని గురించి చెప్పిన పదములకూ, 'కోపగ తగా గిరిరాజనుత శరభోజినృపా' గిరిరాజ కవినుత శరభోజ నృపా నన్ను మరుకేళిగూడవేరా అనేవి శరభోజీని గురించి చెప్పిన పదములకూ దృష్టాంతములు.

వసంత త్యాగేశాంకితములై 'త్యాగేశపదము' లనే పేరుతో, 'మహారాజా సాహేబులవారు కావించిన తెలుగు పదాలడాబు' అని లేఖకుని శీరికతో తంజావూరు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఒక తాళపత్ర సంపుటం ఉన్నది ఇందులోని పదాలు చాలమట్టుకు శాహేంద్రుని నాయకునిగా, కొన్నిచోట్ల అతనిని

స్తుతించినవికూడ కనిపిస్తున్నవి. కవులైన రాజులకు తమ రచనలలో ఆత్మ స్తుతి అస్వాభావికముకాదుగాని, ఈ పదాలుకూడ గిరిరాజ కవికృతములా అనీ, శాహేంద్రుని యక్షగాన రచనములో గిరిరాజునకు అంతాకాని, కొంతైనాకాని పాలున్నదా అని సూక్ష్మ విమర్శకులకు తోచకపోదు.

గిరిరాజకవి రచించిన యక్షగానములు ఏడింటివరకూ ఉన్నవి.

1. శాహేంద్ర చరిత్రము : శాహరాజును కన్యయయిన 'సామాన్య' నాయిక ప్రేమించుట, విరహము, చంద్రదూషణము, కలయిక.

ఇందులోని చంద్రోపాలంభన ఘట్టంలోని చందమామ పదం :

'వలనొప్ప చల్లనివాడవు గదవోయి చందమామా
వలనున్న యింతుల వలచనేటికి చందమామా...'

2. రాజ మోహనకొరవంజి : శాహజీరాజుపై రాజకన్యక ఒకతె వలపుతో తపించి, విరహబాధపడుట, ఎరుకతరాక, ఎరుక, సమాగమము. శోభానం పాటతోను, మంగళంతోను ఈ కొరవంజి ముగుస్తుంది.

3. లీలావతి కళ్యాణం : కళ్యాణపురపు రాజయిన కీర్తిచంద్రుని కొమార్తె లీలావతిని శరభోజీ మహారాజు వివాహమాడుట. ఇందులోని లీలావతీ ప్రవేశపు దరువు—

లీలావతి వెడలె హొయలు మీరగ
పటువగు జనుగవ పయ్యెద పొదల
అటు నిటు ముత్యపుహారము గదల
సుచరిత రమయని సుదతులు చూడ
కచకుచభారము కొనసియాడ
అందెలరొద రాయంచల పిలువ...

4. వాదిజయం : శాహజీకి అంకితమైన నాటకము.

5. సర్వాంగసుందరీ విలాసం : దీని కథకూడ మొదటిదాని వలెనే ఉంటుంది.

గిరిరాజకవి రచించిన యక్షగానాలు, పదాలు మనకు లభించినవి శాహేంద్రుని రచనలకంటె సంఖ్యలో తక్కువగా కనిపిస్తున్నవి. కవితా శిల్పంలో ఇద్దరి రచనలకూ ఏమీ తారతమ్యం కనబడటంలేదు. శాహభూపాలుని రచనలలో ఒకటి రెండు యక్షగానాలలోని పాటలు పాడు పద్ధతి పారంపర్యంగా పాడుకొని వస్తున్న కొన్ని దాక్షిణాత్య కుటుంబాలలో నిలిచి ఉన్నదని చెప్పుకొన్నాము. గిరి

రాజకవి శాహరాజుకు ఆస్థాన వాగ్గేయకారుడేకాక తన సంగీత సాహిత్య రచనలలో కుడిభుజమై వుంటాడని ఊహించవచ్చును గనుక. గిరిరాజకవి పదాలూ, యక్షగానాలుకూడ అదే సంగీత శైలిలో ఆనాడు పాడి, రాజు కొలువులో ప్రదర్శించి వుండడం నిర్వివాదాంశం. కనుకనే గిరిరాజు మనుమడైన త్యాగరాజు యక్షగానముల పాటలలోకూడ, ఆ సంగీత శైలీ, ఆ మాటల కూర్పు కనిపించడంలో విపరీతమేమీ లేదు.

'గిరిరాజకవి యక్షగాన కృతులు' అను శీర్షికను 1956 మే 13 ఆంధ్ర పత్రికలో యస్. వి. జోగారావుగారు వ్రాసిన వ్యాసములో తెలిసిన కొన్ని అంశాలు ఇక్కడ వ్రాస్తున్నాము. కొరవంజులన్నపేర ఎరుకత పాత్రలువచ్చే యక్షగాన నాటకములకు 18 వ శతాబ్ద ప్రారంభంలో గిరిరాజాదుల 'ఏతాదృశ దక్షిణదేశోత్పన్న కృతులే' ప్రారంభమని జోగారావుగారు వ్రాశారు. అంతకుముందు ఎరుకత పాత్ర ప్రవేశమున్న రచనలు నాయకరాజులనాడు ఉన్నవిగాని వాటికి కొరవంజులనే వ్యవహారం లేదు. ఆ యక్షగానాలలోకంటె, మహారాష్ట్ర రాజులనాడు బయలుదేరిన ఈ కొరవంజులలో ఎరుకతపాత్రకు ఎక్కువ ప్రాధాన్యం ఉన్నది. యక్షగానము లన్నిటిలోను కొరవంజిపాత్రలు విహితంగా ఉండవుకాని, కొరవంజి పేరుగల యక్షగానాలలో మాత్రం కొరవంజి లేక ఎరుకత పాత్ర ఉండితీరవలెననేది సిద్ధాంతము. నాయికకు ఇష్టదేవత ఎరుకత వేషములో వచ్చి సోదెచెప్పి, నాయకుని సమాగమము తప్పక ఒనగూడుతుందని సమాధానపరచడం – ఈ కొరవంజి లన్నిటిలోను తప్పనిసరియైన ఇతివృత్తము.

ఎరుకత వేషం: నుదుట మత్తాళి (మందాళి – కృత్రిమ మరకతము) గళమున గులిగింజ, పాలపూసలపేరులు, చెవుల దంతపు గమ్మలు, మేన 'పొంకి'గా కాసెపోసిన పారుటాకుల చీర, వీపున బురుకడు (బుడుతడు) చంక నెరుకలబుట్ట, చేత మంత్రపుకోల, కలిగి – భూజనులు దీని జగన్మోహన కొరవంజి యనంగి – వచ్చెనట.

ఎరుకత చూచిన దేశములు: అంగ వంగాది ఛప్పన్న దేశములు – కొచ్చి (కొచ్చిన్), కెల్లము (క్విలన్, లేదా కేరళం), కొళంబు (కొలంబో), సింగళం, (సింహళం), యావాణము (జావ్హా) మొదలగునవి; పర్వతములు కనకగిరి, సింహగిరి, గరుడగిరి. మొదలగు పుణ్యక్షేత్రములు; కాశి, కాళహస్తి పళణి, అళఘరి తుళుజాపురంబు, మన్నారుకోవెల.

ఎరుకల కులాచారములు: మగండు పోయిన మరది మగండేనే ఓ యమ్మా;
వరుస మా పెండ్లికిని గరిమ నేదున్నర, ఖరముల నిర్ణయము కలదె మా యమ్మా.

సింగి పాపని గన్న సింగడు మందు త్రాగునమ్మ....మద్యమార్గాల మాంసప్రీతిని. దేశద్రిమ్మరితనమును గూర్చి ఎరుకత – రాజకుమార్తెకు చెపుతుంది. సిద్ధగణేశ, శ్రీ వెంకటేశ, కాశీ విశ్వేశ, కంచి వరదప్ప, ఘనకాకుళప్ప ఓబళ నారసింహ, సోనార భైరవ, మధుర చొక్కనాధయ్య, మన్నారయ్య, ఖండేరాయ, కంబంరాయ మొదలైన దేవుళ్ళను పేర్కొంటుంది.

రాజమోహన కొరవంజిలో సింగి, సింగడు కూడ ప్రవేశిస్తారు. వీరివల్ల హాస్యరసం, శృంగారరస పోషణకు తోడ్పడుతుంది. ఈ కొరవంజిలోని దరువులు కురంజి, సౌరాష్ట్రి, పూరి, ద్విజావంతి, పాడి, నీలాంబరి మొ.... రాగాల్లో ఉన్నవి.

వాదజయం : జతగూడి బసువని నోములు నోచుటకు వచ్చిన బాలికామణులు – గిరిరాజకవి పదములుపాడి అందరము (శాహరాజుచే) బహుమానమందుదము రావె – అని సందడించారు అందరునుకూడి సప్తతాళములయందు కోలాటలు ఆడిరి. ఆ ఆటలో ఇదరు తమ తమ విద్యలగూర్చి పందెములాడారు. ఇదరూ వారవరారోహలే, ఒకతె శాహరాజు మెప్పుపొందినది. రెండవ యామె తానుకూడ అతని మెప్పింతునని పంతముపట్టి, చెలికత్తెచే రాయబారమంపి, తిరస్కృతయై స్వయముగా బయలుదేరి రాజుకొలువుకుపోయి, విరహవేదనను పదాభినయముద్వారా ప్రదర్శించి మెప్పించి రాజుచే బహుకృతురాలైనది. వాదజయ కొరవంజి అనేది ఇంకొక యక్షగానం కూర్పు దీనికి కొంచెం భిన్నంగా ఉంటుంది.

సర్వాంగ సుందరీ విలాసం అను యక్షగానము ప్రతిలోని లేఖన సమాప్తి కాలం క్రి. శ. 1704 కు సరిపోతున్నది. ఈ యక్షగానములన్నీ – ఇంచుమించు ఆ కాలంలో రచింపబడినట్లు చెప్పవచ్చును. ఈ సర్వాంగ సుందరీ విలాసము, రాజమోహన కొరవంజి, రాజ కన్యా పరిణయం, వాదజయం – అనే ఇన్ని నాటకాలలోను ఉపయుక్తమయి, ఆ యా నాయికలచేత పాడబడినదీ, గిరిరాజ కవి కృతమూ అయిన ప్రసిద్ధ పదం :

'నన్నే పెండ్లాడుమీ మన్నెరాయ శాహమహీపాల ॥ఎంతైన॥
నన్నే పెండ్లాడుమీ (పల్లవి)
వన్నెమీర రాజకన్యనునే, నీవు అన్నిట నెరజాణవైన నాసామి
అన్నదమ్ములు తల్లి యందరియనుమతి
నిన్నేకోరి చాల నెరనమ్మి వచ్చితి (అనుపల్లవి)
చిన్నదాననని చిత్రమునందు నీవు
ఎన్నకు కొక్కోక మెరిగినదాన

తిన్నగ చిన్నెల తేలించనేర్తును
కన్నెలు వేయి వేలున్ననుగాని...
చక్కనివారిలో చక్కని వాడని
మిక్కిలి నేనీకు సొక్కి వచ్చితిర
గ్రక్కున గిరిరాజ కవినుత శాహేంద్ర
మక్కువ రతిని ఆ మరుడు చోకొన్నట్లు...

## కవిగిరి :

గిరిరాజకవి తమ్ములతో వేంకటగిరి లేక కవిగిరి అనే కవీశ్వరుడు శాహ భూపాలుని బంధువైన ఖండోజీరాయల ఆస్థానంలో ఉండేవాడు. ఆ రాయలా కవిని తన తండ్రిపేర, విచిత్రరాయ వతంసుడని బిరుదుతో గౌరవించారు. వేంకటగిరి రుక్మాంగద చరిత్ర మనే ద్విపద కావ్యమూనూ, నందికేశ్వరకృత మైన అభినయ దర్పణానికి తెలుగు పద్యములతో అనువాదమునూ ఖండోజీకి అంకితం చేశాడు.

## బాలకవి సుబ్బన్న :

లీలావతీ శాహరాజీయమను యక్షగానమును రచించిన సుబ్బన్న - ఒక బాలకవి.

ఈనాడు శరభోజీ రాజు పేరనున్న తంజావూరు సరస్వతీమహల్ పుస్తక భాండాగారంలో తెలుగు గ్రంథాల నెన్నింటినో చేర్పించినవాడు శాహజీ మహా రాజేనట. అనేకమంది గ్రంథ విలేఖరులను పోషించి, అపూర్వ గ్రంథములను చూచి వ్రాయించి, ఆ తాళపత్ర గ్రంథాలను భద్రపరిపించాడు.

## మొదటి శరభోజీ :

1711 నుంచి 1728 వరకు శాహజీ తర్వాత అతని తమ్ముడు పరిపాలించాడు. సంస్కృతాంధ్రములలోను, సంగీతంలోను విద్వాంసుడు. ఇతడు సంస్కృతంలో రాఘవ చరిత్రమనే కావ్యమును శరభ భూపాల కురవంజి అనే యక్షగానమును రచించినాడు. ఈ శరభభూపాల కురవంజిని ఆ నాటి సంగీతంలోనే యీనాడు వీణధనమ్మ కొమార్తె జయమ్మగారు, ఆమె కొమార్తె బాలసరస్వతిగారు నృత్యనాటికగా ప్రదర్శిస్తూంటారు. గిరిరాజకవిని ఈ శరభోజి కూడ పోషించాడు. గిరిరాజు ఇతని కంకితంగా పదాలను రచించాడని ముందు వ్రాశాము.

## తులజాజీ :

శరభోజీ తర్వాత 1728 నుంచి 1736 వరకు తంజావూరు నేలిన తులజాజీ మహారాజు శాహజీకి రెండవ తమ్ముడు. ఇతడు సంస్కృతాంధ్రాది భాషలకు, ఉత్తర దక్షిణ సంగీతములకుకూడా తన ఆస్థానంలో ఉన్నతస్థానం ఇచ్చారు. ఇతడు సంస్కృతంలో సంగీత సారామృతమనే లక్షణ గ్రంథాన్ని రచించినట్లు రెండవ అధ్యాయంలో చెప్పుకొన్నాము. విజయరాఘవ నాయకుని ప్రోత్సాహమున వేంకటమఖి రచించిన చతుర్దండి ప్రకాశికలోని విషయము ప్రాతబడినందున, తులజాజీ తననాటికి వ్యవహారంలో ఉండిన రాగ పద్ధతికి లక్షణం రచించాడు. శాహజీ గిరిరాజ కవులతో ఆరంభమై, త్యాగరాజాదులతో విజృంభించిన సంగీత పద్ధతికి తులజాజీ గ్రంథం దర్పణం వంటిది. తులజాజీ తెలుగులో శివకామ సుందరీ పరిణయం అనే యక్షగానాన్ని రచించాడు.

## రెండవ ఏకోజీ :

తులజాజీ తర్వాత అతని కుమారుడు రెండవ ఏకోజీ రాజ్యానికివచ్చి, ఒక ఏడాది (1736-37) పాటు పరిపాలించాడు. 'బాబాసాహెబ్' అని ఇతనిని ముద్దుగా పిలిచేవారు. తెలుగులో ద్విపదగా రామాయణం రచించిన ఇతడు విఘ్నేశ్వర కల్యాణం అనే నాటకాన్ని శాహభూపాలుని తెలుగు నాటకాన్ని అనుసరించి తాను సంస్కృతాంధ్రము ను రెండింటినీ కలిపి రచించాడు. ఇతడు రచించిన నీతి పదములు 'ఏకరాజేంద్రవినుతా' అనీ 'తుళజేంద్ర తనయైక రాజేంద్ర వినుతుని భోసల కులదేవుని, చంద్రమౌళిని తలచేది' అనీ ముద్రలతో - తంజావూరు భాండాగారంలో ఉన్నవి. తనకాలపు మిగిలిన రాజువలెగాని, కవులవలెగాని ఇతడు శృంగారము పొంతకుపోక, నీతిబోధకములైన పదములను భక్తిరసాత్మకములైన రచనలను వ్రాయడం విశేషంగా చెప్పుకొనదగును.

## శంబరధరుడు :

ఈ రాజుల ఆస్థానానికి చెంది, బొమ్మలాట శాసనుడనీ, ఘనకావ్యభూషణుడనీ, బిరుదులుగల శంభరధరుడు కిరాతార్జునీయమనే యక్షగానం రచించాడు.

## ప్రతాపసింహుడు :

ఏకోజీ తర్వాత జయసింహుడు, ప్రతాపసింహుడు, తులజాజీ, అమరసింహుడు అనువారు తంజావూరును పాలించారు. ప్రతాపసింహుడు 1740 నుంచి 1752 వరకు ఏలినవాడు. రాధికాస్వాంతనం రచించిన 'నట్టువ కవయిత్రి' ముద్దుపళనికి పోషకుడు. మహారాజ ప్రతాపసింహ—సలాము అనే మకుటంతో గల

శబ్దాలను కొన్నిటిని కూచిపూడివారు తమ నాట్యప్రదర్శనాలలోను, కూచిపూడి నాటకాలలోను పాడుతూంటారు. అచ్యుతప్పనాయకుని ఏలుబడికాలంలో (1600 ప్రాంతంలో) తంజావూరుకు వచ్చి మేళత్తూరులో వలస యేర్పరచుకొన్న ఆంధ్ర భాగవత కుటుంబాలవారు, మేళత్తూరువా రయారని ముందు చెప్పుకొన్నాము. వారిలో కాశీనాథయ్య, వీరభద్రయ్యాలు అనేక శబ్దములను స్వరజతులను రచించిన వారు ప్రతాపసింహుని కాలంలో ఉన్నట్లు తెలుస్తోంది.

## కా శీ నా థ య్యా :

వారిద్దరిలోను ముందుండినవాడు మేళత్తూరు కాశీనాథయ్య. ఈతని శబ్దాలను గురించి పరిశోధించి డాక్టర్ రాఘవన్‌గారు ఆంగ్లంలోను, టి లక్ష్మీనరసింహా రావుగారు తెలుగులోనూ వ్యాసాలద్వారా మనకు వెల్లడి చేశారు. కాశీనాథయ్య వీరభద్రయ్యకే గాక, త్యాగరాజుకు ఇంచుమించు సమకాలికుడును, ఆయనకంటే కొంత వయోవృద్ధుడును అయిన వేంకటరామశాస్త్రికూడ మేళత్తూరు భాగవత కుటుంబాలకు చెందిన వాగ్గేయకారుడు. ఈయనను గురించీ, వీరభద్రయ్యను గురించీ వ్రాసినచరిత్రకారులూ, పరిశోధకులూ, వీరంతా వెలనాటితెలుగు బ్రాహ్మణు లని వ్రాశారు. వీరంతా మేళత్తూరులోని ఒకే భాగవత కుటుంబానికి చెందిఉండిన వారయితే, అంతా వెలనాటివారే కావలెను.

కాశీనాథుడు ఆ ప్రాంతపు అనేక క్షేత్రాల వేల్పులకూ, శాహజీ, శరభోజీ, తులజాజీ ప్రతాపసింహ మహారాజులకూ అంకితముచేసి అనేక శబ్దాలు రచించాడు. భళీ భళిరా, సలాం, దిస్సాం, పరాకు మొదలయిన హెచ్చరిక మాటలతో, కవుత్తముతో కలిసి, తాళానుగతంగా యేర్పరచిన జతులతో స్వల్ప సాహిత్యంతో కూడిన రచనను శబ్దం అంటారు. వీటిని ఆలయములలో దేవత సేవయందు, రాజాస్థానము లలో రాజు కొలువు దీర్చి ఉన్నపుడూ, వేల్పునుగానీ, రాజునుగానీ, బిరుదావళి, రంగఘోషణ, యశోగీత ఇత్యాదులతో స్తుతించి నృత్యగానాలతోసహా అభినయిస్తూ విద్వాంసులుగాని, నర్తకీమణులుగాని ప్రదర్శించే వారు. కూచిపూడివారి నాటకాలు కొన్నింటిలో దేవతా ప్రార్థనాదులు అయిన తర్వాత ప్రతాపసింహాంకితములైన శబ్దాలు కొన్నింటిని నాట్యం చేసి, సభాసదులపై పూవులు చల్లే ఆచారం వుంది. నాయకరాజుల నాడుండిన కైవారములు శార్ఙ్గదేవాదులు లక్షణ గ్రంథాల్లో వివరించిన కైవార ప్రబంధపు అద్యతన పరిణామాలే — ఈ సలాములూ, పరాకులూ, వచ్చిన శబ్దాలు అను పేరుగల రచనలు తంజావూరు, మహారాష్ట్ర రాజుల ఏలుబడిలోనే అభివృద్ధి చెందాయి. గజేంద్ర బృంహితము, ఘనగర్జనము, మండూక శబ్దమూ; శకుంత శబ్దమూ అనీ శబ్దాలు పలురకాలు, దైవవందనం,

సభావందనం, అలరింపూ, స్వరజతులూ వీటన్నిటినీ ఈ విధంగా నాట్యోపయుక్త ములయిన రచనలుగా పరిగణించాలి.

కాశీనాథుని రచనలు :

1. ద్విరాజశేఖర తాళంలో చేరుమానం, అలరిప్పు, త్రికాలం, తీరుమానం–
గోపాల కృష్ణాంకితం.

2. శశాంక తాళంలో చేరుమానం. అలరిప్పు, త్రికాలం, తీరుమానం –
గోపాల కృష్ణాంకితం.

3. మదనకుంజరతాళంలో చేరుమానం, అలరిప్పు, త్రికాలం, తీరుమానం –
గోపాల కృష్ణాంకితం.

4. ఝంపతాళంలో చేరుమానం, అలరిప్పు, త్రికాలం. తీరుమానం –
కంచి వరదరాజ స్వామికి అంకితం.

5. ఆటతాళంలో అలరిప్పు, త్రికాలం, తీరుమానం –
నరసింహ స్వామికి అంకితం.

6. ఆదితాళంలో అలరిప్పు, త్రికాలం, తీరుమానం –
శేషాచల వేంకటరమణునికి అంకితం.

7. ఆదితాళంలో అలరిప్పు, త్రికాలం, తీరుమానం –
గోపాలస్వామికి అంకితం.

8. ఆదితాళంలో అలరిప్పు, త్రికాలం, తీరుమానం –
ప్రతాపసింహ రాజుకు అంకితం.

9. త్రిపుటతాళంలో అలరిప్పు, త్రికాలం, తీరుమానం –
(తమిళంలో) వినాయకునికి అంకితం.

10. ఆటతాళంలో మండూకశబ్దం - శ్రీరాగం – గజేంద్రమోక్షణకథ –
శ్రీరామునికి అంకితం.

11. దశావతార శబ్దం – వరద కస్తురిరంగాంకితం.

12. పారిజాతాపహరణ శబ్దం – గోపాలదేవాంకితం.

13. త్రిపుటతాళంలో రుక్మిణీకళ్యాణ శబ్దం – గోపాలకృష్ణాంకితం.

15. రక్తిమార్గమనే శబ్దం – ప్రతాపసింహేంద్రుని కంకితం.

వరదరాజస్వామి మీద, రంగనాయకుల మీద, గోపాలకృష్ణుని మీద పంచరత్నాలు, శబ్దాలు ప్రసిద్ధి కెక్కినవి. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలోని

తాళపత్రాలనుండి టి. లక్ష్మీ నరసింహారావుగారు ఈ శబ్దాలను వ్రాసుకొని మాకు దయతో ఇచ్చారు.

ఈ శబ్దాలలో ఒకటి రెండింటినుంచి కొన్ని భాగాలను ఈ క్రింద ఉదహరిస్తాము. వీటిలోని సాహిత్యం లలితపదాలతో, మధురభావాలతో ద్రాక్షపాకంలో ఉంటుంది.

## శ్రీరామునిమీద శబ్దం

'తక్కిణం తరి తరికుధింకుకు త్ఝారితక తక ధింకు తక్కిణ
కినా తకిణకి నాదణ తధణతా దై ధత్తతా
తాకు తక రేకు తక ఝేకినా
సారె సారెకు కాశినాథుడు సన్నుతించె
నీరజాక్ష వినవయా, వీరతపములు మిగులజేసిన
ఘోరరావణ, కుంభకర్ణాదుల జయించిన రామవరా
కీర్తియనియెడి తీగెలు మేరువయ్యె
చెట్టుపై యిట్టటు కదలక చుట్టుకొన్నది తీగవిడిచి-
తాకిణం తరిత ఝుకు ఝంతరి
మేఘమండలమనే పందిరిమీద తారాగణము తెల్లని
పువ్వులాయెర, విదియ చంద్రుడు
పిందె ఆయెను, పిందె కాయె, నాటి నాటికి పండు పండిన
పండు రీతిని నిండు పున్నమ వెన్నెలాయెర మాన్యధీరా....
........రవికులాంబుధిసోమ దశరథరామ చంద్రాభశిరమేలు
శాబాసు సలాము రే...'

## మండూక శబ్దం : గజేంద్ర మోక్షణ ఘట్టం (ఆటతాళం- చాపు)

'...తన్నంతరి త్రాగ ఝంతరి
పొన్న మల్లెలు పొగడపువ్వులు సన్నజాజులు సంపంగి
పూలవాసన చాలగలిగిన వనములోపల తనరుచుండెడి
తాకు తగ్గణ ఝుకు కమల తటాకమున మండూక శబ్దము
తగణ ణగ ణగ ణగణ గణయని బాగుగా యీలాగు ఘన మం
డూకములు ఘోషింపగా ఫ్రఘ్రట, ఘ్రటక్కుకు
దేకు డింకుకు డికుజకుకుందరి తక్కిణంకిణ
ఉగ్రశాపముతో గజేంద్రుడు....భగ్నమై బలుమకరిచేతను....'

తీగెలు, పందిరి, పువ్వులు, పింది, కాయ, పండువంటి తేట తెలుగు మాట

లతో రామునికీర్తి ఘనతను ఉదాత్తంగా వర్ణించిన రాముని శబ్దమూ, గజేంద్ర మోక్షణ ఘట్టంలోని కాసార వర్ణనకు అనుగుణంగా కప్పల నోటి శబ్దములను అనుకరించే అర్థములేని మాటల కూర్పులో సంగీతము కురియించిన మండూక శబ్దమూ కాశీనాథుని భావకల్పనాశక్తికీ కళాశిల్పనైపుణ్యానికీ తార్కాణములు.

## వీరభద్రయ్య:

సుబ్బరామ దీక్షితులవారు సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో ఇతనిని గురించి 'తైలింగ్య బ్రాహ్మణుడు, తెనుగున మంచి ప్రజ్ఞగలవాడు. ఇతని వాస స్థలము ఉత్తరదేశము' — అనిన్నీ, తంజావూరు ప్రతాపసింహ మహారాజు 'ఔదార్యాది సుగుణములను విని వాగ్గేయకార శ్రేష్ఠుడైన వీరభద్రయ్య ఉత్తర దేశం నుంచి వెణ్ణటిగటుకు వచ్చి, రాజుభేటికై బహుదినములు కాచియుండె' ననిన్నీ, 'ఇతని యోగ్యతాగౌరవములను బహుజనులవలన విని, ఒక దినము రాజే వీరభద్రయ్య గదికి వచ్చి, పాట విని బహుమాన మిచ్చి, తంజావూరికి పిలుచుకొనిపోయి, ఆదరించి గౌరవించె' ననిన్నీ వ్రాశారు. దీనినిబట్టి వీరభద్రయ్య - నాయకరాజులనాడే మేరట్టూరునకు వచ్చి వలస చేసిన భాగవత కుటుంబాలలోనివాడు కాడనీ, ప్రతాపసింహుని కాలంలో ఆంధ్ర దేశం నుంచి వచ్చి- మేరటూరులో నివాసం యేర్పరచుకొని. మేరట్టూరు వీరభద్రయ్య అని పేరు పొందాడనీ అనుకోవాలి. ఇతనికంటే కొంచెం వయోవృద్ధుడయి ఉండిన కాశీనాథయ్యను గురించి సుబ్బరామదీక్షితులు వ్రాయలేదు.

వీరభద్రయ్య భోసలవంశజులైన తంజావూరు మహారాష్ట్రరాజుల కులదైవమగు 'ప్రతాపరాముని ముద్రతో' బహు కీర్తనములు, అనేక రక్తిరాగములందును, బహు దేశీయ రాగములందును, గేయ కల్పనలు వేర్వేర విలసిల్లునటుల విరచించె' నట. ఇవిగాక, ఇతడు ప్రతాపసింహ రాజుపైని - దరువులు పదములు, తిల్లానాలు, స్వరజతులు మొదలైనవి అనేక విచిత్ర గేయకల్పనలు జేసి బహు ఖ్యాతి పొందెనట, 'ఈ మహానుభావునివలననే దక్షిణ దేశపు గాన మార్గము మిగుల పరిష్కారముకలదిగా నేటికిని ప్రకాశించుకొనియున్నది' అని వీరభద్రయ్యనుగురించి సుబ్బరామదీక్షితులు వ్రాసినదానినిబట్టి, మన వాగ్గేయకార చరిత్రలోగాని, కర్ణాటక సంగీతక్రమ పరిణామంలోగాని వీరభద్రయ్య యెటువంటి ప్రధాన స్థానాన్ని ఆక్రమించి ఉన్నాడో తెలుస్తుంది.

తచ్చూరి శింగరాచార్యు వారు పరిష్కరించి ప్రకటించిన సంగీత సర్వార్థ సార సంగ్రహంలో వీరభద్రయ్యగారి కృతులు అనే శీర్షికను ఆహిరి రాగంలో ఒకటీ, బిభాస్‌రాగంలో ఒకటీ ఉదాహృతములు :

ఆ హి రి – ఆ ది

పల్లవి : ఓ మనసా యేమరకే – శ్రీరామనామము ...

అనుపల్లవి : పామరత్వము జెందక యొకటి – పట్టుగాబట్టి యా ప్రతాప
రామా యను నామమే – నిరంతరము సలియింపక దలచు....

చరణం : వారిజాసన ప్రభృతి – దేవతావర్ణమయంబగు నామము
క్రూర పాప దావాగ్ని కెల్ల – వారణాస్త్రము నామము
కోరి నమ్మియున్నవారి కెల్లను – కోర్కెలిచ్చు శుభనామము...

బిహాస్‌రాగం – త్రిశ్రజాతి రూపకం

పల్లవి : నీ నామ కీర్తనలే తారకమయ్యా ...

అనుపల్లవి : మానిత గుణాభిరామ, మా ప్రతాపరామ....

చరణం : సురవర కిన్నరాది వర మునీంద్రులైనా మిము దెలియగ
తరమా – పరమ పావన మి మ్మరయగ మీ
స్మరణ మహిమ అనగా నే నెంతవాడను
నరుడను దుర్మదుడను యిక నామీద కరుణ జూడు...

వీరభద్రయ్య రచనలలో భైరవరాగంలో 'పతిత పావన' అనే కీర్తననూ కాపీ రాగంలో 'సేవింపరమ్మా' అనే కీర్తననూ సుబ్బరామ దీక్షితులు సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో సస్వరంగా చేర్చారు. ఇతడు ఉసేని రాగంలో రచించిన స్వరజతీ, మోహనరాగంలో రచించిన ఒక స్వరజతియో వర్ణమో తంజావూరు గ్రంథాలయంనుంచి డాక్టర్ వి. రాఘవన్‌గారు సంపాదించి మద్రాసు సంగీత పరిషత్పత్రికలో ప్రచురించారు. ఈ రెండు రచనలూ 'అచ్యుత వరదుడు' లేక 'అచ్యుతాబ్ది వరదు'నికి అంకితం చేసినవి. నారాయణ తీర్థుల పారిజాతాప హరణం కూడా అంకితం పొందిన యీదైవం మేరట్టూరులో వెలసిన వరద రాజస్వామి. వీటినిబట్టి సుబ్బరామ దీక్షితులు వ్రాసినట్లు వీరభద్రయ్య — ఆనాడే ఆంధ్రదేశం నుంచి కొత్తగా వలసవచ్చి ఉండడనీ, అంతకు సుమారు 100 ఏళ్ళకు ముందు ఒకటి రెండు తరాల పూర్వీకులు ఆ విధంగా వలసవచ్చిన వారు కావడంచేత, వానిని గురించిన ప్రతీతినిబట్టియే సుబ్బరామ దీక్షితులు వీర భద్రయ్యను గురించి అలా వ్రాశారనీ తోస్తుంది. కాశీనాథ వీరభద్రయ్యలు మాత్రమేకాక బహుళ యక్షగానకర్త అయిన మేరటూరు వేంకటరామశాస్త్రితో సహా ఈ మేరటూరు వాగ్గేయకారులంతా ఒకే వంశమువారయి ఉండడంలో ఆక్షేపణేమీ ఉండకూడదు.

మోహన - ఆది (స్వరజతి)

మోడిశాయ మేర గాదని - తోడితేవే నా సామిని
ఈడులేని మరులు జెందిశానని - నేడు శ్రీ అచ్యుతాబ్ధివరదుని...

.... .... ....

ఉసేని - ఆది - (స్వరజతి)

ఔరా నా సామి వినరా వగలు తెలిసె లేరా, చెనకకురా...
నెనరువాడ వని కోరినది నీ మది
తాళ జాలరా భళి భళిరా...

స్వరజతులు, పదవర్ణములు నాట్యోపయుక్తములయిన సంగీత రచనలని చెప్పుకొని ఉన్నాము. వీటిలోని మాతువు శృంగార రసానుగుణంగా, లలిత లలితములయిన మాటలతో అమరి ఉంటుంది. ఆ మాటలతో నాట్యాభినయము వేరు వేరు భంగిమల ద్వారా వేర్వేరు భావాల నన్నిటినీ ద్యోతకం చేయడాని కనువుగా దీనిలోని ధాతువూ రాగభావమూ వేర్వేరు కళలతో తీగలుసాగి, పదముల ధాతురచనకంటేకూడా ఒక అడుగు ముందుకు పోతుంది. ముందు చెప్పుకొన బోవు ధాతుకల్పనాదక్షులయిన వాగేయకారులకు మార్గదర్శులు ఈ మేరటూరు వాగ్గేయకారులయిన కాశినాథయ్యా, వీరభద్రయ్యలే అని చెప్పాలి. అందుకే సుబ్బరామ దీక్షితులు వీరభద్రయ్యను గురించి నేటి కర్ణాటక సంగీతమునకు మార్గదర్శి అని పేర్కొన్నారు. వీరభద్రయ్య రచించిన ఉసేని రాగపు స్వరజతిని అనుసరించి, ఆయన కాలంలో కొంచెం యువతరానికి చెందిన పచ్చిమిరియం ఆదియప్ప యనే వాగ్గేయకారుడునూ, ఆ తర్వాత కొంతకాలానికి పొన్నయ్యపిళ్లె గారి పూర్వికుడయిన సుబ్బరాయ ఓడువరను వాగ్గేయకారుడును వేర్వేరు స్వరజతులను రచించారు.

సంగీత సర్వార్థసార సంగ్రహంలో వీరభద్రయ్యగారి పదములు అను శీర్షికను దర్బారురాగంలో 'అక్కరో యిపుడింద రావలెనా వాని కక్కరో లేలేవె' : జంజూటి రాగంలో 'లలనా నేనీ విరహ మోర్వగలనా' ; - నాదనామక్రియ రాగంలో 'ఆ లెల్లా హా లెల్లా కృష్ణయేలర నాతో యీ వట్టిపగలెల్ల' అనే నాయికా నాయక సంవాదపదమూ, నీలాంబరి రాగంలో 'అలిగి కూడితే చవిగదా' - ఆనందభైరవిలో 'దాని నన్నెడ బాపవలెనా దైవమా' - మణిరంగులో 'తరుణి నిన్ను జూచి' అనే పదాలను ఉదాహరించారు. మొదటి రెండు వేంకటరమణముద్రతోను, తరువాత రెండూ కృష్ణముద్రతోను తర్వాతివి వేంకటరమణ ముద్రతోను బృహన్నాయక ముద్రతోను ఉన్నవి. ఇంచుమించు ఇవన్నీ క్షేత్రయ్య రచనలుగా ఇటీవల పరిశోధకులు గుర్తించారు. కృష్ణ ముద్రతోటి పదాలు క్షేత్రయ తుపాకుల వేంకట కృష్ణునిపైని రచించినవి.

సంగీత సర్వార్థసార సంగ్రహంలోనే ప్రతాప భూపాలేంద్రుని మీది పదం బులు అను శీర్షికతోగల సురటి, కాంభోజి పదాలు రెండూ వీరభద్రయ్యవి కావచ్చు. సురటి – ఆది.

ప. నిన్నటి పడుచది నేర్చిన నేర్పు – లేమని తెలుపుదునమ్మా....

అ. ప. కన్నె చేయు చిన్నె లాశ్చర్యము కలికాల స్వభావమో తెలియదు ....

చ. దొరయని వెరపింతైన లేక – తొంగి తొంగి యతని చూచేదో
తెరచాటున నేనుండ నతని తన కన్నుగవల తేలించేదో
సరిగెపైట కొంగటు తొలగించి చన్నులజూపి చిరునవ్వు నవ్వేదో...
చక్కని వక్కలాకు మడుపులను సఖియచేత పంపించేదో
సొక్కుచు సోలుచు నతని యెదుటను సొగసు జేయుచును నిలిచేదో
ముక్కువ పన్నీరు పరిమళ గంధము మేన నలదేదో
పుక్కిట విడెమిమ్మని కొసరుచును – మోవినొక్కి జవ్వనిముద్దిడేదో....
బాళిమీర ప్రతాపసింహభూపాల రమ్మనుచు పిలిచేదో
వేళ వేళకును నతనికి సరియౌ వేడుకలను జెల్లించేదో
తాళిపతకమును సరిపెనలును దీసి తా నాని మెడను వేసేదో
తాళలేను సామిది సమయమనుచు తానే యతని పైకొని కలిసేదో

కాంభోజి – ఆది

ప. చిన్నది నీపై మరులుకొన్నది సొక్కి సోలుచు
నున్నది యతి వేగమె ర – మ్మన్నది రారా...

అ. ప. వన్నెలాడిని చేకోర – మన్నెదొరల వీరా
సన్నుత సద్గుణహార, సామీ మల్లాజి హాజీర...

చ. మేలురా మోము చంద్రుని బోలురా – కన్నులు కమ
లాలురా కురులు ఇంద్రనీలాలురా సామీ
శీలరా చనవలు బంతులురా కెమ్మోవి పగ
డాలురా నీకైన జవరాలురా – ముద్దరాలురా....

.... ....

ఈ పదాలలోని నుడికారమూ, లయపొంకమూ పైని సూచించిన వేంకట రమణ, కృష్ణాంకితములైన వాటిలోవలె కాక, వేరువిధంగా ఉన్నవి. మొదటి దానిలో ప్రతాపసింహుని గురించిన ముద్రా రెండవదానిలో అతని మంత్రియైన మల్లాజి పేరూ ఉండడంచేత ఇవి తప్పక వీరభద్రయ్య రచనలే.

## శ్రీనివాసయ్య (1704 - 1731)

సాహిత్య భోజులనిపించుకొన్న శాహజీ, శరభోజీలు తంజావూరు నేలుతూ ఉండినప్పుడు మధురలో తిరుమలనాయకుని వంశపు రాజులలో 11 వ తరము వాడయిన విజయరంగ చొక్కనాథ నాయకుడు పరిపాలిస్తూ వుండేవాడు. ఇతడు కూడ శాహజీ శరభోజీలవలె ఆంధ్ర కవీశ్వరులను యక్షగాన పదకర్తలయిన వాగ్గేయకారులను పోషించాడు. వా రందరిలోను మొదట చెప్పుకొన తగినవాడు మధుర శ్రీనివాసయ్య. ఇతడు మధుర మీనాక్షీదేవి ఆలయంలోని పరిచారకుడు. ఒక తపస్వి రాజమాతంగిదేవి మూలమంత్రమును జపించుకొంటూ ఆ ఆలయపు ధ్వజ స్తంభంవద్ద ఉండగా ఒకనాటిరాత్రి మీనాక్షిదేవి నోట తాంబూలముతో న రక్తీ రూపానవచ్చి ఆ తపస్విని లేపి 'ఓరీ నోరు తెరవ' మన్నదట. ఆ అహంకారి ఆమెను భ్రష్టా అని తిట్టి చీదరించుకొన్నాడట. అప్పుడామె ఆ పక్కనే పండుకొనిఉన్న పరిచారకుడు శ్రీనివాసయ్య నోటిలో ఆ తాంబూలమును ఉంచి అంతర్ధానురా లయిందట. ఆకస్మికంగా కలిగిన ఆ దేవ్యనుగ్రహం వల్ల అతడు సంగీత సాహిత్యాలలో ప్రజ్ఞ, ఆంధ్ర ద్రావిడ భాషలలో కవితాశక్తి గలిగినవా డయినాడట. అర్థపుష్టి, శబ్దశయ్యా కలిగిన మాతువుల మేలిమైన ధాతుకల్పనతో అతడు 'విజయగోపాల' ముద్రాంకితములైన కీర్తనలు రచించి నాడట.

నాటకురంజిలో 'నిను మించినవారు'
కాపిరాగంలో 'నీవే నన్ను బ్రోవవలెనమ్మ'
కళ్యాణిరాగంలో 'ఇంకా దయరాదా'—ఇతనిరచనలు.

## ఘనం శీనయ్య (1704 - 1731)

పైని చెప్పుకొన్న మధురరాజైన విజయరంగ చొక్కనాథుని అమాత్యులలో ఒకడైన వంగల శీనయ్య గోవింద దీక్షితునివలె మంత్రిమాత్రుడేకాక సంగీత సాహిత్యకళానిధి, వాగ్గేయకారుడు. దక్షిణాంధ్రశృంగార సారస్వతంలో ప్రసిద్ధి పొందిన తారాశశాంక విజయమును శేషం వేంకటపతి ఈ వంగల శీనాగ్రణికే అంకితమిస్తూ, ఇతని సంగీత వైదుష్యాన్ని ఇలా పొగడినాడు.

'హాహా హూహూలు గానగర్వమున హాహా హూహూవంచున్, స్వరా
రోహ ప్రక్రియకా తురంగతనులై రూపంబు లానన్ వృథా
సాహంకారులు మర్త్యగాయకులు జోడా నీకు, పాండ్యేశ్వర
స్నేహాలంకృత వంగలాన్వయమణీ సీనాకవిగ్రామణీ....'

ఇంతేకాక, 'ఘననీయదేశీయ కమనీయ గ్రామమూర్ఛనా బహువిధన్యాస ధన్యాసమానతాళమాన నానానూన తాన వితాన భంగీ తరంగిత సంగీత విద్యా విశారదుండును, వీణానినాద వినోద భూలోక నారదుండునూ – శ్రీమన్నారురంగాధిప నామాంకిత గేయకల్పనానుతమణీ' – అని యీ విధంగా వేంకటపతి శీనయ్యను స్తుతించాడు. ఈ కృతికర్తా, కృతిభర్తాకూడా వైష్ణవ ప్రపత్తి పొంది, మన్నారు రంగదేవునియందు, భక్తికలిగినవాడై, అనేక పదములను రచించినాడు. శివదీక్షాపరురాలనురా అన్న కురంజీరాగపు పదము మొన్న మొన్నటిదాకా సంగీత సభలలో బహుజనరంజకంగా వినుపిస్తూండినది – శ్రీ వైష్ణవుడైన శీనయ్య రచనమే. ఈ రచనలోని వ్యంగ్య విలాసమేమిటంటే – శైవదీక్షాపరురాలైన సామాన్య నాయిక వైష్ణవమూర్తియైన మన్నారురంగని – శ్రీవైష్ణవుడంటే చేరనురా – అనీ, వడిగజొచ్చి మఠము చొరవకు – శివార్చలవేళ – అనీ, పో పోరా మన్నారురంగా – మల్లాడకురా – అని నిరాకరించడం. ఇది మన్నారు రంగని శృంగార విలాసంపైని నిందాస్తుతీ; శైవ సామాన్య నాయికాశీల పరిరక్ష ఇందులో ప్రదర్శితములు కావడంవల్ల ఈ పదాన్ని ఇటు శివదీక్షాపరులూ, అటు వైష్ణవులూ కూడ మెచ్చుకోగలిగారు. ఇదిగాక, శీనయ్య రచనలలో సావేరి రాగంలో 'సేవించి ధన్యుల మయ్యేము' అని ఒక కీర్తన కలదట. సంగీత సర్వార్థసార సంగ్రహంలో 'శివదీక్షాపరురాలను' పదమున్నూ ఇంకా మరి మూడు పదాలనూ చేర్చారు 'మన్నారురంగని పదంబులు – అనే శీర్షికలో :

దర్బారు – ఆది

మగవాడని యాడుదని ఒంటిబడి మనసు నిలుపవశమా – యెవరికైనను
వగలు జేయు మన్నారు రంగడా వరాహసామి నిన్ననినేల
బిగువులు తగవులు వావివ రసలు వీరాలాపములు సభలోగాని....
మంచి వయసు దొరకదనుచు పలికే మాటలకేమి మోసమా
కంచుపదనువంటి దింతే తమకము కలిగినవంటే రోసమా
యించు విలుబారి కోర్వ రాదనుటెల్ల నొకరికోసమా
పొంచి పొంచి దొరకరాని సంగతి పొసగితేను మరి దోసమా....

... ... ....

ఇతని పదాలలోని భావాల పొంకమూ, మాటల బింకమూ క్షేత్రయాదుల కనుకరణములుగాగాక, స్వతంత్రమైన పోకడలుగా కనిపిస్తాయి. ఈ క్రిందిదికూడా అలాగే ఉంటుంది.

నీలాంబరి – త్రిపుట

మగనాడు వలచితేను సుఖము...

మగువలే మగవారి మాయలు మరిగి తిరిగిన నేమి ఫలమమ్మా
అతి చులకనమ్మా...

సకల విద్యలు నేర్చిన నెంత సౌందర్యవతియైన
నొకని వలలో జిక్కితే యీ వూరట చెల్లు పెట్లానో
అకట నీవెంత జంతవు, నాయకుని నడవడికలు తెలియువేళ నదియొక్క
మేలా...

.... ... .... ....

ఈ క్రింది పదంలో కొంత క్షేత్రయ్య ధోరణి ఉంది :

శంకరాభరణం – త్రిపుట

వాడెవరో, మనమెవరో – వనితరో యీ వట్టి వాదేల పోపోవే...
నాడు నాడే మన్నారు రంగని చెలిమికూడదని మల్లాడ లేదటవే
యిప్పేటిదిటవే....

నెనరువాడనుకొంటివా – వాని పొలుకువ నేటివరలో [illegible]టపి – ఏటిమాట
అనుకూలు డవునంటివా – దానిపై వానియాసకు మితిగంటివా – పదివేలైన
వినవె యింతటి తెలివివలద – తను వెరుంగని శివముగలదా....

భావములలో అనుభవ పరిపాకమూ, రచనలో శిల్పపు తూకమూ కన్పిస్తున్న శీనయ్య పదాలు క్షేత్రయ్య రచనలతో సమానములుగా తులతూగేవే కాని అనుకరణ కవుల రచనలలో తోసివేయదగినవి కావు. వీటిని గానంచేసి అభినయించినప్పుడు వీటి రసాస్వాదన యోగ్యత మరింత స్పష్టపడుతుంది.

## మార్గదర్శి శేషయ్యంగారు :

ఇతడు శీనయ్యకు ముందుండినవాడని సుబ్బరామ దీక్షితులు వ్రాశారు. దీక్షితులు వ్రాసినదానికి మించి ఈయనను గురించి ఎక్కువగా తెలియలేదు. అయోధ్యా ప్రాంతంనుంచి శ్రీరంగానికి వలసవచ్చిన యితడు శ్రీవైష్ణవుడు, సంస్కృతంలోను, సంగీతంలోను ప్రవీణుడు, కోసల ముద్రాంకితములైన తన సంస్కృత కీర్తనములను ఇతడు రంగని సన్నిధిలో ఉంచగా, వానిలో చాల మట్టుకు చెదలు తినివేయగా, మిగిలిన 60 కీర్తనములు మాత్రం భగవంతునికి సమ్మతములు అని, వానినిమాత్రం ప్రచారంలోకి తెచ్చినాడట. ఆనాటి పండితులాయన ఫణితులలోని నవ్యతను మెచ్చుకొని ఆయనను మార్గదర్శి శేషయ్యంగారని పిలిచారట. 'రంగపతే పాహి' అను కాపీరాగ కీర్తన వింజమూరి వరాహ నరసింహాచార్యులవారు తమ వ్యాసంలో శేషయ్యంగారి రచనగా ఉదాహరించారు.

సంగీత సర్వార్థ సారసంగ్రహంలో కోసలపురి వారి సంస్కృత కీర్తనలని 18 కీర్తనలవరకూ ఉదాహరించారు. అవి మారదర్శి శేషయ్యంగారి రచనలే. కేదార గౌళ, కళ్యాణి, శంకరాభరణం, భైరవి, సావేరి, బేగడ, అసావేరి, అఠాణ, ద్విజావంతి, సురటి, కర్ణాసారంగ, కాంభోజి రాగాలలో ఉన్న ఈ కీర్తనలన్నీ భక్తిరసప్రపూరితములు, దైవనామకలితములు, దివ్యమంగళమూర్తి వర్ణనాత్మకములు. స్వాతి తిరునాళ్ మహారాజు తానుచేసిన సంకీర్తనములు మార్గదర్శి శేషయ్యంగారు చూపిన మార్గములోనే రచించానని చెప్పుకొన్నాడు.

## గోవిందసామయ్య, కూవనసామయ్య (1680 - 1710)

శాహజీ మహారాజు తంజావూరు నేలుతూన్న కాలంలో చిత్తూరు జిల్లాలోని కార్వేటి నగరంలో గోవిందసామయ్య, కూవనసామయ్య అను వాగ్గేయకారులు వెలిశారు. వీరిద్దరు అన్నదమ్ములు. వీరు తైలింగ్య బ్రాహ్మణులని సుబ్బరామ దీక్షితులు వ్రాశారు. గోవిందసామి భరత శాస్త్రకోవిదుడయిన నాట్యాచార్యుడుకూడా. ఇతని రచనలలో తాళపు పోకడలు, జాతుల మార్పుల ననుసరించి సాగిపోయే జతిస్వర రీతులు అద్భుతం గొలుపుతూంటాయని వింజమూరి వరాహ నరసింహాచార్యులవారు వ్రాశారు. కార్వేటి నగరాన్ని అప్పుడు ఏలుతూండిన మాకరాజు వేంకట పెరుమాళ్రాజు ఇతనిని బహూకరించి సమ్మానించాడు. ఒకసారి రాజు వేంకటగిరి వారి కొమార్తె అయిన తన రాణిపైని కోపించి ఆమెను కాపురానికి తెచ్చుకోక బాధ పెట్టినట్లు గోవిందసామికి తెలిసిందట. బహుశా గోవిందసామి స్వస్థలం వేంకటగిరియేమో, గోవిందసామి రాజుకు తెలియకుండా వేంకటగిరి వెళ్ళి, ఆమెకు సంగీతమూ, నాట్యమూ నేర్పి, పురుషవేషం వేయించి, రాజుగారి యెదుట ఆమె సంగీత నాట్యములను ప్రదర్శింపజేసి. రాజు మెప్పుపొంది తిరిగి ఆమెను స్వీకరించుకొనేటట్లు చేసినాడట. మోహనరాగంలో ... సరిగాదాని ... అని స్వర సాహిత్యం వచ్చునట్లు రచించిన పదవర్ణము యీ సందర్భంలో పాడినదే కావచ్చు. ఇంకా యితడు కేదారగౌళ, నవరోజు, ముఖారి రాగాలలో పదవర్ణాలు రచించాడు. ఇవన్నీ నృత్యాభినయానికి ఎంతో అనుకూలమైన జతి భేదాలను కలిగిఉంటాయి. ఇతని తమ్ముడు కూవనస్వామి రచనలలో నాటకురంజి రాగంలో .... ఇంత అలుక... అన్న పదవర్ణము ప్రసిద్ధము.

## సారంగపాణి (1680 – 1710)

గోవింద సామయ్య, కూవన సామయ్యలకు సమకాలికుడూ, సహచరుడూ, కార్వేటినగర వాస్తవ్యుడూ అయిన సారంగపాణి పేరు ప్రసిద్ధపదకర్తగా క్షేత్రయ పేరుతోపాటు వినిపిస్తూ వుంటుంది. సారంగపాణిని గురించి ప్రచారంలో ఉండిన

అభిప్రాయం ఇతడు పూర్తిగా పచ్చి శృంగార పదకర్తఅనీ. క్షేత్రయ్య పదాలలో సగం పచ్చి శృంగారంవుంటే. సారంగపాణి పదాలలో పూర్తిగా పచ్చి శృంగారం ఉంటుందని ఒక అభిప్రాయం జనంలో ప్రాకి వుంది. కాని అది సరికాదు. ప్రాతకాలపు పీచుకాగితములలో అచ్చువేసిన సారంగపాణి పదాలు సుమారు 200 దాకా ఉన్నవి. వీటిని చదివిచూస్తే ఇతనిని వట్టి పచ్చి శృంగారపదకర్త అనడం అన్యాయమే అనిపిస్తుంది. ఇతని పదాలలో పచ్చి శృంగారం అంటూ ఉన్నది - క్షేత్రయ్యాదులగు పూర్వీకులు చేసినదానికంటే ఎక్కువేమీ చెయ్యలేదు. కాగా వారి పదాలలో లేని రెండు ప్రత్యేక విషయాలు ఇతని పదాలలోని సుగుణాలు. ఇతనిని వారికంటేకూడ స్వతంత్ర వాగ్గేయకారునిగా ఋజువుపరుస్తున్నాయి. ఆధునిక గేయ కథలలో యెంకిపాటలను వ్రాసిన నండూరి సుబ్బారావుగారి వలె, జానపదభాషలో రచించిన పదాలు 16 వరకూ సారంగపాణి పదాల పుస్తకంలో ఉన్నవి. అది ఒకటి. చిట్టచివర 43 వరకు భక్తి. వైరాగ్య ప్రబోధాత్మకములైన పదాలున్నవి. ఇది రెండవ సుగుణము. తాళ్ళపాకవారు తప్ప, శృంగార రసాత్మకములైన పదాలు రచించినవారు ఇతని అంత తీవ్రతతో ఆత్మశుద్ధితో భక్తి, వైరాగ్యములను ప్రబోధించే పదాలు వ్రాయలేదు. భక్తివైరాగ్య ప్రబోధనమని స్థూలముగా వాడినామేకాని ఆ పదాలలో సారంగపాణి తన కాలంనాటి సంఘజీవనంలోని దురాచారాలను ఖండించి, నిరసించి, సత్ప్రవర్తనమును సద్భక్తినీ, సత్సాంగత్యమునూ ప్రబోధించినాడు. ఇతని శృంగార పదాలు ఆశ్రయమిచ్చిన రాజును మెప్పించడానికి వ్రాసి ఉండవచ్చునుగాని, ఇతని వైరాగ్య నీతిబోధక పదాలు మాత్రము ఇతని హృదయాన్ని దూసుకొని ఆవేదనతో, ఆరాటంతో వేణుగోపాల భక్తితో సంఘాన్ని హెచ్చరిస్తున్నట్లు కనబడతాయి. క్షేత్రయ్య రచనలలో మనకు ఈ ఘటము కనబడదు. అందుచేత సంగీత రచనలో ఏమైనా, సాహిత్య రచనలో, భాషాశిల్పాన్నిబట్టిగాని, భావ ప్రదర్శననుబట్టిగాని, అనుభవ విస్తృతినిబట్టిగాని చూస్తే సారంగపాణి క్షేత్రయ్యతో సమాన ప్రతిభుడై ఏకసింహాసనమున కూర్చుండతగినవాడుకాని, తక్కువరకపు కవియని త్రోసివేయవలసినవాడు కాడు.

తంజావూరును పాలించిన శాహభూపాలునికి సమకాలికుడై కార్వేటి నగరాన్ని మాకరాజు వేంకట పెరుమాళ్ళరాజు అనే సాళ్వవంశీయుడు ఏలుతూండినట్లూ, సాహిత్య కళాభిమానియైన అతడు గోవిందసామిని గౌరవించినట్లు పైని చెప్పి ఉన్నాము. సారంగపాణికూడ మొదట చాలకాలము ఈ ప్రభువు ఆస్థానంలో విద్యాధికారిగా ఉండినవాడు రెడ్డిరాజుల కొలువులో శ్రీనాథుడు విద్యాధికారియై ఉండినప్పుడు విద్యాధికారికి కావలసిన అర్హతలు సాంస్కృతాంధ్ర భాషా పాండిత్య కవిత్వ విశారదత్వమూ, వివిధ శాస్త్రములలో విద్యాపరీక్షణ శక్తిచాతుర్యములూ, రాజశాసనములను కవితగా ప్రకటించు నేర్పూ. సారంగపాణి విద్యాధికారియైననాడు

నాటి సాంఘిక సంస్కృతీ పరిస్థితుల కనుగుణంగా విద్యాధికారికి కావలసిన అర్హతలు – సంస్కృతాంధ్రభాషా పాండిత్య కవిత్వ విశారదత్వమూ, సంగీత నాట్యాది కళలలో విద్యాపరీక్షణ శక్తిచాతుర్యములూ, మరింత స్పష్టంగా చెప్పాలంటే వాగ్గేయకారుడై, నాట్యాచార్యుడై. అందుకు అవసరమైన వివిధ శాస్త్రాల లోను ప్రామాణికజ్ఞానం కలిగిఉండాలి. సారంగపాణి అంతటి ఘనుడయిన విద్యాధికారియే.

క్షేత్రయ్యకు మువ్వ గోపాలునివలె, సారంగపాణికి కార్వేటి నగరపు వేణుగోపాలుడు ఆరాధ్యదైవము. ఇతని పదాలు దాదాపు అన్నీ వేణుగోపాలాంకితములే. కార్వేటి నగరపు ప్రభువైన మాకరాజుకు అంకితమైన పదాలు కొద్దిగా ఉన్నవి.

| | |
|---|---|
| శృంగార పదాలు | 75 |
| వేశ్యావిలాస దూషణ | 66 |
| జానపదభాషా రీతి | 16 |
| వైరాగ్య నీతిబోధ | 43 |

## శ్రీనాథునితో పోలికలు :

రాజాస్థానములలో విద్యాధికారిత్వం చలాయించినపుడు శ్రీనాథుడు పవిత్ర క్షేత్ర మహాత్మ్యముల గురించిన రచనలలోకూడ శృంగారదోరణులు చొప్పించినట్లుగానే, విద్యాధికారియైన సారంగపాణి ఆస్థానజీవితంలో ఉండగా రచించిన పదాలు శృంగారరసభూయిష్టములై క్షేత్రయ్య పదాలవలెనే అలంకార శాస్త్రములోని నాయికా నాయకాది భేదములకు, వాత్స్యాయన కామసూత్రములకు దృష్టాంతములై ఉన్నాయి. ఆ రోజులలోని ఆస్థాన జీవితములోని అత్యాచారములను, సాంఘికుల దురాచారములను వైరాగ్య నీతిబోధాత్మక పదాలలో కసిగా ఖండించాడు. ఆస్థాన జీవితపు రోజులలో ఇతడుకూడ శృంగార జీవితమును గడపవలసి, ఆ అనుభవముల నైచ్యమును రోసి, వేశ్యావిలాసాలను దూషించి, వేణుగోపాల భక్తికంటె వేరు తరుణోపాయం లేదని ఆ పదాలద్వారా చాటాడు. రాజాశ్రయంలేని రోజులలో ఇతడు అత్యంత దారిద్ర్యం అనుభవించి ఉంఛవృత్తితో బియ్యమడుగుకొని జీవించినట్లు తెలియజేసే పదాలు కొన్ని ఉన్నవి. శ్రీనాథుడుకూడ అటువంటి దారిద్ర్యం అనుభవించిన చరమదశలో పామర జనుల నడుమ గడిపి, వారి ఆనందానికి పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు కథవంటి వీరపదాలను (జాలద్పు) రచించినట్లే, సారంగపాణి తన చేత కాసులేని రోజుల్లో జానపదులతో కలిసి కాలక్షేపం చేస్తూ వారి ఆనందంకోసం 'అగ్గితిరునాళ్ళంట' – 'నాన్నారం సంతలోన' వంటి పల్లె పదాలనుకూడ రచించాడు. ఇతని నీతిపదాలలోని వాగ్ధాటి, సాంఘిక

దురాచార గర్హణంలో ఇతని ఉక్తివైచిత్రీ, ఆత్మోద్వేగమూ ఇతనికి పదకర్తలలో ప్రత్యేక స్థానాన్ని ఇస్తాయి.

పదాల మాటల కూర్పులో క్షేత్రయ్య వలెనే నూటికి నూరుపాళ్ళు తెలుగుతనమును చూపించిన సారంగపాణిని తెలుగు జాతీయ కవులలో ఒకనినిగా పరిగణించాలి. ఈ పదాలలో ద్వితీయాక్షరప్రాసలూ, అంత్యానుప్రాసములూ, ఛేకానుప్రాసములూ, యమకాలూ మొదలైన శబ్దాలంకారములు తెచ్చిపెట్టుకొన్నట్లుగా కాకుండా, అతి సహజంగా, సరళంగా సాగిపోతాయి. సంభాషణ ధోరణిలో దొర్లిపోతూవుండే తెలుగు సామెతలూ, నానుడులూ ఇతని పదాలలో కుప్పతిప్పలుగా ప్రయుక్తములై ఇతని లోకానుభవ విస్తృతిని ప్రకటిస్తూంటాయి. రాగాల పేర్లు వచ్చేపదం. స్వరసాహిత్యములు ఒకటిగా వచ్చే వాక్యములతో కూడిన పదం, మానుల పేర్లు వచ్చే పదం, మానుల కొమ్మల పేర్లు వచ్చే పదం. నాటు మందుల పేర్లు వచ్చేపదం, ఆయుర్వేదౌషధముల పేర్లు వచ్చేపదం, ఊళ్ల పేర్లు వచ్చేపదం ఆభరణాల పేర్లు వచ్చేపదం – ఈ పదాలన్నిటినీ ఇతడు రాజాస్థానంలో తన శ్లేష చమత్కార సామర్థ్యం నిరూపించుకోడానికి రచించినవి. వీటి అన్నిటిలోను కవితా శిల్పంగాని, అర్థస్ఫురణగాని స్వాభావిక ధారాబద్ధమై ఉంటుందేకాని. శ్లేష కోసం శ్రమపడినట్లు కనిపించదు.

ఇతని పదాలలో సంస్కృత సమాసాలు వచ్చేవి చాలా అరుదు. వచ్చినా ఔషధముల పేరుతో చమత్కార శ్లేషలో కూర్చిన యీ పదంలోవలె అర్థం సుబోధకమై వుంటుంది.

గౌళిపంతు – జంపె

పల్లవి : వరకన్యా తిలకమె వనితపేరు, దీని

అ॥ ప॥ పరికించ వేణుగోపాల నా సామి....

చ. పొలతి నెమ్మోము సంపూర్ణ చంద్రోదయము

అలకాళి రుచి వినోదాంజనంబు

దాని మృదు మధురోక్తి ద్రాక్షాది రసమెంచ

మానవతి చూపు మన్మథ బాణసమము....

చెలియ దాని గుణంబు చింతామణి స్ఫూర్తి

అలరించు పాట శ్రుతి కౌనందరసము

... .... ...

ఖండితయైన నాయిక పరుషవచనాలతో కూడిన యీ క్రింది పదంలో వలెనే. ఇతని పదాలలో చాలవాటిలో తేటతెనుగు నుడికారము ఎక్కువ.

పంతువరాళి – ఆది

పల్లవి॥ దోసకారి పోవే అత డీ త్రోవదొక్కునా — పూరకె
అ॥ ప॥ ఆసుబోసిన కోవి వలెనే ఆడకు యీడకు తిరిగేవు మాత్రమె....

చ॥ అందమైన వెండి మెట్టెలు సందెకాడ పంపించితె
కందు గలసిందని యెగిరి చిందులు దొక్కుచు చిదియగొట్టిన
కరుకువరహా లారుబెట్టి కరకంచు చీరెదీసి, పై
చెరగు బాగాలేదని మెటికలు విరిచి నుచ్చు పాతలు జేసిన...
సన్న బియ్యము లేనివాసి సంబావడ్ల గోనె లంపితే
కన్ను లెఱ్ఱజేసి గింజలన్ని కుంపట్లకై త్రించిన—
కలువపూలు లేనివాసి కస్తూరి పట్టెలంపించితె
తిలకించి కోపమున చేత నలిచి పందిటిమీద జల్లిన....
వేణుగోపాలుని గూడి వేలాంత్రాలు సంపాదించి
యేణాక్షులతో వక కాసైన యెరుగ ననుచు వాడుకొన్న....

సామాన్య నాయికతో వేణుగోపాలుడు సొమ్ము ఇచ్చినా ఇయ్యకుండినా వలవతగినవాడే సుమీ అని చెలి చెప్పుతున్న ఘట్టం యీ క్రింది పదంలోనిది.

ధన్యాసి – చాపు

పల్లవి : ఇచ్చిన మంచిదె ఇవ్వకున్నా మంచిదె – యింటికి రమ్మనవే—
అనుపల్లవి : వచ్చితె యేమనవలదే మెచ్చుకోనీ, నీ మెచ్చరాని చుట్టమే
వేణుగోపాలుడు—

చ. కలనాడు వక గవ్వగా సెలవు సేయడ; తలచిన వసువు దయసేయడా
కలిమి లేము లనగ కావడి కుండలు కలకాల మొకరీతిగా వచ్చునా వుండి....
మేలు దలచక యీవేళ పోపొమ్మంటె వాలుగంటి దైవము మెచ్చునా
ఆలోచ నెందుకే అతడు మనకు వేర–కాలము పోవును కడకు మాట నిలుచు...

పురుష విరహం యీ క్రింది పదంలో వర్ణితం :

పంతువరాళి – త్రిపుట :

పల్లవి : వట్టి చూపులలోనే వలపు పుట్టించ నీవలె నెవ రీ జగతి లేరే
అనుపల్లవి : ఇది నీ పుట్టుక దినుసేమొ, పొలతి కలయ చెయిచెయి తట్టి నగువగా
తనువు ఝల్లుమనగ....

చ. సందెవేళ నీవు మా సందువీధిని వెడలి కుందరదనలతో గుసగుసలా
ముందు వచ్చుచు లేని ముచ్చువగల తొలవై మందిలో గ్రక్కున మాటిమాటికి
తిరిగి....
నిన్న జగన్మోహినివలె తళుకుగ అన్ని సొగసుల నీ వందముగ

తిన్నగ తిలకము దిద్ది యద్ద మెదుట వన్నెలాడికొ తలుపు వారజేసుక తొంగి,
॥వట్టి చూపులతోనే॥

.... .... ....

స్త్రీ విరహం యీ క్రింది పదంలో వర్ణితం : ఇందులోని అనుప్రాస లతి రమణీయాలు....

ఆనందభైరవి – ఆది :

రమ్మనే యీమేను వాని సొమ్మనే, కౌగిటజేర్చు
కొమ్మనే, మోవితేనె లిమ్మనే...
బాలనే తమకము నోపజాలనే పతిని జూడని సొగ
సేలనే యీ జవ్వన మేలనే—
మించనే మరుడు నన్నెదిరించెనే, శుకశారికలు రవ
ళించెనే నెలరాజు గర్వించెనే...
వాదటే యీ మేను నీదే గాదటే వాని నిందుతే
రాదటే నెన రింతైన లేదటే...

.... .... ....

శృంగార పదాలలో ఇతడు వాడిన సామెతలూ, తెలుగు పలుకుబళ్ళు, అనుభవపు సూక్తులూ కొన్ని :

1. పూసలోని దారమువలె యెంతజేసెనే నమ్మినందుకు
2. శివశివా అతని మోము చూచితే సేతుయాత్ర పోయివచ్చిన తీరదు
3. వక్కకైనాస లేదుగదవే, వాని చెలిమి కొక దండమే
4. చెడచేనికి ఇంట వడ్లపొంగలి జేసినట్టు . . . –
5. ఉడుము పోతేపోయినది. చెయిమాత్రము విడిచితే చాలుననే కథగా
6. ఉసురుంటే ఉప్పమ్ముకోగలం
7. పెరటిచెట్టు మందుకు గెకోరని పెద్ద నగ వినమా
8. తలపు తెలియని వలపు తగవెనా యేమైనా వలదు
9. వినయమెల్ల దూరలక్షణమనే విధమ్మాయె గదమ్మా
10. పిల్లదిన్న కోడి రారమ్మని పిలచితే పలుకునేమమ్మ
11. వడ్డికాసించి మొదలుపోయిన వార్త నిక్కమని తెలిసెను
12. బలవంత మాఘస్నాన మాయెగా – అందరాని మానిపండాయెగా
13. బొట్నవేలు సున్నమైతే అంతలో బోర్ల పడేదేమో
14. పుట్టిన పుట్టుక వచ్చిన రాకడ అరైె తలుచుకోవే.

వేశ్యాసంగ విరక్తి పదాలు :

1. మోసము పోవద్దురా వేశ్యమోహము వట్టిదిలేరా — చేతి కాసుకు మూల మిదేరా — చెలికాడ యింతటనైన మేలుకోరా....
2. నీ పాదాలకు దండం, నీ తల్లికొక సలాం — నీ యింటికిక రాంరాం — అయినా ఈ పాపము కద్దా — యిట్లయితే కాపురము కోపే సమ్మతైనట్లు దోప నా తరమచే ?
3. నిష్కర్షగా రాత్రికొచ్చే వాడవైతే నిష్కాలు గొంచు రా
4. వారస్త్రీల నమ్మరాదుగా యెంత దోపిన వారి మది సంతుష్టి లేదుగా
5. కలిగిన కాసు గుంజుకోవె కడమజోలి నీ కెందుకె ఉలవకట్టు సామెతగా నున్నది — ఉవిద వేణుగోపాలునిచేత ... (వేశ్యమాత పలుకులు)
6. నీవే నా శాస్త్రము — నాచేత కాసుంటె నీ యక్క యింకొకతె
7. ఇన్నూరు వరహాలు తిన్నగ నాచుకుని యిక కదలమంటివిగా —— వాడు సున్నపాకు కండ్లజూపని నెరదాత, వన్నెలాడిరొ వారవనితంటె సై నీవె... (వేశ్యమాత మాటలు)

సామాన్య స్త్రీచేత నిరాకృతుడైన నాయకుని గురించి వ్రాసినట్లే, వేణుగోపాలునిచేత నిరాకృతురాలయి అతనిచుట్టూ వలపుబాళితో తారాడిన నాయికలను గురించి కూడా పదాలు వ్రాశాడు. ఈ రెండు పద్ధతులలోను ఒక కవికి స్వానుభవమై రెండోది కాకపోదు.

చిత్తూరులో ఆనాడు తూర్పిండియా కంపెనీవారికి కార్యాలయాలు, కొలువులు ఉండినట్లూ, పాశ్చాత్య నాగరికతా వ్యామోహం వలని అనాచారాలు ఆనాడు నాగరకమైన చిత్తూరు మొదలగు పట్టణాలలో తలలెత్తి, అసూర్యంపశ్యలయిన కులకాంతలు సయితము నాగరకతపేర అవినీతిపరులవుతూ ఉండినట్లూ సారంగపాణి ఒక పదంలో వర్ణించాడు.

మోహన — ఆది :

కులకాంతలు పిడిబడి నలుదిక్కులచెలరేగి రిదేటిపాపమో అయితే
వెలయాంధ్రకు జీవనమేమిక శ్రీ వేణుగోపాల కుసంకరమె....
ఉగదెలియని బిడ నెడబాసి, ఉన్నమూట, ముంత దాటవేసి
మగనిపేరు కారాదని రోసి, మన్నెకాపురము వ్యర్థముజేసి...
అందెలు మెట్టెలు రవికెతొ జుట్టి, అత్తమామలకు దుద్దులబెట్టి
బందరు పావడలొ సద్దిగట్టి, పట్టము జూతామని భ్రమపుట్టి...

... .... ....

పగలు రేయి జాగ్రతగా నడిచి బాపనిండ్ల పూటకూళ్ళు గుడిచి
తెగువజేసి తాణాలను గడచి, తగుదుమనుచు సిగుళరము విడిచి
ఇంతదూర మెవరు వెతకరారని యెవరు వచ్చి వేలువంచలేరని
అంతపనికి తేవిణీ చిత్తూరని – చింతలేదు హూణులదరబారని...

ఈనాడు సినీమా నటనా వ్యామోహంతో పల్లెలనుండి నగరాలకు జరుగుతూన్న వలసల వంటివి ఆనాడుకూడ, నాటి ఇతర వ్యామోహాలవల్ల జరుగుతూండి నట్లు ఈ పదంలో స్పష్టంగా తెలుస్తుంది. సారంగపాణి ఆనాడు చూచిన సాంఘిక దృశ్యం నాగరకతా పరిణామ చక్రంలో తిరిగితిరిగి పైకితేలుతూ ఉంటుందికాబోలు.

సారంగపాణి పదాలలో తృతీయ విభాగం జానపద జాతీయరీతులలో చెప్పినవి :

1. అచ్చయ బుట్టింది భూమికి బలు శెబ్బర – కళ్యాణి – చాపు
2. అగ్గురోరం శేరు పెందలకడ్డె – మధ్యమావతి – ఆది.
3. కొండసుట్టొచ్చేరంటె నారాలతూరి – రేగుప్తి – చాపు
4. నగరాన తెప్పతిర్నాల యేడికె – పంతువరాళి – చాపు
5. మనుషా ణమ్మబాకే యీాద్రేగామూ కళెభారం – నాదనామక్రియ చాపు — (వైరాగ్యతత్వం)
6. అగ్గితిరుణాలంట – అజ్జునీకతలంట – ఆరభి – చాపు — (కృత్తికా నక్షత్రోత్సవం)
7. నన్నారం చంతలా నానా దిన్సుందెంట – పంతురాళి చాపు.
8. నచ్చత్రం బొయ్యొత్తామా – చంద్రమాళి నచ్చత్రం బొయ్యొత్తామా — మొత్తం ఇలాటివి 16 మాత్రం అచ్చువేసిన పుస్తకంలో ఉన్నాయి.

'వేణుగోపాలుని విడువము – మరి వేరే వక్కరిపేరు నుడువము' అని తొలినుంచీ పంతము పట్టివుండక, నడుమ కొన్నాళ్ళు 'ఖలుల విత్తము కొంగున' గట్టుదమనే ఆశపడ్డాడుగనుకనే – జీవితంలో అన్నిరకాల అనుభవాలనూ తెలిసికొన్న సారంగపాణి వైరాగ్య, నీతి బోధాత్మక పదాలను మరింత ఆవేగంతో చెప్పగలిగాడు. 'పట్టవలెనయ్యా గట్టిగ మనసు పట్టవలెనియ్యా' – పట్టపలె వేణుగోపాలు పదములు. కట్టవలెను వైకుంఠానికి మెట్లు, నెట్టవలెను సద్వృత్తితో దినములు, మెట్టవలె పుణ్యభూములు భక్తితో' అని పాడునాటికి భక్తివైరాగ్యాలు పూర్తిగా మనస్సులో పాదుకొన్నాయి. అందుకే — 'హరినామ స్మరణము చేయకుంటే అవతల గతియేమి'.

'అన్నదమ్ము లెదబాయకమునుపే, ఆలునిష్ఠురోక్తు లనకమునుపే
కన్నకొడుకు దండించకమునుపే, కాయము వ్యాధుల చివుకక మునుపే
కర్రనూనుకొని తిరుగక మునుపే, కంఠధ్వని తగ్గిపోకమునుపే
అర్రుముందరికి వంగమునుపే, అంగముతల వణుకెత్తకమునుపే

హరినామ స్మరణ సేయవలెనని ప్రబోధించాడు. వట్టి భక్తి, భజనా చాలవు. మంచితనము – మంచినడవడికా ఉండాలంటూ ప్రపంచమంతా కొనియాడగా 'మంచివాడనుచు కీర్తివహించే మానవుడే ఘనుడు' అన్నాడు.

'తన కులాచారము బోవిడువక – తల్లి దండ్రిమాట నిగ్రహింపక
మనసు తప్పుత్రోవల చొరనీయక అనుదినంబు సత్సంగతి వదలక....

.... .... ....

పరులమేలుచూచి లోన గుందక, బంధుకోటి మెచ్చ పనిపూనక
ధరణీశ్వరు కరుణ నమ్మిపొంగక, దాయాదుల, క్రూరదృష్టి జూడక
మంచివాడనుచు కీర్తి వహించాలని' చెప్పాడు.

ఆనాటి సంఘంలోని కొందరు వ్యక్తుల దురాచారాలను కొన్ని పదాలలో గర్హించాడు.

1. పాపాత్ముని ధర్మాధి గారిగా పంపేదొక రోత – సతతము
కోపముచేసే నరనాథుని కొలువు కొలిచే దొకరోత
వలచిన భాగ్యములుండి భుజించని వాని కలిమిరోత – యింట్లో
కులకాంతలు ఉస్సురనగ వేశ్యల గూడేదొక రోత

... ... ...

2. హీను పంచను మహాత్ములు గాచుట యెంత తగని రోత – ఛీ ఛీ
మానిని వృద్ధికి నన్యపురుషులను మాట్లాడుట రోత
తాపసియై అరిషడ్వర్గంబుల తిగిలేదొక రోత వేణు
గోపాలుని పదములు నమ్మియుం గోపియగుట రోత.

3. ధర్మకార్యముల కడ్డము పలికే దబ్బిలి దొక బ్రతుకా – శుద్ధ
నిర్మలాత్మకుల మది నొప్పించే నీచుల దొక బ్రతుకా.

ఈ విధముగా తన తప్పిదములచేతగాని, ఇతరుల ద్రోహములచేతగాని, సారంగపాణి ఆపన్నుడై, చివరకు ప్రపన్నుడై "నిన్ను నే విడువను. నీ పేరు మరువను, నీ బంటు బంటైనాను. అన్న యెన్నటికి ప్రసన్నుడవౌదువో వెన్న ముచ్చిలి తిన్న వేణుగోపాలా" అని గానం చేశాడు. 'బుద్ధిమంతుడైతే పోరాని తావులకు పోతే నీలాపనిందలు వచ్చు. వేరే యవమానము పనిలేదని యన్నాడు.

చివరి రోజులలో ఇతనికి ఆర్థిక సహాయము చేసే రాజులుకాని, మిత్రులుకాని, బంధువులుకాని లేకపోయి, నికృష్ట దారిద్ర్యం అనుభవించి, ఉంఛవృత్తితో జీవించినట్లు ఈ క్రింది పదాలవల్ల తెలుస్తోంది.

శంకరాభరణం – ఆది :

1. ఉంఛవృత్తితో బ్రతికేవారికి ఉగ్రము కారాదు
   పంచసాయకు గన్న వేణుగోపాలదేవ యెందున వగలేక...
   అమ్మా అక్కా అయ్యా యనవలె, పొమ్మంటే తలపంచుక పోవలె
   రొమ్మున తంబుర మీటుచు పాడుచు రోసవడక యిల్లిల్లు తిరుగవలె...

   ....     ...     ....

   ఇచ్చి పెట్టినది దొరికిందనవలె యిప్పటి కిది పదిలక్షలనవలె
   తెచ్చినందులో ముష్టి వేయవలె దేవుడె రక్షకు డనుకోవలె...

సౌరాష్ట్రి – చాపు :

అక్షయ పాత్రకు పోతే కదలని వొక – భిక్షము వేయరయా, మూ
లక్షేపము త్రిప్పి నెత్తినబెట్టెదరా కుక్షింభరులు వేణుగోపాలస్వామి...
తెచ్చుకోవలెనని కొందరు రాలేదు తేబోయినారంట కొందరు – ఒటి
గచ్చులకైనాను కడకు బోయానని–ముచ్చువలెనె తలుపు మూలకు వదిలేరు. .

....     ....     ....

సారంగపాణి పదాలలో సావేరి, కేదారగౌళ రాగాలలో రెండు హెచ్చరికలు, నవరోజులో ఒక లాలిపాట భైరవిలో ఒక మంగళమూ ఉన్నవి. (లాలనుచు నూచేరు లలనలింపునను శ్రీల చెన్నలరు ఉయ్యాల పాన్పునను) అనే లాలిపాటా, 'ఇందిరా రమణునకు ఇభరాజవరదునకు మందరోద్ధారునకు మాధవునకు, నంద నందనుడైన నవనీతచోరునకు కందర్పశతకోటి సుందరునకు – జయమంగళం నిత్య శుభమంగళం' – ఈ రెండు పాటలూ, ఆంధ్రదేశంలో చాలా మందలాల్లో ఇంటింటా పాడగా వింటూంటాము.

ఆనందభైరవి, కేదారగౌళ, శంకరాభరణం, భైరవి, గౌళిపంతు మోహన, పంతువరాళి రాగాలలో ఎక్కువగాను, పున్నాగవరాళి, నాదనామక్రియ, ధన్యాసి, బిలహరి, మధ్యమావతి, సురట, సౌరాష్ట్రి, హుసేని నాటకురంజి, సారంగతోడి, సావేరి, ఆరభి ముఖారి, కాపి, ఘంటా, ఫరజు రాగాలలో అంతకంటె కొంచెం తక్కువగాను, కర్నాట సారంగ, యదుకుల కాంభోజిలలో కొద్దిగాను సారంగ పాణి పదాలను రచించాడు. 'వలచితినే నీపై ముద్దు బాలా' అనే పదానికి 'అపరూప' రాగం అని ఉన్నది. కొందరు ఈనాటి పెద్దవిద్వాంసులు అప్పు డప్పుడు తమ కచ్చేరీలలో కొన్ని సారంగపాణి పదాలను పాడుతూ ఉంటారు.

కాని క్షేత్రయ్య పదాలను నేర్చుకొని, పరంపరాగతంగా పాడుకొంటూ నేటికి కొందరు మిగిలినట్లుగా, సారంగపాణి పదాలకు అంత ప్రచారం కలిగినట్లులేదు. దానికి కారణం చివరికాలంలో అతనికి రాజాస్థానాల ప్రాపు లేకపోవడమూ, శిష్య పరంపర లేకపోవడమూ కావచ్చు. ఈతని పదాల స్వరఫణితులను అన్వేషించి, సేకరించవలసి ఉన్నది.

సారంగపాణి క్షేత్రయ్యవలె భరతశాస్త్ర లక్షణానికి ఉదాహృతులుగా పదాలు రచించడమే కాకుండా, గోవిందసామయ్యవలె ఇతరులకు వేషాలువేసి నాట్యాభినయాలలో శిక్షణ యిచ్చి పదాలను నాట్యాభినయయుక్తంగా ప్రదర్శింపించేవాడట. అంతే కాదు. తానుకూడ ఒకసారి స్త్రీ వేషంవేసి, సభాధ్యక్షుడైన రాజునేకాక, సభాసదులయిన తన మిత్రులను కూడ నిజమైన స్త్రీమూర్తిగా నమ్మించాడట.

క్షేత్రయ్య స్వీయ నాయికలను గురించి ఎక్కువ పదాలను వాటికి తరువాత పరకీయాపదాలను రచించాడు. ఇతడు ఎక్కువగా సామాన్య నాయికను గురించి నవే వ్రాశాడు. పరకీయా ప్రణయం ఇతనికి అంతగా నచ్చినట్లు కనపడదు. పైగా గర్హించినాడుకూడ. తాను ఎన్నుకొన్న స్వీయ నాయికలనుబట్టి క్షేత్రయ్య పదాలకు ఎక్కువ ఔదాత్త్వం వచ్చింది. సామాన్య నాయికతోటి అనుభవాలలో మాత్రము క్షేత్రయ్యకంటె సారంగపాణియే వాస్తవ జీవితానికి ఎక్కువ సమీపంగా రచించాడు. తెలుగు నుడికారంలో సారంగపాణి క్షేత్రయ్యకు అత్యంత సమీపం గానే పోయినా, శబ్దాలంకార ప్రయోగంలో అతనికంటె ఒక అడుగు ముందు వేశాడు. సారంగపాణి ధాతుకల్పన క్షేత్రయ్య పదాల సంగీతానికి రమారమి తుల్యం గానే సాగుతూ, శబ్దాలంకారాలు వచ్చినచోట్ల స్వతంత్రమైన కొత్తపుంతలు తొక్కుతూ ఉంటుంది.

## పైడాల గురుమూర్తి శాస్త్రి :

ఈయన తిరునల్వేలిజిల్లా కయత్తారుగ్రామంలో జన్మించిన ఆంధ్రబ్రాహ్మణుడు. చతుశ్శాస్త్ర పండితుడు. యౌవనంలో ఉండగా చెన్నపట్టణంలో మణలి చిన్నయా మొదలారిచేత తన సంగీత వైదుష్యానికి బహూకృతుడైనాడు. అనేక గీత ప్రబంధరచనా విశారదుడు. రామస్వామి దీక్షితులకు సమకాలికుడేకాని, ఆయనకంటె వయసులో చిన్న. సంగీత సర్వార్థసారసంగ్రహంలో ఈయన కృతులలో ధన్యాసిరాగంలో (నీరజ నయన దనుజ విదళన చణ) అనేదీ. దేవగాంధారిరాగంలో (స్ఫురతు తే చరణ నళినయుగళే శిరసి మే హేకృష్ణా) అనేదీ, మోహనరాగంలో (సభాపతిం హృదంబుజే సదాభజే విమలం) అన్నకృతీ ఉదాహృతములు, ఇవన్నీ సంస్కృతంలో ఉన్నవి.

## పచ్చిమిరియం ఆదియప్పయ్య :

1740 నుంచి 1833 వరకు తంజావూరు నేలిన ప్రతాపసింహ, రెండవ తుల జాజీ రాజులకాలంలో ఉండిన వాగ్గేయకారులలో పచ్చిమిరియం ఆదియప్పయ్య అసామాన్యమైన ఉపజ్ఞ కలవాడు. ఇతని 'విరిబోణి' భైరవివర్ణం వంటిది. తాన వర్ణములలో 'నభూతో నభవిష్యతి' అని పండితులు పొగడినారు. రక్తిరాగాల లోను, దేశీయరాగాలలోను విశేష గమకములతో, జాతీయములతో. వేంకటరమణ ముద్రతో ఇతడు ఇంచుమించు మేరటూరు వీరభద్రయ్య మార్గాన్ని అనుసరించి అనేక కీర్తనలను రచించాడట. రాగాలాపన, మధ్యమకాల పల్లవి ఫణితులు ఇతనివలననే పరిశుద్ధమైనవట.

ఈ ఆదెప్పయ్య కుమారుడు వీణ కృష్ణయ్య, ప్రసిద్ధ వైణికుడై విజయ నగరం, మైసూరు, కొత్తకోట రాజ్యాధిపతులమీద 'సప్తతాళేశ్వరం' అనే మూడు ప్రబంధాలను రచించాడు ప్రసిద్ధములైన సప్తతాళాలలోని ధ్రువతాళంలోనే తక్కిన ఆరుతాళాలూ అంతర్లీనమై ఉండేటట్లు ప్రబంధపు పాట యెత్తుగడలో అన్నితాళాల మొదటి ఘాతలు ఒకే ఘాతగాపడేటట్లు ఈ ప్రబంధరచన ఉంటుంది. ఆ ప్రబంధముల సాహిత్యంలో రాజుల నామాక్షరాలలో ఒక్కొక్క అక్షరమును ఒక్కొక్క ఆవృత్తపు తొలి అక్షరంగా అర్థవంతంగా రచించాడు.

ఈ వీణ కృష్ణయ్య కుమారుడైన వీణ సుబ్బుకుట్టి అయ్య రాగాలాపన, మధ్యమకాల పల్లవి స్వరకల్పనలలోను గమకముల ప్రయోగంలోను, అతీతాన గతగ్రహములుపట్టి వాయించటంలోను తాళజ్ఞానములోను అపారజ్ఞానము కలిగినవాడట.

1707 లో త్యాగరాజు జన్మించిననాటికి పచ్చిమిరియం ఆదియప్పయ్యగారు వయోవృద్ధుడు త్యాగరాజాది యువక వాగ్గేయకారులు తరుచుగా ఆదియప్పయ్య గారిని కలుసుకొని, శాస్త్ర విషయాలలోను, రచనా సందర్భములలోను సందేహాలను నివర్తిచేసుకొనేవారు.

## వీణ పెరుమాళ్ళయ్య :

ప్రతాపసింహుని కుమారులైన తులజాజీ. అమరసింహులు తంజావూరు నేలుతూండినపుడు పుదుక్కోటలో విజయ రఘునాథ తొండమానుడనే రాజు ఆంధ్ర సాహిత్య సంగీతాలను పోషించేవాడు. వీణ పెరుమాళ్ళయ్య ఈ రాజువద్ద 20 రోజులపాటు భైరవి రాగాలాపన చేశాడట. సౌరాష్ట్రి సావేరి రాగాలలో వర్ణాలు రచించాడు. ఘనరాగ తానంలో అందెవేసిన చెయ్యి. 1760–1790

ప్రాంతంలో తంజావూరురాజుల కొలువులోనే ఇతడు ఉండేవాడట. ఇతని తమ్ముడు కొండయ్య సావేరిలో స్వరజతి చేశాడు. ఇంకొక తమ్ముడు నారాయణసామయ్య కూడ గొప్ప విద్వాంసుడు. విజయరఘునాథుని తండ్రియైన రఘునాథ తొండ మానుని ఆస్థానకవి సుదురుపాటి వెంకన్న పార్వతీ కళ్యాణం అనే యక్షగానాన్ని రచించాడు.

## మాతృభూతయ్య :

రెండవ తులజాజీ తర్వాత తంజావూరు నేలిన అతని తమ్ముడైన అమర సింహుని మంత్రి శివరాయమంత్రి ప్రోత్సాహమున ఆ మంత్రికి అంకితంగా పారిజాతాపహరణం యక్షగానంగా రచించిన వాగ్గేయకారుడు మాతృభూతకవి.

> 'గురుతర శాండిల్యగోత్రపావనుడ' వరకవి రంగార్యవరతనూభవుడ
> గురుకృపాసౌగంధి కుంతిలాదేవి. వరముచే జనియించి ప్రజలినవాడ
> మాతృభూతస్వామి మహితకటాక్ష, చాతుర్యపరిలబ్ద సరససాహిత్య
> సంగీత మధురవాగ్ధురి గల్గువాడ—శృంగారరసము తెల్పిన మేలువాడ.

అని యీ కవి తన పారిజాతాపహరణంలో తన్నుగూర్చి చెప్పుకొన్నాడు 'తల్లియైన దేవర' అని అర్థమిచ్చే 'తాయుమానవర్' అను ద్రావిడ నామంగ మాతృభూతేశ్వరుని దేవాలయం పుదుక్కోటలో ఉన్నదట. అందుచేత తంజ వూరుకు రాకముందు పుదుక్కోట నివాసియై యుండవచ్చునని నిడదవోలు వేంక రావుగారు వ్రాశారు. ఇతడు తెలింగ్యవిప్రుడని సుబ్బరామ దీక్షితులవార పేర్కొంటూ ఇతని భక్త్యతిశయాన్ని నిరూపించే సంఘటన నొకదానిని వ్రాశారు పేదరికంలో బాధపడుతూండిన యితడు సుగంధి కుంతలాంబకు అంకితంగ కీర్తనలు రచిస్తూండగా, ఆవిడ యితని స్వప్నంలో కనబడి 'తంజావూరులో న భక్తుడైన ప్రతాపసింహుని వద్దకుపొమ్ము — నీ లేమిని పోగొడతాడు అనిన్నీ. తంజావూరులో ప్రతాపసింహునికి కూడా స్వప్నంలో కనబడి నా భక్తు నీవద్దకు పంపుతున్నాను. అతని దారిద్ర్యమును పోగొట్టు మనిన్నీ చెప్పిందట తన రాక కెదురుచూస్తున్న ప్రతాపసింహుని కొలువులో మాతృభూతయ్య అఖ డంగా సమ్మానితుడై. ఆ తర్వాత త్రిశిరగిరి అనగా నేటి తిరుచ్చిరాపల్లి వెళ్ళి అక్కడ నెలకొని 'త్రిశిరగిరి' ముద్రతో అర్థపుష్టిగల నీతిపదాలు, కీర్తన రచించుకొంటూ ఉండేవాడట.

ఇతని పారిజాతాపహరణములో— కూచిపూడివారి గొల్ల కలాపపు ధోరణు చాలా కనిపిస్తాయి. గోపికా వస్త్రాపహరణ సందర్భంలో గుమ్మ కాంభోజిల గోపస్త్రీలు కృష్ణునికి మొక్కేటప్పటి దరువు :

చేరి మ్రొక్కిరి గోపాలాంగనలు చేరి మ్రొక్కిరి...
చేరి మ్రొక్కిరి సిగ్గుచేత కనులు మూసుక
సారె త్రిశిరగిరీశుడైన శ్రీహరికి—

చల్లనమ్మబోవు గొల్లపడుచు పద్యం :

ఉ. ముక్కర శుక్రుడిచ్చె నయమొప్పగ కమ్మలు సూర్యుడిచ్చె. పెం
పెక్కిన తారహారములు పేర్మిని చందురుడిచ్చె నింద్రుడున్
యెక్కువలైన కంకణము లిచ్చెను, పాపటబొట్టు శంభుడున్
చక్కని సూర్యచంద్రులును శారద యిచ్చెను — నాదుచల్లకున్.

ద్విపద : శ్రీరమ్యమైనట్టి చిక్కని చల్ల, సారస్యమైనట్టి చక్కని చల్ల
కూరిమి కొనరమ్మ కొమరైన చల్ల, భారతి గొన్నట్టి బాగైన చల్ల
శ్రీరమ గొన్నట్టి చెలువైన చల్ల, పార్వతి గొన్నట్టి పరువైన చల్ల
నవ్వుచు గొనరమ్మ నాచేతిచల్ల, నల్లావు పితికిన నయమైన చల్ల
తెల్లావు పితికిన తేటైన చల్ల......?......

ఎక్కడో దక్షిణదేశంలో ఉండినప్పటికీ జాతీయతను వదలని ఇతని తెలుగు నుడికారం నిత్యనూతనంగా శోభిస్తోంది.

**తచ్చూరి** సింగరాచార్యులవారి గాయకలోచనం అనే గ్రంథంలో మాతృభూతయ్యగారి కృతులు రెండూ. సింగరాచార్యులవారిదే అయిన సంగీత సర్వార్థ సార సంగ్రహంలో మాతృభూతయ్యగారి పదాలు మూడూ, ఉదహరించి ఉన్నారు. కేదార గౌళ రాగ కృతి - ఆదితాళం :

పల్లవి : ఏ భయమున కనిదా తప్పగల రీ జగతిలోన....
అనుపల్లవి : నీ భజనచేత కడతేరవలెనేకాక మాతృభూతలింగ...

చ॥ పొగరుమీర కత్తిమొనను బ్రదుకబోతే శత్రుభయము
చిగురు బోణులవలచి భోగించినను రోగభయము
అగణితోద్యోగములు చేసినంతటను రాజభయము
మగతనమున విద్యలభ్యసించిన మాత్రమున సంవాదభయము...

ఇలాగే **తర్వాతి** చరణాలలో జ్ఞాతి భయము, చోరభయము, వృశ్చికాది భయము, జఠరాగ్ని భయము, మనోభయము, యముని భయము - వివరించి 'పాయక త్రిశిరగిరి నిలయుని పదభక్తి కల్గువారలకే భయములే యంటవు' అని చాటుతాడు.

కాంభోజి రాగకృతి – మిశ్రలఘువు :

పల్లవి : ధర్మాత్ములయెద్ద దుర్మార్గ జనములు తలలె త్తగా వలెనా...
అనుపల్లవి : ధర్మస్వరూప శ్రీధర కరగతభ క్త మర్మ త్రిశిరగిరమాతృభూమతేశ,
చ॥ మందార వృక్షముక్రింద చుట్టుగోరంట పొదలల్లినట్ల
చందనద్రుమము చెంత కాలకూట సర్పములుండినట్లు
అందరికి చల్లనగు చంద్రునకు రాహుపద్ధము తగిలినట్ల ....

ఇంకా ఇతర చరణాలలో 'అందమైన తామరకొలనికి మొసలి అడుగుబెట్టి నీయక అందుండినట్లు' అనీ, 'అతిమధురమైన పానకమున పుడక అడ్డము తగిలినట్లు – అనిన్నీ, ప్రతిలేని చెలువంపు పైరులోన రెల్లు పలుమారు మొలిచినట్లు. ఇత్యాదిగా పల్లవిలోని అర్థానికి దృష్టాంతాలుగా చరణాలు నిర్మించాడు.

మోహనరాగ పదం – ఆదితాళం :

ప. చలముసేతూ నీకు మేరా – చక్కని సామి మ్రొక్కేరా
వెలయు దామెర కుమారా వేంకట భూపాలధీరా
కలకలయని యల చిలుకలు పలుకగ
చలమున నాతో హలహలి చేయుచు
పలుమరు నిను మదిలోన దలచుచు
బాలకడు మరులైనది రారా...
ఇంతి పట్టంపుదంతి, ఛామంతి పూబంతి,
మంతుగ నాచెలులలో మేల్బంతి
గుణరత్నములదొంతి యెంతని తెలుపుదు....

ఉన్న మూడు పదాలలోను ఈ మోహనరాగ పదమూ, కాంభోజి రాగంలోని. "సామిగా రారా చలముసేయుట మేరా నరనాథ మొక్కేరా" అ. ప. కామినేని వంశకలశాంభోనిధి చంద్ర, శ్రీమించు బంగారంక నృపేంద్రుని అలభామినిని చేకొనరా, వినరా....అన్న రెండు పదాలలోను ఉదాహృతులయిన దామెర కుమార వేంకట భూపాలుడును, బంగారు అంకనృపేంద్రుడు కృతిపతులుగా అనుపల్లవిలోని నామముద్రలో కనిపిస్తాయి.

సంగీత సర్వార్థసార సంగ్రహంలోని ఈ రెండుపదాలు మా అభిప్రాయం ప్రకారం మాతృభూత విరచితాలు కావు. దామెరవారి వంశావళి అనే గ్రంథం నుంచి సేకరించిన గ్రంథంలోని పదాలలో ఈ వెంకట భూపాలుడు కాళహస్తి రాజనీ, ఆయన అధ్యాత్మ రామాయణ కీర్తన కర్తయైన సుబ్రహ్మణ్యకవికి పోషకుడుగానూ వర్ణితుడైనాడు. అంతేకాకుండా ఈ రెండు పదాలలోను సుబ్రహ్మణ్య

కవి పదాలశైలీ అనుప్రాసలూ కనబడుతున్నవేగాని. మాతృభూతయ్యగారి మిగిలిన పదాలశయ్య కనబడదు.

మోహన – ఆది :

ఇంతి చక్కదన మింతింతయనుచు నెన్న తరముగాదురా (అనేపదంలో) త్రిశిరగిరినివాసా అని ఉండటంచేత ఇది మాతృభూతయ్య సొంతరచన అనీ, పై రెండు పదాలు సుబ్రహ్మణ్య కవివేకాని, మాతృభూతయ్యవి కావనీ స్పష్టము.

## ఇనుపసనిగెల వెంకట్రామయ్య :

ఆంధ్రభాషలో పండితుడు. సంగీత రచనలో ప్రౌఢుడు అయిన వెంకట్రామయ్య అనే వాగ్గేయకారుడు ఆదియప్పయ్యకు కడపటికాలంలో సమకాలికుడని సుబ్బరామదీక్షితులు వ్రాశారు. ఇతని ప్రౌఢ రచనలలోని.... జాతీయముల నెరిగి పాడుటకు దుర్లభముగా ఉండినందున అప్పటి గాయకోత్తములు ఇతనికి (ఇనుపసనిగెల వెంకట్రామయ్య) అని పేరిచ్చినారట. బోధేంద్రస్వాములను గురించి (సతమణి) అనే తోడిరాగ కీర్తనను మధురై నల్లూరు ప్రథమ స్వాములకు అంకితంగా కొన్ని కీర్తనలనూ, గోపాలకృష్ణ ముద్రతో కొన్ని దేవతా విషయిక కీర్తనలనూ రచించినాడట.

## శొంఠి వేంకటసుబ్బయ్య :

ఆదియప్పయ్య సమకాలికుడయిన యీ వాగ్గేయకారుడు వయస్సులో ఆయనకంటె కొంచెము చిన్నవాడు. ఆంధ్రబ్రాహ్మణుడు. ఆంధ్రభాషా పాండిత్యములోను సంగీత విశారదత్వమందును ప్రసిద్ధుడు. బిళహరి రాగంలో ఇతడు రెండవ తులజాజీపైని విచిత్ర కల్పనలతో ఒక వర్ణం రచించాడు. ఆనాడు సంగీత సాహిత్య రసికుడై విద్వాంసులను ఉదారంగా ఆదరిస్తూ ఉండిన మణలి చిన్నయ్య ముదలారి ఏర్పాటుచేసిన సభలో శొంఠి వేంకటసుబ్బయ్యగారు ఎన్నో సంగీత సాహిత్య రచనలనుచేసి మెప్పించాడట. వేంకట సుబ్బయ్య కుమారుడు వేంకటరమణయ్యకూడా సంగీత సాహిత్యములలో తండ్రికి మించిన పాండిత్యం కలిగినవాడని చెప్తారు. ఈయన త్యాగరాజుకు బాల్యమందు సంగీత విద్యా గురువు. పైనిచెప్పిన మణలి చిన్నయ్య ముదలారి పైడాల గురుమూర్తిశాస్త్రి అనే చతుశ్శాస్త్ర పండితునికూడా సన్మానించాడు ఈయననూ, ఈయన రచనలనూ గురించి ఈ అధ్యాయంలో ఇదివరకే చర్చించడమయినది.

## కుప్పుస్వామయ్య :

అమరసింహ మహారాజు కాలంలోను శరభోజీ మహారాజు ఏలుబడి ఆరంభంలోను ఉండిన కుప్పుస్వామయ్య తెలుగున మంచి ప్రజ్ఞ కలవాడు. భక్తి

రసాత్మకములయిన కీర్తనలను. శృంగార రసాత్మకమయిన పదాలను వరద వేంకట ముద్రతో రచించాడు.

## రాజగోపాలకవి – వాగ్గేయకారాగ్రణి :

సంగీత ప్రపంచమున పల్లవి గోపాలయ్య అను ప్రసిద్ధినిగన్న విద్వాంసుడే సాహిత్య ప్రపంచమున కవిరాజగోపాల వాగ్గేయకారాగ్రణిగా విలసిల్లినాడు...అని నిడుదవోలు వేంకటరావుగారు వ్రాశారు. ఇతడు రచించిన భక్తిజన పారిజాతము అనే ప్రబంధంలోని గద్యలో తన్ను గూర్చి యిలా చెప్పుకొన్నాడు :

'ఇది చింతామణి మంత్రజపలబ్ధ చతుష్షష్ఠి కలాకలాపాభిరామ గుంటూరి రామకృష్ణకవి సార్వభౌమనందన,' గోపాల విద్వత్కవీంద్రతనయ వేదాది విద్యా మనీషాభిరామ రాజగోపాల కవివాగ్గేయకారాగ్రణి ప్రణీతంబైన భక్తజన పారిజాతంబను మహా ప్రబంధంబునందు చతుర్థాశ్వాసము.'

ఇతని తాతగారుగాని వారికంటె పూర్వులుగాని గుంటూరు వాస్తవ్యులై తరువాత తంజావూరువచ్చి వలస విడిశారు. వెలనాటివాడయిన మేరటూరు వేంకట రామశాస్త్రి ఈయనకు బంధువర్గములోనివాడని కొందరు పరిశోధకులు వ్రాశారు. భరత సంగీత శాస్త్రధురీణులయిన వెలనాటి భాగవత కుటుంబాలవారు తంజావూరు అచ్యుతప్పనాయకుని కాలంలో దక్షిణాదికి వచ్చినప్పుడే, పల్లవి గోపాలయ్య పూర్వీకులుకూడా తంజావూరువచ్చి స్థిరనివాసం ఏర్పరచుకొని ఉంటారు ఇతడు ప్రతాపసింహుని కుమారుడయిన అమరసింహరాజు కాలంలోను, అటు తరువాతి శరభోజిరాజు కాలంలోను ఉండినవాడు. అటతాళంలో ఇతడు రచించిన... వనజాక్షి.... అనే కళ్యాణివర్ణం ఈనాటికీ సుప్రసిద్ధము. ఈతానవర్ణంలోని వరిక, గమకములూ స్వరకల్పనలయ్యా ఇతని సంగీత కల్పనా చమత్కార నైపుణ్యములకు దృష్టాంతములు. ఇంతేకాక, కాంభోజి, తోడి రాగాలలో అట తాళతానవర్ణాలను కొన్ని రక్తిరాగాలలో వేంకట ముద్రాంకితాలయిన కీర్తనలను కూడ రచించి ఇతడు కీర్తి పొందాడు. శార్ఙ్గదేవుడు నిర్వచించినట్లు రూపకాలప్తి

ననుసరించి పల్లవి పాడుటలో ఇతడు సమర్థుడు. తాళ జతుల ననుసరించే స్వర తానములు నృత్యానికి అనుకూలంగా ఉంటాయని. పద వర్ణాలకు ప్రతిగా ఇతడే తానవర్ణాలకు ప్రాచుర్యమిచ్చాడని అంటారు. వీటికి మధ్యమకాల చిట్ట స్వరాలు కూడా ఉండడంచేత నృత్యవేత్తలకూ, గాయకులకూ ఇవి ఎక్కువ ఆలంబ నీయాలైనాయి. ఇతని కీర్తనల పల్లవులలో రాగవిన్యాసం మనోధర్మయుతంగా సాగుతుంది. తోడిరాగంలో....అంబ నాదు....అనే కీర్తన నాటకురంజి రాగంలోని నీదుమూర్తిని కాంభోజిరాగంలో 'హరిపర్వ'కళ్యాణిరాగంలోని ...మహిషాసుర.... గోపాలయ్య రచించిన ఈ కీర్తనలు ఈనాటికీ విద్వాంసులు కచ్చేరీలలో గానం

చేస్తూంటారు. మోహనరాగంలో శ్రీపురవాసిని ఆశ్రితపావనీ, శ్రీ రమారమణీ మనోహర అని రెండు కీర్తనలనూ, భైరవిరాగంలో మహాత్రిపురసుందరీ అని ఒక కీర్తనా, ఆ మధ్య జి. యన్. బాలసుబ్రహ్మణ్యంగారు మద్రాసు సంగీత పరిషత్పత్రికలో సస్వరంగా పరిష్కరించి ప్రకటించారు.

## రామస్వామి దీక్షితులు :

సుబ్బరామ దీక్షితులవారు రామస్వామి దీక్షితులను గురించి వ్రాస్తూ 'ఈ ద్రావిడ బ్రాహ్మణుడు ఔత్తరుడు' అని వ్రాశారు. 1738 లో జన్మించిన రామస్వామి దీక్షితులు బాల్యంలో కంచిలో గడిపి, పదవయేట గుర్రపువారి కలహం మూలాన్ని తలిదండ్రులతో మధ్యార్జున క్షేత్రానికి దగ్గరున్న గోవిందపురంలో కాపురం ఏర్పాటు చేసుకొన్నారు. సంస్కృతాంధ్రములలో రామస్వామి దీక్షితులు మంచి పాండిత్యం సంపాదించాడు. మంచి శారీరం కలిగి సంగీతంపై కోరికపుట్టి తంజావూరికిపోయి, మేరట్టూరి వీరభద్రయ్యగారివద్ద రెండు సంవత్సరాలుండి రక్తి రాగాలలోను, దేశీయ రాగాలలోను వీరభద్రయ్యగారి కీర్తనలను స్వరజ్ఞానం కలిగేవరకు అభ్యసించి, ఆలాపన, పల్లవి, స్వరములు పాడ నేర్చుకొన్నాడు. అటుతర్వాత మధ్యార్జునంలో వేంకటమఖికి మేనమామ మనుమడైన వేంకట వైద్యనాథ దీక్షితులవద్ద వీణావాదనమును, చతురండి ప్రకాశికలోని రాగాంగోపాంగ భాషాంగ రాగ గీతములను సకల రాగతాళ లక్షణములను సాంగోపాంగముగా నేర్చుకొన్నాడు. గుర్వాజ్ఞపై తంజావూరువెళ్ళి ప్రతాపసింహ మహారాజు కుమారుడైన అమరసింహ మహారాజును మెప్పించి బహూకృతుడైనాడు. అమర సింహునిపైని ఇతడు రాగమాలికా కీర్తనమును రచించినాడు.

తిరువారూరిలోని కమలాంబా త్యాగరాజస్వాములపై భక్తితో ఎన్నో కీర్తనలను రచించాడు. నలువది యేండ్ల వరకు సంతానహీనుడైనందున ఇతడు భార్యతో వైద్యనాథుల ఆలయానికి పోయి, ముద్దుకుమారస్వామి సన్నిధిని భజన సేవచేసి, తిరువారూరికి వచ్చిన కొన్నాళ్లకు పుట్టిన పుత్రునికి ముద్దుస్వామి అని పేరు పెట్టుకొన్నారు. అతడే ప్రసిద్ధ వాగ్గేయకారుడు, త్యాగరాజు సమకాలికుడైన ముద్దుస్వామి దీక్షితులు. ఆ తర్వాత వేంకట వైద్యనాథ నామాంతరంగల చిన్నస్వామి, బాలాంబ, బాలస్వామి జన్మించారు. ముద్దుస్వామి తండ్రివలెనే క్రమాంతాధ్యయనంచేసి, కావ్య నాటకాలంకారాలు సిద్ధాంతకౌముదీ చదువుకొని, సంగీతం అభ్యసించాడు.

మణలి వెంకటకృష్ణుడనే చిన్నయ్యముదలారు రామస్వామి దీక్షితులు రచించిన అష్టోత్తర శతరాగ తాళమాలికను విని, కనకాభిషేకంచేసి, ఆ మాలికను పాడి వినిపించిన ఆయన కుమారులు చిన్నస్వామి బాలస్వాములను కూడా బహూ

కరించాడు. ఈ మణలి ప్రభువు కొలువులో ఒకనాడు వేంకటమఖి పౌత్రుడయిన గోవింద దీక్షితుడు రాగలక్షణ జ్ఞానం విషయమై పరీక్షించగా, రామస్వామి దీక్షితులు....నన్ను పరీక్షింపనేలా....అనే పదం మొదలారు రచించినట్లుగా చెప్పి కడపటి స్వరంలో వేంకటమఖి లక్షణమును స్ఫురించునట్లుగా, రచించి తన పుత్రులచేత పాడించి, వేంకటమఖి శిష్యులే అని మెప్పుపొందాడట.

తన రెండవ కుమారుడైన చిన్నస్వామికి నేత్రదోషం కలిగినపుడు రామస్వామి దీక్షితులు సకుటుంబంగా తిరుపతికిపోయి 'మనసా వేరితరుల తలచక' అనే నలువది యనిమిది రాగాల రాగమాలికను, వేగవాహిని రాగంలో 'ఇంకా దయరాకున్నను' అనే కీర్తనము గానము చేయగా, చిన్నస్వామికి తిరిగి దృష్టి వచ్చినదట. ఈయన ప్రతియేవేదశికిని గీత గోవిందం ద్వాదశసర్గమును పారాయణచేసి వ్రతనిష్ఠ పాటించేవాడట. శ్రీ మధురమీనాక్షిమీద 40 రాగాల రాగమాలికను. హిందోళ, రీతిగౌళ, మనోహరి, పూరచంద్రిక రాగాలలో చౌక వర్ణములను, శంకరాభరణ తాన వర్ణమును. వేంకట కృష్ణముద్రతో అనేక కీర్తనలను రచించాడు. హంసధ్వని అనే రాగాన్ని ఈయనే కల్పించి, ఆ రాగంలో ప్రసిద్ధ ప్రబంధము నొకదానిని రచించాడు. ఇతడు 1817 – ధాత సంవత్సరం శివరాత్రి పుణ్యకాలంలో పరమపదించినాడు.

## ఉపనిషద్బ్రహ్మయోగి : (1720 – 1800)

కాంచీపురానికి దగ్గరగా పాలారు నది ఒడ్డునగల బ్రహ్మపురం అనే గ్రామంలోని వాధులగోత్రీకులయిన లక్ష్మి, సదాశివులనే దంపతులకు సనకమహర్షి అంశమున పుట్టిన కారణజన్ముడు శివరాముడు చిరకాలము సంతతిలేని ఆ దంపతులు దగ్గరగా ఉన్న కృష్ణనగరం వెళ్ళి, అక్కడి శివకామసుందరీ కరినాథ దేవులను అర్చించి, తద్వారా ప్రసాదముగా శివరాముని కన్నారు. సంస్కృతాంధ్ర ద్రావిడ భాషలలోను సాంగోపాంగముగా వేదవిద్యయందును ప్రావీణ్యము సంపాదించి, యుక్తవయస్కుడైన శివరామునికి వివాహ ప్రయత్నాలు జరుగుతుండగా, అతనికి కడుపులో వ్రణబాధ కలిగినదట. ఇష్టదేవతలకు మ్రొక్కుబడులవల్లను, వైద్యమువల్లను, ఆ బాధ నివర్తి చేసుకొని, వివాహానంతరం ఒక కుమారుడు కలిగేవరకు గృహస్థాశ్రమం పాటించి, తరువాత శివరాముడు రామచంద్రేంద్రయోగిగా సన్యాసాశ్రమం స్వీకరించాడు. వాసుదేవేంద్రయోగి ఈయనకు ఉపదేశ గురువు.

రామచంద్రేంద్రయోగి కాంచీపురంలోని కైలాసనాథస్వామి ఆలయంవద్ద అగస్త్యాశ్రమంవద్ద ఒక మఠములో నివసించి, నూటయెనిమిది ఉపనిషత్తులకు, భగవద్గీతకు, భాష్యంవ్రాసి, ఉపనిషద్బ్రహ్మేంద్రయోగి అని ప్రసిద్ధి పొందారు.

తన కాలపు ప్రసిద్ధ వాగ్గేయకారులయిన త్యాగరాజస్వామికీ, ముత్తుస్వామి దీక్షితు లకూ ఈయన వయోధికుడూ, గురుప్రాయుడూ. ఆయన ఉపనిషద్వ్యాఖ్య ప్రజో త్పత్తి మార్గశీర్ష ఏకాదశినాడు (క్రీ. శ. 1751 వ సంవత్సరం డిసెంబరు 17 వ తేదీ) పూర్తిచేసినట్లు వ్రాసికొన్నాడు. అందుచేత సుమారు 1700 ప్రాంతాన జన్మించినట్లు ఊహించవచ్చును త్యాగరాజ, ముత్తుస్వామి దీక్షితులకు ఈయన దివ్యనామ సంకీర్తన రచనలో మార్గదర్శకుడూ, ప్రబోధకుడూ అయి, తరచుగా, వారిని తన మఠమునకు రప్పించుకొని, తన సంకీర్తనములను వారిచేత పాడించు కొని, వారి సంకీర్తనములను వింటూ ఉండేవాడట.

ఉపనిషద్బ్రహ్మేంద్రుల ప్రపౌత్రుడైన తిరువళ్ళూరు వీరరాఘవశర్మ 1896 లో ఉపనిషద్బ్రహ్మయోగీంద్రులు సంస్కృతంలో రచించిన ఆత్మకథా వృత్తాంతమును. ఆయన సంకీర్తన రచనలను సంకలనము చేశారు. కేవల సంస్కృత రచనములయిన వీటిలో ఆత్మకథ తెలుగు లిపిలో అచ్చు అయినది, అందుచేత ఆనాటి రామనామ సంకీర్తన సంప్రదాయమునకు ప్రధాన ప్రబోధకు డయిన ఈ యోగీంద్రుడు మన ఆంధ్రవాగ్గేయకారులలో ఆవశ్య స్మరణీయుడని చెప్పక తప్పదు.

ఈయన రచనలు :

1. వ్యావహారిక ప్రణవ వివరణ (తొమ్మిది భాగాలు)
2. వ్యావహారిక ప్రణవ నామావళి
3. ఆర్ష ప్రణవ బ్రహ్మప్రణవ నామావళి
4. నారాయణ తారానామావళీ శ్లోకములు
5. రామతరంగం (కృష్ణలీలా తరంగిణివంటి రచనలు)
6. రామాష్టపది (గీత గోవిందం వంటిది)
7. దివ్యనామ కీర్తనము.

మద్రాసు సంగీత పరిషత్ పత్రిక 27 వ సంపుటంలో డాక్టర్ రాఘవన్ గారు ఈ అమూల్య చరిత్రాంశాలను. ఈ యోగీంద్రుల సంకీర్తన రచనలను, వాటి సంగీత రచనాది వివరణములతోసహా ప్రకటించిన వ్యాసమును మాకు దయతో పంపినందుకు వారికి మేము కృతజ్ఞులము.

ఉపనిషత్తులకు, గీతకు, బ్రహ్మసూత్రములకు భాష్యములు వ్రాసి, జ్ఞాన మార్గముద్వారాను, నామావళిని, సంకీర్తనములను అష్టపదులను, తరంగములను గానముచేసి నాద బ్రహ్మోపేతమయిన భక్తిమార్గముద్వారాను నిర్గుణ, సగుణో పాసనల రెండింటి ద్వారాను పరమాత్మజ్ఞానము పొందిన ఈయన త్యాగరాజాదులకు మార్గదర్శకుడయినట్లు ముందుచెప్పుకొన్నాము.

నారాయణ తీర్థులు, సిద్ధేంద్రుడు, సదాశివ బ్రహ్మేంద్రయోగి, ఉపనిష ద్బ్రహ్మయోగి మొదలైన అద్వైతయోగులందరు. నాద విద్యను, భక్తిని మోక్ష సంధాయకమైన అమూల్యసాధనములుగా గ్రహించారు. త్యాగరాజస్వామి కూడ అదే మార్గమును అవలంబించి చివరికి సన్యాసము కూడా స్వీకరించాడు. ఈ అద్వైత భక్తిమార్గముల సమ్మేళనము బొప్ప దేవుడు రచించాడని చెప్పబడు తున్న సంస్కృత భాగవతమునందూ, మన పోతనామాత్యుని ఆంధ్రభాగవతము నందూ అనుసృతంగా వస్తున్నదే.

తాను (ఆత్మ) బ్రహ్మతో సమానమని చాటే అద్వైత తత్త్వకీర్తనలనే కాక, కొన్ని శివసంకీర్తనములను, అనేక రామసంకీర్తనములను, రామనామా వళిని ఈయన రచించాడు. ఈయన రామతరంగిణికీ, రామాష్టపది – నారాయణ తీర్థుల కృష్ణలీలా తరంగిణికీ జయదేవుని గీత గోవిందాష్టపదులకూ నామసామ్య మున తప్ప అనుకృతులు కావు.

ఈయన సంకీర్తనములలో వాడిన రాగములు

రాగప్రశంస :

ఈయన రచించిన సంకీర్తనములు దాదాపు 400 కు పైగా ఉన్నాయి. సుమారు 50 రాగాలకు పైగా ఈ కీర్తనలలో వాడబడినవి.

| | | |
|---|---|---|
| శుద్ధకాంభోది | 10 | కీర్తనలు |
| లలితం | 5 | ,, |
| నవరోజు | 6 | ,, |
| జంగల | 6 | ,, |
| ధనాసరీ జంగలా | 4 | ,, |
| బిభాసు | 2 | ,, |
| రామకలి | 5 | ,, |
| పూరి | 9 | ,, |
| ఘంటా | 7 | ,, |
| ద్విజావంతి | 7 | ,, |
| మంగళకైశికి | 5 | ,, |
| మాంజి | 6 | ,, |
| మణిరంగు | 8 | ,, |
| గౌళిపంతు | 7 | ,, |
| పరజు | 6 | ,, |
| ఆహిరి | 3 | ,, |

| | | |
|---|---|---|
| సైంధవి | 7 | ” |
| నవనీత | 8 | ” |
| బేగడ | 8 | ” |

పైన సూచించిన, కొన్ని ఆనాటి అపరూపరాగాలూ, కొన్ని రక్తిరాగాలూ మాత్రమే కాకుండా, ఆనంద భైరవి, నీలాంబరి, కేదారగౌళ, నాదనామక్రియ, సురటి, మోహన ఉసేని, శహన, మోహనకళ్యాణి, నాటకురంజి, పున్నాగ వరాళి, రీతిగౌళ, యమునాకళ్యాణి ధన్యాసి, వరాళి దర్బారు, యెరకల కాంభోది వంటి ప్రసిద్ధరాగాలుకూడా ఈ యోగీంద్రుని రచనలలో కానవస్తున్నాయి.

రామ తరంగమాల :

ఈ వాగ్గేయకార చరిత్రములోని ప్రబోధాధ్యాయంలో వివరించిన ఉదాహరణమనే సంగీత రచనమును అనుసరించి ఈ యోగీంద్రుడు రామ తరంగ మాలను రచించాడు. ఇందులోని కీర్తనలలో ఆద్యక్షరాలుగా అకారమునుండి క్షకారమువరకూ వర్ణమాలలోని అక్షరాలన్నీ వస్తాయి ఉదాహరణ ప్రబంధంలో ఎనిమిది విభక్తులలో ఒక్కొక్కదానికి ఒక పద్యమూ, ఒక గేయమూ ఉంటాయి, అని ఇక్కడ జ్ఞాపకము చేసికోవలెను.

ప్రారంభకీర్తన – శ్రీ రామచంద్ర మా ముద్ధర – మోహనరాగం
(సంబోధన ప్రథమ)

తరువాత వచ్చే 8 ఖండాలలో మొదటిది,

1. శ్రీరామ తుభ్యం నమోస్తు – బిళహరి
2. అయి శ్రీరామ తావకమూర్తిః (ప్రథమావిభక్తి) నాట
3. రామం కలయే – (ద్వితీయ) : యదుకుల కాంభోజి
4. రామేణ – మే – (తృతీయ) : సావేరి
5. శ్రీరామ చంద్రాయ తుభ్యం (చతుర్థి) : ఆరభి
6. తత్త్రిపదాదన్యం/– (పంచమి)
7. త్రైపర రామ చంద్రాయ – (షష్ఠి) – ఆనందభైరవి
8. విదేహ కైవల్య ధరాసుతేశే (సప్తమి) భైరవి.

దక్షిణ భారతదేశమంతటా భజన సంప్రదాయంగల ప్రతిచోటా నిత్యచర్వితమవుతూండే ఈ క్రింది నామావళి గేయమును విననివారుండరు. ఇది ఉపనిషద్బ్రహ్మయోగీంద్రులదే.

కృష్ణానంత ముకుంద మురారే
వామన మాధవ గోవింద,
శ్రీధర కేశవ రాఘవ విష్ణో
లక్ష్మీనాయక నరసింహ ।

సదాశివబ్రహ్మేంద్ర :

ఈయన వేమనవలె ఆధ్యాత్మతత్త్వం వేదియైన దిగంబరయోగి. సర్వసంగ పరిత్యాగి అమరావతీ తీరానగల కరూరు ప్రాంతంలోను, కావేరీ తీరానగల నెరూరు, కొడుముడి ప్రాంతాల పుణ్య క్షేత్రాలలోను 1830 ప్రాంతపు కాలంలో జీవించినవాడు. కొత్తకోట సంస్థానము వారీయనను గురువుగా పూజించుకొంటారు. నెరూరిలో ఉన్న ఈయన సమాధికి నిత్యోత్సవాలు చేస్తూంటారు.... మానస సంచరరే బ్రహ్మణి.... అను సామరాగ కీర్తన బ్రూహిముకుందేతి.... నహి రే నహిశంకా... చింతా నాస్తి కిల రే మానస మొదలగు అధ్యాత్మతత్త్వ బోధాత్మకములైన ఈయన సంస్కృత కీర్తనలు అతి ప్రసిద్ధములు.

తిరువాసనల్లూరు ఈయన స్వగ్రామం. పినతండ్రియైన రామభద్రదీక్షితులు ఈయనకు గురువు. ఆ తరువాత ఈయన పరమశివేంద్ర సరస్వతిస్వామివద్ద కూడా అధ్యయనం చేశారు. ఈయన రచించిన అధ్యాత్మకీర్తన లన్నింటిలోను 'పరమ హంస' అనే మకుటం ఉంటుంది. శివమానసికపూజ, ఆత్మ విద్యావిలాసము, బ్రహ్మసూత్రవృత్తి ఈయన ప్రసిద్ధ రచనలు. 1830 ప్రాంతాన జన్మించిన ఈ యోగీంద్రుడు 1887 లో నెరూరులో బ్రహ్మత్వం పొందారు.

## పదిహేడవ అధ్యాయం

# ధాతుకల్పనా దక్షులు : త్యాగరాజు
# (1767 - 1847)

### సంగీత త్రిమూర్తులు :

ఒక్క దక్షిణభారత సంగీత చరిత్రలోనే కాకుండా, ప్రపంచ సంగీత చరిత్రలోకూడ 1750 నుంచి 1850 వరకూ అత్యంత ప్రధానమైన యుగం. రెండు చరిత్రలలోనూ ఈ యుగాన్ని స్వతంత్ర ధాతుకల్పనాయుగమని పిలువవచ్చును. యూరప్‌లో ఆనాడు బీతోవెన్, మోజార్ట్, మెండల్‌సోన్, షోపెన్, షూబెర్ట్, వీబర్ అనుగొప్ప సంగీత కర్తలందరూ వెలిశారు. వారందరూ సోనాటా సింఫోని ఇత్యాదిగా (ఆర్కెస్ట్రా) వాద్యమేళములపైనీ, ప్రత్యేక వాద్యములపైనీ ప్రయోగింపదగిన సంగీత రచనలను. అపూర్వమైన ధాతుకల్పనాచాతుర్యముతో వెలువరించి యశోధనులైనారు. ఇదేయుగంలో తమ స్వతంత్ర ధాతుకల్పనాత్మకములయిన కీర్తనలతో దక్షిణభారత సంగీతానికి అఖండ పరివ్యాప్తిని చేకూర్చిన అవతారమూర్తులయిన వాగ్గేయకారులు త్యాగరాజు. శ్యామాశాస్త్రి, ముత్తుస్వామి దీక్షితులు, కర్ణాటకసంగీత చరిత్రకారులు వీరు ముగ్గురినీ సంగీత త్రిమూర్తులనీ. రత్నత్రయమనీ పిలుస్తారు. శ్యామశాస్త్రులు 1762 1827 త్యాగరాజు. 1767-1847 ముత్తుస్వామిదీక్షితులు 1776-1835. ముగ్గురూ తంజావూరుజిల్లాలోని తిరువారూరుకు సంబంధించినవారే. సమకాలికులే. వారి రచనలలో రాగస్వరూపము పరిపూర్ణమై సర్వకళలతోను స్పష్టముగా స్ఫురిస్తూ ఉంటుంది. మృదువైన భాషాశిల్పానికిగాని, నవ్యకల్పనలతో నిత్యసుందరమయిన సంగీత శిల్పానికిగానీ, ముందు వీరిని స్మరించి. మిగిలినవారిని స్మరించాలి. అతి అపూర్వరాగాలలో కూడ అతి సునాయాసంగా చెప్పిన కీర్తనలూ, ఒకే రాగంలో వేర్వేరు ప్రత్యేక వ్యక్తిత్వాలు కనిపించే వేర్వేరు కీర్తనలూ, ఆ కీర్తనల రసభావౌన్నత్యమూ. వాటి సంగీత రచనలో ఆత్మోత్తేజకమయిన ఉదాత్తతా, ఈ ముగ్గురు మహనీయులకూ సంగీత రత్నత్రయపదవిని పట్టముగట్టిన ప్రధానలక్షణములని శ్రీ సాంబమూర్తిగారు తమ వాగ్గేయకార చరిత్రంలో వ్రాశారు.

అంతేకాదు, ముగ్గురూ వేదశాస్త్ర పురాణవేత్తలు ; జ్యోతిశ్శాస్త్ర మంత్ర శాస్త్రాలలో మునిగి తేలినవారు – ముగ్గురి జన్మస్థానమూ తిరువారూరే. ముగ్గురూ వరప్రసాదులైన కారణజన్ములే. త్యాగరాజుకు నారదుడూ; దీక్షితులకు చిదంబర నాథయోగీ, శ్యామాశాస్త్రిలకు సంగీతస్వామీ - ముగ్గురు దేవతాచోదితులైన యోగివర్యుల సంబంధమే ముగ్గురకూ సంగీతరచనా ప్రాదుర్భావకారణమయింది. రామబ్రహపుత్రులలో కనిష్ఠుడు త్యాగరాజు సాహిత్యశైలి ద్రాక్షాపాకముగాను, శ్యామాశాస్త్రిలది కదళీపాకముగాను, దీక్షితులది నారికేళపాకముగాను. సంగీత రచన త్యాగరాజుది గోదావరివలె విస్తృతమై, శ్యామాశాస్త్రిలది కృష్ణవలె గంభీరమై, దీక్షితులది ఉభయ ధోరణులతోను త్రివేణీ ప్రవాహమై సాగింది. ఆధు నిక సంగీతానికి వీరి రచనలకంటే స్పష్టతరమైన లక్ష్యాలులేవు. దేశంలోని ప్రసిద్ధ క్షేత్రములను, దైవతములను ముగ్గురు సేవించి కీర్తనలు చేశారు. పంచరత్నములు, నవరత్నకృతులు, నవరత్న మాలికలు మున్నగు రచనలు ముగ్గురూ చేశారు. ముగ్గురూ ఆధ్యాత్మిక తత్వవేత్తలు ; అంతర్దృష్టికల యోగిపుంగవులు లోకోజ్జీవన కరులయిన ఉపదేశకులు, ముగ్గురూ ముందుగా తమ మరణకాలమును తెలిసికొని, ప్రకటించి, ఇచ్ఛామోక్షమును చెందిన తపస్సిద్ధులు జయదేవ, లీలాశుక, అన్నమా చార్యుల కోవకుజెందిన అవతారమూర్తులు.

## త్యాగరాజు : (చారిత్రక పరిస్థితి)

'వయసు గతింపగా తిరిగి వచ్చినవారము దేశదేశముల్<br>
భయపడనేల ? నాడులను బట్టి వచింతుము దేవుడైన రా<br>
మయగుడిలేని గ్రామ మొకచెనను గానము; భక్తుడైన త్యా<br>
గయకృతిలేని గానసభలచ్చట గానము నిక్కువంబుగన్ -<br>
పావన భావముల్ తొలకి పైకొన రాగరస ప్రవాహముల్<br>
తావులు నూప మిన్నొరసి తాళతరంగములొప్ప లోక సం<br>
జీవ నిబంధ రామపద సింధువులో వరభక్తి మంధర<br>
గ్రావము దిప్పి ముక్తిసుధ గాంచిన త్యాగసుధీంద్రు నెన్నెదన్'<br>
—వేంకట పార్వతీశ్వర కవులు.

నాయకరాజులనాడు ప్రారంభించిన యక్షగాన రచనమును, పదరచనమును వారి తర్వాత తంజావూరు నాక్రమించిన మహారాష్ట్ర రాజులుకూడా ఇతోధిక శ్రద్ధతో అవలంబించి, బహువిధాల విస్తరింపజేశారని ముందరి అధ్యాయంలో చెప్పు కున్నాము. క్షేత్రయ్య గొంతులో పరిపక్వమై ధాతుమాతు సమాన ప్రాధాన్యముతో సమగ్ర స్వరూపము నొందిన పదరచన మహారాష్ట్రులనాడు శాహభూపాలుడు, గిరిరాజకవి మేరటూరి వీరభద్రయ్య, కాశీనాథయ్యవంటి వాగ్గేయకారుల రచనలల్లో

ధాతుకల్పన మరింత విస్తృతి పొందినది. శాహభూపాలుడు, గిరిరాజకవి, యక్షగానముల రచనలద్వారా సలాములు, శబ్దములు మొదలైన సంగీత రచనలకూ, వీరభద్రయ్య ఆదియప్పయ్యవంటి వాగ్గేయకారులు నాట్యోచితములైన చౌకవర్ణ, పదవర్ణ, తానవర్ణముల, రచనద్వారాను, మార్గదర్శి శేషయ్యంగారు, పల్లవి గోపాలయ్య, రామస్వామి దీక్షితులువంటి వాగ్గేయకారులు కీర్తన రచనముద్వారాను ధాతుకల్పనను విస్తరించి కొత్తవరవడులు చూపించారు. ఉపనిషద్బ్రహ్మయోగీంద్రుల వంటివారు సంకీర్తన (భజన) పద్ధతికి ఇతోధిక ప్రవర్తకులైనారు.

## తాత తండ్రులు :

శాహభూపాలుని ఆస్థాన వాగ్గేయకారుడైన గిరిరాజకవికి స్వయానపౌత్రుడే మన త్యాగయ్య, అయితే గిరిరాజకవి పుత్రులలో రామబ్రహ్మము కనిష్ఠుడు. రామబ్రహ్మము పుత్రులలో కనిష్ఠుడు త్యాగయ్య, అందుచేత త్యాగయ్య జన్మించిన 1767 నాటికి గిరిరాజకవి బహువృద్ధుడూ, త్యాగయ్య ఇంచుమించు పసిబాలుడూ అయి, త్యాగయ్యకు జ్ఞానము వచ్చేనాటికి తాతగారు చనిపోయి వుండవలెను. శాహభూపాలునినాడు గిరిరాజకవి తాను స్వయంగా యక్షగానములను పదములను రచించడమే కాకుండా, శాహభూపాలుని యక్షగాన పద రచనములో ఆంతరంగిక సాహాయ్యకుడై ఉండియున్నట్లు అనేకమంది పండితుల అభిప్రాయము. శాహభూపాలుని తర్వాత శరభోజీ వరకూ కూడా తంజావూరు నేలిన రాజులకు గిరిరాజ కవిపైనా, అతని కుటుంబముపైనా ఆదరము తగ్గి ఉండినదా అని గిరిరాజ కవిని గురించి వ్రాసినప్పు డనుకొన్నాము తగ్గలేదు. శాహభూపాలుని తర్వాత గిరిరాజకవి వృద్ధుడై ఆ స్థానముతో సంబంధం తగ్గి ఉంటుంది. ఆయన కుమారులలో రామబ్రహ్మముగారు తులజాజీ మహారాజు ఆస్థానంలో శ్రీరామనవమి ఉత్సవ సంవత్సరాలలో రామాయణ ప్రసంగములుచేస్తూ ఉండినట్లునూ, తిరువారూరు, తిరువయ్యారులలో గృహాదిక బహుమానములను పొందుతూ ఉండినట్లును ఆచార్య విస్సా అప్పారావుగారి ఉపోద్ఘాతంవలన తెలుస్తోంది. గిరిరాజకవి తండ్రియైన కాకర్ల పంచనదబ్రహ్మముగారు 1600 సం.... ప్రాంతమున కర్నూలు జిల్లాలోని కంభం తాలూకా ప్రాంతంనుంచి తంజావూరు జిల్లాలోని తిరువారూరు అను పుణ్యక్షేత్రానికివచ్చి స్థిరపడిన ములకినాటి ఆంధ్రబ్రాహ్మణులు. భారద్వాజ గోత్రులు వేదశాస్త్ర పురాణపండితులు. పంచనద బ్రహ్మంగారి అయిదవ పుత్రుడు గిరిరాజబ్రహ్మము. త్యాగయ్య వినాయకుని గురించి చేసిన 'గిరిరాజ సుత తనయా' అనే బంగాళరాగపు కృతిలో తన తాతగారిపేరు ధ్వనించేట్లు చేశాడనీ, 'సీతమ్మ మాయమ్మ శ్రీరాముడు మాకు తండ్రి' అనే వసంతరాగ కృతిలోనూ, 'రామబ్రహ్మతనయుడౌ త్యాగరాజు' అనే మాటలలో 'దొరకునా ఇటువంటిసేవ'

అనే బిలహరి కృతిలోనూ తన తల్లి దండ్రుల పేరులను స్ఫురింపజేశాడనీ పండితుల విశ్వాసము.

జననం:

సీతమ్మ, రామబ్రహ్మముగార్లకు పంచాపకేశ బ్రహ్మమనే జపేశయ్య మొదటి కుమారుడు. రామనాథబ్రహ్మం రెండవ కుమారుడు. వీరిద్దరు దైవభక్తి గాని, పితృ మాతృభక్తిగాని లేక గ్రామములో అల్లరి చిల్లరి పనులవల్ల తల్లి దండ్రులకు ఇబ్బంది కలిగించేవారట అప్పుడొకనాటి రాత్రి తిరువారూరు త్యాగ రాజస్వామి ఆ దంపతులిద్దరికీ స్వప్నంలో దర్శనమిచ్చి, భక్తాగ్రేసరుడును, ప్రసిద్ధ వాగ్గేయకారుడును కాగల కుమారుడు వాల్మీకి, నారద, సరస్వతుల అంశమున జన్మిస్తాడనీ, అతనికి తన పేరు పెట్టమనీ సెలవిచ్చి అంతర్ధానమయినాడట. క్రీ. శ. 1767 వ సంవత్సరం సర్వజిన్నామ సంవత్సర వైశాఖ శుద్ధ షష్ఠినాడు ఆ దంపతులకు వరప్రసాదిగా జన్మించిన ఆ పుత్రునకు త్యాగరాజబ్రహ్మమని నామకరణం చేసికొన్నారు.

బాల్యం, విద్యాభ్యాసం:

త్యాగయ్యగారి యిలవేల్పు శ్రీరాముడు. తల్లిదండ్రుల పూజామందిరంవద్ద బాల్యంలోనే త్యాగయ్య రామభక్తిపరుడైనాడు. తల్లి త్యాగయ్యకు పూజాసమయా లలో జయదేవుని అష్టపదులను, పురందరదాసు రామదాసు కీర్తనలను తాళ్ళపాక అన్నమాచార్యాదుల సంకీర్తనములను నేర్పి, ఆయనచేత పాడించేదట. తండ్రి గారివద్ద సంస్కృతాంధ్ర భాషలలో పాండిత్యం సంపాదించి, పోతనగారి ఆంధ్ర భాగవతం శ్రద్ధగా చదువుకొనేవాడట. కొంత కాలానికి రామ పంచాయ తన పూజతోనే ఆరంభించి పెద్దలు నేర్పిన కీర్తనలు పాడి పాడి స్వయముగా కవనధార కలిగి, ఒకనాడు దేశీయ తోడిలో 'నమో నమో రాఘవాయ' అనే దివ్యనామ సంకీర్తనమును రచించి, ప్రతిరోజూ పూజలో ఆ విధంగా దివ్యనామ కీర్తనలను రచించి పాడుతూండేవాడు. వాటిని ఇంటి గోడలమీద వ్రాసుకొనే వాడట. వాటిని జాగ్రత్తగా వ్రాసికొని, తండ్రియైన రామబ్రహ్మముగారు విద్వాం సులకు చూపగా వారు త్యాగయ్య భక్తికీ, కవితా శక్తికీ మెచ్చుకొని, ఆ కీర్తన లను గ్రంథంగా వ్రాసి ఉంచమని చెప్పినారట. త్యాగయ్య గాన ధోరణీ, కంఠమూ మనోహరముగా ఉన్నవని సంగీతంలో శిక్షణయిస్తే పేరు తెచ్చుకొన గలడనీ తోచి, ఆయన తండ్రి అతనిని తులజాజీ మహారాజుచేత అర్ధ సింహాసన గౌరవం పొందిన ఆస్థాన విద్వాన్ శొంఠి వేంకట రమణయ్యగారి వద్ద శిష్యునిగా ప్రవేశపెట్టినారు. శిష్యుడైన త్యాగయ్య ఏక సంథాగ్రాహియై ఒక సంవత్సరంలో గురువుగారివద్ద చెప్పుకొనవలసినదంతా నేర్చుకొన్నాడట. త్యాగయ్య మేనమామ

గారైన వీణ కాళహస్తయ్యగారు ప్రసిద్ధ వైణికులు. ఆయన ఇంట్లో చాలా సంగీత గ్రంథా లుండేవి. అవి అన్నీ చదివివేసినా త్యాగయ్యకు మనస్సులోని కొన్ని సందేహాలు మిగిలిపోయేవట. ఇలా వుండగా రామకృష్ణానందస్వామి అనే మరుదనల్లూరుమఠ సన్యాసి వచ్చి త్యాగయ్యకు నారదోపాస్తి మంత్రం ఉపదేశించారట. ఈయన రామబ్రహ్మంగారికి కూడ రామమంత్రం ఉపదేశించినవాడు. త్యాగరాజు తిరువయారులోని పంచనదీశ్వరుని ఆలయంవద్ద ఆ మంత్రాన్ని పునశ్చరణ చేయగా ఒకనాడు నారదుడే యతి వేషంలో త్యాగయ్యకు దర్శనమిచ్చి ఆలయంలోకి తీసుకవెళ్ళి 'స్వరార్ణవ' మనే సంగీత గ్రంథాన్నీ, నారదీయమనే మరొక సంగీత గ్రంథాన్నీ యిచ్చి దానివలన సకల సందేహ నివృత్తి కలుగుతుందని సెలవిచ్చి అంతర్ధానుడైనాడట. ఆ విధంగా దర్శన మిచ్చిన నారద గురువర్యుని గురించి త్యాగరాజు భైరవి రాగంలో 'రాజిల్లు వీణ కల్గు గురురాయ' అనీ, కానడరాగంలో 'శ్రీనారద నాదసరసీరుహ భృంగ శుభాంగ శ్రీ త్యాగరాజ నుత శ్రీ రమాంపాలయ' అనీ, విజయశ్రీ రాగంలో 'వరనారద నారాయణ స్మరణానందానుభవముగల శరదిందు విభావఘనా ఘనసారముగాను బ్రోవుమిక' అని స్తుతిస్తూ వేర్వేరు కీర్తనలను రచించాడు.

త్యాగరాజు రెండవ అన్న యౌవనంలోనే గతించాడు. పెద్దన్నగారికి పెండ్లి అయిన తర్వాత త్యాగయ్యకు 18వ ఏట పార్వతమ్మ అను కన్యను ఇచ్చి వివాహం చేశారు. ఆ తర్వాత రెండేండ్లకు త్యాగయ్య తండ్రి పరమపదించాడు. అటు పిమ్మట ఐదేండ్లకు పార్వతమ్మ మరణించగా ఆమె చెల్లెలయిన కమలాంబను త్యాగయ్య కిచ్చి ద్వితీయ వివాహం చేశారు.

## శ్రీ రామ సాక్షాత్కారం:

త్యాగయ్య రామకృష్ణానందస్వామి ఉపదేశానుసారముగా రామతారక మంత్రమును తిరువయ్యారులోని పంచనదీశ్వర దేవాలయంలో నిష్ఠగా జపిస్తూ, 38 ఏండ్లయేసరికి 96 కోట్లు పునశ్చరణ చేసెనట. అప్పుడు లక్ష్మణ సమేతంగా విశ్వామిత్రయాగ సంరక్షణము చేస్తూండిన నాటి మోహన రూపంలో శ్రీరాముడు ఆయనకు ప్రత్యక్షమై క్షణకాలం దర్శనమిచ్చి అంతర్ధానమాయెనట. ఆనంద పారవశ్యంలో త్యాగయ్య అప్పుడు చెప్పిన కీర్తనే - అఠాణా రాగంలోని 'ఎలా నీదయరాదు, పరాకు జేసేవేల. కీర్తనలోని' బాల కనకమయచేల సుజనపరిపాల. విధృతశరజాల, ఘనాఘననీల, నవ్యమాలికాభరణ, రాజీవనేత్ర, జలధిగంభీర. మదనసుకుమార, అతిలావణ్య, దివరాజకోటి సమతేజ, జలజముఖ, యాగరక్షణ, యోగీంద్ర సుహృద్భావిత' ఇత్యాది విశేషణము లన్నిటిలోను త్యాగయ్యకు ఆనాడు సాక్షాత్కరించిన దివ్యమంగళాకృతి స్ఫురిస్తుంది. ఆనాడే గాక త్యాగయ్య

జీవితంలో అనేకసార్లు ఆయనను శ్రీరాముని బాలమోహన రూపమే ఆకర్షించినట్లు ఆయన రచించిన ఇతర కృతులవల్ల మనకు తెలుస్తుంది మధ్యమావతి రాగంలోని 'అలక లల్లలాడగ గని ఆ రాణ్ముని యెటుపొంగెనో' అను కృతిలోకూడ అటువంటి రామదర్శనమే వర్ణితము. 'శ్రీరామ జయరామ' అను యదుకుల కాంభోజికృతిలో ఆనాటి కౌసల్యా, ఆ దశరథుడూ, 'తపమేమి చేసెనో తెలియా' అని పాడుకొంటుంటే ఎవరికైనా ఒడలు పులకరించకపోవడం అరుదు.

## జీవనోపాధి:

పరమభక్త శిరోమణియైన త్యాగయ్య జీవనోపాధికోసమై నరుల కొలువు చేరి నౌకరి చేయుటకంటే, తంబురా చేతపుచ్చుకొని ఒకరిద్దరు శిష్యులు తాళము వేస్తూ వెంటరాగా, రామనామ సంకీర్తనములను గానముచేస్తూ గ్రామంలోని సద్గృహస్థులు హృదయ పూర్వకంగా ఇచ్చిన బియ్యము, పప్పులు 'ఉప్పు మొదలు కప్పురం' వరకు ఇతరమైన దినుసులను ఉంఛవృత్తివలన సంపాదించుకొని యింటికి తెచ్చుకొని, దేవతావర్చన సంకీర్తనాదులైన వెనుక తానూ, శిష్యులూ భుజించేవారట. త్యాగరాజు అన్నగారయిన జపేశయ్యకు యీ పద్ధతి నచ్చేదికాదు. సంగీత సాహిత్యములలో ని:యై రాజులను, ఆస్థానములను సమ్మోహనపరచి, సభాజయముపొంది, వేలకు వేలు సంపాదింపగల శక్తియుక్తులను, అర్హతను గలిగిన త్యాగరాజు అటువంటి మహావకాశాలన్నీ విడిచి బికారి బ్రతుకు బ్రతకడం తలచుకుంటే ఆ అన్నగారికి కడుపు తరుగుకొనిపోయి, ఒళ్ళుమండిపోయి, కోపం వచ్చేది. తమ్ముని మనస్సును మరల్చడానికని జపేశయ్య చాల విధాల ప్రయత్నించాడు. కాని లాభం లేకపోయింది. ఆ ప్రయత్నాలలో ఊరిలోనివారి కొందరి సహాయాన్ని తీసుకొని తమ్ముని బాధించే యెత్తులుకూడా వేసినా, త్యాగయ్య మనోనిశ్చయమును మార్చలేకపోయాడు. కాపురములు వేరయితే, తమ్ముడికి బాధ్యత తెలిసివచ్చి దారిని పడతాడేమో అని. జపేశయ్య, తహాశీల్దారు సాయంతో పిత్రార్జితమయిన తిరువయ్యారులోని యింటిని రెండు వాటాలుగా విభజించి, ఉత్తరపు వాటా తాను తీసుకొని, దక్షిణపు వాటాను తమ్మునికిప్పించాడని 'దినము నిత్యోత్సవమున కాసజెందితి, నా మనసునను యిల్లు ఒకటనియుంటిగాని అనుదినము నొరుల మేలును జూచి తాళలేకను రెండు సేయవలెననుచు బల్కితినా' అని త్యాగరాజు తనవాటాకువచ్చిన 'రామపంచాయతనం' వద్ద కూర్చుండి, మొరపెట్టుకొన్నాడు. మధ్యమావతి రాగంలోని 'నాదుపై పలికేరు నరులు' అనే కీర్తనలోని రెండవచరణమది. మొదటి చరణంలో....

'పంచశరజనక ప్రపంచమున గలసుఖము
మంచువలెననుచు మదినెంచితినిగాని

పంచుకొని ధనము లార్జించుకొని నరి యెవ్వ
రించు మరి గతియు లేదంచు బల్కితినా'—

అని చెప్పిన మాటలలో అన్నగారితో పంచుకొనడము తన కభిమతం కాదని తెల్లమవుతుంది. మూడవ చరణంలో....

'ప్రాణ మేపాటియని, మానమే మేలంటి
గాని శ్రీరామ పరమానందజలధీ
శ్రీనాథ కులములో లేనిదారిని బటి
జేనె డుదరము నింప నొరుల బొగడితినా'....

అని చెప్పిన మాటలలో వలె తన కులమునకు విధ్యుక్తధర్మముగా శాస్త్రము లలో చెప్పబడినది. తన పూర్వులు అనుసరించినది యైన, ఉంఛవృత్తిని అవలంబించడమే తనకు మానమనుకొన్నాడుగాని, పొట్టకోసము పరుల కొలిచి ధనార్జన చేయడాన్ని త్యాగరాజు నిరసించాడు. ఈ భావాన్నే 'రామరామ గోవింద రక్షించు ముకుంద' మొదలయిన దివ్యనామ సంకీర్తనములలోను, ఇంకా యితర కీర్తనల లోను కూడా వెల్లడించాడు. పేరుపడిన అన్నగారి ప్రోత్సాహంతో ఊరిలోనివారు కొందరు త్యాగయ్యపై చాడీలు చెప్పుకొంటూ లేనిపోని నిందలూ, అపవాదులూ ప్రచారం చేస్తూ ఉండేవారు. 'త్యాగయ్య యెంతసేపూ రాముడు రాముడని భజన చేస్తూ ఉంటాడేకాని, తిరువయ్యారులో వెలసిన ధర్మ సంవర్ధనీదేవిని తలపనే తలపడు. ఎంత కావ్వో' – అని ఊరివారు కొందరనుకొంటూండగా త్యాగయ్య చెవిని పడ్డది, ఈ అపవాదుకు తాను తగనని ఆమెకు విన్నవించుకొంటూ ఆయన 'కరుణ జూడవమ్మ! అనే తోడిరాగకీర్తనలో

'అనేక జగదాధారివి నీ వనే మదిని నెరనమ్మితిగా నే
మనే వాడనోయని నీమది నెంచనే వద్దనుచు నాతని వేడు
దునే నాదుపై వినేచాడి చాలునే నీదు దయకు నే పాత్రుడౌ
దునే కువలయనయనే సువసనజఘనే విధునిభవదనే సంతవము....
పరాశక్తి నాయొకచిత్తము తామరాకు నీరు వితము తల్లడి
ల్లరాదు అందునకేమి ఫలము శంబరారికి యరశరీరి,
పురాణపురుషుడగు రామునికి యా పురారికిని నీకు రాజధరి, మ
చ్చరాన వేరెంచరాదు అను త్యాగరాజు నిక విడువరాదు సతతము....

అని గానంచేసి. అజ్ఞానులైనవారు తెలియక, నీకు, శంబరారికి, రామునికి భేదములు కల్పిస్తున్నారుగాని, నా మనసులో ఆ విభేదాలు లేవని నీకు తెలియదా అమ్మా అని ప్రాధేయపడినాడు.

ఇటువంటి సూదిపోటులకు చలించిపోక, చెక్కుచెదరని మనోనిశ్చయంతో త్యాగరాజు తాను నిర్ణయించుకొన్ని ప్రకారం ఉంఛవృత్తిలో నిత్యరామ సంకీర్త

నముతో 40 ఏండ్లు గడిపేసరికి, ఆయనను రామతారకమంత్రసిద్ధి కలిగి. వైణికుడుగా, గాయకుడుగా, పరమభక్తాగ్రేసరుడైన వాగ్గేయకారునిగా ఆయన కీర్తి దేశమంతటా నలుదిక్కులా వ్యాప్తి చెందింది. ఆనాటి విద్వాంసులూ, గాయకులూ త్యాగయ్య గానము విని తరించవలెననీ, ఆనాటి ఆయా సంస్థానముల మహారాజులు ఆయనను తమ ఆస్థానానికి ఆహ్వానించి, ఆశ్రయమిచ్చి అపూర్వ సన్మానములు చేయవలెనని అభిలాష పడుతూండేవారు. త్యాగయ్యకు పితామహుల నాటి మిత్ర ప్రభు వంశానికి చెంది ఆనాడు తంజావూరు నేలుతూ ఉండిన రెండవ శరభోజీ మహారాజు అమూల్య వస్త్రాభరణ జాంబూనదాదులను కానుకలుగా పంపి, ఆయనను తంజావూరు వచ్చి,తన కొలువును పవిత్రం చేయమనీ ప్రార్థిస్తూ సందేశం పంపించాడు అప్పుడైనా ఒప్పుకొని దారిని పడతాడేమో అని. అన్నగారైన జపేశయ్యకూడా ఆశించాడు కాని ఆయన కళ్యాణి రాగ కీర్తనలో చెప్పినట్లు 'నిధి చాలా సుఖమా – రాముని సన్నిధి సేవ సుఖమా–నిజముగ తెల్పు మనసా – మమతా బంధనయుతనరస్తుతి సుఖమో, సుమతి త్యాగరాజనుతుని కీర్తన సుఖమో' అని ప్రశ్నించుకొని, రాజాహ్వానాన్ని, కానుకలనూ నిరాకరించిన నిరాడంబరజీవి, మహాయోగి.

కన్నయ్య భాగవతులు మొదలైన త్యాగయ్యగారి శిష్యుల ద్వారా తిరువాన్కూరు మహారాజైన స్వాతి తిరునాళ్ల ప్రభువు త్యాగయ్యగారి కృతులను విని ముగ్ధులై, వాటిని కర్తృముఖంగా విని ఆనందించే కోరికతో తమ ఆస్థాన గాయకుడైన వడివేలుగారిద్వారా ఆహ్వానం పంపించాడు వడివేలుగారు ఆయనను తరచు కలిసికొంటూ ఒకనాడు మహారాజు ఆహ్వానం సంగతి చెప్పి పెద్ద పదవీ సన్మానమూ లభించగలదనీ విన్నవించగా త్యాగరాజు ఆహ్వానమును నిరాకరించి సాళగ భైరవిరాగంలో 'పదవి. నీ సద్భక్తియు గల్గుటే' అనే కృతి చెప్పినారు.

> 'పదవి నీ సద్భక్తియు గల్గుటే ...
> చదివి వేదశాస్త్రోపనిషత్తుల సత్త తెలియలేనిది పదవా ?
> ధనదార సుతాగార సంపదలు, ధరణీశుల చెలి మొకపదవా ?
> త్యాగరాజనుతుడే శ్రీరాముని తత్త్వము దెలియని దొక పదవా ?...

తాను పంపిన కానుకయు త్యాగరాజు తిరిగి పంపించి వేసినందుకు శరభోజి మహారాజు మనస్సు చాలా నొచ్చుకుంది. అది 1802 ప్రాంతం తూర్పుఇండియా కంపెనీవారు శరభోజి బిరుదములను మాత్రముంచి అధికారాలన్నిటినీ తొలగించివేశారు. ఆ ఖిన్నతకు త్యాగరాజు తిరస్కారం ఒకటి తోడయింది. త్యాగరాజును ఎలాగైనా సరే తీసుకొని రమ్మని శరభోజి యిద్దరు దండనాధులను గుర్రాలపై తిరువైయ్యారు పంపించాడు. వారు వెళ్లగానే రాజుకు విపరీతమైన కడుపునొప్పి

కలిగి వైద్యులెవ్వరికీ చికిత్సకు లొంగలేదు. అప్పుడది ఎవరో మహానుభావునికి అపచారం వలన కలిగిన నొప్పి అని వారు తేల్చగా, వెళ్ళిన దండనాథులు త్యాగరాజును కలుసుకోకుండా వారిని త్రోవలోనే కలిసికొని వెనక్కి మళ్ళించడానికి మరిద్దరు వేగరులను పంపించి వారిని ఆ ప్రకారంగా వెనుకకు రప్పించగానే రాజుకు కడుపునొప్పి తగ్గినదట. అప్పుడు శరభోజీకి వివేకోదయమై తానే స్వయంగా త్యాగరాజు ఇంటికి వెళ్ళి, ఆయన స్నేహం సంపాదించుకొని, సకుటుంబంగా తిరువయారుకు వస్తూ, పోతూ త్యాగయ్యగారి సంకీర్తన కాల క్షేపములకు స్వయంగా పోవుచు, విని తరించేవాడట. 'నిధి చాలా సుఖమా' అను కీర్తన రచనము వల్లనూ, ఇంకా యిటువంటి మహిమాన్విత సంఘటనల వల్లనూ త్యాగరాజు మహా పురుషుడైన భక్తుడని లోకమంతటా వ్యాప్తి కలిగెను

త్యాగరాజుకు ఎలాగైనా కొంత ధనం సమర్పించాలనే ఆశయంతో శరభోజి మహారాజు ఒకనాడొక బ్రాహ్మణుని నియోగించి, త్యాగయ ఉంఛవృత్తికై గ్రామ పర్యటన చేస్తున్నప్పుడు ఆయన వీపున వ్రేలాడే పాత్రలో అడుగున కొన్ని బంగారు నాణేలను బియ్యముతో కప్పిపుచ్చి తెలియకుండా వేశాడట. కాని, త్యాగయ్యగారికి బియ్యం అడుగున నాణేలు కనిపించగానే నాణేల స్పర్శవలన బియ్యంకూడా మైలపడినవని చెప్పి, నాణేలతో సహా ఆ బియ్యాన్నికూడ నదివీధిలో పారబోశారట. ఈ సంఘటన జరిగిన తర్వాత కూడ శరభోజి తన ద్వారా కైంకర్యానికి సొమ్ము గ్రహించి తీరాలని త్యాగయ్యగారి వద్ద ప్రాధేయపడగా, ఆయన తనవద్ద సంగీతం చెప్పుకొంటున్న కొందరు శిష్యులకు కళ్యాణమహల్‌లో రాజుగారి ఖర్చుపై తిండి పెట్టించడానికి ఒప్పుకొన్నారట.

ఒకనాడు త్యాగరాజు గారి యింటిలో వంటకు బియ్యం గాని, దినుసులుగాని ఏవీ లేకపోయాయి. ఆయన జీవితంలో తొలి రోజుల్లో జరిగిన సంగతి– యిది. రోజల్లా యింటిల్లపాది వస్తున్నారు. రాత్రి 11 గంటలవేళ యిద్దరు ముసలి దంపతులు, వారి నౌకరు ఒకపెద్ద మూటతోసహా వచ్చి తలుపుకొట్టినారట. వారికి తలుపు తెరచి త్యాగయ్య 'విచారపూరితమైన ముఖంతో– అతిథులకు పెట్టడానికి తన యింట్లో అన్నీ నిండుకున్న'వని చెప్పారట. అందుకా వృద్ధుడు 'నాయనా త్యాగూ, చింతించకు. కావలసిన సంభారాలన్నీ ఉన్నా' యని చెప్పి, తమ నౌకరును వంట చేయమని బెత్తాయించి, దంపతులిద్దరూ త్యాగయ్యగారితో ముచ్చట లాడుతూ కూర్చున్నారు. వంటకాగానే దైవ నైవేద్యంచేసి అంతా ఆరగిలచారు. వృద్ధుని భార్యే అందరికీ వడ్డించింది. భోజనాలయాకకూడ రాత్రి చాలసేపు ముచ్చటించు కొని, త్యాగరాజును గొప్పవాడ వౌతావని దీవించి, ఆ దంపతులూ, నౌకరు కూడా కనపడకుండా అదృశ్యులైనారట. అప్పుడు వారు సీతారామాంజనేయులే అని గ్రహించి త్యాగరాజు మోహనరాగంలో 'భవనుత' అనే కీర్తన రచించి స్తుతిం

చారట. ఈ కీర్తనలోని 'నాతో బహుపల్కినన'- భవనము చేరినను వెరపించిన, ప్రబలజీసి నను బ్రోచేననుకున్న బదలికదీర భవనుత నా హృదయమున రమింపుము.... అనే ప్రయోగాలలో యీ సంఘటన ధ్వనిస్తున్నదని విజ్ఞుల అభిప్రాయము

'పొటకూటికిగాని బట్టకుగాని, అక్కరకురాని తమ్ముని రామపూజపై ని ప్రాణం విసిగి జపేశయ్య ఒకనాడు త్యాగయ్య పూజించుకొనే రామపంచాయతన విగ్రహాలను రహస్యంగా తీసుకొనిపోయి కావేరిలో పారవేశాడట. ఆ సంఘటన త్యాగరాజు రామభక్తిని మరింత అధికం చేసిందిగాని, తగ్గించలేదట. తెల్లవారి లేచి త్యాగయ్య పూజావిగ్రహాలను వెదకుకొని, తోడిరాగంలో 'ఎందుదాగినాడో' అనే కృతిని రచించి, తన హృదయావేదను వెల్లడించాడట. కొన్నాళ్ళు నిద్రాహారాలు విడిచి, ఆ విగ్రహాలకోసం పరితపించగా, ఒకనాడు రాముడే కలలో కనబడి ఫలానా కావేరీఘట్టంలో దొరుకుతానని చెప్పినట్లూ, త్యాగయ్య ఆ ఘట్టానికిపోయి చూడగా ఆ విగ్రహాలక్కడ లభించినట్లూ, అప్పుడాయన కనుగొంటిని శ్రీరాముని నేడు' అనే బిలహరిరాగ కీర్తనా, 'రారా మా యింటిదాక, రఘువీరా' అనే అసావేరి రాగకీర్తనా, 'ఎట్లా దొరికితివో' అనే వసంతరాగ కీర్తనా గానంచేస్తూ దేవతా విగ్రహాలను పల్లకీలో ఉంచి యింటికి తీసుకొచ్చినట్లూ, ఒక ఐతిహ్యం చెపుతూవుంటారు. జపేశయ్య విగ్రహాలను పారవేసేటంతటి హృదయకాఠిన్యం కలవాడనడంగాని, అవి కావేరిలో దొరికినప్పుడే ఆ కీర్తనలను ఆయన రచించాడనడంగాని, కొందరు పండితులు చారిత్రికాంశములయి ఉంటాయనడానికి సంశయిస్తున్నారు.

అన్నగారికిని, తనకును అభిప్రాయభేదా లున్నప్పటికీ త్యాగయ్య మాత్రము అతని యెడల భక్తిగౌరవాలు కలిగే ఉండేవాడు. అన్న అస్వస్థుడై ఆపదలో ఉన్నపు డొకసారి త్యాగయ్య 'ఎన్నో తప్పులు చేసినవారిని రాజన్య నీవు బ్రోచినావు- నడిబుప్రాయమున త్యాగరాజనుత నా పూర్వజుబాధ తీర్పలేదా అన్యాయము సేయకురా' అని ప్రార్థించినాడట . ఆ వెంటనే జపేశునికి స్వస్థత చేకూరి, మనసు మారి క్రమముగా రామభక్తుడైనాడట.

త్యాగయ్యకు ద్వితీయభార్యయైన కమలాంబయందు సీతాలక్ష్మి అనే కొమార్తె కలిగింది. ఆమెను యుక్తవయసులో తిరువాడివద్ద అమ్మాళ్ అగ్రహార వాస్తవ్యుడైన కుప్పుసామయ్య కిచ్చి వివాహం చేశారు. ఆ వివాహ సమయంలో త్యాగయ్యగారి శిష్యులు, ప్రశిష్యులు యెన్నో కానుకలుతెచ్చి సమర్పించారు. త్యాగయ్య ప్రశిష్యుడయిన రామువెల్లూరు పల్లవి యల్లయ్యగారు తాను చిత్రించిన సీతాలక్ష్మణసమేతుడైన కోదండరామస్వామి చిత్రపటాన్ని గురువుగారికి కాను

కగా యియ్యగా, ఆ పటాన్ని చూచి త్యాగయ్య మోహనరాగంలో 'నను పాలింప వచ్చితివో' అనే కీర్తన చెప్పినారట.

## క్షేత్ర పర్యటనము :

సంగీత; సాహిత్య, జ్యోతిష, మంత్ర, గణిత శాస్త్రిలలో త్యాగయ్యగారి అపార పాండిత్యమును గురించీ, రామభక్తి ప్రాశస్త్యమును గురించీ కర్ణాకర్ణిగా వినిన కాంచీపుర పీఠాధిపతీ. త్యాగయ్యగారి పితృసహితుడూ అయిన ఉపనిషద్బ్రహ్మేంద్ర స్వాములవారు త్యాగయ్యగారిని కాంచీపురం రమ్మని ఆహ్వానించారు. అనేకమంది శిష్యులను వెంటబెట్టుకొని త్రోవలో కొన్ని క్షేత్రాలను దర్శిస్తూ, త్యాగయ్యగారు కాంచీపురయాత్ర చేశారు. ఈ యాత్రలో - ఆయన శిష్యులతోసహా చాలా స్థలాలను దర్శించి, అక్కడి వేల్పులను సేవించుకొని, కొన్నిచోట్ల కొన్నాళ్ళు ఆగుతూ. కొన్నిచోట్ల ఆశ్చర్యకరమైన అనుభవములకు లోనైనారు.

తిరువొత్తియూరు : త్యాగయ్యగారి ప్రియశిష్యుడైన వీణ కుప్పయ్యగారి ఆహ్వానంపైని కుప్పయ్యగారి స్వగ్రామమూ, చెన్నపట్టణాని కుత్తరానకల గ్రామమూ అయిన తిరువొత్తియూరు వెళ్ళి అక్కడ కుప్పయ్యగారింట్లో కొన్నాళ్ళున్నారు. అక్కడ సాయంకాలములందు చేసే నిత్యసంకీర్తనములందు రోజూ ఒక కొత్త కృతిని రచించి గానం చేసేవారు ఆ ఊరి ప్రముఖులయిన కోవూరి సుందరేశ మొదలియారు ఆ ఆరాధన సభలకు వచ్చి, త్యాగయ్యగారిని తమ యింటికి కూడా తీసుకువెళ్ళారట, తిరువొత్తియూరులోని త్రిపుర సుందరిపైని త్యాగయ్యగారు సావేరిరాగంలో 'కన్నతల్లి' - ఆరభిరాగంలో 'సుందరి నిను' - బేగడ రాగంలో 'సుందరి నన్నిందరిలో'- కళ్యాణిరాగంలో 'సుందరి నీ దివ్యరూపమును'- శుద్ధసావేరిలో 'దరిని తెలిసికొంటి త్రిపురసుందరిని' అనే కీర్తన లయిదింటిని చెప్పినారు. ఆ తరువాత చెన్నపట్టణంలోని తిరువళిక్కేణి పార్థసారధిస్వామిని దర్శించినపుడు అసావేరి రాగంలో 'సారి వెడలిన యీ పార్థసారధి గనరె' అనే కృతి రచించారు.

కోవూరు : సుందరేశ మొదలియారు ఆహ్వానంపైని వారి స్వగ్రామమైన కోవూరు వెళ్ళి అక్కడి సుందరేశ్వరస్వామిపై కృతులు రచించారు.

శహనా రాగంలో -ఈ వసుధ నీవంటి దైవము నెందుగానరా....
భావుకము గల్గి వర్ధిల్లు కోవూరి సుందరేశ గిరిశ....

ఖరహరప్రియ రాగంలో- కోరి సేవింపరారె కోర్కెలీడేర
శ్రీ రమణీకరుడౌ కోవూరి సుందరేశ్వరుని...

పంతువరాళిలో — శంభో మహదేవ, శంకరగిరిజా రమణ....

.... .... ....

సురబృంద కిరీటమణీ వర నీరాజిత పదగో
పురవాస సుందరేశ గిరిశ పరాత్పర శుభకర...

కళ్యాణి రాగంలో — నమ్మివచ్చిన నన్ను నయముగ బ్రోవవే
కొమ్మని వరములొసగే కోవూరి సుందరేశ....

శంకరాభరణంలో — సుందరేశ్వరునిజూచి సురల జూడ మనసువచ్చునా...

ఈ కృతులెదూ త్యాగయ్య కోవూరి వేల్పు సుందరేశ్వరునిమీద చెప్పినవే. కోవూరినుంచి బయలుదేరి త్యాగయ్యగారు నాగులాపురం మీదుగా తిరుపతికి వెళ్లుతూ ఉండగా సుందరేశ మొదలియారు త్యాగయ్యకు తెలియకుండా ఆయన పల్లకిలో 1000 బంగారు నాణేలనుంచి, ఆ ధనం శ్రీరామ కైంకర్యాని కుపయోగించిరండని రహస్యంగా శిష్యులతో చెప్పినారట.

నాగులాపురం ; కోవూరు వదలి భక్త గాయకబృందం నాగులాపురం సమీపించేసరికి రాత్రి పడింది. అక్కడ దొంగలగుంపు యీ సంగీత గురువు పల్లకిలో ధనపుసంచి ఉన్నదని పసికట్టి, దారికాసి, ఉండీలబద్దలలో మట్టి ఉండల నుంచి, పల్లకిబోయీలను, శిష్యులను కొట్టగా, శిష్యులకు భయమువేసి, పల్లకిలో ఉన్న సొమ్ముసంగతి గురువుగారికి చెప్పినారు. ఆ సొమ్ము దొంగల కిచ్చివేయండని గురువుగా రనగా, వారి శిష్యులలో తంజావూరు రామారావు అనే ఆయన ఇది రామకైంకర్యమునకై యిచ్చిన సొమ్ము — రాములవారిది మన సొంతంకాదు. అని చెప్పగా, అయితే రాముడే తన సొమ్ము తాను కాపాడుకుంటాడు — మీరు నిశ్చింతగా ఉండండని చెప్పి త్యాగయ్యగారు—దర్బారు రాగంలో

'ముందు వెనుక యిరుప్రక్కలతోడై మురఖరహర రారా రారా....
ఎందుగాన నీ యందమువలె రఘునందన వేగమే రారా రారా....
చండభాస్కర కులాబ్ధిచంద్ర కోదండపాణియై రారా రారా....
అండ గొలుచు సౌమిత్రి సహితుడై అమిత పరాక్రమ రారా రారా ...

.... .... ....

అని ప్రార్థించగానే, రామలక్ష్మణులు కోదండపాణులై, దివ్యమంగళాధారులై వచ్చి, దొంగలను బాణాలతో బెదిరించి పంపివేశారట. వారు త్యాగరాజుకు గాని, శిష్యులకుగాని కనబడలేదు. పల్లకికి రెండుపక్కలా రామలక్ష్మణులు రాత్రి తెల్లవారేవరకూ ధనుర్ధరులై కాపలాకాస్తూ. తెల్లవారగట్ల అంతర్ధానమైరట. ఇదంతా చూసి, విస్మితులైన దొంగలు త్యాగయ్యగారి వద్దకుపోయి, రాత్రంతా

కాపలాకాసి, మాయమైన ఆ బాలభటుల దర్శన మిప్పింపుడని ప్రార్థించారట. త్యాగరాజు రామలక్ష్మణుల సాక్షాత్కారము పొందినవారి అదృష్టమును కొనియాడి, ఆనందబాష్పాలు రాల్చినారట.

తిరుపతి : అటుతర్వాత తిరుపతికి, కొండమీది తిరుమలకుపోయి, ఏడు కొండలవాని దర్శనముకోసం ఆలయానికి వెళ్ళినపుడు స్వామిముందు ఒకతెర అడ్డంగా ఉండి అక్కడివారు దర్శనానికి ఆలస్యమవుతుందని చెప్పారట. అప్పుడు త్యాగయ్య గౌళిపంతురాగంలో

'తెరతీయగ రాదా నాలోని
తిరుపతి వేంకటరమణ మచ్చరమను తెరతీయగ రాదా'

అనే ఈ కీర్తన గానం చేయగానే అర్చకుల కేదో ప్రబోధంకలిగి, ఆ తెర అడ్డు తొలగించారట. అప్పుడు ఆయన మధ్యమావతిలో "వెంకటేశ నిన్ను సేవింపను పదివేల కన్నులు కావలెనయ్యా" అని భక్తిపారవశ్యంతో గానం చేశారట. అప్పుడు ఏనాడో వేంకటేశ్వరస్వామి సాయుజ్యమును పొందిన అన్నమాచార్య, తిరుమలాచార్యాది ప్రాచీన వాగ్గేయకారుల ఆత్మలు ఆనంద భాష్పాలు రాల్చిఉండాలి.

పుత్తూరు : తిరుపతినుంచి కంచివెళ్ళుతుండగా త్యాగయ్యగారి బృందం త్రోవలో పుత్తూరులోని పురాతన దేవాలయంవద్ద ప్రమాదవశమున నేలబావిలోపడి మరణించిన ఒకపురుషునీ, అతని కోసమై దుఃఖిస్తున్న భార్యాపుత్రికలనుచూశారు. ఆ దృశ్యం చూసి, దయార్ద్రహృదయంతో త్యాగరాజు భక్తిపారవశ్యంతో రాముని ప్రార్థిస్తూ బిలహరి రాగంలో—'నా జీవాధార నా నోముఫలమా........ నా చూపు ప్రకాశమా నా నాసికా పరిమళమా నా జపవర్ణరూపమా, నాదు పూజాసుమమా, త్యాగరాజనుత' అని తన్మయుడై గానం చేయగానే, ఆ మృతజీవి పునర్జన్మ పొందినాడట. ఆ భార్యా, భర్తలు కృతజ్ఞతతో త్యాగయ్యగారికి మొక్కి, కొనియాడిరట.

కంచి : శిష్యబృందంతో సహా కంచి చేరుకొని, త్యాగరాజు ఉపనిష ద్బ్రహ్మేంద్రస్వామి దర్శనంచేసి, వారితో వేదాంత తత్త్వవిచారం చేశారు. ఆ క్షేత్రంలోనే ఏకామ్రేశ్వరస్వామినీ, వరదరాజస్వామినీ దర్శించి సంకీర్తన సేవచేశారు. స్వరభూషణి రాగంలో 'వరదరాజు నిన్నే కోరివచ్చితిరా' అన్న కీర్తన రాగపంజర రాగంలో 'వరదానవ నీతాళ' అన్న కీర్తన వరదరాజ స్వామిని దర్శించినప్పుడూ, మధ్యమావతి రాగంలో 'వినాయకుని వలెను' అన్న కీర్తన కంచి కామాక్షిదేవిని దర్శించినప్పుడూ చెప్పినవి.

వాలాజాపేట : కంచినుండి వాలాజాపేట వచ్చి అక్కడ తమ ప్రియ శిష్యుడైన వేంకటరమణ భాగవతుల యింటిలో కొన్నాళ్లు విడిదిగా ఉన్నాడు. భాగవతుల శిష్యులలో ఒకరైన మైసూరు సదాశివరావు తోడిరాగంలో 'త్యాగరాజ స్వామి వెడలెన' అనే కీర్తనచేసి పాడి, వినిపించి, త్యాగయ్యగారి మెప్పు పొందినాడు. వాలాజాపేట నుంచి తిరువయ్యూరు చేరుకొని, కొన్నాళ్ళకు, తర్వాత మళ్ళీ యాత్రచేశారు.

శ్రీరంగ : ఈసారి శ్రీరంగం వెళ్ళి రంగనాథస్వామి నిత్యోత్సవాలను, ఊరేగింపులను కన్నుల పండువుగా దర్శించుకొని దేశిక తోడిలో 'రాజు వెడలె చూతాము రారే కస్తూరి రంగరాజు వెడలె' అనే కీర్తనా కాభోంజిలో 'ఓ రంగశాయీ పిలిచితే ఓయనుచు రారాదా' అనే కృతీ. ఆరభిలో 'చూతాము రారే సుదతులార రంగపతిని' అనే కీర్తనా, దేవగాంధారిలో 'వినరాదా నా మనవి' అనే కీర్తనా-రచించి గానం చేశారు.

చైత్రోత్సవ సందర్భంలో రంగనాథస్వామిని పల్లకీలో ఉంచి నాలుగు వీధులా ఊరేగిస్తున్నపుడు స్వామిపల్లకీ త్యాగయ్యగారు నిలుచున్న వీధిలో ఆగి, అక్కడనుంచి కదలలేకపోయిందట. దృష్టిపరిహారం చేయాలనుకొని దేవదాసులూ, రాజదాసులూ, నృత్యభోగం చేసినా కదలలేదట. అక్కడున్న పెద్దలలో ఒకరు త్యాగయ్యగారి దివ్యతేజస్సు చూసి, యీ మహాభక్తునికి దర్శనం ఇప్పిస్తే కదలవచ్చునన్నారట అప్పుడే త్యాగయ్యగారు దేవగాంధారిలో 'వినరాదా నా మనవి' అని స్వామిని ప్రార్థించగా పల్లకీ కదిలిందట. ఆ తర్వాత ఆలయంలో కూడా స్వామిని సేవించుకొన్నారు.

నాగపట్టణం : శ్రీరంగంనుంచి నాగపట్టణంవెళ్ళి అక్కడి కాయారోహణ స్వామి, దేవేరియైన నీలాయతాక్షి అమ్మవారిని సేవించుకొని సావేరి రాగంలో 'కర్మమే బలవంతమాయె తల్లి కాయారోహణజాయ' అనే కీర్తన రచించారు.

తపస్తీర్థము : అనబడే లాలుడిలో శ్రీమతీదేవిపైని 'గతి నీవని' అనే కీర్తన, తోడిరాగంలోనూ, లలితే శ్రీ అనే కీర్తన భైరవి రాగంలోను, మధ్యమావతిలో దేవిశ్రీతపస్తీర్థ అనే కీర్తనా, కాంభోజీలో .... మహిత ప్రవృద్ధ... అనే కీర్తనా రచించారు.

ఘటికాచలం : అనబడే షోలింగపురంలో - బిలహరి రాగంలో 'నరసింహ నన్నుబ్రోవవే' అను కీర్తన యోగలక్ష్మీనరసింహస్వామి మీదను, వసంత వరాళి రాగంలో...పాహి రామదూత....పూర్ణలలిత రాగంలో ... కలుగునా పదనీరజ సేవ... అను కీర్తనలను యోగాంజనేయస్వామి మీదనూ గానం చేశారు.

ఈ యాత్రలో మధురకూ, ధనుష్కోటికి కూడా త్యాగయ్యగారు వెళ్ళి ఉండాలని కొందరు వ్రాశారుగానీ, ఆ విషయమై పండితులందరూ ఏకాభిప్రాయులై లేరు.

## కీర్తన రచనా శిల్పం:

ఏ వాగ్గేయకారునకుగాని, తన కాలంలో త్యాగరాజు కున్నంతమంది శిష్యులు చేకూరి ఉండలేదంటే అతిశయోక్తికాదు. ఐహిక సంపదలయందు నిస్సంగత్వం కలిగి, వేదచోదితములైన జీవిత పద్ధతులపై నిరాడంబరజీవియై కాలముగడపిన త్యాగరాజు నాదబ్రహ్మోపాసకుడై, మహాతపస్సంపన్నుడైన మహర్షియై జీవించాడు. ఆయనవద్ద సంగీతశిక్షణకై చేరిన శిష్యులందరు ఆయన వద్ద నున్నంతకాలమైనా ఆయన పద్ధతులపైనే జీవించనేర్చి, తిరువయ్యారులోని త్యాగరాజ కుటీరమును ప్రాచీన గురుకుల విద్యాపీఠముగా ప్రకాశింపజేశారు.

త్యాగయ్యగారి కీర్తనలన్నీ దాదాపు - ఆయన పారవశ్యస్థితిలోనో, ఆవేశములోనో ఉండగా వెలువడినవే. పారవశ్యంలో నిమీలితములై కాని, ఆవేశంతో పొంగిగాని ఆయన కన్నులు తేజస్సుతో ప్రకాశిస్తోంటే, నోట పాట వెలువడుతూ వుంటే నల్లరంగుపూసిన మామిడి పలకలను, బలపాలను తీసుకొని నలుగురు శిష్యులు చుట్టూ పరివేష్టించేవారు. కీర్తన పూర్తయేసరికి, శిష్యులలో ఒకడు పల్లవినీ, మరొకడు అనుపల్లవినీ, ఇంకొకడు చరణమునూ, మరొకడు సాహిత్యమునూ పలకమీద వ్రాసుకొని తల ఒకడూ తల ఒక కావేరీ ఘట్టానికిపోయి, ఆ కీర్తన భాగాలను మననం చేసుకొని వల్లెవేశారు. ఆ తరువాత అందరూ కలిసి, కలబోసుకొని, కీర్తనంతా పాఠం చేసుకొని ఆ వెనుక గురువుగారికి వినిపించేవారు. ఇంకొక కీర్తన వచ్చినపుడు మరొక నలుగురు యిదే విధంగా దానిని వ్రాసుకొని మననం చేసుకొని నేర్చుకొనేవారు.

అన్నమాచార్యులనాడు సంకీర్తనముగాను, ఆధ్యాత్మికపదంగాను ప్రారంభించిన కీర్తన రామదాసు, నారాయణతీర్థులూ, సుబ్రహ్మణ్యకవీ వంటి వాగ్గేయకారులచేత భజనకీర్తనగాను, ఆధ్యాత్మ కీర్తనలుగాను పరిణమించి మార్గదర్శి శేషయ్యంగారు, మేరట్టూరు వీరభద్రయ్యగారలు రచనలలో ధాతుకల్పనకు కొత్త మార్గా లవలంబించి ఆ నూతన రూపంలో త్యాగరాజు నాటికి కృతి అనే పేరు వహించి పరిపక్వత పొందింది. కృతులు బయలుదేరునాటికి రాగాల స్వరూపంలో కూడ చాల మార్పులు సంభవించాయి. రాగస్వరూప దర్శనానికి త్యాగరాజు కృతులు దర్పణము వంటివి.

సాహిత్యంలోని అంతరార్థమును మరింత ప్రస్ఫుటం చేయడానికి రాగ సంచారంలోని ప్రత్యేక ప్రయోగాల ద్వారా రాగభావాన్ని సాహిత్యభావంతో రంగ

రించి వి స్తరించడానికి సంగతుల ప్రయోగం విరివిగా జరిగి త్యాగరాజు కృతులకు ప్రత్యేక స్వరూపాన్నిచ్చింది. ఈ సంగతుల విస్తరణనే ధాతుకల్పనాదక్షతగా పేర్కొన్నాము. సాహిత్య భావసంగతులుగాను, రాగ భావసంగతులుగాను నేటి విద్వాంసులచేత గుర్తింపబడిన సంగతులవంటివే శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరంలో స్థాయభంజనీ సంగతులుగాను, రూపకభంజనీ సంగతులుగానూ పేర్కొనబడినవి. నిరవల్ అను గానపద్ధతిలో ఒకే సాహిత్యమును రకరకాల వర్ణమెట్టులు మారుస్తూ రాగభావాన్నీ, సాహిత్యభావాన్నీ సారెసారెకూ మరింత ప్రస్ఫుటంచేస్తూ గానం చేస్తారు. ఆ పద్ధతికూడ త్యాగరాజ కృతులతో ప్రచారం పొందినదే. చరణాంతము లందు చిట్టస్వర కల్పనం ప్రత్యేకము ధాతువిస్తృతికోసమూ, వివిధ లయాత్మక రాగ రంజనకోసమూ ఉద్దేశింపబడినది. పటిష్ఠమైన పద్యకవిత్వభాషకంటె,ఉదాత్తమైన గద్యమే కృతులకు సాహిత్యయోగ్యమైనదని త్యాగరాజు రచనల ద్వారా నిరూపితమైనదని పండితుల అభిప్రాయము. ఆ గద్యములోనే యమక, అంత్య ప్రాసాది అలంకారాలుంటే కృతి అప్రయత్నంగా శ్రావ్యత పొందగలదని కూడా నిరూపితమైనది.

కృతిలోని భావానికి ప్రధాన సూత్రమైన వాక్యం పల్లవి. అనుపల్లవి పల్లవి లోని సూత్రమునకు వ్యాఖ్యగా గాని, అనుబంధంగా గాని సాగుతుంది. చరణాలు ఆ వ్యాఖ్యకు విపులమైన భాష్యమన దగినట్లుగా ఉంటాయి. సులభముగా అర్థమయే లలితమైన పదజాలమూ, ఉదాత్తములైన భావాలూ, సదాశయాలూ, నిత్య జీవితములో సంభాషణలలో వాడుకొనే లోకోక్తులూ సామ్యములూ త్యాగరాజ కృతులను, సంగీతమును సామాన్యజనులకుకూడ ఆస్వాద యోగ్యములుగా చేసినవి ఉపనిషతులలోని పరమ సత్యములనుకూడ సులభశైలిలో తన కృతులలో చొప్పించినందువల్ల త్యాగరాజు కృతులను తత్త్వవిదులయినవారు త్యాగబ్రహ్మోపనిషత్తు అని కొనియాడినారు ఆయన కృతులలోని రసభావ పరిపుష్టి, సంగీత శిల్పంలోని నవ్యతా అనన్య సాధారణమైనవి.

ఆయన కృతులలో దాదాపు సగం రామాయణకథాత్మక మైనవి. వీటిలోని రాముడు రామాయణ కథానాయకుడైన రాముడే; ఇతర కృతులన్నిటిలోను రాముని ప్రశంసవస్తే వాటిలోని రాముడు పరబ్రహ్మస్వరూపుడు, విష్ణువు అని వాదవలసిన యెన్నోచోట్ల త్యాగరాజు రాముడనే వ్యవహరిస్తాడు.

రామాయణంలో వాల్మీకి 24000 శ్లోకములు రచించినట్లు, త్యాగరాజు కూడా 24000 కీర్తనలు రచించాడని చెపుతారు. వాలాజాపేట వేంకటరమణ భాగవతుల కుమారుడైన కృష్ణస్వామి భాగవతులు, ప్రతిదినము భోజనాత్పూర్వం, సంకీర్తన సేవగా పది త్యాగరాజ కృతులనుపాడి పాడిన కృతులను తిరిగి పాడకుండా

సంవత్సరం అయేసరికి 3600 కృతులను పాడుతూ ఉండినట్లు ఆచార్య సాంబమూర్తి గారు వ్రాసినారు. ఇప్పటికీ అచ్చయిన పుస్తకాలలో 660 వరకూ త్యాగరాజు కృతులు కనిపిస్తున్నాయి. త్యాగరాజు 72 మేళకర్త రాగాలలోను కీర్తనలను రచించాడు. బహుదారి, చెంచుకాంభోజ, దీపకం, దేవామృతవర్షిణీ, గంభీరవాణి, గరుడధ్వని, జనరంజని కోకిలధ్వని, మయూరధ్వని, నభోమణి నాదరంగిణి, రాదస్వరావళి, నవరసకన్నడ, ఫలమంజరి సారమతి ఉమాభరణం, సుపోషిణి, విజయశ్రీ వంటిఅపూర్వ రాగాలలో - ప్రాచీన సంగీత లక్షణ కర్తలకు కూడ తెలియని నూతన రాగాలలో ఎంతో నైపుణ్యముతో కృతులను రచించాడు త్యాగరాజు. ఇవి అన్నీ కర్ణాటక సంగీతానికి అమూల్య నిధులైనవి. ఈ రాగాలను త్యాగరాజు తనకు తానే సృష్టించి ఉండవచ్చు. లేదా స్వరార్ణవమనుపేర నారద మునివల్ల తాను గ్రహించిన గ్రంథంవల్ల సూచనలనైనా తీసుకొని ఉండవచ్చును.

నాట, గౌళ, ఆరభి, శ్రీ వరాళి ఈ ఘనరాగ పంచకంలో ఆయన రచించిన కృతులైదింటినిబట్టి ఆనాటి పండితులు ఈయన వట్టి సంకీర్తనపరుడైన రఘువిద్వాంసుడు కాడు. లక్ష్యలక్షణ వేదియైన మహావాగ్గేయకారుడని తెలిసికొన్నారు.

## ఘనరాగ పంచరత్న కీర్తనలు :

నాట - ఆది - జగదానందకారక జయ జానకీ ప్రాణనాయక...
గౌళ - ఆది దుడుకుగల నన్నే దొరకొడుకు బ్రోచురా....
ఆరభి - ఆది - సాధించెనే ఓ మనసా....
వారాళి - ఆది - కనకన రుచిరా కనకవసన నిన్ను ...
శ్రీ - ఆది - ఎందరో మహానుభావు లందరికి వందనములు....

ఈ పంచరత్న కీర్తనలందు భాష, శైలి జటిలంగా ఉంటుంది. వీటిని గానం చేసేటప్పుడు అనేకములైన సంగతులతో విస్తరించి విజ్ఞులైన విద్వాంసులు పాడడానికి యోగ్యములై ఉంటాయి. గాయకుని ఉత్సాహభావోద్రేకములు వెల్లివిరియించే అర్థగాంభీర్యమూ, రసస్ఫురణా వీటిలో ఉన్నవి. వీటిలో కొన్నింటిలో అనర్గళ గంగా ప్రవాహంవంటి సంస్కృత కవితా, కొన్నింటిలో తేటనీటి గోదావరివంటి జానుతెనుగుకవితా, యమక, అనుప్రాసాది శబ్దాలంకార మాధుర్యముతో కూడి ఉంటాయి. వీటిని నాభితానముగా వైణికగాయక సంప్రదాయాలతో పాడవలెను.

త్యాగయ్యగారు రచించిన కీర్తనలలో పంచరత్న ఖ్యాతిపొందినవి నారద పంచరత్నములు, తిరువొత్తియూరు పంచరత్నములు, కోవూరు పంచరత్నములు

నాగపుర పంచరత్నములు, శ్రీరంగ పంచరత్నములు, గురువు ననుసరించే వీణ కుప్పయ్యగారు కాళహస్తీయ పంచరత్నములు, వేంకటేశ పంచరత్నములు - అను కీర్తనలను రచించారు.

త్యాగయ్యగారు ఉంఛవృత్తికి ఊరిలో పర్యటించేటప్పుడు ఘనరాగ పంచరత్న కీర్తనలను గానం చేసేవారట. అవి ఆయన మధ్యవయస్సులో రచించినవి తానవర్ణములు సాగే గానశైలిలో ఈ పంచరత్న కీర్తనల నడక బాల ప్రౌఢంగా గాత్రమాధుర్యసాధన కుపయోగపడుతుంది. వీటిలోని అనుబంధ చరణములు స్వరసాహిత్యములవలె కాక చిట్టస్వరముల పద్ధతిని సాగుతూ, ఆ స్వరాలకు బదులు రమ్యమైన వివిధ లయగతులలో సాగే సాహిత్యమే గానం చేస్తారు ఈ విధమైన ఎత్తుగడ పల్లవి, అనుబంధ సాహిత్యము ఆరభి మధ్యమావతి కీర్తనల కున్నదిగాని, నాట, గౌళ, వరాళి కీర్తనలలో లేదు. ఈ పంచరత్నముల లోని సంగీత శిల్పమునకూ, సంస్కృతాంధ్ర సాహిత్య నిర్మాణదక్షతకూ, ఆనాటి విద్వాంసులైన విమర్శకులంతా అద్భుతాశ్చర్యములకు లోనై త్యాగయ్యగారిని మహా వాగ్గేయకారునిగా మెచ్చుకొన్నారట.

త్యాగయ్యగారి దివ్యనామ సంకీర్తనములు, ఉత్సవ సంప్రదాయ కీర్తనలు అతి సులభమైన ధాతుమాతు నిర్మాణముతో సర్వజనసామాన్యమునకు భక్తిసాధనకుగాను భగవత్సేవాకైంకర్య సమయాలలో, గోష్ఠులలో పాడుకొన వీలుగా ఉంటాయి.

## సంగీత శిల్పంలో ప్రత్యేకత :

అచ్చయి లభిస్తూన్న ఐదారు వందల కృతులలోను సుమారు 200 రాగాలను త్యాగయ్యగా రుపయోగించినట్లు తెలుస్తోంది. ఈయన రచించారని ప్రతీతిలో ఉన్న 72 మేళకర్త రాగకీర్తనలలోను సుమారు 40 మాత్రమే ప్రచారంలో కనిపిస్తున్నవి.

త్యాగరాజ శతవార్షిక సంచికలో శ్రీమతి కన్నమ్మగారు పరిశోధించి వ్రాసిన కొన్ని అంశములను యిక్కడ ఉద్ధరిస్తాము :

ఆనాటికే ప్రచారంలో ఉన్న శంకరాభరణం. తోడి, కళ్యాణి, భైరవి మొదలయిన ఘనరాగములలో ఒక్కొకదానిలో సుమారు 30 కీర్తనలవరకూ దొరికాయి. తరువాతి మెట్టులోని ధన్యాసి, సావేరి, అసావేరి, రీతిగౌళ, దర్బారు, కేదారగౌళ, అఠాణా, ఆరభి, దేవగాంధారి, బిలహరి బేగడ మొదలైన రాగాలలో పది మొదలు ఇరవై కీర్తనలవరకు రాగం ఒకటికి కనిపిస్తాయి. లలితములై ఛాయా భేదమే ప్రత్యేకతగా కలిగి సున్నిత రాగములయిన నాయకి, సారంగ, శహన,

హంసధ్వని, జయమనోహరి, శ్రీరంజని, నీలాంబరి, బలహంస, యదుకుల, కాంభోజి మొదలయిన రాగాలలోకూడా ఒక్కొక్కంటికి అయిదారు కృతులు కనిపిస్తున్నాయి.

ఇవిగాక ఆనాడు ప్రస్తారక్రమంలో నామమాత్రాలుగానే ఉన్న కొన్ని రాగాలకు జీవంయిచ్చి, ప్రచారానికి, తెచ్చారు త్యాగయ్య. ముఖ్యంగా యీ సందర్భంలో ఖరహరప్రియ, హరికాంభోజి రాగాలను పేర్కొనాలి. ఆరోహణావరోహణ స్వరసంపుటిగా మాత్రం ఉన్న యీ రాగాలను పెంపొందించి, యీనాడు రాగవిస్తరణకు పల్లవి పాడుకొనుటకు అనుగుణ్యములుగా చేసినది త్యాగయ్యే. ఈ రాగములలోనే ప్రతి స్వరస్థానమును ఆరంభస్వరంగా తీసుకుని ఆ రాగక్రమాన్ని, రాగగతిని నిరూపిస్తూ కృతులు రచించాడు.

మచ్చుకు ఖరహరప్రియ రాగంలో

| కృతి | | ఆరంభస్వరం |
|---|---|---|
| రామా నీ యెడ | — | షడ్జం |
| రామ నీ సమాన మెవరు | — | ,, |
| చక్కని రాజమార్గము | — | రిషభం |
| విడెము సేయవే | — | గాంధారం |
| రఘువీర రణధీర | — | మధ్యమం |
| పక్కల నిలబడి | — | పంచమ |
| నడచి నడచి | — | నిషాదం (మంద్రస్థాయి) |
| కోరి సేవింప | — | షడ్జం (తారస్థాయి) |

అలాగే హరికాంభోజి రాగంలో

| | | |
|---|---|---|
| రామ నన్ను బ్రోవరా | — | గాంధారం |
| నేనెందు వెదకుదురా | — | మధ్యమం |
| ఉండేది రాముడొకడు | — | పంచమం |
| చనితోడితేవే | — | పంచమం |
| ఒక్కమాట ఒకబాణము | — | దైవతం |
| దినమణి వంశ | — | నిషాదం |
| ఎంతరా – నీ | — | నిషాదం |

రాగములను శాస్త్ర ప్రపంచంలోనుంచి కళా'శిల్ప' ప్రపంచంలోనికి తీసుకొనివచ్చిన త్యాగయ్య కీర్తనరచనలో కొత్తపోకడలకు మార్గదర్శకుడయ్యాడు. అంతవరకు కీర్తనాక్రమం, పల్లవీ, అనుపల్లవీ, యీ రెంటి ధాతు

వుల కలయికవల్ల ఏర్పడిన చరణము సూత్రముగానే ఉండేది. త్యాగయ్య తన భావావేశమును వ్యక్తపరచడానికి యింకా పరిపూర్ణత గల కృతిని సాధించాడు :

త్యాగయ్య తన కృతుల రచనలో సాధ్యమయినంత తాళ వైవిధ్యాన్ని కూడా పాటించాడు. నూటికి డెబ్బై, యెనభై పాళ్ళు ఆదితాళ రచనలే ఆదితాళం లోని కృతులు 310 ఉంటే.

| | |
|---|---|
| రూపకంలో | 93 |
| దేశాదితాళంలో | 86 |
| చాపుతాళంలో | 78 |
| జంపెలో | 33 |
| త్రిపుటలో | 13 |
| త్రిశ్రలఘులో | 8 |

అధిక సంఖ్యాకములైన ఆదితాళ కీర్తనలనే యింకా సూక్ష్మంగా పరిశీలించినట్లయితే అందులోని గతులలోను, ఎత్తుగడలలోను అనేక చిత్రగతులు కనిపించవచ్చును. త్యాగరాజ కృతుల రచనా విశేషములను గురించి శ్రీ సాంబమూర్తిగారి పరిశోధనాంశములు కొన్నిటిని ఉటంకిస్తున్నాము

నారద పంచరత్నములు :

| | | |
|---|---|---|
| శ్రీ నారదముని గురురాయ | — | భైరవి |
| శ్రీ నారద నాద సరసీరుహ | — | కానడ |
| నారద గురుస్వామి | — | దర్బారు |
| నారద గానలోల | — | అఠాణ |
| వరనారద | — | విజయశ్రీ |

నాదబ్రహ్మోపాసన తత్త్వాత్మకములూ, సంగీతజ్ఞాన విషయాత్మకములూ అయిన కీర్తనలు :

| | | |
|---|---|---|
| సంగీత జ్ఞానము | — | ధన్యాసి |
| శోభిల్లు సప్తస్వర | — | జగన్మోహిని |
| మోక్షము గలదా | — | సారమతి |
| రాగసుధారస | — | ఆందోళిక |
| సంగీత శాస్త్రజ్ఞానము | — | ముఖారి |
| నారద సుధారసం | — | ఆరభి |
| నాదోపాసన | — | బేగడ |
| ఆనందసాగర | — | గరుడధ్వని |

స్వరరాగ సుధారసయుతభక్తి — శంకరాభరణం
శ్రీ ప్రప్రియ — అఠాణ
ఇంతకన్నా నందమేమి — బిలహరి

సంగీతవాద్యాదుల ప్రశంసగల కీర్తనలు :

| | | |
|---|---|---|
| కద్దనువారికి | (తోడి) | తంబుర |
| కొలువమరెగదా | (తోడి) | " |
| సంసారులైతే నేమి | (సావేరి) | వీణ |
| అతడే ధన్యుడురా | (కాపి) | తంబుర |
| సొగసుగా | (శ్రీరంజని) | మృదంగతాళములు |
| ప్రాణనాథ బిరాన | (శంకరాభరణం) | వేణువు |
| స్వరరాగ సుధారస | (శంకరాభరణం) | మద్దళం |
| ఎట్లా దొరికితివో | (వసంత) | సుస్వర గానము |
| సుఖి యెవ్వరో | (కానడ) | |

తులసీ పూజాత్మకములైన కీర్తనలు :

దేవీ శ్రీతులసెమ్మ — మాయామాళవగౌళ
తులసీ జగజ్జనని — సావేరి
తులశమ్మ మాయింట — దేవగాంధారి
అమ్మ రావమ్మ — కళ్యాణి

సంగీత శిల్పవిధానమునుబట్టి త్యాగయ్య కృతులను 5 రకములుగా విభజింపవచ్చును :

1. అతిసులభకీర్తనలు (ఉదా : వినవె ఓ మనసా - వివర్ధని)
2. సులభకీర్తనలు : (ఉదా : సుజనజీవనా - కమాన్)
3. మధ్యరకం కీర్తనలు (ఉదా : ఎవరని - దేవామృతవర్షిణి)
4. కష్టసాధ్య కృతులు (ఉదా : నాజీవాధార - బిళహరి)
5. అతిక్లిష్ట కృతులు (ఉదా : దారిని తెలుసుకొంటి - శుద్ధసావేరి)

భైరవిరాగంలోని కొలువైయున్నాడె అనుకీర్తనలోని ధాతురచన తాన శైలిలోను, ఓరంగశాయి అను కాంభోజి రాగకీర్తనలోని ధాతురచన ఆలాపన శైలిలోను చేయబడినవి.

సాహిత్యంలోని భావాలనుబట్టి ఆయన కృతులను ఈ క్రింది విధంగా 5, 6 రకాలుగా విభజించవచ్చును.

1. వేదాంత బోధకములు (శాంతములేక - సామ)
2. నీతి బోధకములు (మనసు నిల్పశక్తి లేకపోతే - అభోగి)
3 నమస్కృతులు (విదులకు మ్రొక్కెద - మాయామాళవగౌళ)
4. సంగీత ప్రశంసాత్మకములు
5. మానస బోధకములు (వినవే ఓ మనసా - వివర్ధని)
6. ఆత్మప్రవర్తన విషయమై పశ్చాత్తాపాత్మక ప్రార్థనములు (ఎటుల బ్రోతువో - చక్రవాకం)
7. విన్నపములు (నాదుపై బలికేరు - మధ్యమావతి)

ఈ క్రింది కీర్తనలలోని చరణ ధాతురచనలోని వైవిధ్యంవలన రాగ స్వరూపం బాగా విస్తృతంగా స్పష్టపడుతుంది :

| | | |
|---|---|---|
| నిను వినా సుఖముగాన | — | తోడి |
| శ్రీ రఘువర సుగుణాలయ | — | భైరవి |
| బ్రోచేవా రెవరే | — | శ్రీరంజని |
| ఎందుకు నిర్దయ | — | హరికాంభోజి |
| శ్రీ రఘువరాప్రమేయ | — | కాంభోజి |
| నా మొరలను విను | — | ఆరభి |
| నీపద పంకజముల | — | బేగడ |
| మరవకురా | — | దేవగాంధారి |

సామాన్యంగా ఈ క్రింది కొన్ని కృతులు త్యాగయ్య రచన లనే భ్రమకు చాలామంది లోనౌతూంటారు. వాటిని అసలు రచించిన వారిపేర్లు ఆ పక్కనే చూడవచ్చును.

1. వినతాసుత వాహనుడై -హరికాంభోజి
2. నీదు చరణములే - సింహేంద్రమధ్యమం
3. నతజన పరిపాల - సింహేంద్ర మధ్యమం - ఈ మూడు రామనాథ పురం కె. వి. శ్రీనివాసయ్యంగారి రచనలు.
4. పరాజ్ముఖమేలరా - సురటి.
5. అభిమాన మెన్నడు - వివర్ధని - ఇవి మన్నార్గుడి రాజగోపాలయ్యగారి రచనలు.
6. దినమే సుదినము - లతాంగి-గిరీశ అయ్యర్‌గారి రచన.
7. వెడలెను కోదండపాణి-తోడి-తంజావూరు కృష్ణభాగవతార్ రచన.

వీటిలో కొన్నింటిలో చివర త్యాగరాజ ముద్రనుకూడ అద్యతను లెవరో చేరుస్తూ వచ్చి, త్యాగరాజు కృతులుగా చలామణి చేశారు కాని, పండితులు పరిశోధించి అసలు విషయములను వెల్లడించారు.

## భా షా వి శే షా లు :

త్యాగరాజు తన కృతులలో బొత్తిగా గ్రామ్యమునుగాని, వీరగ్రాంథికమును గాని వాడక. శిష్ట వ్యావహారికమునే వాడినాడు. త్యాగయ్య శ్లేషార్థముల పొంతకు పోలేదు. ఒక పత్నీవ్రతుడే. పలువిధ చెడు దుర్విషయములవంటి వ్యాకరణ విరుద్ధ ప్రయోగాలు చేశాడుగాని. సంగీత విషయంలో ఆ మాత్రం స్వతంత్రం ఉండవచ్చునని పెద్దల అభిప్రాయం. ఈయన కీర్తనలో వ్యావహారిక సంభాషణలలో దొర్లే లోకోక్తులూ జాను తెనుగు పలుకుబళ్ళు కుప్పతిప్పలు :

'రూకలు పదివేలున్న చేరెడు నూకలు గతిగాని ఓ మనసా

కోకలు వెయ్యున్న కట్టుకొనుట ఒకటేగాని' —

ఊరేలిన తా పండుట మూడు మూరతావుగాని, నూరుభక్షణము లబ్బిన నోటికంతగాని

ఏరునిండి పారిన పాత్రకు తగు నీరు వచ్చుగాని —

సారమౌ కవితల విని వెర్రివాడు సంతోషపడియేమి పడకేమి—

'తురకవీధిలో విప్రునికి పానకపూజ నెరయజేసి యేమి,

సేయకుంటేమి' —

'ఇరవొందగ భుజియించు సమయమున ఈగ తగులురీతి నున్నది'

(తెర తీయగరాదా కీర్తనలో దైవ దర్శనమున కడ్డుగా తెర ఉండటాన్ని ఆ విధంగా పోల్చినాడు.)

'సోమిదమ్మ సొగసుగాండ్ర గోరిన సోమయాజి స్వర్గార్హుడౌను'

ఇటువంటి లోకోక్తులవలన త్యాగరాజు మొగము ముడుచుకొని దుర్నిరీక్షుడై ఉండే మనిషి కాడనీ, చాలా సున్నితంగా హాస్యంచేసే స్వభావం కలవాడనీ. సంఘంలోని దురాచారాలను గర్హించడానికి సూటిపోటు మాటలనైనా వాడే స్వభావం కలవాడనీ స్పష్టపడుతుంది.

'ఉప్పు కర్పూరమువరకును ఉంఛవృత్తిచే నార్జించి

శ్రీపతి పూజల మరచి చేసినట్టివారివలెనే'

'భ్రమపడి ఇరుగు పొరుగు భక్షింప రమ్మని పిల్వ

అమరుచుకో, పూజ జపము, ఆసాయము సేతుననుచు

'బ్రాహ్మణీకము బాయ నీచుల బ్రతుకాయె నది గాక,
బ్రాహ్మమైన మాటలు నేర్చుకొని బరగే రయ్యా'

త్యాగయ్య కృతులు కొన్ని మనస్సున నాటే ఉపదేశములతో నిండిఉంటవి. కొన్నిటిలో భగవంతునితో నొకపుడు పంతాలాడినట్లు, కొన్నిటిలో జాలితో దీను దైనట్లు, మరి కొన్నింటిలో నిందాస్తుతులో, స్తుతి నిందలో కన్పిస్తాయి. తనకు భగవంతునితో నాయికా నాయక భావం ఆపాదించుకొని చెప్పిన కృతులు కొన్ని :

'చెలిమిని జలజాక్ష గంటె చెప్పరయ్యా'
'ఎంతో కరుణారసము నిండిన కన్నులయ్యా'
'భక్తుల జాడ దెలిసి మాటలాడె జాణుడయ్యా'
'శృంగారుని బాసి మేను చిక్కెనయ్యా'
నాలోని జాలిని బల్క జాలనయ్యా'
' హరి మీలో మీరె తెలిసి, మర్మ మీయరయ్యా'
' నీరజనయన ఒక ముద్దీర, బంగారు వల్వలు నే బాగుగ గట్టెద
మరి శృంగారించి నే సేవజేసి కౌగిట జేర్చెద'.

## త్యా గ బ్ర హ్మ బో ధ :

ప్రజల లోని విషయ లోలతా, దాంబికాచారములు, ధనవంతుల గర్వ జీవితము, సామాన్యులలోని హింసాపరత, జారచోరాది దురాచారాలు, కులచార పాతిత్యము, కపటవర్తనలూ వీటి నన్నిటినీ త్యాగరాజు తన కృతులలో పలుచోట్ల ఖండించాడు. ప్రతివారును సంసారమం దుండియె, కులాచారములను వర్జింపక, సత్ప్రవర్తనతో, నిష్ఠాత్ములై, నియమబద్ధులై నిత్యమూ భగవద్భక్తి కలిగియుండ వలెనని ఆయన బోధించాడు. మతభేదములు కాని, మూలదైవముల పేరుల భేదములనుబట్టి వివాదములుగాని ఆయనకు కిట్టవు. భక్తిమార్గములు వేరైనా, మతసంప్రదాయములు వేరైనా సర్వమత లక్ష్యమూ ఒక్కటే అని ఆయన బోధించాడు, అహంకారమును చంపుకొని, శమదమాది సుగుణములను పెంచుకొని, ప్రాపంచిక వ్యవహారములపై నిర్లిప్తులై ఉండుట మోక్షమార్గమని, డాంబికంగా చేసే జపతపాదులకంటే అంతశ్శుద్ధి కలిగి నిష్కామమైన భక్తిమార్గమే ముక్తిప్రదమైనదని ఆయన విశ్వాసం.శ్రీరామానుగ్రహ బలం కలవానిని గ్రహబలమేమి చేయగలదనీ, రామభజనపరులకు దండపాణి భయం లేదనీ. రామకథాసుధారసపానమును మించిన అమూల్యవస్తువు లేదని ఆ భక్తి సాధనకు నాదబ్రహ్మోపాసనమే ప్రధాన మార్గమని ఆయన ప్రపంచానికి చాటించాడు.

## త్యాగయ్యగారి సంగీత నాటకములు :

పాత్రప్రవేశ దరువులనుబట్టి, ఆరంభదైవ ప్రార్థనా, అంత్యమంగళాచరణ కీర్తనలనుబట్టి త్యాగయ్య రచించిన సంగీత నాటకాలు ఆయన తాతగారయిన గిరి రాజకవీ, శాహభూపాలుడూ మున్నగువారు రచించిన యక్షగాన ప్రబంధాలను కొంతవరకూ పోలి ఉండినప్పటికీ, ఇతివృత్తపు అమరికలోను, నాటకీకరణము లోను త్యాగయ్య కొన్ని స్వతంత్ర మార్గములు తొక్కినాడు. ప్రహ్లాద భక్తి విజయమూ, నౌకాచరిత్రమూ, సీతారామ విజయమూ ఈ మూడూ ఆయన నాటక ములు పద్య, కీర్తనాత్మకములైన ఈ నాటకములను శాహభూపాలుని పల్లకిసేవా ప్రబంధమువలె-ప్రబంధములని కూడ వ్యహరిస్తారు నాయకరాజులు మహారాష్ట్ర రాజులు కూడా కొరవంజిలను, నాటకాలను, యక్షగానములను రచించినట్లు, మేర టూరువారు భాగవత మేళనాటకాలను రచించినట్లు ఆ యా సందర్భాలలో చెప్పు కొన్నాము మేలటూరు వేంకటరామశాస్త్రి, ప్రహ్లాద చరిత్రాది నాటకకర్త త్యాగ రాజుకు సమకాలికుడే. ఆయనను గురించి 18వ అధ్యాయంలో చెప్పగలము.

త్యాగయ్య తన తాతగారయిన గిరిరాజకవి నాటకాలను, శాహభూపాలుని నాటకాలను తంజావూరు ఆస్థానములోగాని, తిరువారూరు మొదలయిన క్షేత్రాల లోని దేవాలయాలలోను ప్రదర్శిస్తుండగా దర్శించి, వాటివలన ఉద్బోధితుడయి తన నాటకాలను రచించాడనడంలో సందేహంలేదు. ఆ నాటకాలన్నీ నృత్య నాటకాలే. త్యాగరాజుకు శృంగార కథాత్మకాలైన నృత్యనాటకాలపై అంత అభి మానము పట్టకేమో భక్తి ప్రధానములై అధ్యాత్మ తత్త్వబోధకములయిన కేవల సంగీత నాటకాలు మాత్రము రచించాడు. ఆయన ప్రహ్లాద భక్తి విజయాన్ని ప్రద ర్శించడానికి 5 గంటలు పట్టుతుందట, నౌకాచరిత్రం 2½ గంటలు పట్టే చిన్న నాటకము.

ప్రహ్లాద భక్త విజయంలోని ప్రారంభ కీర్తనా, చివరి మంగళమూ - 'శ్రీగణపతినీ' - 'నీనామరూపములకు' - రెండూ సౌరాష్ట్ర రాగములో రచింప బడినవి. నౌకా చరిత్రములోని ప్రారంభ కీర్తన 'శృంగారించుకొని' - చివరి మంగళం 'మా కులమునకు' అను రెండు కీర్తనలూ సురటి రాగంలో రచింప బడినవి. త్యాగయ్య తన నాటకాలలో పద్యాలు కూడా, ఏ రాగాలలో పాడవలెనో నిర్దేశించాడు. ఈ నాటకాలలోని సంవాదగేయాలు, ద్విపదలు, చూర్ణికలు, కందపద్యాలు, సీసపద్యాలు, ఉత్పల, చంపకమాలలు, శార్దూల విక్రీడితాలు, ఉత్సా హాలూ చక్కని మధురమైన శయ్యలో సాగినవి.

## ప్రహ్లాద భక్తి విజయం :

ఇది అయిదంకాల పెద్దనాటకం. ఇందులో 45 కీర్తన లున్నవి. కొన్ని కృతులవలెను, కొన్ని దివ్యనామ సంకీర్తన శైలిలోను ఉంటాయి. కథకథనానికి సూత్రధారుని సంధివచనా లున్నవి. ఇందులోని ఇతివృత్తము భాగవతంలోని ప్రహ్లాదుడు భక్తితత్వ ప్రబోధకుడుగా పొందిన విజయమును త్యాగరాజు స్వతంత్రించి కల్పించిన సంఘటనలతో నాటకీకరించినాడు. ఈ నాటకంలోని ప్రహ్లాదునకు ఆరాధ్యదైవం రాముడు. త్యాగరాజు దృష్టిలో రాముడు ఒక అవతారంకాదు. సాక్షాత్తు మూలవిరాట్స్వరూపుడయిన పరమాత్మయే. అందుచేత త్యాగరాజు నరసింహావతారకాలంలోని కథలో రామావతార ప్రశంస చేసినందుకు తప్పు పట్టరాదు. ఆదర్శ భక్తుడు ఎన్ని ఆటంకములు, ఎన్ని పరీక్షలు వచ్చినా వాటిని ఎదుర్కొని నిజమైన భక్తిద్వారా తన ధ్యేయమును పొందగలుగునని ప్రహ్లాదుని పాత్ర నిర్వహణ ద్వారా త్యాగరాజు ఈ నాటకంలో ఋజువు చేశాడు.

త్యాగయ్య ఈ నాటక ప్రారంభంలో విష్వక్సేన, సరస్వతి, నారద, తులసీదాస, పురందరదాస, భద్రాచలరామదాసులను స్తుతించాడు. ఈ స్తుతులయాక, 'వాసుదేవయని వెడలిన యీ దౌవారికుని గనరే' అనే కళ్యాణి రాగదరువుతో అసలు నాటకం ప్రారంభమవుతుంది.

## కథా సంగ్రహం :

నాగపాశబద్ధుడైన ప్రహ్లాదుని, హిరణ్యకశిపుని పరిచారకులు సముద్రంలోకి త్రోసివేస్తారు సముద్రుడు భక్తియోగసిద్ధుడైన ప్రహ్లాదుని తలపూవు వాడకుండా ఆదరించి, స్వాగతమిచ్చి ఒడ్డుకు చేరుస్తాడు. ఆ తర్వాత గరుడ ప్రార్థనమూ, గరుడని రాక, నాగపాశ విమోచనము. ప్రహ్లాదుడు కృతజ్ఞతతో సముద్రునికి మ్రొక్కి 'వారధి నీకు' అనే తోడిరాగ కీర్తనలో - హరిసాయుజ్యం పొందే మార్గ మేదో సెలవియ్యమని అడుగుతాడు.

రెండవ అంకంలో ప్రహ్లాదుడు శహాన రాగంలోని 'వందనము రఘునందనా' ఇత్యాది దివ్యనామ సంకీర్తనములతో హరిదర్శనముకై ఆరాట పడుతూ ఉండగా, నారదుడు వచ్చి, వైకుంఠ వైభవమును వర్ణించి త్వరలోనే హరి ప్రహ్లాదునకు దర్శన మీయగలడని ఆశగొలుపుతాడు. అప్పుడు వైకుంఠంలో లక్ష్మీనారాయణుల సంవాదము ఉదాత్త హాస్యధోరణిలో సాగుతూ వుంటుంది.

మూడవ అంకంలో ప్రహ్లాదుడు నీలాంబరి రాగంలో 'ఎన్నగ మనసుకు రాని' అను కీర్తనతో శ్రీహరిని ఏకాంత సేవార్చనచే సన్నిహితుని చేసికొన

యత్నిస్తాడు. హరి దర్శనం కలుగుతుంది. ప్రహ్లాదుడు బ్రహ్మానందం పొందుతాడు.

నాల్గవ అంకంలో ప్రహ్లాదుని భక్తి ఉత్కృష్టమైనదని నిరూపించడానికి, శ్రీ మహావిష్ణువు కొన్ని పరీక్షలు చేస్తాడు.

ఐదవ అంకంలో శ్రీ మహావిష్ణువు తాను భక్తుల హృదయాలలో సదా నివసిస్తానని చెప్పగా, ప్రహ్లాదు డాయనను రీతిగౌళలో 'నన్ను విడచి కదలకురా' అని అర్థిసాడు. కాని, శ్రీహరి అంతర్ధానమౌతాడు. ప్రహ్లాదుడు 'ఎంత పాపి నైతి' గౌళిపంతురాగ కీర్తనలో పరితపిస్తాడు. శ్రీమహావిష్ణువు కరుణామయ హృదయంతో శ్రీ మహాలక్ష్మి సమేతుడై ప్రహ్లాదునికి దర్శనం ఇస్తాడు

## నౌకా చరిత్రం :

త్యాగరాజు గేయ నాటకాలలో ఎక్కువ ప్రసిద్ధి పొందినది నౌకా చరిత్రము. ఇందులో రెండు మూడు సంవాదగేయా లున్నవి. ఈ నాటకం అంతా ఒకే ఒక ఏకాంకిక. రాసక్రీడలు, జలక్రీడలు భాగవతంలోని గోపీ కృష్ణ కథా సందర్భంలో ఉన్నాయి కాని, నౌకాక్రీడ మాత్రం అందులోనిది కాదు. నౌకా విలాసం అనే ఇదే కథ వంగదేశంలో ప్రచారంలో ఉన్నది. ఈ నాటకంలోని కృష్ణుడు ఏడేళ్ళ బాలగోపాలుడు. ఈ నాటకంలో యించుమించు నవరసాలకూ ఆ యా సందర్భాలలో తగిన స్థానం ఉన్నట్లు కనిపిస్తుంది.

## కథా సంగ్రహం :

సాయంకాలం, యమునాతీరం, గోపికలు వేణునాదం విని, కృష్ణుని అన్వేషిస్తూ పోయి, అతన్ని కలిసికొంటారు. వారంతా కలిసి, యమునలో నౌకపై విహారం చేయదలచి, కృష్ణుని కూడా తీసుకొని వెళ్ళడమా, మానడమా అని తర్కించుకొంటూ కృష్ణునే అడుగుతారు. తాను లేనిదే ప్రపంచంలో అణువు కూడా చలింపదని కృష్ణుడు జవాబిస్తాడు. గోపికలు కృష్ణుడు వెనుక చేసిన అల్లరు లన్నీ చెప్పి, అలాగు చేయవద్దని వేడుకొంటారు. నౌకాయాత్ర ప్రారంభం అవుతుంది. రాసలీలలో వలె కృష్ణుడు ఆ గోపిక లందరితోను, ఒక్కొక్క గోపికతో ఒక్కొక్క కృష్ణుడై విహరించి ఆనందంలో ఓలలాడించాడు. సంభాషణ ధోర ణిలో గోపికలు తమ సౌందర్యానికి గర్వించి విర్రవీగుతూ వుండగా వారి నౌక నడియేటిలోకి సాగిపోతుంది కృష్ణుని మాయ వల్ల ఒక తుఫాను వస్తుంది. గాలికీ, తుపానుకూ తోడు, మబ్బులు అల్లుకొని ఉరుములూ, మెరుములూ కలిగి చినికి చినికి వానలోకి దిగుతుంది. దానికితోడు నౌకలో చిల్లొకటి పడి లోనికి నీరు

మెల్లగా చొరపడుతూ వుంటుంది. గోపికలు భయభ్రాంతలై, నిస్సహాయలై కృష్ణుణ్ణి సహాయం చేయమని, రక్షించమని ప్రార్థిస్తారు. కృష్ణుడు గోపిక లందరనూ కళ్ళుమూసికొని ప్రార్థించమని అడుగుతాడు. గోపికలు సౌందర్య గర్వం విడిచి ప్రార్థించారు.

ఆ తర్వాత తుపాను తగ్గి, నౌక మళ్ళి ఒడ్డు చేరుకుంటుంది. ఇతర ప్రాంతా లలో ప్రచారంలో ఉన్న ఈ నౌకా విలాస కథలో కృష్ణుడు గోపికల అహంకార చిహ్నమయిన వస్త్రములను నౌకారంధ్రంలో దూర్పించి కప్పితేనే, నౌకలోకి వస్తూన్న నీరాగుతుంది. త్యాగరాజు ఇక్కడ కొంత మార్పు చేశాడు. ఈ మార్పు ఆయన స్వభావానికి అనుగుణంగానే ఉన్నది.

## సీతారామ విజయం :

ఇది మిగిలిన రెండు నాటకములంత ప్రసిద్ధమైనదికాదు. దీనిగ్రంథం కూడా ఇంతవరకూ పూర్తిగా లభించినట్లులేదు. ఇందులోని ఇతివృత్తం ఉత్తర రామా యణంలోని కథ. కాంభోజి రాగంలోను 'మా జానకి చెట్టబట్టగా మహారాజవైతివి' అనే కీర్తన ఈ నాటకంలోని ఒక పాత్ర. రాముని గురించి పాడినదట. అశ్వ మేధయాగానికి ముందు శత్రుఘ్నుడు యాగాశ్వంతో జైత్రయాత్రకు తరలివెడతా డనగా, రాముడు తమ్మునికి యుద్ధధర్మాలను బోధించడం ఈ నాటకంలోని ఒక ఘట్టం. అప్పుడు లక్ష్మీనిధి అను ఒక పాత్ర – రాముని "నీవు వాలితోను తాటకి తోను చేసిన యుద్ధములన్నీ ఈ ధర్మాలను పాటించే చేశావా" అని అడిగినాడట. దాని కేవో తగిన ప్రత్యుత్తరము లుంటాయి.

ఈ గేయనాటకాలలో నౌకా చరిత్రం చిన్నచిన్న దరువులతో, పద్యాలతో, సంవాదములతో, గాలీ వానా మొదలయిన ప్రకృతి సంఘటనలతో రసవంతంగా ఉంటుంది సంగీతం వింటూవుంటే శాహాభూపాలుని పల్లకిసేవాప్రబంధంలోని దరువులకూ, నౌకాచరిత్రంలోని దరువులకూ చాల పోలికలు కనిపిస్తాయి. ప్రదర్శన యోగ్యతకుగాని, రక్తికిగాని నౌకాచరిత్ర ఉపయోగించినట్లు ప్రహ్లాద భక్తివిజయం ఉపయోగించడం చాలాకష్టము. దీనిలోని సంఘటనలు కూడా పూర్తిగా భక్తి అధ్యాత్మిక భావములతో కూడి ఉండడంవల్ల సామాజికులు కొంత శ్రమపడితేగాని, రక్తిని పొందలే రనిపిస్తుంది.

## శిష్యవర్గం :

త్యాగయ్య శిష్యులను – వాగ్గేయకారులైనవారనీ, ప్రసిద్ధ సభాగాయకులైన వారనీ, ఇతరులనీ మూడు విధాలుగా విభజించవచ్చు.

వాగేయకారులైనవారు : 1. వీణ కుప్పయ్య కృతులను, వర్ణాలను రచించారు. 2. సుబ్బరాయశాస్త్రి – శ్యామాశాస్త్రుల కుమారుడు – కృతులను, వర్ణాలను, రచించారు. 3. మానాంబు చావడి వెంకట సుబ్బయ్య – కృతులను, రాగమాలికలను రచించారు. 4. వాలాజాపేట వేంకటరమణ భాగవతులు, 5. వాలాజాపేట కృష్ణస్వామి భాగవతులు (ఇద్దరూ కృతులను, వర్ణాలను. స్వరజతులనూ రచించారు.)

ప్రసిద్ధ సభాగాయకులైన వారు : 6. ఉమయల్పురం కృష్ణభాగవతులు, 7. సుందరభాగవతులు, 8. గోవిందశివన్ (సంస్కృత కృతులు రచించారు). 9. సభాపతి శివన్, 10. తంజావూరు రామారావు, 11 తిల్లస్థానం రామయ్యంగార్, 12. కన్నయ్య భాగవతులు (స్వాతి తిరునాళ్ ఆస్థానంలో త్యాగరాజ కృతులు గానంచేసి ఆయన కీర్తిని ప్రశస్తికి తెచ్చినారు). 13. అయ్యా భాగవతులు, 14. నెయికరప్పాటి సుబ్బయ్య (పల్లవి శేషయ్యగారి తండ్రి). 15 నేమం సుబ్రహ్మణ్యయ్య (నటరాజ భాగవతుల తండ్రి), 16. నంగవరం నీలకంఠయ్య, 17. సుబ్బరాయ భాగవతులు. 18. గణేశయ్య. 19. సోజ్జరి సీతారామయ్య. 20. లాల్గుడి రామయ్య. 21. కంజిరా విద్వాన్ చిత్తూరు రాధాకృష్ణయ్య. 22. శేవునా వెంకటాచలపతి భాగవతులు (దివ్యనామ సంకీర్తన ప్రచారకర్త), 23. అమృతలింగం పిళ్ళె.

ఇతరులు : 24. వాలాజాపేట పొట్టి జోస్యులు, 25. కుంభకోణం అరవాముదయ్యంగారు (వీరిద్దరు మంత్ర జ్యోతిశ్శాస్త్రాలలో త్యాగయ్యగారి శిష్యులు).

త్యాగరాజు శిష్యులు కొందరు ఆయన దగ్గరికి వచ్చుసరికే పల్లవి విద్వాంసులు, కాని ఆయన కృతులను. బహు శ్రద్ధాభక్తులతో నేర్చుకొనేవారు. కొందరు దివ్యనామ సంకీర్తనములను ప్రత్యేకించి నేర్చుకొనేవారు. వీణ కుప్పయ్య, వాలాజాపేట వేంకటరమణ భాగవతులు, గురువును కనిపెట్టుకొని చాలాకాలం ఉన్నారు. సంస్కృతాంధ్రాలలో మంచి విద్వత్తుగల వేంకటరమణ భాగవతులు త్యాగరాజుగారి కృతులను వ్యాసునిహర్షికి గణపతివలె ప్రక్కనుండి తాళపత్రాలపైనో, పలకలపైనో వ్రాసేవాడు. త్యాగరాజుకు కూడా తన శిష్యులందరిపైన పుత్ర వాత్సల్యం ఉండేది.

త్యాగరాజు తన శిష్యుల కంఠస్వరస్థాయినీ. నాదస్వభావమునూ. విస్తృతినీ ఇతర లక్షణాలనూబట్టి ఇద్దరిద్దరినిగా విభజించి, ఒక్కొక్క జంటకు 200 కృతులకు తక్కువకాకుండా నేర్పేవాడు. కృతులను నేర్చుకొనేటప్పుడు గురుముఖతః వింటూ తాను పాడుతూ తిరిగి పాఠం చేసుకొంటూ ధారణచేసుకోవలసిందే కాని మొదటిలోనే స్వరాలు వ్రాయనిచ్చేవారుకాదు. శక్తికల శిష్యులు

200 కంటె ఎక్కువ కృతులను నేర్చుకొనేవారు. వాటికి ఆ తర్వాత నెప్పుడో స్వరాలు వ్రాసుకొని ఉంచేవారు కనుకనే, యీ నాటికి వారి స్వరాలద్వారాను, వారి శిష్యపరంపరద్వారాను ఆ కీర్తనల సాహిత్యములూ స్వరాలూ మనకు చరిత్రలో పూర్వ వాగ్గేయకారుల రచనలవలెగాక, నిజస్వరూపంలోనే లభించ కలిగాయి. అందుకే వాలాజాపేట శిష్యుల ద్వారాను, ఉమయాల్పురం శిష్యుల ద్వారాను త్యాగరాజ కృతులలో ఎక్కువభాగం లభించాయి.

శిష్యులందరిలోను తంజావూరు రామారావు అనే ఆయన వయస్సులో పెద్దవాడు. గురువుకంటె రెండేండ్లు చిన్న: త్యాగరాజుకు అంతరంగిక కార్యదర్శి, త్యాగయ్యగారి క్షేత్రయాత్రలో కార్యనిర్వహణమంతా ఆయన చేతులమీదుగా సాగేది. గురువుగారి పాటలకు వ్రాయనకాడు కనుకనూ, బలంగా స్థూలంగా ఉండినందుననూ వాలాజాపేట వేంకటరమణ భాగవతులను సహాధ్యాయులంతా గణపతి అని పిలిచేవారుట.

త్యాగరాజును సామాన్య సంకీర్తనకరగా తలచి, దూరదూరంగా మసులుతూ వుండే సోజిరిసీతారామయ్య, పల్లవి దొరసామయ్యవంటి యువకవిద్వాంసు లొకనాడు ఆయన సౌరాష్ట్రంవంటి రాగంలో గంటలు కొలది ఆలాపన, తానం, పల్లవి పాడగా విని, ఆ విద్వత్తుకు అచ్చెరువంది, ఆయనకు శరణాగతులై ఆజన్మాంతము ఆయనను అంటిపెట్టుకొనే తిరిగేవారట

## చ ర మ ద శ :

చరమకాలంలో త్యాగరాజు కీర్తి మహావాగ్గేయకారునిగా, పరమభక్తాగ్రేసరుడైన దేశికునిగా తారస్థాయి నంటియున్నది. క్రీ. శ. 1847 సంవత్సరం పుష్య శుద్ధ దశమినాటిరాత్రి ఆయనకు కలిగిన దివ్య స్వప్నంలో ఇంక పదిరోజులలో భౌతికదేహం వదలి పరమాత్మ సాయుజ్యం కలుగుతుందని ఆయనకు ప్రబోధం కలిగినది. 'గిరిపై నెలకొన్న' అనే శహనారాగ కృతిలో ఆయన యీ విషయాన్ని స్పష్టపరచి ఉన్నారు.

శహన – ఆది :

గిరిపై నెలకొన్న రాముని గురి తప్పక గంటి
పరివారులు విరి సురటులచే నిల
బడి విసరుచు గొనరుచు సేవింపగ ॥గిరిపై॥

పులకాంకితుడై యానందాశ్రు
పుల నింపుచు మాటాలాడవలెనని
కలవరించ గని పది పూటలపై
కాచెద నను త్యాగరాజ వినుతుని ॥గిరిపై॥

## సిద్ధి పొందుట :

ఆ మరునాడు అనగా పుష్య శుద్ధ ఏకాదశినాడు త్యాగయ్యగారు, సంకీర్తన వేళ సమావేశమైన శిష్యబృందాన్నీ, పురజనులనూ, 'పుష్య బహుళ పంచమినాడొక అద్భుతం జరుగగలదు. మీరందరు తప్పక రండ'ని ఆహ్వానించారు. పుష్య బహుళ చతుర్థినాడు పరమహంస బ్రహ్మానందేంద్రస్వామి ఆధ్వర్యమున సన్యాసాశ్రమం స్వీకరించారు. త్యాగయ్యగారి సన్యాసాశ్రమనామం నాదబ్రహ్మానంద స్వామి. స్వామి అప్పు డక్కడ సమావేశమయిన వారందరితోను - 'మర్నాటి ఉదయం 11 గంటలకు శ్రీరామచంద్రమూర్తి తన్ను తన కడకు తీసుకొనిపోవనున్నాడు గనుక, ఈ క్షణమునుంచీ భజనగోష్ఠి ప్రారంభించండని ఆజ్ఞాపించారు. తిరువయ్యారు అంతటా ఈ వార్త వ్యాపించింది. సిద్ధిపొందబోయేముందు పంచమినాటి ఉదయం వాగధీశ్వరి రాగంలో పరమాత్ముడు, జీవాత్ముడు అనే కీర్తన, మనోహరి రాగంలో పరితాపము - అనే కీర్తనా రచించి గానం చేశారు. 11 గంటలవేళకి గానం పూర్తిచేసి యోగసమాధిలో కూర్చున్న నాదబ్రహ్మానంద స్వామికి కపాలమునుండి దివ్యతేజస్సు పైకిపోయి పరమాత్మలో లీనమయింది. ఆయన గురువర్యులయిన శొంఠి వెంకట రమణయ్యగారి సమాధి పక్కనే త్యాగయ్యగారికి కూడ సమాధికట్టారు. ఆ సమాధిపై తులసికోట.

## ఆరాధనా మహోత్సవం :

ఆయన సిద్ధిపొందిన నాటినుండి ఆరాధన దినమున కొందరు శిష్యులు ఆ సమాధివద్ద పూజచేసి, ఇంటివద్ద ఆరాధన చేసేవారు. త్యాగరాజు బ్రతికిఉండిన రోజులలో తన కీర్తి తన మరణానికి 60 ఏళ్ళ అనంతరం విస్తరిస్తుందని చెప్పినట్లుగానే, 1907 నుంచీ ఈ ఆరాధనోత్సవములో కొత్త మార్పు వచ్చింది. తిల్లస్థానం నరసింహ భాగవతులు, పంజు భాగవతులు, వయొలిన్ గోవిందస్వామి పిళ్లెగార్లు/ 1907/లో ఈ ఆరాధన ఉత్సవమును పెద్ద ఎత్తున చేయప్రారంభించారు.

కీర్తిశేషురాలు, గాయకీమణి అయిన బెంగుళూరు నాగరత్నమ్మ తన సంపాద్య ధనమంతా వెచ్చపెట్టి 1925 లో త్యాగరాజ సమాధిపైని ఆలయం కట్టించింది. ఏటేటా జరిగే ఈ ఉత్సవాలకు, ఆరాధనకు - భారతదేశమంతటా ప్రఖ్యాతి హెచ్చింది. 1940 లో త్యాగబ్రహ్మ ఆరాధన మహోత్సవసభ ఏర్పాటు చేయబడింది. ఇక్కడ ఈ ఉత్సవాలు జరిగేటప్పుడే దేశమంతటా జరిగే త్యాగరాజోత్సవాలు భారతదేశమంతటా జాతీయోత్సవాలలో ఒకటిగా ఎన్నికెక్కినవి.

మాటాడు భాషలు వేరైనా, రాష్ట్రాలు వేరైనా, ఆంధ్రులుగాని, తమిళులు గాని, కేరళులుగాని, కర్ణాటకులుగాని అందరిదీ ఒకే సంస్కృతి అనీ, ఒకే సంగీతమనీ. ఒకే వేదాంతమనీ చాటిన నాదబ్రహ్మానందుడు త్యాగరాజస్వామి భారతీయ అవతార పురుషులలో ఒకడు.

## పదునెనిమిదవ అధ్యాయం

# ధాతుకల్పనా దక్షులు [2]
# త్యాగరాజ సమకాలికులు, తర్వాతివారు

### శ్యామాశాస్త్రులు :

మూర్తిత్రయ జీవిత పరిశీలనంలో లోకానికి అనేక అపూర్వ విషయములు తెలిపిన సాంబమూర్తిగారు. శ్యామాశాస్త్రిలను గురించి వడదేశత్తు వడమాల్ అనిన్నీ, దక్షిణభారతంలో తమిళం మాటాడు బ్రాహ్మలనీ వ్రాశారు. సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో సుబ్బరామ దీక్షితులవారు కూడ ద్రావిడ బ్రాహ్మణులలో ఔత్తరులనీ వ్రాశారు. వీరి పూర్వులు ఆంధ్రదేశంలోని కర్నూలుజిల్లా కంబంలో ఉండేవారట. త్యాగరాజు పూర్వీకులుకూడ ఆ పక్కనే ఉండే కాకర్ల నుంచేకదా దక్షిణాదికి పోయినది ? ఈ విధంగానే దక్షిణాదికి పోయిన ఆంధ్ర దేశీయులయిన సాహిత్య కళాకారు లెందరో తమిళం మాటాడువారైనారు అయితే, వారి ప్రాచీనాంధ్రత్వవాసన వీడక, తొలి మాతృభాషయైన తెలుగులోనే విరివిగా తమ సంగీత రచనలను చేశారు

ఆది శంకరాచార్యుల కాలంనాటికి శ్యామాశాస్త్రిల పూర్వీకులు కాంచీ నగరం వచ్చి, శంకరాచార్యులవల్ల అక్కడి బంగారు కామాక్షీదేవి విగ్రహానికి అర్చకత్వం వహించారు. విజయనగర సామ్రాజ్య పతనం తర్వాత–కంచి, తురుష్క దండయాత్రలకు లోనైనప్పుడు ఆ కుటుంబంవారు దేవీ విగ్రహంతో పాటు దేశదేశాలు తిరిగి, చెంజిలో కొన్నేళ్ళు ఉదయార్‌పాళెంలో కొన్నేళ్ళు, అన్నాకుడిలో కొన్నేళ్ళూ ఉండి చివరకు తులజాజీ మహారాజుకాలంలో ఆయన ఆదరం సంపాదించి, తంజావూరు కామాక్షి అమ్మ ఆలయం కట్టించి, అమ్మనారిని అక్కడ వెలయింపించారు. శ్యామాశాస్త్రిల తండ్రి విశ్వనాథశాస్త్రియే ఆ ఆలయాన్ని కట్టించి దేవిని వెలయింపజేయడానికి తులజాజీ రాజును ప్రోత్సహించినారు.

విశ్వనాథశాస్త్రికి 25 ఏళ్ళ వయసులో శ్యామాశాస్త్రిలు జన్మించాడు. ఆ ఊరిలో వేంకటేశ్వర సమారాధన జరుగుతున్నప్పు డొక రోజున ఒక వృద్ధ

బ్రాహ్మణుడు దేవతావేశం కలిగి, పూనకంలో విశ్వనాథశాస్త్రి భార్యను చూచి వచ్చేయేటి చైత్రమాసంలో కృత్తికా నక్షత్రం వచ్చేనాడు నీకు కొడుకు పుట్టగలడు. పోయి బ్రాహ్మణ సమారాధన చెయ్యమని ఆదేశించాడు. ఆ ప్రకారమే కృత్తికా నక్షత్రంలో పుట్టిన బాలునికి వారు వెంకట సుబ్రహ్మణ్యమని నామకరణంచేసి, శ్యామకృష్ణా అని పిలుచుకొనేవారు. బంగారు కామాక్షీదేవి వీరి యింటి ఆడు పడుచుగా లెఖ్క గనుక, శ్యామాశాస్త్రులు చేసిన దేవీ కీర్తన లన్నింటిలోను దేవినిగూర్చి శ్యామకృష్ణ సహోదరి అనే సంబుద్ధి ప్రయోగించి. దానిద్వారా ఆయన తన రచనల్లో స్వనామముద్రను వేసుకొనేవాడు యుక్తవయస్సు వచ్చే సరికి, సంస్కృతాంధ్రాలలో ఆయనకు విద్యాభ్యాసం చేయించారు. వారి కుటుం బంలో సంగీతదృష్టి లేదు కాని శ్యామాశాస్త్రి మేనమామ. ఆయనకు బాల్యంలో సరళీలు మొదలుకొని స్వరజ్ఞానం వరకు నేర్పినాడట. సంగీతస్వామి అని ప్రసిద్ధు డైన భరత సంగీత శాస్త్రవేత్త - ఒక యోగీశ్వరుడు యాత్రార్థియై తంజావూరు వచ్చి తన చాతుర్మాస్యకాలంలో శ్యామాశాస్త్రుల యింటికి భిక్షకు వచ్చారట. ఆ యోగీశ్వరుడు బాలుడైన శ్యామాశాస్త్రిలో దాగిఉండిన సంగీతశక్తులను గుర్తించి, భవిష్యత్తులో అతడు గొప్ప వాగ్గేయకారుడు కాగలడని అతని తండ్రితో చెప్పారట. ఆ సంగీత స్వామివద్ద శ్యామాశాస్త్రులు మూడు సంవత్స రాలపాటు సంగీతలక్షణ మర్మా లన్నింటిని గ్రహించిన వెనుక, ఆ స్వామి అక్కడినుంచి కాశీ వెళ్ళాడట. ఆయన శ్రీ విశ్వేశ్వరుని సన్నిధిలో నర్తించే వాడట. అప్పుడు తులజాజీ రాజు ఆస్థానంలో విద్వాంసుడుగా ఉండిన పచ్చి మిరియం ఆదియప్పగారి సంగీత ధోరణులను వినుమనీ. అతనివద్ద ఏమీ నేర్చుకో వద్దనీ చెప్పి గురువైన సంగీతస్వామి శ్యామాశాస్త్రులకు ఎన్నో సంగీతగ్రంథాల నిచ్చి మరీ వెళ్ళాడట. ఆదియప్పగారు శ్యామాశాస్త్రులను చాల ఆదరించి, మెచ్చు కొనేవాడట. ఆప్యాయంగా కామాక్షీ అని పిలిచేవాడట.

తండ్రి తర్వాత కామాక్షమ్మను అర్చనచేసే అధికారము శ్యామాశాస్త్రులకు వచ్చింది. శ్యామాశాస్త్రుల స్వరజతులూ, తానవర్ణాలూ, కృతులూ రానురాను విద్వత్ప్రసిద్ధిపొంద నారంభించినవి. సామాన్య రాగాలలోనే కాక అపూర్వ రాగాలలోను, అతిక్లిష్టమైన నడకలుగల తాళములలోను ఆయన సునాయాసంగా కృతులు రచిస్తూండేవాడు. ఆయన మొదటికృతి 'జననీ నత జనపరిపాలినీ పాహిమాం భవానీ.'

శ్యామాశాస్త్రులు కామాక్షీదేవియందు అపారమైన భక్తి కలవాడు. దేవి సాక్షాత్కరించి, శాస్త్రులతో సంభాషిస్తూ ఉండేదని విజ్ఞుల విశ్వాసము. శుక్రవారపు పూజాసమయాలలో భక్తితో పరవశం చెందిఉన్న దివ్యక్షణాలలో ఆయన అద్భుత రచన లొక్కటొక్కటి వెలువడుతూండేవి. ముత్తుస్వామి దీక్షితులకు శ్రీవిద్యా

ఉపదేశంచేసిన దేవీ ఉపాసకుడు శ్యామాశాస్త్రిలేనని ఆయన వంశీకులు చెపుతూ ఉంటారు.

మూర్తిత్రయంలోని త్యాగరాజ ముత్తుస్వామి దీక్షితులవలెకాక శ్యామాశాస్త్రిలకు శిష్యులు చాల తక్కువ. వారి కాయన తన రచనలను పూర్తిగా చెప్పను కూడ లేదట. దేవతాస్తుత్యాత్మక రచనలుతప్ప, ఈయన నరస్తుతిగా కృతులేవీ చెప్పలేదు. శ్యామాశాస్త్రిలు తరచు తిరువయ్యారులో త్యాగరాజు యింటికిస్నేహరీత్యా వెడుతూ ఉండినప్పుడు త్యాగరాజు శిష్యులు - ఈ మహానుభావుల సంభాషణలతో ఈనాడు మన భోజనం రెండుజాములు దాటాకనే అనుకొనేవారట శామ్యాశాస్త్రిలు దేశయాత్రకాని. క్షేత్ర దర్శనంకాని చేయక, తంజావూరులోనే జీవితమంతా గడిపాడు.

పుదుకోటలలో ఒకరి ప్రబోధంవల్ల మాత్రం ఇతడు తన శిష్యుడైన అలనూరు కృష్ణయ్యతో కలిసి మధురవెళ్ళి. తొమ్మిది కృతులను రచించి పాడినాడట. వీటిని దేవీ నవరత్నమాలిక అంటారు. వీటిలో ప్రసిద్ధమైన కృతులు :

| | |
|---|---|
| సరోజ దళనేత్రి | శంకరాభరణం - ఆది |
| దేవీమీననేత్రి | " " |
| మరివేరే గతి | ఆనందభైరవి - చాపు |
| నన్ను బ్రోవు లలిత | లలిత-మిశ్రలఘు |
| మాయమ్మ | ఆహిరి - ఆది |
| దేవీ నీపదసారస | కాంభోజి - ఆది |
| మీనలోచనబ్రోవ | ధన్యాసి - చాపు |

అచ్చు ప్రచారంలేని ఆ రోజులలో వాగ్గేయకార కృతులకు ఎంతమంది ఎక్కువ శిష్యులుంటే అంత ప్రచారం ఉండేది. శ్యామాశాస్త్రిల క్లిష్టతాళముల వల్లను, అనుభవగాంభీర్యంవల్లను, ధాతుకల్పనలో ఎక్కువ సంగతులతో చౌక కాలంలో సాగే కృతులు ఎక్కువగా ఉండడంచేతను, ఈయన దగ్గరకు శిష్యులు చేరినదీ తక్కువే. చేరినవారిలో నేర్చుకొన్నదీ తక్కువే. త్యాగరాజుకు 20 మందికి మించి శ్రద్ధాళువులైన శిష్యులుండటంచేతను, దీక్షితులకు గాయకులైన ఇద్దరుసోదరులు, ఇంకా శిష్యవర్గమూ ఉండటంచేతనూ వారి కృతులకు శ్యామాశాస్త్రిల రచనలకంటె యెక్కువ ప్రాచుర్యం లభించింది. ఈయన రచనలు మొత్తానికి త్యాగరాజు కృతులంతటి సరళ ధోరణివీ కావు. దీక్షితులకృతు లంతటి శ్రమసాధ్యములుకావు. ఈయన తెలుగు, సంస్కృతం, తమిళ భాషలలో కృతులను చేశాడు. వాటి అన్నిటిలోను దేవీభక్తి అంతర్వాహినియైఉంటుంది. ఆయన కృతులలో చాలమట్టుకు గ్రహము అతీతమో, అనాగతమో అయివుంటుంది. భైరవి,

స్వరజతి, లలితరాగ కృతివంటి కొన్నిటిలో రాగనామంకూడా పొందుపరచాడు. శుద్ధ సూచిత, మిశ్రస్వరాక్షరాలు ఈయన రచనలలో కుప్పతిప్పలు. రచనలన్నీ కలిసి 300 వరకూ ఉండవచ్చు. తాళప్రస్తారమును గురించిన పథకాలతో ఆయన వ్రాసిన వ్రాతప్రతులు దొరికి ఉన్నవట. భైరవి స్వరజతిలోని ఎనిమిది చరణాలూ ఆరోహణక్రమంలో సరిగమ పదనిస ఎనిమిది స్వరాలతోను ఆరంభిస్తాయి.

బహుశా శ్యామాశాస్త్రులకు ఆనందభైరవి రాగంపైని ప్రత్యేకాభిమానం ఉండడంచేతనేమో, ఆ రాగంలో ఎక్కువ కృతులు రచించాడు. ఈ రాగంలో ఆయన చేసినన్ని రచనలు, తనకాలపువారుగాని, తరువాతివారుగాని ఎవరూ చేయలేదు. ఆనందభైరవిలో అటతాళంలో కంచి వరదరాజును గూర్చి సామినిరమ్మనవే అను తానవర్ణంలో రాగస్వరూపవివృతి మనోజ్ఞంగా ఉంటుంది. ఈయన స్వరజతులూ, కృతులూ ఎక్కువగా చాపుతాగంలో సాగుతవి. ఈ చాపులో 3 ప్లస్ 4 అని విరిగేవాటికంటె 4 ప్లస్ 3 అక్షరాలతో విరిగేవి ఎక్కువ.

ఆనాడు తంజావూరు రాజసానానికి వచ్చి అక్కడి విద్వాంసులను తన బిరుదుపట్టాలతోను. జయపత్రికలతోను బెదరించి,సవాలు చేసిన బొబ్బిలి కేశవయ్య అనే సంగీత విద్వాంసుని తంజావూరు విద్వాంసుల ప్రార్థన కాదనలేక స్వతః రాజస్థాన్ విముఖుడైన శ్యామాశాస్త్రిలు—రాజసభలో ఎదుర్కొన్నాడట. ఆ వివాదానికి వెళ్లేముందు దేవీపూజచేసి చింతామణి రాగంలో దేవీ బ్రోవ సమయమిదే అన్న కీర్తన రచించాడట. భూలోక చాపచుట్టి అను బిరుదు గల కేశవయ్య రాగాలాపనలోను, వేర్వేరు జాతులలో గతులతో తానములు పాడుటలోను సింహనందనం వంటి బహ్వక్షర ప్రమాణంగల తాళాలలో పల్లవులు పాడుడలోను గట్టివాడట. శ్యామాశాస్త్రిలుకూడ అటువంటి క్లిష్టపరిశ్రమనే చేసినవాడు కనుక, అతని సింహనందనతాళ పల్లవిని తన శరభనందన తాళపల్లవితో ఓడించాడట. అలాగే నాగపట్నంలో అప్పుకుట్టి అనే విద్వాంసునికికూడ ఈయన గర్వభంగం చేసి, తనకు స్నేహితునిగా చేసికొన్నాడు.

శ్యామాశాస్త్రుల ప్రసిద్ధ రచనలలో కొన్ని

కీర్తనలు : ఆనందభైరవి – ఆది – ఓ జగదాంబ
,, – చాపు – హిమాచలతనయ
,, – రూపక – పాహిశ్రీ గిరిజాసుతే
సావేరి – త్రిశ్రలఘు – శంకరీ శంకురు
మధ్యమావతి – ఆది – పాలించు కామాక్షి
కళ్యాణి – చాపు – తల్లి నిన్ను నెరనమ్మి
,, – రూపక – హిమాద్రి సుతే } ఈ రెండింటికీ ఒకే
,, – ,, బిరాన వరాలిచ్చి } సంగీత రచన.

ఫరజు – త్రిపుట – నీలాయతాక్షి
పున్నాగవరాళి - ఆది – కనకశైల విహారిణి
తోడి – చాపు – నిన్నే నమ్మినాను
పున్నాగవరాళి – ఆది – బ్రోవ సమయము
మాంజి – చాపు – బ్రోవవమ్మ

స్వరజతులు : తోడి – ఆది – రావే హిమగిరి
భైరవి – చాపు – కామాక్షి అనుదినము
యదుకులకాంభోజి – చాపు – కామాక్షీ

## శ్యామాశాస్త్రుల కృతులు :

ఆనందభైరవి – చాపు :

ప. మరి వేరే గతి యెవరమ్మ – మహిలో బ్రోచుటకు...

అ. ప. శరణాగత రక్షికి నీవే యని – సదా నిన్ను నమ్మితి మీనాక్షి....

చ. మధురాపుర నిలయ వాణి – రమా సేవిత పదకమల
మధుకైటభ భంజని కాత్యాయని – మరాళగమన నిగమాంతవాసిని....
వరమిచ్చితీ వరమే బ్రోవు శివయంబ యిది నీకు బరువా
నెరదాతవు నీవుగదా శంకరి – సరోజభవాది సురేంద్రపూజిత....
శుకశ్యామల ఘనశ్యామ కృష్ణుని సోదరి కౌమారి
అకళంక కళాధరి బింబాధరి – అపార కృపానిధి నీవే రక్షింప....
పాదయుగము మదిని దలచి కోరి వినుము మదగజ గమన
పరుల నుతింపగనె వరమొసగు సతతము నిను మది మరువకనే
మదనరిపు సతి నిను హృదయములో గతియని తలచి
నుతి సలిపితే ముదముతో ఫల మొసగుటకు ధరలో నతావన
కుతూహల నీవేగా....మరి వేరే....
శంకరాభరణం – ఆది

ప. సరోజదళ నేత్రి హిమగిరిపుత్రి నీ పదాంబుజములె
సదా నమ్మితినమ్మ శుభమిమ్మా శ్రీ మీనాక్షమ్మా.

అ. ప. పరాకు సేయక వరదాయకి నీవలె నే దైవము లోకములో గలదా
పురాణి శుకపాణి మధుకరవేణి సదాశివునికి రాణి ...

చ. కోరి వచ్చిన వారికెల్లను కోర్కెలొసగే బిరుదుగదా – అతి
భారమా నన్ను బ్రోవ తల్లి కృపాలవాల నే తాళజాలను.... 1
ఇందుముఖి కరుణించుమని నిన్నెంతో వేడుకొంటిని – నా

యందు జాగేలనమ్మా మరియాదగాదు దయావతి నీవు....2
సామగాన వినోదినీ గుణధామ శ్యామకృష్ణ వినుతా శుక
శ్యామలాదేవి నీవే గతి రతి కామ కామ్యద కావవే నిన్ను....3

## ముద్దుస్వామి దీక్షితులు :

సంస్కృతాంధ్రములలో పండితుడూ, వేంకటమఖి మాతులపౌత్రుడైన వేంకట వైద్యనాథ దీక్షితుల సంగీత విద్యాశిష్యుడు. గొప్ప వాగ్గేయకారుడు అయిన రామస్వామి దీక్షితులకు నలభై యేండ్ల వరకు సంతతిలేక, ఆయన భార్యతో కలిసి శ్రీ వైద్యనాథ క్షేత్రంలో ముద్దుకుమారస్వామి గుడివద్ద సంకీర్తనసేవ చేయగా, వరప్రసాదియై జన్మించినవాడు ముద్దుస్వామి దీక్షితులు. తమిళులీయనను ముత్తుస్వామిదీక్షితర్ అంటారు. ఇతడు బాల్యంలోనే విద్యాభ్యాసం ప్రారంభించి. వేదాధ్యయనములోను, వ్యాకరణ ఛందో జ్యోతిషాది వేదాంగ పఠనములోను, కావ్యాలంకార శాస్త్రములలోను, మంత్రశాస్త్రములోను, యోగశాస్త్రములోను పరిపూర్ణ పాండిత్యం సంపాదించాడు. వివాహితుడైన తర్వాత దీక్షితులు మణలి చిన్నయ్య ముదలారివద్ద ఉంటూండగా, చిదంబరనాథయోగి అనే మహాసిద్ధుడు మణలికివచ్చి, దీక్షితుల భక్తి విద్యాగరిమకు, వినయవిధేయతలకు మెచ్చుకొని మహామంత్రం ఉపదేశించెనట. శ్యామాశాస్త్రిల కుటుంబంవారు కొందరు శ్యామాశాస్త్రిలే దీక్షితులకు శ్రీ విద్యామంత్రం ఉపదేశించాడని చెప్పుతూంటారని సాంబమూర్తిగారు వ్రాశారు. ఉపదేశం పొందిన తర్వాత, దీక్షితులు చిదంబరయోగితో కలిసి కాశీయాత్రచేసి, అక్కడ ఐదేళ్ళవరకు మంత్రావృత్తిచేసి, అష్టమహాసిద్ధులను సంపాదించి, వేదాంతశాస్త్రోపదేశం పొంది, గుర్వనుజ్ఞపై తిరిగి మణలికి వచ్చి, దేవతాతృప్తికై అంతర్బహిర్యాగాలను నిర్వర్తించాడట.

అటుతర్వాత, తిరుత్తణిలో సుబ్రహ్మణ్యేశ్వరుని సన్నిధిలో సుబ్రహ్మణ్యం పంచాక్షరీ మహామంత్రమును ఆవృత్తి చేసుకొంటూ ఉండగా, ఒకనాడు చెంగల్వరాయ నాముడైన సుబ్రహ్మణ్యుడు ఒక మహాపురుష రూపంలో దర్శనమిచ్చి, దీక్షితులను నోరు తెరవమని కోరి, నోటిలో కండచక్కెరవేసి అంతర్ధానం చెందాడట. వెంటనే సద్యస్ఫురణగా - మాళవగౌళ రాగంలో ప్రథమా విభక్త్యంతంగా శ్రీ నాథాది గురుగుహోజయతి అని మొట్టమొదట సంస్కృత కీర్తన రచన ప్రారంభించాడు. ఇది అయిన వెనుక సంబోధన ప్రథమ మొదలయిన ఏడు విభక్తులలోను ఒక్కొక్క విభక్తికి ఒక్కొక్కటి చొప్పున ఏడు కీర్తనములను గురుగుహాంకితముగా రచించాడు. తన సోదరులతో కలిసి కాంచీపురంలో నాలుగేళ్ళు నివాసం యేర్పాటుచేసుకొని శ్రీ కామాక్షి సన్నిధిలో శ్రీ విద్యోపాసనచేసుకుంటూ, కంజదళాయతాక్షి, ఏకామ్రనాథం భజేహం మొదలైన అనేక కీర్తనలు గేయకల్పనలు విలసిల్లగా రచించి, తన తమ్ములచేత పాడించి ప్రచారంలోకి

తెచ్చినారు. కంచిలోని ఉపనిషద్బ్రహ్మ స్వాములతో వేదాంతవిచారణ చేసిన సందర్భములో ఆ స్వాములు వారిచే రచింపబడిన రామాష్టపదులకు వర్ణక్రమముతో రాగతాళాలను ఏర్పరచారు. ఆ తర్వాత దీక్షితుల కుటుంబం తిరువారూరు వచ్చి స్థిరపడినారు. అప్పుడు గురుగుహ ముద్రతో తిరువారూరులో వెలసిన శ్రీ త్యాగరాజస్వామి పైనను, ఆనందేశ్వర, సిద్ధేశ్వర అచిలేశ్వర, హాటకేశ్వర వల్మీకేశ్వరుల మీదను. ఆ క్షేత్రములలో వెలసిన షోడశ గణపతులమీదను, చోళమండలంలో వెలసిన శివ విష్ణు క్షేత్రములలో వెలసిన దేవతలమీదను, పంచలింగ క్షేత్రములలో వెలసిన ఈశ్వరమూర్తుల మీదను, కాశీ, మధుర, అళఘరు కోవిళ మొదలయిన క్షేత్రములమీదను అనేక సంస్కృత కీర్తనలను రచంచారు.

సంస్కృత భాషాప్రయోగంలో ఈయనకు అసాధారమైన సామర్థ్యమున్నది. అన్ని కీర్తనలలోను అద్వైతాత్మకమైన వేదాంత తత్త్వముఅంతర్లీనమై ఉంటుంది. వేంకటమఖి రాగసంప్రదాయములలో గనుక జాతీయాలతో, ఆయా రాగాల జీవస్వరాలు రాగనామాలను కూడా చేర్చి కీర్తనలు రచించారు, సూళాది సప్తతాళాలలోను చేసిన నవగ్రహకీర్తనలలో ఈయనకుగల జ్యోతిషశాస్త్ర పాండిత్యం స్పష్టపడుతుంది. దేవీమూర్తులను దేవతా మూర్తులను వర్ణిస్తూ చేసిన వివిధ కీర్తనలలో ఈయనకు గల మంత్రశాస్త్ర పాండిత్యమూ, దేవతా ప్రతిమా లక్షణ విజ్ఞానమూ అత్యంత సూక్ష్మములని ప్రకట మవుతుంది. కమలాంబా విషయమై నవావరణపూజాక్రమంగా తొమ్మిది కీర్తనలను రచించి తన తమ్ములచేతను, శిష్యులచేతను పాడించారు. ఇతని తమ్ము లిద్దరిలోను చిన్నస్వామి దీక్షితు లకాలమరణం చెందగా. భ్రాతృవియోగంవల్ల విరక్తి చెందిన చిన్న తమ్ముడు బాలస్వామి హరి యనే శిష్యునితో కలిసి రామేశ్వరయాత్ర చేసి, తిరిగి వస్తూ ఎట్టయాపుర సంస్థాన ప్రభువుల మన్నన పొందినాడు. ముద్దుస్వామి దీక్షితులు తన కొమారునిగా భావించుకొంటున్న చిన్నతమ్ముడు పరారి అయినాడని దుఃఖంతో – తన యిద్దరు భార్యలను సుబ్రహ్మణ్యుడనే శిష్యుని వెంట పెట్టుకొని, దేశాటన చేస్తూ అక్కడక్కడ తమ్ముని కొరకు వెదకుతూ ఉండగా, శాత్తూరులో పెరుమాళ్ల మంటపంవద్ద ఒక వైష్ణవ బాలకునిద్వారా తిరువారూరి నుంచి వచ్చిన బాలస్వామి అనే విద్వాంసునికి ఎట్టయాపురపు రాజు పెండ్లి చేయిస్తున్నాడని విని – ఆనందంతో – మేఘరంజని రాగంలో 'వేంకటేశ్వర ఎట్టప్ప భూపతి మాశ్రయేహం' అనే కీర్తన రచించి శిష్యుడికి నేర్పారు.

అక్కడినుండి కొందరిని వెంటబెట్టుకొని ఎట్టయాపురానికి ప్రయాణమై వెడుతూవుండగా త్రోవలో వానలేక పాడయిపోయిన పంటభూమిని చూసి– ఆనందామృతాకర్షిణి. అమృతవర్షిణీ...అని అమృతవర్షిణిరాగంలో ఒకకీర్తనచేసి శిష్యుడికి నేర్పే లోపునే ఆకాశంపై మబ్బుకమ్మి, రేగటినేలపై బడి. బండి సాగకుండా

బాడి అయేటంత పెద్ద వర్షం కురిసిందట. అ రేగడిబందలో ఎలాగో కష్టపడి బండి తోలుకొని, సాయంకాలానికి ఎట్టయాపురం చేరుకొని, తమ్ముని కలిసికొని సంతోషించారట. ఎట్టయాపుర ప్రభువు ముద్దుస్వామి దీక్షితులు తనపై రచించిన మేఘరంజని కీర్తన విని మెచ్చుకొని ఆయనను బహువిధాల సన్మానించి,బాలస్వామి వివాహాన్ని అతి వైభవంగా జరిపించారట. ఆ బాలస్వామి దీక్షితుల పెంపుడు కుమాడుడే సంగీత సంప్రదాయప్రదర్శిని రచించిన సుబ్బరామ దీక్షితులు వా రిరువురు అప్పటినుంచి ఎట్టయాపురాస్థానాన్నే ఆశ్రయించి, సంగీత సరస్వతి నర్చిస్తూ, వాగ్గేయకారులై పేరుపొందారు. తమ్ముడి పెండ్లయిన తర్వాత ముద్దు స్వామి దీక్షితులు తిరువారూరులో వుండి 1835 వ సంవత్సరములో ఎటయాపురపు రాజు తన కుమారుని వివాహానికి రమ్మని ఆహ్వానం పంపగా, అక్కడికి తిరిగి వెళ్ళి - వెళ్ళిన మూడుమాసాలకు బంధుమిత్రు లందరకు తనకు అవసానము సమీపించినదని వెల్లడించి మన్మధ సంవత్సర తులా కృష్ణ చతుర్దశినాడు పరమపదించారు.

## పంచలింగస్థల కృతులు :

1. చింతయ మాం - భైరవి - పృధ్వీలింగం - కాంచీపురం
2. జంబూపతే - యమునాకళ్యాణి - అపోలింగం - తిరువనైక్కావల్ (జంబులింగం)
3. అరుణాచలనాథం - సారంగ తేజోలింగం - తిరువణ్ణామలై
4. శ్రీకాళహస్తీశ - హుసేని - వాయులింగం - కాళహస్తి
5. ఆనందనటన ప్రకాశం - కేదారం - ఆకాశలింగం - చిదంబరం.

దీక్షితులు గురువుతోకలిసి కాశీయాత్రకు వెళ్ళి అక్కడ ఐదు సంవత్సరాలు గడిపి ఉత్తర హిందూస్థానపు సంగీతరీతులతో ప్రత్యక్ష పరిచయం సంపాదించు కొన్నారు. ఆ పరిచయ ప్రభావము ఆయన కృతులకు ఎన్నుకొన్న కొన్ని రాగాల లోను, ఆ రాగాల స్వరూపనిరూపణములలోను కొంతవరకు కనిపిస్తుంది యమునాకళ్యాణి, జయజయవంతి లేక ద్విజావంతి బృందావనీసారంగ, భీమపలాసి లేక కర్ణాటక బేహాగ్ మొదలయిన రాగాల కీర్తనలలో ఆయనకుగల హిందూస్థానీ సంగీత పరిచయం కనుక్కోవచ్చు. రాగంయొక్క పరిపూర్ణ స్వరూపము గ్రహాంశన్యాసాదిస్వర. ప్రత్యేకస్వర ప్రయోగనిరూపణలద్వారా ఆయన కృతులలో స్పష్టంగా వివిధాంగముల క్రమవిన్యాసంతో ఆయన కీర్తన లలో లభించినట్లు యితరుల కీర్తనలలో లభించదు. అంతేకాకుండా ఆయన

రచించిన చాలకృతులలో వాడిన రాగపు పేరుకూడ కీర్తనలో నిబద్ధమై ఉంటుంది. ఇది యిట్లు చేయవచ్చని దీక్షితులూ, చేయకూడదని త్యాగరాజూ వివరించుకొని ఉండినట్లు ఐతిహ్యం చెపుతారు. తనకంటె పదేళ్లు పెద్ద అయిన త్యాగరాజుగారి వద్ద దీక్షితులు కొన్నాళ్ళు సంగీతం చెప్పుకోడానికి వెళ్ళినట్లూ, త్యాగరాజు హరికాంభోజిరాగంలో దినమణివంశతిలకలావణ్య అనే కీర్తన పాఠం చెప్పగా విని, వ్యాకరణశాస్త్రం ప్రకారం లావణ్య తిలక అని ఉండాలికాని, తిలకలావణ్య అని ఉండటం దోషమని చెపార్పట దీక్షితులు. త్యాగరాజు నీ సంస్కృతంలో ఏమోగాని, మా తెలుగులో యిలాగే ఉండాలనీ, ఉండవచ్చునీ వాదించగా, అంతకుముందు తాను తెలుగులో కూడా కొన్ని కీర్తనలూ, రచనలూ చేసి ఉండినా, అప్పటినుంచీ తెలుగులో చేయడం మానుకొని, సంస్కృతంలోనే రచించ పూనుకొన్నాడట దీక్షితులవారు. దీక్షితుల తెలుగు రచనలలో ప్రసిద్ధమైనది. తోడిరాగంలోని చౌకవర్ణం 'రూపముజూచి వలచివచ్చితిరా', ఆయన హుసేని రాగంలో రచించిన స్వరజతిని తిరువారూరిలోని కమలమ్మ అను నట్టువరాలూ, వళ్ళలార్‌గుడి అమ్మణిఅమ్మ అను నటువరాలూ ఆయనవద్దనే నేర్చుకొని నాట్యాభినయ యుక్తంగా గానంచేసేవారట.

మొత్తానికి ఈయన కృతులు పండితులకు ఆస్వాదయోగ్యమయినట్లుగా సామాన్యజనులకు కావు. అవి సాధారణంగా విలంబకాలంలో సాగుతూ, అప్పు డప్పుడు ఒకే కృతిలో నడుమ మధ్యమకాలంలో కొంతనడిచి, వినేవారు పూర్తిగా సాలోచనగా అనుభవిస్తేగాని రక్తికిరావు. త్యాగర్యాజుకృతులలో మధ్యమకాల రచనలెక్కువ. త్యాగరాజు సాహిత్యగుణం: మాధుర్యం- శ్యామా శాస్త్రిలది ప్రసాదగుణం: దీక్షితులది ఓజస్సు. సమాన ఘటితమైన శయ్యలో ఓజోగుణం వర్తిస్తుంది. త్యాగరాజు రచన తన యిష్టదైవంతో భక్తుడు తన కష్టసుఖాలను వెళ్లబోసుకొనేటట్లు ఆత్మాశ్రయ (సబ్జెక్టివ్)మై ఉంటుంది. దీనిని ప్రణయశృంగారంలో నాయికా నాయక భావసంబంధమైన అనుభవంగాను, భక్తి శృంగారంలో జీవాత్మ, పరమాత్మను బంధానుభవంగాను చెపుతారు. త్యాగరాజు కృతులలో అన్నిరసాలకూ విస్తృతమైన అవకాశం ఉన్నది. దీక్షితుల రచనలు వస్త్వాశ్రయ (ఆబ్జెక్టివ్)మై ఉంటాయి. ఇది మానసికాభిప్రాయ నివేదనంకాదు. ఆరాధ్యవస్తువును నిర్మమకారంతో ఉదాత్తంగా సర్వలక్షణలక్షితంగా వర్ణించడమే దీక్షితుల మార్గము. ఆయని కీర్తనలలో వర్ణించిన ప్రతి దేవతకూ మూర్తిభేదాలను వివరిస్తూ వివిధ గుణాలను, రూపలక్షణాలను కీర్తిసాడు. వీటిలో రసవ్యంజక మైన మానసికావస్థ తటస్థమేకాని, రసకల్లోలితంకాదు. త్యాగరాజు మనసు రసకల్లోలితం. దర్శనంవల్ల కలిగే అనుభూతి చిత్రణం ఇంకా శ్యామాశాస్త్రిల రచనలలో ఉన్నదికాని, దీక్షితుల మనస్తత్వంలో సోహంబ్రహ్మాస్మి అనే తత్త్వము పూర్తిగా జీర్ణించినందున ఆ బ్రహ్మజ్ఞానముతో దర్శించి, నిర్వికార

చిత్తవృత్తితో చేసిన సగుణోపాసనమే ఆయన కీర్తనలు ఆయన సంస్కృత భాషాపాటవమూ, ఛందోవ్యాకరణవశీకరణా ఆయన కీర్తనలలో స్పష్టపడతాయి. అక్షయలింగవిభో అను శంకరాభరణ కృతివంటివానిలో ఆయన శబ్దాలంకారములు లయమాధురిని సాధించిపెట్టినవి.

ఆయన జ్యోతిషశాస్త్ర పాండిత్యాని కుదాహరణగా నవగ్రహకీర్తనలలో బృహస్పతిని గురించిన దానిని పరిశీలించవచ్చును.

అఠాణ-త్రిపుట :

ప. బృహస్పతే తారాపతే బ్రహ్మజాతే నమోస్తుతే॥

అ. ప. మహాబలవిభో గీష్పతే మంజుధను ర్మీనాధిపతే॥
మహేంద్రాద్యుపాసితాకృతే మాధవాదివినుత ధీమతే॥

చ. సురాచార్యవర్య వజ్రధర, శుభలక్షణ జగత్త్రయగురో
జరాదివర్జితక్రోధ,కచజనకా శ్రితకల్పతరో॥
పురారి గురుగుహ సంమోదిత, పుత్రకారకదీనబంధో
పరాదివాక్చత్వారి వాక్స్వరూప ప్రకాశక దీనబంధో॥
నిరామయాయ నీతికర్త్రే, నిరంకుశాయ విశ్వభర్త్రే
నిరంజనాయ భువనభోక్త్రే, నిరంకుశాయ సుఖప్రదాత్రే॥—

ఆయన మంత్రశాస్త్ర పాండిత్యాన్ని పట్టియిచ్చే కేదారగౌళ కృతి—

కేదారగౌళ-ఆది :

ప. నీలోత్పలాంబికాయై నమస్తే జగదాంబికాయై॥

అ. ప. మూలాధారక్షేత్రస్థితాయై ముచుకుందవరప్రదాయై
మూలమంత్రాత్మికాయై, మూలాజ్ఞానహర గురుగుహవరదాయై॥

## మేలటూరు వేంకట్రామశాస్త్రి :

వై శికీరీతిలో చాలా యక్షగానములను రచించిన వేంకట్రామశాస్త్రి శరభోజీ శివాజీరాజుల కాలంలో అనగా 1798-1855 కాలంలో ఉండినవాడని సుబ్బరామ దీక్షితులవారు వ్రాశారు. ఆంధ్రదేశం నుంచి నాయకరాజుల కాలంలో వచ్చి మేరటూరులో వలస విడిసిన భాగవత కుటుంబాలవారు పారంపర్యంగా సంగీత సాహిత్యకోవిదులై, వాగ్గేయకారులై ఆంధ్రభాషలో పదాలను, యక్షగాన నాటకములను, ఇతర సంగీత రచనలను చేస్తూ వచ్చారని మేరటూరు కాశీనాథయ్య,

వీరభద్రయ్యలను గురించిన వ్యాసములో చెప్పుకొన్నాము. ఆ వంశములోనివాడే అయిన వేంకట్రామశాస్త్రి త్యాగరాజాది రత్నత్రయానికి సమకాలికుడు, ప్రసిద్ధ వాగ్గేయకారుడు. ఈయన శ్రీవత్సగోత్రుడయిన గోపాలకృష్ణార్యుని కుమారుడనీ లక్ష్మణార్యుని శిష్యుడనీ, వెలనాటి తెలుగుబ్రాహ్మణుడనీ, దేవీపూజా, నారసింహోపాసనాపరుడనీ, త్యాగరాజుకు సమకాలికుడునూ, ఆయనకంటే వయోవృద్ధుడనీ డాక్టరు రాఘవన్‌గారు వ్రాశారు. త్యాగరాజీయన సాహిత్యమునూ, ఈయన త్యాగరాజు వర్ణమెట్టులనూ మెచ్చుకొనేవారట.

ఈయన ప్రసిద్ధ గాయకుడు, నటకుడూ, నాటకకర్త – ఈయన నారసింహోపాసకుడై ప్రహ్లాద చరిత్రను యక్షగానముగా రచించాడు. దానిని తంజావూరి గ్రామాలలో నృసింహ జయంత్యుత్సవ సందర్భాలలో నాటినుంచీ నేటి వరకూ ప్రదర్శిస్తూనే ఉన్నారు ఈయన రచించిన ఇతర యక్షగానాలు, మార్కండేయ చరిత్ర, రుక్మాంగధ చరిత్ర, ఉషా పరిణయం, సత్సంగరాజ నాటకం, హరిశ్చంద్ర నాటకం 2 భాగాలు, రుక్మిణీకళ్యాణం, శివరాత్రి నాటకం, అసత్సంగ రాజ నాటకం, సీతాకళ్యాణం, జగన్మోహన విలాసం, వీటన్నిటిలోను ప్రహ్లాద చరిత్రం ఎక్కువ రసవంతమైనదని పెద్దల అభిప్రాయం.

ఈ యక్షగానాలకుతోడు ఈయన చిందు అనే గేయములను, అద్వైత కీర్తనలను కూడా రచించాడు. ఈయన అద్వైత కీర్తనలలో ఒకదాని పల్లవి "తోట వేసినాను ఇప్పుడు" అని రూపకాలంకారంలో రచితమైనది చిందులు శృంగార రసాత్మకములు. ఇతని నాటకాలు ప్రదర్శించే భాగవతులు నేటికీ ఈయన నటనాగాన సామర్థ్యములను గురించి అనేక గాథలను చెపుతూ ఉంటారు, కొన్నిటిలో దైవభక్తి మహత్మ్యము కొన్నిటిలో ఆయన పాత్ర పారవశ్య సామర్థ్యములూ వర్ణితములు. ఆయన నాటకాలలో అనేక అపూర్వ రాగాలలోను రక్తిరాగాలలోను ఆయన రచించిన దరువులు కీర్తనలు రాగ లక్షణాన్వేషులయిన కర్ణాటక సంగీత పరిశోధకులకు కావలసినన్ని దృష్టాంతముల నియ్యగలవు. ఆయన రచించిన ఉసేనిరాగపు స్వరజతి, అత్యంత ప్రసిద్ధమైనదనీ దానిని ఆయనవద్దనే తిరువారూరు కమలమ్మ అనే నటువరాలు, నేర్చుకొని, నాట్యాభినయ యుక్తంగా గాన ప్రదర్శనలు చేసేదనీ రాఘవన్‌గారు వ్రాశారు. దీని సాహిత్యం, "ఏ మాయలాడిరా ఏమని బోధించెరా" అని ప్రారంభిస్తుంది. ఈయన పచ్చిమిరియం ఆదియప్పయ్యగారితో బహుమైత్రిగా ఉంటూ ఆయన రచించిన వర్ణమెట్టులకు సాహిత్య కల్పనచేసి యిస్తూ ఉండేవారనీ సంప్రదాయ ప్రదర్శినిలో ఉన్నదట.

మేరటూరి వేంకటరామశాస్త్రివారి 'చిందు' అనే శీర్షికతో సంగీత సర్వార్థసార సంగ్రహంలో యీ క్రింది పదం ఉదాహృతమై ఉన్నది.

నాదనామక్రియ - ఆది :

పల్లవి : తళుకు బెళుకు కులుకుగల మితారిరా యేరా నా సామి....

అను ప. తళుకు బెళుకు కులుకుగల మితారి
వలపు దెలుపు సొలపు చూపులదారి
కలిగి చిన్నారి పొన్నారి వయ్యారి
ఘనుడ, మల్లాజేంద్రా నిను గోరి

చ. పగడాలు సొలపు జిగిడాలు
అలరు జాతి కెంపుల నగజాలు
చిలుక సకికి కెంజేయన జాలు
చిలుకల కొలికి వాతెర జిగిడాలు
సులలిత నయ గుణములుగల ఇంతిరా
వలరాజు దంతిరా, చెలువలరిన చెంగలువల బంతిరా,
రతనాల దొంతిరా, యిలగల లలనలలో మేల్బంతిరా
నెమ్మేని కాంతిరా, తెలివగు మెరుపులలో నడితంతిరా,
సొబగైన గొంతిరా,
తెలికలువల చెలువుని మేనల్లుని గిండ్లూ, చారదేసి కండ్లూ
పొలుపుమీరి యటు విటులెరుగని చండ్లు మల్లెపూల చెండ్లు,

అని యిదే విధంగా పొడవైన మూడు భరణాలతో కళ్ళు జిగేలు మనే అప్రాసలతో వింత లయ విన్యాసాలతో శృంగారరస ప్రకాశమై ఉంటుంది, యీ చిందు.

## శరభోజీ, శివాజీలు (1798-1855)

రెండవ శరభోజీ మహారాజు తంజావూరు సరస్వతీ మహల్ పుస్తక భాండాగారమును నెలకొల్పి, సంస్కృతాంధ్రాది భాషలలో సాహిత్య సంగీతాది శాస్త్ర విషయికములైన అనేక గ్రంథములను కావ్యములను తాళపత్రములపైన వ్రాయించి, ఆనాటి కాగితములపై సిరాలతో వ్రాయించి భద్రపరిపించాడు. ఈనాడు సంగీత సాహిత్య చరిత్ర పరిశోధకుల కీగ్రంథాలయం కల్పతరువులాగ సహాయపడుతున్నది, ఆయన తర్వాత తంజావూరు రాజయినవాడు శివాజీ, తమవంశపు మూలపురుషుడూ ఔరంగజేబు నెదిరించినవాడూ స్వాతంత్ర్య యోధుడూ అయిన శివాజీవలెనే యితడు ఛత్రపతి బిరుదం స్వీకరించాడు.

ఈయన ప్రోత్సాహంపై శివపారిజాతం అనే యక్షగానాన్ని కనకాజెట్టి వెంకట కృష్ణజెట్టి అనే మల్లుడు రచించాడు. ఆంధ్ర కాళిదాస బిరుదాంకితుడైన ఆలూరి కుప్పన శివజీరాజు మన్ననలు పొందినవాడు. శివపారిజాత రచనలో వెంకటకృష్ణ జెట్టికి కుప్పన సాహాయ్యపడినాడని కొందరు విద్యాంసుల అభిప్రాయం.

శివాజీ మహారాజు స్వయంగా అన్నపూర్ణా పరిణయమనే యక్షగానం రచించాడు కొంకణేశ్వరు డను దేవునియెడ అన్నపూర్ణా భవాని ప్రణయమూ, వివాహమూ ఇందులో వర్ణితములు. రాజాస్థానంలో ఆనాడు యక్షగాన ప్రదర్శనాల నిర్వహణకు సబ్నవీసు అను ఉద్యోగి ఉండేవాడు. రంగనాథ కవీశ్వరులు లేక అమృతక‌ు తులసీ రంగయ్యంగారు అనే కవీశ్వరుడు శివాజీ రాజుకు గురుపీఠాన ఉండి. ఆయన రచనలకు సాహిత్యగోష్ఠులకు ఆశీస్సుల నందజేస్తూ ఉండేవాడు.

## దొరసామయ్య (1782-1816)

పై శరభోజీ, శివాజీరాజుల సమకాలిక వాగ్గేయకారులలోపులై యూరు దొర సామయ్య సంగీతసాహిత్య నాట్యశాస్త్రములలో విద్వాంసుడు.ఇతని జీవితవిశేషాలు ఎక్కువగా తెలియలేదు. ఇతడు ఆంధ్రభాషలో కీర్తనలను, పదములను సుబ్రహ్మణ్య ముద్రాంకితములుగా రచించాడు. ఇతని కృతులూ, పదాలూ నేటి సంగీత విద్వాంసులకు తెలిసిప్రచారంలో ఉన్నవి దాదాపు 49 వరకూ ఉన్నవి పంచనద క్షేత్ర మనబడే తిరువయ్యారులో ఇతడు చాలకాలం గడిపాడు చిదంబర దేవాలయంలోని చిత్సభిలో వెలసిన నటరాజస్వామి తాండవ విలాసములను గురించి దొరసామయ్య చేసిన నాలుగు కీర్తనలలోను ఆయన నాట్యశాస్త్ర వైదుష్యం ప్రకటితమవుతుంది.

పంతువరాళి – మిశ్రచాపు :

ప. అద్భుతనటనం బాడీని మా అంబరకేశుండు...

అ: ప. అద్భుత మద్భుతమని ధర్మవర్ధని అడుగడుగుకు జూచిమెచ్చ
మోదము హెచ్చ.

హరహర శివశివ యనుచు, సుర లందరును వందనము సేయ...

1 చ. ధాతవెంట నిల్చి చేతతాళము బూని, తాతై తై యనగా పల్కల
నాతి యను జీమూతంబూ సంగీతము వర్షింపగ – పురు
హూతు డపుడు వేణు గీతముసేయ: సభాతలమునను కృపాతటినీశుడు
తాతకిట; ఝణుత, కిటకిట, తకతరి; కిటతకఝొంతరి కిటితకఝొమని...

2. అంగజు తండ్రి మృదంగము పూని, ధళాంగని వినిపించగ, ఆ
ఇంగితంబుగని మంగళదేవి కరంగి, లయమువేయగా. కు

రంగనేత్రియౌ ధరాంగన నాదము భంగములేక చెలంగింప నపుడు
తత్తోంగ్ తకతోంగ్ తకిణంతరితోంతరి కిటతకతోంతరికిటతకతోమని...

2. కరములెత్తి మైమరచి ఋషులెల్ల హరహరహర యనగా, నందికే
శ్వరు డందరికి ముందరను నిల్చి, హెచ్చరికె పరాకనగా, లంబో
దర సుబ్రహ్మణ్యు లిరుగడలను శంకరభవ మాముద్ధరయని మొరలిడ
ధరితకిట ఝుణుతకిట దృగ్గుతక తద్దిత్తళాంగు దృగ్గుతళాంగు
తక తధిం గిణతోమ్మని.... (అద్భుత)

నటరాజ తాండవం గురించిన దొరసామయ్య రచించిన మిగిలిన మూడు కీర్తనలు ఇవి: గౌళిపంతు రాగంలో "ధూర్జటి నటించిన ప్రదోషసమయమునను," ఫరజు రాగంలో "ఆడీనమ్మా హరుడు ద్రుకుటథైయని", తోడిరాగం రూపక తాళంలో "తత్తధిమి తధిద్దియని సదాశివు డాడీనె" వీటిలో "ధూర్జటి నటించినీ" అనే కీర్తన "ఆడీనమ్మా" అనే కీర్తన ఈనాటికీ సంగీత లోకంలో ఎక్కువ ప్రచారంలో వున్నవి. ఈ కీర్తనలను వీణధనమ్మాళ్ మనుమరాండ్రయిన శ్రీమతులు బృందా, ముక్తా గానం చేస్తూంటారు.

గౌళిపంతు- ఆదితాళం :

ధూర్జటి నటించెను- ప్రదోష సమయమునను ..
ఊర్జితముగ రజతాద్రికొన నత్యున్నతమౌ వజ్రమంటపమున....
సురలసురులు కిన్నరు లిరుగడ కొనియాడ- నందీ
శ్వర పుష్కర మురజరవముతో గూడ-
ఉరగము లసియాడ జడనుండు ఉవిద జడిసివేడ-
మెరయుచు నరచందురు చిరువెన్నెల గాయ ప్రణవనాదము మ్రోయ॥ధూ॥
మురహరు డతి దురమున, డమరువు పలికింప
సరసిరుహభవు పెదవు లదరగ కొనిపింప
వరుసక్రమముగాను బాగుగ నవరస కళలతోను
దరహసిత ముఖాంబురుహమున ముద్దుగార, చిరుచెమటలూర ॥ధూ॥
వరనూపుర మణులు చరణముల ఘలుఘల్లన
అరకాల నమరు నసురునికి గుండెఝల్లన- మరువైరి వగను
సుబ్రహ్మణ్యుని బాగుగను
కరుణను కనికరమునను జూచి కరుణింప- మేనుపులకరింప ॥ధూ॥

పరజు- ఆది :

ఆడినమ్మా హరుడు ద్రుకుట్ట థైయని
జాడగ గిరికన్యకను క్రీగంట, జూడ నంది సెబాసని కొనియాడ
చూడ జూడ వేడుకగా చంద్రచూడుండు మూడు కండ్లవాడు...

.... .... ....

దొరసామయ్య రచించిన ఇతర గేయాలలో శివకేశవాభేదమును ప్రబో ధించు కీర్తన కళ్యాణిరాగం, ఆదితాళంలో పాడతగినది:

వస్తువొకటి అదియు రెండు విధముల వాడుకొందురే బుధులు....
హస్తకటక మకుటకుండల మని ప్రశస్తముగను బంగరు వాడురీతి....
అంబరుడై నటియించిన నేమి, పీతాంబరుడై పవళించిననేమి
శంబరశిఖ చేపట్టిన నేమి, శంబరశిఖ పడగొట్టిన నేమి...

.... .... ....

ఇతని పదాలు :

1. కళ్యాణి- ఆది : దాని దగ్గరి కేగలేదని దాచే వేరా
2. పంతువరాళి- ఆది : దానికే తగునుగాని మరి యేదానికైన తగునా
3. సావేరి- ఆది : మందు గైకొనరే...

ఈ మూడు పదాలు ప్రణయ శృంగార రసాత్మకమైనవి- కొన్నిచోట్ల శృంగారము పచ్చిగా యున్నది. భక్తి శృంగారాత్మకమైన ఆధ్యాత్మిక పదాలు మూడింటిని కూడా ఉదహరిస్తాము.

1. సౌరాష్ట్రి- చాపు : అటువంటివేళ నన్నాదుకోవయ్య...
కుటిలులైన యమభటులు నాదు ముం
గిట నిలిచి జీవుడ ఇటు రమ్ము రమ్మనే....

.... .... ....

2. మోహన- ఆది : అట్టి సమయమున నాదు చెయి
బట్టి యేలుకోవయ్యా....

ఇతని కృతులకును, పదాలకును వాడబడిన రాగాలు :

పరజు, గౌరి, తోడి, ఆహిరి, భైరవి, పంతువరాళి - కాంభోజి, కాంభోజి, వరాళి సావేరి, సురటి, మోహన, ఆనందభైరవి, శంకరాభరణ, కళ్యాణి, సౌరాష్ట్రి, బేగడ, యదుకుల కాంభోజి, ద్విజావంతి, మధ్యమావతి, అఠాణ,

**ఆరభి - తాళాలు :** ఆది, రూపక, ఝంప, అటచాపు, చాపు, మత్య, మిశ్రచాపు, ఖండచాపు, దేశాది.

పైని ఉదహరించిన కీర్తనలూ, పదాలు వాటిని దొరస్వామయ్యగారు పాడి ఉండిన స్వరాలతోసహా మద్రాసు సంగీత పరిషత్పత్రిక 12వ సంపుటంలో సి.ఎస్. అయ్యరుగారు ప్రకటించారు. ఈయన, విఖ్యాత విజ్ఞానవేత్తయైన సి వి. రామన్ గారు, వాగ్గేయకారుడైన యీ దొరస్వామయ్యగారి వంశపరంపరలోని వారేనట. ధాతుకల్పనాదక్షులయినంత మాత్రము - మాతురచనలో శిల్పముగాని, భావ గాంభీర్యంగాని తగ్గని వాగ్గేయ రచనలకు దొరసామయ్యగారి కీర్తనలు, పదాలూ చక్కని ఉదాహరణములు. సొల్లుకట్టు శబ్దాలతో కూడుకున్న ఆయన ధూర్జటి నాట్యకీర్తనలు పాడి, నాట్యాభినయం చేయగా చూస్తే, కైలాసనాథుని తాండవ దృశ్యం కన్నులకు కట్టినట్లు కనిపించి, సభ భూలోక కైలాసం అనిపించకపోదు.

అద్వైత తత్త్వబోధాత్మకమై చిదంబర నటరాజుకు నాట్యానంతరం పాడతగిన లాలిపాటతో దొరసామయ్యగారి రచనావిచారం ముగిస్తాము.

**ఆహిరి - ఝంపె :**

పరహంస నాలోన పవళింపవె ....
పరమ పావన దయాపర దిగంబర చిదం
బర పురమున నటించి బడలితివిచాల ....
తనువనే సభను విస్తారంబుగాను,
నెనరనే చప్పరము నిర్మించినాను
మనమనే బంగారు మంచంబులోను,
ప్రణవమను పూబాన్పు పరచియున్నాను ....
ధ్యానమను హేమపాత్రాంతరములోను, ఆ
నందమనియేటి దుగ్ధాన్న మిడినాను,
నీ నామమనెడి తెనియను బోసేను
పూని భక్షయించి, జోజో పాడినాను ....
తెలివియను మాణిక్య, దీపంబిదోను,
వెలుగు సుబ్రహ్మణ్య వినుత నీకేను
వెలలేని భక్తియను విడెము నిచ్చేను.
కలయ నాబుద్ధియౌ కాంతినిచ్చేను ....

ఈ పదంలోని కవిత ఉన్నత పథాలలో విహరిస్తున్నది. భావాలు పరమోదాత్తములు, పలుకులు కండచక్కెరవలె కరిగిపోయేవి. బ్రహ్మానంద రసాను

భూతిని కలిగించే ఈ పదమును రచియించిన దొరసామయ్య రచనా శిల్పానికి జోహారు.

ధాతుకల్పనలో సాధింపబడిన ప్రత్యేకమైన అభివృద్ధినిబట్టి ఈ యుగాన్ని ధాతుకల్పనా దక్షులయుగమని పిలిచినా, ఈ యుగపు వాగ్గేయకారులలో మాతు కల్పనలో విశిష్టమైన పోకడలు చూపిన వారున్నారనడానికి త్యాగరాజు, దొర సామయ్య ముందు చెప్పబోవు సభాపతయ్య చక్కని తార్కాణములు. దొర సామయ్యకు సంగీత విద్వల్లోకంలో పల్లవి దొరసామయ్య అని వ్యవహారం. పల్లవి గోపాలయ్యను గురించి ముందు చెప్పుకొన్నాము. పల్లవి సీతారామయ్య అనే ప్రసిద్ధ పల్లవి కర్తకూడ ఈ కాలంలో ఉన్నట్లు సాంబమూర్తిగారి గ్రంథాలనుబట్టి తెలుస్తోంది. త్యాగరాజుగారి శిష్యుడైన వీణ కుప్పయ్యగారి కుమారుడు తిరువత్తూరి త్యాగయ్యగారు పల్లవి స్వరకల్పవల్లి అనే గ్రంథాన్ని తండ్రి రచించిన అనేక పల్లవులను సమకూర్చి ప్రకటించారట.

## మూవనల్లూరు సభాపతయ్య :

తంజావూరు అచ్యుతప్ప నాయకుని ఏలుబడి కాలంలో ఆంధ్రదేశంలోని కృష్ణా, గుంటూరు జిల్లాలనుంచి యక్షగానములను ప్రదర్శించు భాగవత సంప్రదాయముల కుటుంబాలు తంజావూరు జిల్లాకు వలస వచ్చినట్లు చెప్పుకొన్నాము. ఆ విధంగా వచ్చినవారు కొందరు మేలట్టూరులో, కొందరు శూలమంగళంలో కొందరు మూవనల్లూరులోను స్థిరనివాసం ఏర్పరచుకొన్నారు. ఊత్తుకాడు అనే మరొక గ్రామం కూడా భాగవత మేళాలకు ప్రసిద్ధిచెందినదే. వీటిలో మూవనల్లూరు గ్రామానికి చెందిన సభాపతయ్య పదకర్తయే, భరతనాట్యాచార్యుడై 1860 ప్రాంతంలో రాజమన్నారుడి, తంజావూరులలో ప్రసిద్ధిపొందినవాడు. ములకనాటి వైదికుడు. మన్నార్గుడిలోని రాజగోపాలునిపై భక్తితో ఎన్నో పదాలు రచించడంచేత ఇతనిని రాజమన్నార్గుడి సభాపతయ్య అని కూడా అంటూ వుంటారు. ఇతడు ఎక్కువగా శృంగారపదాలను, పాటలలో సీతా స్వయంవర కథను రచించాడు. స్త్రీ వేషం వేసి పాటపాడుతూ పదాభినయనం చేసేవాడట ఈతడొకసారి స్త్రీ వేషం ధరించి శరభోజీ మహారాజు ఆస్థానంలో నాట్యం చెయ్యగా ప్రేక్షకులైన పండిత రాజవర్గమండలీ, మహారాజూ అందరూ ఆ వేష ధారి నిజంగా స్త్రీయే అని భ్రమించారు. మహారాజు అసలు సంగతి తెలుసుకొని, అతణ్ణి గొప్పగా ప్రశంసించి నీకేమికావలసినా యిస్తాను కోరుకోమన్నాడు. సభాపతి అశ్వములనో, గజములనో, గ్రామములనో, భూములనో, ధనమో, ఆభరణములో కోరుకొంటాడని రాజుతోసహా అందరూ అనుకొన్నారు. అతడు వాటినేమి కోర లేదు; తంజావూరు రాజాంతఃపురంలో ఉన్న శ్రీకృష్ణ విగ్రహాన్ని యిప్పించమని

కోరుకున్నాడు. అంతా తెల్లపోయారు; రాజు విసుపోయాడు. అంత చిన్న కోరిక కోరేవేమిటి. పెద్ద బహుమాన మేదైనా కోరమని రాజు మళ్ళీ అడిగాడు, మహా రాజు దయవల్ల ప్రాప్తించే సంపదవల్ల తాను గర్వపడి శ్రీకృష్ణుని మరచి పోవడం సంభవించవచ్చుననీ, మహారాజు దయతో ఆ కృష్ణువిగ్రహాన్నిప్పిస్తే, యింటిలో నిలుపుకొని భక్తితో పూజిస్తే తన కవితాశక్తీ, నాట్యగానకళలూ ఇతోధికంగా అభివృద్ధిపొందుతాయనీ సభాపతయ్య మహారాజుతో మనవి చేసు కొన్నాడు. శరభోజీ ఆయన కోరిక చెల్లించాడు.

ఉత్తరాంధ్రంలో కృష్ణా తీరాన జన్మించిన క్షేత్రయ్యా, పశ్చిమాన రాయల సీమలో జన్మించిన సారంగపాణీ, దక్షిణాన చోళమండలంలో వెలసిన సభాపతయ్యా ముందు చెప్పబోవు పరిమళరంగ భక్తుడైన అజ్ఞాతకవీ పదకవితా శాఖను పరిపక్వ స్థితికి తెచ్చి, దేశమంతటా విస్తరింపజేసి ప్రసిద్ధికెక్కినవారు.

సభాపతయ్య పదాలనుబట్టి అతడు రసపారవశ్యానుభవ మెరిగిన కళాశిల్పి అని బోధపడుతుంది. కొన్ని పదాలు పల్లవి యెత్తుగడలోనే యే ఆధునిక కవి భావగీతమో అనిపిస్తాయి. అంటే వాటిలోని రసభావమాధుర్యం – (లిరికల్ స్వీట్ నెస్ –) వాటికి అటువంటి నవ్యత్వాన్ని ఇస్తుందన్నమాట.

శంకరాభరణం – మిశ్ర :

దారి చూచుచున్నది నీదుప్రియ తరళాక్షి యో చిన్నది....
వారిజముఖి నీవు వచ్చువేళనుకొని కోరికతో రాజగోపాలసామి ॥నీదారి॥

వెన్నెలగాయగ వేడ్కమీర మంచి సన్నజాజి..రిసరులును గంధము
పన్నీరు చెంబులు పడకింటిలోనుంచి, వన్నెలాడి తలవాకిటనిలిచి ॥నిదారి॥

ఏ వగనైనను ఎందుచప్పుడైన, నీవో యనియెంచి నిలిచి తిరిగిచూచి
ఈ వగచిత్తము నిచట నిలిపినట్టి, భావంబెవరికి బయలు గానీక ॥నీదారి॥

పచ్చి పచ్చిగా పదములుపాడుచు, వచ్చి రాజగోపాలసామీ నీవు
ముచ్చటలాడుచు ముద్దులువెట్టుచు, గుచ్చికౌగిటజేర్చి కూడుటదలచి ॥నీదారి॥

తేట తెనుగు జాతీయములు, లోకోక్తులు ఈ క్రింది పదంలో రసనిష్పత్తి కెంతగా తోడ్పడుతవో చూడవచ్చును.

కాంభోజి – మిశ్ర :

అన్యాయముగ నే నపదూరుపాలైతి అతివరో యేమందునే ,,
మన్నారు రాజగోపాలసామికి నాకు మరులు కద్దని పలికేరు ,,
ఆ సరసుడు ప్రీతిచేసిపిల్వగను రోసము చూపితినే

మా సీమలోనిది మర్యాదకాదని వేసారి మ్రొక్కితినే
దోస మెన్నక పలుకు మోసగత్తెలు గేలిచేసే రేమందునే ,,
ఆసతీర నే ననుభవించక యయ్యయ్యో నక్క పల్లమన్న సామెతరీతిని.,
ఆటపాటలకై యాతనితో నేను మాటాడినందుకా,
బోటుల కెదుట నీ ప్రొద్దు వానింటికి పోయి వచ్చినందుకా,
సూటిగాను వానిచూచి నవ్వే యలవాటు చేసినందుకా,
ఏటికే యీగేలి యే పాపమెరుగనే, తాటిక్రిందపాలు తాగినచందాన ,,
ఏకమై గోపాలు డెనయవచ్చెదనంటె. నీ కిది తగదంటినే
కోకలెత్తిపట్టి కొంటెతనముచూప, రాకు పొమ్మంటినే
ఈ కారణమేమే. యిది తెలియ వట్టిపోకిళ్లు చేకొంటినే
లోకము మూయను మూకుడుగలదటె, చాకివాడు వృథా జానకి ననినట్లు.,

ఇందులో నాయిక - పరకీయా. నాయకుడు ధూర్త రాజగోపాలుడు. ఇంకొక పదం యెత్తుగడ - భావాన్నిబట్టి చూసినా, మాటలనుబట్టి చూసినా, రవీంద్రుని గీతాంజలి ననుసరించి ఏ ఆధునికుడో వ్రాసిన గేయమా అనిపిస్తుంది.

బిలహరి - మిశ్ర :

ప. ఈలాగు పాంథుడవు నీవు ఒంటరిగాను యిప్పు డెచ్చటికేగేవు
వేగను ?....

అ. ప. మేల పయోధరములు చేరి యెంటను మెరయగ గోపాల
హరియనుచును ॥ఈ॥

చ. చంతనుండెడి గుడిచాటుచేరక, శ్రమముదీరను సుఖమొందగోరక,
సుంత యీ తరువున జూచియయిన నిలువక, ఎంత సుఖముచేయు
నీకొమ్మ యనకోక ,,
నీవు కట్టుకోక నిటు జారియుంచక, నీవేళ భూసురహితము మాటవినక
త్రోవనడచుటకు తోడెవ్వరును లేక, ఈవగ ముందువెనుక యోచింపక
ఎవ్వరిందు రా నెరుగనట్టితావు, జవ్వని నన్నొకతె నిందుగనినావు
అవ్వలనైన నిందు నిలువలేవు, హరిహరిగోపాలయేల భ్రమసేవు ”

నభాపతయ్య పదాలు మొత్తం ఒక 50 వరకు సేకరించి 1884 లో గుజిలీ ప్రతిగా అచ్చువేశారట. సీ. మా. తిరుపతి వేంకటార్యులనేవారు ఈ పదాలకు నాయికా నాయక లక్షణవివరాలను, భానుదత్తకవి రసమంజరిలోని ఉదాహరణ

శ్లోకాలతో సహా సమకూర్చారట. ఇక్కడ ఉదహరించిన మూడు పదాలలోనే ఇతని రచనలో క్షేత్రయ్య సారంగపాణుల ధోరణులకంటె ప్రత్యేకపు పోకడలుండి నట్లు స్పష్టపడుతోంది. తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు ఈతని పదాలను గురించి వికృతి సంవత్సర మాఘమాస భారతిలో ఒక వ్యాసం వ్రాశారు.

## పరిమళరంగ పదకర్త:

పరిమళరంగ ముద్రాంకితములైన పదములేనే కాక, కీర్తనలనుకూడ రచించిన వాగ్గేయకారుని అసలు పేరేదో ఎవ్వరికీ తెలియలేదు. సుబ్బరామ దీక్షితులు ఇతనిని గురించి వ్రాస్తూ తైప్రింగ్యుడనీ, చెన్నపట్టణానికి ఉత్తరాన 1904 కు ముందు 200 ఏళ్ళలోపున ఉండినవాడని వ్రాశారు అంటే, తంజావూరు మహారాష్ట్ర రాజులపాలన కాలంలోనే అన్నమాట. పరిమళరంగడు అనే పదం, మువ్వగోపాలుడు, వేణుగోపాలుడు, రాజగోపాలుడు మొదలయిన వారివలెనే ఒక క్షేత్రంలో వెలసిన దేవతామూర్తి అయి ఉండవలెను. చెన్నపట్టణానికుత్తరాన నెల్లూరిలో ఒక రంగనాథ దేవాలయం ఉన్నది. దక్షిణాదిన శ్రీరంగములో ఉన్న రంగనాథుడు కస్తూరి రంగడు, కావేటి రంగడు. కస్తూరి రంగనికే పరిమళ రంగడని నామాంతరమేమో, లేక తిరువఃర న్ధూరు అను క్షేత్రంలోని రంగేశుడైనా పరిమళరంగడు కావలెను. అయితే ఇది చెన్నపట్టణానికి బాగా దక్షిణాన ఉన్నది కనుక ఇది కాదు. 18 వ శతాబ్దంలో ఈ రంగక్షేత్రాలలో నివసించిన వాగ్గేయకారుడెవరో అజ్ఞాతుడై ఈ పరిమళరంగాంకిత పదాలను, కీర్తనలను రచించి ఉంటాడు. అతడు అజ్ఞాతుడు కావడానికి ప్రబలకారణం ఏమిటో, అసలు మనిషి యెవరో తెలిస్తేనే కాని తెలియదు. ఇతడు నరస్తుతి విముఖుడనీ, మహీపతులవలన ఏదో మాట పట్టింపు రావడంచేతనే అటువంటి ప్రతిజ్ఞచేసి, దేవతాంకితంగానే తన రచనలను చేసినట్లునూ — అతని పదాలలోను, కీర్తనలలోను కొన్ని చరిత్రాంశ సూచన లిచ్చే మాటలున్నవి.

సంగీత సర్వార్థసార సంగ్రహంలో పరిమళరంగని కీర్తనలు అను శీర్షికను, 8 కీర్తనలును, పరిమళరంగని పదములు అను శీర్షికను 48 పదాలును ఉన్నవి. ఈ సంగ్రహాన్ని సేకరించిన తచ్చూరి సింగరాచార్యులవారూ, సంప్రదాయ ప్రదర్శినీ కర్త అయిన సుబ్బరామ దీక్షితులవారూ కూడా పరిమళరంగని పదాలు అని యీవిధంగా పరిమళరంగనామం రచయిత నుద్దేశించి వాడినా, ఆ నామం మువ్వగోపాలవలె అంకితనామమేకాని కవి అసలుపేరు వారికికూడ తెలిసినట్లు కనబడదు.

ఈతని కీర్తనలు ఎనిమిదీ కూడా పరిమళరంగనాయకికి అంకితములు. ఆమెను కవి రంగనాయకి, అమ్మ, పరిమళ శ్రీరంగనికొమ్మ, అంగజునికన్నమ్మా, శ్రీరంగనాచ్చారమ్మ, లోకమాతా, యిత్యాది పర్యాయపదాలలో సంబోధించాడు.

పంతువరాళి - అటతాళం. (కీర్తన)

ప. నిన్నే చాలనమ్మినందుకు నీ నామములే భజనచేయగలిగెను...

అ. ప. ధన్యుడనయినాను నే నిపుడు దయసేయవె పరిమళరంగనాయకీ ...
సగరిసనిధనిస రిరిసనిధప ధనిసరిరిసనిస - రిగమగరిస - రిగమప -
ధపమపధమపమధప - రిరిగరినిసనిధపమగరిస....

చ. మున్నుజేసిన పూజ మహిమో - ముదమున కరుణించినావు
నన్ను నీవాడవి యెంచి - నమ్మికలిచ్చినావు
అన్నపానాదులకు నీవు - అపారముగ నొసంగినావు
ఎన్నటికి నీ ప్రాపు యీవె కలుగజేసినావు ...

ఎవరున్నారు సాటి నీకు, యీరేడుజగములలో
ఏవరసులైనవారిని వేరె కాననమ్మ
భవసాగరమున నీవే నన్ను పాలించి కాపాడితివి
కవనధారలుగలుగ నాదు గమనము నీయందుండజేసితివి...

పన్నగశయనుడైన పరిమళరంగని కొమ్మా
ఎన్నతరమ నీ మహిమలు ఎవరును తెలియలేరు
నన్ను నీ భక్తుడని యిపుడు నమ్మికలొసంగి యాదరించితివి
కన్నతల్లి నీవేయనుచు కలలో మొదలు మరువక నేను....

నన్ను నీవాడనియెంచి నమ్మికలిచ్చినావు, అన్నపానాదులకు నీవు అపారముగ నొసంగినావు .... ఏవరసులైనవారిని వేరెకాననమ్మ ... కవనధారలు గలుగ నాదుగమనము నీయందుండజేసితివి — ఈ వాక్యములను బట్టి ఈతడు పరిమళ రంగనాయకియైన లక్ష్మీదేవియందు భక్తిగలిగి, ఆమె కటాక్షపాత్రుడై కవిత్వము చెప్పగలిగిన వాడైనాడని తెలుస్తుంది; అయితే అది వట్టి కవిత్వము కాదు. అనుపల్లవిలో ఉన్న జతులను చూస్తే, అతడు సంగీత సాహిత్యములలో ప్రజ్ఞ కలిగినవాడని స్పష్టపడుతుంది.

కళ్యాణిరాగ - రూపకచాపుతాళ కీర్తన రంగనాయకి అమ్మ నన్ను రక్షింపవమ్మ....అనే దానిలోకూడ అనుపల్లవిలో జతులున్నవి. మరి వేరె దైవములను మాటిమాటికి వేడనని చెప్పాడు కళ్యాణి-జంపెతాళంలో 'రంగనాయకి అమ్మ' అని మరొక కీర్తనకూడా ఉంది. కన్నడరాగ ఝంపెతాళ కీర్తన కన్నడసేయకవే కరుణింపవమ్మ అనే దానిలో పరిమళ రంగనాయకి పదములె నమ్మినాను - సరివారి ముందర నన్ను చౌకసేయకవమ్మ - మరియాద దెలిసియుండే మహిపతులెవ్వరు లేరు సరసిజవదన నిన్నె చాల కోరినాను .... అను చివరి చరణంలో

రాజులవల్ల తనకు కలిగిన అనాదరాన్నీ, అందువలన కలిగిన తన రాజవైముఖ్యాన్నీ ప్రకటించాడు.

రంగనాయకీదేవి యెడల ఈతనిభక్తి ప్రసిద్ధ మహాభక్తుల మార్గంలో సాగుతూ పారవశ్యంలో దేవీమూర్తి నెదుటనుంచుకొని ప్రత్యక్షముగా ఆమెతో గారాబు కొమరునివలె సంభాషిస్తున్నట్లు వుంటుంది ఈతని ఎనిమిది కీర్తనల లోను అనుపల్లవిలో జతిస్వరా లున్నవి.

బృందావన సారంగరాగంలో – పక్షపాతము నీయందున్నది పంకజదళ నేత్రీ, కుక్షిలో సకల జగములణచుకొన్న సుగుణి పరిమళ శ్రీరంగనిరాణి—అనే కీర్తనలో నవరత్నములు కొందరి కొసంగేవు – నల్లపూసలు కొందరి కొసంగేవు– భవమోచని యీ వంచనచేసే ప్రభావమేమమ్మ....అని ఆమె భక్తపక్షపాతాన్ని శంకించి ఆ తర్వాత శృంగారమగు సారంగగమన నీచిత్తమదేమమ్మ – భగం పరిచేవు కొందరిని నీవు – పాలించేవు కొందరిని నీవు – మంగళకరమైన మూర్తివి నీవు – మనుజులపట్ల వేడుకలు చేసే — యీ భూమి జనులందరు నీకు పుత్రులు – కందర్పునిగన్న చక్కనిబొమ్మ కడకంట జూచేవు....అని సమాధాన పడతాడు.

ఇవిగాక కేదారగౌళ, తోడి. పున్నాగకీరాళి రాగాలలో కీర్తన లున్నవి. దానిలో – నరులను కొలిచి నే వేడజాల – అనీ – నరులను మేము నడచేసేది లేదు – నీ నమ్మికలియ్యక నే దురితముపోదు – అనీ,– ఇమ్మహిలోపల నితర దైవముల నమ్మననీ అంటాడు.

కీర్తనలలో భక్తిరసమును పదాలలో శృంగారరసమును యథావిధిగా పోషించాడు. చాలపదాలలోకూడా అనుపల్లవిలోగాని, చరణంలోగాని, రెండు చోట్లనూ కూడానూ జతిస్వరాలను వాడాడు.

1. తేటమాటల పాటలాట లభినయ పాటలగంధి వచ్చెర
2. వలపు నేను కనుగొంటినే వనితరో యేమిసేతునే

} ఈ రెండు భైరవి రాగ పదాలలోను

3. దాని నెడబాసివచ్చినావో – దయ నాపై గలిగి–అనే సావేరి రాగపదంలోను
4. వలపు నిలుప వశముగాదురా – అనే కన్నడరాగపదంలోను
5. ఎంతవేగమె తెల్లవారెరా పరిమళరంగ
అంతరంగమున నీతో ననుభవించునంతలో నె
6. ఏరాను మందుబెట్టెరా ఏరా మాటాడవు

} ఈ రెండు కాపీరాగ పదాలలోను

7. ఏమి తప్పుజేసినానురా శ్రీ గోవింద – అనే శంకరాభరణం పదంలోనూ జతిస్వరాలను వాడిన పరిమళరంగని ధాతుకల్పనా సామర్థ్యమూ వీనిలో మొదటి

పదంలో చెప్పినట్లు రససోఫ్ఫోరకమైన తేటమాటలతో కూడిన మాతుకల్పనా సామర్థ్యమూ చక్కగా వెల్లడి అవుతాయి.

శివుని పేరుగల రాగము పాడనే చింతించక యిపుడు....అని శంకరాభరణ రాగపదంలోను, హరిమధ్యపినేవా ఆహిరిరాగ మీపదము – అని ఆహిరిరాగపదం లోను రాగనామాలని సూటిగా సూచించాడు.

పరిమళరంగాంకిత పదాలలో చాలమట్టుకు లక్ష్మీ ప్రతిరూపిణి అయిన రంగనాయకి నాయకురాలుగా ఉండినవే.

అలిగే దెటువలెనో చెలియలో అది నా చేతగాదే
చెలువుడైన పరిమెళరంగనికి చిత్తమిచ్చిన వెనుక వంచనగాను....

అన్న కేదారగౌళపదంలో–ఆమె పలుకులు ఆమె ముగ్ధత్వాన్ని చాటుతాయి.

నేటివలెనే ఒక్కసారిగూడితె చాలు నెలనాళ్ళకు తాళనే
మాటిమాటికి కలియగానే ఫలమేమి
మనసు తెలిసి లాలించిన పరిమళరంగ.......

అన్న కళ్యాణిరాగంలో తృప్తమయిన స్వీయనాయికయొక్క అనుభవము ప్రతి భక్తునికీ స్వానుభవ మవుతున్నది

అనుభవింపవలెనమ్మా అక్కరదీర నేడు
పనివేరే తోచలేదు పరిమెళరంగని నే ॥ననుభ॥
మరువపువాసనవలెనే మనసులు రెండునొకటిగానే ॥ననుభ॥

అన్న వసంతభైరవిపదంలో కోరిక యెంత కుతిదీరకున్నదో చెపుతూ, మరువపు వాసనవలె మనసులు రెండూ ఒకటైతేనే అనుభవపు తమితీరునని సూచించడం ఎంతో రమణీయమైన భావంతో కూడిన పదశిల్పం.

కాని నాయకునిపై కోపగించి ఒక పరకీయ నాయిక చెలిని అడుగుతోంది –

పున్నాగవరాళి :

ఈడకు వచ్చునో – నేనాడకు రావలెనో
మోడిగానున్నాడేమొ ముద్దుల నీలమేఘదేవుడు – అని.—

పరకీయ నాయికయైన గోపికామణి చెలిని—

ఇల్లాలిగా నేలబుట్టించె విధి యిందుకేమంచునే చెలియా(అని అడుగుతుంది. అతడువచ్చి, ఆమెతో సమాగమమైనప్పుడు)

చల్లనాయె నా మనసు చల్లనాయ నిపుడు
ఉల్లము రంజిల్ల నొడిమీదనుండగా పరిమళరంగ....

అని పరవశురాలై అతని బాహువల్లరిలో వ్రాలిపోతుంది. గూఢార్థపూర్వక మైన తేటమాటలతో ఆమె పరిమళరంగని ప్రణయసన్నిధిలో ప్రశ్నిస్తుం దిలాగ—
కళ్యాణి :

భావము తెలిపెదను పంకజాక్ష
కావవే పరిమళరంగడైన వేంకటరమణ
కమలమున గలిగిన కలువపూవుల నిండి
కమలము తొలగి మిగుల గారుచుండి
విమలమైన యేరులై వేగమై గిరు లెక్కి
అరమర పారెను వెలసి యాకాశమందు

ఈ పరిమళరంగ పదకవి తనకు పూర్వ పదకర్తల ధోరణులను, అందులో అన్నమాచార్యుల పదరచనా ధోరణులు కూడ బాగుగా తెలిసినవాడిలా కనిపిస్తాడు.
ఘంటారవం :

మరువదు నాథుని చిన్నెలు మగువరో యెంతని తెలుపుదు
సరసము జేసెడు వింతలు జాడల నా మనసు
సున్నగ కురులను దువ్వుచు సన్నపుజాజి విరులను
మిన్నగ కొప్పున తురిమిన మెలకువను మనసు
ఎన్నగ పయ్యెద తొలగించి జాతిపన్నీరు చిలికిన
వెన్నని చక్కదనమ్ము వేమారు నా మనసు

కొన్ని పదాలలో శృంగారరసం చుబ్బనచూలుగా వెల్లువికే పచ్చితనంలేక పోలేదు. కాని, అన్నిటిలోనుకూడ భావంలో ఆధ్యాత్మికార్థం వ్యంగ్యీభూతమై అంతర్లీనమై ఉన్నది. కీర్తనలలోని భావములనుబట్టి ఈ కవి మహాభక్తుడౌట నిశ్చయం. శృంగారరసాత్మకములయినా అతని పదాలన్నీ నాయికా నాయక భావంలో జీవాత్మ పరమాత్మల ఐక్యానుసంధానమునే ప్రస్ఫుటింప జేస్తున్నవి. ప్రముఖులయిన క్షేత్రయాది పదకవులలో ఈ అజ్ఞాత వాగ్గేయకారుడు నాల్గవవాడు. క్షేత్రయ్య పదాలకు తరువాత దక్షిణదేశంలో పరిమళరంగని పదాలకే ఎక్కువ ప్రచారం ఉన్నది. పరంపరగా పాడుకొంటూవచ్చే సంగీత విద్వత్కుటుంబాలలో అన్వేషిస్తే, ఈ పదాలకు స్వరాలు లభించగల ఆశ ఉన్నది.

## ఇతర అజ్ఞాత పదకర్తలు :

ఇంకా ఆరుగురివరకూ పేరుతెలియని అజ్ఞాత పదకర్తలను గురించి ఆయా గ్రామనామాలతో, వారి పదాలలోని ముద్రలతోమాత్రం – సుబ్బరామ దీక్షితులు

తమ సంప్రదాయ ప్రదర్శినిలో పేర్కొన్నారు. తచ్చూరివారు సంగీత సర్వార్థ సార సంగ్రహంలో ఒక్కొక్కరివి ఒకటి రెండేసిచొప్పున వారి పదాలను ఉదాహరించారు. వారందరూ మొదటిరకపు పదకర్తలు కాకపోయినా, తక్కువరకపు వాగ్గేయకారులు మాత్రము కారు. వీరందరూ తమ పదాలను తెలుగులోనే రచించారు.

## యువరంగని పదాలు :

ఈయన దక్షిణాదిలోని ఉదయార్ పాలెం అనే చిన్న జమీందారీకి అధిపతి అనీ, తులజాజీకి సమకాలికుడనీ, సాహిత్యకళాభిమాని అనీ సి. ఆర్. శ్రీనివాసయ్యంగారు వ్రాశారు. శహనారాగంలోని యువరంగని పదంలోని – చెయిబట్టి నా సిగ్గు చెరుపవలెనా, చిత్తము రా నడువనా – అనే పదమూ, భైరవి రాగంలోని – వెన్నెల తిరిగేగాని, వేళ గాదురా నా సామి వన్నెకాడ యువరంగ. వగలేల జేసెదవుర – అనే పదమూ సంగీత సర్వార్థ సారసంగ్రహంలో ఉన్నవి. వీటిపల్లవులను చూస్తేనే చాలు, ఈ వాగ్గేయకారుని అనుభవ పరిపాకమూ, రసభావవిస్ఫూర్తి భాషాశిల్పమూ సామాన్యమైనవి కావని తెలుస్తుంది. యువరంగని పదకర్త చిన్నరాజ్యపు ప్రభువే అయినా, ఆనాటి విజయనగర, తంజావూరు, మధుర, పుదుక్కోట, మైసూరు రాజ్యాల కొలువు కూటాల విద్వత్కవి గాయకులతో అన్ని విధాలా సమానంగా తులతూగే విద్వత్కవి గాయకారులను పోషించి, కొన్ని విషయాలలో ఆ ప్రభువుల మన్ననలకుకూడ పాత్రుడయిన వాగ్గేయకార ప్రభువు, ఈ యువరంగ ప్రభువుకూ, మధ్యార్జునంలో ఏలిన తంజావూరు మహారాష్ట్ర ప్రభువైన ప్రతాపసింహునికీ అంకితంగా అనేక పదాలు తమిళంలో రచించిన వాగ్గేయకారుడు ఘనం కృష్ణయ్యర్.

## కస్తూరి రంగని పదాలు :

కస్తూరి రంగనికి అంకితంగ చెప్పబడిన కొన్ని పదాలనుబట్టి, కస్తూరి రంగడో, ఆ పేరిట దైవానికి భక్తుడో అయిన వాగ్గేయకారు డీకాలంలో ఉండి ఉండాలని సంగీత చరిత్రకారులు చెపుతున్నారు. "ఇందెందు వచ్చితివిరా అల దాని యిల్లు యీ వీధి కాదు పోపోరా" అనే పదం కస్తూరిరంగ ముద్రకలది. సంగీత సర్వార్థసార సంగ్రహంలో ఉన్నది.

## ఘట్టుపల్లి వారి పదాలు :

వాగ్గేయకారుని పేరు తెలియదు. ఈ పదాలు కైలాసపతి ముద్రాంకితాలు. ఘట్టుపల్లివారివని చెప్పి సంగీత సర్వార్థ సారసంగ్రహంలో "తలుచుకొంటె తాళజాలనే" అనే కురంజిరాగ పదమూ, "నేనే జాణ" అనే సావేరి రాగపదమూ

"అయ్యయ్యో మరుపాయెనా దైవమా" అనే ఘంటారాగ పదమూ, "వనితలోపగ" అనే శ్రీరాగపదమూ ఉదాహృతములు. వీటిలో "నేనే జాణ" అనే పదం మాత్రం ఘనం శీనయ్యకృతమని సి. ఆర్. శ్రీనివాసయ్యంగారు మొదలైన పండితులు వ్రాశారు. ఈ పదాలలోని శృంగారం కొంత పచ్చిగా ఉంటుంది.

## బొల్లవరపువారి పదాలు :

ఈ శీర్షికలో రెండు పదాలు కనిపిస్తున్నాయి. బొల్లవరపు వేంకటరాయనికి అంకితమిచ్చినట్లుగా పాటలలోని ముద్ర చెపుతుంది. "మోసమాయెగదవే నా బుద్ధికి" అనే ఆహిరిరాగపదంలోని "పొద్దుబోవ నే పూదోటలోపల పొద రింటిలో నుండగా సద్దుజేయక సంధ్య జాముకాద యే చందాన వచ్చెనో" అను చరణం క్షేత్రయ పదాలలోని "ఎవ్వడే వా డెవ్వడే" అనే శంకరాభరణ రాగ పదాన్ని జ్ఞాపకం చేస్తుంది. రెండవ పదం ముఖారిరాగం – అటచాపు తాళం జల్లి మాటకు "నేనొల్ల మ్రొక్కెదనన్న యిల్లు వెళ్ళవు" అని పల్లవి. బొల్లవరపు వేంకటరాయడు కర్తయైనా కావచ్చు. కృతిపతియైన రాజుగాని, వేంకటేశ్వర దైవంగాని కావచ్చు.

## శోభనగిరివారి పదాలు :

కాంభోజి రాగంలోని 'చెలియ నీతో' అనె పదంలో కాయల పేర్లు వేరు వేరర్థాలలో శ్లేష విరుపులలో వస్తాయి.

చెలియ నీతో పొందు చింతకాయ
తలపెట్టినంతనే దానిమ్మకాయ
అలివేణి నీ పొందు నలుక గుంపెనకాయ.
యల చందురుడు మింట నంటికాయ
మెలత వెన్నెల బైట మేను కాకరకాయ
కులుకు కుచములమీద గోరువంకాయ....

కాంభోజి రాగంలోనే 'నెలతా' అనే పదం పచ్చి శృంగారంలో ఉంటుంది. ఇవి శ్రీ శోభనగిరి అప్పడు అనే దైవానికి అంకితమైనవి. పదకర్త యెవరో పేరు తెలియదు.

## జటపల్లివారి పదం :

ఒక్కటే ఉన్నది. జటపల్లి గోపాలునికి అంకితం
మగవారికి ధర్మమేదదే – మగువ వారల నమ్మగూడదే....

మొగిపె చేతులెత్తి మొక్కుదురెంతో మోహమున్నరీతి చొక్కుదురు
తగులైలదక్క, రేపగలు నే మారక వగలు జేతురు యెంతని
చుల్క జూతురు...

ఈ పదకర్తకూడా అజ్ఞాతుడే. ఈ ఒక్క పదం తప్ప వేరేమీ ప్రచారంలో లేవు.

## ఇనుకొండవారి పదాలు :

ఒక్కటే ఉన్నది. రేగుప్తిరాగం, ఆదితాళం, సాహిత్యంలో మనోహరమైన భావాలు, సంభాషణ చాతుర్యం, సొగటాలాటకు సంబంధించిన పారిభాషిక పదాలలో నాయకుడు నాయికతో పందెములు పట్టుతున్న ఘట్టం . అంకినం ఇనుకొండ విజయరామునికి – ఆంధ్రదేశంలో ఇనుకొండ అనే కొండమీది ఊరిలో వెలసిన దేవుడుగాని, ఆ ఊరి పరిపాలకుడైన రాజుగాని కావచ్చు. స్పష్టంగా ఎవరైనదీ తెలియలేదు. కవిపేరు అజ్ఞాతం.

రేగుప్తి – ఆది :

ప. నీవే యోడితే నెలత నా దానవు నే నోడితినైన నీ వాడను ....
అ. ప. భావము తెలిసి యట్లు పందెమువేయను రావే సొగటాలాడ రాజీవనేత్రి....

చ. దుగకు నోడితె కుచయుగముల నన్ను చెణకు,
దుగ నే గెలిచితె దొరికించుకొందును
పగడకు నోడితె వాలుగంటి నెవరికైన
పగడానకైతె యధరపాన మిచ్చేనా....

.... .... ....

## శివరామపురంవారి పదాలు :

ఈ శీర్షికలో ఉన్నపదాలు సంగీత సర్వార్థ సారసంగ్రహంలో మొత్తం ఏడున్నాయి. కర్తపేరు అజ్ఞాతమే. తరచిచూస్తే ఈ ఏడూ శివరామపురంవారివి కావేమో అనిపిస్తుంది.

కాంభోజి – జంపె :
ఏమి సేయుదు నిమిష మేడాయెనే
రామపురమయ్య యిటు రాడాయెనే చెలీ ....

ధన్యాసి – ఆది :
పోదామా పారిపోదామా
పోదాములా శివరామపురమయ్య నీ తోడు

కల్లగాదురా పరాకా - కంచికాడ తెల్లవారమనము ....
నీకు వెచ్చానికి మరిలేకుంటేనేమి. మా యత్త
ఏకముగా దేవపూజ యింటిలోదాచిన
రూకలు పట్టుకోకలు నూరుపోకలు కట్టెడు తెల్లటాకులు
నే దెచ్చేగాని ....

ఈ విధంగా ఈ పదాలలో పరకీయాప్రణయం వర్ణింపబడి ఉంది. పురుష విరహం వర్ణితమైన ఒకపదంలో నాయకునిపేరూ, అంకితపుముద్రా లేవుగాని, నాయిక పేరు నాంచారు అని ఉన్నది సామాన్య నాయిక, అంతగా పచ్చితనము, అశ్లీలము లేవు.

నాదనామ క్రియ - అటచాపు :

చెలికాడ తోడి తెచ్చావా....ఎంత
తెలియ జెప్పినగాని తెలుసుకోలేవా...

తళుకు నీలములు ముంగురులు. దాని,
సొంపుజూచితె సన్యాసికి బుట్టు మరులు
పలికితే చిందు చక్కెరలు, దాని,
యిలుచుట్టి తిరిగేరు యీనాటి దొరలు ....

వనిత విద్యల నొరగల్లు, విను,
పెద్దనగరి చాయల దానియిల్లు
నునుమోవి తేనెజొబ్బిల్లు, యీ
తనువుదాని కమ్మినగాని చెల్లు ...

మరునిమీదనె నదూరు - అది.
తిరిగి చూచి నవ్వితే ముద్దుగారు
తరుణి కోడెగాండ్ల బిడారు - అది,
బిరుదాయతు దానిపేరు నాంచారు ...

అప్రయత్నంగా సాగిన అందమైన అనుప్రాసలు, జాతీయపు పలుకులూ ఈ పదానికి ఎంతో లాలిత్యాన్నీ, మాధుర్యాన్నీ యిచ్చాయి.

చానలార వినవే - అనే శహన రాగపదం. కోలాకృష్ణునికి అంకితం. అనుపల్లవిలో - మానిత గుణ కృష్ణేంద్రుడు - చివర చరణంలో - చక్కని కోలా కృష్ణుడు - బహుశా కోలారు కృష్ణుడేమో. చంద్రగిరి కృష్ణభూపతీ, జింజి సేనాపతీ, తుపాకుల అనంతభూపతికి తండ్రీ, క్షేత్రయ్యకు పరిచితుడూ అయిన తుపాకుల వెంకట కృష్ణుడు ఇతడు కావచ్చేమో.

కృష్ణవిజయ రామచంద్రుడనే రాజుకు అంకితంగా - సరసిజాక్షితో వినవే-సరసాగ్రేసరుడైన సామికి సరియెవ్వరే. ఇరవొంద శ్రీకృష్ణ విజయరామ చంద్రుడు. అనుపదంకూడా శివరామపురి పదాలలో ఉన్నది. ఇది బహుశా ఇను కొండవారి పదాలలో ఉండవలసినది పొరపాటున శివరామపుర పదాలలో చేర్చి ఉంటారు. రాజగోపాలాంకితమై జుజావంతి రాగంలోని చూడరే అది నడచే హొయలు సుదతిచేయు జాడలు....ఆడుది కులకాంత, అ తింటికోడలు, అగ గోపా లుని విడిదికి వెడలె అని పరకీయాశృంగారం వర్ణించిన పదం మూవనల్లూరి సభా పతి రచనమై ఉండాలి. దానినికూడా శివరామపురి పదాలలో వేయడం తప్పు.... పదవే అలవానిచెలిమి బలవంతముగదవే. సదయుడైన మా మదన గోపాలుని చనువందరికిని దొరకనె దొరకదే—అనే కాంభోజిరాగ పదం మదనగోపాలుని అంకితం. ఆదివరాహ ముద్రతోకూడ శివరామపురివారి పదాలున్నవట.

ఇంకా వేణంగిరాయ అనే ముద్రతోటీ, మల్లికార్జున, కృష్ణముద్రలతో ఉన్న పదాలు సంగీతగ్రంథాలలో ఉదాహృతములై ఉన్నాయికాని. వాటి రచయిత లెవరో ఎవరికీ తెలియదు.

## ఆనయ్య :

శరభోజీ మహారాజు ఆస్థానంలో ఉమాదాస ముద్రతో కీర్తనలను పదాలను రచించిన సంస్కృతాంధ్ర పండితుడైన వాగ్గేయకారుడు ఉండేవాడు. 20 వ శతాబ్దపు తొలి రోజులలో ప్రసిద్ధిపొందిన మహావైద్యనాథయ్యరను గాయకుడు ఈయన శిష్యుడట. కేదారరాగంలో 'భజన సేయవే' అని ఈయన చేసిన కీర్తన ప్రచారంలో ఉన్నది.

## పదకర్తలు : సింహావలోకన :

ఈ వాగ్గేయకార చరిత్రలో పదకర్తలను గురించిన పరిశీలన ఇంతటితో దాదాపు ముగిసింది. ఇటుపైని చర్చించబోయే వాగ్గేయకారులలో పదకర్తలైన వారుగాని, ఇతరవిధాల ప్రసిద్ధిపొందినవారి రచనలలో పదాలుగాని అంతగా చెప్పు కోవలసిన పనిలేదు. పదరచన కర్నాటక సంగీతంలో రసభావయుతమైన రాగ విస్తృతికీ, నాట్యాభినయానికీ చాలా దోహదంచేసింది. భక్తివైరాగ్యాలకన్నా. శృంగారం జనసామాన్యానికి త్వరగా రక్తి కలిగిస్తుంది కనుక, మొదటి రోజులలో పదాలద్వారానే సంగీత సభా సంప్రదాయాలు వ్యాప్తి చెంది, రాగ. తాన. పల్లవి. కీర్తనలద్వారా విసుగుకలిగిన శ్రోతలకు మనోరంజనమూ. సులభరసోత్పత్తి సాధ్య పడినవి. 15 వ శతాబ్దంలో అన్నమాచార్యులు సంకీర్తన లక్షణంలో శృంగార

సంకీర్తనమనీ, పదమనీ పేర్కొని నిర్వచించిన లక్షణం ప్రకారం లక్ష్యరూపంగా రచించిన పదాలే అద్యతన పదకర్తలందరకు మార్గదర్శులు. అన్నమాచార్యులకు మునుమునినాడే పదకవితా మార్గదర్శి అని పేరు ప్రసిద్ధికెక్కినట్లు చెప్పుకొని ఉన్నాము. కాని ఆనాడు సంగీత రచన ఇదమిత్థమని చెప్పడానికి మనకు ఆధారాలు లేకపోయినా మాతువులోని భావకల్పనకు అనుగుణమైన సరళధాతురచన ఉండేదని చెప్పుకొన్నాము. క్షేత్రయాది అద్యతనపదకర్తల రచనల పదస్వరూపం పరిపూర్ణ సుందరమై ధాతుమాతు సమాన ప్రధాన శిల్పాన్ని దిద్ది తీర్చుకొన్నది.

పదకర్తల పరిశీలనకు తర్వాత, ఈ యుగపు ఇతర ధాతుకల్పనా దక్షులను గురించి చెపుతాము. త్యాగరాజ దీక్షిత, శ్యామాశాస్త్రులకు సమకాలికులలోను, వారి శిష్యులలోను, తరువాతివారిలోను, ధాతుకల్పనాదక్షులైన కీర్తనాది రచనలను చేసినవారు, ఇంకా నూతనరీతుల సంగీత రచనలను చేసి, సంగీత సభాసంప్రదాయాలకు వరవడులుపెట్టిన ప్రముఖ వాగ్గేయకారులను ఇప్పుడు పరిచయం చేస్తాము.

## సుబ్బారాయశాస్త్రి (1803- 1862):

ఈయన శ్యామాశాస్త్రిల కుమారుడు. సంస్కృతాంధ్ర తమిళభాషలలోను, సంగీతంలోను గొప్ప విద్వాంసుడు. ఇతడు సంగీత విద్యను మొదట తన తండ్రి వద్దను, తరువాత, త్యాగరాజస్వామివద్దను నేర్చుకొన్నాడు. తంజావూరులోని మహారాష్ట్ర సంగీత విద్వాంసులయిన మేరుగోస్వామివద్దను, రామదాసస్వామి వద్దను హిందూస్తానీ సంగీతమును అభ్యసించాడు. అంతేకాదు; వైలిన్, వయినీ సరిందా అనే ఉత్తరాది వాద్యంపైనీ సంగీత కచ్చేరీలు చేయగలిగిన విద్వాంసుడు; కుమార ముద్రతో అనేక కృతులను స్వరజతులను రచించిన వాగ్గేయకారుడు. ఈయన రచించిన కృతులశైలి త్యాగరాజాది రత్నత్రయం రచనల శైలి ననుసరించి ఉంటుంది. మధ్యమకాల సాహిత్యం, చిటస్వరం, స్వరసాహిత్యం మొదలయిన విశిష్ట లక్షణాలతోకూడి వుంటాయి 'ఈయన కృతులు'. అవి మధురమీనాక్షీదేవి ఆలయంలో ఎక్కువ ప్రచారం పొందినవి. ఈయన తిరువయ్యారులో ధర్మసంవర్ధనీ సన్నిధానంలో "నిను వినాగతిగాన" జగాన అను కళ్యాణిరాగ కీర్తన కొత్తగా చేసి పాడినప్పుడు ఈయన గురువు త్యాగరాజు పరమానందభరితుడై మెచ్చుకొన్నారట. ఉదయార్‌పాళెం జమీందారు యువరంగభూపతి సుబ్బారాయశాస్త్రిలను బహు విధాల సన్మానించి పోషించాడు. సుబ్బారాయశాస్త్రి చెన్నపట్టణంలో 12 ఏళ్ళు నివసించి ఉండిన కాలంలో, తిరువళిక్కేణి పార్థసారథి దేవుని గురించి "నిను సేవించిన" అను యదుకుల కాంభోజిరాగ కీర్తన రచించారు.

సుబ్బారాయశాస్త్రిల ప్రసిద్ధ కృతులు :

1. ఏమని నే నీ మహిమ- ముఖారి- ఆది
2. జననీ నిను వినా- రీతిగౌళ- చాపు
3. నన్ను బ్రోచుటకు- తోడి- ఆది
4. నిను సేవించిన- యదుకుల కాంభోజి- చాపు
5. నిను వినా గతి గనా- కళ్యాణి- ఆది
6. మీన నయన- దర్బారు- ఆది
7. వనజాసన- శ్రీ- రూపక
8. వేంకటశైల- హమీర కళ్యాణి- ఆది
9. శంకరీ నీవని- బేగడ- రూపక
10. శ్రీ కమలాంబా- దేశీయ తోడి- రూపక

ధాతుకల్పనాదక్షులైన వాగ్గేయకారులలో సంగీత రత్నత్రయం తర్వాత అంతవాడుగా చెప్పుకొనదగినవాడీయన. రాగభావం కీర్తనలోని సాహిత్యభావంతో మేళనమై, రసస్ఫూర్తి కలిగించడం ఈయన కృతులలో కూడ విశిష్ట లక్షణంగా కనిపిస్తుంది.

రీతిగౌళ- చాపు :

ప. జననీ నిన్ను వినా- త్రిలోకజననీ దిక్కెవరమ్మ జగములోన గానా....

అ. ప. మనసిజ మానస సమ్మోదిని వినవే నా మనవిని విని నన్ను బ్రోవుము....
వరదాయకిగాదా యెక్కనిబ్రోవనరుదా దయరాదా
నెరనమ్మిన నాతోను వాదా, సరసిజభవహరిహరనుతపాదా ....

కరుణానిధి నీవు వేగమె వచ్చి కరుణతో నను బ్రోవు
గిరిరాజకుమారి పైనావు పరితాపముల నెల్ల పరిహరించేవు ....

వనజాయతనేత్రి కుమారజననీ కామితదాత్రీ
ఘనపాపలతా లవిత్రి, సనకాది మునిజన సన్నుతపాత్రీ ....

చిట్టస్వర సాహిత్యం :

నిరవధిక సుఖదాయకి యనుచు విని నిను చాల గొలిచితి నిరతముగా
తనయుని మొరలు విని నీవలెనే బ్రోచుటకు నెవరిక ధరలో వినుమా
ఇది ఘనమా, తరుణ మిది కృపసలుప దురుసుగ సరసీరుహ
లోచని సువాసిని- తామసము సేయకనె బ్రోవుము.... ....

## శ్యామాశాస్త్రి శిష్యపరంపర :

శ్యామాశాస్త్రిల ప్రప్రథమ శిష్యుడు ఆయన కుమారుడు శ్రీ సుబ్బారాయ శాస్త్రిలను గురించి చెప్పుకొన్నాము. తరువాత చెప్పుకొనదగినవారు పెరంబూరు కృష్ణయ్య, అలసూరు కృష్ణయ్య, సంగీతస్వామి, తలంగంబాడి పంచనదయ్య, దాసరి అనువారు.

అలసూరు కృష్ణయ్య మైసూరు ఆస్థాన విద్వాంసుడుగా ప్రసిద్ధి కెక్కిన వాడు. క్లిష్టమైన పల్లవులను సునాయాసంగా పాడగల సమర్థుడు. ఇతని కుమారుడైన సుబ్బారాయశాస్త్రిలు కూడ గొప్ప విద్వాంసుడు.

శ్యామాశాస్త్రిల శిష్యులలో కుమారుని తప్పిస్తే, ప్రథమ శిష్యుడని ప్రసిద్ధి పొందినవాడు సంగీతస్వామి. ఇతడొక యతీంద్రుడు. 'ఓ జగదంబ'అను ఆనంద భైరవి రాగకృతిలోని చిట్ట స్వరములకు సాహిత్యము సంగీతస్వామి రచనమే. సన్యాసాశ్రమ స్వీకారానికిముం దితడు శ్యామాశాస్త్రిల శిష్యుడు. కాషాయాంబర ధారణానంతరం ఇతడు గురువుగారి యింటికి వెళ్ళగా, శ్యామాశాస్త్రి లితనికి సన్యాసులకు లాంఛన పూర్వకంగాచేసే సన్మానాదికంతో స్వాగతమిచ్చారట.శిష్యుడు 'యతినైనా నేను మీకు శిష్యుడనే' అని మనవి చేశాడట.

తలంగంబాడి పంచనదయ్య కళ్యాణిరాగం- త్రిశ్రలఘు తాళంలో 'బిరాన బ్రోవ నిది సమయము' అను కృతీ కలగడ రాగం- త్రిశ్రలఘువులో 'సరసిజ నేత్ర'అను కృతీ మొదలయిన ఆంధ్ర తమిళ సాహిత్యములలో సంగీత రచనలను చేసిన వాగ్గేయకారుడు. ఇతడు స్వనామ ముద్రాకారుడు.

'పదియింటివాళ్ళ దాసరి' అను నాగస్వర విద్వాంసుడు శ్యామాశాస్త్రిల శిష్యుడు. ఇతడు త్యాగరాజ కృతులనుకూడ అద్భుతంగా నాగస్వరంపై వాయించి ఆ వాగ్గేయకారుని మెప్పు పొందాడట.

శ్యామాశాస్త్రిల కుమారుడైన సుబ్బారాయశాస్త్రిల శిష్యులలో ప్రధానుడు అతని పెంపుడు కొడుకయిన అన్నాస్వామిశాస్త్రి (1827-1900) ఇతని అసలు పేరు తాతగారి పేరైన శ్యామకృష్ణశాస్త్రి. కాని, ఆ పులంతా పిలుస్తూవుండిన 'అన్నా' అనేపేరు వ్యవహారంలో నిలిచింది. సంస్కృతాంధ్ర భాషలలో పండితుడు. కావ్యనాటకాలంకార వ్యాకరణ సంగీతశాస్త్రిలలో నిధి. వయసు వచ్చినప్పటినుంచీ వర్ణములు, కృతులు, దరువులు తెలుగు సాహిత్యంలో రచించేవాడు, కేదారగౌళ రాగంలో 'కామించి యున్నదిరా' అనే దరువు, శహనారాగంలోని 'ఇంకెవరు' అనే కృతీ ప్రసిద్ధ రచనలు, తాతగారయిన శ్యామాశాస్త్రిలవారి 'పాలించు కామాక్షి' అను మధ్యమావతి రాగకృతికీ, 'పాహి శ్రీగిరిరాజసుతే' అను ఆనందభైరవి రాగకృతికీ ఇతడు చిట్టస్వరములకు సాహిత్యం రచించాడు.

త్యాగరాజు శిష్యుడైన వీణకుప్పయ్య ఇతనికి చాల ఆప్తస్నేహితుడు. ఇతని శిష్యుడయిన మేళకారర గోవిందయ్య వేణు విద్వాన్ శరభశాస్త్రిలకు గురువు. వీణ ధనమ్మకు గురువైన తంజావూరు కామాక్షమ్మ కూడ అన్నాస్వామిశాస్త్రిల శిష్యురాలు : వీరుకాక, తచ్చూరి సింగరాచార్య సోదరులుకూడ వీరి శిష్యులు. వీరు విజయనగర ఆనంద గజపతి మహారాజు ఆస్థాన విద్వాంసులు.

## త్యాగరాజు శిష్య పరంపర :

వీణ కుప్పయ్య : త్యాగరాజు శిష్యులందరిలోను అగ్రగణ్యుడు. వీణ కుప్పయ్య ఈయన మద్రాసు ఉత్తరభాగంలో ఉన్న తిరువొత్తియూరులో జన్మించాడు. పాట కుప్పయ్యనీ, తిరువొత్తియూరు కుప్పయ్యనీ, నారాయణ గౌళ కుప్పయ్య అనీకూడ ఈయనకు అభిమానులిచ్చిన ముద్దుపేరులు. ఈయన తండ్రియైన సాంబమూర్తిశాస్త్రిగారి సంగీత మహిమను గురించి 'సాంబుడు వాయించవలె. సాంబుడు (పరమేశ్వరుడు) వినవలె' అని చెప్పుకొనేవారట. గానచక్రవర్తి బిరుదాంకితుడైన కుప్పయ్యగారు చాల వర్ణాలూ, కృతులూ, తిల్లానాలూ రచించాడు. కొత్తవాసల వెంకట్రామయ్య, పల్లవి సీతారామయ్య, ఫిడేలు పొన్నుస్వామి చినకుప్పుస్వామి, పెద కుప్పుస్వామి అనువారు ఈయన శిష్యులు. కుప్పయ్యగారి కృతులను వర్ణాలను పల్లవి స్వరకల్పవల్లి అనే గ్రంథం ప్రకటించిన ఆయన కుమారుడు తిరువొత్తియూరు త్యాగయ్య, తన రచనలను సంకీర్తన రత్నావళి అనే గ్రంథంగా ప్రకటించిన వాగ్గేయకారుడు.

కుప్పయ్యగారు రాధా రుక్మిణీ సమేతుడైన వేణుగోపాలస్వామికి భక్తుడు. ఆయన రచన లన్నిటిలోను 'గోపాలదాస' ముద్ర ఉంటుంది. కుప్పయ్యగారి కాపురముండినందువల్ల మద్రాసుకు సంగీత ప్రపంచంలో ప్రముఖస్థానం లభించింది. త్యాగరాజు కృతులలోని రాగ భావాలను గ్రహించి, వాటిని తానవర్ణములద్వారా వెల్లడిచేసిన ప్రఖ్యాతి కుప్పయ్యదే. త్యాగరాజు పంచరత్న కృతులలోని రాగభావాలతో నాట, గౌళ, అరభి, శ్రీ, వరాళి యీ ఘనరాగ పంచకంలో ఆట, ఆది తాళాలలో కల్పనా చమత్కృతితో ఈయన రచించిన తానవర్ణాలు బహు ప్రసిద్ధములు. నయరా ఇంకా నారాయణగౌళ, రీతిగౌళ, కాంభోజి, బేగడ బిలహరి, సావేరి, తోడి మొదలైన రాగాలలో అనేక వర్ణాలను రచించి, ఆహిరి, తోడి, ఘంటా, కర్ణాటకకాపీ, కర్ణాటక జింగలా, మారువా ధన్యాసి. పున్నగవరాళి మొదలైన రాగాలలో కీర్తనలను రచించి, కొన్ని ఛాయా రాగాలకు మూర్ఛనలూ, వాటి ఛాయా స్వరసంబంధాలూ చేర్చి ఒక లక్షణ గ్రంథాన్ని తయారుచేసి, కర్ణాటక సంగీత ధాతుకల్పనాదక్షులైన వాగ్గేయకారులలో విశిష్ట స్థానము సంపాదించుకొన్నాడు.

వీణ కుప్పయ్యగారి ప్రసిద్ధ కృతులు

| | | | | |
|---|---|---|---|---|
| కనికరము లేకపోయెను | – | ఆనందభైరవి | – | రూపకం |
| ఈ తనువును పెంచి యేమిఫలము | – | దేశ్యతోడి | – | ” |
| మనవ్యాలకింప వదేమి | – | కమాస్ | – | ఆది |
| నా మొరాలకించి | – | ధన్యాసి | – | రూపకం |
| తామత మేలనమ్మ దయజూడని॰ | – | కాంభోజి | – | ” |
| నీ సహాయము లేని కోర్కులు | – | దేవగాంధారి | – | ఆది |
| ఇంత పరా కేలనమ్మ జగదీశ్వరీ | – | బేగడ | – | రూపకం |
| నీవేదిక్కని నిన్నెంతోనెర నమ్మితి | – | దర్బారు | – | ఆది |
| జగదభిరామా | – | కానడ | – | |

ఈ విధంగా 15 కృతులు తచ్చూరివారి గాయకలోచనంలో ఉన్నవి.

ఈయన 62 ఏళ్ళు జీవించారు. 1839 లో త్యాగరాజు చెన్నపట్టణంలోని ఈయన ఇంటికివచ్చి కొన్నాళ్ళున్నాడు.

## తిరువొత్తియూరు త్యాగయ్య :

ఈయన కుప్పయ్యగారి కుమారుడు మద్రాసులోని ముత్యాలపేటలో కాపురం ఉండడంచేత ముత్యాలపేట త్యాగయ్య అని, స్వరసింహ త్యాగయ్య అనీ ఈయనకు నామాంతరములు, ఘనరాగపంచకమూ మొదలైన 108 రాగాలలో అతి భక్తిపూరితమైన కీర్తనలు వ్రాసి సంకీర్తన రత్నావళి అను గ్రంథాన్ని వేణు గోపాలస్వామికి అంకితంగా రచించి ప్రకటించాడు. ఇతడు శ్రీ త్యాగరాజు పై భక్తితో ఖరహరప్రియ రాగంలో 'త్యాగరాయ సద్గురుని తలతు నతి ప్రేమతో' అనే కీర్తన రచించాడు. కాంభోజి రాగంలోని 'సరసిజానన' అను అటతాళ వర్ణంలో ముక్తాయి. స్వరమూ, మూడు ఆవర్తములే ఉన్నదని విద్వాంసు లాక్షేపణీయమని తలచి, దానిని పూర్తిచేయించడానికి దక్షిణదేశమంతటా అనేకమంది ప్రయత్నించగా, చివరకు తిరువొత్తియూరి త్యాగయ్యగారే దానిని పూర్తిచేసి, స్వరసింహు డని పేరు పొందారట. పైగర్ వరదాచార్లుగారు, తుని ప్రాంతీయులైన గణపతి రావు అనే సంగీతరావు, అన్నామలై విశ్వవిద్యాలయంలో పనిచేసిన దేవరగారూ, నెల్లూరి రాఘవరాజుగారూ, గుంటూరి వాస్తవ్యులై ఈమధ్య 5, 6 ఏళ్ళ క్రితం పరమపదించిన పిరాట్ల శంకరయ్యశాస్త్రిగారూ తిరువొ[illegible]రి త్యాగయ్యగారి శిష్యులేనట.

[illegible]

## మావాంబుచావడి వెంకటసుబ్బయ్య :

ములికినాటి ఆంధ్రుడైన యీ వాగ్గేయకారుడు త్యాగరాజుకు బంధువర్గంలోని వాడూ శిష్యుడూ కూడ. ప్రసిద్ధ విద్వాంసులయిన మహావైద్యనాథయ్యారు, పట్నం సుబ్రహ్మణ్యయ్య, శరభశాస్త్రి, లావణి వెంకటరావు, ఫిడేలు వెంకోబరావు, త్యాగరాజు మనుమడయిన పంచాపకేశయ్య, శివరామయ్య గార్లు యీయన శిష్యులే. ఈయనలాగే పట్నం సుబ్రహ్మణ్యంగారు కూడా 'వేంకటేశ' ముద్ర తోనే కృతులు రచించడంచేత, నిజానికి యీయన వ్రాసిన కృతులు కొన్ని పట్నంవారి రచనలుగా చలామణీ అవుతున్నవి. 'స్వామికి సరి యెవ రనవచ్చు' అని యీయన రచించిన దేవగాంధారిరాగ కృతి త్యాగరాజ గురుస్వామికి భక్త్యుపహారము ఇతని యితర రచనలు :

| | | |
|---|---|---|
| సరస్వతి రాగంలో | — | మరియాదగాదు |
| రాగమాలిక | — | శివభూపతే |
| ,, | — | కరుణించుము |
| మలయమారుతం | — | ధన్యుదెవ్వడో |
| ,, | — | జన్మమెందుకు |
| కుతూహల రాగంలో | — | ఆవరకు |
| ప్రవాళజ్యోతి | — | పరబ్రహ్మము. |

## పల్లవి శేషయ్య :

త్యాగరాజు శిష్యుడైన నెయిక్కారపాటి సుబ్బయ్యగారికి శిష్యుడవటంచేత ఈ శేషయ్యగారు త్యాగయ్యగారికి ప్రశిష్యుడు. కంచి శేషయ్య అనికూడా వ్యవహారం. పల్లవి గానంలో ప్రసిద్ధివల్ల పల్లవి శేషయ్య అనిపించుకొన్నాడు. అతడుకూడ ములికినాటి ఆంధ్రుడే. తెలుగులో అనేక కృతులను, పదవర్ణాలను, తిల్లానాలను రాగభావపరిపుష్టంగా రచించిన ఈ వాగ్గేయకారుడు లక్ష్యలక్షణ విద్వాంసు డని అంటారు. కానడ, కాపి, వసంత, ధన్యాసి రాగాలలోని ఇతని తిల్లానాలు బహురక్తి జనకంగా ఉంటాయి. అల్పసంచారంగల రాగాలను కూడ గంటలకొద్దీ పాడగలశక్తిని సంపాదించి, సునాయసంగా పల్లవి చిట్టస్వరాలను విస్తరించడంలో పేరుపొందాడు. ఒక గానసభలో ధన్యాసి రాగాన్ని 8 గంటల సేపు పాడాడట. ఇంకొకసారి ద్విజావంతి రాగం అప్పటి కప్పుడు కల్పించి కల్పన జతులు పాడడంలో తనకు తానే సాటియట. 'హెచ్చగడతరమే' అను అఠాణ రాగ కీర్తన సంగీత) విద్వల్లోకంలో ప్రసిద్ధము. మల్లికావసంతం అనే అపరూప రాగంలో కృతిచేసిన నాగొలి వాగ్గేయకారు డితడే. ఇదిగాక, భైరవి, పూర్ణషడ్జం,

గౌరీ మనోహరి, కేదారగౌళ, సామ, ఖమాస్ కేదారం, గరుడధ్వని, శుద్ధిసావేరి, హిందుస్థానీ బేహగ్, శుభపంతువరాళి, షణ్ముఖప్రియ రాగాలలో ఇతడు కృతులను రచించాడు. మైసూరు సంస్థానప్రభువు యితనిని పోషించారు ఈయన వేయి రాగాలకు పైగా ఆరోహణావరోహణలు కొన్నిటికి వివరణములతో సహా తన రచనల నన్నిటినీ స్వరపరచి, ఆ స్వరములను గ్రంథస్థము చేశాడు.

మైసూరు రాజా దర్శనం దొరకకపోయిన రోజులలో ఒకనాడు ఇతడు చాముండీశ్వరి ఆలయం ముందరి నందివద్ద నిల్చుండి పూజకై అటు వెళ్లుతున్న రాజుగారి కంటపడి, రాజు ఆహ్వానముపైని ఆస్థానానికి వెళ్ళి 'భూమి వెలయు సోమకులవర, శ్యామభూప, శేషుని మనవి విని విని – కామితార్థము లొసగి కావు మిక – కళ్యాణగుణ ధీరోదారా' – అని ధన్యాసి రాగంలో ఒక తిల్లానాపాడి, రాజుచేత బహుకృతుడై, తర్వాత ఆస్థాన గాయకునిగా గౌరవింపబడినాడు. ఇదిగాక, ఉపాంగ రాగపద్ధతి కాపి రాగంలో 'ఉదరన ధీం' అను తిల్లానా కూడా చాల ప్రసిద్ధమైనది.

## వాలాజాపేట వేంకటరమణ భాగవతులు :

త్యాగరాజు పూజావేళను అయ్యంపేటనుంచి తిరువయ్యారుకు వచ్చి, తులసితీర్థం యిస్తూండేవాడు వేంకటరమణయ్య. తద్వారా అతడు త్యాగరాజుకు అత్యంత ప్రీతిపాత్రుడైనాడు. త్యాగరాజు కృతులను ఆశువుగా పాడి రచిస్తూండే టప్పుడు పక్కను కూర్చుండి వ్రాసే శిష్యులలో ప్రముఖు డీయన. వ్యాసునకు భారతం వ్రాసిపెట్టిన గణపతివలె గురువుగారి కితడు వ్రాసిపెడుతున్నా డనే అభిమానముతోనో. లావుగా, పొడుగ్గా ఉండేవాడనో ఇతనిని సహాధ్యాయులంతా 'గణపతి' అని పిలిచేవా రట. మిగిలిన శిష్యులవలె కాక, వాలాజాపేట వేంకట రమణ భాగవతులూ. అతని బృందంవారూ త్యాగరాజుగారి కృతులనే కాక, నౌకా చరిత్రాది సంగీత నాటకములను కూడా పాఠం చేసుకొన్నారు. వేంకటరమణ భాగవతులు ఆయన కుమారుడు కృష్ణస్వామి భాగవతులు వ్రాసిపెట్టి ఉంచిన చరిత్రాంశములనుబట్టి త్యాగరాజు జీవితము సంగీత చరిత్రపరిశోధకులకు పూర్తిగా లభిస్తోంది. ఈ వాలాజాపేట విద్వాంసులు సౌరాష్ట్రబ్రాహ్మణులు, సంస్కృతాంధ్ర విద్వాంసులు.

గురు శుశ్రూషచేసున్నా వేంకటరమణ భాగవతులు తొలిరోజుల్లో గురువు గారి కృతులను త్వరగా నేర్చుకొనలేకపోయేవాడట. అప్పుడు త్యాగరాజు షడ్విధ మార్గిణి రాగంలో జ్ఞానమొసగరాదా అను కీర్తనతో శ్రీరామునిగూర్చి ప్రార్థించి తన శిష్యునికి జ్ఞానప్రదానం చేయమని వేడుకున్నాడు. ఆ మర్నాటి నుంచి వేంకటరమణ భాగవతుల గ్రహణ ధారణశక్తులు అభివృద్ధి చెందినవట.

వేంకటరమణ భాగవతులు త్యాగరాజ గురుపూజగా, 'కాకర్ల వంశాబ్ధి' ఇత్యాది మంగళాష్టకమునూ, ధ్యానశ్లోకములను రచించాడు. అయ్యంపేటకు సంస్కృతనామ మయిన 'రామచంద్రపుర' ముద్రతో కొన్ని కృతులను రచించా డీయన. 1874 వ సంవత్సరం - భావ సంవత్సర మార్గశిర శుద్ధ సప్తమినా డీయన దిగవంతు డయాడు.

ఈయన శిష్యులలో ముఖ్యులు : మైసూరు సదాశివరావు, రాయవెల్లూరు పల్లవి ఎల్లయ్య, లోకా నారాయణయ్య, కవి వెంకటసూరి, కాంచీపురం అరుణా చలాచారి,

## సదాశివరావు :

వాలాజాపేటలో రామభజన మందిరం నెలకొల్పినప్పుడు జరిపిన ఉత్స వంలో - మైసూరు సదాశివరావు - 'సీతా లక్ష్మణ సమేత, శ్రీ కోదండ రామ స్వామి నను రక్షింపవేమి' అనే కాంభోజి రాగ కీర్తన రచించి పాడినాడు. కళ్యాణిరాగంలో 'ఓ రాజరాజేశ్వరి,. కనుగొని ధన్యుడనైతిని శ్రీ కంచికామాక్షి' అనేకీర్తనలు, మాళవ గౌళ, కమాసు, అఠాణా, పూర్ణాషడ్జం, బలహంస, కానడ, దేవగాంధారి, రాగాలలో ప్రసిద్ధమైన కీర్తనలు, 'ఏ మగువ బోధించెరా' అను ధన్యాసిరాగంలో పదవర్ణమూ మైసూరు సదాశివరావుగారి రచనలు.

## కృష్ణస్వామి భాగవతులు :

వేంకటరమణ భాగవతుల కుమారుడు. కొన్ని కృతులను స్వర జతులను రచించాడు. త్యాగరాజ కృతుల స్వరాలను పాశ్చాత్య పద్ధతిలో స్టాఫ్ నొటేషన్‌లో వ్రాయించి అచ్చువేయించిన చిన్నస్వామిముదలికి ఈతడు సాహాయ్యం చేశాడు. పాడినవి పాడకుండా ప్రతిదినమూ పదేసి త్యాగరాజ కృతులను పాడిన తర్వాతనే మధ్యాహ్న భోజనం చేసేవాడట. ఆ లెక్కని ఒక సంవత్సరం అయ్యేసరికి 3600 కృతులు పాడి, త్యాగరాజకృతి సర్వస్వమును ఇతడుక ంఠస్థంచేసి ఉండాలి. ఇతని ముగ్గురు కుమారులలో చివరివాడు రామస్వామి భాగవతులు త్యాగబ్రహ్మోప నిషత్ అని త్యాగరాజ కృతులపై వ్యాఖ్యారూపమైన గ్రంథం రచించాడు.

## పట్నం సుబ్రహ్మణ్యయ్య :

మానాంబుచావడి వెంకట సుబ్బయ్యగారి శిష్యుడయిన ఇతడు త్యాగరాజు గారి ప్రశిష్యుడు. కీర్తిశేషులగు ప్రసిద్ధ విద్వాంసులు పైగర్ వరదాచారిగారు కొన్నాళ్ళు వీరితో ఉండేవారట. 'వీరి మధ్యమ కాల శైలి, మిగుల రంజకమైన స్వరప్రయోగములు, తాళముయొక్క దశప్రాణపూరితమైన భిక్కట్టునూ వెయ్యా

రులుగా అపూర్వ రాగాలను సులభముగా పాడే చాతుర్యమును' బహువిధాల మెచ్చుకొంటూ శ్రీ వరదాచారిగారు వ్రాసియున్నారు. త్యాగరాజుగారి కృతులవలెనే వీరివి సమశైలిలో ఉంటాయి.

పట్నం సుబ్రహ్మణ్యయ్యగారి ప్రసిద్ధ కృతులు :

| | | |
|---|---|---|
| చక్రవాకం | – | 'ఇంకా దయలేదా నాపై' |
| మందారి | – | 'నిన్ను జెప్ప కారణమేమి మనసా' |
| హుసేని | – | 'కరుణించరా కరుణానిధే' |
| సింధుమందారి | – | 'కరుణించుట కిదె సమయమయ్యా, కరిరక్షక' |
| సాళగభైరవి | – | 'సుఖముగాదు ఈ సుతకళత్రాది మోహము' |
| మలయ మారుతము | – | 'జన్మమెందుకు భక్తిలేని నరజన్మమెల్ల' |

ఇవికాక, ఫలమంజరి, బృందావన సారంగ, సరసాంగి, ఉదయరవిచంద్రిక రాగాలలో ఈయన కృతులున్నవి. ఈయన అనేక వర్ణములను, జావళీలను, తిల్లానాలనుకూడ రచించాడు. పూచీఅయ్యంగార్ అని ప్రసిద్ధిపొందిన రామనాధ పురం శ్రీనివాస అయ్యంగారు ఈ పట్నం సుబ్రహ్మణ్యయ్యగారి శిష్యులే. పూచీ అయ్యంగారు జావళులు మొదలైన సంగీత రచనలుచేసి పేరు పొందారు. వీరి జావళీలలో అత్యంత జనరంజకత పొందినవి; కాపిరాగంలోని 'సరసము లాడే టందుకు'. మేళత్తూరు భాగవత సంప్రదాయానికి చెందిన గణపతయ్య అను వాగ్గేయకారుడు పట్నం సుబ్రహ్మణ్యయ్యకు మేనమామట.

## దీక్షితులవారి రచనావైదగ్ధ్యం :

దీక్షితులవారు తోడి రాగంలో చేసిన 'రూపము జూచి' అను చౌకవర్ణంలో పల్లవి, అనుపల్లవి, చరణములందు మాత్రం సాహిత్యం ఉండి, ఆ తర్వాత తాన వర్ణం మాదిరిగా చిట్టస్వర సంపుటాలు చేరి ఉంటాయి.

'కమలాంబాం భజరే' అను కల్యాణి రాగంలోని కమలాంబా నవావరణ కృతిలో విలోమ చిట్టస్వరం రచింపబడినది. ఈ పద్ధతి చిట్టస్వరములో ఒకసారి పాడబడిన క్రమం – వెనుకనుంచి ముందుకు తిరిగి పాడబడుతుంది. అనులోమ విలోమ చిట్టస్వరం వెనుకనుంచి ముందుకు, ముందునుంచి వెనుకకు పాడుతారు. ఈ పాడడంలో రాగభావానికి భంగం ఉండదు. దీక్షితులు రేవగుప్తి రాగంలో చేసిన 'సదా వినత సాదరే' అనే కృతిలో ఈ రెండవ పద్ధతి చిట్టస్వర రచన చేరి ఉన్నది. ఇవికాక సాహిత్య బంధములో గోపుచ్ఛయతి, స్రోతోవహయతి అను పద్ధతుల రచనలు కూడా దీక్షితులవారి కృతులలో కనబడతాయి. స్రోతోవహ యతిలో – సాహిత్యబంధము స్రవంతి (నదీప్రవాహము) వలె మొదట సన్న ముగా నుండి, క్రమంగా వెడల్పు అవుతూవుండే అనుప్రాసాన్వితమైన సమాస

ఖండాలతోగాని, వాక్య ఖండాలతోగాని కూర్చబడి ఉంటుంది. గోపుచ్ఛయతి ఆవుదోకవలె మొదట విస్తృతిగలిగి, క్రమంగా సన్నబడే సమాన ఖండాలతోగాని, వాక్య ఖండాలతోగాని కూర్చబడి ఉంటుంది. 'త్యాగరాజ యోగ వైభవం, రాజయోగ వైభవం, యోగవైభవం, వైభవం, వం' అనే యీ విధంగా గోపుచ్ఛ యతినే కాకుండా, స్రోతోవహాయతిని కూడా దీక్షితులవారు ఆనందభైరవి రాగ కీర్తనలో నిబంధించారు.

తెలుగులో కొద్దిగాను, సంస్కృతంలో విశేషంగాను రచనలు సాగించిన దీక్షితులవారి కీర్తన లన్నింటిలోను వేంకటమఖి ఏర్పరచిన 72 మేళకర్త రాగాలకు, ఇంకా అనేక జన్యరాగాలకు లక్ష్యప్రాయములుగా రచించిన సంస్కృత కీర్తనలు రాగభావమును స్పష్టముగా జీవగ్రహాంశ స్వరాది విశేషాలతో పట్టి చూపించే ఉదాహరణ రచనలు. ఈ కృతులలో చాలమట్టుకు చౌకకాలంలో ప్రారంభించినా, చరణములలో మధ్యమకాలంలో వడిచే సాహిత్యం ఉంటుంది. దీక్షితులవారికి సమర్థులైన సోదరులు, ఇతర శిష్యులు పరివేష్ఠించి ఉండినందువల్ల, వారి రచనలకు, త్యాగరాజ కృతులకు తర్వాత – శిష్యపరంపర ద్వారా దేశములో మంచి ప్రచారమే లభించింది.

## దీక్షితులవారి శిష్యపరంపర :

ముత్తుస్వామి దీక్షితులవారి శిష్యులలో ప్రసిద్ధులు, సంగీత శాస్త్ర, ద్రావిడ భాషలలో పండితుడైన తిరుక్కడైయూరు భారతి, ఆవడయార్ వీణ వెంకట రామయ్య తేపూరు సుబ్రహ్మణ్యయ్య, తిరువారూరుశుద్ధమృదంగం తంబియార్చాడు. భరతం పొన్నయ్య, వడివేలు, భరతం కొరనాడు రామస్వామి, నాగస్వరం తిరు వళందులూరు బిల్వవనం, తానవర్ణాల తిరువారూరు అయ్యాస్వామి, నట్టువరాంద్రు తిరువారూరు కమలం, వల్లలార్గుడి అమ్మణిగార్లు.

## చిన్నస్వామి దీక్షితులు :

ఈయన ముత్తుస్వామి దీక్షితుల రెండవ సోదరుడు. నారదునిపైని నాగ వరాళి రాగంలో....గానలోల కరుణాలవాల....అనే కృతిని, కళ్యాణిరాగంలో 'నారాయణానంత' అనే కృతినీ రచించాడు. 45 వ ఏట మరణించాడు. ముత్తు స్వామిదీక్షితులు క్రొత్తకీర్తనలు రచింపగానే తన తమ్ములచేత పాడించుకొని వినేవాడు.

## బాలస్వామి దీక్షితులు :

ఈయన ముత్తుస్వామి దీక్షితుల కనిష్ఠ సోదరుడు. మణలి చిన్నయాముదలి సంస్థానంలోను, ఎట్టయాపురం సంస్థానంలోను ఈయన అనేక తానవర్ణములను,

కృతులను రచించి, పాడి బహువిధముల సన్మానితుడైనవాడు. 'సామికిసరి' అని వసంతరాగంలో ఈయన రచించిన దరువు వేంకటేశ్వర ఎట్టేంద్రమహారాజుకు అంకితము.

## సుబ్బరామదీక్షితులు :

ఈయన ముత్తుస్వామి దీక్షితుల కనిష్ఠ సోదరుడైన బాలస్వామిగారికి దత్తపుత్రుడు. తండ్రులవలెనే ఆంధ్ర సంస్కృత ద్రావిడ భాషలయందును, సంగీతమందును గొప్ప విద్వాంసుడు. 17వ యేటనే కార్తికేయునిపై ని దర్బార్‌రాగంలో ఆటతాళవర్ణం ఒకటి రచించాడు. ఎట్టయాపుర సంస్థానాధీశుని మెప్పు పొందాడు. యమునారాగంలో ఒక జతిస్వరాన్ని ఆ రాజు కోరికపై రచించి బహూకృతుడైనాడు. జగద్గురు శంకరాచార్యులవారి దర్శనం చేసిన సందర్భంలో సుబ్బరామ దీక్షితులు రామక్రియరాగంలో ఆయనను గురించి ఒక తానవర్ణం రచించి గానం చేశాడు. ఎట్టయాపురాధీశ్వరుని ప్రోత్సాహంపైని సంగీత సంప్రదాయప్రదర్శిని అనే ఉద్గ్రంథంలో తాను రచించిన వాగ్గేయకార చరిత్రము, సంగీత లక్షణ సంగ్రహము. ఆనాటికి ప్రచారంలో ఉన్న మహావిద్వాంసుల కీర్తనలూ, వర్ణములూ ఇత్యాదిగాగల సంగీతరచనల ఉదాహరణాలతో రాగలక్షణ వివరాలతో వేంకటమఖి మేళకర్త జన్యరాగ పద్ధతి ననుసరించి ఐదు భాగములుగా రచించాడు. ఈనాటికీ ఇది సంగీతలోకంలో గొప్ప ప్రామాణికమైన గ్రంథము. ఇందులో తాను స్వయంగా రచించిన చౌకవర్ణ, తానవర్ణ, కీర్తన, రాగమాలికా, రాగసంచారులను కూడ చేర్చారు. ఆనందభైరవి రాగంలో సుబ్బరామదీక్షితులు రచించిన 'సారెకు' అనే పదవర్ణం ముద్దుస్వామి ఎట్టేంద్ర మహారాజుకు అంకితం. కమాస్ రాగంలో ఎంతని అనే పదవర్ణం తిరువారూర్ వీరవసంత త్యాగరాజస్వామికి అంకితం. ఇవికాక, బిళహరి, తోడి, ఇమన్ కళ్యాణిరాగాలలో ఈయన రచించిన జతిస్వరాలు ప్రసిద్ధములు.

ఈ మహానుభావుడు కవిత్రయం రచించిన ఆంధ్రమహాభారతాన్ని ద్రావిడ భాషలోనికి తర్జుమాచేసిన ధీశాలి.

## ఎట్టయాపుర ప్రభువులు :

వీరు సుమారు 1816 ప్రాంతంనుంచి ఎట్టయాపురాన్ని పరిపాలిస్తూసంస్కృతాంధ్ర ద్రావిడసాహిత్యములకు, కర్ణాటక సంగీతానికి అఖండమైన సేవ చేశారు. వీరిలో జగదీశ్వర రామకుమార ఎట్టప్ప, ముద్దుస్వామి ఎట్టప్ప, జగదీశ్వరరామ

వేంకటేశ్వర ఎట్టప్ప అను ముగ్గురు ప్రభువులూ ఒకరి తర్వాత ఒకరుగా 1860 నుంచి 1899 ప్రాంతాలలో పరిపాలించినవారు వీరు ముత్తుస్వామి దీక్షితులను, ఆయన తమ్ముడు బాలస్వామిని అనేకవిధాల సన్మానించినవారు. బాలస్వామి దీక్షితులూ, ఆయన కుమారుడు సుబ్బరామ దీక్షితులూ ఎట్టయాపుర ఆస్థాన విద్వాంసులుగా వుండిపోయి సంగీత సాహిత్యాలకు బహువిధాల సేవ చేశారు. ఈ ప్రభువుల ప్రోత్సాహంపైననే సుబ్బరామదీక్షితులు సంగీత సంప్రదాయప్రదర్శిని ఉద్గ్రంథంగా తయారుచేశారు.

## స్వాతి తిరునాళ్ మహారాజు

1829 నుంచి 1847 వరకు తిరువాంకూరు పరిపాలించిన ఈ మహారాజు సంస్కృతాంధ్ర మళయాళ భాషలలోను సంగీతములోను గొప్ప విద్వత్తు గల వాగ్గేయకారుడు. కవి పండిత గాయక శిల్ప పోషకుడు. కులశేఖర పెరుమాళ్ అని కూడ ఈయనకు పేరు వ్యవహారంలో ఉంది. 1813 లో జన్మించి సరస్వతీ ప్రసన్నమునూ, రాజ్యలక్ష్మీ ప్రసన్నమునూ కలిగిన ఈ ధన్యజీవి 34 వ యేటనే కీర్తిశేషుడైనాడు. బాల్యంలోనే సంస్కృతంలో పరిపూర్ణుడై, ఆంగ్ల, పారశీకాంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక, హిందూస్థానీ భాషలలో పాండిత్యం సంపాదించినాడు. ఇతడు సంస్కృతంలోను, తెలుగులోను, మళయాళంలోను, మణిప్రవాళంలోను సాహిత్యములలో పదవర్ణాలు పదాలు, తిల్లానాలు, కృతులు మొదలయిన సంగీత రచనలను చేశాడు. ముత్తుస్వామి దీక్షితుల శిష్యులై భరత నాట్యాచార్యులుగా ప్రసిద్ధిపొందిన పొన్నుస్వామి, వడివేలు సోదరులు. హిందూస్థానీ గాయకులైన తంజావూరు రంగయ్యంగారు తంజావూరు చింతామణి (సారంగి); వైణికుడు – చోళపురం రంగనాధరావు; హిందూస్థానీ సంగీత విద్వాంసులయిన మేరు గోస్వామి అను నామాంతరం గల అనంతపద్మనాభ గోస్వామి; సర్వాత్ విద్వాంసుడైన సులేమాన్ సాహెబ్ హలావతి, అను గొప్ప గొప్ప గాయకవరులతో స్వాతి తిరునాళ్ మహారాజు ఆస్థానం కలకల్లాడుతూండేది.

ఈయన రచించిన పదవర్ణాలలో, 'సరసిజనాభ' అనే కాంభోజి రాగంలోనిదీ, 'సామి నిన్నే నమ్మితిరా' అనే యదుకులకాంభోజి రాగంలోనిదీ నాట్యోపయుక్తములై చాల ప్రసిద్ధిపొందినవి. మొదటిదానిలోని సాహిత్యమును వదలి దాని నిప్పుడు కొందరు నట్టువనార్లు తానవర్ణం అని అంటున్నారు. వీటిలోని ధాతుకల్పనా, లయాత్మకతా నాట్యమునకు ఎంతో ఉపయోగకరంగా ఉన్నవి. స్వర సంపుటులలో లక్షణాన్ని అతిక్రమించని అసామాన్య ప్రయోగాలెన్నో శ్రోతలకు అద్భుతం కలిగిస్తాయి. కీర్తనల కంటే వర్ణాలు పొడుగ్గా ఉంటాయి. ఈ మహారాజు రచించిన 21 వర్ణాలలో 6 భక్తి రసాత్మకములు. మిగిలినవి శృంగార

ఠసాత్మికములు. ఈ 21 వర్ణాలలో రెండుమాత్రం తానవర్ణాలు - మిగిలిన 19 చౌక వర్ణాలు. రాగభావాన్ని సర్వసంపుటములద్వారా ప్రస్తరించుటకు పోతాయి.

ఆనాటి సంగీత విద్వాంసు లందరికంటే హెచ్చు జీతము 100 రూపాయలు ఇస్తూ తంజావూరు భరతాచార్యుడైన వడివేలును తన పదవర్ణ కీర్తన రచనలో తనకు సహచరుడుగా నియమించినా డీమహారాజు. ఈయన పదాలన్నీ తమ ఇలవేల్పయిన పద్మనాభస్వామికి అంకితములు. ఈయన పదాలలో 10 సంస్కృతంలోను, 5 తెలుగులోను, 50 మళయాళంలోను ఉన్నవి. ఈయన కీర్తన రచనలో మార్గదర్శి శేషయ్యంగారి పద్ధతిని అనుసరించాలని చెప్పుకొన్నాడు. గేయములలో యమకములూ ఆది, మధ్య అంత్యానుప్రాసములు ఉపయోగించే పద్ధతులను వివరిస్తూ ఒక లక్షణ గ్రంథాన్ని మళయాళంలో రచించాడు.

ఈయన రచించిన ప్రసిద్ధ వర్ణాలు : 1. కామోదరి రాగంలో 'సరసమృదు పద', 2. ధన్యాసిలో 'హా హాంత', - 3. తోడిలో - దానిసామజేంద్ర గామిని, 4. ఘంటారాగంలో 'సాదరమవివశా', 5. సదసిజనాభ, కింమయాకృతమ్, 6. సౌరాష్ట్రంలో 'పరమాకుల హృదయం', 7. శంకరాభరణంలో ఇందుముఖీ 8. ఎదుకుల కాంభోజిలో సామీ నిన్నే, 9. శంకరాచరణంలో 'చలమేల' - ఇవిగాక, కమాచి, నీలాంబరి, కళ్యాణి రాగాలలో వర్ణా లున్నవి. 'నవరస' అనే అపూర్వరాగంలో 'ఎంతైవేడిన' అనే పదంకూడా రచించాడు. పదాలన్నీ పద్మనాభస్వామి నాయకుడుగా గీతగోవింద నాయికా నాయకపద్ధతి ననుసరించిన నన్నివేశాలలో సాగుతాయి. వీటి సంగీత రచనలో వడివేలు ఈయనకు సాహాయ్యపడి ఉంటాడని పండితులంటారు. ఈయన దేవీ నవరాత్ర ములలో సంకీర్తన సమయమున పాడుకొనుటకు వీలుగా 9 కీర్తనలను రచించాడు.

1. దేవి జగజ్జననీ — శంకరాభరణం - ఆది
2. పాహిమాం శ్రీ వాగిశ్వరి — కళ్యాణి - ఆది
1. దేవీ పావనీ — సావేరి - ఆది
4. భారతీ మాం అవ — తోడి - ఆది
5. జననీ మాం అవ — భైరవి - త్రిపుట
6. సరోరుహాసన జాయే — పంతువరాళి - ఆది.

ఇవి ఆరున్నూ సర్వతీ దేవిని గూర్చినవి, వచ్చే మూడూ పార్వతీదేవికి అంకితములు.

7. జననీ పాహి — శుద్ధ సావేరి - త్రిపుట
8. పాహి జననీ — నాటకురంజి - త్రిపుట
8. పాహి పర్వత నందినీ — ఆరభి - ఆది.

ఇవిగాక, రామాయణ సంకీర్తన, భాగవతసార కీర్తన, పద్మనాభకేశాది పాదవర్ణన కీర్తనలగా రచించాడు.

## స్వాతి తిరునాళ్ మహారాజు రచించిన తెలుగు పదము :

అఠాణారాగము – చాపుతాళము :

వలపుతాళ వశమా నా సామికి
చలముసేయ న్యాయమా॥ (పల్లవి)

అలరు విలుని సమానుడౌ శ్రీ పద్మనాభుడు
నెలత యిపుడు నన్ను నిరాకరించెనే॥ (అనుపల్లవి)

చిరతరప్రాయమునాడే చిగురుబోణి వాని
కరుణాసాగరుడని కలికి చాల నమ్మితి
మరుని బాణముచేత మగువ నా మన సెంతో
పరవశమాయెనే భాగ్య మిటు లాయెనే॥ (చరణం)

సోమకిరణముచేత సొగసైన నిన్నటి రేయి
రామరామ నాకు రమణి యుగ మాయెనే
కామకేళిలో నన్ను కలసియుండిన విభుడు
నామీద నున్న నెనరు నాతి మరచెనే (చరణం – 2)

తెలుగుజావళి – సైంధవిరాగం – ఆదితాళం :

ఇటు సాహసములు ఏల నాపై చక్కని సామి॥ (పల్లవి)
ఇటులు వగలు తాళ నా తరమా॥ (అనుపల్లవి)

ఇక చిన్నదాన నేను మగవాని ముఖము నెరు
గక నే నున్నాను వగకాడ నీ కిది మేర
గాదే వలపు న్యాయ మెరుగు నా సామి ॥ఇటు॥

మనసు రంజితమయ్యె నీకు తగిన మగువతో
ఈ వగలుంచ వలను వినివేర నా పలుకులు
ఈ వేళను వింతలు చాలుచాలు నా సామి ॥ఇటు॥

సరసిజనేత్రుడ నీ కరుణవల్ల చాల
యౌవనము వచ్చెనాడు మరుకేళిలో నే నిను
లాలింతు సరస పంకజనాభ నా సామి ॥ఇటు॥

తిరువాంకూరు మహారాజు తెలుగుభాషలో రచించిన పదమూ, జావళి ఎంత సున్నితమయిన శృంగారముతో. సుకుమార శైలిలో ఉన్నవో మచ్చు చూప దానికే పైని ఉదహరించాము

## స్వాతి తిరునాళ్ హరికథలు :

తన కొలువులోని మహారాష్ట్ర దేశీయ సంగీత విద్వాంసుడైన మేరు గోస్వామి ప్రోత్సాహముతో స్వాతి తిరునాళ్ శ్రీమద్భాగవతంలోని కుచేలోపాఖ్యానమును, అజామిళోపాఖ్యానమును కీర్తనంలోను, శోకములతోను కూడిన హరికథలుగా సంస్కృతభాషలో రచించారు. వీటిలో కథాకథనమూ, ఆయా పాత్రల సంభాషణమూ కూడా కీర్తనలలోను, శ్లోకములలోను సాగిపోతుంది. ఇటీవల ఈ హరికథలు సంగీత నాటకములుగా కూడా పాటించబడినవి. కుచేలుడు శ్రీకృష్ణునికి గుప్పెడు అటుకుల నిచ్చి, సిరిసంపదలను పొందిన కథ. జీవితమంతా అనేక పాపకృత్యములు చేసిన అజామిళుడు మరణసమయంలో తన చిన్న కొడుకును నారాయణా అని పిలిచినందువల్ల – జరిగిన నారాయణ నామస్మరణ వల్ల వైకుంఠము చెందిన కథ ఇందలి ఇతివృత్తాలు, సంస్కృతభాష ఈకీర్తనలలోను, శ్లోకాలలోను సామాన్య సాహిత్యపరులకు సుబోధముకాని జటిలశైలిలో ఉంటుంది. కీర్తనల సంగీతం మిగిలిన స్వాతి తిరునాళ్ కృతులలోని సంగీత రచన వలెనూ, సమకాలికుడైన త్యాగరాజస్వామి కృతులలోని సంగీతము వలెనూ ఉంటుంది.

భరతాచార్యుడైన పొన్నయ్యా తెలుగులో ఈ మహారాజుకు అంకితంగా రచించిన ఆటతాళ శబ్దము నొకదానినీ, త్రిశ్ర శబ్దము నొకదానినీ డాక్టర్ వి. రాఘవన్‌గారు మద్రాసు సంగీత పరిషత్పత్రికలో ప్రచురించారు. వానిలో త్రిశ్ర శబ్దమును ఇక్కడ ఉదాహరిస్తున్నాము.

త్రిశ్ర శబ్దం :

తక్కిటు తత్త కిటు కిట తక తకిటు ధికుట తక తోంకటు
తక ఝుం ఝుం ధరికిట తక తెయ్ ధ తధణేకుతకత
ఝెను తకధరి కుధిం గుతత్తోంగ్ తక తోంగ్ తధిగిణ
ధోంతాతే తెయ్ దత్తత కిణక ఝొంతరితక
గుణమణిగణ పటుణాలయ శరణాగత కరుణానిధి
వితరణమున తరణిసుతుడు, గోభూసుర సురతరువని
నృపవరులకు మకుటమణని, విపులకీర్తినికేతునకు తాహ ఝొంత
ఝొంతరితక

శ్రీ పంకజనాభదాస వంచిపాలరామవర్మ
కులశేఖర కిరీటపతి, మహరాజ రామరాజబహదుర
మన్నెసుల్తాన్ షంషేర్జంగ్, భళిభళిరే సల్లామురె
తత్తోంకిట తక తధిగిణ ధోంతధిగిణధోం
తకతధిగిణ ధోం....

## కంచి వేంకటాద్రిస్వామి :

కంచి వరదరాజస్వామి భక్తుడైన యీ పరివ్రాజకాచార్యులను అల్లూరి వేంకటాద్రి స్వాములని కూడా వ్యవహరిస్తారు. ఈయన త్యాగరాజస్వామికి సమకాలికుడు. త్యాగరాజు బ్రహ్మైక్యం పొందిన తర్వాత ఆయన భౌతికదేహాన్ని సమాధి గతం చేసేటప్పుడు అక్కడ సమావేశమైన కవిపండిత వాగ్గేయకారులలో ఈయనకూడ ఉన్నాడు. వేంకటాద్రి స్వామి కీర్తనలను పేర యీయన కీర్తనలకు దక్షిణదేశంలోను, ఆంధ్రదేశంలోను సంకీర్తనపరుల గోష్ఠిలో బాగా ప్రచారం ఉన్నది. ఈయన కంచి వరదరాజస్వామి పైనా, శ్రీరంగంలోని అళఘిరిస్వామి పైనా, విష్ణుపరంగాను యెన్నో సంకీర్తనములు రచించి, భక్తిపరవశత్వంతో గానం చేసేవాడు. శ్రీహరినామ సంకీర్తనలు అను పేర 1888 లో విద్యావివేక కళానిధి ముద్రాక్షరశాలలో ముద్రితమైన గుజిలీ ప్రతిలో 162 కీర్తన లున్నాయి. వీటిలో భక్తిరసాత్మకములైన దివ్యనామ సంకీర్తనములవంటివే కాక, హెచ్చరికలు, లాలిపాటలు, మంగళారతులు, భగవంతునితో భక్తుని సంభాషణలుగానూ, విష్ణుని లీలల సుతులుగానూ సాగు కీర్తనలు కలవు. వీటికి సమకాలికులైన త్యాగరాజాదులు వాడిన రాగాలన్నీ వాడినాడు.

కాంభోజి – ఆట ;

సుందరరాజుని చూచిన కన్నుల జూరి మరెవ్వరని...
ఇందీవరశ్యామల కోమలాంగుడౌ యిందిరా హృదయారవింద వాసుడైన...

ముద్దు పదములందు మువ్వలు గదలగ దిదిన కస్తురితిలకము జారంగ
నిద్దంపు చెక్కిళ్లు నిగనిగ మెరయగ పద్దు లీడేర్చెడు పరమపురుషుడైన....

.... .... ....

మధ్యమావతి – ఆట

ఎరుగనివానివలె నున్నావు, నే నెంత వేడిన యేమనవు...
పరిగ పరిగ వచ్చి పంకేరుహనాభ, సరగున బ్రోవవు సావధాన మేల....
పాంచాలి పరులచే బాధలు పడగానే, అంచితముగ నీ వక్షయ మనలేదా...

.... .... ....

ఈ స్వామి సిద్ధిపొందే ముందు చెప్పిన చరమశ్లోకం :

'విఖ్యాతే ధాతువర్షే దివస పరివృఢే కుంభగే కృష్ణపక్షే
తిథ్యాం సప్తమ్యభిఖ్యా యుజి శశిదివసే మైత్రి తారాసమేతే
శ్రీరంగేశాంఘ్రిపద్మే సతత విరచితాశేష కైంకర్యలక్ష్మీ
శ్రీమాన్ రామానుజార్యః (పరమపదగతా వేంకటాద్రిర్యతీంద్రః).

ధాతవర్షం అనగా క్రీ. శ. 1874 కు సరిపోతుంది. తన దివంగతిని గూర్చి తానే చెప్పుకొన్న శ్లోక మిది. మహాభక్తులు, మహిత వాగ్గేయకారుల వలెనే ఈ యోగివర్యుడు కూడా తన చరమకాలం గురించి ముందే తెలిసికొని ఇచ్ఛామరణం పొందిన సిద్ధుడు. అన్నలూరి నారాయణదాసు అను యీయన శిష్యుడు కాబోలు రచించిన 9 కీర్తనలు కూడ పై శ్రీహరి నామకీర్తనలు అను పుస్తకంలో చివర చేర్చారు. వీనిలో మొదటిది శహనా రాగంలో గురుమహారాజయిన వేంకటాద్రి స్వామిని గురించి.

## పరాంకుశదాసు:

భజన సంప్రదాయానికి చెందిన సంకీర్తనములు రచించిన యీ కాలపు వారిలో పరాంకుశదాసు కూడా ప్రసిద్ధుడు. ఇతడు త్యాగరాజుకు, కంచి వేంకటాద్రి స్వామి మున్నగువారికి ఒక 50 ఏళ్ళ తరువాత చెన్నపట్టణం ప్రాంతంలో ఉండినట్లు అతని కీర్తనలనుబట్టి తెలుస్తుంది. ఆ కీర్తనలు పరాంకుశదాసు కీర్తనలు అను పేరుతో వెస్లువార్డ్ కంపెనీ మద్రాసువారు ప్రచురించిన పీచుకాగితపు పుస్తకముగా వెలువడినవి. ఈ పుస్తకంలో మొదటనున్న కొన్ని కీర్తనలలో గురుకుల వర పరాంకుశ పదయుగళం - భజరే యతిరాజం - తిరుమంత్రార్థమును బాగుగ బయలు పరచు శ్రీ పరాంకుశ పదయుగళుని సదా ధ్యానించవే రామానుజ గురుని ధ్యానించవే - నన్ను మరువక బ్రోవు శ్రీమత్పరాంకుశ దివ్యచరణ. మీరే నాగతి - పరకేశవార్యతనూజం శ్రీమత్పరాంకుశ మృదుచరణాబ్జం .... అనే కీర్తనలు పరాంకుశదాసు రచనలే అయివుంటే పదయుగళం, చరణాబ్జం అనే శబ్దాల అర్థస్ఫురణ రామానుజాచార్య గురువరేణ్యుని గురించిన విశేషణములకు సరిపోదు. వైష్ణవ సంప్రదాయంలోని అడిగళ్ అనే తమిళ ప్రయోగం ఈ ప్రయోగాలకు మాతృక అయి ఉండవచ్చు. లేదా ఈ కీర్తనలు పరాంకుశదాసుల శిష్యులెవరైనా ఆయనను గురించి పాడినవి గురువుగారి కీర్తనలతో చేర్చి ఉండవలెను.

ఈయన కీర్తనలన్నీ భక్తిరసాత్మకములై శ్రీరాముని గురించిన ప్రార్థన గీతులు. తెలుగులో ఎక్కువగాను, సంస్కృతంలోను, కొద్దిగా హిందుస్థానీలోను, తమిళంలోను కూడా వున్నాయి యీ కీర్తనలు. ఈయన కీర్తనలకు తెలుగు దేశంలోనే కాక, తమిళ దేశంలో కూడా భక్తకూటాలలో మంచి ప్రచారం ఉన్నది. నిత్యసంకీర్తనములతో శ్రీరాములు సేవ చేస్తూండిన ఈ వాగ్గేయకారునకు తిరువేంగడ తాతాచార్యు లనువారు ఉపదేశగురువు. ఆయనను గురించి, రామానుజాచార్యులను గురించీ కూడా కీర్తనలు చేశా డీయన. ధన్యాసి రాగంలో ఈయన రచించిన - రాముని మినహా భూమిలో వేరొక స్వామియు లేదు సుమా - అనే షడ్భాషా కీర్తనలో తెలుగు, తమిళ, కన్నడము, ఆంగ్లము, మహారాష్ట్రము,

హిందుస్తానీ భాషలు ఆరింటిలోను చరణా లున్నవి. కొన్ని కీర్తనలు - సుజన జీవనా, నన్ను విడచి కదలకురా - వంటి త్యాగరాజాది పూర్వ వాగ్గేయకారుల కీర్తనల మట్టుల ననుసరించి వ్రాసినట్లు ఆ కీర్తనల ముందు సూచింపబడి ఉన్నది. మద్రాసులోని తిరువళ్ళిక్కేణి పార్థసారధి గురించి, రంగనాధుని గురించి కూడా యీతడు చెప్పిన కీర్తన లున్నవి.

ఏ కారణం చేతనో పరాంకుశదాసును పోలీసులు తీసుకొనిపోయి చెర సాలలో పెట్టినపుడు - ఉన్నాడో లేడో నా పాలిట వాడున్నాడో లేడో - అను మధ్యమావతి రాగ కీర్తనను, వారివద్ద కేసులో గెల్చినపుడు - అడియుంగళ్ జయబేరిగె, సమదరి యిల్లాల్ దైవమిల్లై యెన్నుబువియిల్ - అను శంకరాభరణ కీర్తనను రచించాడట. ఇవికాక, పరాంకుశదాసు కీర్తనలలో ఆలయములందు నిత్యోత్సవాదులందు కైంకర్యమున ఉపయోగించే కందార్థాలు, ఆరగింపు పాట, విడెము, శయ్య, పవ్వళింపు, లాలి, జోల, మేలుకొలుపు, మంగళాలు మొదలైన సంకీర్తనములు కూడా కలవు. పట్టాభిరామ స్తోత్రము గల సీస పద్యాలు, రామాయణ సంగ్రహ సీసమాలిక, రఘునాయక స్తోత్రచూర్ణిక పరాంకుశదాసు చేసిన యితర రచనలు.

పరాంకుశదాసు కీర్తనలలోని సాహిత్యం భజనకీర్తనల కుకావలసిన సులభ శైలిలో వున్నది. వ్యాకరణ నిర్దుష్టతను అంతగా పాటించలేదు. సంగీత రచనలో కొన్ని కీర్తనలకే పూర్వ వాగ్గేయకారుల కీర్తనల ననుసరించినట్లు పుస్తకంలో సూచించినా అంతకంటె ఎక్కువగా చాలా కీర్తనలలో అనుసరించి ఉండవచ్చును. ప్రసిద్ధముగా జనరంజకతపొందిన సామాన్యరక్తి రాగాల నన్నిటినీ ఈ కీర్తనల కుపయోగించుకొన్నాడు. ఈ కీర్తనల సంగీతంలో ధాతుకల్పనా దక్షతగాని, విశిష్ట విద్వత్ప్రకర్షగాని ఉంటుందనుకొనకూడదు

## చెయ్యూరి చెంగల్వరాయశాస్త్రి (1810-1900)

చెంగల్వరాయశాస్త్రి అసలు ఇంటిపేరు మార్వెద్దివారు ఇతడు చెంగల్పట్టు జిల్లా పెరుంపేడు గ్రామంలో 1810 వ సంవత్సరంలో జన్మించాడు. సంస్కృతాంధ్ర భాషలలోను, భరతనాట్య సంగీత శాస్త్రములలోను పాండిత్యం సంపాదించాడు. సంస్కృతాంధ్రములలో కవితాశక్తి కలిగి, అనేక కీర్తనలను, పదములను యక్షగానములను పద్యకావ్యములను రచించాడు. పెరియ కాళప్ప అనే చెయ్యూరి జమీందారు ఆహ్వానంపైని ఇతడు స్వగ్రామం వదలి, చెయ్యూరు కాపురానికి వెళ్ళాడు. అందువల్ల ఇతని ఇంటిపేరు మార్వెద్దివా రనేది క్రమంగా మారి చెయ్యూరు వారని వ్యవహారంలోకి వచ్చింది. త్యాగరాజస్వామి యిక

పదేళ్ళకు సిద్ధిపొందుతా రనగా, చెంగల్వరాయశాస్త్రి తన సంగీత, సాహిత్య రచనా వ్యాసంగంలో కొంతపేరు సంపాదింప ప్రారంభించాడు.

చెయ్యూరులోని ఆలయంలో ఇప్పటికీ యితని కీర్తనలను నిత్యోత్సవాలకై పాడుతుంటారు. ఇతడు ప్రతి శనివారమూ భజనలూ, కృత్తికాదినములందు ప్రత్యేక ఉపాసనమూ, సంతర్పణలూ చేస్తూ వుండేవాడు. సంస్కృతంలో కృతులు రచించిన కామకోటిశాస్త్రి, ఝంఝామారుతం సుబ్బయ్యగార్లు యితనికి సమకాలికులు, పరిచితులు.

ఇతడు చెయ్యూరిలోని ముక్తాంబాదేవికి భక్తుడు. బర్హంపురపు మహారాజు ఆహ్వానాన్ని త్రోసిపుచ్చి, చెయ్యూరులోని దైవసన్నిధిని వదలక చివరివరకూ అంటిపెట్టుకొని వుండిపోయాడు: ముద్దుకుమార శతకమును, వేయి కృతులను రచించాడు. వాటిలో 360 కృతులు కంచి కామాక్షమ్మపైనా, 240 మధుర మీనాక్షమ్మపైనా చెప్పినవి నూటికి పైగా వేంకటేశ్వరులపైని చెప్పిన కీర్తనలున్నవి. ఈ కృతులలో మధ్యమకాల సాహిత్యమూ, లలితమైన పలుకు నుడికారమూ, మాధుర్యమూ ప్రధాన లక్షణాలు. ఈయన తమిళంలోకూడా కొన్ని కృతులు రచించాడు. ఈతని పాటలన్నీ ఆశుధారగా పాడినవే అనీ, సాంబమూర్తి శాస్త్రి, కృష్ణమూర్తిశాస్త్రి అను విద్వాంసు లిద్దరు వాటికి మెరుగులు దిద్దినారనీ ఆచార్య సాంబమూర్తిగారు వ్రాశారు.

'అవిరళమగు భక్తి' అనే కళ్యాణి రాగకీర్తనలోను, దర్బారీ రాగంలోని 'ఎంతవేడినగాని' అనే కీర్తనలోను, యదుకుల కాంభోజిలోని, 'లలితే మాం పాహి దయ - అనే కీర్తనలోను సంగీతం ధారాప్రవాహిగా సాగుతూ, భక్తిరసం చిప్పిల్లుతూ ఉంటుంది. బిళహరిరాగంలో 'నీరు చిమరిగినరసన' అనే పాట సరస మధురంగ వుంటుంది. పూర్ణచంద్రిక ఇమన్ కళ్యాణివంటి ప్రౌఢమైన రాగాలలో అంత్యప్రాస, అనుప్రాస, యమకాదులతో కొన్ని సులభకీర్తనలను, కొన్ని క్లిష్టమైన కీర్తనలను దేవాలయ నిత్యోత్సవ కీర్తనలను కొన్ని పెండ్లి పాటలనుకూడ రచించారు.

కృతులు, శబ్దములు, సుందరేశ్వర విలాసమనే తెలుగు యక్షగానమూ, చారులీలా విలాస మను తెలుగు పద్యప్రబంధాలు రచించిన చెంగల్రాయశాస్త్రి చిత్ర కవిత్వములోను, బంధకవితా రీతులలోను కూడ బహు నమర్థుడు. చెయ్యూరిలోని కందస్వామి ఆలయంలో అక్కడి సామాన్య ప్రజలకు ఆకర్షణీయంగా తమిళ సంభాషణలతోను తెలుగు దరువులతోను వల్లీనాటక యక్షగానాన్ని మెరుగులు దిద్ది కూర్చి ఉత్సవ సమయాలలో ప్రదర్శించేటట్లు చేసిన వాడీయనే. ఈతని కృతులలో స్వనామముద్ర - కనిపిస్తూంటుంది. ఇతడు 90 ఏళ్ళు జీవించి 1900 వ సంవత్సరంలో కీర్తిశేషుడైనాడు.

**ఇతడు రచించిన శుద్ధ స్వరాక్షర కందపద్యాలు :**

సామపన గరిమ పసగని గామ నిదని గానిమగని గదనిరిగదా
సీమ మమరి సరిపగని పామరి పగమాని గాని పనిగాదనిదా....
సీమ మమరి సరి పనిగని పామరి పగమానిగాని పనిగాదనిదా....

సుందరేశ్వర విలాసంలోని కొన్ని దరువులు· (మీనాక్షీదేవి సుందరేశ్వరుల శృంగారవిలాసము ఇందు వర్ణితము. మీనాక్షీదేవి దిగంతములకు జైత్రయాత్రకై వెడలినప్పటి దరువు).

భైరవి – ఆది :

దిగంతములు జయింప మీనాక్షీదేవి వెడలె జూడరె చెలులార
ధగద్ధగిత కేతనము వెలుంగను జగంబులకును సుఖంబు లొసంగను...
శూలచక్ర పరశు క్షురిక ముఖాభీల నిశిత కరవాలము లమరగ
స్త్రీలు కొంద రుభయభాగంబుల మేలమాడ పరమేశ్వరి శంకరి....

పరమేశ్వరి యుద్ధయాత్రకూ, రౌద్రరస పోషణకూ అనుగుణమైన ఉదాత్త భావముల తో, భావానుగుణమైన మాటలతో ఈ దరువు రచన ఎంతో మనోజ్ఞంగా సాగింది.

సిద్ధేంద్రయోగి విరచితమైన భామాకలాపంలోని శకునముల పాటను జ్ఞాపకము చేసే దరువు ఈ యక్షగానంలో కూడా ఉంది : 'మంచి శకునములాయె నమ్మ' అని ఆనందభైరవి రాగం. ఆదితాళంలో సాగింది. ఆంధ్ర భాగవతంలో గోపికలు కృష్ణుని అన్వేషించు ఘట్టాన్ని పోలిన శోకవరాళి రాగంలో మీనాక్షీదేవి శివుని వెదకేటప్పటి దరువు :

దరువు : ఎందు వెతకి చూతు నే నేమిసేతు. మా
కంద తరులార వాని కనులజూపరె....

చందమామ పదం :

ఇందీవరాక్షుల నెందుకు యేచేవు చందమామా – అల్ల
కందర్పునకు జోడు చెందినవాడవె చందమామా
ఉర్విని పాంథుల ఉసురుపోసుకొనేవు చందమామా
పర్వదినంబుల పాము మ్రింగును నిన్ను చందమామా

గౌళిపంతు :

రొదలు వలదె తుమ్మెదలారా మీ సదయుడు లేడని సరగున నను గని
వదరుచు మీరు పూలపొదలు దూరేరు...
కూయవలదె కోకిలలారా మీరు మాయురె మీ కిది మంచిసమయమని
వేయి విధములుగ విచ్చలవిడిగను...

ఆడకురె మయూరములారా, మీరు నేడు జూడ ప్రాణేశ్వరుకౌగిట
జోడుగూడి మీ పోడిమ నణచెద.

తోడి :

కోపములు తీరెనా, మీ యిద్దరి కోరిక లీడేరెనా...
ఆపరాని విరహము దరిజేరెనా అందర మొకటి యౌనటుల చేకూరెనా....
కలనైన వల దంటిరె యీలాగున తొలుతటి ఫల మంటిరె
లలనలు జేసినారని యాడుకొంటిరె చెలులవల్ల వచ్చిన తప్పు కంటిరె...
శ్రీ సుందరేశ్వరుని మీనాక్షిని మించి తమ లోకటాయెనా
వాసన లెనసి చెల్వాలరు పానుపుపైని ఆసనేలిన జాడ లదిగో కానబడె మీ...

సంగీతశిల్పానికి దీటుపోని కవితాశిల్పంతో ఈ యుగంలో ఈలాటి దరువులు వ్రాసిన వారిలో పల్లవి దొరసామయ్యను తప్పి స్తే, చెంగల్రాయశాస్త్రికి మరెవ్వరూ సాటిరారని చెప్పడానికే ఈ దరువులను ఉదహరించాము.

## తూము నరసింహదాసు :

రామదాసును గురించి చెప్పుకొన్న అధ్యాయంలో గుంటూరునుంచి దేశయాత్ర చేసుకొంటూ భద్రాచలం వెళ్ళి, అక్కడ శ్రీరామచంద్రమూర్తికి కైంకర్యములు చేయించిన రాజా తూము నరసింహదాసను వాగ్గేయకారునిగురించి చూచాయగా చెప్పుకొన్నాము. అచ్చయ మంత్రి, వెంకమ్మ అనువారు ఈయన తలిదండ్రులు. గుంటూరు వాస్తవ్యులు. ఈయన త్యాగరాజస్వామికి సమకాలికుడు. ఆంధ్ర సంస్కృత సాహిత్యములలోను, సంగీతంలోను పాండిత్యం సంపాదించిన యీతడు గుంటూరులో డివిజన్ కొలువులో లౌకికోద్యోగియై ఉన్నా, పారమార్థిక చింతతో భద్రాచల సీతారాములయెడ భక్తి కలిగి, భక్తి ప్రబోధకములైన భజన కీర్తన లెన్నో రచించాడు. ఈ కీర్తనలలో రామభక్తి, పరమార్థ చింతా, వేదాంత తత్త్వమూ కలవు మాత్రమేకాక, సీతారాములకు భక్తితో, సంకీర్తన కైంకర్యమున కుపయోగించు ఉత్సవ సంప్రదాయ కృతులైన మేలు కొలుపులు, హెచ్చరికలు, లాలి పాటలు మంగళారతులు కూడా ఉన్నవి. ఈ కీర్తనలు ఆంధ్రదేశ మంతటా భజన కూటములవారి నోళ్ళలోను, ఆ సాంప్రదాయముగల యిళ్లలోను, చిరకాలం నుంచి వినబడుతూ ఉన్నవే.

1. సౌరాష్ట్రం — భజనచేసే విధము తెలియండి. జనులార మీరు
   నిజము గనుకొని మోదమందండి.
2. మధ్యమావతి — రామనామామృతమే నీకు రక్షకం బనుకోవే మనసా
3. ఎరుకుల కాంభోజి — ఎందుకే యీ వట్టి బాధలు - నీ కెందుకే....
   ఎందుకే బాధలజెందుచు నుండెద వందముగా ముకుంద వరదయనవు....

4. " — సెలవా మాకిక సెలవా రామయ్యా
సెలవా మాకిక శరణాగతవరభరణా భవతరణారామయ్యా

5. యమునా కళ్యాణి — కావేటిరంగా నను గావవేరా
కావేటిరంగ నను గావుమనుచు వేడ
రా వేమిసేతురా రాకుమార....

6. తోడి — వందన మిదె శ్రీరంగా.

7. యెరుకులకాంభోజి — కరుణ యేదిరా రంగయ్యా

8. రేగుప్తి — రంగని సేవింపగలిగె నమ్మా

9. శహన — వరదుని గంటినీ - కంచి వరదుని గంటినీ....

10. రీతిగౌళ — రామసహాయ మెన్నటికో

11. కానడ — చెలియా శ్రీరామచంద్రుని సేవజేతామా

నరసింహదాసు సకుటుంబంగా, భక్తులైన మిత్రబృందముతోసహా దక్షిణ దేశంలోని పుణ్యక్షేత్రములన్నీ యాత్రచేస్తూ, శ్రీరంగమూ, కంచీ దర్శించి, అక్కడి దేవుళ్ళపై కీర్తనలు పాడెను. చెన్నపట్టణం వచ్చి, పార్థసారథిస్వామిని దర్శించి. అప్పుడు తిరువొత్త్యూరులో వీణ కుప్పయ్యగారింటిలో బసచేసిన త్యాగరాజస్వామిని దర్శించి ఆయన సంకీర్తనములను విని, అద్భుతానంద పరవశుడై తాను ఆయన ఘనతను ప్రశంసిస్తూ పద్యములు చదివాడట. అక్కడ నుంచి నెల్లూరువెళ్ళి రంగనాథుని సేవించి ఆ తర్వాత వరద రామదాసను మరొక భక్త వాగ్గేయకారుని తోడుచేసుకొని భద్రాచలం వెళ్ళాడు. అక్కడ కొన్నాళ్ళు స్థిరనివాసం ఏర్పరచుకొని, సీతారాములపైని నిత్యోత్సవ సంకీర్తనములు రచించి పాడుతూండేవారు. అప్పటి నైజామును కలిసికొని, అదివరకు గోపన్నగారు తానీషావారి సమ్మతిపైని భద్రాచలరాముల నిత్య కైంకర్యానికై యిచ్చిన దాన శాసనము దుష్టులెవరో చెక్కివేసినదానిని తిరిగి వ్రాయించి, నైజాముచేత తిరిగి రాములవారికి కైంకర్యములకు నిత్యోత్సవములకుగాను వార్షికములు ఏర్పాటు చేయించారు నరసింహదాసుగారును, వరద రామదాసుగారును చాలకాలం భద్రాచలంలో ఉండి నిత్య సంకీర్తనముతో రాములవారిని సేవించుకొని, అక్కడే రాములవారిలో ఐక్యం పొందారని, తూము నరసింహదాసు చరిత్ర అనే హరికథ వల్ల మనకు తెలుస్తోంది. ఇందులో చాల సంకీర్తనములు నరసింహదాసుల రచనలే. తూము నరసింహదాస అనిముద్ర. ఆ కీర్తనలలో కనిపిస్తూంది. నరసింహదాసుగారి సహచరులైన వరద రామదాసుగారు కంచివాస్తవ్యులు - రామాంకితంగాను వరదరాజాంకితంగాను భక్తి కీర్తనలు వ్రాసినవారు. రామదాసును గురించిన అధ్యాయములోను, త్యాగరాజును గురించిన అధ్యాయములోను నరసింహదాసుగారిని గురించి యిదివరకు చదివే ఉంటారు.

## మద్దిరాల వేంకటరాయకవి :

ఒక్కొక్క పుణ్యక్షేత్రంలో వెలసిన ఆరాధ్య దైవానికి అంకితములుగా అనేక కీర్తనలను. నిత్యోత్సవాది సందర్భములకై రచించి, భక్తి చోదితులైన వాగ్గేయకారులు, తమ జీవితమునే ఆ దైవమునకు అంకితముగా చేసివేస్తూ వచ్చారని ఇంతవరకు ఈ అధ్యాయంలో శ్యామాశాస్త్రుల విషయములోను, ఇంతకు ముందే చెంగల్వరాయశాస్త్రి కంచి వేంకటాద్రిస్వామి, తూము నరసింహదాసుల విషయంలోను తెలుసుకొన్నాము. నరసింహదాసు చరిత్ర పరిశీలనకోసం మనం కొంతకాలంపాటు సంచరించిన దక్షిణదేశం విడిచి ఆంధ్రదేశం చేరుకొన్నాము. తూర్పుగోదావరి జిల్లాలోని పిఠాపురం అతిప్రాచీనమూ చరిత్ర ప్రసిద్ధమూ అయిన ఊరు. ఈ ఊరికి మూలదైవము కుక్కుటేశ్వరస్వామి రాజరాజేశ్వరీదేవి ఆయన దేవేరి. ప్రసిద్ధ వాగ్గేయకార చక్రవర్తియైన త్యాగరాజుకు సరాసరి సమకాలికుడై పిఠాపురంలో వెలసిన కుక్కుటేశ్వరస్వామి పద సమారాధన తత్పరుడై నిత్య సంకీర్తన సేవలో జీవితము గడపిన వాగ్గేయకారుడు మద్దిరాల వేంకటరాయకవి. ఈ వేంకటరాయకవి కుక్కుటేశ్వర రాజరాజేశ్వరీ దేవుల శృంగార కలాపమును కీర్తనాత్మకముగా 'ఏకాంత సేవా విలాస' మను పేర రచించినాడు. ఈ గ్రంథపు పీఠికలో కీర్తిశేషులు విమర్శ్యావర్శకులు నడకుదుటి వీరరాజు పంతులుగారు. మద్దిరాల వేంకటరాయకవి కీ. శే. 1850 ప్రాంతంలో పరమపదించినట్లు అనేక ఉపపత్తుల మూలంగా నిర్ధారణగా వ్రాసినారు. త్యాగరాజు 1847 లో సిద్ధిపొందెను.

కుక్కుటేశ్వరభక్తుడై, సంకీర్తనపరుడై కాలక్షేపంచేస్తూ ఉండిన వేంకటరాయడు దారిద్ర్యంతో కాలంగడుపుతూ ఉండేవాడు. ఒకసారి తండ్రి ఆబ్ధికానికి చేత కాసైనా లేకపోగా జపమాలికయైన స్ఫటికపు తావళాన్ని పిఠాపురంలోని కంచెర్ల కృష్ణయ్య అనే శ్రేష్ఠిగారివద్ద రెండు రూపాయలకు తాకట్టుపెట్టి. పితృకార్యం నెరవేర్చాడు. గ్రామంలోవుండి ఈశ్వరార్చన చేసేకన్న అడవులకుపోయి అక్కడే తపస్సు చేసుకొంటే ఆర్థికబాధ లుండవని తోచి, మధ్యాహ్నపు వేసవి కాలపు ఎండలో పడి పిఠాపురానికి ఉత్తరానఉన్న అగ్రహారం దాటి వెడుతూండే సరికి వడగొట్టి, మొగము తిరిగినట్లయి, అక్కడున్న ఒక మర్రిచెట్టు నీడను అంగవస్త్రం పరచుకొని పడుకొన్నాడట. అక్కడ నిద్రపట్టి స్వప్నంలో అతనికి కుక్కుటేశ్వరుడు కనపడి 'ఏదీ, ఆకుమడుపులు పంపెరా' అనే దరువు పాడమని అడుగగా–వేంకటరాయడు 'స్వామీ, జపమాలికను తాకట్టు పెట్టుకొనునంతటి దరిద్రుడను. నా కంతటి ఆనంద మెక్కడిది' అన్నాడట. అప్పుడు స్వామి 'దానికి తగిన యేర్పాట్లు చేశానులే – పాట పాడు' అన్నాడట. అప్పుడతడు మేల్కొని నిద్రవలన ఆకలీ, వడశోషా తగ్గి తేరుకొని, పాట పాడుతూ

ఉండేసరికి భేరీ కాహళ వాద్యాలతో కోలాహలంతో కొందరు జనం తనవైపే వస్తూ కనిపించారట.

పిఠాపురంలో ఇతని జపమాలికను తాకట్టుకు తీసుకున్న క. చెర్ల కృష్ణయ్యకు మధ్యాహ్నం భోజనానంతరం నిద్రలో కుక్కుటేశ్వరుడు స్వప్నదర్శనమిచ్చి. 'ఓయీ మద్దిరాల వెంకటరాయుడుగారి జపమాలికనూ, కొంతసొమ్మునూ తీసుకుపోయి, అగ్రహారపు మర్రిచెట్టుకిందనున్న ఆయనకిచ్చి. ఊరికి తోడ్కొని' రమ్మని చెప్పినట్లు తోచిందట. దేవుడే తనకు సాక్షాత్కరించినందుకు పరమానంద భరితుడై పోయిన శ్రేష్ఠి వెండి పళ్ళెంలో తాంబూల కర్పూరములు, జపమాలిక, కొన్ని వరహాలూ, ఉంచి, ఊరి పెద్దలు కొందరు వెంటరాగా మేళతాళలతో ఆ మర్రిచెటు వద్దకు వచ్చిన సంరంభమే వేంకటరాయుడు పాటపాడుతున్నప్పుడు కనిపించినది. మహేశ్వరుని కరుణను కొనియాడుతూ, ఆ వాగ్గేయకారుడు, తన జపమాలికను తీసుకొని, స్వగ్రామము చేరుకొని ఇతోధిక భక్తితో సంకీర్తనములు చేస్తూ కాలము గడిపాడట.

ఆ కాలంలో పిఠాపురాన్ని పరిపాలిస్తుండిన నీలాద్రిరాయ ప్రభువు వేంకట రాయుడుగారిని పిలిపించి 'అయ్యా, మీరు ఎప్పుడును కుక్కుటేశ్వరునికాని మాధవ స్వామిని స్తుతింపరా' అని అడిగినాడట. ఆ ఊరిలో కుంతీ మాధస్వామి ఆలయం కూడా ఉన్నది. అందుకు ప్రత్యుత్తరముగా ఆయన

హరియనగ హరుడనగ నరయ భేదములేదు....
పరమతేజంబిటుల ప్రసరించె మనసా....
పరమభక్తి జ్ఞాన పారవశ్యానంద
పరతనుండిన ముక్తి కరతలామలకమగు....
వింతగను పీఠపురి వెలసి వేంకటరాయ స్వాంతాబ్జకర్ణికయె సదనమైయున్న
కుంతిమాధవుడితడు కుక్కుటేశుండితడు శాంతేడితడు
పరమసంతోష దతడూ....

అని రేగుప్తి రాగంలో పాడినాడట.

ఈయన ఏకాంతసేవా విలాసము- ధూపసేవా కీర్తనలు, ఏకాంత సేవ, భజన కీర్తనలు అని మూడు భాగములుగా వున్నది. ఇది కేవల భక్తిరస ప్రధానము. ఏకాంతసేవా భాగాన మాత్రము శృంగార హాస్యరసములను చూపి, దానిని యక్షగాన నాటక ఫక్కీలో రచించాడు. మిగిలినవన్నీ విడివిడి కీర్తనలే

ఏకాంతసేవా భాగంలో పార్వతీ పరమేశ్వరులు నాయికా నాయకులు. నాయకుడు వాహ్యాళికి వెడతాడు. నాయిక విరహభారము సైపలేక నాయకుని

లోపతెమ్మని చెలికత్తెను పంపుతుంది. రాయబారము ఫలితముగా శివుడు గౌరి కడకు వస్తాడు. చెలులాయనకు ఆరతులెత్తి స్వాగత మిస్తారు. గాని, గౌరి కోపించి, వాసగృహద్వారం బంధిస్తుంది. అక్కడ తలుపు దగ్గరి సంవాదగీతులు, ఆ తరువాత గంగా గౌరుల సవతుల కయ్యము. సమాధానపడుట దేవ దేవేరులకు దేవతాకాంతల జోలపాటలు, లాలిపాటలు, ఆరాత్రికములు, శోభనపు పాటలు, పరాకులు, హెచ్చరికెలు.

మదిరాల వేంకటరాయ కవి గ్రంథము యింకా బయటపడకముందే, ఈ వాగ్గేయకార చరిత్ర గ్రంథకర్త తండ్రిగారగు బాలంత్రపు వేంకటరావుగారును, వోలేటి పార్వతీశముగారును, వేంకట పార్వతీశ్వర కవులను ప్రసిద్ధ నామముతో ఏకాంతిసేవ అను ఆధునిక కావ్యమును మంజరీ ద్విపదలతో గీత పద్యములతో రచించారు. అందులో భక్తుడైన కవి నాయికగాను, నిర్గుణ పరబ్రహ్మరూపుడైన పరమాత్మ ఆ నాయికకు హృదయేశ్వరుడయిన నాయకుడు.

ఏకాంతసేవా విలాస గ్రంథములోని 'పూర్ణచిదానంద యోగిరే' అను కొన్ని కీర్తనలనుబట్టి వేంకటరాయకవి మంత్రశాస్త్ర యోగశాస్త్రాదులు బాగుగా తెలిసిన తత్త్వజ్ఞాని అని తెలుస్తుంది ఈ గ్రంథంలో తెలుగు కీర్తనలు దరువులు మాత్రమేకాక, దివ్యనామ సంకీర్తనములు, అనేక సంస్కృత కీర్తనలు, శ్లోకములు కలవు. వీనిలో నామగోపన కీర్తనమొకటి, అకారాదిగా వర్ణక్రమాద్యక్షరములు వచ్చే చరణాలుగల కీర్తన మొకటి కూడా ఉన్నవి.

మర్రిచెట్టుక్రింద స్వప్నంలో శివుడు పాడమని కోరెనన్న పాట :

> ఆకు మడుప్పులు పంపెరా యివె అందుకొమ్మిటు చూడు, నీ
> రాకకే యెదురాచు నున్నది రాజసంబున బ్రోవరా
> శ్రీకరంబగు నింటికిన్ దయసేయరా తడవాయెరా
> ప్రాకటంబుగ కుక్కుటేశ్వర భామ నిన్ పిలిచిందిరా....

తలుపు దగ్గిరి సంవాద గేయం :

శి. వరమణి కనకోజ్జ్వలమైన కవాటముదీయవె గౌరీ – కవాటముదీయవె గౌరీ

పా. త్వరితంబేటికి ఏ చెలి యింటికి సరిగితి దెల్పగదోయీ....
శివ అరిగితి దెల్పగదోయీ ...

శి. సరసజనయనా భక్తుల యిండ్లకు జరిగితినే ఓ గౌరీ.... ॥నే జరి॥

పా. పురుషుల యిండ్లకు నరిగిన కుంకుమ బొట్టంటినదేమోయీ....॥కుం॥

శి. చిరతరముగ నా నిటలమునంటెకి శిఖిలోచనమే గౌరీ – అది....॥శిఖి॥

సవతుల కయ్యము (గంగా – గౌరీ సంవాదం) :

గం. నాకంటే నీ వెక్కువే కుక్కచేతుల జేకొనగా గౌరూ....
గౌ. ఆకాశముననుండి యూడిపడట్లు నీ వాడావచ్చెదు గంగా
గం. ఆ కాశిలోన తెడ్డాడించుకొని తిరిగి నానాటవే గౌరూ...
గౌ. పోకిళ్ల బోకు నీ పొంగు నివారింతు పోపోవె ఓ గంగా...

.... ... ...

సవతుల సమాధానము :

గం. ఆటాక త్తెవు నీవు గౌరు
చౌ. వేల్పుటాటక త్తెవు నీవు గంగా
గం. కోపించ లోకులు నవ్వారె, గోరు
గౌ. నా పంచాజేర నీవెవ్వారె గంగా....
గం. పోరెందుకే మనకు గౌరు – చాల
గౌ. నోరుంటె తలగాచు గంగా....
గం. కలసి యుందము మనము గౌరు –
గౌ. మిక్కి బలసినదానవె గంగా

ఈ కీర్తనలు కొన్నిటిని పిఠాపురంలోని నేటి ఆలయ అర్చకులలో కొందరూ ఆ ఊరి కళావంతులు కొందరూ పాడగలరట.

## ఉత్తరాంధ్రంలోని ఇతర వాగ్గేయకారులు :

గుంటూరుజిల్లాలో జన్మించి భద్రాచలంలో స్థిరపడిన తూము నరసింహ దాసులను గురించీ, పీఠికాపుర వాస్తవ్యులయిన మద్దిరాల వేంకటరాయని గురించీ తెలిసికొన్నాము. వీరు సులభమైన ధాతుకల్పనలలో సంకీర్తన శైలి కనువైన గోష్ఠిగానముల కుపయోగించు సంగీత రచనలను చేసినవారేగాని, సంగీత విద్వత్ప్రదర్శనకై గాని ఎక్కువ ప్రయత్నించినవారుకారు త్యాగరాజుకు సమకాలంలో గాని, అంతకు కించిత్పూర్వంగాని ఉత్తరాంధ్ర దేశంలో సంగీత విద్వాంసులు ఏ వాగ్గేయకారుల రచనలను పాడేవారు ? వారి విద్వత్ప్రకర్ష ఏ మార్గముల సాగేది – అనే ప్రశ్నలు పుట్టడం సహజం. శ్యామశాస్త్రులతో తంజావూరులో వాదానికి ఢీకొన్న భూలోకచాపచుట్టి బొబ్బిలి కేశవయ్య తంజావూరు విద్వాంసు లందరికీ హడలు పుట్టించి, శ్యామాశాస్త్రి లంతటి ప్రౌఢ విద్వాంసునిచేత కూడా విభావిజయంకోసం ప్రత్యేక శ్రద్ధాభక్తులతో దేవీపూజ చేయించినంతటి ప్రతిభా శాలి. తంజావూరు గొప్పతనమును శ్యామాశాస్త్రిల విజయమును యెక్కువ చేయ డానికి నేటి దాక్షిణాత్య సంగీత చరిత్రకారులు ఉత్తరాంధ్ర దేశీయుడైన బొబ్బిలి కేశవయ్యను డాంబికత్వ అట్టహాసములు గల నరకాసురునితో పోల్చారు గాని,

బొబ్బిలి కేశవయ్య సామాన్య విద్వాంసుడు కాదని, త్యాగరాజస్వామి వంటి వారితోటి వివాదంలో సింహనందనం వంటి అపురూప తాళాలలో పల్లవి నెత్తుకొనుటనుబట్టి, ఇతర జతిస్వరవర్ణ గానములను అలవోకగా చెప్పుటనుబట్టి మహా ప్రజ్ఞాశాలియైన గాయకుడనీ మనకు తేటతెల్లమవుతోంది.

అంటే, ఆనాటి బొబ్బిలి, విజయనగరం, పిఠాపురం, మాడుగులవంటి సంస్థానములలోని ప్రభువులు సాహిత్య సంగీత విద్వాంసులను పోషించడమేకాక, వారి విద్వత్తుకు తగిన బిరుదాది గౌరవ సన్మానములతో వారిని దేశములలోని ఇతర రాజాస్థానములకు జైత్రయాత్రలకు ప్రోత్సహించి పంపుతూ వుండేవారనుట స్పష్టము. త్యాగరాజాదుల కృతులు తచ్చూరి సింగరాచార్యులవంటి విద్వాంసుల ద్వారా ఉత్తరాంధ్రదేశానికి రాకపూర్వం- ఇక్కడి సంస్థానములలో ఉండే విద్వాంసులు రచించిన వర్ణములు, స్వరజతులు ఇతర సంగీత రచనలు ఇతర ప్రబంధాలు సభలలో గానం చేయబడుతూ ఉండేవి.

ఉత్తర సర్కారులలో సాహిత్య కళాపోషణ చేస్తూ ఉండిన జమీందారీలలో విజయనగరం ప్రధానమైంది. విద్వత్ప్రభువుల పోషణలో ఉంటూ ఉన్నందున దీనికి విద్యలనగరం అని కూడా వాడుక ఉండేది. 18 వ శతాబ్ది చివరి దశకంలో ఈ రాజ్యాన్ని పూసపాటి నారాయణగజపతి మహారాజూ, ఆయన తర్వాత విజయరామగజపతి. 19 వ శతాబ్దంలో ఆనందగజపతి మహారాజూ సాహిత్య సంగీతాది సర్వ కళలనూ పోషించినవారు. వారి పోషితులలో మహావిద్వాంసులైన కొందరు వాగ్గేయకారుల చరిత్ర మిక్కిలి మనకు ప్రసక్త విషయము. ఈ క్రింది విషయములు ఆచార్య విస్సా అప్పారావుగారి సంపాదకత్వంలో వెలువడిన త్యాగరాజ శతవార్షికోత్సవ సంచికవల్ల తెలిసినవి.

## వీణ పెదగురాచార్యులు :

ఈయన 1794 లో జన్మించి త్యాగరాజుస్వామికంటే 27 ఏళ్లు చిన్నవాడైనా, ఆయనకంటె 20 ఏళ్లు ముందే 1822 లో పరమపదించారు. త్యాగయ్యగారు తీర్థాటనము చేసినప్పుడు ఈ పెదగురాచార్యులవారితోను, బొబ్బిలి కేశవయ్యగారితోను విద్యాగోష్ఠి సల్పినారట. ఈ ఆచార్యులవారు విజయనగరం, మాడుగుల, తిరువాన్కూరు ప్రభువుల ఆదరణముపొంది, వారి కంకితంగా చాలా గీతములు, తానవర్ణాలు, తిల్లానాలు, స్వరపల్లవులు, శృంగారపదములు కోణుగోలు శబ్దములు, జక్కిణీ దరువులు (యక్షగాన దరువులు) సలాముదర్వులు, అనేక కీర్తనలు వర్ణమెట్లూ తయారుచేశారట. ఈయనను గౌరవించిన మాడుగుల రాజు కృష్ణభూపతిదేవు; విజయనగరాన్ని ఏలిన నారాయణ గజపతికి అంకితంగా ఈయన ఎన్నో సంగీత రచనలను చేశారు త్యాగయ్యగారి కృతులు ప్రచారంలోకి రాక

పూర్వం పెదగురాచార్యులుగారు, వాసా సాంబయ్యగారు, కృష్ణమూర్తిగారు, శిష్టు సర్వయ్యశాస్త్రిగారు మొదలైనవారి కృతులు. జయదేవాష్టపదులు, నారాయణ తీర్థులవారి తరంగాలు ఉత్తరాంధ్రదేశంలోని సంగీత విద్వద్గోష్ఠులలో ప్రచారంలో ఉండేవి. విజయనగర విద్వాంసులలో వీరు అగ్రగణ్యులని ప్రసిద్ధి పొందారు. అముద్రితములైన వీరి రచనలు విజయనగరంలోని వీరి వంశపు వారివద్ద నేటికిని కలవట.

## దూర్వాసుల సూర్యనారాయణ సోమయాజులుగారు :

1842 నుంచి 1896 వరకు విజయనగరంలో జీవించిన వాగ్గేయకారులు. విజయరామగజపతి మహారాజు పైని 20 గీతాలు. 15 స్వరజతులు రచించారు, ఈ మహారాజు తన ఆస్థాన విద్వాంసులయిన యీ సోమయాజులుగారినీ, వీణ వెంకటరమణ దాసుగారినీ, తన కుమారుడైన ఆనందగజపతి యువరాజులుంగారినీ వెంటబెట్టుకొని దక్షిణాదిని మదరాసూ, ఉత్తరాన కాశీ, కలకత్తా మొదలయిన ప్రదేశాలకుపోయి అక్కడ కొన్నినెలలు ఆగుతూ, ఆ యా హిందూస్థానీ, కర్ణాటక సంగీత మర్యాదలను తెలుసుకొని, తమ విద్వాంసులకు తెలియజేసేవారు. తండ్రి కోరికపైని ఆనందగజపతి కూడా వీణావాయిద్యంలో ప్రజ్ఞావంతుడై, సంస్కృతాంధ్రములలో కృతులనురచించారు. ఈయనస్వరమేసాహిత్యంగాను సాహిత్యమే స్వరంగానుండునుదే స్వరాక్షలకందము నొకదానిని భైరవిరాగంలో రచించారు. ఈ మహారాజుగారి సంగీతశిక్షణ దూర్వాసుల సూర్యనారాయణ సోమయారాజులుగారి వద్దనే. ఈ సోమయాజులుగారు తమ తండ్రియైన దూర్వాసుల వెంకటరెడ్డి శాస్త్రులవారి వద్ద సంగీత సాహిత్యాలను అభ్యసించారు. ఆనంద గజపతిరాజుకు అంకితముగా స్వరజతులను, పదాలను. జావళీలను రచించారు. 1. ఇటు చూడరా- ముఖారి; 2. నెంనమ్మినాను - మోహన; 3. ఎందుకీ తొందర - ఆనందభైరవి : మొదలైనవి. ఈయన 72 మేళకర్త రాగాలలోను పూసపాటిరాజుల చారిత్రక విజయాలను, వీరగాథలను వర్ణిస్తూ కీర్తనలు రచించారు. ఈయన వీణపై షట్కాలతాళమును, జోడుమీటు, తడమీటు, మట్టుమీటు, గారతానాలు, కటకంతానాలు మొదలైన 21 జాతుల తానాలను వాయించగలిగిన ప్రజ్ఞావంతులట ఈయన కర్ణాటక హిందూస్థానీ సంగీత రీతులలోనేకాక పాశ్చాత్యరీతులలో కూడ ప్రజ్ఞ సంపాదించి పైస్రాయి ఎల్జిన్ ప్రభువును కూడా మెప్పించారట. వీరి కాలం వరకు మన ఆంధ్రదేశంలోని సంగీత విద్వత్సభలలో పెద గురాచార్యుల రచనలూ ఇంకా యితర స్థానిక వాగ్గేయకారుల రచనలూ ప్రచారంలో ఉండేవి. మహారాజుతో దేశ యాత్రలు చేసిన సోమయాజులుగారి ద్వారా, మన దేశంలోకి త్యాగరాజ కృతులు, దీక్షిత, శ్యామశాస్త్రుల కృతులు, పట్నం సుబ్రహ్మణ్యయ్యగారి రచనలు - వ్యవహారంలోకి వచ్చాయి.

## వీణ గురురాయాచార్యుల వెంకటరమణదాసు :

1884 లో జన్మించిన వీరు 90 ఏండ్లకు పైగా జీవించారు. పైన చెప్పు కొన్న పెద గురాచార్యులు దత్తపుత్రుడూ, సంగీత విద్వాంసుడూ అయిన సీతా రామప్పగారి కుమారుడు చిన గురాచార్లుగారు. ఆ చిన గురాచార్యులుగారి మూడవ కుమారుడు వెంకటరమణదాసుగారు. వీణావాదనములో నూతన మార్గములను కనిపెట్టిన యీ మహా విద్వాంసుడు మైసూరు, బరోడా సంస్థానాలలో సన్మానితు లయిరి. తానము, పల్లవి గానంచేయుటలో ప్రసిద్ధులు.

## వాసావారు : తుమరాడవారు :

బొబ్బిలి సంస్థానంలో ఉండిన వాసా దాసన్నగారూ, మాడుగుల సంస్థానం లోని అప్పయ్యగారూ, సాంబయ్యగారూ, కలిగొట్ల కామరాజు పంతులుగారు, శిష్టు సర్వయ్యశాస్త్రిలు, కృష్ణమూర్తిగార్లు, బొబ్బిలి, పిఠాపురం సంస్థానాలలో ఉండిన నందిగామ వేంకన్నగారు, తుమరాడ సంగమేశ్వరశాస్త్రిగారు 19 వ శతాబ్దంనుంచి 20 వ శతాబ్ది తొలికాలువరకూ వెలసిన వాగ్గేయకారులు. అముద్రితాలైన వారి రచనలను గురించి అంతగా తెలియదు. దాసు శ్రీరాములుగారు రచించిన కొన్ని జావళీలకు పదాలకు సంగమేశ్వరశాస్త్రిగారు స్వరరచనలను చేకూర్చినట్లు ద్వారం వెంకటస్వామినాయుడుగారివల్ల మాకు తెలియవచ్చింది.

## తచ్చూరి పెదసింగరాచార్యులు, చిన సింగరాచార్యులు :

వీరిద్దరు అన్నదమ్ములు. కాపురస్థలము చెన్నపట్టణమే ఐనా వీరు ఆజీవితాంతం విజయనగరపు ఆనందగజపతి మహారాజుగారి ఆస్థాన విద్వాం సులుగా ఎన్నిక గన్నవారు. పెద్ద సింగరాచార్యులుగారు, అళహసింగరాచార్యులు గారు ఇద్దరూ ప్రసిద్ధ వాగ్గేయకారులు. పెద్దసింగరాచార్యులుగారిని గురించి సుబ్బరామదీక్షితులవారు తమ సమకాలికులయిన ప్రసిద్ధ వాగ్గేయకారులుగా ప్రశం సించారు. తోడి, భైరవి, కాంభోజి, శంకరాభరణము, కళ్యాణి, బిలహరి, నాటకురంజి, ఆనందభైరవి మొదలైన రాగాలలో 50 కి పైగా సింగరాచార్యుల వారి భక్తిరసాత్మకమైన కీర్తనలూ, చాలా జావళీలూ. తరువాత వెలువడిన కొన్ని సంగీత గ్రంథాలలో కనిపిస్తున్నాయి. మద్రాసు తిరువళిక్కేణి నివాసులయిన వైణికోత్తములు రామానుజాచార్యులుగారు సమకూర్చిన సంగీత సర్వార్థ సార సంగ్రహమనే గ్రంథం, అనేక శాస్త్రీయ విషయాలతోనూ, వివిధ వాగ్గేయకారుల సంగీత రచనల ఉదాహరణలతోను సింగరాచార్య సోదరులు పరిష్కరించి ప్రకటించారు. ఇదికాక. అళహసింగరాచార్యులవారు అన్నగారి పర్యవేక్షణ క్రింద గాయకలోచనము మొదలయిన సంగీతశాస్త్ర గ్రంథాలలో తమ కీర్తనములను,

జావళీలను మాత్రమేకాక, అనేకమంది ప్రాచీన, మధ్యయుగ, అద్యతన వాగ్గేయకారుల పదములు, కీర్తనలు, జావళీలు, స్వరజతులు, వర్ణములు ఇత్యాదిగాగల అనేక సంగీత రచనలను ఉదాహరించి, అనేక శాస్త్ర విషయములను తెలియ పరిచారు అంతేగాక ఈ సోదరులు, ముత్తుస్వామి దీక్షితులవారివలెనే, పాశ్చాత్య బాణీలో సాగే బ్యాండు స్వరరచనలుచేసి, వాటికి భక్తిరసపూరితమయిన భగవన్నామ బిరుదావళితో గేయములను రచించారు. సంగీత సర్వార్థసార సంగ్రహం లోని వివిధ వాగ్గేయకారుల రచనలను ఈ గ్రంథంలో ముందరి అధ్యాయాలలో చాలాచోట్ల మేము ఉదాహరించియున్నాము. ఈ సంగ్రహంలోని ఇతర ప్రత్యేకాంశాలేవంటే, సరళి స్వరాలకూ, జంట స్వరాలకూ చక్కగ సరిపోయే సాహిత్య రచనలూ, అలంకారములకు కూడా అటువంటి రచనలు, లక్షణగీతాలు, కైవార ప్రబంధాలు, తానములు, తన్నకారములు, చౌకవర్ణములు, తానవరములు స్వర జతులు, పదాలు, కీర్తనలు.

తచ్చూరివారి జావళీలలో 'సామి నెడబాసి నేనెట్లు సైరింతునే' అనే దేవమనోహరిరాగ జావళీ; 'వానిజోలి నాకేలె' అనే బ్యాగురాగ జావళీ; 'ఎన్నాళ్ళు సైరింతునే ఓ చెలియ' అనే జంఝూటిరాగ జావళీ — ప్రసిద్ధమైనవి. తమ గాయకలోచనంలో కూడా ఉదాహృతములైనవి.

జా వ ళీ లు :

దేవమనోహరి – చాపు :

సామి నెడబాసి నేనెట్లు సైరింతునే కోమలి శ్రీరాజగోపాల మరుఁ
డురమున విరిశరముల నేసెనే సరసిజాక్షి ఇదే సమయము రమ్మనవే ॥సా॥
కలువలదొర పగ నాపైఁ గావించేనే కలికిరో తమినిలుప నాతరమటే ॥సా॥
శింగరనుతుడు మోసము చేసెఁగదే అంగనామణి ఇపుడైనను బిలువవే ॥సా॥

బ్యాగు – చాపు :

వానిజోలి నాకేలే ఇందుముఖిరో ఆ వనితబోధచే మైమరచె ॥వా॥
మానినిరో వానిమమత లెందుబోయె పూని దాని యిలువిడిచి రాకయున్నాఁడిఁక ॥
ఇంతిరో నిను బాయనని నానో ఎన్నో బూటకములు పలికెనే సంతసమెల్ల

నా చానకొసఁగి నన్ను పంతముతో మరునిపాలుచేసె నిఁక ॥వా॥
మాట తప్పనివాడని నేను మనసున నెంచితిగదనే బోటిరో అల వాని
మోము జూడనగునా సాటివారలు నవ్వ జాలరేమె యిఁక ॥వా॥
శింగరనుతుడు నాతో మునుచేసిన చెలిమిని మరచెనే బంగారమువంటి
వానిగుణములెల్ల అంగనామణి మోహాబ్ధిఁ జేరేనింక ॥వా॥

## కీర్తనలు

**కళ్యాణి – రూపకము :**

దేవీమీనాక్షి ముదందేహి మేసతత....పావనమధురానిలయే – పాండ్య
రాజతనయే – భావరాగతాళాదిక పరితోషితహృదయే....భావుకఫలప్రదా
యిని భక్తమోదసంధాయిని – సేవకపాప విమోచని – శ్రీకదంబవనవాసిని...
సారిసని – ధని నిధపమ – గధమాగరి – మగారిసనిరీరి – ధానిస
రిగమపరి గమపధాప – మపధపధని – సరిగగరిస – నిసరి – రిసని – ధనిస
సనిధ – పమగమపధ – నిసరిసారి – నిధపమగరి – నిధానిసరి – గమా
పధని....దే... హిమకరనిభవదనే – విమలకుందరదనే – రమణీయమణి
సదనే – రక్షితమదనే – సుమశరజనకసహోదరి...సుంద
రేశ హృదయేశ్వరి సిమరవిజితనిఖిలామరి సాధువశంకరి శంకరి....కమల
జాదిసుర పాలిని ఘనతర శుభగుణశాలిని – సమదానేకపగామిని సంగీత
రసాహ్లాదిని...సా...దే...

**శహన – ఆదితాళం :**

శ్రీశారదే – ధీవిశారదే – చింతామణే – గుణభూషణే ...శ్రీ...
ఈశ రమేశ సేవితే – ఇంద్రాదిసంభావితే – భాసురతేజే మాం – పాలయ వందిత
సురసమాజే....శ్రీ....
సరసీరుహ భవప్రియే – శశినిభముఖీ సదయే –
వరవీణా పుస్తకపాణి – వరదాయకి – గీర్వాణి... అరవిందాసనే – అబ్జనయనే
సురసనే – తుంబురు నారద పూజితే – శింగరవందితే – సుచరితే....శ్రీ ...

## జావళీలు :

జావళీ లక్షణమునుగురించి సంప్రదాయప్రదర్శినిలో సుబ్బరామదీక్షితులవారు చెప్పిన వివరాలు ప్రబంధలక్షణాధ్యాయంలో చెప్పుకొన్నాము. పదవర్ణాలలోనూ, స్వరజతులలోనూ ఉండే స్వరకల్పనల ధాతువిన్యాసాన్ని వర్జించి,శృంగార రసాత్మకమైన సాహిత్యంతో మధ్యమకాలంలో స్పష్టమైన లయతో అందముగాసాగి ఉర్రూతలూగించే రచనజావళీ.సభాసంప్రదాయయుగంలో వర్ణములతోప్రారంభించిన సంగీత కచ్చేరిలో భక్తిరసాత్మకమైన కృతులనూ, ప్రత్యేక రాగాలాపనమునూ, తానమూ, పల్లవీ ముగించిన వెనుక పదాలు గానం చెయ్యడమూ, చిట్టచివర మధ్యమకాలంలో చురుకైన లయలో ఓలలాడించే జావళీలు ఒకటి రెండు పాడి, మంగళంతో సభ ముగించడం పరిపాటి అయిపోయింది. లయాత్మకత వలనా, మధ్యమకాలం వలనా, జావళికి కూడా పదవర్ణ, స్వరజతులవలెనే – భరతశాస్త్రానుగుణ్యంగా నాట్యం చెయ్యడానికీ, భావం అభినయించడానికీ ఎంతో అవకాశము ఉన్నది.

ధాతువూ, మాతువూ కూడా తేలిక రచనగా ఉంటుంది. కనుక సాంప్రదాయిక మహారాష్ట్రరాజుల ప్రోత్సాహంవల్ల వారి ఆస్థానంలోగాని, తిరువాన్కూరు మహారాజయన స్వాతితిరునాళ్ ప్రోత్సాహంవల్ల ఆయన ఆస్థానంలోగాని బయలుదేరి ఉండవలెను. తెలిసినంతవరకు స్వాతి తిరునాళ్ రచించిన జావళీలే చారిత్రికంగా మొట్టమొదటి జావళీలని చెప్పవచ్చును. ఆయన ఆస్థానంలో సంగీత విద్వాంసులూ, నట్టువనార్లూ, పదములూ, శబ్దములూ, తిల్లానాలూ వంటి సంగీత రచనలను చేసిన వాగ్గేయకారులూ అయిన పొన్నయ్యా వడివేలు సోదరు లేవైనా జావళీలు రచించి ఉండాలి. మరొకదృష్ట్యా విచారించి చూస్తే, అంతవరకూ చౌకకాలంలో గానంచేస్తూ ఉండిన శృంగారాత్మకములైన పదాలనే మధ్యమకాలంలో గానంచేసి, జావళీలు అన్నారా అనీ, ఆ విధంగా జావళీ రచనాపరిణామం కలిగిఉండవచ్చనీ కూడా తోస్తుంది. స్వాతి తిరునాళ్ తర్వాత జావళీ కర్తలలో ప్రసిద్ధిపొందినవారు ధర్మపురి సుబ్బారావుగారు ధర్మపురీశునికి అంకితంగాను, తిరుప్పనందల్ పట్టాభి రామయ్యగారు తాళవనేశునికి అంకితంగానూ, తిరుపతి నారాయణస్వామిగారూ ఎన్నో జావళీలు చెప్పారు. కరూరి శివరామయ్య అనువారు ఓ మై డియర్ వంటి ఇంగ్లీషుమాటలు కూడా చేర్చి జావళీలు రచించారట.

తచ్చూరివారు కూడా జావళీలు రచించినట్లు చెప్పుకొన్నాము. తరువాతి వారిలో జావళీలు రచించిన వాగ్గేయకార విద్వాంసులలో పూచీ అయ్యంగార్ అని ప్రసిద్ధిపొందిన రామ్నాడ్ శ్రీనివాసయ్యంగారు ఘనులు ఈయన జావళీలు మాత్రమేకాక కీర్తనలు, తిల్లానాలు కూడా రచించారు. పూరీకళ్యాణి రాగంలోని పరమపావన - అనే కీర్తనా; కేదారగౌళరాగంలోని - సరగునపాలింప - అనే కీర్తనా. రీతిగౌళరాగంలో - సద్గురుస్వామి - అనే కీర్తనా, ఫరజురాగంలోని తిల్లానా, కాపీరాగంలోని - సరసములాడేందుకు సమయమిది కాదుర నాసామి - కమాస్ రాగంలోని "కొమ్మరో వానికెంతబిగువే" అనే జావళీలు - వీరి రచనలే. వీరి కీర్తనలలోని చిట్టస్వరములు శ్యామాశాస్త్రిల పద్ధతిలో ఉంటాయని చెపుతారు. ఈ రామనాథపురం శ్రీనివాసయ్యంగారు పట్నం సుబ్రహ్మణ్యయ్యగారి శిష్యులు - తచ్చూరి సింగరాచార్యసోదరులు శ్యామాశాస్త్రిల కుమారుడైన సుబ్బరాయశాస్త్రిల దత్తపుత్రుడైన అన్నాస్వామిశాస్త్రిల శిష్యులు. అందుచేత వీరంతా త్యాగరాజ శ్యామశాస్త్రిల శిష్యపరంపరలోని వారే అన్నమాట.

సంగీత సభలలో బహుళప్రచారంలో ఉన్న కొన్ని జావళీలు - కొన్నిటిని, వాటిని రచించిన వాగ్గేయకారులను ఇక్కడ చూచిస్తున్నాము.

| | |
|---|---|
| స్మరసుందరాంగుని సరియెవ్వరే - ఫరజు | ధర్మపురి సుబ్బారావు |
| అది నీపై మరులుకొన్నదిరా - ఇమన్‌కళ్యాణి | ,, |
| మరుబారి కోర్వలేనె నారీమణి తేవె - జంఝూటి | ,, |

సఖి ప్రాణసఖుడు జంఝూటి ,,
మారుబారి తాళలేనురా - కమాస్ ,,
ఏమందునే ముద్దుబాలామణి - ముఖారి ,,
తారుమారు లాడేవేమే బజారి - నాటకురంజి ,,
ఇటు సాహసము - సైంధవి స్వాతి తిరునాళ్
మరియాద - సురటి పట్నం సుబ్రహ్మణ్య అయ్యర్
నిరుపమాన సామిని నా నిలయమునకు రమ్మనవే - బ్యాగ్
పూచి శ్రీనివాసయ్యంగార్
వగలాడి బోధనలను వలచితివో సామి - బ్యాగ్ తిరుపతి నారాయణస్వామి
చెలి నే నెట్లు సైరింతునే - ఫరజు పట్నం సుబ్రహ్మణ్య అయ్యర్

ధర్మపురి సుబ్బారావుగారు మద్రాసులోనే ఉండేవారట. ప్రసిద్ధ వైణికు రాలైన ధనమ్మాళ్‌ను ఆశ్రయించి, ఆయన ఆమెను నాయికగా, ధర్మపురీశుడు నాయకుడుగా ఆమె గానముచేసికొనడానికి వీలుగా యెన్నో పదాలను రచించారట. 'సరస నే వీణ వాయించుచో శెభాషిచ్చునే - స్మరసుందరాంగుని సరి యెవ్వరే' అనే ఫరజురాగపు జావళీ యీ విధంగా వీణ ధనమ్మాళ్ వీణావాదన ప్రశస్తిని గురించి ప్రకటించే జావళీ.

ఆంధ్రదేశంలో ఉత్తరసర్కారులలో దాసు శ్రీరాములుగారు, గబ్బిట యజ్ఞ నారాయణశాస్త్రిగారు కూడా జావళీలను, వివిధ కీర్తనలు రచించి ప్రసిద్ధి పొందినారు. దాసు శ్రీరాములుగారు నాటకములను కూడ రచించి ఆధునికాంధ్ర నాటక రచయితలలో తొలి కోవలోనివారుగాను, గబ్బిటవారు కూడ నాటకములలో హార్మోనీద్వారా సంగీతం నిర్వహించినవారుగాను ప్రసిద్ధిపొందారు. దాసు శ్రీరాములుగారి జావళీలను కృష్ణా గోదావరులలోని ఆనాటి నట్టువరాండ్రు దేవాలయాలలో నాట్యాభినయానికి ఉపయోగించేవారట.

జావళీల రాకడతో వాగ్గేయకార చరిత్రంలో మనం 20 వ శతాబ్దానికి వచ్చేశాము. 20 వ శతాబ్దంలో పేరుపొందిన ఇతర వాగ్గేయకారులలో ప్రముఖులైన వారిని గురించి, ఆధునిక యుగంలో సంగీతాత్మక సాహిత్య రచనలు తొక్కిన కొత్తపుంతలను గురించీ ఈ గ్రంథపు చివరి అధ్యాయంలో వివరిస్తాము.

# పంధొమ్మిదవ అధ్యాయం

# కాలజ్ఞాన తత్త్వ కర్తలు

## చారిత్రక సమన్వయం :

ఈ వాగ్గేయకార చరిత్రలో 10 వ అధ్యాయంనుంచి, 18 వ అధ్యాయం చివరివరకూ - 17 వ శతాబ్ద ప్రారంభంనుంచి, 20 వ శతాబ్ద ప్రారంభం వరకూ గడచిన మూడు శతాబ్దాలలోను మన కర్ణాటక సంగీతపు క్రమపరిణామానికి కారణ భూతులైన వాగ్గేయకారుల జీవిత విశేషాలను, రచనలను గురించి చెప్పుకొన్నాము. 16 వ శతాబ్దివారైన రామామాత్యుడు మొదలైన లక్షణకర్తలు ప్రారంభించిన సంగీత ప్రబంధరచనా మార్గము, తాళ్ళపాక అన్నమాచార్యులు, పురందరదాసు మొదలైన లక్ష్యకర్తలు ప్రారంభించిన సంకీర్తనమార్గమూ ఒకదాని సాహాయ్యమొకటి పొంది, సాగిన సంగీత వాహినికి సామాన్యజన వినోదకళలలోని యక్షగాన గేయరీతులును, నాటక పద్ధతులును తోడై మధ్యతరగతి పండితాదరణమునూ, రాజాస్థాన గౌరవమునూ సంపాదించుకొన్న యక్షగానపద రచనా శాఖల అభివృద్ధికీ, ధాతుకల్పనాయుతమైన కృతిరచనా పరిణామానికీ, ఇంకా అనేక శాస్త్రీయ సంగీత రచనారీతుల విజృంభణకూ, సంగీతసభా సంప్రదాయాల అభివృద్ధికీ దోహదము జరిగి, ఆధునిక కర్ణాటక సంగీత స్వరూప మేర్పడింది.

కాని, పండితవర్గంతో గాని, రాజాస్థానముతో గాని ఏ మాత్రమూ సంబంధంలేని పామరజనం, తమ ముక్తిపిపాసను తీర్చుకొనడంకోసం అన్నమాచార్యాదులు చూపిన సంకీర్తనమార్గంలోని వైరాగ్యపదముల పద్ధతినీ,యక్షగానముల లోని దరువుల పద్ధతినీ అవలంబించుకొన్నారు. 13 వ శతాబ్దితో సింహాచలంలో ఉండిన కృష్ణమాచార్యుల వచన గేయాలనూ, 15, 16 శతాబ్దులలో తిరుపతిలో వెలసిన తాళ్ళపాకవారి ఆధ్యాత్మ సంకీర్తనలనూ, ప్రాతిపదికలుగా తీసుకొనే ఆ తరువాతి శతాబ్దంలో కాలజ్ఞాన తత్త్వాలూ, ఆత్మబోధామృత తత్త్వాలూ అను పేరులతో ఆధ్యాత్మిక ప్రబోధం కలిగించే కీర్తనలను రచించిన వాగ్గేయకారులు ఉదయించారు. వీరిలో చాలమంది పామరజనోద్ధరణమునే ఆశయముగా ఎంచుకున్నవారు, బ్రాహ్మణేతర కులాలలో జన్మించినవారూ ఉపనిషత్తులలోను, వేదాలలోను చెప్పిన పరమార్థతత్త్వాన్ని సులభభాషలో పామరులకు బోధించే కీర్తనలను

చేసినవారూను. వీరు యోగసాధనలో సిదులై, అనేక శిష్యవర్గమును చేరదీసి తమ విజ్ఞాన చంద్రికలను వెదజల్లినారు. వీరి జ్ఞానబోధ అంతా ప్రజలందరికీ సామాన్యముగా అర్థమయే మాటలతో కొంతవరకు సంకేతములతో రూపకాలంకారములతో తత్త్వార్థమును నిగూఢముచేసిన కీర్తనలలో దరువులలో సాగింది. కాని ఈ వాగ్గేయకారులు భాషావిశారదులనిగాని, శాస్త్రీయ సంగీత వైదుష్యం కలిగిన వారనిగాని అనుకొనడానికి వీలులేదు. శాస్త్రీయ గేయరీతుల నూతన ప్రవాహ వేగంలో దేశీయ గేయరీతులు కొట్టుకునిపోయి ఏష్యం కాకుండా ఈ కాలజ్ఞాన తత్త్వాల రూపంలో కాలూనుకొని, నిలదొక్కుకుని ముందుకు సాగాయి. సాహిత్యంలో అంతమాత్రమే కాని. సంగీత పరిణామంలో ఇవి చేసిన దోహద మేమీ లేదు.

అ చ ల మ త ం :

సామాన్య జనులలోని విరాగులకు, సన్యాసులకు, షడ్దర్శనములలోను మిగిలన దర్శనము లన్నిటి కంటె తరణోపాయంగా యోగశాస్త్రం ఎక్కువ ఆలంబనీయ మయింది. ఈ విధంగా యోగంలో సిద్ధిపొందిన బైరాగులు హఠ యోగులనీ రాజయోగులనీ వారు అవలంబించిన యోగముల ప్రత్యేకతను బట్టి రెండు విధాలుగా ఉంటారు ఈ యోగమతానికి మన దేశంలో అచలమత మనే పేరు కూడా వ్యవహారంలో వుంది. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు తమ వేమన వ్యాసావళిలో దీనిని గురించి ఈ క్రింది అంశాలను తెలియచేసినారు.

దేహమున కెప్పుడును చలనమునిచ్చి, తద్వారా మనస్సును కూడ చలింప జేసేది వాయువు. దానిని-లోని శ్వాసను పైకి పోనియ్యక, బైటి ఊపిరిని లోనికి రానీక శ్వాసక్రియను స్తంభింపజేయడం- ప్రాణాయామ మంటారు. దీనిద్వారా మనస్సు నంటియుండే మాలిన్యం నశిస్తుందట. ఆ తర్వాత పంచేంద్రియాల నడవడికను అదుపులో ఉంచుకొనవలెను. ఈ విధంగా శరీరాన్ని స్వాధీనం చేసుకొని తమ కారాధ్యమైన వస్తువునందు దేవునందో, గురునియందో మనస్సు నిలిపి, చేసే సాధనను ధారణ అంటారు. ఆ ధారణ విషయముపైకి తప్ప. మిగిలిన వృత్తులందు మనస్సును పోనీకుండా పట్టి ఉంచడం ధ్యానం ఆ అవస్థలలో నేను, దీనిని ధ్యానిస్తున్నాను అనే జ్ఞానంలోని ధ్యాత, ధ్యేయము, ధ్యానము అను మూడు వస్తువులలోను ధ్యానము చేయుటకు గురియైన వస్తువునిల్చి నేనను కర్తను, ధ్యానమను క్రియను గురించిన జ్ఞానమును అంతరింపజేయుటే సమాధి అంటారు.

ఈ సమాధి సంప్రజ్ఞాతమనీ, అసంప్రజ్ఞాతమనీ రెండు విధాలు, మొదటి దానిలో- యోగసాధకుని మొదట ధ్యేయవస్తువు యొక్క స్థూలరూపం గోచ

రించి క్రమంగా దాని సూక్ష్మరూపం కూడా స్పష్టపడుతుంది. ఆ మూలప్రకృతి దర్శనంలో ఋతంభర అనే ఒక విశిష్ట ప్రజ్ఞ కలుగుతుంది. దానివల్ల యథార్థ జ్ఞానం కలిగి, సంశయాలన్నీ అంతరిస్తాయి. శ్రుతిప్రమాణంచేతను, అనుమాన ప్రమాణం చేతను కలిగే జ్ఞానం కంటే ఋతంభర జ్ఞానం గొప్పది. మొదట విద్యా విహీనులై యుండిన కొందరు బాలయోగులకు కూడా యీ ఋతంభరవల్లనే, దివ్యజ్ఞానం కలిగి ఉండినట్లు వింటూంటాము ఈ సంప్రజ్ఞాత సమాధి కూడా అభ్యాసబలంచేత అసంప్రజ్ఞాత సమాధిగా మారుతుంది. ఆ అవస్థలో మిగిలిన ధ్యేయస్ఫూర్తి కూడ నశించి, కేవల నిర్మలజ్ఞానం కలుగుతే కైవల్యావస్థ. ఈ విషయాలన్నీ పాతంజల యోగశాస్త్రంలోనివి.

## తత్త్వకర్తలు:

కాలజ్ఞాన తత్త్వకర్తలు ఈ అచలమతాన్ని అనుష్ఠించే విధానాన్ని బోధించ డానికీ, సుఖదుఃఖ సమానబుద్ధీ, ఇంద్రియ నిగ్రహమూ, అచలసమాధీ అభ్యసించ మని సామాన్య ప్రజలను ప్రబోధించడానికీ తమ తత్త్వాలను తేలికైన దేశీయ గేయరీతులలో రచించారు. చాలా తత్త్వాలలో శిష్టవ్యావహారికమూ, గ్రామ్యభాషా, నింద్యగ్రామ్యములూ కూడా వాడబడ్డవి. ఆంధ్రదేశంలో ఏగ్రామానికి పోయినా సంతలలో, జాతర్లలో, రచ్చసావడులలో, సత్రములలో, కలవారియింటి వాకిళ్ళలో, ఖామందుల లోగిలి ముంగిళ్ళలో, అంగడి వీధులలో, రైలు పెట్టెలలో బస్సు స్టాండులలో, బళ్ళఘాటీలలో ఈ తత్త్వాలను పాడే బిచ్చగాళ్ళూ, బైరాగులూ కని పిస్తూంటారు. చంకనుజోలె, జోలెలో తిండితినడాని కొక కుండపెంకు, ఒకచేత తంబురా (ఏకనాదం అని కొన్నిచోట్ల పేరు) మరొక చేతిలో చిరతలు పెట్టుకొని వాళ్ళు ఈ తత్త్వాలను పాడుకొంటుంటారు. వారికి శ్రావ్యగాత్రంతోగాని, రాగలయ విన్యాసాలతోగాని పనిలేదు. ఒక్కొక్కడు తనకు తెలియకుండానే అతిశ్రావ్యంగా పాడుతూ, మధ్య ఏదో రాగాలాపన కూడా శాస్త్రపరిచయం లేకుండానే చేసేస్తూ చిరతలపై లయవిన్యాసాలు చూపిస్తూ ఉండడంకద్దు. అందులోని కళాప్రదర్శనం అంతంతమట్టుకే. అడుగుకొనేవారికి తాము పాడుతున్న తత్త్వాల పరమార్థం పైనిగాని, వాటి ఆచరణపైగాని శ్రద్ధకూడా అంతంతమట్టుకే. పామరుల్లోకూడా, ఆ తత్త్వాల అర్థాన్ని గ్రహించి, ఆచరణలోపెట్టి, యోగులైనవారు వేళ్ళమీద లెక్కపెట్టదగినంతమందే ఉంటారు. కాని, కర్మసిద్ధాంతాది భారతీయ వేదాంత సూత్రాలవలె – ఈ తత్త్వాలలోని పరమార్థం ఆ ప్రజలకు అస్థిలో పట్టిపోయి, వారి దైనందిన జీవితంలో ఎప్పుడో ఏ కష్టసమయంలోనో అక్కరకు వస్తూ వుంటుంది,

## కాలజ్ఞాన తత్త్వాలు :

యోగివేమన రచనలుగా ఇలాటి తత్త్వాలు కొన్ని ప్రచారంలో ఉన్నాయి గాని, వాటి కర్తృత్వాన్ని గురించి పండిత పరిశోధకులకు ఏకాభిప్రాయం లేదు. అందుచేత, అచలమతానికి సంబంధించిన యీ తత్త్వాలు వ్రాసిన వారిలో మొదటి వారు పోతులూరి వీరబ్రహ్మంగారే. అతని తర్వాత, అతని శిష్యులు, శిష్యపరంపరలోనివారు, అనుయాయులూ, ఇంకా ఇతరులూ ఆ మార్గంలోనే తత్త్వసాహిత్యాన్ని అభివృద్ధి చేశారు. సిద్ధర్ పాడల్‌గళ్, సిద్ధరపదగళు అనే పేర తమిళ, కన్నడ దేశాలలో కూడ ఇటువంటి తత్త్వాలున్నాయి. ఆ పేర్లుకూడా ఆ రచయితలు యోగాభ్యాసంలో సిద్ధిపొందిన విషయాన్ని స్పష్టపరుస్తాయి.

అచలమతావలంబకులకు పోతులూరి వీరబ్రహ్మంగారి కాలజ్ఞాన తత్త్వాలు ప్రమాణగ్రంథము. ఈ గ్రంథంలో వీరబ్రహ్మంగారు స్వయంగా చెప్పిన తత్త్వాలు కొన్నీ, కొన్ని ఆయన ప్రియశిష్యుడైన దూదేకుల సిద్ధప్పగారు చెప్పినవీ, వీరబ్రహ్మంగారి మనుమరాలయిన ఈశ్వరమ్మ చెప్పినవీ, యాగంటి లక్ష్మప్పగారు చెప్పినవీ, ఇంకా బ్రహ్మంగారి శిష్యులో భక్తులో అయిన పూదోట రామన్నగారు, చిత్తూరు నరసింహదాసుగారు, కాలువ కోటయ్యగారు, కొమ్మల్లూరి వీరరాఘవులు గారు, తాడిచెర్ల చలమయ్యగారు, తాడిచెర్ల శేషయ్యగారు, నారనయ్య, నారసయ్య దయతో అహోబలదాసు, సున్నపుగుంట రాఘవులు, మహమ్మదు హుసేను, తరిగొండ భ్రమరాంబానరహరిగార్లూ, జక్కులేటి కంబగిరి, ఘంటయ్య అనువార్లు రచించిన తత్త్వా లన్నిటినీ చేర్చి, కాలజ్ఞాన తత్త్వాలు అనేపేర పరిమి వీతాచార్లు అనే అచలమతావలంబి, తన రచనలతోకూడా చేర్చి, కూర్చినాడు.

## ఆత్మబోధామృత తత్త్వాలు :

ఆత్మ బోధామృత తత్త్వాలు అను పేరుతో మరొక తత్త్వాల పుస్తకం గుజిలీప్రతులలో ఉంది. అందులోని తత్త్వాలు రచించినవారు ఎడ్ల రామదాసు, తరిగొండ సుబ్రహ్మణ్యం, సుబ్బకవి, ఇందుకూరి ఇందుధరుని శిష్యకోటి, నారాయణపురం నారాయణదాసు, రామబ్రహ్మగురుడు, కృష్ణగురుడు, శివరామ దీక్షితులు, అప్ప బ్రహ్మము, పరశురామ నరసింహ గురుస్వామి, సత్యమప్పయ్య, సుందరార్యులు, చన్నయ్య, మల్లెపెద్ది కృష్ణబ్రహ్మము, తిలునగరి కృష్ణుడు, కోటయాచార్లు, నూజివీటి వీరయార్యుడు చర్మపురి సూరయ్యదాసు, బొట్టా నరసింహదాసు, శివలాలు సద్గురు దేశికుడు, బాలకృష్ణయదాసు, కళారి వీరస్వామి, గురు చెంచయ్య, బ్రహ్మపురం వీరన్నప్పలదాసు, నారాయణహరిదాసు.

## ఏగంటివారు :

వీరికి ఏగంటివారు. యాగంటివారు, అగంటివారు అని వ్యవహారం ఆయా పుస్తకాలలో వున్నది. తత్త్వాలన్నిటిలోనూ, కొంత భాషాసౌష్టవం కలిగి, భావన స్పష్టంగా ఉన్న రచనలు ఏగంటివారివి, ఏగంటి లక్ష్మప్పగారి తత్త్వాలు అనీ, ఏలలు అని పదిదాకా కాలజ్ఞానతత్త్వ సంచయంలో ఉన్నవి. ఇవికాక, యాగంటి వారి యేలలనీ, తత్త్వాలనీ ఇంకా 20, 30 దాకా అందులోనే ఉన్నవి. వీటన్నింటిలోను చివరి చరణంలో ముద్ర, యాగంటి యాళ అనికాని, యాగంటి గురుడు అని కాని, యాగంటిదాసుడు అని కాని కొన్నింటిలో సంబోధన ప్రథమంలోను, కొన్నింటిలో ప్రథమావిభక్తిలోను, కొన్నింటిలో తత్పురుషలోను ప్రయోగాలున్నవి. వీటినిబట్టి యీ తత్త్వాలన్నీ యాగంటివారైన వేర్వేరు వాగ్గేయకారుల రచనలనిగాని, లేదా, అన్నీ ఒక్క లక్ష్మప్పగారి రచనలే అనిగాని ఇదమిద్ధమని చెప్పడానికి వీలులేదు. అన్నియాలలలోను శివపారమ్యము కలదు. పంచాక్షరీ మంత్రప్రభావము, ఖేచరీ ముద్ర మొదయిన రాజయోగ పారిభాషికపదముల వివరణమూ కొన్నింటిలో ఉన్నవి. శ్రీ తిమ్మావఝుల కోదండరామయ్యగారు యాగంటి లక్ష్మప్పగారు వీరబ్రహ్మంగారి శిష్యుడైన సాలెకులజుడని వ్రాసియున్నారు. ఏగంటివారి పదాలనుగురించి శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు యిలా వ్రాశారు : 'జనులలో నెక్కువ వ్యాప్తినిగాంచుటకును, మననము చేయుటకును పద్యములకన్న పాట లెక్కువ పనికివచ్చునను తత్త్వమును పండితులనేకులు గమనింపలేదుగాని, పామరులుమాత్ర మెరిగి యాచరణకు తెచ్చిరి. అట్టి పాటలలో సామాన్యముగా గానరాని భాషా సౌష్ఠవము విషయమును సంగ్రహించి చెప్పు శక్తి, ధారాళమైన శయ్య - యేగంటివారి పదములలో ఎక్కువగా గానవచ్చును'.

కోదండరామయ్యగారే యాధారంతో వ్రాశారోగాని, యాగంటి లక్ష్మప్పగారి తత్త్వాలను బట్టిగాని కాలజ్ఞానతత్త్వాల పుస్తకంలోని పాటలపై నున్న సూచనలను బట్టిగాని లక్ష్మప్పగారు వీరబ్రహ్మంగారి శిష్యుడన్న విషయం యెక్కడా సూచితము కాలేదు. అందుచేత యేగంటి గురుడూ ఆయన శిష్య బృందమూ బ్రహ్మంగారి ప్రభావంతో సంబంధంలేని మరొక కాలానికి చెందినవారని మాకు తోస్తోంది. సిద్ధయోగులకూ, శైవమతానికీ ఆటపట్టుగా పేరుపడిన శ్రీశైల ప్రాంతంలో వీరుండియుండవచ్చును.

శ్రీ అనంత కృష్ణశర్మగారు చూపించిన ఏగంటివారి పదాన్ని ఒకదానిని ఇక్కడ ఉదాహరిస్తాము.

ప॥ ఆనందమయుడు గావలెను॥

మనసు పదిలము పేయవలెను, ఈ తనువు లోపలి తెలివి తానె కనవలెను
కనుచూపు లొకటి కావలెను, అందు ఘనచిదానందలింగము కానవలెను॥
వాయువుల కుంభించవలెను మిక్కిలి యుపాయమున కుండలిని పైకెత్తవలెను
తోయజంబులు దాటవలెను అందు పాయకుండెడు నాదు పలుకు వినవలెను
మూడుయేరులు దాటవలెను అందు జోడుబాయని గురునిజాడ గనవలెను
మేడమీదికి చేరవలెను అందుజోడుబాయని హంసజాడ గనవలెను
రేయి పవ లొకటిగావలెను, అందు వేయిరేకులమీది వెలుగు గనవలెను.
ఆయెదను హంస గానవలెను, ఆత్మ బాయ కేగంటి గురుపదవి గనవలెను॥

యాగంటి లక్ష్మప్పగారి యాల : ఇందులో గ్రామ్యప్రయోగా లున్నవి.

సూర్యసోమావహ్నినడుమా – శౌర్యమానే చిలుకాగంటి
సూర్యదీప్తి కాయుచుండగా – ఓ యాగంటిలింగా
చూడచూ డాశ్చర్యమాయేగా ॥
కంటినిండా చూచుచుండా గంజి యుదయాగిరిమీదా
పాముజేసే సజ్ఞా తెలిసితె, ఓ యాగంటిలింగా
సారమైనా పుట్టా జేరును ॥
పాముపేరూ చెప్పా విషమూ – ఆడ కాడా కెక్కెగదర
సీమ యెనుపోతూ కడుపూన – ఓ యాగంటిలింగా
ధీరనమునా మింగీయుంటీరా ॥

యాగంటివారి యాల : ఇందులో భావనాశక్తి, కవితాశిల్పమూ సొగసులు తీరినవి.

సన్నంపూదిడ్డీవాకిట – పున్నామా వెన్నెల బైటా
కిన్నెరాల నాదమింటిరా – ఓ……….
వినగ వినగా వింతలాయెరా ॥
ఎఱ్రమానూ ఒడ్డూకిందా యెనిమిదీ ఊడాలున్నవి
ఊడాయూడా లెంచీ చూచితే – ఓ
యుగము జగమూలందే యున్నవి ॥
నల్లగుంటా నట్టానడుమా, తెల్లదామర పువ్వున్నాది
తెల్లదామర పువ్వులోపాల – ఓ
తెలివిపరచే దేవుడున్నాడు ॥

పై మూడు పాటలలోను మొదటిని యాగంటివారి వచనా లను పేర మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలోని తాళపత్ర గ్రంథంలో దిగా ఉదాహరింపబడినది. తరువాతి రెండూ కాలజ్ఞాన తత్త్వాలనుపేర వెలువడిన

సంచయగ్రంథంలోనివి. ఈ గ్రంథములోనివే - కోలుకోలు అనే ఊతపదంతో పాడే కోలాటంపాట ఒకటీ, ఖేచరీముద్రను గురించిన తత్త్వం ఒకటీ ఇక్కడ ఉదాహరిస్తాము. పై రెండు పాటలలోను ఉన్నట్లుగా, ఈ క్రింది పాటలలోని భాష గ్రామ్యంకాదు - గ్రాంథికంగానే ఉంటుంది.

కోలాటం పాట : ఇది కూడా ఒక రకపు యాలపాటే.

పారదోలి వ్యసనములను సారమత్త గజము లడచి
వీరకంకణంబు గట్టు విజయు డెవ్వడో॥
కోలుకోలు పరమగురుని కొలువుసేయరే
కాలకర్మ జననములను కడకు జిమ్మరే॥
కాలిమడమ యోనిమూల కదలకుండ నొత్తిపట్టి
మూలబంధ మూర్ధ్వగతికి మొనయు డెవ్వడో॥
నాదపంచకంబు దెలిసి నాదు కర్ణమందుబలికి
నాదలయము జెందునట్టి నరుడు యెవ్వడో॥

ఈ పైని గుర్తించిన యాలలవంటి యాలల ఉదాహరణములను సుగ్రీవ విజయాది యక్షగానములలోని వానిని, ఈ గ్రంథమందలి ప్రబంధాధ్యాయంలో చూపించినాము.

ఖేచరీ ముద్రను గురించిన తత్త్వము : యాగంటివారిదే. తపవోజకు కొంతమార్పు.

ఇదియే ఖేచరీ ముద్ర, ఇది నిత్యమౌను, పదిలముగ సాధింప బ్రహ్మ మగపడును నలినమని చిత్తంబు లయముజెందెడివేళ బయలులో బయలు నిర్బయలు కనపడును చూపునిలిపినయపుడు రూపంబు గనబడును చూపు రూపౌకటైతె పాప కనబడును పాపమధ్యను నున్న పరంజ్యోతిరూపమై దీపంబు గనబడును దివ్యపురుషులకు సత్యమనియెడి వత్తి సరసవంతముజేసి చిత్తమలరగ సమురువత్తి ముట్టించి చిత్త మలినంబాయె శ్రీ గురుని కృపచేత ప్రత్యక్ష యాగంటి ప్రభువు తానేను ॥

ఈ పాటలలోని మాటలకూర్పు, భావముతీర్పు అన్నమాచార్యాదుల వైరాగ్యపదములను కొంతవరకు జ్ఞప్తికి తెస్తున్నందున కాబోలు శ్రీపాద గోపాల కృష్ణమూర్తిగారు యాగంటివారు తాళ్ళపాకవారికి మునుపటివారుగా తోస్తున్నదన్నారు. పోలిక లున్నమాత్రాన మునుపటివారని చెప్ప సాహసింపలేముగాని, తాళ్లపాకవారికి సమీపగాలంలోనివారనిగాని, తరువాతివారనిగాని అనడానికి యిబ్బంది ఉండదు. అందుచేతనే పోతులూరి వీరబ్రహ్మంగారిని గురించి చెప్పడానికి ముందే యాగంటివారి యేలలను గురించి చెప్పాము. వీరబ్రహ్మంకంటే అన్యుడైన యాగంటి గురుదెవ్వరో మరొక వ్యక్తిగాని, తాళ్లపాకవారివలె యాగంటివారని వరుసగా కొందరు తత్త్వకర్తలుగాని ఉండి ఉండాలి.

## పోతులూరి వీరబ్రహ్మం:

వీరబ్రహ్మంగారి కాలాన్ని కూడా చరిత్రకారులు రెండు మూడు రకాలుగా చెపుతున్నారు. శ్రీ అనంతకృష్ణ శర్మగారు బ్రహ్మంగారు 17 వ శతాబ్దపు మధ్య భాగంలో ఉండినవా రన్నారు. వీరబ్రహ్మంగారి జీవితచరిత్రమును వ్రాసిన తాడికొండ రాఘవాచార్యులుగారు తమ వీరాచార్య చరిత్రంలో ఆయన 1686 వరకు జీవించినట్లును, జవంగుల నాగభూషణదాసుగారు తమ వీరబ్రహ్మేంద్రస్వాముల చరిత్రలో ఆయన 1594 వరకు జీవించినట్లును వ్రాశారు. జక్కుల స్వామినాథయ్య అనువారు కూడా బ్రహ్మంగారి జీవిత చరిత్ర వ్రాశారు. మొత్తంమీద తాళ్ళపాక వారిలో పదకర్తలలో మూడవ వాడయిన చిన తిరుమలాచార్యుడు 16 వ శతాబ్ది చివరివరకూ ఉండినవాడే. యాగంటివారూ, వీరబ్రహ్మంగారూ కూడా ఆ కాలంలో కాని, 17 వ శతాబ్ది మొదటి భాగంలోగాని పుట్టి, మధ్యభాగంవరకూ ఉండినవారని చెప్పుకోవచ్చును. అచల మతాచార్యత్వమువల్లనే కాక, వీరబ్రహ్మంగారికి కాలజ్ఞానంవలన కూడ ప్రసిద్ధి కలిగింది. కాలజ్ఞాన మనగా భూతమును భవిష్యత్తుగా చెప్పుట. జరిగినదానిని జరుగబోవునదిగా చెప్పి, తన కాలమును తానే వెనుక కీడ్చుకొనుట...అని అనంతకృష్ణ శర్మగారు వ్యాఖ్యానం చెప్పినారు. కలియుగంలో జరుగబోవు వర్ణసంకరం, పరపరిపాలనం, పరిపాలకుల నిరంకుశత్వంలో అమాయికుల కడగళ్లు ఈ విధంగా దుష్టాత్ముల పాడుకృత్యములూ, ధర్మాత్ముల ఆకర్షణీయతా, దారిద్ర్య, క్షామ, భూకంప, ప్రళయవిప్లవాది దురాకృత ప్రకృతి వైపరీత్యములు జరిగి, తుదకు భూమి నుద్ధరించే అవతారమూర్తిగా వీరభోగవసంతరాయ లను ధర్మాత్ముడవతరించి రామరాజ్యమును స్థాపిస్తాడని వీరబ్రహ్మంగారు బోధిస్తూ వుండేవారు. నిత్యమూ మహమ్మదీయ దండయాత్రలలోను, పరస్పర మతవైషమ్యములలోను కష్టనిష్ఠురముల పాలయి, భయప్రకంపితులై శంకాకులితజీవులై యుండిన ఆనాటి సామాన్య ప్రజానీకానికి యీ కాలజ్ఞాన బోధ ఆశాజనకంగా, ధైర్యోత్పాదకంగా ఉండేది. గ్రామగ్రామాలలో బ్రహ్మంగారికి పెద్ద శిష్యపరివారం పెరిగింది.

బ్రహ్మంగారు విశ్వబ్రాహ్మణులు. నందికొండ గ్రామ వాస్తవ్యులయిన యనమొదల వీరభోజాచార్యులు, వీరపాపమాంబ అను దంపతులకు దత్తపుత్రుడు. బాల్యంలో యీయన కర్నూలు జిల్లాలోని బనగానపల్లెలో గరిమరెడ్డి అచ్చమ్మగారి పశువులను మేపుతూ ఉండగానే అనేక మహిమలను చూపినాడట. తాను తోలుకొని పోయిన పశువుల చుట్టూ ఒక్క బిరి గీయగా, అవి ఆ బిరిలోనే గడ్డి మేస్తూవుండేవి. క్రూరమృగాలేవీ ఆ బిరిలోకి వచ్చేవికావు. తాను మాత్రం అరణ్యగర్భంలోకిపోయి ఒక గుహలో కూర్చొని తాటాకులపై కాలజ్ఞాన విశేషాలనూ, తత్త్వాలనూ వ్రాసుకొనేవాడట. అచ్చమ్మ అనే ఆమె యీ వింతను చూసి, ఆశ్చర్యపడి, ఆయన శరణువేడి, ఆయనకు శిష్యురాలయిందట. ఇదికాక, ఆయన ఒక చచ్చిన ఆవును

చనిపోయిన మనిషినీ బ్రతికించాడట. అంతేకాక పోలేరమ్మ జాతరకు చందా లిమ్మని ఊరిపెద్ద లాయన నడుగగా, ఆయన ప్రస్తుతం లేదనీ, కొన్నాళ్లుపోయాక యిస్తానన్నాడు. కాని పెద్ద లూరుకొనక ఆయనను రచ్చకీడ్వగా అతడు గుడి కెదురుగా తిన్నెపై కూర్చుండి చుట్ట కాల్చుకొనడానికి నిప్పుతెమ్మని పోలేరమ్మ నడిగి, వారందరి యెదుటా ఆమె బాలికా రూపంలో వచ్చి, చుట్టకు నిప్పంటించేటట్లు చేశాడు. ఒకనాడు జడివానలో నిలిచి తడియకుండా వచ్చాడు. ఈయన తన ఆశ్రమంలో శివ విష్ణ్వాది దేవతా భేదాలనుగాని, హిందూ మహమ్మదీయాది మత భేదాలనుగాని, కులభేదాలనుగాని పాటించక సర్వమానవ సౌభ్రాత్రాన్ని బోధించి ఆచరణలో పెట్టించాడు. ఆయన శిష్యులలో బ్రాహ్మణుని మొదలు చండాలుర వరకూ అన్ని కులాలవారూ, హిందువులూ, మహమ్మదీయులూ కూడా ఉన్నారు.

## దూదేకుల సిద్ధప్ప :

వీరబ్రహ్మంగారికి అత్యంత ప్రీతిపాత్రుడైన శిష్యుడు దూదేకుల పీరు సాహెబు, ఆదం బీబీల కుమారుడైన సిద్ధప్ప. అత డొక వరప్రసాది. మహమ్మదీయుడైనను, వైరాగ్యబుద్ధి కలిగి, బ్రహ్మంగారి బోధలకు ఆకర్షితుడై వచ్చి, అనేక పరీక్షలకు, స్వమతస్థుల కోపతాపాలకు, కష్టనిష్ఠూరాలకూ ఆగగలిగి, గురువుకు అత్యంత ప్రీతిపాత్రుడైన శిష్యుడైనాడు. సిద్ధప్ప కూడా చాలా తత్త్వాలను రచించాడు. ఈ విధమయిన తత్త్వకర్త లందరిలోను బ్రహ్మంగారి తత్త్వాలకు కొన్నింటికి మాత్రమూ బాగా ఇటీవలి ఎడ్ల రామదాసు కీర్తనలకూ రాగాల పేర్లున్నాయి. అవి ఆనాడు ప్రసిద్ధములై జనబాహుళ్యంలో ప్రచారంలో ఉండిన పూర్వ విరచిత గేయాల వర్ణ మెట్లలో రచింపబడినవై యుండవచ్చు. ఏక నాదమూ, చిరతలూ, బ్రహ్మంగారికిగాని, శిష్యులకుగాని, వారి అనుయాయులకుగాని తప్పని సరియైన వాద్యాలు.

మహమ్మదీయుడైన సిద్ధయ్యకు పాడు వేదాంతమును నేర్పి వీరబ్రహ్మంగారతనిని మతభ్రష్టుని చేశాడని కొందరు మహమ్మదీయులు సిద్ధవటం నవాబుకు ఫిర్యాదు చేశారు. నవాబు బ్రహ్మంగారిని తన ఆస్థానానికి పిలిపించాడు. ఆయన బ్రహ్మతేజస్సుకూ, కాలజ్ఞానాది మహిమలకూ ఆశ్చర్యపడి, నవాబు ఆయనను యెంతో గౌరవించి శిష్యుడై తన రాజ్యంలో ఆయన అచలమతాన్ని స్వేచ్ఛగా ప్రచారం చేసుకోనిచ్చాడట. వీరబ్రహ్మంగారు సంసారియైన యోగసిద్ధుడు కాని, సన్యాసికాడు. బ్రహ్మంగారికి, ఆయన భార్య గోవిందమ్మగారికీ అయిదుగురు కొడుకులూ, ఒక కొమార్తె. ఆయన మనుమరాలయిన ఈశ్వరమ్మకూడ కాలజ్ఞాన సంపన్నురాలూ, తత్త్వకర్త్రిణీ. గృహస్థ వానప్రస్థ ధర్మములను నిర్వర్తించి,

అనేక సామాన్యజనులను అచలమతావలంబులనుజేసి, జీవితంలోని సుఖ దుఃఖాలను ధైర్యంతో, విరక్తమనస్కతతో స్వీకరింపనేర్పి, వీరబ్రహ్మంగారు ఒకనాటివైశాఖ శుద్ధదశమీ ఆదివారంనాడు జీవసమాధి గతులైనారు సమాధి ప్రవేశానికి ముందు ప్రియశిష్యుడైన సిద్ధప్పను తన సమాధిలోకి పుష్పాలు తెమ్మని బనగానిపల్లెకు పంపించి, అతను తిరిగిరాకపూర్వమే కందిమల్లయ్యా పల్లెలో జీవసమాధి గతులైనారు సిద్ధప్ప పువ్వులతో తిరిగివచ్చి, గురువుగారికోసం అక్కడనే ప్రాయోపవేశం చేసి దుఃఖించాడు. శిష్యుని ఊరడించడానికని బ్రహ్మంగారు సమాధిలోంచి లేచి పైకివచ్చి అతనికి తన పాదుకలు, రుద్రాక్షతావళమూ, బెత్తమూ యిచ్చి, అంతర్థానులైనారట. ఈ గురుశిష్య సంబంధాన్నిబట్టి బ్రహ్మంగారివంటి గురుడు లేడు. సిద్ధయ్యవంటి శిష్యుడులేడు అను లోకోక్తికి ప్రచారం కలిగింది.

అల్లాడపల్లెలోని ఆలయంలో వేంచేసిన వీరభద్రస్వామి వీరబ్రహ్మంగారికి గురువట. తాడికొండ రాఘవాచార్యులుగారు వ్రాసిన దానిప్రకారం యీ వీరభద్రస్వామి ప్రమథగణంలోనివాడుకాడు; వేదాంతి, యోగసిద్ధుడూ అయిన ఒక మహనీయుడు సిద్ధిపొందగా ఆయనపేర అక్కడ ఒక ఆలయం కట్టినారట.

వీరబ్రహ్మంగారి సమాధి నేటికిని - కడపజిల్లా బద్వేలు తాలూకాలోని నెల్లూరు కడప బస్సుమార్గంలోని కందిమల్లయ్యాపల్లెలో ఉన్నది. ఇప్పటికీ ప్రతి సంవత్సరమూ వైశాఖశుద్ధ దశమినాడు దేశంలోని అన్ని ప్రాంతాలనుంచీ బ్రహ్మంగారి భక్తులూ, అచలమతాభిమానులూ, బైరాగులూ, కందిమల్లయ్యాపల్లె చేరుకొని, బ్రహ్మాండమైన ఉత్సవం జరుపుతూంటారు. చాలమంది ఆ సమాధివద్ద మొక్కులు మొక్కుకొని చెల్లించడంకూడా కద్దు బ్రహ్మంగారి తత్త్వాలలో బాగా ప్రచారం ఉన్నవాటి పల్లవులు.

1. తియ్యని మామిడిపండు, పండు తినబోతే దొరకాదు తీపులుమెండు...
2. ప్రపంచనడతా జూటా, మన పెద్దలవాక్యము బాటా
   ముగ్గురు మూర్తులు జూటా, మూఃము యెరుగుట బాటా....
3. ఈజన్మ మిక దుర్లభమురా ఓరి సాజన్మ సాకార సద్గురుని కనరా...
4. కోటాలాటి కోటా జగతిలో యేకోటా లేదు...
5. చెప్పలేదంటనక పొయ్యేరూ, నరులార గురునిచేరి మ్రొక్కితే బ్రతుకనేర్చేరు...
6. ఇల్లువాకిలి నాది యిల్లాలు నా దనుచు
   యేల భ్రమసితి వయ్యొ మనసా...

బ్రహ్మంగారు యీ క్రింది తత్త్వంలో విగ్రహారాధన చిత్తం చెడిపోవడానికే తోడ్పడుతుందనీ, చిన్మయమైన నిర్గుణాకార బ్రహ్మోపాసనమే ఆలంబ

సీయమని ప్రబోధిస్తాడు. అంతేకాక బాహిరాడంబరం కల కర్మకాండను నిరసిస్తాడు.

చిల్లరరాళ్ళకు మొక్కుచునుంటే చిత్తము చెడిపో నోరే వోరే
చిత్తమునందున చిన్మయరూపుని జూచుచునుండుట సరే సరే
ఒక్కపొద్దులని యెన్నుచునుంటే ఒనరుగ చెడుదువు వోరే వోరే
ఏకమైన యా వైభవమూర్తిని చూచుచు నుండుట సరే సరే.

.... .... ....

అక్కలమ్మకు సారెవచ్చె వెన్నెలారో ...అని అన్నమాచార్యులు రచించిన వెన్నెలపదాన్ని జ్ఞాపకంచేసే చందమామపదం ఒకటి బ్రహ్మంగారి పాటల్లో వుంది. ఇందు సహస్రారశీర్షకమైన పామును యోగసాధనచే లొంగదీసికొనుట వర్ణించాడు.

ఆనందభైరవి రాగం – ఆది :

చందమామ చందమామ చందమామా – యీ
సంధితెలిపే జ్ఞానులెవరే చందమామా ॥
కాయమను పుట్టలోను చందమామ – పాము
మాయగానె మెలగుచుండు చందమామ ॥
జంటనాగస్వరము లూది చందమామ – పామును
పాదు పెకలింపవలెను చందమామ॥
తొమ్మిది వాకిళ్ళుమూసి చందమామ – సామును
నెమ్మదిగా పట్టవలెను చందమామ॥
భక్తియను కట్టుకట్టి చందమామా – పామును
యుక్తిచేసి పట్టవలెను చందమామ॥
దేహీ దేహములసందు చందమామ – పాము
తెలియకుండా చుట్టుకొన్నది చందమామ॥
అజపమంత్రధ్యానముచేత చందమామ – పాము
అఖండ కళలతో వెలుగుచునుండు చందమామ॥
పామునుబట్టే జోగియెవరు చందమామ – ఓహో
అతని పేరు సిద్ధగురుడు చందమామ॥

దూదేకుల సిద్దయ్యగారి తత్త్వాలలో ప్రసిద్ధమైనది ఒకటి....

ఏ కులమని నను వివరమడిగితే యేమనిదెల్పుదు లోకులకూ
పలుగాకులకు, దుర్మార్గులకు, యీ దుష్టులకు॥
పాలభాగమున యాలలుబాడుచు భావముకన్నది నా కులము॥

.... .... ...

ఇంటిలోపలను ఇల్లుగట్టుకొని మంటలోపల రాట్నం బెట్టుక
కంటిలోపలా కదురుబెట్టుకొని, ముక్కులోపల యేకు బెట్టుకొని
చెవులో బారాచేతికి తీసుక నారాయణయను నరము దీసుకొని
అష్టాక్షరియను తడికెనేసుకొని, పంచాక్షరియను పంచదీసుకొని
తద్దిమితద్ధిమి గుబదెబగుబదెబ ఏకినకులమే మాకులము....
రొమ్మునలక్ష్మి చీరెకట్టుకొని చక్కంగా సిరిపావడ దొడగి,
ఆనందమైనా పీరబ్రహ్మశాల్వ కప్పుకొని జగమంతటనూ
నిండియున్నదే నా కులమూ - ఒంటరిగాదే నాకులము....

దూదేకుల సిద్దయ్యయేకాక, మహమ్మద్ హుస్సేనను మరొక మహమ్మదీయుడు ఈ అచలమార్గంలో తత్త్వాలు వ్రాశాడు.

ఊదుచు కొలిమితిత్తుల సమరసము తెలియ వలెరా.
వాదభేదములనణచి యాత్మలో శోధింపగ వలెరా....
ఒక్కటి మొదలు వృక్షము లెక్కకు మిక్కిలి కొమ్మలురా,
ఎక్కచూచితే ఎంతో పొడుగాకాశమంటినదిర.
చొక్కమైన పండొక్క కొమ్మను చేతికి చిక్కదుర -
ఒప్పుగ దెలిసిన వారికి పండు ఒద్దనె యున్నదిర ...

... ... ...

పంచాక్షరములు భావములోపల ఫలియింపగవలెర
పొంచి మహమ్మద్ హుస్సేన్ గురునిపాదము గనవలెర...

ఈ తత్త్వకర్తలు పెద్దవ్యాకరణ పండితులూ, భాషాశాస్త్రజ్ఞులూ కాకపోయినా వేదాంత రహస్యాలను సంకేతార్థములుగల శబ్దాలమాటున గూఢంచేసి, నేటి విద్యావంతులైన పండితప్రకాండులకుకూడ గురుముఖతః ఆ రహస్యం తెలుసుకొంటేనే గాని సామాన్యంగా అర్థంకాకుండా రచించారు. ఈ తత్త్వాలు లోపల పరమార్థమేమో వెంటనే స్ఫురింపకపోయినా పామర జనం మాత్రం ఆ సంకేతపదాలు కలిగించే మాయాజాలానికి ఆకర్షితులై సద్యో వినోదంపొంది వాటిని గానంచేసికొంటూ, ఏ తలనెరిసిన గురువుద్వారానో వాటిలోని పరమార్థాన్ని బోధింపజేసికొంటూంటారు.

పైని చెప్పిన హుస్సేన్‌దాసు– అచల వేదాంతాన్ని మోక్షరస బిల్హణీయ మనే యక్షగానంలో బోధించాడు. ఇతనిది కడపజిల్లాలోని అగువపల్లె అని ఈ యక్షగానాన్నిబట్టి తెలుస్తోంది.

తూర్పుగోదావరిజిల్లా ఉప్పాడ గ్రామ నివాసి సన్నిధి జగ్గరాజకవి ఎరుకుల కురంజి అను యక్షగానమును తత్త్వబోధాత్మకంగా రచించాడు. ఈ యక్ష గానా లను గురించి రాబోయే అధ్యాయంలో చెప్పుకొందాము.

వీరబ్రహ్మంగారి జీవితాన్ని కూడా వారి శిష్యులలో ఒకడు యక్షగానంగా రచించాడు.

తరిగొప్పుల రామస్వామి అనే జిజ్ఞాసువు 'మనసు మర్దన' అను పేర వేదాంత కీర్తనలను రచించాడు.

## నిట్టల ప్రకాశదాసు :

19 వ శతాబ్దం తొలిభాగంలో ఉండిన తత్త్వకర్తలలో చెప్పుకోదగిన వాడు నిట్టల ప్రకాశదాసుగారు. ఈయన తత్త్వాల కవితాప్రాశస్త్యాన్ని గురించి పదిహేనేళ్ళ క్రితం ఒక ఆంధ్రపత్రికలో శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారొక వ్యాసం ప్రకటించారు. ఈయన తత్త్వాలలో తేటయైన తెలుగుమాటల ద్రాక్షాపాకం-సంకే తములు అర్థబోధను క్లిష్టము చేసేవిగా ఉండక కదళీపాకంలో ఉంటాయి. ఉదా :

1. గూటి చిలకేదిరా అన్నా....

2. గాలిపటమురా జీవా, గాలి
   నిలిచినంతలోనె కూలిపోవు ధరణిలో
   జాలమేల చేసేవుర.

ప్రకాశ దాసుగారి తత్త్వాలు కొన్ని సంకీర్తనాత్మకములుగాను, కొన్ని భక్తుడైన కవిమనోధర్మాన్ని ప్రకటించేవిగాను ఉంటాయి.

శంకరాభరణము - అది.

3. నారాయణ నీ నామము నిరతము నమ్మి స్మరించుట నావంతు
   ఘోరదురితములు పారదోలి నను గారవించు టది నీ వంతు

ఎరుకల కాంభోజి

4. రాములవారిమాట - నవ
   రత్నములుంచిన మూట....జయ
   రాములవారిమాట - మాకు
   దోసెడు వరహాలమూట....

ఈ పై రెండు రామదాసు భజనకీర్తనల ధోరణిని సాగినవి. ఇంకొకటి ఇటువంటిదే - ఆయన మనోభిలాషలను ప్రకటించేది.

ఆనందభైరవి.

5. దైవసహాయ్యమెన్నటికో - రామ
దైవమొక్కడేయని తలచేదెన్నటికో...
మత్తతా మానేదెన్నటికో, నా
చిత్తము హరిపైని చేర్చేదిన్నటికో...
ఉత్తములతో పొత్తెన్నటికో, పర
విత్తముపై భ్రమ విడిచే దెన్నటికో....
ఆశను రోసే దెన్నటికో, భవ
పాశములను కోసివేసే దెన్నటికో
దాసులగూడే దెన్నటికో, నిష్టల ప్ర
కాశూడనని గంతువేసే దెన్నటికో...

ఈయన తూర్పు గోదావరి జిల్లా కాకినాడలోను, ఆ చుట్టుప్రక్కల గ్రామాలలోను ఉండినట్లు తెలుస్తోంది. తత్త్వాలలో చివరిది ప్రస్తుతం పిఠాపుర వాస్తవ్యురాలు, 90 ఏండ్ల ప్రాయముగల నట్టువరాలు అయిన పెండ్యాల సత్య భామగారి ద్వారా (ఆమెగారి అమ్మమ్మ స్వయముగా ప్రకాశదాసుగారి ద్వారా నేర్చు కొన్నది) మాకు అందినవి.

ఈయన తత్త్వాలు పాడుకొంటూ, ఊరూరా కోవెల చావడులలోనో బజారులలోనో స్వేచ్ఛగా తిరుగుతూ, కొన్ని మహిమలను కూడా చూపించిన యోగసిద్ధుడని నిరూపించే ఐతిహ్యాలు కొన్ని గోదావరిజిల్లా అద్దరీ, ఇద్దరీ పెద్దలు చెప్పుతూండటంకద్దు. ఒకేసమయంలో రెండుమూడు గ్రామాలలో అక్కడి ప్రజలకు కనబడడమూ, గోదావరి నీటిలో మునుగకుండా పద్మాసనం వేసికొని తేలుతూ దాటిపోవడం, శాపానుగ్రహ శక్తియుక్తి ఈ గాథలలోని కొన్ని అంశాలు. ఈయన జీవితంలోని గాథలలోగాని, ఈయన తత్త్వాలలోగాని - మొత్తంమీద ఆయనకు ఐహిక జీవిత సుఖాలపై గల రోతా, సుఖదుఃఖాదిక ద్వంద్వాతీతమైన యోగమనస్కతా ప్రకటమవుతాయి.

## ఎడ్ల రామదాసు :

19 వ శతాబ్దపు అంత్యభాగంలో కాకినాడలో ఉండిన తత్త్వకర్త ఎడ్ల రామదాసు. బ్రహ్మంగారి తత్త్వాల తర్వాత ఎడ్ల రామదాసుగారి తత్త్వాలకు బహుళ ప్రచారం ఉన్నది. 119 కీర్తనలతో 'సాంఖ్యతారకామనస్కయోగం బనెడు సుజ్ఞానచంద్రిక' అను గ్రంథమును ఎడ్ల రామదాసుగారు తాను జీవించి ఉండగానే స్వయముగా వ్రాసికొన్న పీఠికతో సహా ముద్రింపించాడు. విజయనగర

సంస్థాన సమీపమునగల కలవచర్ల గ్రామంలో ఎడ్ల అచ్చయ్యగారికి మహ లక్ష్మమ్మకూ కుమారుడై జన్మించిన యితడు అక్షరాభ్యాసమైన వెనుక 12 ఏళ్ళ ప్రాయంలో కాకినాడ వా స్తవ్యు డైనాడు. అక్కడ మంతెన వెంకటాచార్యులను వేదాంత గురువువద్ద ఉపదేశం పొంది, సాంఖ్య, తారక, అమనస్క రాజయోగాది భావముల బోధశాలియైనాడు. ఇతడు తన పీఠికలో తానే వ్రాసికొన్న ప్రకారం— "తాను, విద్యావిహీనుడై నా, సద్గురు కృపను వచో రచనయందును, కవిత్వమందును ఒక ధోరణి కలిగి కొన్ని కీ ర్తనలను మరికొన్ని త త్త్వాలను గద్య పద్యాలతో, సకల జనుల కాహ్లాదకరంబగునటుల సులభ శై లిని" రచించాడు.

ఈ సుజ్ఞాన చంద్రికతోపాటు, ఎడ్ల రామదాసుగారి శిష్యులు కొందరు తాము రచించిన త త్త్వాలనుకూడా చేర్చి, ఎడ్ల రామదాసు చరిత్ర అను పేరుతో ప్రకటించారు. అది యిప్పుడు ప్రచారంలో ఉన్నది. ఈ గ్రంథంలో త త్త్వాలు రచించిన ఇతర భ క్తులు—బూచి అప్పలదాసు, చిట్టూరి నారాయణదాసు, వి త్తనాల కొండయ్యదాసు, వెంకటదాసు, బోని అప్పలదాసు, బోని గురవయ్యదాసు, మామిడి అప్పలదాసు, కంచుమ ర్తి యల్లయదాసు నాగన్న అనువారు.

సుజ్ఞాన చంద్రికను ఎడ్ల రామదాసు తన జీవిత చరిత్రంగానే రచించాడు. హరికథా కథన ధోరణిలోని తోహరాలతో ఉ త్తమ పురుషైకవచనంలో ఆత్మకథా కథన పద్ధతిని చొప్పించినాడు.

> "అండపిండ బ్రహ్మండపురంబున నా గురురూపము జూపెన్
> కుండలాగ్రమున మంతెన వేంకటగురువై తా నటియించెన్
> శ్రీకరమగు శ్రీ కాకినాడపురి దాపున జేరిన వాడన్
> ప్రాకటముగ యడ్ల రామదాసు తలవాకిటపబు ప్రకటించెన్."

ఈ సుజ్ఞాన చంద్రికలోని ఎడ్ల రామదాసు రచనలన్నీ త త్త్వాలు మాత్రమే కావు - చాల పాటలు సంకీ ర్తన పద్ధతిలో సాగినవి. భజన పాటలు - మేలు కొలుపులు, జోలపాటలు, మంగళహారతులు, ఆంజనేయ దండకము, గోపీకృష్ణ సంవాదము, గురుశిష్య సంవాద గేయములు కూడ కలవు. రంగనాథుడు, వేంకటేశ్వరుడు, రాముడు, కృష్ణుడు, వినాయకుడు, త్రిపురసుందరి, ఈశ్వరుడు, నారాయణుడు ఇన్నిపేరులతో వెలసిన పరబ్రహ్మమును గురించిన కీ ర్తనలున్నవి.

కొన్ని పల్లవులు—బాగా ప్రచారంలో ఉన్నవి...

1. ఈశ్వరా జగదీశ్వరా పరమేశ్వరా కరుణించరా
2. జీవమా మేలుకొనవే -
   మేలుకానవే వెఱ్ఱిజీవమ చాలు నీ కిలలోను సౌఖ్యము॥

3. అనుమాన మెందుకే మనస ఈ తనువు నిత్యముగాదు హంస॥
4. దీనిభావము తెలియవలెనన్నా నీలోను బ్రహ్మము
   పూని కనుగొనవలెను వినుమన్న –

కృష్ణలీలా సంకీర్తనం – శ్రీరాగం – ఆటతాళం :

ఎన్ని మాయలు నేర్చినా డమ్మ – యశోద నీ కొడు
కన్నిటికి నెరజాణుడో యమ్మ॥
ఎన్ని మాయలు నేర్చినాడే చిన్నతనయుడు నిన్నరేయి, మా
కన్నెపడుచును జూచి రమ్మని కనుసైగలు చేసినా డట॥
వట్టిమాటలు గావు వినవమ్మ ఈ వాడలోపల
యిట్టివానిని జూడలేదమ్మ –
ఉట్టిమీదా చట్టిలోనా పట్టి పాలిడి అట్టె బోవగ
చట్టియోడల కొట్టి కృష్ణుడు పొట్టనిండా బట్టినా డట॥

ఈ తేలిక తేట మాటలలో జీవాత్మ పరమాత్మల సంబంధం యిందులో ద్యోతకం చేశాడు. పరమాత్మ క్రీడా విలాసాలే బాలకృష్ణుని లీలలు.

మాయామాళవ గౌళ–అట :

వ్యవసాయము జేసేవారము ఈ అడవిలోపల కాపువారము
నవద్వారపురము వీథివారము నవనీతచోరుని భక్తవరులము॥
అండపిండ బ్రహ్మాండము మేము మెండుగ పండించినారము
పుండరీకాక్షుని నామము ఈ పుడమి అంతట జల్లినారము॥

ఈ తత్త్వంలో భక్తిసాధనను వ్యవసాయంతో పోల్చి మనోహరంగా రూపకీకరించాడు. ఈ క్రింది తత్త్వాలలో మాటలు తేలికైనా భావం గూఢమైన వేదాంతబోధతో కూడుకొన్నది.

నాదనామక్రియ – అట :

మాయాపురంబున నున్నది చూడ మనసు కింపగునట్టి చిన్నది
ఆహా,మాయమాటలు గావు మదినెంచిచూడగ మద నాగ్నిబడ ద్రోయుచున్నది

నాదనామక్రియ – అట :

దీని భావము తెలియరా, దుర్గుణము లిక నెడబాయరా, దీ
నర్థమే పరమార్థమని నీ ఆత్మలో నెరిగుండరా॥

వాదభేదము మానరా, మన మెచ్చినది పొరుగూరురా, యీ
పక్షి దెలిపిన మాటలన్నియు తక్షణము యోచించరా॥

నాదనామక్రియ – అట :

ఈ ఊరి కిదే దారికదా గురురాయలు తెల్పిన దదేకదా॥
దారికి యెదురై మూడు శునకములు దాటుచు మిక్కిలి మొరిగెగదా
యెక్కువయిన యేకాక్షరి కుక్కల కెదురుకొని మద మణచెగదా॥

గురు శిష్య సంవాదం – హిందూస్థానీ కాఫీ – అట :

శి. ఇలను సద్గురుసేవ జేసితె ఫలము యేమిటి గురువరా
గు. ఈ ధరను సద్గురు కృపను పరముకు దారి దొరుకును శిష్యుడా॥
శి. పంచభూతము లే స్థలంబున సంచరించును గురువరా
గు. పంచభూతము లయిదు గూడి ప్రపంచమాయెను శిష్యుడా॥

బాగా ప్రసిద్ధికెక్కిన ఈ క్రింది తత్త్వం ఎడ్ల రామదాసుగారిదే—

సావేరి – అట :

ఏమి జన్మం బేమి జీవనమూ – యీ మాయకాయము॥
ఏ జన్మము యేమి జీవన మేమి శాశ్వత మేమి సౌఖ్య
మి దేమి నా ప్రారబ్ధకర్మము స్వామి న న్నిటు చేసి మరచెను॥

కఠారి వీరాస్వామి అనే తత్త్వకర్త బహుశా శక్తిపూజకుడు కాబోలు.
అతడు....

"ఆడదే అక్షరము లక్షయ మాడదే మోక్షంబురా
ఆడదాన్ని జూచి తెలిసిన అతడే జగయోగిరా॥
ఆడదానిలో అన్నిబుట్టి ఆడ లీనం బాయెరా
ఆడదాన్ని కలిసి గెలిచిన అతడే వైరాగిరా॥"

ఇతడు ఈ తత్త్వంలో ఆడది బియ్యే బియ్యేల్ ప్యాసు మూలమాయెరా
అని వ్రాసినందున బొత్తిగా ఇటీవలివాడుగా తోస్తుంది.

మొత్తానికి యీ తత్త్వాలలో సూటిగా అర్థం చేసుకోబోతే చమత్కారార్థం
స్ఫురించే సంకేతకధా ఉండడంవల్ల పామరజనం బాగా ఆకర్షితులై, వాటిని

కర్ణాకర్ణిగా నేర్చుకొని, తర్వాత ఏ గురుని వద్దో దాని పరమార్థం తెలుసుకోవడం ద్వారా వాటికి బాగా ప్రచారం వచ్చి వుంటుంది. సాహిత్యపరులైన కొందరు ఆధునిక గేయకవులకు ఈ తత్త్వములు కొన్ని ఒరవడులుగా పనిచేసినవి. ఛందస్సులలోను, సంకేతపదముల శిల్పంలోను, భావార్థ గోపనంలోనూ వారు తత్త్వకర్తలను అనుకరించారు. అట్టి వారిలో కవికొండల వేంకటరావుగారూ, అడవి బాపిరాజుగారూ ప్రముఖులు. ఈ తత్త్వాలకు కొందరు కర్తలు ఏవో రాగాలపేర్లూ అవీ నిర్ణయించినా, అవి ప్రాచీన కాలంనుంచీ వస్తూండిన ఏవో దేశీయ గేయరీతుల వరుసలలో నప్పేటట్లుగా వారు తయారుచేసుకొన్నవే గాని, సంగీతరచనా శిల్పంలో తత్త్వకర్తలు ప్రత్యేకంగా పాటుపడినారని చెప్పడానికి ప్రత్యే కాధారాలు లేవు. సాంఘిక చిత్రాలలో సినీమాలు ప్రారంభించి నప్పటినుంచీ కూడా ఏవో బైరాగి పాత్రలు వస్తూవుండడమూ, ఈ తత్త్వాలలో కొన్నిటిని ఉన్నవున్నట్లుగా గాని, తమ సందర్భాని కనుగుణంగా కొన్ని మార్పులు చేసుకొని . ని వాడుకొంటూ ఉండడము అందరికీ తెలిసిన విషయమే.

ఇరవయ్యో అధ్యాయం

# అద్యతన యక్షగాన పరిణామము హరికథా వాగ్గేయకారులు

తొలి యక్షగాన రచయితలను గురించిన తొమ్మిదవ అధ్యాయంలో యక్ష గాన వాఙ్మయరూప పరిణామమును గురించి చెప్పుకొన్నాము. ఆ తరువాత నారాయణతీర్థుల యక్షగానములను గురించి, కూచిపూడి సిద్ధేంద్రయోగి భామకలాపమునుగురించీ, 10, 11 అధ్యాయాలలోను, 15, 16 అధ్యాయాలలో తంజావూరు నాయకరాజుల కాలంలోను, మహారాష్ట్ర రాజుల కాలంలోను యక్షగానము దిద్దుకొన్న కొత్త తీరులనుగురించీ తెలుసుకొన్నాము పామరజన వినోద వికాసాలకోసమె సంకీర్తనము ఎలాగ తత్త్వంగా పరిణమించిందో దీనికి ముందరి అధ్యాయంలో వివరించాము. 18 వ శతాబ్దంలో యక్షగానం ఒక పక్క రాజాస్థానాలలో కొత్త తీరులు దిద్దుకొంటూఉండగా, పామరజన వినోద వికాసాలకోసం మరొక ప్రక్క రాజాసానాలు లేనిచోట్ల, ఆంధ్రదేశంలోని అన్నిప్రాంతాలలోను గ్రామ నాటక ధోరణిలో కుప్పతిప్పలుగా యక్షగానాలు వెలువడినవి. వీటి కర్తలలో కొందరు విద్యావంతులై భాషా, సంగీతశాస్త్ర విశారదులైన వాగ్గేయకారులూ ఉన్నారు. కొందరు భాషలోగాని, సంగీతంలోగాని చెప్పుకొనదగిన ప్రతిభ లేక, పామరజన వినోదానికి చాలిన లయజ్ఞానమూ, వాగ్ధోరణీ కలిగినవారు. తంజావూరు యక్షగానాలను తప్పించి, మిగిలిన దేశంలోని యక్షగానాలు దాదాపు 300 కు మించి ఉంటాయి. తాళపత్ర గ్రంథ భాండాగారాలలో ఉన్నవేకాక, కొన్ని వందల యక్షగానాలు గుజిలీప్రతులలో పీచుకాగితములపై అచ్చుపడినవి. డాక్టర్ రాఘవన్ గారివంటి పరిశోధకులు ఈ యక్షగానాలు అన్నీకూడా 18 వ శతాబ్దానివిగాని, ఆ తర్వాతివిగాని అయిఉండాలని తేల్చారు. ఈ కాలంలోనే యక్ష గానాలు హరికథలుగా ఏకవ్యక్తి ప్రదర్శనము లయినట్లు చెప్పవచ్చును. అంతేకాదు ఆరంభంలో యక్షగానమూ, హరికథా ఒకటే అయినట్లు చెప్ప డానికికూడా దృష్టాంతములున్నవి. పాల్కురికి సోమునినాడూ, శ్రీనాథునినాడూ జక్కుల పురంధ్రులు శివుని కథలు ఏకవ్యక్తి ప్రదర్శనములుగా పాడి యాడినట్లు 9 వ అధ్యాయంలో చెప్పుకొన్నాము. సిద్ధేంద్రయోగి భామాకలాపంలో హాస్య

గాడైన మాధవీ, చివర ఎప్పుడో చేరుకొనే కృష్ణుడూ లేకపోతే యించుమించు అదికూడా ఏకవ్యక్తి ప్రదర్శనమే – దానికితోడు. అందులో – కవిప్రశంసగల పద్యంలో "జనులార వినుడి హరికథ విన వేడుక గలిగెనేని" అని ప్రారంభిస్తూ ఆ కలాపం హరికథ అని పేర్కొనబడింది.

యక్షగాన ప్రదర్శనానికి వేర్వేరు పాత్రలు, సంధివచనాలు చెప్పే సూత్రధారుడూ అవసరముకదా, ఆ సంధివచనాలు చెప్పే సూత్రధారుడే వేర్వేరు పాత్రలు నటించడానికి వేర్వేరు నటీనటు అక్కరలేకుండా ఆ పాత్ర లన్నిటినీ తానే కథాకథనంతో కలుపుకొని నటిస్తే యక్షగానం నేటి హరికథగా పరిణమించింది. అవే దరువులు, కందార్థాలు, సంవాదాలు, పద్యాలూ — ఇందులోకి వచ్చాయి.

ఈ అధ్యాయంలో హరికథగానూ, యక్షగానముగాను కూడా ప్రచారంలో ఉండిన మృత్యుంజయ విలాసము వంటి నాటకములను రచించినవారిని గురించీ, అద్యతన గ్రామనాటక, యక్షగాన కర్తలలో భాషా సంగీత ప్రవేశం కలిగినట్లు తోచిన కొందరినిగురించీ, ఆధునిక యుగంలో హరికథా వాగ్గేయకారులుగా ప్రథితులైనవారిని గురించీ వివరిస్తాము.

## గోకులపాటి కూర్మనాథుడు :

సింహాచల దేవాలయమును మరాటీలో, తురుష్కులో ముట్టడించి దోచుకొనబోయినపుడు అక్కడి వేల్పు వరాహ నరసింహస్వామిని గురించి ప్రబోధిస్తూ ఆవేశంతో ఒక శతకం చెప్పినవాడు కూర్మనాథుడు. అప్పుడు స్వామి ప్రభావంవల్ల చెట్ల గుంపులోనుంచి తుమ్మెదలగుంపు వచ్చి, దేవాలయాన్ని ముట్టడించిన ముష్కరులపై ముసిరికొని, కుట్టి, చెల్లాచెదరు చేసిందట. అప్పటినుంచి ఆ చెట్లున్న చిన్న కొండకు తుమ్మెదలమెట్ట అని పేరు. ఆ గోకులపాటి కూర్మనాథుడు మృత్యుంజయ విలాస యక్షగానం రచించాడు. ఇది పార్వతీ పరమేశ్వరుల కళ్యాణగాథ అయినప్పటికీ,

> ' నారాయణుని పేర నా స్వామిపేర
> నత్యంత భక్తితో నంకితం బైన
> మృత్యుంజయ విలాస మృదుల నాటకము
> హరి కంకితం బౌట హరకథ యగుట
> హరిహర దాస హృద్యం బగుచుండు '

అని కవియే చివర ఫలశ్రుతిలో చెప్పుకొన్నాడు. కూర్మనాథుడు విష్ణుభక్తుడు. విశాఖజిల్లాలోని తిరుమల పెద్దింటివారి శిష్యుడు.

ఈ యక్షగానం ఇష్టదేవతా ప్రార్థనాత్మకమైన శ్లోకమూ, ద్విపదా అయాక సౌరాష్ట్ర రాగంలో హిమవంతుని ప్రావేశిక దరువుతోను, హిమవద్వర్ణన చూర్ణికతోను కథా ప్రారంభమై, కాఫిరాగంలో 'సురలు క్రొవ్విరి వాన కురియించినపుడు' అనే దరువులోని దంధణాందంధణాం ఇత్యాది శబ్దాలతో మేళర కి కదుతుంది. పార్వతి బాల్యము, యుక్తవయస్సు. నారదముని జోస్యము, ఎఱుకసాని రాకడ, శివునికడ పార్వతి శుశ్రూష. ఇంద్రుడు మన్మథుని శివునిపైకి పురికొల్పుట, కామదహనం, పార్వతి తపస్సు, బ్రహ్మచారిగా శివుని రాకడ. ఉమామహేశుల వివాహము, సవతుల పోరు, బుజ్జగింపు మొదలయిన ఘట్టాలతో ఈ యక్షగానం కాళిదాసు కుమార సంభవాన్ని ప్రాతిపదికగా ఉంచుకొన్నా, ఎరుకత ఘట్టము, సవతుల పోరువంటి దేశీయగాథలను చేర్చుకొన్నది. వివాహానంతరం శివుని విలాసాలు. కుమారోదయం, తారకవధ సూచితము లయినాయి. ఇందులో శివభృత్యుడైన భృంగి హాస్యరసపోషకమైన పాత్ర. అతనిది చాల సున్నితమూ, సభ్యమూ అయిన హాస్యము.

భృంగి హాస్యపు దరువొకటి—శృంగారకరమైన పుష్పాలను వదలి శివప్రీతికరమైన పుష్పాలవనం వెయ్యమని భృంగి అడుగుతూంటే నవ్వు వస్తుంది.

అల్లిబిల్లిగ నల్లుమల్లె లేలె, తెల్ల
జిల్లేడు చెట్లువేయరె తల్లులార ॥
ముమ్మరముగ గ్రమ్ము జాజిమొక్కలేలె, మంచి
యుమ్మెత్తలు వేయరె ఓయమ్మలార ॥
ఎక్కలేదని సంపెంగ లిక్కడేలె తుమ్మి
మొక్కలు నాటరే ఓ యక్కలార ॥

శివుడు పార్వతి వలపులో పడ్డ సంగతి తెలిసి భృంగి కుహనావిషాదం....

ఏమి సేతు దిక్కెవ్వారు నీకింక అయ్యవారు, ఇదిగో
కామినీభూతాలగతివెంట బట్టిరి అయ్యవారు ॥

ఇలాటి దరువులు, ద్విపదలు, రగడలు, కందాలు, సీసాలు, వృత్తాలు మాత్రమే కాక, ప్రాచీన దేశి గేయరీతులయిన శోభనాలు, మంగళహారతులు, కొట్నంబుల పాటలు, పెండ్లి పాటలు కూడ ఉన్నవి.

శోభనం : శోభనమే శర్వునకు శోభనమే పార్వతికి
శోభనమే కైలాస శుభమందిరునకు ॥

మణితతుల హారతులు మదవతులు ఇయ్యరమ్మ
మతియుతుడు శివ్వన్నకు మగువ గౌరమ్మకు ॥ శోభ ॥

కొట్నంబుపాట :

ఇంతిరావె గొజ్జంగి బంతిరావె, రత్నాల
దొంతిరావె మదనుని దంతిరావె ॥
కొమ్మరావె బంగారు బొమ్మరావె. చివురు లే
గొమ్మరావె ముద్దుల గుమ్మరావే ॥

మంగళహారతి :

శ్రీమహాలక్ష్మిని శ్రీ విష్ణుబోలె, తామరతంపరై దవిలి దంపతులు
పూవునాతావియు బొందినయట్లు ఈ వధూవరులుందు రెనసి యెల్లపుడు
కలికి మా గౌరమ్మ కడకంటిచూపు కలువ పూవులదండ గద శంకరునకు॥
జయ మంగళం నిత్య శుభమంగళం ॥

ఈ పెండ్లి పాటలన్నీ నేటికీ ఉత్తరాంధ్రదేశంలో ఇంటింటా స్త్రీలు పాడు కొంటూ ఉంటారు.

కూర్మానాథుడు సంగీత విద్వాంసుడు. భాషా విశారదుడుకూడ. ఈతని యక్షగానంలో వాడిన రాగాలు – సౌరాష్ట్ర, కాపీ, సారంగ, పంతువరాళి, తోడి ముఖారి, కాంభోజి. బిలహరి, ఆనందభైరవి, కన్నడగౌళ, మారువ, సురటి, శంకరాభరణం, శుద్ధవరాళి, సావేరి హుశేని, పున్నాగ, కేదారగౌళ. మంగళగౌరి, దేవగాంధారి, హాయిరి (ఆహిరి) రేగుప్తి. ఇతని దరువులలోను, పద్యాలలోను నిర్దుష్టమైన భాష, లలితమైన కవితాశిల్పం, సాహితీపరులలో ఇతనికి ఎంతో ప్రశస్తి కలిగించాయి. విశాఖపట్టణ జిల్లా నివాసియైన ఇతని యక్షగాన రచన ఆధునిక హరికథా రచయితల్లో అగ్రగణ్యులైన నారాయణదాసుగారికి కూడ తొలి రోజులలో ఒరవడిగా ఉండేదట. 1870- 1920 వరకూ గోదావరిజిల్లాలో వుండిన ప్రయాగ రంగశర్మగారు మృత్యుంజయ విలాసాన్ని హరికథగా గానం చేసేవారట.

## గరుడాచల యక్షగాన కర్తలు :

ఓబయ్య , నారసింహస్వామి వెలసిన అహోబలక్షేత్రానికి గరుడాచలమని కూడా అక్కడి పర్వతాన్ని బట్టి పేరుంది. ఆ నరసింహునకు చెంచులక్ష్మితో గలిగిన ప్రణయకలాపమే గరుడాచల యక్షగానంగాను, చెంచునాటకంగాను లోకంలో ప్రసిద్ధి పొందింది. తెలిసినంతవరకు ఈ పేరుతో రెండు యక్షగానా లున్నవి.

అందులో ఒకదానిని గరుడాచలాధీశుపేర అంకితం చేసి, ఓబయ్యో లేక ఓబ మంత్రి అనే కవి రచించాడు. కందుకూరి రుద్రయ్య సుగ్రీవవిజయపు ధోరణిలో త్రిపుటలు, జంపెలు, అటతాళదరువులు, ఏకతాళదరువులు, ధవళములు, ద్విపదలు మున్నగు గేయరీతులతో రచించిన ఓబయ్య రాగముల నేమీ సూచించినట్లు కన బడదు. చెంచువాళ్ళలో ప్రచారంలోవున్న కథకు మొదట ఇతడు భాషను యిచ్చి గ్రంధస్థం చేసి వుండవచ్చు. ఇతడు 17 వ శతాబ్దమువాడయి వుంటాడు.

యాదవదాసు ; రెండవ గరుడాచలమును రచించినవాడు యాదవదాసుడు- ఇతనిది భద్రాచలం. తన యక్షగానమును భద్రాచలరాముని కంకితం యిచ్చాడు. ఇతడు రామదాసు చరిత్రమును కూడ యక్షగానంగా రచించాడు. కనుక ఇతడు రామదాసుకు అధమం నూరు సంవత్సరాలైనా ఇటీవల—అంటే 18 వ శతాబ్దం మధ్యభాగంలో కూర్మనాథ కవి కించుమించు సమకాలికుడై ఉంటాడు.

శ్రీ లక్ష్మీనరసింహదేవుడు వేటకుపోయి చెంచు వనితను పెండ్లి యాడుట శ్రీ పద్మపురాణస్థమయిన ప్రబంధమని యితడు చెప్పినాడు. కథాక్రమం బెట్టి దనిన—అని ప్రారంభింపగానే అప్సరసలు రంగస్థలంపైని ప్రవేశిస్తారు. స్వర్గము లోపల సభలో నుండెద మమ్మ సన్నుతాంగి....అనేది వారి ప్రావేశికీ దరువు. రంభ, ఊర్వశి, చెరో, ఏరువు పాడతారు. దీనినిబటి కళావంతులైన దేవదాసీ స్త్రీలచేత ఆనాడు భద్రాచల ప్రాంతంలో రామకైంకర్యోత్సవ సందర్భా లలో ఇలాటి యక్షగానాలు ప్రదర్శించే వారు అని తోస్తుంది. 18వ శతాబ్దమధ్యము కదా యిది- ఆనాడు తంజావూరు యక్షగానాలలో ఎరుకత వచ్చింది. యాదవ దాసుని గరుడాచల యక్షగానంలో కూడ 'ఎరుకతతా వచ్చెను. అవ్వో యవ్వ...' అని ఎరుకతపాత్ర ప్రవేశించింది. ఇదే కాలపు వాడయిన కూర్మనాథుని యక్ష గానంలో కూడ ఎరుకత వున్నది. ఈ పాత్ర దేశీయులైన ఎరుకులు, చెంచులు, సవరలు మొదలగువారి ఆటలలోనుంచి వచ్చి, ఆయా మండలాలలో ఒకేసారి ఈ విధంగా గ్రంథస్థ యక్షగానాలలోకి ఎక్కి ఉండాలి గాని, ప్రత్యేకంగా తంజా వూరు నుంచి వచ్చిన ఎరువు సంప్రదాయ మేమీ కాదు. నాయకరాజులు కూడ రాయలసీమ నుంచే తంజావూరు వెళ్ళినవారు కనుక, ఈ సంప్రదాయాలను వారు తమతో కూడ అక్కడకు తీసుకు పోయారంటే సమంజసంగా ఉంటుంది. కాని, భద్రాచలంలోని యాదవదాసూ, విశాఖపట్నం జిల్లాలోని కూర్మనాథుడూ తంజా వూరు నుంచి ఈ సంప్రదాయాలను ఎరువు తెచ్చుకొన్నారేమో అని కొందరు నేటి పరిశోధకులు చేసే ఊహ నిరాధారము.

లక్ష్మీదేవి మహావిష్ణువు తనతో చలముచేసి, వేరొక వనితను వలచినట్లు కల కన్నది. కలకంటినో చెలియలారా....అని దరువు. ఆ తర్వాత బాళ—

" చెలి తాళలేనే. కల యిట్టిదౌనే
దిగులాయె నో యమ్మ మనవి గై కొనవమ్మ
పగలు రాత్రీ యేక పగులాయెనమ్మ "

అప్పుడు చెలికత్తెలు ఎరుకలసానిని పిలిపిస్తారు.

" కొల్లాపు రెల్లమ్మకు మొక్కెదనే యవ్వా
మదిలోన క్లేశంబు మానవే తల్లి
ఒక్క పురుషుని కొరకు వ్యాకులత జెందేవు
అత డెటువంటివాడని అడిగితివే యమ్మ
కోటి సూర్యుల కిరీటము గలవాడె తల్లీ
భుజమున శంఖచక్రములు కలవాడె తల్లీ "

ఇత్యాదిగా ఎరుకత లక్ష్మీదేవికి సోది చెపుతూ – సవతి వచ్చు నీకు చంద్రవదన.... ఐదు, ఆరు, ఏడు నాళ్ళలో అని తేలుస్తుంది.

ఈ నాటకంలో పామరజన వినోదానికి వచ్చే హాస్యపాత్రలు సోడిగాడు సింగి.

"సోడిగాడు వచ్చెను, యెరుకుల సోడిగాడు వచ్చెను....
సోడిగాడు సింగిజాడలో తిరుగుచు వాడవాడల మహా
వేడుక తోడుత ॥సోడి॥

నల్లాని మొగముతోను, వంకబొట్టు తెల్లాగ మెరయగాను
చిల్లాలుపోయిన చింపూల గొంగడి
అల్లాన నడుమూన అట్టె చుట్టుకొని ॥సోడి॥

సింగీ – సోడిగాళ్ల యాలపాట – సంవాదం :

సింగీ నీవు నన్ను విడిచి, చెంగున గంతులువేసి
ఎందు పోయినావు చెప్పవే – ఓయాల వోలయ్యా
సింగీ నీ వెందు పోయినావె...
సింగా నీవు పిలిచెదవు, అంగానాలయింటికి,
పొంగుచూను యెరుకజెప్పితి, ఓయాలవోలయ్యా
బంగారుసొమ్ము లిచ్చిరి...

ఆ తరువాత అసలు కథలో అలుకగొన్న లక్ష్మీదేవిని అనునయించి నరసింహుడు అడవికి వేటకు వెడతాడు; అక్కడ చెంచులక్ష్మిని చూసాడు. చాల సేపు సంవాదము లయినవెనుక. ఒక రసపట్టులో నరసింహునకూ, చెంచులక్ష్మికి నడిచిన సంవాదం :

చెంచు : బాణ మెయ్యగలవా మృగముల బట్టి ద్రుంచగలవా
నాణెముతోడుత జారుడబండలమీది కెక్కగలవా...

నర : మృగముల బట్టెదనే నేనిక నగములు తిరిగెదనే
పగతులువచ్చితె రణముజేసియు పట్టి త్రుంచగలనే...

చెంచు : గట్లు యెక్కగలవా పెద్దా చెట్లు ప్రాకగలవా
చెట్లమీదీ జుంటీతేనెలు తెచ్చియివ్వగలవా...

నర : చెట్లుయెక్కెదానె పక్షులు చేతగొట్టగలనే
కల్ల మాటలు నీతో యెందుకు కరుణ చేయనటవే॥

ఆయనగారు ఆ తర్వాత చెంచులక్ష్మిని వెంటబెట్టుకొని యింటికి రావడము, అక్కడ తలుపుదగ్గర ఆదిలక్ష్మితో సంవాదగేయాలు, ఆ వెనుక సవతుల కయ్యము, సమాధానము.

ఈ గరుడాచల నాటకాలు రెండింటిలోను యాదవదాసుని రచనకే ఎక్కువ ప్రచారం వుంది. ఇందులోని దరువులు ఆంధ్రులలో నేటికీ చాలమందికి నోటికి కూడా వచ్చును. కాని, యిందులో రాగాలూ, తాళాలూకూడా ఏమీ సూచింపలేదు. ఈ దరువులలోని సంగీత సంప్రదాయం మన శాస్త్రీయ సంగీతంలో దేశీయ రాగాలని చెప్పబడిన రాగాలను అనుసరించే ఉంటుంది.

## చిల్లర యక్షగానకర్తలు :

ఇవికాక 18, 19 శతాబ్దాలలో ఆయా గ్రామ నాటక సంఘాలలో వెలసినవీ అక్కడక్కడ భాషా, సంగీత సంప్రదాయాలకు తోడ్పడినవీ అయిన కొన్ని యక్షగానాలనూ, వాటి కర్తలనూ పేర్కొని, వాటిలోని విశేషాలను వాచవిగా చూపిస్తాము.

## వేలూరి కన్నయ్యదాసు :

ఇతడు కార్వేటి నగర వేణుగోపాల భక్తుడు : ఆంధ్ర కవిరత్న బిరుదాంకితుడు; తత్త్వజ్ఞాన పరిపూర్ణ ప్రభుత్వము చెందిన బాలస్వరూపానందస్వాముల పౌత్రుడు. ఇతడు ఒకానొక ప్లవనామ సంవత్సర కార్తీక శుద్ధ పంచమినాడు శ్రీ మహాభారత విలాస మనే యక్షగానం రచించాడు. ద్రౌపదీవివాహ సందర్భంలో కొట్నముల పాటలు, కందార్థములు, గీతార్థములు, సీసార్థములు, దరువులూ ఇందులో ఉన్నవి. అన్ని దర్వులకూ రాగాలు లేవు. పున్నాగ, నాట, పంతువ

రాళి, జంఝూటి, ఆనందభైరవి, రేగుప్తి, నీలాంబరి, ముఖారి, శంకరాభరణ, అఠాణ - కొన్ని దరువులకు ముందే ఉన్నవి. కవిత్వం తప్పులతడక.

కాళయ్య : ఇతడు మార్కండేయ విలాస మను యక్షగానం రచించాడు. ఇతడు 'విశ్వకర్మకుల సాగరచంద్రుడు.' దరువులు పద్యాలు నిర్దుష్టంగా సాగినవి కాని, కవిత పేలవంగా ఉంటుంది. చోళసింహపురి—లేక చోళనగరం ఇతని నివాసస్థలం - బహుశా నెల్లూరు కావచ్చు. తన యక్షగానాన్ని చోళపుర వరుడగు నరహరికి అంకితం చేశాడు. అలత్యప్రాసలూ యమకాలూ అందంగా ఉన్నవి.

దరువు : చందనమమ్మ శ్రీ భారతి, హరి
చందనగంధి శుభాకృతి
పొందుగ గీర్వాణబృందము నేలెడి
మందయాన అరవిందలోచన నీకె॥

మరుద్వతీ మృకండుల సంవాదం — ఏల :

మృ : నన్నుతాంగి కానలోన, పన్నుగనే వెదకియలసి
యున్న నన్నుగాన కిప్పుడు, ఓ మరుద్వతీ
కన్నడసేయగా తగునా —

మ : పన్నుగనా పర్ణశాలకు, నన్నొంటరిజేసి విడిచి
ఉన్నతంపు అడవికిపోవగా — ఓ మునిచంద్ర
కన్నెలతో వెదుకవచ్చితి —

ఇందులో ఎరుకలసాని పాత్ర వస్తుంది. హాస్యగాడొకడు వస్తాడు. కాని, వాని హాస్యం మొరటు. ఇందులో గొబ్బి పాటలూ, ద్విపదార్థం, గీతార్థం, కందార్థం, సీసార్థం, చూర్ణిక—ఉన్నవి. దరువులముందు ఆహిరి, ఆనందభైరవి, సౌరాష్ట్రి, తోడి సావేరి, శోకవరాళి, కాంభోజి—మొదలైన రాగాలున్నవి.

నవరోజు రాగంలో జోలపాట :

అయ్య రారా మార్కండయ్య రారా
చయ్యన ననుగన్న ముద్దులయ్య రారా....

## రామాయణ యక్షగాన కర్తలు :

కూచగిరి యల్లదాసు రచించిన కూచకొండ రామాయణములో రాగాలు లేవు. విశ్వామిత్ర గోత్రజుడైన వేంకటనాయకకవి రచించిన లేపాక్షి రామాయణం, మూడు రాత్రుల కథ — బాలకాండంనుంచి యుద్ధకాండంవరకూ కథ. హరికి అంకితం. రాగాలున్నవి. శేషాచలదాసు రచించిన ధర్మపురి రామాయణం

రామాయణ నాటకాలన్నిటిలోను బాగుంటుంది భాష, కవిత్వమూ నిరుష్టములు. 20 రాగాలదాకా దరువుల ముందున్నవి. పూరిరాగం ఎక్కువ. తిరునగరు అనంతదాసు కుశలవ చరిత్రమనే రామనాటకం రచించాడు. ఇతడు సంగీత సాహిత్య విద్యా ప్రవీణుడనని చెప్పుకొన్నాడు. ఇతని సాహిత్యమూ, రచనా బాగున్నవి. కందార్థాలే కాకుండా ఉత్పలార్థాలను కూడా చెప్పాడు. ఇతడు వేదాద్రి నరసింహభక్తుడు - నవరోజు రాగంలోని ఇతని లాలిపాట ప్రచారంలో ఉన్నది

లాలిమన్మధమొలక రవివంశతిలక లాలిముద్దుల చిలుక లాలికవితశుక
అన్నముద్దులపట్టి అవనిజకునిపుట్టి, సన్నుతిపొందితివి సభలజగజెట్టి
పన్నుగా మాయట్టి పణతులనుబట్టి, చెన్నుగానూ బెదరుచెలగి సీతొట్టి
పాత్రాగుము నిండ బంగారుకొండ పలుమారు ఏద్వకు పసినిమ్మపండ ॥లాలి

## సన్నిధి జగ్గరాజు:

ఇతడు 19 వ శతాబ్దంలో తూర్పు గోదావరిజిల్లాలో సముద్ర తీరస్థ గ్రామమైన ఉప్పాడలో ఉండినవాడు. ఎరుకుల కురంజి అనే తత్త్వబోధాత్మక యక్షగానం రచించాడు. దీని కథావిధానం ప్రబోధచంద్రోదయపు ఇతివృత్తాన్ని పోలి ఉంటుంది.

కర్మమెడలింపనేరని కారణమున
దుర్మదాంధతా దుష్క్రియ లునుము కొరకు
బుధుల సద్గోష్టి బాయక బుద్ధివలచి
జీవసతివచ్చె సంతోషభావమలర

జీవకాంత ఇందులో ప్రధానపాత్ర. అప్పుడు హాస్యగాడు ఆ జీవకాంత కెదురేగి.... జీవతనువులనగా యేవో, యీశ్వరతనువులనగా నేవో ఆ వృత్తాంతము తెలియజెప్పగదవే పాపా .... అని అడుగుతాడు — ఆమె స్థూలతనువూ, సూక్ష్మతనువూ, కారణతనువూ, నిర్మలతనువూ ఈ నాలుగున్నూ జీవతనువులనీ, ఆనందతనువూ, చిన్మయతనువూ, చిద్రూపతనువూ, శుద్ధతనువూ ఈ నాలుగున్నూ ఈశ్వరతనువులనీ చెపుతుంది.

ఇందులో ఎరుకతకూడా వస్తుంది. అందుకే కాకుండా, జ్ఞానబోధకం కావడంచేతకూడా దీనికి ఎరుకలకురవంజి అనిపేరు

సారంగరాగంలో అటతాళ దరువు :

శకునముచెప్పె యెరుకుల పడతిని సకియ తోడితేవె - కొమ్మా
నికటమై యమరుచా నిర్గుణతత్త్వము నిర్ణయింపగల నెరజాణను నిటు॥

తప్పక మదిలోని కోర్కెలు దెల్పేటి తరుణిదేవే కొమ్మా - అవునే
ఒప్పుమీర నోంకారము గురిచెప్పు నేర్పులాడినిదేవే - కొమ్మా॥

ఎరుకత ఎరుకచెప్పిన (జ్ఞానబోధచేసిన) సందర్భంలో దరువులు—

ఆనందభైరవి :

ఏకబ్రహ్మ మనేక దీప్తులది యెరుకలబుట్టె యవ్వా
ప్రాకటమగునా బ్రహ్మం దీపం శూన్యంగృహమే యవ్వా
బ్రహ్మ విష్ణు రుద్రాదుల కధికబ్రహ్మపదంబే యవ్వా
బ్రహ్మరంధ్రమున ప్రబలుచున్న చిద్బ్రహ్మంబిదియను మవ్వా.

సురట : పరమహంసగనుమీ - వెన్నెల బయలులోన నిలుమీ యవ్వా.

ఈ జగ్గరాజు తాను శృంగగిరిపీఠాసనస్థిత శ్రీమచ్ఛంకరాచార్య పాదారవింద మకరందపాద మిళిందాయమాన మానసుడనని గద్యలో చెప్పుకొన్నాడు. ఇతని యీ యక్షగానంలోని మొదటనున్న వినాయకస్తుతి పద్యమూ, సిద్ధేంద్రయోగి భామకలాపంలోని వినాయకస్తుతి పద్యమూ ఒక్కటే. సిద్ధేంద్రయోగి పద్యాన్నితడు అతనిపై గౌరవంకొద్దీ వాడుకొని ఉండవచ్చును.

## కానుకొలను వెంకటదాసు :

ఇతడు బందరు నివాసి. ఇతని శ్రీకృష్ణ నాటక ప్రబంధ రాసక్రీడా విలాసం యక్షగానంలో కవిత్వం నిర్దుష్టంగాను, మధురంగాను వుంటుంది. భాగవతంలోని దశమస్కంధమూ, నారాయణతీర్థుని కృష్ణలీలాతరంగిణీ,ఇతని రచన కుద్బోధకము లని తోస్తుంది. కొన్ని దర్వులకు రాగాలు మాత్రమే కాకుండా అవి పాడతగిన స్వరాలు కూడ ఉన్నవి. కొన్ని పాటలు తేటతెలుగులోను కొన్ని సంస్కృత సమాసాలతోను నిండి ఉన్నవి. ఇతడు శ్రీ శ్రీనివాస మహాప్రసాద లబ్ధ సహజ సంగీత సాహిత్య కవిత్వ విద్యావిచిత్రుడనని గద్యలో చెప్పుకొన్నాడు. మంగళ కౌశిక, జంఝూటి, ఆనందభైరవి, జంగలా, శుద్ధసావేరి, పున్నాగవరాళి, రేవగుప్తి, ముఖారి, బిలహరి, గౌరీ రాగాలను వాడినాడు.

## సామినేని పార్థసారథి :

ఇతడు దివ్యసూరీ విలాసము, శ్రీరామ మిశ్రావతరణం, శ్రీమన్నాథ మౌనీయం, శ్రీ పుండరీకాక్షోదయం, శ్రీమద్రామానుజ విజయం, యామున మౌనీయం, మహపూర్ణీయం అను ఆరు సంగీత ప్రబంధాలలో వైష్ణవాచార్యుల జీవితములను చిత్రించెను. ఈ ఆరింటికీ ప్రబంధషట్కమని పేరు. ఇందులోని

కీర్తనలు అధ్యాత్మ రామాయణ కీర్తనలవలె ఉంటాయి. ఆరభి, మధ్యమావతి, ధన్యాశి, మొదలైన ప్రసిద్ధరాగాలలో ఆ కీర్తనలను పాడవలెనని సూచించాడు.

## త్వరకవి రామకృష్ణయ్య :

భవానీ శంకర విలాసమనుపేర ఇతడు వ్రాసిన యక్షగానంలో పార్వతీ పరమేశ్వరుల ప్రణయ కలహమూ, సఖీసంధాన సంవాదమూ, పార్వతిని ప్రణయ కోపనగా, ఖండితగా చిత్రించు ఘట్టాలూ కలవు. పాటలు అందంగా ఉన్నవి. రాగాల సూచనలున్నవి. ఇతడు రుక్మిణీ పరిణయ, రతీపరిణయ, ద్రౌపదీపరిణయ, ధ్రువోపాఖ్యాన, తులసీమాహాత్మ్య, చెన్నకేశవ, సంవాద, రుక్మిణీ కృష్ణ సంవాద, గోపాల మాహాత్మ్య, గోపాలస్థంపురాణ, గజేంద్ర మోక్షణ, సహస్ర కంఠ రామాయణాది బహువిధ ప్రబంధ నిర్మాణతా నిధానతా త్వరకవివనీ, సంగీత సహజపాండిత్యుడననీ చెప్పుకొన్నాడు. విలుకానిపుర వేణుగోపాలుడు, కొరటూరి మందిరభవుడైన వల్మీకనాథుడూ యితని కిష్టదేవతలు.

## ఎర్రగుంట్ల వేంకట శేషయ్య :

రంభా రావణ సంవాద మితని యక్షగానము. భాషాకవిత్వమూ, సందర్భోచితమైన శయ్యాల మార్పులలో సాగే దరువులతో ఇతని యక్షగానం బాగుంటుంది. ఒక సీసపద్యంలో మేళకర్త రాగాలను, ఇంకొక పద్యంలో జన్య రాగాలను రంభను గురించిన ఇంద్రుని పొగడ్తలో చొప్పించాడు. 'వెడలె రావణుడు' అనే దరువు రావణపాత్ర పటాటోపానికి తగిన శబ్దాలంకారాలలో లయ విన్యాసాలతో సాగుతుంది.

.... .... ....

## హరికథా వాగ్గేయకారులు :

యక్షగానానికీ హరికథకూ ఈ అధ్యాయ ప్రారంభంలో చెప్పుకొన్న పరస్పర సంబంధాన్నిబట్టి ఆలోచిస్తే, మన దేశంలో యక్షగానమూ హరికథా ఆది నుంచీ కూడా పక్క పక్క ఉంటున్నాయనీ, ఒకొ్కక్కప్పుడు ఒకే ప్రబంధం నలుగురు నటులూ కలిసి ప్రదర్శిస్తే యక్షగానమై, ఒక్కరే ప్రదర్శిస్తే హరికథ అయ్యేదనీ తెలుసుంది. యక్షగానంలో అంతగా యెక్కువగా ఉండని ఒక ప్రత్యేకాంశ హరికథలో ఉండవచ్చు. యక్షగానం పూర్తిగా నాటకీయగతిలో సాగుతూ నటనానుకూలమై ఉంటుంది. అందులోని సంధివచనాలు క్లుప్తంగానే ఉంటాయిగాని, వాటిని ప్రత్యేకించి కథాకథన మని చెప్పడానికి వీలులేదు. హరికథలో ప్రత్యేకించి కథాకథనం ఉండాలి. తరువాత తరువాత యక్షగానంనుంచి

వేరుపడి స్వతంత్రత సంపాదించుకొన్న హరికథలో ఈ అంశం బాగా అభివృద్ధి చెందింది. ఈ కథాకథనంలో గద్యపద్యములేకాక, తొహరాలనే ఆఖ్యాన గేయాలు ప్రధానంగా ఉపయోగానికి వచ్చాయి. పాత్ర నిరూపణమూ; సంభాషణలూ, దరువులూ, హరికథలోకి వచ్చాయి, వాటితోపాటు అన్నిపాత్రల గానమూ నృత్యమూ, అభినయమూ హరికథకు డొక్కడే చేయడం వచ్చింది. ఒక్కడే, యిన్ని కళలతో గంటలకొలది నిలుచుండి, వందలకొలది ప్రజల నాకర్షింపగలగ డంతో హరికథ చాలా జనరంజకమైన కళగా పరిణమించింది.

స్వాతి తిరునాళ్ మహారాజును గురించి 18వ అధ్యాయంలో చెప్పుకొన్నపుడు మేరుగోస్వామి అనే మహారాష్ట్ర సంగీత విద్వాంసుని ప్రోత్సాహంవల్ల మహా రాష్ట్రదేశంలో ప్రచారంలో ఉండిన హరికథా ప్రసంగ పద్ధతి దక్షిణదేశానికి దిగుమతి అయినదనీ, స్వాతి తిరునాళ్ స్వయంగా అజామిళోపాఖ్యానం, కుచేలో పాఖ్యానం సంస్కృతంలో హరికథలుగా రచించాడనీ చెప్పుకొన్నాము. బొత్తిగా దక్షిణదేశానికి చెందినంతవరకూ హరికథలు మహారాష్ట్ర సంప్రదాయాన్ని అనుస రించే వచ్చాయని చెప్పవచ్చునేమోగాని, ఆంధ్రదేశానికి సంబంధించినంతవరకూ మాత్రము హరికథ యక్షగాన సంప్రదాయంలోనుంచే పరిణమించింది. అయితే, ప్రారంభ ప్రోత్సాహములు మాత్రము మహారాష్ట్ర సంప్రదాయంవల్లనే కలిగి ఉండవచ్చును. ఈ నాటికీ తొహరాలవంటి ఆఖ్యానగేయాలను తప్పిస్తే, దక్షిణాది హరికథలలో మహారాష్ట్ర సంప్రదాయిక గేయాలుండడానికీ, మన హరికథలనిండా యక్షగానపు దరువు లుండడానికీ అదే కారణము. తొహరాలు మహారాష్ట్రదేశపు లావణీ, పొవాడా గేయాలను పోలిఉంటాయి. ఆంధ్రదేశపు హరికథా పరిణామంలో పరరాష్ట్ర ప్రభావం తక్కువ అని చెప్పడానికి ప్రధాన దృష్టాంతం - మన అధ్యాత్మ రామాయణమే.

నాటకీయమైన సంవాదధోరణి తక్కువగా ఉన్నప్పటికీ, ప్రధానంగా ఆఖ్యాన శైలిలో సాగినది మునిపల్లె సుబ్రహ్మణ్యకవి రచించిన అధ్యాత్మ రామాయణము. దీనిని గురించి 14 వ అధ్యాయంలో విపులంగా చెప్పినాము. సూక్ష్మంగా ఆలోచించి చూస్తే కీర్తనాత్మకంగా నడచిన ఈ సంపూర్ణ రామాయణ గాథయైన అధ్యాత్మ రామాయణము మన భాషలో తొలి హరికథయని చెప్ప వచ్చును. దాని సంగీతశైలి కూడా ఏకవ్యక్తి ప్రదర్శనకు ఎక్కువ అనుకూలంగా ఉంటుంది. కాని, అందులో అంతర్గర్భితమై ఉన్న అధ్యాత్మబోధవల్ల ఈనాడు మనకు తెలిసిఉన్న హరికథా ధోరణిలోని సులభగతికి మించి అధ్యాత్మ రామా యణము హరికథాభాగవతుల నిత్య ప్రదర్శనలకు ఆలంబనీయం కాకపోయింది.

## తాళ్లూరి నారాయణకవి, మోక్షగుండ రామాయణము :

ఆ కొరత - తాళ్ళూరి నారాయణకవి రచించిన మోక్షగుండ రామాయణము వల్ల తీరింది. నారాయణకవికి ఒకనాటి స్వప్నంలో తన గురువర్యుడైన వెంకట శివార్యుడు కనబడి "అనేకులు రామాయణం రచించారు గాని, నీవు దానిని సులభశైలిలో కీర్తనాత్మకంగా రచింపు" మని ఆన తిచ్చారట. మెలకువరాగానే నారాయణకవి తన మిత్రుడైన వేమూరి యజ్ఞనారాయణ దైవజ్ఞుల నడుగగా - ఆయన - రామాయణమును తప్పకుండా హరికథగా రచించి సార్థకజన్ముడవు కమ్మనీ. దానిని మోక్షగుండపురపు శ్రీరామచంద్రమూర్తికి అంకితము చేయుమనీ సలహా యిచ్చారట.

మోక్షగుండ రామాయణ కీర్తనలశైలి సులభముగా ద్రాక్షాపాకంలో ఉంటుంది. సంప్రదాయసిద్ధములైన తోహరాలు, మంజరులు, రగడలు, పంచచామరాది వృత్తాలతో 3, 4 చరణాలకంటె ఎక్కువగా ఉండక, అంత్యానుప్రాస యమకాది నియమాలతో పండిత సామరరంజకంగా ఉంటుంది నారాయణకవి రచన. కాశీ కృష్ణాచార్యులవారి శిష్యబృందము చాలచోట్ల మోక్షగుండరామాయణ హరికథాగాన ప్రదర్శనములను కొన్నిరోజులు "సీరియల్" గా ఇచ్చినారట. ఈ రామాయణ కీర్తనలు - ఆంధ్రదేశంలో చాల యిండ్లలో స్త్రీజనంనోట కూడా వినిపిస్తాయి.

తోహరా : 1. రామ రామ యనవే శ్రీరామకథ వినవే
రామా రఘుకుల రామా సీతా
రామామణిరో రమ్యంబగు శ్రీ రామాయణ కథ ॥

2. ఒక దివ్యపురుషు డుదయించె నంత
ప్రకట హోమాగ్ని లోపలను వింత
హరి నీలాంగు డరుణ తేజుండు
అరుణాంబరుండు సాహస విక్రముండు ॥

3. మునీంద్ర వీ రెవరో తెల్పుమ
మేరుసమాన ధీరు లతి సుకుమారు లెవరి కుమారులో
వీ రిటురాగ కారణ మేమియొ ॥

జంఝూటి: 4. మహరాజ దశరథతనయులు దినరాజ కులఘనులు
దినరాజ కులఘనులు, శ్రీరామ లక్ష్మణులు
చనుదెంచి మారీచుల సుబాహుల ద్రుంచి యాగమ్ము
చేయించి యాగమ్ము సాగించి రీ దినము ॥

5. హనుమంత పోయి రమ్మిక
వాయునందన లేవవోయి
శీఘ్రముగ పోవోయి తేవోయి ఈయవోయి
చండకిరణుడు పొడవకుండ రావలెను దోర్దండ పొద్దుండ,
విలుచుండక, పోయిరమ్మిక॥

తాళ్లూరి నారాయణకవికి తర్వాత హరికథ దేశంలో త్వరత్వరగా వ్యాప్తి జెంద నారంభించింది. అన్ని ప్రాంతాలలోను హరిదాసులు బయలుదేరినారు. సింగరిదాసు, నరసింహదాసు, సంగడి నాగదాసు, తిరుక్కడైయూరు కృష్ణదాసు మున్నగువారు అనేక హరికథలు వ్రాశారు. వారిలో సింగరిదాసూ, కృష్ణదాసూ రామదాసు చరిత్రమును తమ తమ ధోరణులలో వేర్వేరుగా హరికథగా రచించారు. వీరికి తర్వాత ఆంధ్రదేశమంతటినీ హరికథాగానముతో ఉర్రూతలూగించిన మహాప్రతిభాశాలియైన వాగ్గేయకారుడు శ్రీ మదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు.

## ఆదిభట్ల నారాయణదాసుగారు :

ఈయన 1864 కు సరియైన రక్తాక్షినామసంవత్సర శ్రావణకృష్ణ చతుర్దశి నాడు అజ్ఞాత గ్రామంలో జన్మించి, సుమారు 80 ఏళ్లు జీవించారు. పేరూరు ద్రావిడ పుణ్యదంపతులయిన నరసమాంబ వేంకటచయనిగార్లు యీయన తలిదండ్రులు, హరికథా పితామహుడని వాసిగాంచిన యీ వాగ్గేయకారుడు లయబ్రహ్మ- నృత్తగీతవాద్యములలో మూడింటిలోను నిధి. గాత్రపాటలోను వీణావాదనంలోను మహా పండితులు, సంస్కృతాంధ్ర, పారశీకాంగ్లభాషలలో ప్రసిద్ధిపొందిన విద్వాంసులు, బహు గ్రంథకర్త, అష్టభాషావేత్త, అష్టభాషాకవి. భరతశాస్త్రంలో, వ్యాకరణ జ్యోతిష శాస్త్రములలో పండితప్రకాండులను గడగడలాడించిన విద్వచ్ఛక్తిమంతులు; సువర్ణ ఘంటాకంకణహస్తులు, చాలాకాలం వీరు విజయనగరంలోని విజయరామగణపతి సంగీతకళాశాలకు ప్రధానాచార్యులుగా పనిచేశారు. వీరు రచించిన హరికథలలో ప్రసిద్ధమైనవి 7, 8 వరకూ ఉన్నాయి.

ఐదారేళ్ళ బాల్యంలోనే ఆంధ్ర భాగవతంలోని వామనచరిత్ర పద్యాలను శ్రావ్యంగా పాడి పార్వతీపురంలోని ప్రజలను సమ్మోహనపరచినారట. ఆయన వ్రాసిన వేల్పువంద అను అచ్చుతెనుగు పద్యశతకంలోని యీ పద్యంలో బాల్యంలోనే తల్లిదండ్రులనుంచి భగవత్‌భక్తి నేర్చుకొన్నట్లు తెలుస్తుంది

> ఆరవయేట నిన్నరయు నెరవు తెల్పి
> పైచిరి కన్నవార్వొచ నాకు
> ఆనాటినుండి నే నాడుచుం బాడుచు
> నీ పేరు చాటుచుంటి నలుకొసల... .. '

ఇది సింహాచల వరాహ నరసింహస్వామిపైని నారాయణదాసుగారు చెప్పిన శతకము. ఈయన అసలుపేరు సూర్యనారాయణ, హరికథలలో ప్రతిభ సంపాదించుకొన్న తర్వాత నారాయణదాసయినారు.

ఋగ్వేదాన్ని స్వరపరిచి అచ్చ తెనుగులోకి అనువదించారు. ఆ గ్రంథం పేరు - మొక్కుబడి. దానినికూడ ని స రి అను మూడు స్వరాలలో స్వరపరిచారు. "తారకం - హరికథామృతం" అనే సంస్కృత కావ్యములూ, బాటసారి అనే మరొక అచ్చతెనుగు కావ్యమూ రచించారు. పారశీక భాషలోని ఉమర్ ఖైయాం రుబాయీలను తెలుగు, ఇంగ్లీషు సంస్కృత భాషలలో పద్యములుగాను, తెలుగు గేయములుగాను కూడా అనువదించారు. సమకాలికులైన సంగీత సాహిత్య విద్వాంసులూ, కళాశీలురూ అందరూ కూడా ఈయన బహుముఖ ప్రతిభకు ముగ్ధులయేవారు.

ఈయన రచించిన హరికథలు : 1. జానకీశపథము, 2. రుక్మిణీ కల్యాణము, 3. మార్కండేయ చరిత్ర, 4. హరిశ్చంద్రోపాఖ్యానము, 5. అంబరీష చరిత్ర, 6. భీష్మ చరిత్రము, 7. ప్రహ్లాద చరిత్ర, 8. గజేంద్రమోక్షము, 9. యథార్థ రామాయణము.

ఈయన యథార్థ రామాయణంలో - మూలరామాయణ కథలోని అహల్యా దేవేంద్ర వృత్తాంతం, వాలి వధవంటి కొన్ని ఘట్టములు ప్రక్షిప్తములని వాటిని వదలి స్వతంత్ర ఫక్కీని రచించారు.

## బాగేపల్లి అనంతరామాచార్యులు :

ఈ గ్రంథమునకు పరిచయ వాక్యాలు వ్రాసే సందర్భంలో శ్రీ రాళ్ళ అనంత కృష్ణశర్మగారు - రాయలసీమ ప్రాంతంలో కడచిన శతాబ్దాంతంవరకూ జీవించి ఉండిన బాగేపల్లి అనంతరామాచార్యులనే హరికథా వాగ్గేయకారుని గురించి తెలియజేశారు. అనంతరామాచార్యులు తాలూకాకచేరిలో ఉద్యోగియైనా, జీవిత కాలమంతా హరికథా రచనా, ప్రసంగములతో గడిపిన భక్త గాయకుడు ఆయన రచించినవి సుమారు 13 హరికథలట. 'చక్కని పరిశుద్ధ లలితరచన. పాటలు తోహరాలు : అన్నీ శ్రీ వేంకటేశ్వరస్వామికి అంకితములు. వాటి సంగీతపు వరుసలన్నీ ఇంచుమించు అప్పటికే వాడుకలోనున్న కృతుల, పదాల, జావళీల మెట్లకు అనుకృతులే. ఆయన వంశంవారిప్పటికీ హరికథా వృత్తిలోనే జీవనం సాగిస్తున్నారు.' ఈ అనంతరామాచార్యులవారు నారాయణదాసుగారికి పూర్వులే అయి ఉండాలి.

## బా లా జీ దా సు :

నారాయణదాసుగారి హరికథలకు తర్వాత బహుళప్రచారం పొందిన హరికథలు బాలాజీదాసుగారివి. ఈయన విశాఖజిల్లా అనకాపల్లి కాపురస్థులు. ఈయన తల్లిదండ్రులు కేశవరామ ప్రసాదుగారు, గన్నమాంబ. విశ్రుతగాన ప్రవీణుడౌ బాలప్రసాదుగారి కీయన సహోదరుడు. ఈయన శైలజాహృదయాబ్జ భాస్కర కటాక్షవీక్షణప్రాప్తగాన కవిత్వయుతుడు. ఈయన రచించిన హరికథలు - గయోపాఖ్యానం, జయప్రదాదేవి చరిత్రం, దుర్మాంగద చరిత్రం, నలచరిత్ర, సీతా కళ్యాణం, దయాకర విజయం, శశిరేఖా పరిణయం, కుశలవ విజయం, త్రిశంకు విజయం, సూరదాసు చరిత్రం, పురందరదాసు చరిత్రం, ద్రౌపదీమానసంరక్షణం, కుచేలోపాఖ్యానం, భద్రాచలరామదాసు, కర్ణానందదాయిని, హరికథేతిహాసమంజరి 1, 2 భాగాలు, సంపూర్ణ రామాయణం, పూర్వహరిశ్చంద్ర,

## తిరునగరి శేషదాసు

హేలాపుర నివాసులు కస్తూరి రంగదాస సుపుత్రులు అయిన తిరునగరి శేష దాసుగారు ఆంధ్రదేశమందలి సుప్రసిద్ధ హరిదాసులలో నొకరు. భక్తిజ్ఞానమార్గముల చేతగాని, నృత్యగీతవాద్య కృషిద్వారాగాని, నాదబ్రహ్మోపాసనద్వారాగాని, భగవద్గుణకీర్తనచేయటమే భవసాగర తరణోపాయమని నమ్మిన సాధకులలో ఒకడైన ఈ శేషదాసుగారు బాల్యంనుంచీ శ్రీరామభక్తుడై హరికథలను రచించి వాటిని గానముచేసి భగవద్భక్తి మహిమను గురించి ప్రచారముచేసినవాడు. ఈయన ప్రతి సంవత్సరమూ పాదచారులై భక్తసంఘముతోకలసి రామసంకీర్తనములను గానం చేస్తూ భద్రాద్రి యాత్ర చేసి శ్రీరాములనుకొలిచి వస్తుండేవాడు. చలివేంద్రలు, పాంథజన విశ్రాంతి ధర్మశాల ను కట్టించాడు. ఈయన రచనలలో శ్రీరామ పాదుకా పట్టాభిషేకమూ, సుభద్రాపరిణయమూ, సీతాకల్యాణమూ, సీతాపహరణమూ, శ్రీమదుత్తరరామ చరిత్రా ప్రధానమైన హరికథలు.

అయ్యగారి వీరభద్రరావు – అను వారు శివలీల, మయూరధ్వజచరిత్ర, కుశలవ, రామదాసు చరిత్ర శ్రీకృష్ణతులాభారము అను హరికథలను వ్రాశారు.

కోసూరి భోగలింగదాసు – అను వారు శ్రీమత్సంగీతానంద రామాయణమును, బాల, అయోధ్య, సుందర యుద్ధకాండములు హరికథలనూ, నలోపాఖ్యాన హరికథనూ రచించారు.

కొమ్మూరి బాలబ్రహ్మనంద దాసు – అను వారు భీమార్జున గర్వభంగము, సంపూర్ణ శివచరిత్రము, శ్రీరామకథాలహరి బాల, అయోధ్యకాండలను, నందనార్ చరిత్రను, శ్రీకృష్ణరాయబారమును, బృందాదేవిచరిత్రను హరికథలుగా రచించారు.

బాబు పి. యస్. నౌషర్ఖాన్ జీ కవిగారు – కబీరుదాసు చరిత్రను, సీతా కళ్యాణమును, వైజయంతీ విలాసము (విప్రనారాయణ చరిత్ర)ను, శ్రీరామ జననమును హరికథలుగా రచించారు

వరిమి సుబ్రహ్మణ్యదాసు – అను హరికథకునకు కథకవాచస్పతి అనీ, కవిశిరోమణి అనీ బిరుదులున్నవి. ఈయన రచించిన హరికథలు తన కాలమునాటి యితరుల రచనలకంటే ఇతివృత్తంలో ప్రత్యేకత కలిగి ఉన్నవి. సంపూర్ణభారతం 22 కథలు, ధన్వంతరి చరిత్రము, నలచరిత్రము, 14 కథలుగల సంపూర్ణ శ్రీకృష్ణభాగవతము, లక్ష్మీ కళ్యాణమును క్షీరసాగర మథనము శమంతకమణి అనే సత్యభామా కళ్యాణము పార్వతీ పరిణయమూ, పతితులసి, సుమతీచరిత్ర, రఘుకుల చరిత్ర (కాళిదాసు రఘువంశాన్ని అనుసరించినది) తులసీ ప్రభావము, సాయిబాబా చరిత్ర.

పెంటపాటి సర్వేశ్వరరావు భాగవతార్ గారి హరికథలు - భక్తరామదాసు భీమార్జున గర్వభంగము, భక్తప్రహ్లాద, సత్యనారాయణవ్రత మహాత్మ్యము.

ములుకుట్ల పున్నయ్యశాస్త్రి గారి హరికథలు - విజయభారతము, మాయాసుభద్ర, భక్త త్యాగరాజు, వేమనయోగి మూడున్నరవజ్రం,శ్రీకృష్ణదేవరాయలు, శివాజీ, రాణాప్రతాప్, మహాత్మాగాంధీ క్రిప్సురాయబారం, నేతాజీ — ఈయన హరికథల ఇతివృత్తములూ, రచనా నిర్వహణా మిగిలినవారి రచనలకంటే నవ్యత్వము కలిగి, ఆధునికాభిప్రాయాలతో ఉంటవి. త్యాగరాజు హరికథ, స్వరాజ్య హరికథలు బాగా ప్రచారంలో ఉన్నవి.

పెద్దింటి దీక్షితదాసుగారు : ఈయన పూర్తి పేరు సూర్యనారాయణ దీక్షితులు. నరసాపుర వాస్తవ్యులైన ప్రసిద్ధ హరికథాకారుడు, మహాభారత ప్రధానేతివృత్తమంతా వేర్వేరు ఘటాలు హరికథలుగా రచించడమేకాకుండా, కవిమహాత్మ్యము అను పేర అందులోని నలదమయంత్యుపాఖ్యానమును కూడ రసవంతంగా రచించారు. ఇవిగాక, వీరి హరికథలలో ప్రత్యేకించి చెప్పుకొనదగినది పేరంభొట్లు పెళ్ళి. ఇది హాస్యరసప్రధానమూ, సాంఘికేతివృత్తం కలది. కీర్తిశేషులయిన ముసునూరి సూర్యనారాయణ భాగవతారుగారు ఇతర కథలతోపాటు దీక్షితదాసుగారి కథలను కూడా చెపుతూ వుండేవారు. దీక్షితదాసుగారి గేయాలు సరళబంధంలో సాగిపోతూ ఆకర్షణీయంగా ఉంటాయి.

తిరుమలనల్లాన్ చక్రవర్తుల సంపత్కుమార జగన్నాథ తిరువేంగళాచార్యులుగారు : వీరు విజయవాడ వాస్తవ్యులయి, చెప్పుకొనదగిన హరికథారచన చేసినవారిలో ఒకరు. రామాయణ, మహాభారత ప్రధానేతి వృత్తాలనే కాకుండా, భాగవత గాథలయిన సత్యభామా పరిణయమునూ, మోహినీరుక్మాంగద కథనూ ఇతరత్రా గోదా పరిణయమునూ, శోభనాచల మహాత్మ్యమునూ కూడ హరికథలుగా రచించారు. ఇతివృత్తాలలోను, రచనలోను, కొత్తదనము కలిగి, ఈనాటి జనాభిరుచుల ప్రకారం కొత్త కథలు అదే ఫక్కీలో రచించి గానం చేసేవారి ప్రతిభపైనే—ఈహరికథల భవిష్యత్తు ఆధారపడిఉంది. చరిత్రాత్మక గాథలూ, జాతీయతా ప్రబోధకములైన సంఘటనలూ,సాంఘికపునరుజ్జీవన సమస్యాత్మకములైన కథలూ నూతన ధోరణులలో హరికథల బాణీలో రచించి జనులకు వినోదమూ వికాసమూ కలిగించడానికి ఎంతైనా అవకాశం లేకపోలేదు.

# ఇరవైయొక్కటవ అధ్యాయం

# ఆధునిక వాగ్గేయకారులు (1850-1956)

త్యాగరాజుకు సమకాలికులూ, అనుయాయులూ అయిన ధాతుకల్పనాదక్షులయిన వాగ్గేయకారులను గురించిన – ఈ గ్రంథపు 18 వ అధ్యాయంలో 19 వ శతాబ్దమును పూర్తిచేశాము. 19, 20 అధ్యాయాలలో కూడా 19 వ శతాబ్దంలోని మరికొందరు వాగ్గేయకారులను స్మరించాము.

స్థూలంగా ఆధునికయుగమని నిర్దేశించవలసివస్తే ఈనాటికి నూరు సంవత్సరాల వెనుకనుంచీ చూసుకొని రావలసి వుంటుంది. 19 వ శతాబ్దపు చివరిసగంలో పుట్టి, ఈనాటికీ జీవించివున్న కొందరు వాగ్గేయకారులను గురించీ, కొంచెము వారికి 10, 15 ఏళ్ళ ముందరి తరంవారిని గురించీ చెప్పుకొంటూ ఈ అధ్యాయం ప్రారంభిస్తాము. ఈ శతాబ్దంలో మొదటి సగములో మధ్యయుగపు ప్రాచీనతకూ, ఆధునిక యుగపు నవ్యతకూ నడుమనుండిన సంధియుగ లక్షణాలు కనిపిస్తాయి. అందుకే ఈ తొలిసగంలో ప్రాచీన సంకీర్తన యుగలక్షణాలు ధాతుకల్పనాదక్షులనాటి కృతి రచనా లక్షణాలు, సంగీత సభాసంప్రదాయాలు అనాడే మనప్రాంతాలకు కొత్త పద్ధతులతో దిగుమతియైన రంగస్థల సంప్రదాయాలూ కనిపిస్తాయి. అందుచేత ఈ తొలిసగంలో మనకు తారసిల్లే వాగ్గేయకారుల రచనలలో ఈ సంప్రదాయాలన్నీ కనిపిస్తాయి. ఒక్కరి రచనలోనే అన్నీ ఉంటాయనికాదు. ఒక్కొక్కరి రచనలో ఒక్కొక్క లక్షణం ఎక్కువగా భాసిస్తుందని చెప్పాలి.

మొత్తంమీద ఆధునికయుగపు వాగ్గేయకారుల రచనలను మూడువిధాలుగా విభజింపవచ్చును. ఒకరు – పూర్తిగా సంగీత విద్వాంసులయి, సాహిత్యములో ఒకవిధమైన ప్రవేశం కలిగి గేయ రచనలు చేసినవారు. రెండవ విధానికి చెందిన వారు పూర్తిగా సాహిత్యపరులయి లీలగా సంగీతాభిరుచికలిగి గేయరచనలు చేసిన వారు - మూడవవారు – సంగీత సాహిత్యములలో సమానాభినివేశం కలిగి గేయ రచనలు చేసినవారు.

## వీణె శేషన్నగారు :

శేషన్నగారి ప్రాచీనులు శరభోజీమహారాజా కాలంలో తంజావూరిలో ఉండేవారు. అప్పటి వీణె సోమన్నగారి మనుమడు చిక్కరామప్పగారు తన కాలంనాటికి

మైసూరు చేరుకొన్నాడు. ఆయనకు కడగొట్టు కుమారుడు శేషన్నగారు. 1852 లో జననం. 1926 లో పరమపదించారు. ఈయన కర్ణాటకుడయినా, వర్ణములు జావళీలు, తిల్లానాలూ తెలుగు సాహిత్యంతోనే రచించారు. వైణికశిఖామణి అని మైసూరు రాజాస్థానంలో బిరుదు సంపాదించిన ఈ విద్వాంసుడు ఫిడేలు, జలతరంగం, స్వరబత్తు, హార్మోనియం, పియానో మున్నగు పలు వాద్యాలను చక్కగా వాయించగలిగినవాడు. వీణాగానమునమాత్రం ఆయన ప్రత్యేక సాధన చేసి, సిద్ధహస్తుడయి, ఉత్తర దక్షిణ దేశాలలో ప్రఖ్యాతి సంపాదించాడు. ఈ గ్రంథానికి పరిచయ వాక్యాలు వ్రాసే సందర్భంలో వీరిని గురించి మా దృష్టికి తెచ్చిన శ్రీ అనంతకృష్ణ శర్మగారికి కృతజ్ఞులము.

## తంజావూరు విద్వచ్చతుష్టయము : (1829 - 1900)

ముత్తుస్వామి దీక్షితులకు శిష్యులై, స్వాతి తిరునాళ్ మహారాజు ఆస్థానంలో సంగీత భరతశాస్త్ర విద్వాంసులైన పొన్నయ్య, వడివేలుగార్లను గురించి 18 వ అధ్యాయంలో కొంత చెప్పుకొన్నాము. వారిద్దరేకాక, శివానందం, చిన్నయ్యలతో కలిసి మొత్తం నలుగురు సోదరులకు సంగీతలోకంలో తంజావూరు విద్వచ్చతుష్టయం అని ప్రసిద్ధి. ఈ నలుగురు సోదరులు, వీరికి మూడవతరంలోని మహాక పొన్నయ్యపిళ్ళెగారును కూడ తెలుగులో అనేక వర్ణములూ, కీర్తనలూ, జావళీలు రచించారు. 'పేరు వుడయాన్ పేరిశై 'అను పేర మూడవతరపు పొన్నయ్యగారు ఈ వంశపువారు రచించిన 20 తానవర్ణాలను 29 కీర్తనలను సస్వరముగా అచ్చు వేయించారు. తానవర్ణాలలో ఎక్కువభాగం, ఈ సోదర చతుష్టయంవారు స్వాతి తిరునాళ్ ఆస్థానానికి పోకముందే తంజావూరులో ఉన్నపుడు బృహదీశ్వరునకు అంకితంగా రచించినవీ, శరభోజీరాజు మంత్రియైన దత్తాజీకి అంకితంగా రచించి నవీ, తులజాజీరాజుకు అంకితంగా రచించినవీ ఉన్నవి. వీటిలో తానవర్ణాలు గౌళ, లలిత, ఆనందభైరవి, కమలామనోహరి, నాటకురంజి, తోడి, కళ్యాణి, శంకరాభరణం, కాంభోజి, కేదారగౌళ, సావేరి సురటి, అఠాణ, సారంగ, పంతువరాళి — వంటి ప్రసిద్ధ రాగాలలో ఉన్నవి. పై సోదరులలో చిన్నయ్య మైసూరు కృష్ణరాజేంద్రుని ఆస్థానములో కొంతకాలం వుండి, తానవర్ణాదులు రచించినట్లు తెలుస్తుంది. వీరి వంశంవారీనాటికీ దక్షిణదేశంలో పేరెన్నికగన్న గాయకులుగా ఉన్నారు మూడవ తరంలోని పొన్నయ్య పిళ్ళెగారు మద్రాసు విశ్వ విద్యాలయంలో పని చేశారు.

## దాసు శ్రీరాములుగారు (1846-1908) :

ఆంధ్ర సంగీత సాహిత్య వికాస చరిత్రలోను, సంఘాభ్యుదయ చరిత్రలోను 19 వ శతాబ్ది చివరి సగంలో ప్రధానపాత్ర వహించిన యుగపురుషుల కోవకు

చెందిన దాసు శ్రీరాములుగారు కందుకూరి వీరేశలింగం పంతులుగారికి అన్నివిధాలా సమకాలికులు, కృష్ణాజిల్లా కైకలూరు తాలూకాకు చెందిన కూరాడ గ్రామంలో కామాంబా కన్నయ్య మంత్రిగార్లకు ఏకపుత్రుడుగా జన్మించారు. ఇంటివద్ద పారశీ భాషా, బందరు నోబిల్ కళాశాలలో ఆంగ్ల విద్యా, నూజివీడు సంస్థానంలో మాడభూషి వేంకటాచార్యులవారి సహవాసమునా, తర్వాత ఆకిరిపల్లి లోని సంస్కృత విద్యాపీఠంలోనూ సంస్కృతభాషా అభ్యసించారు. 12 వ ఏటనే సోమలింగేశ్వరునిపై ఒక శతకమునూ, 14 వ ఏట సాత్రాజితీ విలాసమనే యక్షగానమునూ రచించిన వీరికి పద్యకవితలోనూ గేయ కవితలోనూ కౌశలం ఆబాల్యముగా పాదుకొన్నది. జ్యోతిష అష్టావధాన వ్యస్తాక్షరి, శతఘంటాకవన, సమస్యా, పూరణ విద్యలలో ఆరితేరి నూజివీడు వల్లూరు సంస్థానాల పండిత సభలలో అగ్రతాంబూలం సన్మానం పొందారు. కొన్నాళ్లు గుడివాడలో ప్రధానాంధ్రోపాధ్యాయులుగా పనిచేసి వీరు సెకండ్ గ్రేడ్ ప్లీడర్‌గా ఉత్తీర్ణులై బందరులోను, ఫస్టు గ్రేడ్ ప్లీడరుగా ఉత్తీర్ణులై ఏలూరులోను ప్రాక్టీసు చేశారు. కల్పవల్లి అనే పత్రికకు సంపాదకులై వితంతు వివాహము, నౌకాయానము, సంఘబహిష్కార ప్రాయశ్చిత్త సమస్యలు మొదలైన సాంఘిక సమస్యలపై మార్గదర్శకములైన వ్యాసాలను వ్రాశారు.

ఏలూరులో వీరి పోషణలో ఒక గాన పాఠశాల ఉండేది. దేవీభాగవతాంధ్రీకరణము, అచ్చ తెనుగు అభిజ్ఞాన శాకుంతలము, రత్నావళీ మాళవికాగ్నిమిత్ర, మహావీర చరిత్రాది సంస్కృత నాటకాంధ్రీకరణాలే కాకుండా, వీరు మనోలక్ష్మీ విలాస నాటకము, మంజరీ మధుకరీయము, కురంగ గౌరీశంకరము, సంగీత రసతరంగిణి అను బుద్ధ చరితము స్వతంత్ర నాటకములుగా రచించారు. వీరి పద్యకావ్యాలలో ఆంధ్రవీథి. తెనుగునాడు వచన కావ్యాలలో అభినవ గద్యప్రబంధమూ రసజ్ఞుల మన్ననలను పొందినవి.

వీరు అనేక కృతులు, సర్వజితులు, పదములు, జావళీలు రచించిన వాగ్గేయకారులు:- అలంకార సంగీత భరతనాట్యశాస్త్రములలో కూలంకషమైన ప్రజ్ఞ కలవారై తమ పదములను జావళీలను నృత్యాభినయములకు వినియోగించు కూచిపూడి నర్తకులకు, ఇతర కళాపరులకు అభ్యాస విన్యాసాలలో సహాయపడుతుండేవారట వీరి సంగీత రచనలలో కొన్నింటిలో పిఠాపురం వీణాచార్యులు, తుమరాడ సంగమేశ్వర శాస్త్రిగారు సహగేయకారులై స్వర వసరులను కూర్చుతూండినట్లు శ్రీ ద్వారం వెంకటస్వామినాయుడుగారు మాకు చెప్పినారు. 'గణనాయకం' అను కళ్యాణి రాగకృతిలో చివర 'దాసు రామపాల సంగమేశ్వరం' అను ముద్రలో ఇద్దరి పేరులూ ఇందుకు తార్కాణం.

ఆనాడు నట్టువనార్లు, కళావంతులు రెండువిధముల నాట్యము చేసూవుండే వారు. ఒకటి భరతనాట్యమనీ, రెండవది కర్ణాటకాభినయమనీ వ్యవహరించేవారు. ఈ రెండవపద్ధతి నాట్యానికే పదములనూ జావళీలను ఉపయోగించేవారు. దాసు శ్రీరాములుగారి జావళీలలో ఆవిధంగా కర్ణాటకాభినాయానికి ఉపయోగించేవాటిని మూడింటి నిక్కడ కొంచెముగా ఉదహరిస్తాము :

1. మోహనరాగం (పరకీయనాయిక)

తత్తరపడనేల తాళు తాళరసామి
అత్తింటి కోడలరా —
కొత్తగా నేవచ్చి కొన్ని నెలలాయెరా—

2. (ఖండితనాయిక)

అవిపీ ముషిణికాయ, అది నీకు ప్రియమాయ
అయ్యో నిన్నేమందురా॥

3. ఆనందభైరవి – (ప్రోషిత భర్తృకయైన నాయిక)

ప॥ వనితరో యీ వన్నెలేలనే – యీ వేళ నాకు

అను ప॥ ఆకులేల పోకలేల అగరేల గంధమేల
మగనికి దయలేక మేను సగమై యున్నట్టివేళ॥

చర॥ భాసురాంగి తోటలేల, ఆటలేలపాటలేల
దాసురామ పాలుబాసి ఆశలుడిగి యున్న వేళ॥

## తుమరాడ సంగమేశ్వరశాస్త్రిగారు (1874-1931) :

వీణాచార్యుడని దేశ ప్రసిద్ధిగాంచిన తుమరాడ సంగమేశ్వరశాస్త్రిగారు వాగ్గేయ రచనలో దాసు శ్రీరాములుగారికి సహశిల్పి అని ముందు చెప్పుకొన్నాము. వీరిని సన్నిహితులు సంగన్నశాస్త్రిగారని పిలిచేవారు. బొబ్బిలిసంస్థానంలోని సంగం వలసవద్ద బలివాడ అగ్రహారం వీరి జన్మస్థానల విజయనగరం మహారాజగు ఆనందగజపతికి ఆస్థాన వైణికులూ, ఆప్తమిత్రులూ అయిన నందిగాన వెంకన్న గారు సంగన్నశాస్త్రిగారికి వైణిక విద్యాగురువు. వెంకన్నగారు వీణావాద్యంలో అసమాన ప్రతిభాశాలి మాత్రమేగాక, సుదూరము వినబడే గౌడగాత్రంగల గాయకులు. వారి శిష్యులైన సంగమేశ్వరులు వారిఅంశ గ్రహించి, ప్రతిభలోను, కీర్తిలోను కూడా గురువునుమించినవా రవిపించుకొన్నవారు. మొదట కొన్నేళ్లు విశాఖపట్నం జిల్లాలోని గొనేవారి సంస్థానంలో ఆసాన వైణికులై తర్వాత ఖశింకోట సంస్థానం చేరారు. ఆ జమీందారుగారితో కలిసి చెన్నపట్నం వెళ్ళి

అక్కడ కృష్ణగాన సభలోను, గోవిందప్పనాయక వీధిలోని రామమందిరంలోను వీణ కచ్చేరీలుచేసి, ఆనాటి చెన్నపట్నపు దాక్షిణాత్య విద్వాంసు లందరి మన్ననను పొంది, తోడాలతో బహూకరింపబడ్డారట. తర్వాత సంగన్నగారు పిఠాపురం సంస్థానంచేరి, జీవితాంతంవరకూ అక్కడే ఉన్నారు. అక్కడ ఉన్నప్పుడే విశ్వకవి రవీంద్రనాథ ఠాకూరు వారి వీణాగానమునకు సమ్మోహితులై కలకత్తాకు తమ శాంతి నికేతనానికి తీసుకవెళ్ళి, కొన్నాళ్లు ఆతిథ్యమిచ్చి, అక్కడి తమ విద్వాంసులకు, పాశ్చాత్య సంగీత మిత్రులకు వీరి సంగీతకళా వైదుష్యమును పరిచయపరచినారట. వీరు దీక్షగా త్రికాలములను, త్రిస్థాయినీ ఏకబిగిని దినమునకు వేయిసార్లు చొప్పున నూరుదినాలు వరుస తప్పకుండా వీణావాదనమున సాధనంచేసిన మహావిద్వాంసులు, కోకిలాలాప, మేఘగర్జనాది ప్రకృతి ధ్వనులలో ఏ ధ్వనీ వారివీణపై పలికింపలేనిది లేకుండా ఉండేదట. నాగబంధస్వర సంప్రదాయంలో సిద్ధహస్తుడైన సంగన్నగారికి మైసూరువీణవీ శేషన్నగారన్నా, విజయనగరం వీణ వెంకటరమణదాసుగారన్నా అత్యంత గౌరవప్రపత్తు లుండేవట. లలితోపాసకులైన శాస్త్రులుగారు వయొలిన్, నాగస్వర వాద్యములను కూడ మనోహరంగా అవలీలగా వాయించేవారట. వీరి సంగీత రచనలలో శ్రీరాములుగారితో చేసిరని ఉదాహరించినది 'గణనాయకం' అనే కళ్యాణిరాగ కీర్తనను గురించి ముందు ప్రస్తావించాము. ఇదిగాక, ధన్యాసిరాగంలో ఆదితాళంలో తాన వర్ణమూ, ఘనరాగ పంచకంలో తాన చిట్టలూ, మోహన మొదలైన రక్తిరాగాలలో స్వరపల్లవులూ సంగన్నశాస్త్రిగారు రచించినవి సరే వాయిస్తూండగా వినిన శ్రీ ఆకొండి రాజారావుగారు పిఠాపురంవాస్తవ్యులు మాకు దయతో తెలియజేశారు. వీరు 1931 లో పుష్య అమావాస్యనాడు పరమపదించారు.

## ముత్తయ్య భాగవతార్

(1877-1945) ఈయన తండ్రిపేరు లింగయ్య. తల్లి పేరు ఆనందవల్లి, తమిళనాడులోని రాజపాళానికి దగ్గర పునల్వేలి గ్రామంలోజన్మించారు. బాల్యంలోనే తండ్రి గతించాడు. హరికేశనల్లూరులో పెరగడంచేత హరికేశనల్లూరు ముత్తయ్య భాగవతార్ అని ప్రసిద్ధి. బాల్యంనుంచీ లలిత కళలయందభిమానం ఎక్కువ. బాల్యంలోనే ఆయన తిరువయ్యూరువెళ్ళి. సాంబశివ సద్గురువువద్ద గురుకులపద్ధతిలో సంగీతాభ్యాసం చేశారు.

హరికథా ప్రదర్శన లందభినివేశం గలిగి, తన మేనమామగారయిన లక్ష్మణ సూరిగారి సాహాయ్యముతో సతీసులోచన, కౌసల్యాపరిణయం, వల్లీకళ్యాణం మొదలయిన హరికథలను దిద్దితీర్చారు.ఈ మహామహోపాధ్యాయ లక్ష్మణసూరిగారి కుమారుడు నేడు సుప్రీంకోర్టు న్యాయమూర్తియైన టి. యల్. వేంకట్రామయ్యర్ గారు గొప్ప సంగీత శాస్త్ర విద్వాంసుడు, పరిశోధకుడు,

ముత్తయ్యా భాగవతులు తెలుగు, కన్నడ, సంస్కృత, తమిళ భాషలలో చాలా అపూర్వ రాగాలలో వర్ణాలు, కీర్తనలు, దరువులు రాగమాలికలు, తిల్లానాలు – వివిధ లయరీతులలో రచించారు. ఈయన ప్రసిద్ధి విని 1928 లో మైసూరుమహారాజు కృష్ణరాజ వొడయరు ఈయనను తన ఆస్థానానికి రప్పించి పాడించి, కంఠాభరణ కంకణాదులతో, గాయకశిఖామణి అనే బిరుదుతో గౌరవించి తమ ఆస్థాన విద్వాంసునిగా నియమించుకొన్నారు. అక్కడ ఉండగా, మహారాజు కోరికపైని కన్నడంలో చాముండీ అష్టోత్తర సంకీర్తనావళిని, సంస్కృతంలో ఇతర శివాష్టోత్తర శత కీర్తనలను రచించారు.

1930 లో మద్రాస్ మ్యూజిక్ అకాడమీ ఈయనను అధ్యక్షునిగా ఎన్నుకొని, సంగీత కళానిధి అని బిరుదు ఇచ్చారు. 1931-32 మ్యూజిక్ అకాడమీకి సంబంధించిన టీచర్స్ ట్రెయినింగ్ కాలేజీకి ప్రిన్సిపాల్‌గా పనిచేశారు.

1936 లో తిరువాన్కూర్‌మహారాజు చిత్రతిరునాళ్ ఈయనను తిరువేంద్రం రప్పించుకొని, స్వాతి తిరునాళ్ అకాడమీకి అధ్యక్షునిగా నియమించి స్వాతి తిరునాళ్ మహారాజు సంగీత రచనలను సస్వరంగా పరిష్కరించి ప్రకటించేభారం ఆయనపైని పెట్టినారు.

వివిధ వాగ్గేయకారుల రచనలతోను, తన సంగీత శాస్త్ర పరిశోధనాంశములను చేర్చి సంగీత కల్పద్రుమమనె తమిళ గ్రంథాన్ని రచించి చిత్ర తిరునాళ్ మహారాజుకు అంకితం చేశారు. తిరువాన్కూర్ విశ్వవిద్యాలయం ఈయనకు 1942 లో డాక్టరేట్ గౌరవపట్టము నిచ్చారు.

తన సంగీతశాస్త్ర పరిశోధనద్వారా ఈయన కనుగొన్న నూతన రాగాలు— వాటిలో కొన్ని కీర్తనలూ :

ఊర్మికరాగం — కాళరాత్రే
వలజిరాగం — జాలంధరసుపీఠస్థే
బుధమనోహరి — సమయమిదే నన్ను బ్రోచుటకు
కిరణరంజని — వాంఛతోనా
పసుపతిప్రియ — పశుపతి ప్రియసతీ పావనీ నీవేగతి

ఇవికాక, మాయాప్రదీపం, చక్రప్రదీపం, సుమనప్రియ, గుహరంజని, ఈయన కనుక్కొన్న నూతనరాగాలు.

ఈ క్రింది అపూర్వ రాగాలలో ఈయన రచించిన కీర్తనలవల్ల ఆ రాగాలకు బహుళ ప్రచారం కలిగింది. ఆ రాగాలేవంటే : పుష్పలతిక, హరినారాయణి, హంసానంది, గౌడమల్లారు, విజయనాగరి, అమృతవర్షిణి, పాడి, చెంచుకాంభోజి, నవరత్న విలాసం, గౌరి.

స్వరసాహిత్యములు రెండింటిలోను నిరోష్ఠ్యముగా ఉండే కీర్తన నొకదానిని శంకరాభరణ మేళంలో (సరిగదనిస, సనిదగరిస) అను సంచారంగల రాగంలో రచించి, దానికి నిరోష్ఠక రాగమని పేరుపెట్టారు ముత్తయ్యభాగవతులు.

ఈయన గోటువాద్యం, వయొలిన్, మృదంగ వాద్యాలను వాయించుటలో ప్రతిభ కలవారట.

## మైసూరు వాసుదేవాచార్య - జననం 1865 :

ఈ శతవర్షజీవి - అడయారు కళాక్షేత్రంలో సంగీతాచార్యులై ఈనాటికీ మనలో ఉన్నారు. మైసూరు మూడవ కృష్ణరాజ వొడయర్ ఆస్థానంలో పౌరాణిక విద్వాంసులయిన సుబ్రహ్మణ్యాచార్యుల కుమారుడీ వాసుదేవాచార్యులు. 5 ఏళ్ళ ప్రాయంలోనే మైసూరులోను సుబ్బరాయరు అనువారివద్దను, వీణ పద్మనాభయ్య అనువారివద్దను సంగీతాభ్యాసంచేసి తర్వాత 5, 6 ఏళ్ళు తిరువయ్యారులో పట్నం సుబ్రహ్మణ్యయ్యగారికి శిష్యత్వం చేశారు.

1896 లో పట్నం సుబ్రహ్మణ్యయ్యర్‌గారివద్ద సంగీతాభ్యాసం ముగియగానే జనవరి 2 న వాసుదేవాచార్యులు చేసిన సంగీతకచ్చేరీ అనంతరం ఆయనకు గొప్ప సన్మానం జరిగిందట.

ఆ తర్వాత వివిధ పరిషత్తులలో ఆయనకు లభించిన బిరుదావళి - సంగీత భావజ్ఞ శిఖామణి, సంగీత సాహిత్య విద్వన్మణి, సరళగాన శిరోమణి, సంగీతశాస్త్ర రత్న, సంగీత కళాకోవిద, సంగీత కళానిధి, గాయనాచార్య, సంగీతశాస్త్ర విశారద, సంగీత సుధానిధి, సంగీత సాహిత్యవల్లభ, - 1954 లో స్వతంత్ర భారతాధ్యక్షుడు రాజేంద్రప్రసాదు సనదు, శాల్వ యిచ్చి జాతీయ బహూకరణోత్సవంలో గౌరవించారు.

వాసుదేవాచార్యులవారు తెలుగులోను, సంస్కృతంలోను 300 కీర్తనలను వర్ణములను, రాగమాలికలను, స్వరజతులను, తిల్లానాలను రచించారు. వీటిలో భక్తిరసం అప్రయత్నంగా పొంగిపొర్లుతూ ఉంటుంది. ఈయన కృతులలో 70 వరకూ చేర్చి వాసుదేవ కీర్తనమంజరి ప్రథమ భాగంగా అచ్చయి వెలువడింది. ద్వితీయభాగం అచ్చులో ఉన్నది.

ఈయన రచించి, ప్రకటించిన నవరత్న రాగమాలికా కీర్తనలలో 3 త్యాగరాజు, దీక్షితులు, శ్యామాశాస్త్రిగార్లపై రచించినవి.

ఈయన కన్నడంలో "నా కండ కళావిదరు" అను గ్రంథంలో తా నెరిగిన సంగీత విద్వాంసులను గురించి వీణ శేషణ్ణ, పట్నం సుబ్రహ్మణ్యయ్య, రామ్నాడ్ శ్రీనివాసయ్యంగార్లను గురించి రస పురస్కృతులను ఉల్లేఖించారు.

సీతా స్వయంవర మనే యీయన రచించిన నృత్యనాటిక ఈయన నాట్యశాస్త్రాభినివేశాన్ని కూడా ప్రకటించగలదు.

ఈయన వ్యాకరణ, సాహిత్యములలో కూలంకషజ్ఞానముగల పండితుడు.

## ప్రయాగ రంగశర్మగారు :

(1859-1927) ఈయన తూర్పుగోదావరి జిల్లా రాజోలు తాలూకా గుడిమెళ్ళంక వాస్తవ్యులు. జ్యోతిశ్శాస్త్ర పండితులయిన లక్ష్మణశాస్త్రిలవారి కుమారుడు. తెలగాణ్యులు - కౌశికసగోత్రము. వీరి శ్రావ్యగానమున ఆధ్యాత్మ రామాయణము, గీత గోవిందాష్టపదులు, తీర్థులవారి తరంగాలు, గోకులపాటి కూర్మనాథుని మృత్యుంజయవిలాస హరికథా ప్రదర్శనలూ ఆనాటి పండితులకు, పామరులకు కూడ ఆకర్షణీయముగా ఉండేవట. ఈయన యెక్కువగా భజన సంప్రదాయ కీర్తనలూ, మంగళహారతులూ, తలుపులదగ్గర పాటలూ, పెండ్లిండ్ల వేడుకపాటలూ రచించారు ఆంధ్రదేశంలో యింటింట - ఈ పాట ఫలానివారిదని తెలియకుండ, వీరి పాటలెన్నో ప్రచారములో ఉన్నవి. వర్ధమానుడయిన ప్రసిద్ధ కర్ణాటక సంగీత యువక విద్వాంసుడు శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ ఈ రంగ శర్మగారి దౌహిత్రుడు.

మారాముచేసే చంటిపిల్ల వినోదానికై తల్లులు తరచు పాడుతూ వుండే 'ఏమే ఓ చిట్టి....అడుగో బూచివాడు' ఇత్యాదిగా సాగేపాట యీ రంగశర్మ గారి రచనయే. బాగా ప్రచారంలో ఉండిన వీరి యితర కీర్తనలు :

'శ్రీరామనామ మంత్ర పఠన శాయవే'
'వరలక్ష్మీదేవీ రావమ్మా', - 'త్రిపురసుందరీ రావమ్మా'
'రామ రామ యనరాదా', - 'ఓం నమో నారాయణాయ'
'బాలాత్రిపురసుందరీ పూజాసమయము'
'పూజసేయుదము వేగ రారమ్మా'
'సదాశివుని మృదుపదాంబుజము'
'మంగళంబే శంభురాణీ'
'హారతివ్వరే రాజరాజేశ్వరికి'.

ఈయన 1859 లో జన్మించి సుమారు 70 ఏళ్లు జీవించి 1927 లో కీర్తిశేషులైనారు.

## కొచ్చెర్లకోట రామరాజుగారు :

ఈయన తూర్పు గోదావరి జిల్లా తాటిపాక కాపురస్థులయిన కొచ్చెర్లకోట వెంకటనారాయణగారికి జానకమ్మగారియందు కలిగిన కుమారుడు. 1878 జననం. కీర్తనలూ, స్వరజతులు, వర్ణములు రచించి, యీయన సంగీత సాహిత్యములలో ప్రసిద్ధిపొందిన ఆంధ్రదేశపు ఉత్తమ వాగ్గేయకారులలో ఒకరు. సంపన్న గృహస్థు

లయిన వీరు చాలమంది పండితులను, విద్వాంసులను తమ యింటికి పిలిపించి ఆదరించేవారు. వయొలిన్‌పైనా, మృదంగముపైనా అద్వితీయమైన సాధన చేసిన రామరాజుగారి వాద్యప్రతిభ పండితులను, పామరులను కూడ బహూధా రంజింప జేసేదట. సాధారణంగా మృదంగములో అందరూ వాయించే కుడివేపు యీయన ఎడమచేతితోను, ఎడమవేపును కుడిచేతితోను వాయించునట్లుగా, యీయన వయోలిన్ కుడిచేత నుంచుకొని ఎడమచేత కమానుంచుకొని అవలీలగా వాయించే వారుట.

బందరు వాస్తవ్యులయిన నోరి వెంకటరత్నముగారు రామరాజుగారికి సంగీత గురువు, చాలామంది శిష్యులు వీరింటిలోనే వుండిపోయి భోజనం కూడ అక్కడనే చేస్తూ శుశ్రూషచేస్తూ ఆయనవద్ద సంగీత విద్యాభ్యాసం చేసేవారు. వీరి స్వరజతులూ, తానవర్ణములూ సభలలో పాండిత్య ప్రకర్షకేకాక, విద్యార్థుల సంగీత జ్ఞానం అభివృద్ధి చెందడానికి చేసే అభ్యాసములకు ఉపయోగకరంగా ఉంటాయి భజన సంప్రదాయంలో ఎన్నో కీర్తనలుకూడా రచించారు. ఈయన 1946 ఏప్రిల్ 15 వ తేదీని దివంగతులైనారు. ముందరి శతాబ్దంలో త్యాగరాజాది వాగ్గేయకారుల వలెనే తరువాత శతాబ్దంలో రామరాజుగారి వంటి వాగ్గేయకారులు చేసిన సేవవలన కర్ణాటక సంగీత భాండారం అభివృద్ధి చెందింది.

ఈయన చేసిన స్వరజతులు సుమారు 30 వరకున్నాయి- వాటిలో ప్రధాన మైనవి :

1. మోహనరాగంలో 'బాలకృష్ణమోహన'
2. భైరవిరాగంలో 'శ్రీ త్రిపురసుందరి'
3. బిలహరిలో ప్రారంభమయిన రాగమాలిక 'బిలహరి రాగాలాపన చేసెద వినరా తిరుపతిపురవరదా'

తానవర్ణములు 20 వరకు చేశారు. ఇవన్నీ శ్రీ కడలి కపోతేశ్వరస్వామికి అంకితము చేశారు.

శ్రీరాగంలో —'శ్రీ సత్యానంద'
రామప్రియలో —'కనకాంగి'
కీరవాణిలో —'స్వామి నిన్నే కోరియున్నాను'
ధన్యాసిలో —'వలచియున్న నాపై వాదమేల'
సింహేంద్ర మధ్యమంలో —'చలమేల జేసేవురా చక్కని చంద్రమౌళి'
శుద్ధసావేరిలో —'చెలిమి కోరియున్న నాపై'

ఈయన రచించిన కీర్తనలుసుమారు 50 వరకూ ఉంటాయట.

భైరవిలో —'పరమార్థమన్నియెరిగి తిరిగి'

తోడిలో —'దయరాదా నాపై దాశరథీరామ'
బిలహరిలో —'ఆనందరాముకి అనుచరుండగుచు'

## పాపట్ల కాంతయ్యగారు :

19 వ శతాబ్దపు ద్వితీయార్థమంతాను సుమారు 60 ఏళ్లు 20 వ శతాబ్దంలో ఒక దశకం వరకూ జీవించిన పాపట్ల కాంతయ్యగారు ఆంధ్ర వాగ్గేయకారులలో ప్రత్యేకంగా చెప్పుకొనదగినవారు. ఈయన స్వస్థలం కృష్ణాజిల్లాలోని జగ్గయ్యపేట— కాని ఎక్కువగా హైదరాబాదులో నివసించారు పల్లవి, కల్పనస్వర విన్యాసగానంలో ప్రసిద్ధి పొందిన ఈ కర్ణాటక సంగీత విద్వాంసుడు గాత్రపాటను, వయొలిన్ వాద్యమునూ, హార్మోనియం వాద్యమును కూడ సాధించినాడు. యాదగిరి, దొంతి ఆస్థానముల జమీందారులు మైలవరం జమీందారుగా వీరిని గౌరవించి, చాలాకాలం పోషించారు. ప్రసిద్ధ పల్లవి విద్వాంసుడైన పాపట్ల రామయ్యగారు ఈయన అన్నగారు. సంగీత విద్యాగురువు. ఈయన బాగా చిన్న వయస్సులోనే గేయరచనలు ప్రారంభించి, అనేక వర్ణములు, కృతులు చేయడమే కాకుండా ఆనాటికప్పుడే దేశంలో పాడుకొంటూవున్న రంగస్థల నాటక సమాజమువారి నాటకములకు ఆయా సన్నివేశాలకు తగిన పాటలను రచించి ఆంధ్ర దేశపు ఆబాల గోపాలమునకు సన్నిహితుడైనాడు. ఆనాడు మైలవరం జమీందారు పోషణలో ఉండిన మైలవరం నాటక సమాజంవారి సావిత్రి, ద్రౌపదీ వస్త్రాపహరణం, కృష్ణ తులాభారం వంటి నాటకాలలో ఈనాటికీ మన కర్ణకుహరాలను వదలని పాటలను రచించిన వారు పాపట్ల కాంతయ్యగారే. సావిత్రి నాటకంలో 'పోవుచున్నాదే'రాగమాలిక 'అహకాంతా' కృష్ణతులాభారంలోని 'భలేమంచి చౌకబేరము' 'మునివరా' మొదలయిన సంవాదగేయములూ, రాగమాలికలూ, ఆయా రసవత్సన్నివేశములకు సరిగా సరిపోయి, ఒక పాతికేళ్ళపాటు ఆంధ్రదేశపు నాటక ప్రేక్షకులలో, పండిత పామరులలో ప్రతివారినోటనూ వినిపిస్తూ ఉండేవి.

## ధర్మవరం కృష్ణమాచార్యులు :

కాంతయ్యగారి కించుమించు సమకాలికుడై ఆంధ్ర నాటక పితామహుడని వాసిగాంచిన కృష్ణమాచార్యులవారు తాము రచించిన విషాద సారంగధర, పాదుక, చిత్రనళీయం, ప్రమీలార్జునీయం మొదలయిన నాటకములన్నిటికీ ఆయా సన్నివేశాలలో పాటలను వ్రాసీ ఆ పాటలను నాటకము చివర అనుబంధముగా ప్రకటించేవారు కాంతయ్య గారు. కృష్ణమాచార్యులవారు సంగీత సాహిత్యాలలో సమాన ప్రతిభగల వాగ్గేయకారులుగా పరిగణింపబడినారు

## పురాణం కనకయ్యశాస్త్రిగారు :

1878-1954 పాపట్ల కాంతయ్యగారి శిష్యులలో అగ్రగణ్యుడైన పురాణం కనకయ్యగారు ప్రసిద్ధ కర్ణాటక సంగీత విద్వాంసులుగా, వాగ్గేయకారులుగా పేరు పొందారు. ఈయన గద్వాల, యాదగిరి సంస్థానములలో ఆస్థాన విద్వాంసుడుగా ఉండడమేకాకుండా, ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల అనేక ఇతర సంస్థానములలో గౌరవింపబడిన గాయకోత్తములు, గాత్రపాటలోను, వయొలిన్ వాద్యంలోను, రాగాలాపన, నిరవలు పాడడంలో ఈయనకు ప్రత్యేకప్రతిభ వుండేది. ఈయన సంగీత రచనలలో ఆనందభైరవి రాగంలోని 'నిన్నే వలచి యున్నదిరా' అను వర్ణము ప్రసిద్ధమైనది. ఈయన కుమారుడు పురుషోత్తమశాస్త్రిగారు ఆధునిక కర్ణాటక గాయకులలో పేరెన్నిక గన్నవారు.

## పిరాట్ల శంకరయ్యశాస్త్రిగారు (1881 – 1951)

కనకయ్య శాస్త్రిగారికి సమకాలికులును, గుంటూరులో కాపురం ఉండి నపుడు మిత్రవర్గంలోనివారును అయిన పిరాట్ల శంకరయ్యగారు త్యాగరాజు శిష్య పరంపరలోనివారు. త్యాగరాజు శిష్యుడైన వీణ కుప్పయ్యగారి కుమారుడు ముత్యాలపేట వాస్తవ్యుడైన తిరువొత్తియూరు త్యాగయ్యగారు. ఈయనను గురించి 18వ అధ్యాయంలో చెప్పుకొన్నాము. ఆ తిరువొత్తియూరు త్యాగయ్యగారి శిష్యుడు పిరాట్ల శంకరయ్యశాస్త్రిగారు. శంకరయ్యగారు బాల్యమునుంచీ భక్తి పరుడు. వేదాంతశాస్త్రంలో వాసుదేవ తీర్థస్వాముల శిష్యుడు. ఈయన అన్నగారయిన పిరాట్ల శివరామయ్యగారు ముక్త్యాల సంస్థానంలో విద్వాంసుడు. శంకరయ్య గారు వర్ణములను, కృతులను రచించారు. వాటిలో ప్రసిద్ధమైన కొన్ని, శంకర ముద్ర వీటన్నిటిలోను ఉంటుంది.

1. రిషభప్రియ – ఆది – నిత్యబోధస్వరూప నిగమాంత వేద్య – కృతి
2. వాచస్పతి – ఆది – అనుమానమెల్ల – కృతి
3. సింహేంద్రమధ్యమ–ఆది – ఓజగదంబ పలుకవేమి ఓంకారరూపిణి – కృతి
4. ,, ,, పిలిచిన పలుకవురామ – మధ్యమకాల కృతి
5. షణ్ముఖప్రియ – ఆదితాళ వర్ణము
6. కీరవాణి – త్రిపుట – ఏలాగున బ్రోచెదవో – కృతి
7. హేమవతి – ఆది – ఏనాడు దయవచ్చునోయని – కృతి
8. 1ి వ మేళకర్తరాగం – ఆది – నీ రూపలావణ్యము – కృతి
9. కేదారగౌళ – రూపకం – నెరనమ్మినవారి యెడల – కృతి
10. కామవర్ధని – ఆది జననములేదు మరణము లేదిక – కృతి

ఈయన ఆంధ్ర విశ్వవిద్యాలయపు బోర్డు ఆఫ్ స్టడీస్‌లో సంగీత పాఠ్య నిర్ణాయక గౌరవ సభ్యుడుగాను, మద్రాసు మ్యూజిక్ అకాడమీ - ఎక్స్‌పర్ట్ కమిటీలో సభ్యుడుగాను చాలాకాలం పనిచేశారు.

## హరి నాగభూషణంగారు : జననం 1884

ఆంధ్రమాత ప్రసవించిన ఆధునిక వాగ్గేయకారులలో ఆదిభట్ల నారాయణ దాసుగారొక యెత్తు, హరి నాగభూషణంగారొక యెత్తు. 1884 లో జన్మించిన వీరింకా మన నడుమ వున్నారు. తండ్రియైన హరినరసింహశాస్త్రిగారే వీరికి ప్రత్యక్ష సంగీతగురువులు. కృష్ణాజిల్లా బందరు వాస్తవ్యులు. నాగభూషణంగారికి సంగీతంలో పరోక్ష గురువులు; గాత్రంలో కోనేరి రాజపురం వైద్యనాథయ్యర్ వయొలిన్‌లో తిరుక్కోడి కావల్ కృష్ణయ్యర్, గోవిందసామి పిళ్ళైగార్లు, నాగ భూషణంగారి తండ్రిగారైన హరి నరసింహశాస్త్రిగారు పట్నం సుబ్రహ్మణ్యయ్య గారివద్ద సంగీతాభ్యాసంలో మైసూరు వాసుదేవాచార్యులకు సహాధ్యాయులు, నరసింహశాస్త్రిగారుకూడ వయొలిన్ వాద్యంలో సిద్ధహస్తులు.

నాగభూషణంగారు సంగీత సాహిత్యాలలోను, సంస్కృతాంధ్రాంగ్ల భాషల లోను ప్రజ్ఞాశాలియైన పండితులు. వీరికి వాగ్గేయకారరత్న అని, సంగీత సాహిత్య భావనా పరాయణ అనీ, వేదాంత పారీణ, గాయకశిఖామణి, గాయక సార్వభౌమ అని అనేక బిరుదములు కలవు. ఒకపక్క సంగీత కళోపాసకులై, ఇంకొక పక్క హూణవిద్యలో న్యాయమూర్తి పట్టం పొందారు.

1912 లో నాగభూషణంగారికి మద్రాసులో తచ్చూరి సింగరాచార్యులవారు మొదలైన సంగీత విద్వాంసులంతా ఘనమైన సన్మానంచేసి ఆయనకు సువర్ణ ఘంటా కంకణం తొడిగారు.

కాకినాడ సభలో సంగీత కచ్చేరి అయాక 1941 లో వీరు ఆకస్మాతుగా అస్వస్థులై పార్శ్వవాతంవచ్చి, వయొలిన్ వాద్యసాధనగాని, గాత్రసాధనగాని చేయ వీలులేక, అప్పటినుంచి మంచముపట్టి, లోకవ్యవహారము తగ్గించుకొన్నారు. కాని, చేతికందివచ్చిన కుమారులను ఆ అస్వస్థతలో ఉండికూడా వయొలిన్ వాద్యంలోను, గాత్రపాటలోను ఎన్నికకువచ్చే విద్వాంసులనుగా తయారు చేసి కొన్నారు.

1943 లో బందరులో వీరికి షష్ఠిపూర్తి సన్మానం జరిగింది. 1949 లో శిష్యులంతా చేసి, బందరులోనే మరొక సన్మానం చేశారు.

ఈయన కొన్ని తానవర్ణములను, అనేక భక్తిరసాత్మక కీర్తనలను, కొన్ని హరికథలను రచించారు. అస్వస్థులయాక కొన్ని సంస్కృత గ్రంథాలను కూడ రచించారు.

వీరి రచనలు :

1. 132 శ్లోకాలలో రామాయణం ఏడు కాండలు.
2. రామాష్టోత్తర నామశ్లోకావళి.
3. రామరాఘవ స్తవరాజం (సంస్కృతము. తెలుగు)
4. త్యాగరాజస్వామి చరిత్ర – (హరికథ – 3 భాగాలు)
5. శంకరాచార్యస్వామి చరిత్ర – (7 భాగాలు)
   (హరికథ; వేదాంతానుభవమంతా ఇందులో కలదు )
6. విభీషణ శరణాగతి (హరికథ)
7. పాదుకా పట్టాభిషేకం (హరికథ)

త్యాగరాజస్వామి చరిత్రను ఆస్వస్థులు కాకముందే తానే స్వయంగా పుష్య బహుళ పంచమినాడు చెప్పేవారు. శంకరాచార్య చరిత్రను వరుసగా 7 రాత్రులు తానే అంబాజీపేటలో చెప్పినారు. విభీషణ శరణాగతి, పాదుకా కథలను విజయ నగరంలో హరికథలుగా చెప్పి, హరికథా పితామహుడైన ఆదిభట్లవారిచేత, విజయనగరం మహారాణిచేత బహువిధాల పొగడ్తనందారు.

హరి నాగభూషణంగారి తానవర్ణాలలో 2 ప్రసిద్ధమైనవి. గమనశ్రమ రాగంలో 'నందగోపబాలా యశోదా తనయా' అనేదొకటి, శంకరాభరణ రాగంలో శ్యామసుందరాంగ చలముచేయ మేరగాదురా' అనేదొకటి.

సంస్కృతంలోను తెలుగులోను కలిపి, ఈయన రచించిన కీర్తనలు సుమారు 60 పైగా ఉన్నవి. కొన్ని రాగాలు ఆయన స్వయంగా కల్పించినవి. వీరి కీర్తనలలో 'త్యాగ' అని స్వనామాంకిత ముద్రగా ప్రయోగించారు.

మాధవప్రియ రాగం (సూర్యకాంతం జన్యం)మాధవప్రియే మహిమాతిశయే అను కీర్తన.

స్వయంగా కల్పించిన జయనాట అనే రాగంలో రామా యని పిలిచిన పలుకవేమి, నా మాటలు వినరావో.. అనే కీర్తన రచించారు.

ఇతర ప్రసిద్ధ కీర్తనలు :

| | |
|---|---|
| భైరవి రాగంలో | – నీ మహిమలు పొగడతరమా<br>నిత్య నిర్మల ప్రకాశ |
| హేమవతి రాగంలో | – ఎవరి నాశ్రయించెదరా<br>ఇనకులేశ రామచంద్ర |
| వాచస్పతి రాగంలో | – నీ రూపము నెమ్మనమున<br>సారె సారెకు సరిగ నెంచనిమ్ము |

ధ్రువతాళం-ఆరభి రాగంలో - ఏమి పాపమో నీదు మోము జూపవు
సంకీర్ణజాతి రూపకం-శహనరాగంలో - ఎంత సొగసుకాడవో ఇందిరా రమణ
కానడ రాగంలో - నను విడనాడుట న్యాయమా
(ఈ కీర్తన చిట్టస్వరానికి కూడ సాహిత్యం ఉన్నది)
సారమతి రాగంలో - నా మొరాలకింపవేమి
మోము జూపవేమి
ఝూలవరాళి - నే నెవ్వరి వేడుదు—

ఇవికాక లీనమతి, నాట్యమనోహరి అను అపూర్వ రాగాలలో కూడ ఈయన కీర్తనలు రచించారు.

## ఓగిరాల వీరరాఘవశాస్త్రిగారు :

గుంటూరుజిల్లాలోని ఒంగోలులోను, తర్వాత రేపల్లెలోను, ప్రస్తుతం కొవ్వూరులోను ఉంటున్న వీరు ఇప్పుడు 50 ఏళ్ళకు లోపయిన వయస్సువారు. దేవీ ఉపాసకులయిన వీరు 'దేవీ గానసుధ' అను గ్రంథంలో తాను రచించిన 100 కీర్తనలవరకు సస్వరంగా ప్రకటించారు. ఈయన హరి నాగభూషణంగారి శిష్యులలో ప్రధానుడు. వీరి గ్రంథ పీఠికనుబట్టి, దైవప్రబోధితంగాను, స్వప్నో ద్బోధముల ద్వారా వారికి కలిగిన వాగ్గేయ కర్తృత్వ శక్తి వలన వారా కీర్తనలను రచింపగలిగినట్లు తెలుస్తోంది. అవన్నీ భక్తిరసపూరితములు. ఇటీవలనే వీరు మరి నూరు కీర్తనలతో 'దేవీ గానసుధ' రెండవభాగం ప్రకటించి దానిని సుప్రీం కోర్టు న్యాయమూర్తి, సంగీత కళానిధి అయిన టి. యల్. వెంకట్రామయ్యర్ గారికి అంకితం యిచ్చారు.

## తిరుమలనల్లాన్ చక్రవర్తుల వేంకటనారాయణాచార్యులు :

వీరు గుంటూరు వాస్తవ్యులయిన ప్రసిద్ధ వైదికులు. 1939 వ సంవత్సంలో కళ్యాణి రాగంలోను, ఇంకా 30 రాగాలలో శ్రీ వేంకటేశ్వరస్వామిని గురించి కొన్ని కీర్తనలను రచింపగా, ఈయనకు ఒకనాడు స్వప్నం వచ్చి, ఆ స్వప్నంలో 'స్వామి' యోగి వేషంలో దర్శనమిచ్చి 'విజయీభవ' అని ఆశీర్వదించగా, ఆ ఉత్సాహంతో ఈయన – సింహేంద్రమధ్యమ రాగంలో శతరాగ రత్నమాలికచే రంజిల్ల జేతురా శ్రీశ జాతిభేద సప్తతాళ సహిత....అను కీర్తనతో ప్రారంభించి నారాయణముద్రతో సూళాది 35 తాళములలోను ఖండచాపు మిశ్రచాపు తాళముల లోను, శతరాగములలో 100 కీర్తనలను స్వరసాహిత్య తాళాంగాలతో సహా రచించి – వేంకటేశ్వరస్వామికి అంకితం చేశారు.

ఈయన జ్ఞాతియైన శ్రీమాన్ తి. న. చ రాఘవాచార్యులవారు యీయనకు సంగీత గురువులు. వీరి శతరాగ రత్నమాలికకు శ్రీ పిరాట్ల శంకరశాస్త్రిగారు పీఠిక వ్రాశారు

త్యాగరాజస్వామియందు తనకుగల భక్తిని సూచిస్తూ ఈయన బేగడ రాగంలో "జ్ఞానముచే" అనే కీర్తన రచించారు.

ఇంతవరకు పూర్వ వాగ్గేయకారులు రచించిన కీర్తనలు 35 సూళాది తాళాలలో కొన్ని తాళాలలోనో ఉన్నవి కాని, సంపూర్ణముగా అన్ని తాళాలలోను లేవు కనుక, ఈ 35 తాళాలను అభ్యాసం చేయడానికి వీరి కీర్తనలు ఉపయోగకరముగా ఉంటాయని శ్రీ శంకరశాస్త్రిగారు తమ పీఠికలో వ్రాశారు.

## శొంఠి సీతారామయ్యగారు :

ఈయనకు 55 ఏళ్ళ వయస్సు. త్యాగరాజుకు గురువులయిన శొంఠి వేంకటరమణయ్యగారి వంశంలో పుట్టిన వీరు వీణాచార్య తుమరాడ సంగమేశ్వరశాస్త్రిగారు వెలసిన పిఠాపురం కాపురస్థులు. ఇప్పుడు 85 ఏళ్ళ వయస్సుగల వీరితండ్రి శొంఠి లచ్చయ్యశాస్త్రిగారును, వీరును కూడా కర్ణాటక సంగీతంలో విద్వాంసులు; అనేకమంది శిష్యులకు సంగీత గురువులు- సీతారామయ్యగారు రామాయణ, భాగవతములలోని ఘటములను వందలకొలది కీర్తనలుగా రచించి, భగవద్గీత 18 అధ్యాయాలను 180 కృతులుగా చేసి, అన్నిటికి స్వరమును, సాహిత్యమును భద్రపరచి యున్నారు. బాలకాండాయోధ్య కాండలను 146 కృతులుగా రచించినారు. త్యాగరాజు మున్నగు వాగ్గేయకారుల ధోరణిలో తెలుగు సంస్కృత సాహిత్యములతో సుమారు 640 కృతులను, కృష్ణజననం గురించి 25 కృతులు, 50 తానవర్ణములు, ఈయన రచించిన కృతులన్నీ మొత్తం 1200 వరకూ ఉంటాయట. వీరు తన రచనలలో శృంగారాన్ని పరిహరించి, కేవలం భక్తినే స్వీకరించారు.

## రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు :

ప్రాకృత సంస్కృత కర్ణాటాంధ్రభాషా సాహిత్యములలో కూలంకష పండితులుగా, సాహిత్య విమర్శకులుగా, సంగీత విద్వాంసులుగా ప్రథితులయిన శ్రీ శర్మగారు మైసూరు విశ్వవిద్యాలయంలోను, తిరుపతి వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలోను, వరుసగా సంస్కృతమునందూ, సంగీతమునందూ ఆచార్యులుగా కృతకృత్యులయినవారు. ప్రాచీనాంధ్ర కర్ణాటక ద్రావిడ వాగ్గేయకారుల గానకళా శిల్పరహస్యములను వీరు మైసూరులో తమ గురువులైన బిడారం కృష్ణప్పవారివద్ద శుశ్రూషలో గ్రహించినవారూ, అనుభవశాలియైన గాయకులూ, స్వయంగా

పెనుగొండకొండ, సంధ్యాగేయమువంటి ఆధునిక కవితాగేయములను రచించి పాడిన వాగ్గేయకారులుకూడ ! ప్రస్తుతము తాళ్ళపాకవారి గేయసహస్రమును సంస్కరించి, ప్రచురిస్తూ, ఆనాటి రాగముల స్వరూపములను సంగీతక్రమపరిణామ పరిశోధనలద్వారా కనుగొని, సాధ్యమయినంత చేరువ స్వరూపాలను చేకూర్చుకొని, ఆ కీర్తనలకు స్వరసంపుటులను పునర్నిర్మించి ప్రకటిస్తున్నారు. ఇప్పటి కప్పుడే నూరు, నూటయాబది కీర్తనలకు మెట్లువేసి, స్వరపరిచారు.

## జి. ఎన్. బాలసుబ్రహ్మణ్యంగారు :

ప్రసిద్ధ కర్ణాటక సంగీత విద్వాంసులైన ఈయన పట్నం సుబ్రహ్మణ్యయ్య మున్నగు ముందటి శతాబపు విద్వాంసుల సంగీతకృతులను పరిశోధించి, సస్వరంగా మద్రాసు సంగీత పరిషత్పత్రికలో ప్రకటించారు. అంతేగాక, తాను స్వయంగా తెలుగులోను, సంస్కృతంలోను నూటికి మించి కృతులను రచించి సస్వరంగా ఇటీవలే ప్రకటించారు. వీరి రచనలు తనకు ముందుతరమువారయిన వాగ్గేయకారుల రచనలలోని సరళభక్తిశయ్యను అనుసరిస్తూ స్వరసంగతుల నూతన కల్పనలకు, నిరవల్ విస్తృతికీ అస్కారము కలిగినవై వుంటాయి.

## శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరంగారు :

చిదంబరం విశ్వవిద్యాలయంలో సంగీతభూషణుడైన ఈయన తీవ్రభావావేశమూ, సునిశితమైన కవితాదృష్టి, నిరుష్టశిల్పమూ గల గేయాలను సుమారు నూటివరకూ రచించారు. కవితాధోరణిలో ఆధునిక కవిగేయములవలెఉండి, గానంలో చిక్కటి సంప్రదాయక సంగీత రచనలై రసభావపరిపుష్టములై ఉంటాయి వీరి గేయరచనలు.

## కె. యమ్. సౌందర్యవల్లిగారు :

మద్రాసు సైదాపేట వాస్తవ్యులు. ప్రసిద్ధ కర్ణాటక వాగ్గేయకార కులగురువైన త్యాగరాజస్వామికి అంకితంగా సుమారు వంద కీర్తనలకు పైగాను అనేక రామసంకీర్తనములను చక్కటి సరళమైన తెలుగులో రచించి, సాహిత్యములను స్వరములతో సహా ఆంధ్ర మహిళ మాసపత్రికలో ప్రకటించారు. ఈ కీర్తనల సంకలనగ్రంథము కంచి కామకోటి పీఠాధిపతులకు అంకితము చేయబడింది.

## మంగళంపల్లి బాలమురళీకృష్ణగారు-జననం 1930 :

ఐదారేళ్ళ ప్రాయంలోనే శాస్త్రీయ కర్ణాటక గానంలో దైవదత్తంగా లభించిన ఉపజ్ఞత గాయక సార్వభౌములయిన పారుపల్లి రామకృష్ణయ్య పంతులు

గారి శిష్యత్వం తోడయి బాలమురళీకృష్ణ 8 ఏళ్ళ ప్రాయం నాటినుంచీ సంగీత కచ్చేరీలలో మహా విద్వాంసులను సైతము ఆహాయనిపించి, సంగీతాభిలాషులగు అశేషజనాన్ని ఓహో అనిపించినాడు. ఇతని గురుపరంపర – సోపానములు వేసు కొంటూ పైకివెళ్ళగా, తిన్నగా త్యాగరాజే మనకు దర్శనమిస్తాడు. పారుపల్లి వారు ఇతని గురువు. పారుపల్లి వారి గురువులు సుసర్ల దక్షిణామూర్తిగారు, ఆయనకు ఫ్లూటు శరభశాస్త్రులకు, పట్నం సుబ్రహ్మణ్యయ్యగారికీ, మహావైద్యనాథయ్యరు మున్నగు విద్వద్గాయకులకూ సంగీత విద్యాగురువు తిరువయ్యారు నివాసియైన ఆకుమడుల (మానాంబుచావడి) వేంకటసుబ్బయ్యగారు. ఈ వేంకట సుబ్బయ్య గారిని గురించి 18 వ అధ్యాయంలో చెప్పుకొన్నాము. త్యాగరాజు ఈయనకు సంగీత విద్యాగురువేకాక, మేనబావకూడాను.

గురు శిష్య పరంపరతో అటువంటి ఉన్నత సంప్రదాయానికి చెందిన బాల మురళీకృష్ణని–తండ్రిగారైన మంగళంపల్లి పటాభిరామయ్యగారు స్వయంగా సంగీత విద్వాంసులు. ఈ అధ్యాయం ప్రారంభంలో స్మరించిన ప్రయాగ రంగశర్మగారు బాలమురళికి మాతామహుడు.

అటువంటి వాగ్గేయకారుల కోవలో పెరిగిన వర్తమానగాయకుడు స్వయముగా వాగ్గేయకారుడుకూడా అయి, 72 మేళకర్తరాగాలలోను రాగానికి ఒక్కొక్క కృతి చొప్పున జనకరాగ కృతిమంజరి అను గ్రంథాన్ని రచించి ప్రకటించినాడు. ఈ గ్రంథానికి విద్వత్పండిత ప్రకాండులయిన కాశీ కృష్ణాచార్యులవారూ, విశ్వనాథ సత్యనారాయణగారూ తొలిపలుకూ, పీఠికా వ్రాశారు.

కాశీ కృష్ణాచార్యులవారి తొలిపలుకులో 'ఇందలి ప్రతి కృతియందును శ్రీ త్యాగరాజుగారి శైలి స్ఫురింపక పోదు. సంపూర్ణరాగములగుటచేత, ఔడవ షాడవ వక్రరాగములందువలె ప్రస్తారగతి కుటిలముగాక, సరళముగా నుండుటచే మాధుర్యాది రసములు చక్కగ స్ఫురించుచున్నవి. మరియొక విశేషమేమన, చాలవరకు నీ కృతులు గీర్వాణభాషలోనే రచింపబడి పండితులకును ఆనందమును కల్గించుచున్నవి' అని వ్రాశారు.

విశ్వనాథవారు తమ పీఠికలో – 'చి. మురళీకృష్ణయొక్క ప్రతిభయు, శాస్త్రజ్ఞానము, నిత్యాభ్యాసము పండి సముద్భవించినది గ్రంథము......శ్రీ త్యాగ రాజ కృతులు మినహాయించినచో తక్కినవారు వ్రాసిన కృతులయందు భావ సమృద్ధి తక్కువగానుండును. ఆ కృతి యే దేవత నుద్దేశించి వ్రాయబడినదో తద్దే వతాసంబోధన బహుళ్యముండును. ఆ సంబోధనలయందు మధుర శబ్దజాలము నుపయోగించుటకూడ కవితాశక్తికాదనుటకు వీలులేదు. మధురశబ్ద సంయోజన మాత్ర శక్తిమంతులు తెలుగులో నెంతమంది కవులు కాలేదు. ఈ కృతులలో చాల భాగ మట్టివే. అంతతో ముగిసినచో వ్రాయదగినవేవియు నుండెడిదికాదు. అంతకు

మించిన యొక ప్రతిభ, కవియొక్క భావనా విశేషము ఇతనియందు కనుపించు చున్నది........ఈ గ్రంథము. వయసుచేత చిన్నవాడైనను విద్యచేత నాంధ్రదేశస్థ గాయక వతంసులలో నొకడైన చి. మురళీకృష్ణకు కీర్తిపతాకయే'- అని వ్రాశారు

## ఆధునిక సాహిత్యపరులలో గేయకర్తలు

నవ్యాంధ్ర వాఙ్మయ యుగకర్తయైన గురజాడ అప్పారావుగారు అనేక సాహిత్య రూపాలలో మార్గదర్శియైనట్లే, గేయరచనలో కూడ మార్గదర్శియైనాడు. ఆయన 'దేశమును ప్రేమించు', 'పుత్తడిబొమ్మ', నీలగిరిగీతాలు ప్రాచీన దేశిగేయ రీతులను మనస్సులో ఉంచుకొనే, గణాలలో కొద్ది చిన్నమార్పులతో ఆ నూతన గేయాలను అందించాడు. ముత్యాలసరం ప్రతి యువకవికీ ప్రాథమిక పాఠమై పోయింది. గురజాడ నాటినుంచీ, నేటివరకూ కూడ, మన దేశంలో సంభవించిన అనేక రాజకీయ, సాంఘిక పరిణామాలన్నీ మన పద్యకవితలోనూ, గద్యవాఙ్మయం లోనూ వలెనే గేయకవితలో కూడా వివిధరీతులు పుట్టడానికి కారణమైనాయి.

ఈ పరిణామాలతో మొదటిది జాతీయోద్యమం. దానితోపాటు వచ్చిన సర్వ మానవ సమానత్వ సౌభ్రాతృత్వాలనే ఆదర్శాలూ. సాంఘిక సంస్కరణోద్యమము ఆ ఉద్యమాన్ని అంటి బ్రహ్మసమాజంవంటి సర్వమత సమన్వయోద్యమం వచ్చింది. జాతీయతా ప్రబోధగేయాలూ, భక్తిగేయాలూ వచ్చాయి. స్త్రీ సముద్ధరణ, వితంతువివాహనిర్మూలనవంటి నూతనాభిప్రాయాలతో స్త్రీప్రాముఖ్యంగల ప్రణయ గేయాలు వచ్చాయి. ఆ తర్వాత సామ్యవాదాభిప్రాయాలతో ఆకలిపాటలు. యుద్ధ కాలంలో ఫాసిస్టు వ్యతిరేకగేయాలు, ఆ తర్వాత చైనాయుద్ధం, కొరియాయుద్ధం, తెలంగణా ఉద్యమం, అటంబాంబు, ఉదజనిబాంబు. శాంతి - విశ్వమానవత, భారత స్వాతంత్ర్యం, మొదలైన సంరంభాలన్నీ మన కవులచేత నూతన రీతి గేయాలను వ్రాయిస్తూ వచ్చాయి. ఇవికాక, ప్రకృతిగీతాలు, జానపదగీతాలు, సంవాదగీతాలు, బృందగీతాలుకూడా ఆయా సందర్భాలలో ప్రచారంలోకి వచ్చాయి.

## లలితగేయ పరిణామం :

పాపట్ల కాంతయ్యగారూ, ధర్మవరం కృష్ణమాచార్యులుగారూ రంగస్థలంలో పాటలు చేర్చినతరువాత, రంగస్థలంలో నానాటికీ మహారాష్ట్రంనుంచో, వంగదేశం నుంచో ఎరువుతెచ్చుకొన్న మట్లలో గేయాలు వ్రాయడం మొదలుపెట్టారు మన వారు. క్రమక్రమంగా రంగస్థలం మోహం మొత్తి వెనుకదారి పట్టడానికి కారణమైన సినిమా పరిశ్రమాభివృద్ధితో గేయం మరికొన్ని కొత్త అవతారాలనుతాల్చింది. మన సినిమావారుకూడా ఉత్తరాదినుంచి వచ్చేహిందీ సినీమాలవ్యాపారం మన వ్యాపారం కంటె ఎక్కువ వ్యాప్తం కావడంవల్లా ఆర్థికంగా ఎక్కువవిజయవంతం కావడంవల్లా

హిందీసినీమాల వ్యామోహంలో కొంతవరకూ చిక్కుకొన్న మన ప్రేక్షకులకు ఆ హిందీ సినీమాలలో విన్న సంగీతపు బాణీలలోనే గేయాలను తయారుచేయించడం మొదలుపెట్టారు. శాస్త్రీయ సంప్రదాయానుసారులైన కీర్తనలు మొదలయినగేయాల కంటె విలక్షణమైన నూతన స్వరూపం వచ్చింది గేయానికి. సినీమాలో ఈ పరిణామానికి వచ్చిన గేయాలకు గ్రామఫోను, రేడియో ప్రసారాలవల్ల ఎక్కువప్రచారం కలిగి ఈనవ్యావతారంలోగేయం 'లలితగీతం'గా-లైట్‌సాంగ్‌గా తేలింది సినీమాలో కూడ సాహిత్య సంగీతాలలో సాధికారులైనవారు పనిచేసేచోట గేయం పూర్తిగా తన ప్రాంతీయ సంప్రదాయాలను కోలుపోక, కొంతవరకు తేరుకొని ఉంది నవ్య సాహిత్య పరిణామంలో ప్రణయ సంబంధియైనపుడు భావగీతంగాను, లేకపోతే జాతీయ గీతంగానో, ఆకలిపాటగానో వేర్వేరు వేషాలు ధరిస్తూవచ్చిన నవ్య కవిగీతంకూడా ఈ నూతన లలితగీత పరిణామానికి దోహదం చేసింది.

## గేయ కర్తలు

ఏదేశ మేగినా ఎందుకాలిడినా – పొగడరా నీ తల్లి భూమిభారతిని....అని ప్రబోధించి రాయప్రోలువారు ఈ యుగ ప్రారంభంలో జాతీయ గౌరవానికి పునాదులు వేశారు. ఆధునిక గేయకర్తలలో బహువిధ గేయాలను రచించి, దేశ ప్రజహృదయాలను చూరగొన్నవారిలో ముఖ్యులు ముగ్గురు. వారు కీర్తిశేషుడు బసవరాజు అప్పారావుగారు, దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు, నండూరి వెంకట సుబ్బారావుగారు (ఇటీవల కీర్తిశేషుడు). వీరి ముగ్గురిలోను అల్పాయుష్కుడై తక్కువ వ్రాసినవాడైనా బసవరాజు అప్పారావుగారి గేయాలు ఆవేశపూరితాలై హృదయాన్ని కదిలించేవిగా ఉంటాయి. అంతేకాకుండా మధురమైన కంఠస్వరంతో సంప్రదాయ సిద్ధమైన సంగీతజ్ఞానంతో ఆయన గానం శ్రోతలను పరవశులను చేసేదట. సుబ్బారావుగారి యెంకిపాటలు జానపదప్రణయాన్ని జానపద భాషలో చిత్రించేవిగా ప్రారంభించి ఎంతో జనాదరణ పొందినా ఇటీవల ఆధ్యాత్మిక భావాలతో నిండి తొలిగేయాల రక్తికి క్రమంగా దూరమయాయి. కృష్ణశాస్త్రిగారి గేయాలు భావశిల్పంతో, పదశిల్పంతో, విశాలమైన భిత్తికపైని అందంగా తీర్చిన అజంతా చిత్రాలవంటివి. బసవరాజు అప్పారావుగారి పాటలు చాలమట్టుకు సినిమాలలోకీ, గ్రామఫోను రికార్డులలోకి ఎక్కాయి. నండూరి సుబ్బారావుగారు తొలిసారి ఎంకి పాటలు ప్రచురించినపుడు వాటిని పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారిచే స్వర పరిపించి, ఆ స్వరాలనుకూడా అచ్చువేశారు. కొన్నాళ్లు కొందరు ఆ స్వరాలలోనే పాడేవారు కాని, కవిగారు పాడినప్పటి అందం రాలేదు. రాను రాను గాయకులా పాటలను వేరే స్వరాలతో పాడుతున్నారు. బ్రహ్మసమాజపు తొలి రోజులలో వెంకట పార్వతీశ్వరుల ఏకాంత సేవలోని మంజరులను ప్రార్థన సమాజంలో గేయములుగా పాడుకొనేవారు. ఆ ప్రార్థన సమాజంలో కృష్ణశాస్త్రిగా

ఎన్నో భక్తిగీతాలను రచించి గానంచేసేవారు. ఆ గానాలు గోష్ఠిగానాలై హృదయాలను పులకింపజేసేవి. కృష్ణశాస్త్రిగారి గేయాలను పాడి, ప్రచారమిచ్చే గాయకులు ఆయన బంధుమిత్రులలో ఉన్నారు. శర్మిష్ఠ, ఊర్వశి, విద్యాపతి, ఉమర్ ఖైయాం, ఆండాళ్ మొదలైన గేయనాటికలు వ్రాసి ఆయన అందులో సిద్ధహస్తుడనిపించుకొన్నారు. కృష్ణశాస్త్రిగారివలె సుకుమారభావాలతో, మృదుమధుర కవితాశిల్పంతో గేయాలల్లే అనుయాయులలో వింజమూరి శివరామంగారినిచెప్పి, మిగిలిన వారిని ఎన్నుకోవాలి. చండీదాసు కథను సహజయాన పంథ అనే గేయనాటికగా వ్రాసి, ఇంకా బహువిధ గేయనాటికలను వ్రాసి సంపుటంగా ప్రకటించిన తల్లావజ్ఝల శివశంకరస్వామిగారు ఈ గ్రంథకర్త (రజని) వంటి యువ గేయకర్తలను గేయనాటికా రచనకు ప్రోత్సహించారు. వారి చండీదాసు నాటకరచనమూ, ఈ గ్రంథకర్త చండీదాసు నాటక రచనమూ సమకాలికములు. రాజకీయార్థిక జీవితాలలో విప్లవ పథాలకు దారిచూపిన శ్రీ శ్రీ గేయాలకు, అదే ధోరణిలో వ్రాసిన అనిశెట్టి గేయాలకు యువకలోకంలో ఈనాడు ప్రత్యేకాభిమానం ఉంది. అన్నమాచార్యులనుంచి శ్రీ శ్రీ దాకా అందరి గేయరీతులనూ ఆకళించుకొని, ఆరుద్ర చేసే నూతన గేయసృష్టిని ఆంధ్ర యువకులు అబ్బురంతో స్వీకరిస్తూంటారు. జానపద గీత ధోరణిలో వందలకొలది గేయాలను రచించిన కవికొండల వేంకటరావు, (కీర్తిశేషులైన) అడవి బాపిరాజుగార్ల గేయాలకు ప్రత్యేక స్థానం ఉంది. విశ్వనాథ సత్యనారాయణగారి కిన్నెరసాని పాటలూ, కోకిలమ్మ పెళ్ళి, ఇంకా యితర గేయాలూ ఆంధ్రుల హృదయాలలోని 'పాపికొండలను' కరగించాయి. జానపద శైలిలో రచన సాగించిన కొనకళ్ళ వేంకటరత్నంగారి గేయాలలోని పల్లీజీవిత మాధుర్యమూ తేట తెనుగు తియ్యదనమూ ఈమధ్య గేయాభిలాషులకు ఆదరపాత్రములైనాయి. మల్లవరపు విశ్వేశ్వరరావు, పట్టాభిరామిరెడ్డిగార్లు రవీంద్రనాథ ఠాకూరు వంగగేయాలలోని సంస్కృతపు పలుకుబడులను, అంత్యానుప్రాసలను, ఛందములను తెనుగువారికి చవిచూపారు.

సుకుమార భావనా, కోమల పదశిల్పమూగల వేదుల సత్యనారాయణశాస్త్రిగారి గేయాలూ, రసావేశమూ, వ్యుత్పన్నతా పెనగొని ఉండే ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి, పుట్టపర్తి నారాయణాచారి తీర్థులూ, సంపత్ గార్ల గేయాలూ, వ్యుత్పన్నతా మధుర శిల్పమూకల పిలకా గణపతిశాస్త్రిగారి గేయాలూ, విస్తృత లోకానుభవమూ, రచనా శిల్పంలో కొత్త పోకడలూ కల నార్ల వెంకటేశ్వరరావుగారి గేయాలూ ఆంధ్రలలిత గాయక లోకానికి ఎన్నో కొత్త వరుసలను ప్రసాదించాయి. తెలంగాణ వీణ మ్రోగించిన దాశరథి, నారాయణరెడ్డిగార్ల గేయాలలో సంకెళ్ళను త్రెంచుకొనే స్వేచ్ఛాభిలాషా యౌవనోచిత కార్యోత్సాహమూ ఆంధ్రలోకాన్ని అభ్యుదయపథానికి దృష్టి సారింపచేశాయి.

తాపీ ధర్మారావుగారు, సముద్రాల రాఘవాచార్యులుగారు, పింగళి నాగేంద్ర రావుగారు, మల్లాది రామకృష్ణశాస్త్రిగారు, సదాశివబ్రహ్మంగారు, ఆత్రేయ, కొసరాజు రాఘవయ్యగారు, ఇంకా ఇతరులూ తెరపై గేయరీతులను రకరకాలుగా వెలువరిస్తున్నారు.

ప్రయాగ నరసింహశాస్త్రి జానపద గేయాలను అనేకంగా సేకరించి, ఆ రీతులలో అనేక కొత్త గేయాలు సృష్టించడమే గాకుండా 50 కి పైగా బుర్ర కథలూ, 30 వరకూ హరికథలూ రచించి, కథా ప్రసంగాలుకూడా చేసిన గాయకుడు. ఇదే పద్ధతిని జానపద శైలిలో అనేక ఆవేశపూరిత గేయాలను, బుర్రకథలనూ రచించిన సుంకర. నాజర్ మున్నగు వారున్నారు. గేయంలోని లయను చెడగొట్టి ఆధునిక యువ కవులు చేసిన స్వేచ్ఛాలయతో కూర్చిన గేయాలు సంగీతానికి అల్లంతదూరాన ఉండవలసివే.

సంగీత సాహిత్యములలో ప్రజ్ఞావంతులై. ఈ శతాబ్ది ఆరంభంలో రోషనార, శ్రీ సామ్రాజ్యంవంటి నాటకాలు రచించి 'నాదేశం బిది. నా హక్కిది, నా జన్మభూమి యిది' వంటి జనరంజక గేయాలను రచించి, ఇటీవలనే కీర్తిశేషులైన కొప్పరపు సుబ్బారావుగారు గేయ నాటికా రచనములోను, ప్రదర్శనములోనూ ప్రత్యేక ప్రయోగాలను సాధించారు.

చింతా దీక్షితులుగారు, న్యాపతి రాఘవరావుగారు, ఏడిద కామేశ్వర రావుగారు, బి. వి. నరసింహారావుగారు ఈ గ్రంథకర్త మున్నగువారు బాలగేయ సాహిత్యంలో ప్రత్యేకంగా కృషి చేసినవారు.

ఈ ఆధునిక గేయకర్తల కృషిని గురించి వ్రాస్తూ ఆంధ్ర వాగ్గేయకార చరిత్రమును ముగింపబోయే ముందు ఈ గ్రంథకర్త గేయ రచనలో స్వీయకృషిని గురించి కొంచెమైనా వ్రాసికొనకపోతే అతి వినయం అనిపించుకొంటుందేమో. సరస్వతీ కటాక్షం రెండువిధాల లభించడంచేత. స్వయంగా దాతుమాతు కల్పన చేయగలిగిన వాగ్గేయకారత్వములో శతపత్రసుందరీ గేయ సంపుటమును విశ్వ వీణా మధురానగరీ, చండీదాసాది గేయ నాటికలను రచించి, అనేకాధునిక కవుల గేయాలకు ధాతుకల్పనచేసి, తాను పాడి పలువురచే పాడించి, మెప్పించిన యీ గ్రంథకర్త ఇప్పుడీ వాగ్గేయకార చరిత్రమును ఆంధ్రలోకానికి అంద జేస్తున్నాడు.

మన వాగ్గేయకారులను గురించిన సమగ్రమైన చరిత్ర యింతవరకు ఆంధ్ర సారస్వతంలోగాని ఆంగ్లంలోగాని రాలేదు. తెలుగుభాషా సమితివారి ప్రోత్సాహంతో యిప్పుడు ఒకేసారిగా మా విషయంపైని ఒకటికంటె యెక్కువ వాగ్గేయ కార చరిత్ర గ్రంథాలు వెలువడే అవకాశం లభించింది.

## ధన్యవాద సమర్పణ గేయం

హైద్రాబాదు
28 జూలై 1957

నా కృతి కృతియేనా – నీ కృపలేకున్న !
ఓ వాగ్గేయ కళామయి : గాయత్రీ! వేదధాత్రి=నాకృతి!!
ఇరుప్రక్కల క్షీరధారలిచ్చి నన్ను పెంపకున్న
తరతరాల తాతల బహుతపః ఫలము నీయకున్న!?=నాకృతి!!
కని బుధ గురు మిత్రుల మంగళాశీస్సు పడయకున్న
కువలయ హితకర్త శీతలతర సౌహార్ద మొదవకున్న!? = నాకృతి !!
నా కృతిలో జాతీయ పురాసుకృతి ఫలింపకున్న
నా కృతితో నవకృతులెన్నో ప్రజల తనియింపకున్న,
మహితకృతిగ నాకృతి సమితి బహూకృతి నొందకున్న
సమితి సభాస్థలి నా గానముతో ఉప్పొంగకున్న!! = నాకృతి !!
భాగ్యనగరి నిన్ను భవ్యభారతిగ నుతింపకున్న
నవభారత భారతి మానవ భారతవి కాకున్న !
నాకృతి కృతియేనా – నీ కృప లేకున్న
ఓవాగ్గేయ కళామయి – గాయత్రీ వేదధాత్రి!! = నాకృతి !!

(1957 జూలై 28వ తేదీ ఆదివారం హైదరాబాదులో ప్రతాప గిరిజీ కొఠీలో జరిగిన తెలుగు భాషాసమితి బహుమతి ప్రదానోత్సవంలో – ఆంధ్ర వాగ్గేయకార చరిత్రమునకు ఆంధ్రప్రభుత్వ బహుమానము గ్రహించేటపుడు గ్రంథకర్త పాడిన గేయము.)

# అకారాది విషయసూచిక

## గ, ఘ

## చ, ఛ



## జ, ఝ



## ఢ, ఢ



## త, థ

## ప, ఫ



## బ, భ



## మ

## శ

# ఈ గ్రంథ రచనమునకు సహాయపడిన గ్రంథములు, వ్యాసములు, వ్యాసకర్తలు

## 1. సంస్కృతము

| గ్రంథము లేక వ్యాసము | కర్త | ప్రచురణ కర్తలు |
|---|---|---|
| 1. నాట్యశాస్త్రము. | భరతముని. | నిర్ణయసాగర ప్రెస్, బొంబాయి. |
| 2. బృహద్దేశి. | మతంగముని. | తిరువాన్కూరు ప్రచురణం. |
| 3. సంగీత రత్నాకరం. (కల్లినాథ, సింహభూపాలుర వ్యాఖ్యలతో) | శార్ఙ్గదేవుడు | 1, 2, 3, 4 భాగాలు అడయార్ లైబ్రరీ ప్రచురణలు, |
| 4. స్వరమేళకళానిధి. | రామామాత్యుడు. | అణ్ణామలై విశ్వవిద్యాలయ ప్రచురణం. |
| 5. సంగీతసుధ. | గోవింద దీక్షితులు, | మద్రాస్ మ్యూజిక్ అకాడమీ ప్రచురణలు. |
| 6. చతుర్దండి ప్రకాశిక. | వేంకటమణి. | |
| 7. సంగీత దర్పణం. | చతురదామోదరుడు. | |
| 8. రాగతాళచింతామణి. | గోవిందామాత్యుడు. | తంజావూరు సరస్వతీ మహల్ ప్రచురణ. |
| 9. సంగ్రహచూడామణి. | గోవిందుడు. | అడయార్ లైబ్రరీ ప్రచురణములు |
| 10 రాగవిబోధ | సోమనాథుడు. | |
| 11. నృత్తరత్నాకరం. | జాయపసేనాని | డాక్టర్ వి. రాఘవన్ గారి ఆంగ్ల ఉపోద్ఘాతం; మద్రాసు విశ్వవిద్యాలయ ప్రచురణం. |

| గ్రంథము లేక వ్యాసము | కర్త | ప్రచురణ కర్తలు |
|---|---|---|
| 12. రత్నపాంచాలిక | నాటిక–సర్వజ్ఞ సింహ భూపాలుడు. | పిఠాపురం రాజావారి ప్రచురణం. |
| 13. శృంగార రసమంజరీవ్యాఖ్య | అక్బర్‌షా | డాక్టర్ వి. రాఘవన్ గారిఆంగ్లఉపోద్ఘాతం. |
| 14. సంగీత సారామృతం. | తులజాజీ మహారాజా. | |
| 15. గీతగోవిందం. | జయదేవుడు. | వావిళ్ళవారి ప్రచు రణం. |
| 16. కృష్ణ కర్ణామృతం. | లీలాశుకుడు. | శ్రీ కె. ఎస్ రామ స్వామిశాస్త్రిగారి ఉపోద్ఘాతంతో కూడిన వావిళ్ళవారి ప్రచురణం. |
| 17. కృష్ణలీలాతరంగిణి. | నారాయణతీర్థులు. | వావిళ్ళవారి ప్రచురణం. |

## 2. తెలుగు

| | | |
|---|---|---|
| 18. పండితారాధ్య చరిత్ర. | పాల్కురికి సోమనాథుడు | ఆంధ్ర గ్రంథమాల ప్రచురణం. |
| 19. ఉదాహరణ వాఙ్మయం. | నిడదవోలు వేంకట రావుగారు | |
| 20. గాన భాస్కరము. | కె.వి. శ్రీనివాసయ్యంగారు. | |
| 21. సంగీత సంప్రదాయ ప్రదర్శిని. భాగం 1. | సుబ్బరామ దీక్షితులు | ఎట్టయాపుర ప్రచు రణం. |
| 22. సంస్కృత వాఙ్మయం. చరిత్రం. భాగం 2. | శ్రీ మల్లాది సూర్యనారా యణ శాస్త్రిగారు. | ఆంధ్ర విశ్వకళాపరి షత్ ప్రచురణం. |
| 23. అన్నమాచార్య చరిత్రం. | తాళ్ళపాక చిన్నన్న. | శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి దీర్ఘమైన పీఠికతో తిరుపతి దేవ స్థానంవారిప్రచురణ. |
| 24. తాళ్ళపాకవారి కీర్త నలు. 1 నుంచి 10 | శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి శ్రీ ఉదయగిరి శ్రీనివాసా | |

| | గ్రంథము లేక వ్యాసము | కర్త | ప్రచురణ కర్తలు |
|---|---|---|---|
| | సంపుటాలు : అన్నమాచార్య, పెదతిరుమలాచార్య చినతిరుమలాచార్య కీర్తనలు | చార్య, శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగార్ల చేత పరిశోధితములై పీఠికలతో కూడినవి. | తిరుపతిదేవస్థానంవారి ప్రచురణములు. |
| 25. | పరమయోగి విలాసం | తాళ్లపాక చిన్నన్న | ,, |
| 26. | సంకీర్తన లక్షణము. | తాళ్లపాక చినతిరుమలయ్య | ” |
| 27. | శతక కవుల చరిత్రం. | శ్రీ వంగూరి సుబ్బారావుగారు | ఆంధ్ర గ్రంథమాలా ప్రచురణ. |
| 28. | ఆంధ్ర కవి తరంగిణి 6, 7. 8, 9, 10 సంపుటాలు. | శ్రీ చాగంటి శేషయ్యగారు | కపిలేశ్వరపురం తూర్పుగోదావరి |
| 29. | సుగ్రీవ విజయం యక్షగానం | కందుకూరి రుద్రయ్య | శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి పీఠికతో కపిలేశ్వరపురం వారి ప్రచురణం. |
| 30. | దేశి సాహిత్యశాఖ | శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు. | |
| 31. | వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రి షష్ట్యబ్దపూర్తి సన్మాన సంచిక నారాయణ తీర్థులు వ్యాసం | శ్రీ శివశంకర స్వామిగారు | |
| 32. | నారాయణ తీర్థులు రేడియో ప్రసంగం. | శ్రీ తిప్పావఝుల కోదండరామయ్యగారు | ” |
| 33. | కూచిపూడి సంప్రదాయం. వ్యాసం. | శ్రీ అయ్యంకి తాండవకృష్ణగారు | ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక |
| 34. | ,, | గొర్రెపాటి వెంకటసుబ్బయ్య గారు | కిన్నెర |
| 35. | భద్రాచలరామదాసు చరిత్రము. | వావిళ్ల ప్రచురణం. | |

| గ్రంథము లేక వ్యాసము | | కర్త | ప్రచురణ కర్తలు |
|---|---|---|---|
| 36. | దాశరథీ శతకం. | కంచెర్ల గోపన్న | గుజలీప్రతి |
| 37. | క్షేత్రయ్య పదములు. | ఆచార్య విస్సా అప్పారావుగారిచే సంపాదితము, శ్రీ అప్పారావుగారు, శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు. జమ్ములమడక మాధవరామశర్మగార్ల వ్యాసములతో ఆంధ్ర గానకళా పరిషత్ప్రచురణం. | |
| 38. | ” | శ్రీ గిడుగి సీతాపతిగారిచే సంపాదితము. శ్రీ సీతాపతి, ఆచార్య సాంబమూర్తి, కృష్ణయ్యర్‌గార్ల వ్యాసాలతో పిఠాపురం మహారాజావారి ప్రచురణం. | |
| 39. | ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు | సుబ్రహ్మణ్యకవి | వావిళ్ళ ప్రచురణం |
| 40. | దామెర్లవారి పదాలు | భారతిలో వ్యాసం | తిమ్మావజ్ఝలకోదండ రామయ్యగారి పరిశోధన, మద్రాసు అముద్రిత ప్రాచ్య పుస్తక భాండాగారం |
| 41. | భామాకలాపం (తాళపత్రప్రతి) | సిద్ధేంద్రయోగి రచన- | |
| 42. | దాక్షిణాత్యాంధ్ర వాఙ్మయం, | శ్రీ నిడదవోలు వేంకటరావుగారు | |
| 43. | మధుర తంజావూరు నాయకుల నాటి దక్షిణాంధ్ర వాఙ్మయం | శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు | |
| 44. | యక్షగానములు, (వ్యాసములు, ఆంధ్రపత్రిక) | శ్రీ యస్. వి. జోగారావుగారు | |
| 45. | విప్రనారాయణ చరిత్ర (యక్షగానం) | విజయరాఘవ నాయకుడు | తంజావూరుసరస్వతీ మహల్ ప్రచురణం. |
| 46. | మన్నారుదాస విలాసం. | రంగాజమ్మ, | ఆంధ్రసాహిత్య పరిషత్ప్రచురణం. |

| గ్రంథము లేక వ్యాసము | కర్త | ప్రచురణ కర్తలు |
|---|---|---|
| 47. కాశీనాథయ్య శబ్దాలు, (వ్రాతప్రతి). | తాళ్ళూరి లక్ష్మీనరసింహారావు గారు తాళపత్ర గ్రంథంలో నుండి చూచి వ్రాసుకొన్నది. | |
| 48. " (వ్యాసం.) | తాళ్లూరి లక్ష్మీనరసింహారావు గారు, (కిన్నెరలో). | |
| 49. సంగీత సర్వార్థ సారసంగ్రహం, | తచ్చూరి సింగరాచార్య సంపాదితం. | |
| 50. గాయకలోచనము | తచ్చూరి సింగరాచార్య సంపాదితం. | |
| 51. గాయక పారిజాతము | " | |
| 52. సభావతయ్య పదాలు, (భారతిలో వ్యాసం) | తిమ్మావజ్ఝల కోదండ రామయ్యగారు | |
| 53. పల్లవి దొరసామయ్య. రచనలు (ఆంగ్ల వ్యాస పరంపర.) | సి. ఎస్. అయ్యర్ గారు | మద్రాస్ మ్యూజిక్ ఎకాడమీ జర్నల్ |
| 54. శ్రీ త్యాగరాజ శతవార్షికోత్సవ సంచిక, (వివిధ వ్యాసావళి). | " | ఆంధ్ర గానకళా పరిషత్. రాజమండ్రి |
| 55. శ్రీ త్యాగరాజ కీర్తనలు | | " |
| 56. వెంకటాద్రిస్వామి కీర్తనలు | | " |
| 57. తూము నరసింహదాసు చరిత్రము | | |
| 58. కాలజ్ఞాన తత్త్వములు, (రేడియో ప్రసంగం). | తిమ్మావజ్ఝల కోదండ రామయ్యగారు | |
| 59. కాలజ్ఞాన తత్త్వములు<br>60. ఆత్మబోధామృత తత్త్వములు | } వీరబ్రహ్మం, సిద్దప్ప. లక్ష్మప్పగార్ల గేయాలు | |

| | గ్రంథము లేక వ్యాసము | కర్త | ప్రచురణకర్తలు |
|---|---|---|---|
| 61. | దూదేకుల సిద్దప్పగారి చరిత్ర | జవంగుల నాగభూషణంగారు | |
| 62. | ఎడ్ల రామదాసు చరిత్ర | | కాకినాడ ప్రచురణం |
| 63 | నిట్టల ప్రకాశదాసు కీర్తనలు | | |
| 64. | భామాకలాపము సత్యభామా విలాసం, (యక్షగానం) | మంగు జగన్నాధ కవి | |
| 65. | మృత్యుంజయ విలాసం | యక్షగానం | గోకులపాటి కూర్మనాథ కవి |
| 6. | రుక్మాంగద చరిత్రం | " | ఏనుగలూరిపాపరాజు |
| 67. | శ్రీ మహాభారత విలాసం | " | వేలూరి కన్నయ్యదాసు |
| 68 | మార్కండేయ విలాసం | " | కాశయ్య |
| 69. | రామదాసు చరిత్ర | " | యాదవదాసు |
| 70. | కూచకొండ రామాయణం | " | |
| 71. | లేపాక్షి రామాయణం | " | వేంకటనాయక కవి |
| 72. | ధర్మపురి రామాయణం | " | శేషాచల దాసు |
| 73. | ధర్మాంగధ చరిత్ర | " | కూరపాటి వరదరాజు |
| 74. | వామన విజయం | " | దూపాటి వేంకటాచార్య |
| 75. | ఎరుకుల కురవంజి | " | సన్నిధి జగ్గరాజ కవి |
| 76. | శ్రీ కృష్ణ నాటక ప్రబంధ రాసక్రీడా విలాసం | " | కానుకొలను వేంకట దాసు |

| గ్రంథము లేక వ్యాసము | కర్త | ప్రచురణ కర్తలు |
|---|---|---|
| 77. భవానీశంకర విలాసం | " | త్వరితకవి రామకృష్ణయ్య |
| 78. కుశలవ చరిత్ర మను రామనాటకం | " | తిరునగరు అనంతదాసు |
| 79. రంభారావణ సంవాదం | " | ఎఱ్ఱగుంట్ల వేంకట శేషయ్య |
| 80. రాజయోగ సారం | " | వాశిలి సుబ్బయ్య |
| 81. మోక్షరస బిల్హణీయం | " " | గంగనపురి హుసేన్ దాస్ |
| 82. రామదాసు చరిత్ర | హరికథ | తిరుక్కైయూర్ కృష్ణ దాసు |
| 83. దివ్యసూరీ విలాసాది ప్రబంధ షట్కం | " | సామినేని పార్థసారధి |
| 84. గరుడాచలం | యక్షగానం | ఓబమంత్రి |
| 85. " | " | యాదవదాసు |
| 86. యథార్థ రామాయణం | హరికథ | ఆదిభట్ల నారాయణ దాసు |
| 87. సావిత్రీ చరిత్రం | " | " |
| 88. రుక్మిణీ కళ్యాణం | " | " |
| 89. మార్కండేయ విలాసం | " | " |
| 90. గయోపాఖ్యానం | " | బాలాజీదాసు |
| 91. జయప్రదాదేవి చరిత్రం | " | " |
| 92. పూర్వ హరిశ్చంద్ర | " | " |
| 93. శివలీల | " | అయ్యగారి వీరభద్రరావు |
| 94. మాయూరధ్వజ చరిత్ర | " | " |
| 95. కుశలవ | " | " |
| 96. రామదాసు చరిత్ర | " | " |

